# ఆంధ్రాధ్యాత్మరామాయణము



అనువాదకుఁడు:

పిశుపాటి నారాయణశాస్త్రి.

తమకు పుస్తకములు కావలసినచో
చందా నారాయణశెట్టి
పబ్లిషర్ ఆంధ్ర బుక్ సెల్లర్
బ్రాంచిమార్కెట్, సికింద్రాబాదు
అని వ్రాయవలెను.

౧౯౩౯ సం.

వెల 3-0-0

శ్రీరస్తు

శ్రీ సీతారామాభ్యాం నమః

# ఆంధ్రాధ్యాత్మరామాయణము

---

## అవతారిక

---

### ఇష్టదేవతాస్తుతి



శ్రీ మహిపుత్రికావిభుఁడు చిన్మయమూర్తి సమస్తభక్తలో
కామరభూరుహంబు విగతార్తి నివర్తన సంగ్రహీత మా
యామనుజక్రముండు మహితాత్ముఁడు దివ్యశరాసపాణి శ్రీ
రాముఁడు మన్నమస్కృతిపరంపరలం గొనుఁగాత సత్కృపన్. ౧

చ. శ్రితతతి కూఁతమై పతికిఁ జెప్పి ఘటింపఁగఁ జేయుచుం దయా
స్పితములు నెల్లఁ; బ్రహ్మహరు శివవిభుం గనుభక్తిఁ గొల్చు త్స్మ
సుతి జగదేకమాత పరిశుద్ధయశోఽన్విత సీత భక్తసం
తతి నలరించుఁగాత సముదారదయారసదృష్టి నింపుచున్. ౨

క. సరసిరుహాసనమున వా, క్సరసీరుహనయనతోడి చతురోక్తుల ని
ర్భరమోదాంబుధిఁ దేలెడు, పరమేష్ఠి భజింతుఁ గృతికి బ్రహ్మయు విడన్. ౩

చ. పదుగురిలోనఁ గొంత ప్రతిభన్ ఘటియించితి నాదు నాల్కపై
ని దయ నటించి మున్ను, రఘునేతృవిచిత్రచరిత్రరాజ మి
య్యదనున వ్రాయఁ బూనితి భవార్ణవముం దరియింపఁగోరి, యె
వ్విధిని గృతార్థుఁ జేయుదువొ వీనిఁ; గృపైకరతీ! సరస్వతీ! ౪

ఉ. స్వాదుమృదూక్తి సంసరణసాగరతారకధారుణో కుమా
రీదయితప్రభావము విరించిముఖామరవారసేవ్యముం
బైదలికిన్ వచించి నిరపాయసుఖాంబుధిఁ దేలు పార్వతీ
నాథుఁడు శంకరుండు కరుణం దిలకించెడుఁ గాక యీకృతిన్. ౫

క. ఫలిముఖకమలస్రుత మా, శ్రితజనముక్తిదము నైన శ్రీరామకథా
మృత మాని మాననీయు, స్థితిఁ దనరుభవాని మత్కృతికి సేమ మిడున్. ౬

చ. తలను ధరించి రామవసుధాపతి యానతిఁ, బిల్లకాల్వఁగా
జలనిధి నుత్తరించి; దనుజప్రభుపాలితలంకఁ జొచ్చి కొం
దలమునఁ గ్రాఁగుసీతకు ముదంబును గూరిచి స్వామిభక్తిమైఁ
బొలుచు మరుత్సుతుండు సతముం వెలయించుత మత్కృతీంద్రమున్. ౭

స ం స్కృ త క వి స్తు తి

క. కామితఫలదాయకుఁ డగు, రాముని కథ సంస్కృతమున రసభరితముగా
నీమహి వ్రాసిన పూని, గ్రామణి వాల్మీకి నాదికవిని భజింతున్. ౮

సీ. పరమేష్ఠి సృష్టికిఁ బ్రతిసృష్టిఁ గావించి ఘనతరఖ్యాతిఁ గైకొనియె నెవఁడు;
గురుశాపహతుఁ ద్రిశంకుని స్వర్గసౌఖ్యాప్తుఁ బొనరించి సత్కీర్తిఁ బొందె నెవఁడు;
క్షత్రియుం డయ్యు దుష్కరతపశ్శక్తి బ్రహ్మర్షిపదోన్నతి నందె నెవఁడు;
జానకీరాఘవసంధానకర్తయై జగదుపకారంబు సలిపె నెవ్వఁ;

గీ. డాత్మతత్త్వంబు శ్రీమ దధ్యాత్మరామ, చరిత మనుపేర భువి వెదఁజల్లె నెవ్వఁ;
డా మహామహుఁ గొల్తు బద్ధాంజలినయి, భువనమాన్యు విశ్వామిత్ర మునివరేణ్యు.

క. వ్యాసునకు నవలఁ గాళీ, దాసునకుం దక్కుసంస్కృత కవీంద్రులకుం
దోసిలి యొగ్గి నమస్కృతిఁ, జేసెదఁ దన్మధురఫణితి సిద్ధించుటకై. ౧౦

ఆ ం ధ్ర క వి స్తు తి

ఉ. పంచమవేదమై పరఁగు భారతసంహిత నాదిలో రసో
దంచితభావగర్భితపదస్ఫురితోత్తమశైలిఁ దెల్గుగా
వించి కవిప్రపంచమునఁ బేర్గనినట్టి విరించికల్పులం
సంచిత పుణ్యులం గొలుతు నన్నయ తిక్కన యెఱ్ఱ నార్యులన్. ౧౧

క. భారతశైలిని గవితా, ధోరణి సాగించి భువి నతుల్యప్రథచే
మీఱిననాచనసోము, న,మారాధిత భీము బుద్ధి నభినందింతున్. ౧౨

ఉ. యోగివిధాన నైహికసుఖోన్నతికై మదిఁ జొన్పకే స్వవి
ద్యాగరిమం మురాంతకుమహత్త్వము వ్యక్తముసేయు శ్రీమహా
భాగవతమ్ముఁ దన్మయత భాసురశైలి వెలుంగ నేఁ మహా
భాగుఁడు వ్రాసెఁ; నయ్యనఘు భక్తి భజించెదఁ బోతనార్యునిన్. ౧౩

క. అసమ శ్రీహర్షసమం, జనసైషధకావ్యముగ్ రసస్ఫూర్తిఁ దెలుం
గు సలిపి యశముం బడసిన, రసికుఁడు శ్రీనాథునకుఁ గరమ్ములు మోడ్తున్. ౧౪

గీ. ఆంధ్రకవితాపితామహా ద్యఖిలపూర్వ, కవిశిఖామణులగ్ భావికవివృషభుల
వర్తమానకవీంద్రులఁ బండితులను, నభినుతించెద మత్కృతి నాదరింప. ౧౫

గు రు స్తు తి

క. శమదమముఖగుణశోభితు, సమధికతత్త్వజ్ఞు సత్యసంకల్పు భవ
క్రమవిరహితుని సనందన, సము బ్రహ్మానందతీర్థసంయమిఁ గొలుతున్. ౧౬

సీ. నిరుపమసాహితీనిపుణు లష్టవధాన శతవధాన విధానచతురమతులుఁ
బ్రకటితపావనబ్రహ్మవర్చసులు వేదాంతశాస్త్రార్థసిద్ధాంతచణులు
శిష్టులు శిష్యప్రశిష్యప్రసన్ను లవ్వారి, వేమూరి, సద్వంశభవులు
నిష్కపటులు యశోనిధులు సుబ్రహ్మణ్య నరసింహ పానన నామధేయు

గీ. లస్మదాయవివేకవిద్యానిదాను, లయిన మద్గురువర్యుల స్మయరహితులఁ
బుణ్యమూర్తుల వందనపూర్వకముగ, హస్తపద్మంబులను మోడ్చి ప్రస్తుతింతు. ౧౭

స్వ వి ష య ము

సీ. అనఘభారద్వాజముని గోత్రజుండ నాపస్తంబసూత్రుండ వైదికుఁడను
బూతచరిత్రులౌ సీతాంబికా పున్నయార్య దంపతుల మోదార్ణవమున
నోలలాడించు సుతాళిలోఁ గడపటివాఁడను, వెలనాటివాఁడ వేంక
టప్పాభిధాను మేనల్లుఁడ నగ్రజన్ముఁడఁ గవిపుంగవముఖ్యహితుఁడ,

ఆ. నింటిపేరు వెలయు నిలఁ బిశుపాటి వారన; మగఁడుసుదతి వినయవసతి
నాగరత్న, మేను నారాయణుండను,బంకజాక్షుపాదభజనరతుఁడ. ౧౮

సీ. సదమలచరితుఁ డచ్చంభట్లు సత్క్రియాతత్పరమతి నాదు తాతతాత
త్రిణయనార్చనపరాయణుఁడు గుర్వంభట్లు ధర్మశీలుఁడు నాదు తండ్రితాత
వీరమాంబామనోవిభుఁడు లక్ష్మయనామతతయశస్కుఁడు నాదు తండ్రితండ్రి
వాత్సల్యనిధి యనవద్యవర్తనుఁడు నౌ పున్నయార్యుఁడు నన్నుఁ గన్నతండ్రి

గీ. అక్కపె ద్ద్యన్వవాయ పయగపయోధి, కుముదమిత్రుండు కౌశికగోత్రజుండు
విస్మయపురాణ ధోరణీ విశ్రుతుండు, మాననీయుండు సుబ్బాభిధానుఁ డతిథి
కామదుండు మదీయమాతామహుండు. ౧౯

క. పూజితులన్ వాత్సల్య వి,రాజితులన్ మిళితహృదయరాజీవులు నా
మా జననీజనకులకు ర,మాజననీజనకులే సమానులు జగతిన్. ౧౦

క. వేంకటరత్నాభిఖ్యుఁడు, వేంకటసుబ్బాభిధాన విమలాత్ముఁడు శే
షాంకుండును నేకోదరు, లింక వినుఁడి వీరుముగుర కేఁ దమ్ముండన్. ౧౧

క. ఎనమండ్రవంశవర్ధను, జననుతహితవర్తనుని బ్రశాంతు ఋతవచ
స్కుని వేంకటసుబ్బాభి,ఖ్యుని బంధుప్రియుని శ్వశురుఁ గూఁకుదుఁ గొల్తున్. ౧౨

మ. 'అబ్బాయీ! యెటకేగినాఁడ విటుర' మ్మం చెప్పుడుం బిల్చుచున్
డ బ్బెం తైనను గొల్లవెట్టు చతిగాఢప్రేమ నా వ్రాయు నీ
కబ్బమ్మున్ విని యిచ్చమెచ్చుచు నెటో కన్మూసెమి స్వర్గామియా
సుబ్బాభిఖ్యు మదగ్రజాతుఁ దలఁతున్ సుస్నిగ్ధభావాన్వితున్. ౧౩

వితర్కాదికము

ఉ. చిక్కులువెట్టి చిత్తమును జిందఱవందఱచేయఁజాలు పె
ద్రొక్కము లేదు, సత్పథనిరోధక సంతతి గల్గ, దన్న లే
నెక్కరణిం జరించిన నదే మనువారలుగారు, గావునం
జొక్కపుభక్తితో నిపుడ స్తోత్ర మొనర్చెద రామభద్రునిన్. ౧౪

సీ. పండుకోఁతికిఁ బోలెఁ బస దోఁపంగి కలంగు నొడలిపై ముడుఁత లేర్పడకమునుపె
చూచుపున్నముఁ బాయ ద్రోచి యేఁచెడిపొరల్ కనుపాపలను గ్రమ్మకొనకమునుపె
కఱ్ఱ చేఁ గొని యూఁచ కాళులు తడఁబడ వడఁకుచు నిల నడు గిడక మునుపె
కడలి పొంగినభంగిఁ గఫము విజృంభించి బలిమిఁ గుత్తుక కట్టుపడక మునుపె
గీ. కడకుఁ గుడుచుట కేనిఁ దోఁప్పఁగ లేని, బలవిహీనత చేతి కేర్పడక మునుపె
పాపహార మగుజానకీపతిపదాబ్జ,సేవ సేయంగ వలయు విశేషభక్తి. ౧౫

క. తెలివి గలకొలఁదిఁ గరుణా, జలనిధి దాశరథిమహితచర్యలు నోటం
బలుకుట కంటును బుట్టువు, దొలఁచెడి సదుపాయ మొండు దోఁపదు మహిపై. ౧౬

క. మునిపతి పలికిన తెఱఁగున, మును పెవ్వరు గని సొంతముగ వ్రాయమిఁ గ
న్గొని మురిసి సమగ్రముగాఁ, బెనిఁగించెద రామచంద్రు దివ్యత్కృపచే. ౧౭

ఉ. ఆమయబాధ కగ్గమయి పోయిన, మాపయిఁ గొంత దేఱి, స
ర్వామయనాశకారి యని యాత్మ నెఱింగి, భవంబు డింద ని
స్సీమ సుఖంబుఁ జెంద మునిచింతితసత్పద మొంద, జానకీ
రాముని సచ్చరిత్రమును వ్రాయఁ దొడంగితి ని వ్విధంబునన్. ౧౮

ఉ. వ్రాసినవారికంటెఁ గడువాసి గడించెద నన్న మూఢవి
శ్వాసముచేతఁ గాదు, గరువంబునఁ గాదు, ధనంబుగూర్చు పే
రాసను గాదు, దుస్తరభవాంబుధిఁ దిన్నఁగ దాఁటి చిత్సుఖ
శ్రీసముదారు ధీరు రఘుశేఖరుఁ జేరుటకై యతించితిన్. ౨౯

చ. తెలివియుఁ దేటయున్ మిగులఁ దేఁకువ లోకమునం జరింపఁగాఁ
గలిగెడిభాగ్య మెవ్వనియఖండదయన్ లభియించె; న వ్విభున్
జలరుహనాభు నాశ్రితవశంవదుఁ గామదుఁ బాపనోదనుం
దెలిసినయంతవట్టు వినుతించుట మంచి దటంచు నెంచితిన్. ౩౦

క. మనుటకుఁ జెడిపోవుటకున్, మనుజున కిల సాధనంబు మనసే యగుటన్
మనసు హరియందుఁ జేరిచి, వినుతించుటె ముక్తిఁ గాంచువెర వనునూహన్. ౩౧

క. రామునియడుగులు గొలిచెద, రామచరిత్రామృతంబుఁ ద్రావెద, మఱియున్
రామాలయమున కేఁగెద, రామునికథ వ్రాయుదును గర మ్మనురక్తిన్. ౩౨

క. ధ్యేయుం డని మఱియుఁ గథానాయకుఁ డని సకలలోకనాయకుఁ డని భ
ద్రాయితమూర్తికి సీతానాయకునకె దీని నిచ్చినాఁడను గృతిగా. ౩౩

షష్ఠ్యంతములు

క. దేవునకుం బ్రీణితసుగ్రీవునకుం బ్రమథనాథకీర్తితపదరా
జీవునకుం గరుణామయ, భావునకుం గలుషవిపినపటుదావునకున్. ౩౪

క. సమధికచిద్రూపునకుం, గమనీయాలాపునకు జగద్ద్రోహదురు
ద్యమవారకకోపునకున్, శమితోత్తేజితభవాగ్నిసంతాపునకున్. ౩౫

క. గుణభరితునకున్ సన్ముని, గణరక్షానిరతునకు సుఖదచరితునకున్
బ్రణతహృతదురితునకు సముల్బణలావణ్యాంచదవయవస్ఫురితునకున్. ౩౬

క. ధీరునకు భక్తచిత్తవిహారునకు ననర్ఘరత్నహారున కఖిలా
ధారునకు విగతమాయా, దూరునకు ననన్యలభ్యదోస్సారునకున్. ౩౭

క. జలదశ్యామునకు మహోజ్జ్వలతేజోధామునకు యశస్సీమున క
త్యలఘుతరప్రేమునకును, సలలితనామునకు జనకజాకామునకున్. ౩౮

# కథాప్రారంభము

వ. తదీయసేవానిష్ఠితుండ నగునేను మనవిసేయు విధమ్మగా మనస్సన్నిధిం గల్పించి
కొని, యపరవిరించి యగు విశ్వామిత్రముని పంచాననునిచే రచింపఁబడిన యుమా
మహేశ్వరసంవాదరూప మగునధ్యాత్మరామాయణంబునర్థంబు నాంధ్రంబున గద్య
పద్యాత్మకంబుగ సంగతంబు సేసెద. ౩౯

మ. అతిలోకంబు పురాణవంద్య మగునీయధ్యాత్మరామాయణా
ద్భుతనామాంచితదివ్యకావ్యమును నే పుణ్యాత్ము లన్యక్రియా
రతిదూరీకృతులై వినం జదువ నశ్రాంతంబు వాంఛింతు; రా
యతపాపౌఘముఁ బాసి చెందుదురు బ్రహ్మానంద ము మ్మానవుల్; ౪౦

గీ. చటులసంసారబంధమోచనము వలయు, నేని; నీకావ్యమును బఠియింప వలయు,
నూఱు లక్షలకోట్లధేనువుల నీయ, వచ్చుఫల మందుదురు విన్నవారు దీని. ౪౧

క. వితతజగత్త్రితయమునకు, నతులపవిత్రతను గూర్ప నమరె హారగిరి
ప్రసృత శ్రీరామార్ణవసంగత లలితాధ్యాత్మరామగంగ సరంబున్. ౪౨

పార్వతి పరమేశ్వరుని బ్రశ్నించుట

చ. ఒకతఱి రాజతాద్రి పయి నుజ్జ్వలభానుశతప్రభామనో
జ్ఞక మగుసౌధరాజమునఁ జారుహిరణ్మయరత్నపీఠికా
రకముగఁ గూరుచున్నసురరాజగరిష్ఠుని ధ్యాననిష్ఠునిన్
సకలమునీంద్రసిద్ధసురసంఘసనాథుని భూతనాథునిన్. ౪౩

ఉ. శంకరు భక్తమానసవశంకరు సాధ్వసదూరుఁ గాంచి, వా
మాంకమునందుఁ బొల్చెడి హిమాచలపుత్రిక భక్తినమ్రయై
శంక బయల్పడం బలికె సర్వమలాపహృ దూర్జితంబు శ్శే
మంకర మన్యదుర్లభము మంజులవాక్య మొకండు ప్రీతితోన్. ౪౪

గీ. విన్నప మొనర్తు మ్రొక్కి జగన్నివాస!, సర్వజీవలోకమునకు సాక్షివి పర
మేశ్వరుఁడ వౌట సీతాహృదీశ్వరుని సనాతనం బగుతత్త్వంబు నాకుఁ జెపుమ. ౪౫

క. మీర లుపాధివిరహితులు, శ్రీరామునితత్త్వ మెల్ల జెల్వొందెడి, న
క్కారణమునఁ దద్దివ్యసుధారసము ద్రావఁ దలఁతుఁ దగ మీవలనన్. ౪౬

గీ. అనఘ! యెంతటిపరమరహస్య మైనఁ, దెలుపుదురు భక్తులకు భవాదృశు లెపుడును;
కాన ప్రియుఁడవు ధ్యేయుండ వైననీవు, భక్తురాలికి నాకుఁ జెప్పంగఁ దగును. ౪౭

సీ. మహనీయు లెద్దాన మహితసంసారవారిధి నవలీలఁ దరింతు; రట్టి
ఘనతరవిజ్ఞానకలితంబు ననుభక్తి వైరాగ్యయుతము శశ్వత్ప్రకాశ
మానంబు శాస్త్రసమ్యగ్భాషితము నగు జ్ఞానస్వరూపంబు సదమలంబు,
ముగ్ధనౌ నా దగుబుద్ధికిఁ దెలిసెడిచక్కని శైలిని నొక్కి బోధ
గీ. చేయు మయ్యా పుష్పసాయకభంజన!, వాంఛితంబుఁ దీర్పు ప్రమథవంద్య!
నృహరిదివ్యతత్త్వనిశ్చయవిజ్ఞాన, దూరగులకు ముక్తి దూర మండ్రు. ౪౮

వ. ఇదియుఁగాక మఱొక్కటి వినుండు, ౪౯

క. శ్రీరాముఁ డఖిలజగద్గురు, సారం బమ్మహితుభక్తి సంసారమహా
నీరధికిఁ దెప్ప గాదె? సు,రారాధిత! తెల్పు మీ రహస్యము మొదటన్. ౫౦

చ. భవభయబంధమోక్షణముపట్టున భక్తియె మూలకారణం
బగును, దదన్యసాధనము నారయఁ జాల మజాండమందుఁ, గా
న విమలవాక్యజాలమున నామది సంశయబంధనంబు నేఁ
డవితథభంగిఁ ద్రెంపుఁడు, సమర్థులుగా రిట నన్య, లీశ్వరా! ౫౧

వ. జ్ఞానవృద్ధు లగుబుధులుకొందఱు శ్రీరాముని సజాతీయ విజాతీయ స్వగత భేద రహితుండనియు నుత్పత్తిరహితుం డగుననాదిపురుషుండనియుఁ బరమాత్మ యనియు సత్త్వరజస్తమోరూపమాయాగుణవివర్జితుఁ డనియుఁ, జెప్పుచున్నారు. అంతియెకాక యట్లుఁ గృతనిశ్చయులై యహర్నిశ మేమఱక యమ్మహాత్ము భజించి తుదకు జ్ఞానసిద్ధి నొంది పరమపద మలంకరించుచున్నారు. మఱికొందఱు ఆర్యులు రాముఁడు పరమాత్మ యైనను స్వకీయాజ్ఞానసంవృతుండై పరమాత్మాభిధేయుఁ డగుతన్నుఁ దా నెఱుంగఁ జాలక పరులయిన బ్రహ్మాదులు "నీ విట్టివాఁడ" వని తెలిపినమీఁదట నాత్మతత్త్వమును దెలియుచున్నాఁ డని పల్కుచుండిరి; దియుఁ గాక.

ఉ. నే నిటువంటివాఁడ నని నిక్కము రాముఁ డెఱుంగఁ జాలినన్;
జానకిపోక కాకరణిఁ జాలవగం బొగులంగ నేల? య
జ్ఞానపరీతురీతి వనజాసనబోధితుఁ డౌట యెట్టు? లీ
శాన! మనుష్యమాత్రునకు సర్వజగన్నుతి గల్గనేర్చునే? ౫౩

క. విను తాఁ దన్నెఱుఁగనపుడు, కన నందఱవంటివాఁడె కద; యట్టియెడన్
వినుతింతు రెవ్వ రతనిని, ధనదసఖా! యేమిఫలము దాన లభించున్? ౫౪

క. ఇయ్యెడ మీచే నుత్తర, మెయ్యది యూహింపఁబడియె నిపు డద్దానిం
జయ్యనఁ దెలుపుఁడు కూరిమి, తొయ్యలి నగునాకు శంక దూరము గాఁగన్. ౫౫

పరమేశ్వరుఁడు పార్వతికి రాముఁడు పరమాత్మ యని తెలుపుట

చ. అనవుడుఁ జంద్రమౌళి, పరమాత్ముఁడు రాముని దివ్యతత్త్వముల్
వినఁగఁ దలంపు గల్గుటను నీ వతి ధన్యవు, భక్తురాల వా
తనికి, నిగూఢ మీ విమలతత్త్వముఁ దెల్పఁ డటంచు నెవ్వరై
నను నను గోరినట్టులఁ గనంబడ దింతకు ముందు నెన్నఁడున్. ౫౬

గీ. అడిగితివి గాన నీవిప్పు డామహాను, భావునకు వందనము చేసి పలుకువాఁడ
నాలకింపుము శ్రవణపేయముగ బుద్ధి, నితరవిషయసంగతముఁ గానీక, దేవి!

సీ. అవనీభరనివారణార్థ మత్యంతంబు పద్మజా ద్యమరసంప్రార్థనమునఁ
దా నవ్యయుండుఁ జిదానందమయుఁ డయ్యు, వసుధాస్థలిన్ సూర్యవంశమందు
మాయాగుణములూఁది మనుజుఁడై యుదయించి నిరవశేషముగ దుశ్చరితు లైన
రాక్షసులం జంపి రమణీయము స్థిరమ్ము భువనపాపహరం బపూర్వము నగు

గీ. సద్యశమ్మును నెలకొల్పి శస్త్రభంగి, నెప్పటివిధాన బ్రహ్మత్వ మెనసినట్టి
సర్వలోకప్రకాశు శ్రీజానకీశు, నిచ్చలు భజింతు మచ్చిత్త నీరజమున. ౫౮

సీ. విశ్వోద్భవస్థితివిలయాదికంబుల నాచరింపఁగ హేతు వైనవాని
నద్వితీయుండు మాయాశ్రయుం డపగతమాయుఁడై నిరతంబు మనెడివాని
నానందసాంద్రుఁ డత్యమలుఁ డచింత్య సన్మూర్తియై యెంతయుఁ బొలుచు వాని
స్వాభావికజ్ఞానసహితుండు విదితతత్త్వుఁడు నయి యెల్లెడఁ దోఁచువాని

ఆ. సరసిజాసనాదిసురగణసన్నుతుల్, గొనెడివాని మేలు గూర్చువానిఁ
బుడమిముద్దుపట్టియెడఁదఁ బాయనివానిఁ, గొలుచువాఁడ నేటికోళ్లతోడ. ౫౯

వ. అని యమ్మహనీయు వినుతించి తదీయతత్త్వంబు తేటపడ నిట్లనియె. శ్రీరాముండు ప్రకృతికంటె నతీత మగుపరబ్రహ్మము. అతని కనాదిపురుషత్వమును నిత్యానందస్వరూపత్వమును నద్వితీయత్వమును నైజంబులై యుండు. పురుషోత్తమవాచ్యుఁ డగు నాజగద్భర్తయె నిజమాయాప్రభావంబున నీసమస్త ప్రపంచమును గల్పించి గగనంబుపగిది వెలుపల నంతర్బహిస్థితుండై వెల్గుచున్నాఁడు. సర్వాంతరస్థుం డయ్యును నిగూఢాత్ముఁడై మాయాకల్పితప్రపంచ మంతయు నన్యుని చందమున వింతగ నరయుచుండు. ఇదియునుగాక యెవ్వని చెంత జడమ్ము లగు లోకుల యంతఃకరణమ్ము, లయస్కాంతశిలానికటంబున నినుమువోలె ననారతముం దిరుగుచుండునో; యట్టి పరమాత్మునిఁగ రాముని భావింపుము. అజ్ఞానదూషితచేతస్కు లగునల్పుల కీ పరమరహస్యంబు దురవగాహంబై చెల్లు. ౬౦

సీ. అగపుత్రి! సంసారమందుఁ గ్రిందును మీఁదు నగుమూఢమానసు లనుదినంబు
శుద్ధబుద్ధీంద్రియశోభితుండు నిరస్తమాయావికారుఁ డాత్మస్వరూపుఁ
డైన శ్రీరాముని యందు నిజాజ్ఞాన మారోపణముఁ జేసి, యాలుబిడ్డ
లనెడుమోహంబుఁ గైకొని వివిధక్రియాలంపటు లగుచు గళస్థమైన
గీ. కనకభూషణంబుఁ గానని చందాన, హృదయనిలయమందు నెపుడు వెల్గు
ననఘు రాము నెఱుఁగ నసమర్థులైయుండి, పొరయుచుంద్రు జననమరణములను.

గీ. దేవి! యప్రకాశంబు జ్యోతిస్స్వభావుఁ, డైనరవియందుఁ బోలె, విజ్ఞానఘనుఁడు
నుత్తమోత్తముఁ డగురఘుసత్తము కడ, లేశమేని నజ్ఞానంబు లేదు సూవె. ౬౨

సీ. నయనరోగావృతనరుఁడు భ్రమల్లోచనములఁ దోఁచెడివస్తుసముదయమును
ద్రిమ్మరుచున్న చందమ్మున నూహించు గతిని, దేహేంద్రియకర్త యైన
యంతఃకరణమున కమరు కర్తృత్వంబుఁ దద్విలక్షణుఁడు నుత్తముఁ డమలుఁడు
నైనపరాత్మయం దారోపణ మొనర్చి మోహించుచున్నది మూఢలోక,
గీ. మంబికా! సుఖదుఃఖమోహాదికముల, నతఁడు దమకుఁ దాల్యం డండ్రు, దంతె కాని
వాస్తవంబుగ జానకీవరునియందుఁ, గానఁగాఁ బడ దజ్ఞానగంధ మెపుడు. ౬౩

గీ. అవిరతవిభాసి యగుసూర్యునందుఁ బగలు, రే యనువిభాగ మెదవని రీతి, నొక్కఁ
డమలుఁడును జిన్మయుం డగునాత్మునందుఁ, గలుగ వెప్డు జ్ఞానాజ్ఞానములు, వెలంది!

గీ. మాయ కాశ్రయుఁడుఁ గ నియామకుఁ డజుండు, నైన రామభద్రుండు మాయా గుణాళి
కగ్గమయి సుఖదుఃఖమ్ము లందు ననుట, కన్నను విరుద్ధ మగు మాట గలుగ దెందు.

క. విను తెలిపెద నీవిషయం, బున సీతారాము లనిలపుత్రున కెఱిఁగిం
చినపరమరహస్యము గల, దనుపమసాధనము ముక్తి కది దుర్లభమున్. ౬౪

సీ. మున్ను రామచరిత్రమున రాముఁ డమరకంటకు దశగ్రీవు రణంబులోన
సైన్యపుత్రామాత్యసహితమ్ముగ వధించి జానకీలక్ష్మణభానుతనయ
హనుమదాదులతోడ నరిగి యయోధ్య కం దభిషిక్తుఁడై వసిష్ఠాదిమౌని
వరుల యానతి నిరంతరసంప్రకాశితభాసురరత్నసింహాసనమున
గీ. గోటిసూర్యప్రభారాశి గోట మీటు, కాంతి చెన్నార ధారుణీకన్యతోడఁ
దగ సమాసీనుఁడై కేలుదమ్మి మోడ్చి,యుం డలరుచున్న హనుమంతు మోము సూచి.

సీ. అవనిజతోడ ని ట్లను జానకీ! కనుఁగొంటివె మనముందుఁ గూరుచున్న
కరువలికొమరు, నీ కపిమణి మన కెంతొ సాయమ్ముఁ జేసెఁ గష్టముల కోర్చి,

యభిలషింపం డెన్నఁ డైహికాముష్మికఫలముల, జ్ఞానంబుపట్ల నితని
కాసక్తి యధిక, మాత్మానాత్మవిజ్ఞానదక్షుండు మద్భక్తి తత్పరుండు.

గీ. దళితపాపుఁడు జ్ఞానబోధమున కర్హుఁ, డమలచరితుండు గుణవంతుఁ డమితశాంతుఁ
డకల్మతంబున వాత్సల్య మమర నేఁడు, తెలుపు మితనికిఁ దత్త్వంబుఁ దేటపడఁగ.

సీత శ్రీరామప్రేరితయై హనుమంతునకు రామతత్త్వ ముపదేశించుట

క. అనవుడు లోకవిమోహిని, జనకాత్మజ యట్లె యనుచు శరణాగతుఁ డౌ
వినుచూలుకుట్టునికి రాముని తత్త్వవినిశ్చయంబు బోధించె నిటుల్. ౯౯

వ. మారుతీ! నిర్మలమానసుండ వై శ్రద్ధాభక్తు లొదవ నాలింపుము. శ్రీరాముఁడు
ప్రకృత్యతీతుఁ డగుపరమాత్మ. అతండు కాలత్రయబాధావిరహితుం డై జ్ఞానానంద
స్వరూపమునఁ బ్రకాశించుచుండు. సజాతీయ విజాతీయ భేదములు లేక స్థూల
సూక్ష్మహేతురూపము లైన సమస్తోపాధులచే విడువంబడియుండు, నిదియుం గాక
యమ్మహాత్ముని సత్తామాత్రునింగను, వాఙ్మనసముల కందనివానింగను, ఉండుట,
పుట్టుట, పెరుఁగుట, మాఱుపడుట, తఱుఁగుట, నశించుట, యనునాఱువికారము
లకు దూర మైనవానింగను, సర్వవ్యాపింగను, సమస్తమున కాత్మయయిన వానిఁ
గను, స్వతఃప్రకాశునింగను, మాయాదోషదూషితునింగను, నెఱుంగుము. మఱియు.

క. ఓలి జగత్సర్గముఁ బరి,పాలనము వినాశనం బభంగురభంగిం
దాలిమిఁ గావించెడినను, మూలప్రకృతిగ నెఱుంగుము, మరుత్తనయా! ౭౧

క. రామునిసన్నిధిమాత్రము,చే మారుతి! సకలజగము సృజియించెద జా
గేమియు నొనరింపక నే, నీమార్గము ధన్యతముల కెఱుఁగఁగ వచ్చున్. ౭౨

ఉ. ఆతని సన్నిధానమహిమాతిశయంబున నిట్టిభంగి నా
కాతతకర్మముల్ సలుపునట్టిసమర్థత గల్గె నంచు నా
చేత నొనర్పఁగాఁబడిన సృష్టిముఖాద్భుతకార్యజాతముల్
వాతతనూజ! మూఢమతి వల్కును రాఘవకర్తృకంబుగాన్. ౭౩

వ. ఇదియును గాక, యయోధ్యానగరంబునఁ బవిత్ర మగురఘువంశంబునం బొడము
టయు, విశ్వామిత్రునివెంటఁ బయనం బగుటయుఁ, గ్రతుసంరక్షణదీక్షాదక్షత్వం
బును, నహల్యాశాపమోచనంబును, మాహేశ్వరధనుర్భంగంబును, మత్పాణి
గ్రహణమ్మును, బరశురామగర్వనిర్వాపణమును, ద్వాదశవత్సరపరిమితాయోధ్యా
వాసమ్మును, దండకారణ్యగమనంబును, విరాధవధమును, మాయామాహరిణరూప
మారీచమారణమ్మును, గబంధనిర్మథనంబును, జటాయుర్మోక్షదానంబును, గపట

సీతాపహరణమును, శబరీపూజయు, సుగ్రీవసమాగమంబును, వాలినిర్మూలనంబును, మదన్వేషణమ్మును, బయోధిబంధనంబును, లంకానిరోధంబును, రావణసంహారమ్మును, విభీషణునకు లంకారాజ్యదానంబును, బుష్పకమున నస్మత్సమేతముగఁ దిరిగి పురమున కేగుటయు, రామపట్టాభిషేకంబు నను నీసమస్తకార్యంబులు మత్కృతంబు లైనను జ్ఞానహీను లగుమందబుద్ధులు కొందఱు వికారరహితుండును సర్వస్వరూపుఁడు నగు నీరాముని యం దారోపించుచున్నారు. ౨౪

సీ. పవనందన! రామభద్రుఁ డానంద స్వరూపుఁడు నిర్వికారుం డచలుఁడు
మాయాశ్రయత్వ సంబంధంబుచేఁ బ్రపంచాకృతిఁ గన్పట్టు నంతెకాని
యితఁ డెంతమాత్రము నెచ్చటికిం బోఁడు నిలువఁడు విలపింప నేరఁ డెపుడుఁ
గోరఁ డెట్టిదియైనఁ గొంచెపుఁ బనియేనిఁ జేయఁగాఁ జనఁడు, త్యజింపఁ డేదియు
గీ. నన్ని యెడల నుదాసీనుఁ డైనయాత్మ, చెంగట వసించి సకలమ్ముఁ జేయుచుండుఁ
బరమగోప్యంబు దీనిఁ దాత్పర్యబుద్ధి, నెఱుఁగు మని సీత దెల్పె నాదరము మిగుల.

రాముఁడు హనుమంతునకు నాత్మానాత్మ పరాత్మ స్వరూపమును బోధించుట

వ. ఆమీఁద (శ్రీ)రాముఁ డమ్మారుతికిఁ బ్రకృతాంశ మగు నాత్మానాత్మ పరాత్మరూప పదార్థ త్రితయ స్వరూప యాథార్థ్య మెఱిఁగింపఁ దలఁచి యిట్లనియె. ౨౫

క. గగనంబు మూఁడు తెఱఁగుల, నగపడు చందమున మారుతాత్మజ! త్రివిధం
బగు భేదము గన్పట్టెడుఁ, దగ బ్రహ్మమ్మునకుఁ గూడ దానిని వినుమా. ౨౬

వ. తటాకంబునందు జలభిన్నమై యదృశ్యంబుగను జలములం బ్రతిబింబించియు నంతర్బహిస్స్థితంబయ్యు నాకాశంబు ముత్తెఱంగులఁ దెలియఁబడుచున్నది. అట్లే చైతన్యంబును బుద్ధ్యవచ్ఛిన్న మనియుఁ బరిపూర్ణ మనియు బింబభూత మనియుఁ ద్రివిధంబుగ విభజింపఁబడె, నందు మొదటిది బుద్ధికి సాక్షియై యయ్యది యుపాధిగా నుండ దానియం దంతట నిండియుండును. మాయయను సర్వభూతసమష్టియ కావున రెండవది మాయావచ్ఛిన్నమై పరిపూర్ణమై యొప్పు. దీనినె శుద్ధపరబ్రహ్మ మందురు. మూఁడవది బుద్ధియందుఁ బ్రతిఫలించిన ప్రతిబింబము. దానిని దేహాభిమానియగు జీవుఁ డందురు. చైతన్యయుతాంతఃకరణ కర్తృత్వమును నవిద్వాంసు లగువారు భ్రాంతి నొంది యవిచ్ఛిన్నుఁడును సర్వసాక్షియు నగు శుద్ధచిన్మాత్రమునం దారోపించుచుండిరి. మతిహీనులచే నతనియందు జీవభావముగూడ నావిధమున నారోపితం బగుచుండె. ఆత్మప్రతిబింబమైన జీవుఁడును మిథ్యయే యని తెలిసికొనుము. అజ్ఞానాదు లవిద్యోపాధిచేఁ గలుగుకతమునఁ బరస్పరాధ్యాసరూప మైనయవిద్య వలన జీవుఁడు సృజింపఁబడుచున్నాఁడు. శుద్ధచిన్మాత్రరూప మైనబ్రహ్మమునకు

సజాతీయాది భేదత్రయ మెన్నఁడును గలుగనేరదు. ఇట్లు కల్పిత త్రివిధభేదము గల జీవరూపుఁ డయిన యహంశబ్దవాచ్యునకును బరిపూర్ణ చైతన్యమునకును దత్త్వమస్యాదిమహావాక్యములచే నైక్యము చెప్పఁబడుచున్నది. మహావాక్య విచారం బొనర్చి జీవాత్మ పరమాత్మల కభేదజ్ఞాన మెన్నఁడు వడయునో; యప్పుడ యజ్ఞానము స్వకార్యములతో నిస్సంశయముగ నిశ్శేషముగ నశించుఁ గావున. ౭౮

గీ. ఫల మపేక్షింప కఖిలక్రియలు మదర్పణముగ నొనరించు నాభక్తసమితి దీని
విమలబుద్ధి నెఱింగి బంధములఁ బాసి, నేనగుటఁ గాంచుఁ దుదఁ, బవమానతనయ!

సీ. మద్భక్తి విముఖులు మహి శాస్త్రచోదిత కర్మకలాపోగ్రగర్తములను
దెలియక కూలువారలు జన్మశతముల కైనను జ్ఞానమ్ము నందఁబోరు
సంసారబంధమోక్షముగూడఁ జేకూర, దిప్పుడు చెప్పినయీవిషయము
పరమరహస్యంబు తరుచగసత్తమ! యాత్మస్వరూపుండ నైన నేను
గీ. దాచ కెఱిఁగించినాఁడ మత్తత్త్వమెల్ల, నిదిమహేంద్రరాజ్యముకంటె నెక్కుడరయ
నెట్టికఠినేని మద్భక్తిహీనుఁ డైన, శఠున కిద్దానిఁ జెప్పంగఁ జనదు నీవు. ౮౦

వ. అని రాముండు సామీరి కుపదేశించె. ౮౧

క. రమణీయం బతిగోప్యము, సుమహిత మమలంబుఁ బాపశోధనము సమ
గ్రము నగు శ్రీరాముని తత్త్వముఁ దెలియఁగఁ జెప్పినాఁడ నద్రికుమారీ! ౮౨

క. పవనాత్మజునకు రాముఁడు, సవిమర్శముగాఁగఁ దెల్పు సర్వోపనిష
త్ప్రవిమలసారము దీనిని, దవిలి పఠించినజనుండు తగ ముక్తి గనుꣳ. ౮౩

గీ. బ్రహ్మహత్యాదికము పూర్వభవకృతమ్ము,పాతకచయమ్ము విదళించిభ్రమఁద్యజించి
యుపరత రానంద వారాశి నోలలాడు, సతము శ్రీరామహృదయంబుఁజదువువాఁడు

సీ. పరధనపరదార హరణచణుం డైనఁ బాపి యైనను మతి భ్రష్టుఁ డైన
జననీజనకులఁ జంపిన నికృష్టుం డైనఁ బసిఁడి మ్రుచ్చిలినదుర్భావుఁ డైన
నవనీసురోత్తంసహంత యైనను యోగిగణములయెడ నపకారి యైన
లోకాభిరాము సీతాకాంతుఁ బూజించి ప్రకటితభక్తి నుత్సుకత మీఱ
గీ. సతము శ్రీరామహృదయంబుఁ జదివెనేనిఁ, బరమయోగులకైన లభ్యంబు గాని
త్రిదశపూజిత మగుమోక్షపదముఁ జేర,నరుగు నీజన్మమంద మాహాత్మ్య మొప్ప.

వ. అనుటయుఁ గాత్యాయని మృత్యుంజయున కిట్లను. ౮౬

చ. ఇది శశిపావకాక్ష! జగదీడ్యపదాంబుజ! మీయనుగ్రహం
బున దృఢమై మదీయ హృదిఁ బోక తిరంబుగ నున్న సందియం

బను ముడి వీడఁ జిత్రముగ, నారయ నే నతిధన్యనుం గృతా
ర్థను జుమి తావకీనదయఁ దాల్చి మరల్చితి మూఢచిత్తమున్. ౮౭

గీ. లలిత భవదీయ వదనాబ్జ గళిత మైన, శ్రీరఘూత్తమ తత్త్వసుధా రసాయ
నంబు భవనాశనంబుఁ బినాకపాణి! తనివి సన దెంత ద్రావిన మనమునకును. ౮౮

ఉ. తాపహరంబు శ్రోతృజనతాసుఖదంబు శుభంకరంబు సీ
తాపతి సచ్చరిత్రము సుధాకరశేఖర! నాకు నిష్టు సం
తోషముగాఁగఁ బల్కు టను జెల్లగు కోర్కి, సవిస్తరంబుగా
దాఁపక తెల్పుమీ యమృతధారలఁ జిల్కు స్ఫుటాక్షరంబులన్. ౮౯

శివుఁడు గౌరికి శ్రీరామచరిత్రముం జెప్పుట

సీ. అనవుడుఁ బ్రియురాలి కనియె భూతేశుండు హైమవతీ! రహస్యములలోన
నధికమై పొల్చు రహస్యంబు ననుపమం బగునట్టి శ్రీమ దధ్యాత్మరామ
చరితంబు జానకీజాని పూర్వము నాకుఁ గేవలకృప నెఱిఁగించినట్లు
మానక నీకు సమస్తంబు బోధింతు నాలింపు తాపత్రయాపహ మది
గీ. దాని విన్నట్టివార లజ్ఞానజనిత, భవ మహాభయ దాంభోధిఁ బాసి పుత్ర
సంతతియును జిరాయువు సంపదలను, బొంది సుఖముగ నుందు రెప్పుడును గౌరి!

వ. అది యెయ్యది యంటేని. ౯౧

చ. దశవదనాద్యశేష ఖలదానవభారముచేత నెంతయుం
గృశయయి గోస్వరూపము ధరించి ధరిత్రి సుపర్వకోటితో
నశనిధరుండు వెన్కొనఁగ నబ్జజునిం గనఁ బోయి స్వీయ దు
ర్దశ సకలమ్ము రాక్షసకృతమ్ము వచించె దదగ్రమందునన్. ౯౨

వ. అట్లు విన్నవించి. ౯౩

చ. వ్యసనము రేఁప, నేత్రముల బాష్పకణంబులు జాలువాఱ, మై
పస చెడ, గర్భవేదనను బట్టఁగఁ జాలక ముక్తకంఠయై
వసుమతి యేడ్వఁగాఁ, గొలువువారలు జంత్రపు బొమ్మ లైరి, శై
లసుత! తదా విరించి సకలమ్ము నెఱింగినవాఁడు గావునన్. ౯౪

ఉ. మానస మొక్కమూర్తము సమంచితనిశ్చలతన్ వహించుచుం
దానను నిల్పి ధ్యానపరతంత్రత నుండ సమస్తకృత్యముల్
గానఁగనయ్యె, నంత సురలన్ ధరణిం దనవెంటఁ గొంచు స్వ
స్థానము వీడి పాల్కడలిదాపునకుం జనె శీఘ్రగామియై. ౯౫

ఆ. అరిగి దానియొద్దనం దరవిందసుఁ, భవుఁడు గద్గదోక్తిఁ బరమభక్తి
నఖిలలోకమానసావాసు సర్వజ్ఞుఁ, బద్మనాభు నీశుఁ బ్రస్తుతించె. ౯౬

క. అతులపురాణోద్భవములు, శ్రుతిప్రసిద్ధములు నయినస్తోత్రముల సము
ద్ధిత సమ్మోదాశ్రుకణావృతనయనసరోజుఁ డగుచు వినుతి యొనర్చెన్. ౯౭

బ్రహ్మాదిదేవతలకు విష్ణువు దర్శన మొసఁగుట

ఉ. అత్తఱిఁ గానవచ్చె దనుజాంతకుఁ డాశ్రితకల్పకంబు ద
గ్గుత్తిక వేఁడుపద్మజునకుం గడుఁ బచ్చనిబట్టతోఁ బతం
గోత్తమవాజితో దశశతోష్ణరుచి ప్రతిమానకాంతితో
నుత్తమయోగిభాషితజయోక్తులతోఁ బురుహూతు దిక్కునన్. ౯౮

సీ. నిజతనుప్రభలచే నిబిడాంధకారంబు నణఁగించి తనకుఁ బ్రత్యక్షమైన
హారకిరీటకేయూరకుండలకటకాదిభూషాంచితు నంబుజాక్షు
హరినీలదేహు స్మితానను శ్రీవత్సకౌస్తుభాస్తోకరుక్కలితవక్షు
సనకాదిమౌని పార్షదపరివేష్టితు దీపితస్వర్ణయజ్ఞోపవీతు
గీ. శంఖచక్రగదాద్యుల్లసత్కరాబ్జు, క్షీరసాగరకన్యకా క్షితిసమేతు
మూఢదుర్దర్శు నలవిష్ణుమూర్తిఁ గాంచె, జలజగర్భుఁ డతిప్రయాసమ్ముతోడ. ౯౯

విధాత విష్ణుని వినుతించుట

చ. కనుఁగొనినంత మేనఁ బులకల్ మొలకెత్తఁగఁ గేలుమోడ్చి యి
ట్లని వినుతించె, మాధవ! దయామయ! దేనిని గర్మపాశబం
ధనము దొలంగ సజ్జను లెదన్ భజియించెద; రట్టినీదు ప
ద్వనరుహయుగ్మమున్ హృదయవాక్తనుశుద్ధిగఁ గొల్చి మ్రొక్కెదన్. ౧౦౦

చ. సకలజగంబు లీవు మురశాసన! సత్త్వరజస్తమోగుణా
త్మిక యగు మాయ నూఁది కడిమిన్ సృజియింతువు పెంతు వొక్కటన్
వికలము సేయుచుందు, విది వేడుక కంతియెకాని యీక్రియా
ప్రకరము నిన్ను నంటదు లవంబును జిన్మయమూర్తి వౌటచే. ౧౦౧

గీ. దురితమతులు నీగుణములఁ దొడరి పొగడ, నెట్టి పరిశుద్ధత లభించు, నట్టిశుద్ధి
నధ్యయనదానముఖ్యకర్మాచరణము, వలనఁ బడయంగఁజాలరు, వారిజాక్ష!

ఉ. కావున భక్తులైనమునికాంతులు స్వాంతమునందుఁ జేర్చి సం
భావన సేయుచుండిన భవత్పదపద్మము మన్మనోఽబ్జదో

షావళి రూపుమాయు సమయంబు లభించుటఁ జేసి కంటి, ల
క్ష్మీవర! యిమ్మహాఫలముచేఁ గృతకృత్యుఁడ నైతి నెంతయున్. ౧౦౩

క. మునుస్వార్థసిద్ధి కయి మే, మనయము సేవించితిమి త్వదంఘ్రిని, జ్ఞాన
మ్మునుగోరువార లట్లా,త్మను బ్రత్యక్షముగ నెఱుఁగ స్మరియింతు రెదన్. ౧౦౪

సీ. విడువక నిరతంబు వెడఁదయురానురమున నునికిఁ గాంచియును బయోధికన్య
సవతిపైఁ బోలె నీచరణార్చనముకల్మి నలరెడి నిర్మాల్య మైనతులసి
మాలికపైఁ గడుమచ్చరించుచునుండుఁ దనకంటె నున్నతదశను గాంచె
నని యసూయాగ్రస్తయై, కంటె? వైకుంఠ! నిజభక్తజనులపై నీకుఁ గల్గు
గీ. ప్రేమ లచ్చియందేని నావిర్భవింప, దనుట నిజ మందుచేఁ బరమార్థవేదు
లైన భవదర్చనాసక్తు లాత్మలందు, స్థిరతరం బగుభక్తి వాంఛింతు రెపుడు. ౧౦౫

క. భవరోగతప్తులకుఁ గే, శవ! యుష్మత్పాదభక్తి సరసౌషధినై
మిపులఁ బ్రసిద్ధింగనె, నం,దువలన నీభక్తి నిమ్మనుగ్రహబుద్ధిన్. ౧౦౬

క. ఈవిధి వేఁడఁగ నజుఁ, డ,గ్గోవిందుఁడు మోదమంది "కోరుం డెదియేఁ
నావలన మీకు నిప్పుడు, గావలసినకార్య మున్నఁ గావింతు"న నెన్. ౧౦౭

క. హర్షితహృదయాగత దే,వర్ష భవచనామృతమునఁ బరమేష్ఠి మహా
హర్షాబ్ధిఁ దేలి యనె సా,మర్షాసుర కర్శిత సురమండలి రేఁపన్. ౧౦౮

రావణుని దుశ్చేష్టలు విరించి విష్ణునికి విన్నవించుట

క. పౌలస్త్యసుతుఁడు రక్షుఁగ, పాలుఁడు రిపుదుర్జయుఁడు సుపర్వగణమన
శ్శూలుఁడు రావణనాముఁడు, కాలాంతకుఁడొకఁడు జగతిఁగలఁడు మురారీ!౧౦౯

సీ. మద్దత్తవరమున మదమెక్కి యమ్మూర్ఖుఁ డిది మంచి యిదిచెడ్డ యిది యధర్మ
మిది ధర్మ మిదిపాప మిది పున్నె మనువివేకము వీడి, దుశ్చిత్తకలితుఁ డగుచు
లోకపాలుర సర్వలోకంబులను బల్మి బాధించుచున్నాఁడు పరమపురుష!
మనుజునిచేత నాశన మంద వరమిచ్చు వేళఁ జేసితి నొక్కపీలు నేను
గీ. దానఁ గడుమేలుగల్గె నిత్తరుణమందు, మానుషాకృతిఁ బుట్టి భూమండలమున
దేవకంటకు వాని వధింప వయ్య!, ఖలులఁ జంపుట నైజంబుగాదె నీకు?. ౧౧౦

వ. అని పలికి దీనాననయై తనవెనుకనున్న భూదేవిం జూపి. ౧౧౧

చ. అరసితివే ముకుంద! సగమై విలపించెడి యి వ్వసుంధరన్ ?
"దురితరతాసురప్రకరదుర్భర భారము సైచియుండ నా

తర మిఁకఁ గాదు నిర్దయతఁ దాల్పక తగ్గ యుపాయ మెద్దియే
నరయు"మటంచుఁ జేరి నను బ్రార్థన చేయఁగ నిందు వచ్చితిన్. ౧౧౨

చ. *అతని కతంబునన్ భువన మంతయు నెంతయు క్షోభ మొందె, దే
వతలు నిజాలయంబు దివిఁ బాసి సతీసుతపాళితోడఁ బ
ర్వతగుహలందు డాఁగిరి, తపఃపరికల్పితదివ్యతేజ మే
గతి గతిమాలెనో; భయముఁ గైకొని రాతనిఁ జూచి మానులున్. ౧౧౩

క. *వానిఁ గడతేర్చి మనముల, కానందముఁ గూర్పవలయు నసురాంతక! చిం
తా నిర్మగ్నాదితి సం,తానమ్మును దేర్ప నర్హతరుఁ డొరుఁ డున్నే? ౧౧౪

వైకుంఠుండు నసురపై మనుష్యరూపమున నవతరింతు ననుట

చ. అని వినిపింపఁ గాంక్షితము, న య్యహితల్పుఁడు పల్కెఁ బంకజా
సన! విను కశ్యపుం డను ప్రజాపతి నేను నిజాత్మజుండనై
తన కుదయింపఁగాఁ దప ముదాత్తతఁ జల్పెను జాలకాల, మా
యనకు ముదమ్ముఁ గూర్చుటకునై యటులే యని సమ్మతించితిన్. ౧౧౫

క. ఆతఁ డిపుడు దశరథుఁ డన, భూతలమునఁ బుట్టి పెరిఁగి భూమీశ్వరుఁడై
ఖ్యాతి వహించెడుఁ గావున, ధాతా! తనయుండ నయి యతనికి జనింతున్. ౧౧౬

సీ. నలినసంభవ! నన్ను నాల్గుభాగములుగ విభజించుకొని, వేఱువేఱ నతని
పట్టఁపుదేవి గర్భమున నేనును, దక్కఁ గాంతామతల్లుల గర్భములను
నస్మదీయాంశము లమరంగ నల్వురు పుత్రులుగాఁ క్షితిఁ బుట్టువాఁడ
జనకుని మందిరంబున సీత నా యోగమాయ జన్మించు, నామగువఁ గూడి
ఆ. లోకములకు నెట్లు చేకూరు సౌఖ్యంబు, భూమిభార మెట్లు పోవడంగు;
నట్టు లే నొనర్తు నరుగుఁడు మీ,రని,కమలనాభుఁ డంతఁ గన్ను మొఱఁగె. ౧౧౭

చ. అంతఁ జతుర్ముఖుండు విబుధావళి కిట్లను, వింటిరే రమా
కాంతుని పల్కుఁ; దా స్వయముగా రఘువంశమునందు భూస్థలిన్
వింతగ మానుషాకృతి జనించి బుధాపకృతిత్వరాయిత
స్వాంతుల దైత్యకాంతుల ధ్రువంబుగఁ బీఁచ మడంతు నం చనెన్. ౧౧౮

క. *విభుఁడతఁడు దలఁచుకొన్న సు,లభముగ లోకముల కెల్ల లగ్గగు, నిదె నేఁ
డభయం బిడి చనె మనమిం,క భయంపడి యేల వగవఁగా? మునులారా! ౧౧౯

చ. తడయక మీర లమ్మహితదర్పుని పజ్జ సహాయులై జవం
బడర వసింపఁ గార్యమున కందముఁ జందముఁ గల్గుఁ గాన, నే

ర్పడ భవదంశలం దరుచరప్రవరాళిని సృష్టిసేయుఁ డా
తఁడు ధరణీస్థలిన్ నిలుచుదాఁకఁ దదుక్తి మెలంగునట్లుగన్. ౧౨౦

క. చతురాననుఁ డిటు లానతి, క్రతుభుక్కుల కొసఁగి, యసురకల్పిత భారం
బతిశీఘ్రమ తొలఁగు సుఖస్థితి చేకుఱు ననుచు వగపుఁ దీర్చి పుడమికిన్. ౧౨౧

ఆ. సత్యలోకమునకు సమ్మునిసందోహసహితుఁడగుచు నేఁగి సమ్మదమున
హృదయతాపమడఁగ నెంతయు సుఖమున, నుండె నంత దివిజు లుబ్బుమీఱ.

ఉ. వానరరూపముం గొని యవారితవిక్రమ మొప్పఁ గొండలన్
మ్రానులఁ బూని ఘోరరణరంగములన్ రిపుసేనఁ గూల్ప నెం
తేని సమర్థులై జగదధీశ్వరు రాకకు వేచియుండి రా
యా నిఖిలాగభూరుహచయంబులు వాసపదంబులై తగన్. ౧౨౩

వ. అని చెప్పి కథాకథన దక్షుం డగు నిటలాక్షుండు దాక్షాయణికి విష్ణు వవనీతలంబున
నవతరించిన విధము దెలియ నిట్లనియె. ౧౨౪

క. కోసలదేశంబున సరయూసరిదంతికమునం దయోధ్యయనంగా
భాసిల్లు నొక్కపురము ధరాసుదతీహారతరళరత్ననిభంబై. ౧౨౫

చ. దశరథనామధేయుఁ, డమితస్వభుజాబలనిర్జితేంద్రవై
రి, శమదమాన్వితుండు, సిరి శ్రీదునితోఁ దులఁదూఁగు మేటి, స
ద్యశుఁడు జగత్ప్రసిద్ధుఁడు నిరంతరసత్యపరాయణుండు ని
త్యశమితదుష్టలోకుఁడు దయామయుఁ డాపుర మేలుఁ గోమలీ! ౧౨౬

గీ. అతఁడు సంతానహీనదురంతదుఃఖపీడితస్వాంతుఁడై యొక్కనాఁడు గురుని
బ్రహ్మపుత్రుఁ గులాచార్యుఁ బరమమౌని, నలవసిష్ఠునిఁ జూచి యిట్లనియె మ్రొక్కి.

ఆ. స్వామి! చెప్పు మెట్లు సర్వలక్షణలక్షితులు సుతుల్ జనింపఁగలరు నాకుఁ?
బుత్రహీనమగుటఁ బోరి రాజ్య మఖిలంబు, లీల దక్కి శోకమూల మయ్యె. ౧౨౮

గీ. అనిన మునిసత్తముండు ధరాధినాథ! యపరదిక్పతులో చతురంబునిధులొ
యనఁగఁజాలినవారు శౌర్యములప్రోవు, లాత్మజులు నల్వు రుదయింతు రందులకయి.

గీ. శాంతచిత్తుఁ దపోధను శాంతమగని, ఋశ్యశృంగుఁ దోడ్కొనివచ్చి యేము నతఁడుఁ
గూడి పనిచినభంగి నేకొదువలేక, పుత్రకామేష్టి సేయుము, భూతలేంద్ర! ౧౩౦

క. అని యనుకంప వచించిన, విని తత్క్షణ మమ్మహాత్ముఁ బిలిపించి, మఘం
బును జేయఁగ మొదలిడె శుచి, యును మునిగణయుతుఁడునై, పయోజదళాక్షీ!

గీ. అగ్నియందు శ్రద్ధాభక్తు లమర హోమ మాచరింపఁగ దశరథుఁ, డాక్షణంబ
పాయసంబున్న బంగరుపాత్రయొకటి, చేతనుధరించి సభ్యు లచ్చెరువునొంద. ౧౩౨

చ. అనలుఁడు తప్తకాంచన నిభాంగముతో నొక దివ్యమూర్తియై
యనలమునుండి లేచి, మనుజాధిప! దివ్యము దేవనిర్మితం
బును దనయోదయంబునకు మూలము నై తగు పాయసంబు గై
కొను మిదె తెచ్చినాఁడ నొనగూడును నీదగువాంఛ దీనిచే. ౧౩౩

క. *నందియ మేటికిఁ బరమా,నందమయుం డచలుఁ డాదినారాయణుఁడే
నందనుఁడై నినుమోదము,నం దేల్చెడు కాల మిదె జనపతీ! వచ్చెన్. ౧౩౪

క. అని వినిచి దశరథుని కర,మునఁ బాయసపాత్ర మునిచి పొగడఁగఁ దన్నుం
గను మొఱఁగెఁ బావకుం, డజ్జనపతి సుకృతం బనన్యసాధ్యము సాధ్వీ! ౧౩౫

సీ. రా జంతఁ దనమనోరథము దీఱుటఁ జేసి ఋశ్యశృంగవసిష్ఠ ఋషుల కెఱఁగి
వారల యనుమతి వడసి ప్రయత్నపూర్వకముగఁ బాత్రస్థపాయసంబు
నిరుభాగము లొనర్చి యిచ్చెఁ గౌసల్యకు సగమును గైకకు సగము, నపుడు
చరుభక్షణమున నాసక్తి గల్గి సుమిత్రవచ్చినఁ బతి తమ కిచ్చినట్టి

గీ. దానిలో నర్ధ మర్ధ మాదరముతోడ నొసఁగి రాయిర్వు, రిట్లు పాయసము గుడిచి
రాజపత్నీత్రయంబు గర్భములు దాల్చె, రాజ తిలకుఁ డానందవారాశిఁ దేలె. ౧౩౬

శ్రీరామ జనన ప్రకారము

క. నిజగర్భస్థితగరుడ,ధ్వజతేజంబున నృపాలు తన్వంగులు నా
కిజలజనేత్రలనఁ జెల్వి,రాజ! యంతఃపురమునం దలరి రెంతేనిన్. ౧౩౭

వ. అంత దశమమాసంబైన చైత్రంబున శుక్లపక్ష నవమినాఁడు పునర్వసునక్షత్ర
యుక్తంబును మంగళకరంబు నగు కర్కాటక లగ్నంబున సూర్యాంగారక గురు శుక్ర
శనైశ్చరులు తమతమ యుచ్చస్థానములైన మేష మకర కర్కాటక మీన తులా
రాసులం దలరార మహేంద్రప్రముఖ బృందారక సందోహంబులు పుష్పవర్షంబు
వర్షింప. ౧౩౮

క. ఉదయించెఁ గోసలాత్మజ, యుదరమ్మున నుండి చక్రి యోగిధ్యేయుం
డుదితార్కసహస్రద్యుతి, నడలించు శరీరకాంతి యలమఁగ గృహమున్. ౧౩౯

వ. అట్లు పరమాత్మయు సనాతనుండు నగు జగన్నాథుండు నల్లగలువరేకుల నుల్లసం
బాడు నొడలును, బీతాంబరాచ్ఛాదితకటిమండలంబును, గజహస్తోపమానము
లగు చతుర్భుజంబులును, నరుణారవిందసుందరము లయిన నేత్రకోణంబులును,

నిరంతరభాసమానసువర్ణకుండలమండితకర్ణయుగళంబును, సహస్రభాస్కర ప్రతీకాశం బగుతనుచ్ఛవియు, మాణిక్యమయ కిరీటాలంకృత శిరోభాగంబును, వక్రంబులై భ్రమరనికరంబుల కనుంగు లగుముంగురులును, శంఖచక్రగదాపద్మవనమాలికలును, గరుణారసపూరితంబులై విశాలత్వముం బడసి యుత్పలంబులకుం బరాజయసూచకంబు లైనలోచనంబులును, శ్రీవత్సహారకేయూర నూపురాది భూషణంబులును గలిగి సమగ్రం బగుదివ్యవిగ్రహంబుతోఁ గౌసల్యాగర్భంబున నావిర్భవించుటయు. ౧౮౦

కౌసల్య తనగర్భమునఁ బొడమిన విష్ణువిఁ బ్రార్థించుట

క. ఆమూర్తిఁ గాంచి, కౌసల్యామానిని పరమవిస్మయాకుల యగుచున్
భూమిఁ బడి మ్రొక్కి యిట్లనె, నామోదాస్రు ప్రపూరితాక్షులతోడన్. ౧౮౧

గీ. వందనము దేవదేవ! దివ్యప్రభావ!, శంఖచక్రగదాధర! సాధుపూజ్య!
యరయనీవ యనంతుండ వచ్యుతుండవు, బ్రాహ్మణుడవుఁ బరమాత్మవు భువనపతివి.

సీ. వేదార్థ మెఱిఁగిన వేత్తలు నిన్ను వాక్కునకు బుద్ధ్యాదులకును విషయము
గాని వానిఁగ, నింద్రియానీకము నతిక్రమించినవానిఁగ, నంచితునిఁగ
జ్ఞానైకవిగ్రహుఁ గాను సత్తామాత్రునిఁగఁ జెప్పుచున్నారు, నీవు మాయ
చే గుణత్రయమును జెంది విశ్వంబును సృష్టించి పోషించి చెఱచుచుండు
గీ. వంతెకాని సృష్ట్యాదికార్యప్రశంస, లేను గుణరహితుఁడవు నిర్లేపుఁడవు త్రి
మూర్త్యతీత పరా నాద్యవమూర్తితోడ, నుండు వెక్కాలమును, జిదానందరూప!

సీ. ఉండు వంతయుఁ జేయుచున్నట్లు పరమార్థ మరసినఁ జేయవింతైనఁ గాని;
నడచుచునున్నట్లుఁ గడునాస్థ వినుచున్నయట్లుఁ జూచుచునున్నయట్లు దోఁచు
చుంటివేకాని నీ వొక్కింత నడువవు వినవు వీక్షింప, వీ వివిధకార్య
ములు మాయవలనన కలుగుచునున్నవి రూఢిగ నిర్వికారుఁడవు నీవు,
గీ. నిన్ను వేదంబు లప్రాణునిఁగ మనస్సు, లేనివానిఁగఁ బలుకు మహానుభావ!
సకలభూతంబులం దేకసరణి నున్న,వాఁడ వైన నజ్ఞానులు చూడలేరు. ౧౮౨

క. అమలినచేతస్కులుఁ దత్త్వ మెఱింగినవారు భక్తిపరులును విస్ప
ష్టముగాఁ గాంచెదరు భవ, త్సమధికరూపమును బరమశాంతాకారా! ౧౮౩

ఉ. అండజవాహ! నీయుదరమందుఁ గనంబడుచుండె నౌర బ్ర
హ్మాండము లెల్ల నాకుఁ బరమాణువులో యన; నిట్టి విశ్వగ
ర్భుండవు నాదుగర్భమునఁ బుట్టుట లోకుల మోహపెట్టఁగా
నొండె తదాకృతిన్ మెలఁగు టొండె యనం దగు నన్య మున్నదే? ౧౮౪

క. శ్రీనాయక! భక్తపరాధీనుఁడ వీ వనుటఁ జూచితిని గనులారన్
నే నిపుడు, రఘుకులంబన మానంబై యొప్పు భువనమండలి నింకన్. ౧౪౭

సీ. నీమాయకుం జిక్కి నే నింతదాఁక దుర్లంఘ్యసంసారవారాశిలోన
మునిఁగినదాన నై ధనధాన్యపతిపుత్రవస్తువులందున వాంఛ గలిగి
చరియించుచుంటి, నిత్తఱి భవత్పాదమూలము సేరఁ గంటిఁ బుణ్యమునఁ జేసి
కావున మోక్షంబు గల్గు నిక్కంబు, నాహృదయాంబునందు నీయీస్వరూప
గీ. మెల్లపుడు నిల్చుఁగాత సర్వేశ! నన్ను, నావరింపకుండెడుఁ గాక యఖిలజగము
మోహపెట్టు భవన్మాయ, పూర్ణభక్తి గలుగుఁ గావుత భవదనుగ్రహము కతన.

గీ. చర్మదృష్టి విలోకింపఁ జాలనట్టి, యీస్వరూపంబు విడనాడి యిందిరేశ!
కోమలాంగమ్ముతోఁ జిన్నికుఱ్ఱ వగుచుఁ, గనులపండువుగా నిఁకఁ గానిపింపు.

ఆ. ముద్దులొల్కు నీదు మోము గనుంగొని, కాంక్ష దీఱ నిన్నుఁ గౌఁగిలించి
తేనెఁ జిల్కు పల్కు లానందముగ విని, భవము దాఁటి ముక్తిఁ బడయుదాన.

సీ. *నిన్నెత్తికొని తిను మన్న! యన్నమటంచుఁ బేర్మి ముద్దను నోటఁ బెట్టునపుడుఁ
ద్రావు త్రావు మటంచుఁ దగఁ గాళ్లపైఁ జేర్చి భువనేశ! నీ కుగ్గుఁ బోయునపుడు
సందిటఁ జేర్చి నిస్తంద్రమోదమునఁ ద్రయీమయ! నీకుఁ బా లిచ్చునపుడు
నొగి నిద్దురంబుచ్చ నుయ్యాల మెత్తపై నునిచి జోలలు పాడి యూఁపు నపుడుఁ
గీ. గమ్మకస్తురి దిద్ద మొగమ్మునందు, నచలభావమ్ము నీకడ నరయు నపుడు
నామదిం బుట్టునిర్భరానందలహరి; కవధి యున్నదె? నీరజాతాయతాక్ష!. ౧౫౧

క. పశుపత్యజవినుతై త్వాదృశరూపవిలోకనమునఁ దేఱితి, నిఁకఁ బై
శిశుభావ మొంది నను సంతస పెట్టుము నాఁగ, నాగతల్పుఁడు ప్రీతిన్. ౧౫౨

కమలనాభుఁడు కౌసల్యకుఁ బూర్వవృత్తమును దెల్పుట

క. నెమ్మది నెది యెది గోరెద, వమ్మా! యదియెల్ల సఫల మగు నీకు యథా
ర్థ మ్మిమ్మనుడి మృషగాదు జగమ్ములు వమ్మైన నర్కగమనము చెడినన్. ౧౫౩

గీ. వసుమతీభారమును బాప నసురనాథు, దశవదనుఁ జంపఁ బ్రార్థింపఁ దమ్మిచూలి
మానుషత్వముఁగొంటి నిమ్మాడ్కి నేను, దల్లి! కల దొకగోప్య మద్దాని వినుము.

సీ. అదితివి నీవు కశ్యపుఁడు పంక్తిరథుండు మున్ను మీ రిరువురు నన్ను నాత్మ
సుతునిఁగఁ బడయంగ నతులతపంబు సల్పితి; రందుచే జనించితిని నీదు
గర్భంబునం దిటు లర్భకత్వముఁ గొని, పూర్వజన్మార్జితపుణ్యమునను
గంటివి మన్నిజాకారంబు, నిద్దాని నరయఁజాలరు నిక్క మకృతపుణ్యు,

గీ. లిమ్మహాసుకృతమున జ్ఞానమ్ము గలిగి, నీకు సిద్ధించు మోక్ష మనింద్యచరిత!
జలజగర్భాదు లేని నస్మత్స్వరూప, మిట్లు గనలేరు నీ భాగ్య మేమనందు. ౧౫౫

క. మన యిరువుర సంవాదము, వినినఁ బఠించినను గలుగు విశ్వను తాస్మ
ద్ఘనతరసారూప్యము జ్ఞప్తి నిలుచు నామీఁద మరణవేళల నైనన్. ౧౫౬

చ. అని వచియించి తల్లికి "నిజాకృతి నేకడ కంపె నెందుఁ బో
యెనొ యెటు లయ్యెనో తెలియ దేమివిచిత్ర" మటంచుఁ గోసలా
వనిపతిపుత్రి నల్గడలు భ్రాంతిఁ గనుంగొను నంతలోనఁ జ
క్కని పసిబిడ్డయై వగవఁగాఁ దొడఁగెన్ రతనంపు టుయ్యెలన్. ౧౫౭

గీ. మేచకశ్యామ మైననెమ్మేనికాంతి, లలితనయనకుశేశయముల వెడల్పు
బాలభాస్కరరుచియు లావణ్యగరిమ, బాల్యమునఁగూడ మిగులఁ గన్పట్టుచుండె.

గీ. భువనకంటకు వింశతిభుజు వధింప, నవని జనియించినట్టివాఁ డగుటఁ జేసి
దిక్పతుల భావములలోని దిగులు దీఱ, సుందరాకృతిఁ బొల్చె గోవిందుఁ డగజ!

వ. అంత. ౧౬౦

గీ. తనకుఁ దనుజాతుఁ డుదయించె నను సువార్త, దాదిముఖమున నాలించి దశరథుండు
మోదవారాశిలోపల మున్గితేలి, గురుఁ డగు వసిష్ఠుతోఁ జనెఁ గొడుకుఁజూడ.

క. చని ప్రసవమందిరమునకు, వనజదళవిశాలనేత్రు వారిదగాత్రుం
దనయునిఁ గనుఁగొని కుతుకంబున గురువర! కంటె నాదు పున్నెముల గనిన్.

క.*పున్నామ నరకజలనిధి, నన్నుం దాఁటింప నితఁడు నౌక గదా; నా
పున్నెం బేమందును దివి, పన్నగము భవత్కృపారసము గురువర్యా! ౧౬౩

చ.*కలిగె సమస్తముం గొడుకు గల్గకపోయె నటన్న లేమియుం
దొలఁగెను నేటితో భవదనుగ్రహరూపరమాశ్రయంబునన్,
గులము పవిత్ర మయ్యె మునికుంజర! నే నిపు డాచరింపఁగా
వలసినకార్యముం దెలిపి వైళమ మీ రొనరింపఁ జేయుఁడీ. ౧౬౪

గీ. అనుచు నొజ్జ సహాయమ్ము నంది యపుడ, యవనినాథుండు శిశువున కాచరించె
జాతకర్మాదికము యథాశాస్త్రముగను; ప్రమద మంతరంగంబునం బ్రబల నంత.

గీ. కైక ధర్మరతున్ హితుఁ గనియె భరతుఁ, బూర్ణచంద్రాననుల నిరువుర సుమిత్ర
గనియె లక్ష్మణ శత్రుఘ్ను లనెడివారి, మంచిలగ్నమ్ములందుఁ గుమారజనని! ౧౬౬

చ. గురువరుఁ డన్నరీతిఁ దనర్చున్ శుభలక్షణలక్షితుల్ మనో
హరులు కుమారకుల్ నలువు రాత్మసతీత్రయమందుఁ గల్గుటన్,
ధరణి సురాళి కిచ్చె వసుధాపతి గోవుల నంబరంబులం
బురముల దివ్యరత్నములఁ బుత్తడినానెములం బ్రియంబునన్. ౧౬౭

సీ. మననశీలురు తపోధనులు జ్ఞానమ్ముచేఁ బ్రకటితాజ్ఞానమ్ముఁ బాయుకొఱకు
నిరతమి మ్మహితునందు రమింతురు గాన కోసలరాట్పుత్రికాసుతునకు
రాముండనియు, భూభరము భరించుటఁ గైకపట్టికి నెట్టన భరతుఁ డనియు,
లక్షణాన్వితుండౌట లక్ష్మణుఁ డనియు, శత్రువులఁ జంపుటను శత్రుఘ్నుఁ డనియు
గీ. నర్థమున కనుగుణంబుగ నవనినాథుఁ, డధికసంతుష్టిఁ జెంద సంయము లవు ననఁ
బేరు లిడె నల్వురకును నపారలీల, శిష్టజనపూజితుండు వసిష్ఠమౌని. ౧౬౮

గీ. పాయసాంశము నరణముగ్ బట్టి రామ, భద్రుతో లక్ష్మణుఁడుగూడె, భరతుతోడఁ
గూడె శత్రుఘ్నుఁ, డా రాచకొమరు లిట్లు, రెండు తెగలుగఁ జరియించుచుండిరి, సతీ!

రాముని బాల్యక్రీడలు

గీ. రామచంద్రుండు సౌమిత్రితో మెలంగి, వేడు కలర బాలక్రీడ లాడువేళఁ
బలుకు పలుకులుఁ జేయుచేష్టలు విని కని, తల్లిదండ్రులు చెందుముదంబు ఘనము.

సీ. కాంచనాశ్వత్థసంఘటితమాణిక్యముక్తామలప్రభ ఫాల మలమికొనఁగఁ
దపనీయరత్నసంతతులచేఁ బొదిగినపులిగోరు గళమునఁ బొలుపుమిగుల
మణులు చెక్కినపైఁడి మద్దికాయలు చెవితమ్మెలజంట నందమ్ము గులుక
శింజితమంజుమంజీరయుగ్మము కాలి మడమలపై బెడం గడరఁ జేయఁ
గీ. జిఱునగవుగుల్కు మోము, దోశ్శిరసులందు,నంగదంబులు, మొలనూలునమరసిరత
మావుదూడల వెంబడి యంగణమునఁ, గ్రీడఁగావించుఁ బదితేర్ల జేసబిడ్డ. ౧౭౧

క. లలితేంద్రనీలపుం జాయల నీనెడి కోమలాంగ మభినవరద కు
ట్మలపంక్తి ముద్దుపల్కులఁ, గలిగి ముదము నిడుమడింపఁగలిగెఁ బితలకున్. ౧౭౨

గీ. అనుదినముఁ దాను భోజన మాచరింపఁ, బోవునప్పుడు దశరథక్ష్మావరుండు
"నాయనా! రమ్మర"మ్మనినను భవాని!, యరుగఁ డారాముఁ డాటపై నాసఁ జేసి.

క. ఎంతగఁ బిలిచిన నాడుచుఁ, జెంతకు రాకున్నఁ "బుత్రు శీఘ్రము కొని ర
మ్మింతీ!" యని పంపును బ్రియ,కాంతను బిడ్డపయిఁగలుగు గారాబమునన్. ౧౭౪

గీ. "నాన భుజియింపఁ బోవుచున్నాఁడు రమ్మ, నాయనా!"యనిసస్మితాననము తోడఁ
దల్లి చేరంగఁబోవ నతండు దూర,మరుగుఁ జిఱునవ్వునవ్వుచు నబ్జవదన! ౧౭౫

క. చిక్కితి వీఁకెందుఁ బోయెద, వక్కడ నిలు మనుచు వెంట నామె పరుగిడం
జిక్కక చను మనసునకుం, జిక్కనివాఁ డెట్టు లొక్క చేడెకుఁ జిక్కున్. ౧౭౬

గీ. నగుచు నెవ్వరు పిల్చుకున్నను దనంతఁ, గర్దమాంకితపాణియై కడఁగి వచ్చి
తల్లి తననోటఁబెట్టు ముద్దనుగ్రహించి, మరలఁ బరుగెత్తు నతఁడు రామాలలామ!

క. ప్రతిమాసము సుతు సముఖం,కృతుఁ జేసి శుభంబు గలుగ నిచ్చును విప్ర
ప్రతతికి వాయనదానము, లతులానందమునఁ గోసలాత్మజ, గిరిజా! ౧౭౮

గీ. మఱుఁగుఁబూలును గుడుములు మంచిమంచి,వడలుఁ జక్కిలములుఁ జేసి వాయనముల
సాదరంబుగ నొసఁగు ముత్తైదువలకుఁ గొడుకు పుట్టినదిన మంచుఁ గొఱఁతవడక.

క. కొడుకు దుడు కగుటచే నా,బిడ గృహకృత్యములు విడిచిపెట్టి సదా యె
య్యెడ నేమి సేసి తిట్టం,బడునో; యని యరయుచుండుఁ బరమప్రీతిన్. ౧౮౦

చ. పనియొనరించుచున్నతఱి బాలుఁడు తల్లిని బిల్చి "నాకు భో
జన మిడు మమ్మ" యంచు విలసద్గతి డాసి క్రియానురక్తయై
తన కటు సేయకున్నఁ గుపితత్వము నూని పయోఘృతాదికం
బునిచిన భాండముల్ వగుల హుంకృతి మోఁదును జేతి కఱ్ఱతోన్. ౧౮౧

వ. ఇట్లు బాలక్రీడలు సేయు చొక్కనాఁడు. ౧౮౨

గీ. ఉట్టిపై నున్న కుండల నుర్విఁ ద్రోసి, యందుఁగల పాలఁ బెరుఁగు వెన్నం దినుఁడని
తమ్ములకు నిచ్చి తాను మోదమునఁ గుడువఁ, దల్లికిం జెప్పె వంటవాఁ డుల్ల మెరియ.

వ. అట్లు సూదకచోదితయై. ౧౮౪

ఉ. వచ్చియు రాని కోపమున వారిజలోచన తన్నుఁ బట్టఁగా
వచ్చుటఁ బాఱఁ జూచి రఘువర్యుఁడు మోమున నవ్వు దొల్కఁగా
నచ్చోటు వాసి పర్విడిన నంతటఁ బోవక తొట్రుపాటుతో
నెచ్చటి కెంతదూర మిటు లేఁగెదు చూచెద నంచు వెంబడున్. ౧౮౫

గీ. ఎట్టులో పట్టికొని పట్టి నింతి తనదు, కోప మే మయ్యెనో చిత్తతాప మడఁగ
సందిటం జేర్చి ముద్దు నొసంగు మనుచు, లాలన మొనర్చుఁ గసరుటల్ మాని, దుర్గ!.

క. పిల్లతనముఁ గైకొని మెల,మెల్లగ నేడువఁగ సాగు మిహిరాన్వయ రా
ట్తల్లజుని పెద్దకొమరుఁడు, తల్లి కినుకఁ గొట్టు ననెడితహాతహా పాడమన్. ౧౮౭

క. నలువురఁ గొమరులఁ గవుఁగిట, నిలిపి సమానముగఁ బ్రేమ నెక్కొన లలనా
తిలకము లాలించెను బల్కులఁ దేనియ లొలుక ముద్దుఁ గొసరుచు రమణీ! ౧౮౮

క. ఆనందావళి జగముల, కానందము గూర్చు రాముఁ డావిధి మాయా
మానవబాలకుఁ డై పర,మానందాంబుధిని దేల్చె నా దంపతులన్. ౧౮౯

క. ఆ రాకొమరులు నల్వు ర,పారబలు లతిక్రమించి బాల్యంబును గౌ
మారావస్థను గొని సు, శ్రీరంజిలి, రంత నవ్వసిష్ఠునిచేతన్. ౧౯౦

సీ. ఉపనీతులగుచుఁ దత్కృప సర్వవిద్యలయందుఁ గూలంకష మైనప్రజ్ఞ
వడసి ధనుర్వేదపాండిత్యము గ్రహించి నిఖిలశాస్త్రజ్ఞాననిపుణతఁ గని
భువనాధిపతు లయ్యుఁ బౌరి విలాసమ్ముగా నరరూపు గొన్న దాశరథు లలరి
రానందదాయకు లై చూచువారికి, నహరహంబును సుమిత్రాగ్రసుతుఁడు
గీ. సేవ్యసేవకభావంబు చెలువు మిగుల, నాదరంబున శ్రీరాము ననుసరించి
క్రమ్మరుచునుండెఁ జుమ్మ,శత్రుఘ్నుఁ డల్లె,భరతుఁ బాయకతిరుగుఁ,బర్వతకుమారి!

చ. చటులశరప్రపూరితనిషంగము మూఁపునఁ, గేలఁ జాపముం,
దిటవుగఁ దాల్చి తమ్ముఁ డరుదేరఁగ వెంబడి, వాజి నెక్కి ప్ర
స్ఫుటగతిఁ గాన కేఁగి రఘుపుంగవుఁ, డుగ్రమృగాళిఁ జెండి మం
దట నిముఁ జూడు మంచు నిరతంబును దండ్రి ముదంబు నొందఁగన్. ౧౯౨

సీ. తటిఁ బాయకుండఁ బ్రాతర్వేళ మేల్కని స్నానమ్ము గావించి సంధ్యవార్చి
జననీజనకు లున్న చక్కటి కేఁగి సాష్టాంగ నమస్కృతు లాచరించి
నగరవాస్తవ్యుల కగు కష్టసుఖముల శ్రద్ధ విచారణ సల్పి, మేలు
గల్గెడి భంగిని గార్యముల్ దిద్ది, బాంధవసమేతముగఁ గుందనఁపుఁ బళ్లె
గీ.రములభుజియించు పానిసంఘములఁ గూడి,ధర్మశాస్త్రరహస్యముల్ తఱచుగ వినుఁ
దత్తదుచితాంశములఁ దెల్పుఁ దదితరులకు,రాముఁ డెప్పుడులోకాభిరాముఁడగుచు.

గీ. మనుజరూపముఁ గైకొని మనుజభంగి, సర్వ మెఱిఁగించెఁ గాని నిశ్చయ మరసిన
నతఁడు పరిణామహీనుఁ డవ్యయుఁ డనంతుఁ,డించుకైనను జేయఁడు, మించుఁబోణి!

విశ్వామిత్రుఁడు యజ్ఞసంరక్షణార్థము రామలక్ష్మణులఁ బంపుమని దశరథునిఁ గోరుట

ఉ. అంతట నొక్కనాఁడు పరమాత్ముని రాముని స్వీయమాయచే
నెంతయు మానుషత్వము వహించి జనించిన యట్టివానిఁ గా
స్వాంతమునందుఁ దా నెఱిఁగి వచ్చెఁ గనుంగొనఁగా నయోధ్యకున్
శాంతుఁడు గాధిపుత్రుఁడు కృశానుసమానుఁడు సమ్మదమ్మునన్. ౧౯౫

క. అరుదెంచినకౌశికుఁ గని, సరగున నెదు రేఁగి గురునిసమ్మతిమై భూ
వరుఁడు యథావిధి పూజను, జరిపి నమస్సాచరించి సవినయభంగిన్. ౧౯౬

గీ. పలికె నిజఫాలసీమ నంజలి ఘటించి, మానినత్తమ! భవదాగమనమహా ఫ
లోదయమ్మునఁ జేసి ధన్యుండ నైతి, సుకృతవంతమ్ము జన్మము సుదిన మిద్ది. ౧౯౭

క. మీయట్టి మానినత్తము, లే యింటికి నేఁగుదెంతు రెదియేఁ బనితో;
నాయింటి వైభవము ముం, దాయింద్రుని విభవ మెంత దగు? మునిచంద్రా! ౧౯౮

క. ఎందులకై మీరలు మన్మందిరమున కరుగుదెంచినారలు నేఁ? డా
చందమ్ముఁ దెల్పుఁ డెది యైనం దప్పక చేయువాఁడ, నావుడుఁ బ్రీతిన్. ౧౯౯

గీ. అమ్మహామతి వల్కె ధరాధినాథ! పర్వకాలంబు ప్రాప్తించు పట్టునందు
సురలఁ బితరుల సంతోషపఱచుకొఱకుఁ, గ్రతు వొకటి సేయువాఁడ గలదు నాకు.

గీ. దాని నొనరింపఁ బూనిన తత్క్షణంబ, పాపమతులు మారీచసుబాహు లనెడు
దానవు లనూనసేనాయుతముగ మూఁగి, విఘ్న మొదవించుచుండి రుర్వీతలేంద్ర!

మ. *క్రతుదీక్షా పరతంత్రబుద్ధి నగుటం గ్రవ్యాదు లస్మత్క్రియా
యతవైశ్వానరకీలలన్ శలభసామ్యం బంద కారీతి గ
ర్వితులై నాయొనరించుజన్నమునకున్ విఘ్నంబు గావించియుం
బ్రతుకం జాలిరిగాక వేఱు గలదే? రాజన్యచూడామణీ! ౨౦౨

క. ఆ పాపుల రూపడఁపఁగ, నీ పెద్దకొమారు రాముని౦ దోడు సుమి
త్రాపుత్త్రు నిచ్చి పంపుము, భూపా! నావెంట, మేలుఁ బొందెదు పిదపన్. ౨౦౩

క. "కల నన్నమాత్ర నులుకుచు, నిలు వెడలని కుఱ్ఱ లెట్లు హింసించెద రా
ఖలదానవశార్దూలం,బుల" నని మది సంశయింపఁబోకుము నృపతీ! ౨౦౪

గీ. అసురులం జంపి జగ మరాతిసము సేయ, భువిని బొడమిన పద్మనాభుండు గాని
మానవుఁడుగాఁడు రాముఁ; డస్మాదృశులకుఁ, దెలియు నీగోప్య మితరులు దెలియలేరు.

క. అడుగుము వసిష్ఠు నటుపై, నొడఁబా టగునేని మదికి నుత్సాహముతోఁ
గొడుకుల నంపుము నావెంబడి జన్నము ముగిసినంతఁ బంపుదు మరలన్. ౨౦౬

వ. అని మునితిలకుండు పలుకుటయు. ౨౦౭

క. చింతాశరణ్యుఁడై ఋషి, కాంతుని మాటలకు భీతి గదురఁగ గురు నే
కాంతమునఁ జీరి ధరణీ,కాంతుండు వచించె నిట్లు, కంజాతముఖీ! ౨౦౮

క. ఆచార్యముఖ్య! మునివా,గ్వైచిత్ర్యము హృదయదళనపాటవ మగుటం
దోఁచకయున్నది నా కిపు, డాచరణీయమును దెల్పుఁ డఖిలము దెలియన్.

సీ. పుట్టకపుట్టక పుట్టి రీనాఁటికి భవదీయకరుణచే బహుసహస్ర
సంవత్సరంబులు చన్నమీఁదటఁ గుమారులు నల్వు రమరకల్పులు మహాత్మ!
వారలలో రామభద్రుండు నా కతిప్రియకరుం, డాతని విడిచిపెట్టి
క్షణమైన జీవింపఁ జాలఁ, గా దన్న నిస్సందేహముగ హాని శాప మొసఁగు
గీ. సత్యభంగంబు గలుగని చందమునను, గాధిపుత్రుండు కుపితుఁడు గానిభంగి
శ్రేయ మబ్బు విధంబునఁ జెప్పు మొకయు, పాయ మిత్తఱి దయచేసి, బ్రహ్మపుత్ర!

వసిష్ఠుఁడు దశరథునితో రామలక్ష్మణుల గాధేయునివెంటఁ బంపుమని చెప్పుట

క. అనవుడు మైత్రావరుణుం, డను జనవర! దేవతారహస్యము గల దె
వ్వనికిం దెలుపఁగఁ దగనిది, విను మది నీ సంశయమ్ము వీడఁగఁ జేయున్. ౨౧౧

క. మనుజుం డని రాముని నీ, మనమునఁ దలఁపంగఁ బోకు మనుజేశ! సనా
తనుఁ డగుపరమాత్మయె యిటు, జనించె ధరణిస్థలి న్నిశాటులఁ జంపన్. ౨౧౨

సీ. సామాన్యుఁడవు కావు భూమీశ! నీవు బ్రహ్మకుమారుఁ డయి కశ్యపాభిధేయ
భాసితుం డగుప్రజాపతివి; కౌసల్య యశస్విని దేవతాజనని యైన
యదితిదేవిగ నమ్మ మంబుజగర్భుండు భూభార మణఁగించుపూన్కి మున్ను
ప్రార్థన సేయ నాపరమాత్మయే మీకు నందనుఁ డై పుట్టినాఁడు సూవె
గీ. గ్రామ్యవిషయంబులం బోక కమలనాభు, ధ్యానపూజాది తత్పరత్వంబు గలిగి
దంపతులు మీరు పెక్కువత్సరము లుగ్ర, తపముఁ గావించితిరి దైత్యదమనుఁ గూర్చి.

చ. వరదుఁడు భక్తవత్సలుఁడు వారిజనాభుఁ డనుగ్రహించి ని
న్నరయఁగ వచ్చి కోరు మెదిన్నైన నొసంగెద నన్న మోదసం
భరితుఁడ వై "భవద్దయకుఁ బాత్రుఁడ నైతి మఱొం డిఁ కేల క్ర
చ్చఱఁ గొమరుండ వై యుదయ మందుము నా" కని యంటి వత్తఱిన్. ౨౧౪

ఉ. దానికి సమ్మతించి వసుధాతలనాయక! నీకుఁ బుత్రుఁ డై
తా నుదయించె నిప్పుడు, యథార్థము రాముఁడు సూడ విష్ణు వే
కాని మఱొండు గాదు, భుజగప్రభుఁ డాతనిపాన్పు లక్ష్మణుం
డై నినుఁ దండ్రిగాఁ బడసె నా రఘురాము ననంతరమ్మునన్. ౨౧౫

గీ. అమ్మహావిష్ణుని సుదర్శనాయుధమ్ము, గరుడవాహనమును రెండుఁ గలసి నీకు
భరతశత్రుఘ్ను లై జనించిరి మఱియును, సీత నాఁగ విదేహభూనేత యింట.

సీ. యోగమాయ జనించి యున్నది, గాధేయుఁ డీ రాము నా సీత నేకముగను
గూర్పంగ నెమ్మదిఁ గోరి యయోధ్యకుఁ దా వచ్చె, నన్యులకుఁ దెల్పంగఁ దగని

పరమగోప్యం బిది, పరులకుం జెప్పక దాఁచుము నీవు డెందమ్మునందు
జాగేటి కింక విశ్వామిత్రుఁ బూజించి య మ్మహామహు వెంట ననుపు మధిప!

ఆ. రామలక్ష్మణులఁ బరాక్రమధుర్యుల, నందియమ్ము వీడి సమ్మదమున
జయము గల్గు దుష్టజన మీల్గు సత్కీర్తి, నిబిడముగ జగాన నిండి వెల్గు. ౧౦౭

క. అనవుడుఁ దన్నుం గృతకృ, త్యునిఁగాఁ దలపోసి దశరథోర్వీశుఁడు చ
య్యన సుతులఁ బిలిచి కవుఁగిట, నునిచి శిరము మూరుకొని మహోత్సాహమునన్.

క. మా ర్పలుకక కౌశికున క, హర్పతితులితునకు సంశయముఁ బో నిడి కం
దర్పాకారుల సుతుల స, మర్పించెను, దాసఁ బ్రముదితాత్ముం డగుచున్. ౧౦౯

చ. అలఘుశుభప్రదమ్ము లగునాశిషముల్ కరుణించి భర్త క
మ్ములపాదు లుగ్రచాపము లమోఘశరంబులు ఖడ్గముల్ యథా
బలముగఁ దాల్చి సింహములభాతిఁ బ్రయాణపుఁ గోర్కె ముందుగా
నిలిచిన రాజపుత్రుల మునీంద్రుఁడు తోడ్కొని పోయె, నంబికా! ౧౧౦

సీ. వారితో నొకకొంతదూర మేఁగినమీఁద భక్తిచే శ్రీరామభద్రుఁ బిలచి
యమరనిర్మితమైన విద్యాయుగంబు బలాతిబలనామధేయవిభాసితంబు
గలదు నాకడ వానిఁ దెలిసిన నాఁకలి యలసట లెవ్వియుఁ గలుగఁ జాల,
వని చెప్పి యుపదేశ మొనరించె, నంతట గంగాభవానిని గడచి ముగురు
గీ. తాటక వసించునట్టి యుద్దండకాన, నంబుఁ జేరిరి, త త్సమయంబు నందు
రఘుకులోద్వహు సత్యపరాక్రముఁ గని, దేశకాలజ్ఞుఁ డైనగాధేయుఁ డనియె.

గీ. కలదు తాటక యనెడిరక్కసి నెలంత, కామరూపిణి యి మ్మహాగహనమందు,
దానికతమున లోక మెంతేని గోడు, గుడుచుచున్నది యిడుమలఁ బడి సతంబు.

క. మగువ యని విచారింపక, తెగ నేయుము దాని నీ వతిత్వరితముగా
నగు శుభ, మన రాముఁడు నే, నె గుణధ్వని దిగ్గజములచెవులు గలంగన్. ౧౧౩

క. ఆ టంకృతిచేతఁ ఘో, రాటవి సకలమ్ముఁ దా నిరంతర యగుటం
దాటక విని సైపక వడి, గీఁటుకొనుచు రదనపంక్తి ఖేచరవృత్తిన్. ౧౧౪

శా. ఘోరాకారముతోడఁ బైఁ గవిసె, సక్రోధుండు శ్రీరాముఁ డో
నీ! రాకాసి! యిఁ కెందుఁ బోయెదవు, వచ్చెం జచ్చుకాలంబు నీ
క్రూరత్వం బెది చూపు చూచెద జగత్క్షోభంబు గావింతు రె
వ్వా ర వ్వారలకండక్రొవ్వుఁ గరగింపం గాదె నే వచ్చుటల్? ౧౧౫

వ. అని, పరుషమ్ముగఁ బలికి. ౨౨౬

క. దండధరదండనిభ మ్ము, ద్దండశరం బొండు లాగి తడయక నిజ కో
దండమునఁ గూర్చి దానవి, గుండియ రెం డై చనఁగ నగుచు వైచె, సతీ!.

ఉ. ఆతపనీయచండవిశిఖాయతపాత ముదగ్రదీర్ఘని
ర్ఘాతము కొండఁ బోలె నల తాటకివక్షము వ్రక్కలించినన్
వాతఁ దొఱంగ రక్త మనివారిత మై, కుజపాళి చాల్పడన్
భూతచయంబు భీతి గొన బోరనఁ గూలె నరణ్యధారుణిన్. ౨౨౮

సీ. మునిశాపమునఁ జేసి తనకుఁ బ్రాప్తించినరక్కసితనము శ్రీరాము కరుణఁ
బాయుటవలన మున్నటియట్ల సుందరాంగము సమస్తాభరణములు గల్గి
యలరారుయక్షకన్యక యయి వలఁగొని మ్రొక్కి- య య్యనఘుని మొదల గాంచి
నాకంబునకుఁ జనె, నంత మునీంద్రుండు గాధిపుత్త్రుండు తాటకావధంబు
గీ. సేయుటకుఁ గడుసంతోషచిత్తుఁడగుచుఁ, దనదు కవుఁగిటఁ జేర్చి మూర్కొనిశిరంబు
బుజ్జగించెఁ ద దున్నతిఁ బొగడె, నింత, కన్న మునులకుఁ బ్రీతి యే మున్న? దతివ!.

గీ. రావణుని సంహరింప నారాయణుం డె, రాముఁ డై పుట్టె దేవకార్యమున కిపుడు,
తోడుపడి కొంచె మేఁ గృతార్థుండ నగుదు, నని విచారించి కొంత సే, పవలమౌని

గీ. మీఁదఁ గావించుదైత్యవధాదికమ్ము, పట్ల నుపయోగపడుటకుఁ బ్రమదమున నొ
సంగె శ్రీరామునకు రహస్యములతోడ, మంత్రములతోడ సర్వాస్త్రమండలమ్ము.

సీ. అంతట మున్ను పురారిఫాలాగ్నిచేఁ బంచాస్త్రుఁ డెవ్వోట భస్మ మయ్యె;
నట్టి మనోహరం బై హానిసంకులం బైనకామాశ్రమమందు నడవి
నొకరాత్రి గడపి యుత్సుకతమైఁ బ్రొద్దుట లేచి కాల్యంబుల నాచరించి
పయనమై త్రోవఁ గన్పడుచిత్రముల నెల్ల భూపపుత్త్రులకుఁ దెల్పుచు మునీంద్రుఁ
గీ. డరిగి సురసిద్ధసేవిత మతులరమ్య, మనఘమునిమండితము భూరుహాన్వితంబు
ద్రష్టృలోకమహానందదాయకంబు నైనసిద్ధాశ్రమముఁ జేరె నచలతనయ!.

ఉ. చేరి, తదాశ్రమస్థమునిశేఖరులం బిలిపించి కంటిరే?
వీరలు రామలక్ష్మణులు విక్రమశాలులు యాగవిఘ్నకృ
త్క్రూరనిశాటసంఘమును గూల్పఁగఁ దెచ్చినవాఁడ నంచు న
వ్వారలఁ గూడి వారి కనివారితభంగి నొనర్చె నర్చలన్. ౨౩౩

కౌశికయాగసంరక్షణము

ఉ. అప్పుడు రాఘవుం డనియె నయ్య! తపోధన! జాల మేల మీ
రిప్పుడ యాగదీక్షను వహించి భవత్ప్రతికూలు రైన వా

రెప్పుడు వచ్చి విఘ్నమును నెద్దియొనర్తురొ; యట్టికాలముం
జెప్పుము మచ్ఛరంబుల విశీర్ణశిరస్కులఁ జేతు ప్రేల్మెడిన్. ౧౩౪

క. ఆమాట కలరి ముని వి, శ్వామిత్రుం డల్లి యనుచు జన్న మొనర్పం
గా మొదలిడె దీక్షం గొని, తా మౌనిగణమ్ముతోడ దక్షకుమారీ! ౧౩౫

. జన్నము యథాక్రమమ్ముగ జరుగుచుండఁ, గామరూపులారాక్షసుల్ కడఁగి యాగ
శాలఁ గురిసిరి మధ్యాహ్నవేళ మాంస, శల్యసమ్మిశ్రరుధిర మ్మసహ్యముగను.

వ. తదుత్తరక్షణంబ. ౧౩౬

క. ఈకౌశలమున నా, రాక్షసులఁ దపస్వి చూప, రాముఁడు గని పై
త్యక్షయకరము శరద్వయ, మాక్షణమున వింటఁ గూర్చె నతిరౌద్రముగన్.

చ. చెవికొనదాఁకఁ జాపమును జివ్వన లాగి తదంబకంబు లు
ద్దవిడి సమిద్ధురీణుఁడును ధైర్యవిశాలుఁ డతంద్రితుండు రా
ఘవుఁ డరు దందఁ దాపసులు గ్రక్కున నుక్కడఁగుం డటంచు దా
నవయుగళమ్ముపైఁ బఱపినం బ్రళయార్కభయంకరంబులై. ౧౩౯

వ. వారలపయిం గవిసె, నట్లు గవిసి. ౧౪౦

క. అం దొక బాణంబే మసి, యందుఁగ మారీచుఁ ద్రిప్పఁ జామడ లోకనూ,
ఇందుముఖి! లవణసాగర, మందుం బడవైచె నంద ఆశ్చర్యపడన్. ౧౪౧

గీ. అగ్నిమయ మగు రెండవ యంబకమునఁ, బడియె మేనికిఁ బాసి సుబాహుని తల
యమరనాయకువజ్రపాతమునఁ గూలుభూమిభృచ్ఛృంగ మోయనఁ బోలుపుదక్కి.

క. వారల వెంబడి వచ్చిన, వారల నా లోనఁ గూల్చె వసుధాస్థలిపైఁ
గ్రూరశరంబుల సటఁ గల, వారౌనన లక్ష్మణుండు వారని కినుకన్. ౧౪౩

సీ. సానుజుఁ డగు నాజిసూనునిపై సపు డమరులు కుసుమ వర్షమును గురిసి,
రల దేవదుందుభు లత్యుత్కటంబుగఁ దమయంత జయనినాదముల మ్రోఁగె
సిద్ధచారణులు ప్రసిద్ధవాక్యంబులం బొగడి, రంతట మునిపుంగవుండు
భక్తిచే దృక్శతపత్రంబులందు నానందబాష్పంబులు సింద నెలమిఁ

ఆ. బూజ కర్హుఁ డైనరాజీవలోచను, నసురమథను రాము నఘవిరాము
ననుజసంయుతముగ నర్చించి తోడ పయి, నుంచి గ్రుచ్చి కవుఁగిలించుకొనియె.

గీ. అచలనందిని! పక్వఫలాదికమ్ము, లన్నదమ్ములఁ దినుపించి యవసరముల
మధురగాథలు దెల్పు చ పమ్మౌని మూఁడు, దినములుం దుండె నాల్గవదినమునందు.

ఉ. రామునిఁ జూచి యిట్టులను రాఘవ; నేఁడు విదేహభూమిప
గ్రామణి సేయుజన్నమును గానఁగఁ బోవుద, మప్పురంబునం
దా మును స్వీయచాపమును దాఁచె గిరీశుఁడు, దాని నెక్కిడన్
భూమిపు లెవ్వ రిందనుకఁ బూనరు సార మపార మౌటచే. ౨౪౬

క. నీ వది చూడఁగ వచ్చిన, భూవరుఁ డాతండు నీకుఁ బూజ లొనర్చున్
గావున వైళమ పోవం, గావలె నని మునులతోడఁ గాకుత్స్థులతోన్. ౨౪౭

గౌతమాశ్రమవృత్తాంతము

సీ. పయన మై చనిచని భాగీరథీతీరదేశసంస్థితమును, దివ్యపుణ్య
ఫలనికురంబసంపన్నభూజోపేత మైనను బక్షిమృగాళిహీన
మవుటచే నితరజంతువులకు వాసయోగ్యంబు గానిది యగుగౌతమాశ్ర
మముఁ జూచి మౌనిసత్తముతోడ నిట్లను రామచంద్రుఁడు, తపోరాశి! తెల్పు
గీ. మెవరి దీ యాశ్రమము? జగద్వంద్య, మక్షిపర్వ మత్యున్నతంబును బత్రపుష్ప
ఫలయుతం బయ్యు జంతుమండలనివాస, హీన మై కానఁబడుటకు హేతు వేమి?

క. స్వాంతమున దీనిఁ గనుఁ గొన, నెంతయు సంతోష మొదవె, నేత ద్వన వృ
త్తాంతము యథార్థముగ భగ, వంతా! దయచేసి తెలుపవలె నన మునియున్.

వ. విను మని యిట్లు చెప్పఁ దొడఁగె. ౨౫౦

ఉ. ఆతతకీర్తిసారుఁ డనలాధికతేజుఁడు సర్వధర్మభృ
న్నేత మహాతపస్వి కమనీయకథాత్త జగత్ప్రసిద్ధుఁ డా
గౌతమమౌనివల్లభుఁడు కాంచనచేలు దయావిశాలు ల
క్ష్మీతరుణీవిభుం గుఱిఁచి చేసెఁ దపంబుఁ దదేకచిత్తుఁ డై. ౨౫౧

వ. అట్లు పురుషోత్తముం గొలుచు చుండ. ౨౫౨

శా. భాషానాయకుఁ డిచ్చెఁ బ్రీతుఁ డయి దివ్యద్బ్రహ్మచర్యంబునన్
యోషారత్నము లోకసుందరి జగన్మాత్యర్హలావణ్య శు
శ్రూషాసక్త నహల్య న మ్మునికి నచ్చో, నాతఁ డత్యంత సం
తోషాఢ్యుం డయి యుండె ని వ్వనమునందుం దత్సతీయుక్తుఁ డై. ౨౫౩

చ. తపసులలోన నుత్తముఁ డతం డటు లియ్యెడ న య్యహల్యతో
విపులముగా సుఖం బనుభవించుచు నుండ, శచీమనోహరుం
డపరిమితానురాగమున నాసతిఁ గూటమిఁ గోరి యాత్మలో
నెపు డవకాశ మబ్బు నని యేమఱ కారయుచుండె నిత్యమున్. ౨౫౪

వ. అట్లుండి యొక్కనాఁడు. ౨౫౫

క. ముని యిల్లు వీడి బయటికిఁ, జనియుండినవేళ మౌనిసదృశాకృతిఁ గై
కొని వచ్చి సురతసుఖముం, గని యుటజం బపుడ పాసి కలవరపడుచున్. ౨౫౬

ఉ. ముప్పగుఁ దప్ప కేను మునిముఖ్యునకుం గనఁబడ్డపక్షమం
దప్పుడ తప్పుత్రోవ నెటు లేనియు నిచ్చోటు వాసి పోవుటల్
* చొప్పగునంచు నెంచి బలసూదనుఁ డాశ్రమసీమనుండి తా
నెప్పుడు సాగె నప్పుడ; సతీ! చనుదెంచెను నక్షపాదుఁడున్. ౨౫౭

మ. నిజరూపంబున నింటినుండి చనుస్వర్ణేతన్ విలోకించి, కెం
పుజిగిన్ మేలములాడు కన్గవ, నయాంభోరాశి నాఁ బొంగు న
* క్కజపుంగ్రోధరసంబు, భీప్రదము లై కన్పట్టఁ దేజఃప్రభా
వజటిశ్రేష్ఠుఁడు గౌతముం డనుఁ బయోవాహాతు లోగ్రార్భటిన్. ౨౫౮

శా. మద్రూపంబు ధరించి యీపగిది నస్మద్గేహసంచారముల్
రుద్రుం డేని నొనర్ప శంకితుఁ డగున్ మూఢాత్మ! నీ విట్లు కా
* మోద్రేకంబున వచ్చి తిందుల క దేమో? నీ కథం జెప్ప ము
ద్యద్రౌద్రాగ్నిని భస్మ మయ్యెద వబద్ధం బాడి పో నెంచినన్. ౨౫౯

ఉ. త ప్పిది యో యొనర్చినవిధంబును నీ దగుమోముచంద మే
చెప్పుచు నున్న దెందు కిఁకఁ జెప్పు మెవండవు నీవు! నేను లే
* నప్పుడు మత్కుటీరమున నడ్గిడఁ గారణ మేమి? ము ప్పెటల్
దప్పదు, మత్తపోఽనలవిదగ్ధునిఁ జేతు నిమేషమాత్రలోన్. ౨౬౦

వ. అనుటయు. ౨౬౧

గీ. ఖరతర కుఠార నిహతిచేఁ దరువు వోలెఁ. గుధరవైరి తదుగ్రవాక్యానను గంప
* మొంది గుండె గుభా లనఁ గుందె, హాని, బాటకిం దప్పి చనుటేలుదారి లేమి.

క. శాప మెటులుఁ దప్పని దని, పాప మతఁ డెలుంగు రాలుపడ నాలమునన్
* మోపె కరాంబుజములు తన, పాపపుఁగృత్యమ్ము నిట్లు పలికెను రామా!. ౨౬౩

ఉ. ఓ మునిసార్వభౌమ! కరుణోదధి! నే నలదేవనాథుఁడం
గామశరాగ్ని కింధనముగాఁగ శరీరము, బుద్ధి మాలి యొం
డేమి దలంప కాము మెయి నియ్యెడఁ జేసితి నీచకార్యముం,
గాముకు లేమి సేయ? రలుకం గొన కీవు క్షమింపఁగాఁ దగున్. ౨౬౪

ఉ. చేసినతప్పు చెప్పిన నశించును బాప మటందు రార్య, లేఁ
జేసితిఁ గుత్సితంపుఁ బనిఁ, జెప్పితి దాసుఁడ నంటిఁ గోపముం
జేసినఁ జేయకున్న మునిశేఖర! మీరలె చుండు, నాపయిన్
రోసముఁ బూన కించుకయనుగ్రహబుద్ధిని జూడ వేఁడెదన్. ౨౬౫

చ. ఇటు వినయంబు లాడుత్రిదశేశ్వరు నుగ్రపుటల్క "యోనిలం
పట! దురితాత్మ! మోహక! భవత్కృతదుష్క్రియకున్ సమాన మౌ
నటులఁ ద్వదీయదేహము సహస్రభగంబులు గల్గి యుండు నిం
కిటపయి" నంచుమౌని శపియించె భుజంగముభంగి రోఁజుచున్. ౨౬౬

వ. ఇట్లాఖండలు నుద్దండశాపంబునకు గుఱి చేసి,యటఁ గడ మక లోఁనికింజని. ౨౬౭

చ. చెడుగుఁదనం బటంచు నిరసింపక చేసినచేఁత కింతయున్
గడగడలాడుచుం గరయుగంబును మోడ్చియున్న చేడెతో
నడ రెడికిన్కఁ బల్కెఁ "గులటా! నినుఁ బెండిలియాడి నా తపం
బడవిని గల్పుకొంటిని కులాంగన లీక్రియ సంచరింతురే? ౨౬౮

సీ. తెలియక మంచిచెడ్డలు పాపకార్యంబు సలిపితి గాన పుంశ్చలి! తదీయ
పాపఫలంబుఁ గన్పడఁ జేతు నిదె విను, మాహారమును మాని యహరహంబు
నుత్తమతపము సేయుచు గాలికిన్ వాన కెండకును సహించి యేకచిత్త
మున హృదయస్థితు ననఘు రాఘవుని ధ్యానమ్ము సేయుచు నీవనమ్మునఁ గల
గీ. బండయందుఁ బ్రవేశించియుందు, మబల!, వదలి పోవునుగాపుత మిది మొదలుగ
నస్మదీయాశ్రమమునుండి యఖిలజంతు,గణము లని పల్కి యిట్లనె గౌతముండు.

ఉ. చేడియ! తప్పుఁ జేసి పయిఁ జింతిల నేమిఫలంబు? పెక్కువే
లేఁడులు చన్నమీఁద జగదీశుఁడు రాముఁడు సానుజన్ముఁ డై
యీడకు రాఁగలండు మిథిలేశుని యజ్ఞముఁ జూడఁ బోవు, చా
నాఁడు స్వకీయపాదనలినంబున నిన్ను స్పృశించు సత్కృపన్. ౨౭౦

ఉ. ఆమహనీయపాదమహిమాతిశయంబున ధూతపాప వై
రామునిఁ బూజలం దనుపు, రామ! ప్రదక్షిణపూర్వకంబుగా
వేమఱుఁ గాళ్లమీఁదఁ బడి వేఁడుము, శాపము వాయు దాన నా
పై మును బోలె నాకడ శుభంబుగ నీకు వసింప నయ్యెడున్. ౨౭౧

క. అనిచెప్పి గౌతముఁడు చ,య్యన నచ్చోటు నిర్గమించి కుధరశ్రేష్ఠం
బని వినుతిఁ గన్నగౌరీ,జనకునికడ కేఁగెఁ దపము సలుపఁగ రామా! ౨౭౨

ఉ. అదిమొదలా యహల్య పవనాశన యై తన దైనమంగళ
ప్రద మగునాశ్రమస్థలిని బ్రాణులకుం గనరాక దీక్ష నీ
పదములధూళి యెన్నటికిఁ బైఁ బడునంచుఁ బ్రతీక్ష సేయు చు
న్నది దృషదాకృతిం గొని కనంబడుచుండెనె? సజ్జనప్రియా! ౧౭౩

ఆ. తోడరి యిపుడు గూడ దుష్కరతపముఁ గా, వించుచున్న యవ్విరించిసుతను
నక్షపాదుగృహిణి నీక్షణమున నీవు, కడుఁ బవిత్రురాలిఁగా నొనర్పు. ౧౭౪

చ. అని మునిపుంగవుండు నిజహస్తమునన్ రఘురాముహస్తముం
గొని యిటుర మ్మటంచు నటకుం గొనిపోయి మహోగ్ర మౌ తపం
బొనరుచు నజ్జటిప్రవరు యుగ్మలి నారయఁ జేసి, దీనిపై
ననుపుము యుష్మదీయపదయుగ్మము నేఁడని పల్కె నంబికా! ౧౭౫

అహల్యా శాపమోచనము

క. మునిహితముగ రఘుపతి స, న్మునిపూజితనిజపదాబ్జమును దచ్ఛిలపై
నునిచెను దోడనె మునిసతి, మునుపటిరూపమ్ముఁ బడసె మునులరు దందన్. ౧౭౬

స్రగ్ధర. నిజపాదస్పర్శమాత్రన్ నిబిడజలదమున్ వీడి తోతెంచు శంపా
వ్రజ మన్ విభ్రాంతి గొల్పం, బ్రకటతరశిలం బాసి తొల్లింటిరూ ప
క్కజ మై చూపట్టఁ బ్రత్యక్షముగ నమరునగ్గౌతమప్రేయసిం దో
యజరాడ్వంశాబ్ధిమాణిక్యము గని ముదితుం డై ప్రణామం బొనర్చెన్. ౧౭౭

సీ. వందనం బొనరించి వనితామతల్లి! నే రాముఁడ, నని పల్క రమణి యపుడు
స్మితవక్త్రుఁ బీతకౌశేయవాసునిఁ జతుర్బాహు ససౌమిత్రిఁ బద్మనేత్రు
శ్రీవత్సరత్నరాజిత విశాలోరస్కు శంఖచక్రగదాంబుజాతహస్తు
నీలమాణిక్యసన్నిభదేహు స్వప్రభాదీపితదిగ్భాగు దివ్యచాప
గీ. బాణధరు రామభద్రు శ్రీభర్త నరసి, హర్షవిస్ఫారితేక్షణ యై, నిజేశు
మాటఁ దలపోసి యమ్మహామతికిఁ బూజ, సేసె నర్ఘ్యాదికముల శాస్త్రీయముగను.

అహల్యాకృతశ్రీరామస్తవము

మ. నయనాంతంబుల హర్షబాష్పములు చిందన్ భక్తితోఁ బత్కు శే
శయయుగ్మంబున క య్యనిందిత నమస్కారంబు గావించి లే
చి, యిదే, మత్సుకృతంబు పెంపున రఘుశ్రేష్ఠున్ రమాకాంతు న
వ్యయు వీక్షింపఁగఁ గంటి నంచుఁ దలఁచుం బ్రార్థించు నేకాగ్రతన్. ౧౭౮

చ. కనుఁగొనుఁ జిత్తతాప మడఁగన్, వినయంబున మ్రొక్కుఁ, దా పునః
పునరవలోకనంబు సలుపున్, రఘురామున కివ్విధంబుగాఁ
దనివిసనంగ వందనశతంబులు దేహము పొంగఁ జల్పి యి
ట్లని వినుతించె ఫాలమున నంజలిఁ జేరిచి గద్గదోక్తులన్. ౨౮౦

చ. నిటలదృగబ్జగర్భముఖనిర్జరు లెయ్యది పొందఁ జాల కొ
క్కటఁ దపియించుచుందురు మొగంబులు వాయఁ దదేకచిత్తులై
యటమట లేక; యట్టి భవదంఘ్రిసరోజరజఃకణంబు సోఁ
కుట సఫలమ్ము జన్మ మనుకూలము దైవము, దేవతాపతీ! ౨౮౧

చ. విడివడి పొంగెడున్ హృదయవీథిని భక్తిరసంబు రామ! నీ
నడవడిఁ జూడఁ జిత్రముగ నాకుఁ గనంబడు చుండెఁ, జిత్స్వరూ
పుఁడ వని నిర్గుణుండ వని పూర్ణుఁడ వాద్యుఁడ వంఘ్రిహస్తహీ
నుఁడ వని చెప్పుచున్నవి నిను న్నిగమాంతము లెల్ల నేకమై. ౨౮౨

ఆ. అనఘ! యట్టివాఁడ వయ్యును మాయాగుణానుకృతిని మానవాకృతిఁ గొని
విశ్వ మెల్ల మోహవివశమ్ముగాఁగఁ జరించుచుంటి విటు ప్రపంచమునను. ౨౮౩

ఉ. చారుయదీయపాదజలజాతపరాగపవిత్రగాత్రి భా
గీరథి శంకరాదుల నొగిన్ విమలాత్ములఁ జేయఁ జాలెనో;
శ్రీరమణీమనోహరుఁ డశేషజగన్నుతుఁ డమ్మహాత్ముఁ డే
భూరిదయం గనంబడియెఁ బో మును జేసినపుణ్యసంపదన్. ౨౮౪

గీ. మానుషావతారముఁ గొన్న మనుజుఁ జాపహస్తు రమణీయకాయు రామాభిధేయుఁ
బద్మపత్రవిశాలాక్షుఁ బద్మనాభుఁ, గొలుతు నిరతంబుఁ దక్కు వేల్పుల భజింప.

చ. ఘననిగమాళిచేత వెదకంబడు నెవ్వనిపాదధూళి; యే
యనఘునిబొడ్డుదమ్మిఁ గమలాసనుఁ డుద్భవ మందె; నే ఘనా
ఘననిభునామసారరసికత్వము గుర్తెఱిఁగెం బురారి; య
వ్వినుతచరిత్రుఁ డైనరఘువీరు నుదారు సదా భజించెదన్. ౨౮౫

ఉ. నారదమౌనిముఖ్యులుఁ బినాకి సరోజభవాది దేవతా
వారముఁ జోళగోపితవిపంచికలన్ వెలిఁ జేసి యాపదు
ద్ధారక! భక్తిమై యదవతారకథావళిఁ బాడుచుందు రే
కారియ మైన మాని తమకంబున; నట్టి నినున్ స్మరించెదన్. ౨౮౬

చ. తిలకము జాలువాఱ, నిజదేహమువొంగ, గురుస్తనోపరి
స్థలి ప్రమదాశ్రులం దడియ, దంతపుమెట్ల విపంచిమీఁద మం
జులగతి నే పరాత్పరుని చోద్యములం బలికించి భారతీ
లలన ముదబ్ధిముంచు సురలర్; నత మావిభు నిన్నుఁ గొల్చెదర్. ౨౮౮

సీ. నీవు పరాత్మవు నిర్మలుండవు శాశ్వతుఁడవు స్వయంప్రకాశుఁడ వనంతుఁ
డవు సర్వకారణమవు పరానుగ్రహార్థము ప్రపంచమును మోహమున ముంపఁ
దగుమాయ దేహంబు ధరియించితివి రామ! యాత్మీయమాయాగుణాళియందుఁ
బ్రతిబింబితుండవై బ్రహ్మవిష్ణుమహేశనామభేదంబులర్ బడసి జగము,
గీ. సృష్టిఁ జేసి పెంచి చెఱచు స్వతంత్రుండ, వఖిలకర్త వీవె యనఘచరిత!
నిన్నుఁ జూడ నేఁడు నేర్చితి, మార్చితి, మందబుద్ధి, సౌఖ్య మందఁ గంటి. ౨౮౯

సీ. అక్కునఁ జేర్చి నెయ్యం బార వారాశిపుత్రిక యెద్దాని బుజ్జగించుఁ
దొలివేల్పుదుండగీఁడులదుండగంబుల, దాఁటుదు రమరు లెద్దాని నమ్మి
ముత్రోవ లై భువనత్రయమ్మును బవిత్రము సేయుగంగ యెద్దానఁ బొడమె
స్మరణమాత్రన పాపి సంసారమును ముక్తి ఘటియించు నమృతంపు ఘుటిక యెద్ది
గీ. యఖిల నిగమోపబృంహితం బైన దెద్ది, లలితగతి నేఁడు నా ముందుఁ బొలిచె నెద్ది,
యట్టి భవదీయమహితపాదాబ్జమునకు, నంజలి యొనర్చుదాన మహానుభావ!.

క. నీవ జగదాదిభూతుఁడ, వీవ సమస్తప్రపంచ మితరు లెవరుఁ గా
రీవ జగదాశ్రయుండవు, దేవా! నీ విధము నాకుఁ దెలియఁగ నగునే? ౨౯౧

గీ. అరయ నీ వద్వితీయుండ వఖిలభూత, చయమునం దెట్టిసంబంధసరణి లేక
సర్వమునకుఁ బరుండవై స్వప్రకాశుఁ, డవయి వెలుఁగొందు చుందువు రవికులేశ!.

గీ. అల్ల యోంకారవాచ్యుండ వనఘ! నీవె, వాగవిషయపూరుషుఁడ వవ్యయుఁడ వీవె
వాచ్యవాచకభేదంబువలన లోక, మయుఁడవై యున్నవాఁ డవు, మధువిదారి!.

వ. దేవా! నీ వొక్కండవైనను వివిధరూపములు గలమాయ నవలంబించినవాఁడవై మహత్తత్త్వాది కార్యములుగను, మూలప్రకృతి రూపకారణముగను, కర్తగను స్వర్గాదిఫలముగను, తత్సాధనము లగు దేవయజ్ఞాదులుగను, గన్పట్టుచున్నావు. భవన్మాయామోహితబుద్ధులు యథార్థముగ నిన్నెఱుఁగఁ జాలరు. మాయచే మనుజుని చందమునఁ దోఁచుచున్న పరమేశ్వరుఁడ వని నిన్నుఁ దెలిసికొనలేక, వాస్తవముగ మనుష్యుఁడ వే యని భావించుచున్నారు. ఆకాశము వదువున నీవు బహిరంతర్గతుండవై యచలుండవై నిత్యుఁడవై నిర్లిప్తుండవై జ్ఞానస్వరూపుండ

వై సత్త్వమె స్వరూపముగఁ గలవాఁడ వై నాశరహితుండ వై యుంటివనుట వేదములయందు సుప్రసిద్ధము. తమోగుణవశ్యనై యేమియుం దెలియని స్త్రీనయిన నేను భవదీయ వాస్తవస్వరూపం బెట్లు దెలియనేర్తు? అనన్యమానసంబున ననేక పర్యాయంబులు నమస్కరింతు నని కృతశతప్రణామ యై యహల్య, కౌసల్యానందనునితో మఱియుఁ బ్రార్థనాపూర్వకముగ నిట్లనియె. ౨౯౪

ఆ. రామ నీదుపాద రాజీవమం దెడ, తెగనిభక్తి గల్గుపగిది నెపుడు
న న్ననుగ్రహింపు నా స్తుతి నాలింపు, మెందు మెలఁగుచున్న నెట్టు లున్న ౨౯౫.

క. వందనము పురుషపుంగవ!, వందన మజ్ఞాత! భక్తవత్సల! రామా!
వందనము హృషీకేశా!, వందన మంబుధిశయాన! వందనము హరీ! ౨౯౬.

సీ. భయదదీర్ఘామోఘభవబంధమోచన! వర్షాంబువాహ భాస్వచ్ఛరీర!
తప్తగాంగేయ సందీప్తవస్త్రావృత! ప్రవిమలశతపత్రపత్రనేత్ర!
కరికరాంచన్నైజకర ధృతశరచాప! భానుకోటి ప్రభా భాసమాన!
నవరత్న ఖచితకుండలమండితశ్రోత్ర! సంస్తువద్ధాత! లక్ష్మణసమేత!
గీ. స్తోత్ర మొనరింతు నన్ను నస్తోకకరుణఁ, బ్రోవు మని వేఁడి ప్రత్యక్షముగ వెలుంగు
దాశరథిచుట్టుఁ దిరిగి వందన మొనర్చి, ముదల గొని భర్తకడ కేఁగె ముదిత యగుచు.

క. గిరిపుత్రి! యహల్యాకృత, వరరామస్తవ మెవండు పఠియించు సమా
దరమున నిరతం; బాతఁడు, పరముపదమునొందు ధూతపాతకుఁ డగుచున్ ౨౯౭.

క. పుత్రార్థులు కౌసల్యా, పుత్రునిఁ జిత్తముల నునిచి పొగడుచు మఱి యీ
స్తోత్రముఁ జదివిన వత్సర, మాత్రములోఁ బడయుదురు కుమారుల, గౌరీ! ౨౯౮.

గీ. గొడ్డురా లైన దీని మిక్కుటపుభక్తిఁ, జదివినను విన్న నొక్కవత్సరములోనఁ
బంచశరుఁ బోలు కొడుకును బడయఁగలదు, సర్వకామప్రదుఁడు రామచంద్రుఁడబల!

చ. ధరణిసురఘ్నుఁ డైన గురుతల్పగుఁ డైన సురాపుఁ డైన సో
దరపితృమాతృగోబుధవధాదరుఁ డైనను గామభోగ సా
గరవిసిమగ్నుఁ డైనఁ గలకంఠి! రఘూత్తము దివ్యనామ సం
స్మరణము సేసి దీని నొకసారి పఠించిన ముక్తుఁ డయ్యెడున్. ౩౦౧

ఉ. అంతట గాధినందనుఁడు సానుజు రామునిఁ గాంచి, నాయనా!
యెంతటి వారి కేని ఘటియింపఁగ రాని పనిం బొనర్చి తీ,
వెంతయు మోద మయ్యె, మన మియ్యెడనుండి విదేహధారుణీ
కాంతుఁ డొనర్చు సత్క్రతువుఁ గానఁగఁ బోవుద మాపురిం జొరన్. ౩౦౨

క. కనుఁ గొనినమీఁద మీ ప, త్తనమునకుఁ మీరు వొందు తడ వైన భవ
జ్జనకుఁడు తహతహపడు, మిమ్మనిపెడి తఱిఁ జాలకష్ట మయ్యెను గాదే? ౩౦౩

వ. అనిచెప్పి కేసరికిశోరయుగళముం బోని రామలక్ష్మణులం దోడ్కొని, మునులతో భువనపావని యగు గంగాభవానిం డాయం బోయి, దానిం దాఁట నావికావలోకనంబుసేయునంత, నొక్కనావికుఁడు వారిం జేరవచ్చి మ్రొక్కి సవినయమ్ముగ గాధేయునితో ని ట్లనియె. ౩౦౪

క. దాఁటింతుఁ గాని మిము జవ, దాఁటక భవదాజ్ఞ, నొక్కతహతహగల ది
ప్పాటుఁ మీయందఱిలోఁ; బాటితతాటకునియెడఁ దపస్వివరేణ్యా! ౩౦౫

వ. అని, రామునిది క్కై. ౩౦౬

చ. శిలను మనుష్యసుందరిఁగఁ జేయురజస్సు భవత్పదంబులం
గల దనువార్త యొండు వినఁ గల్గితి, ఱాతికిఁ గొయ్య కంతగాఁ
గలుగమిఁ జేసి భేదము, జగన్నుత! దారుమయంపునావపై
నిలుపకమున్న మీచరణనీరజముల్ గడుగం దలంచితిన్. ౩౦౭

చ. అరమర యేల సామి! నిజ మాడెదఁ దావకపాదమానుషీ
కరణపరాగముం దుడిచి గ్రక్కున దాఁటఁగఁ జేతు నీ సరి
ద్వర, మటుగాకయున్న నుడుపంబు భవత్పదధూళి సోఁకి సుం
దరి యగు, దాన జీవనవినాశము తప్పక సంభవించెడిన్. ౩౦౮

క. అనిపలికి, రాఘవునిపద, వనజంబులు గడిగి పడవవాఁ డవ్వలియొ
డ్డునకుఁ వారలఁ జేరిచెఁ, దనకల మెక్కించి ముదము దనరఁగ, మగువా! ౩౦౯

క. పిమ్మట రఘురామునితో, న మ్మునిముఖ్యుండు మిథిల కరిగి యుపగతా
లమ్మున ఋషివాటమునకు, సమ్మతి నేఁ గుటయు జనకజననాథుండున్. ౩౧౦

గీ. "వచ్చె గాధేయుఁ" డనుశుభవార్తను విని, మోదమంది పూజాద్రవ్యముల్ గ్రహించి
యెదురుగాఁ జని నిజపురోహితునితోడ, మౌనిచంద్రున కెలమి నమస్కరించి. ౩౧౧

వ. భక్తివినయంబు లుట్టిపడ యథావిధిగఁ బూజించి, తన్నికటస్థు లయిన సర్వలక్షణసంపన్నులును, నిజదేహప్రభాశోభిత దిగ్భాగులును, జంద్రసూర్యసంకాశులు నగు రామలక్ష్మణులం జూచి విస్మితుండై. ౩౧౨

మ. పురుషశ్రేష్ఠులు దేవతాభులు జగత్పూజ్యుల్ మహావిక్రముల్
నరనారాయణులో; యనంగఁ దగి యున్నా రెవ్వ రీబాలకుల్

పరమానందము గల్గెదుఁ గా మునిగణ ప్రఖ్యాత యేత న్మనో
హరలావణ్యవిలోకనక్షణమునం దస్మన్మనోవీధికన్. ౩౧౩

క. కొడుకులుంగా నిమ్మహితులఁ,బడసి ముదము నెనయునట్టి భాగ్య మెవని కే
ర్పడెఁ? నసదృశ మై యేవం,గడము పుడమి వెలిఁగ వీరికతన? మహర్షీ! ౩౧౪

సీ. అనుడు విశ్వామిత్రుఁ డధికసంతుష్టుఁడై పలుకు, విదేహభూపాల! వీరు
దశరథరాజన్యతనయులు సోదరుల్ రామలక్ష్మణులు పరాక్రమనిధు,
లధ్వరసంరక్షణార్థ మీయిరువురఁ గొనివచ్చినాఁడను జనకుఁ డంప
వచ్చుచు నీవీరవరుఁ డేకశరమున జగముఁ బీడించుదుశ్చరిత యైన
గీ. తాటకను గీటడంచెఁ,బిదప మదాశ్రమముఁ బ్రవేశించి నామయజ్ఞమును జెఱచు
క్రూరమతుల సుబాహుముఖ్యుల ననేక,దానవుల రూపుమాపె నుద్దండభంగి.

క. మారీచు నేకశరమునఁ, బారావారమ్ములోనఁ బడవైచె సునా
సీరప్రముఖాధ్వరభు, గ్వారము కైవార మొనరుపఁ, బృథివీశా! ౩౧౬

సీ. అటుమీఁద గంగాతటావనీస్థితమును, మంగళకరమును మహిత మైన
గౌతమాశ్రమమును గని, లోని కేఁగి, యం దమ్ముని యుగ్రశాపమ్మువలనఁ
బెనుబండ యైయున్నవనిత కహల్యకు స్వపదాంబుజాత సంస్పర్శమునను
మునుపటిచందాన మనుజకాంతారూప మలవడఁ జేసి ప్రమోక్కాచరించి,
గీ. యామెచే నెంతయును బూజలంది నేఁడు,నీగృహంబున విలసిల్లునిటలనయను
విల్లుచూడఁ దలంచి నావెంట నిటకు,వచ్చినాఁడు, కాఁ డందఱవంటివాఁడు. ౩౧౭

క. ఆ పెనువి ల్లావంతయు, మోపెట్టఁగ లేక బిక్కమొగముల లజ్జా
రోపితహృదయమ్ములఁ బృథివీపతు లరిగి రనుమాట విని మే నుబ్బన్. ౩౧౮

గీ. "దానిబల మెట్టిదో చూచెదను మదుగ్ర,జాగ్రదుద్దండదోర్దండసత్వ పీడి
తాంగ మై భంగపాటు దా నందకున్నె",యను తలంపున నున్నాఁడు జనవరేణ్య!

క. కావున శైవశరాసము, నీ వీ రామునకుఁ జూపు, మేటికి జాగా
చేవఁ గనుంగొని వైశమ,ఖోవలె నని యుండెఁ దండ్రిఁ బొడగనువాంఛన్. ౩౨౦

చ. జనకుఁడు ధర్మవేత్త మునిచంద్రునివాక్యము లాలకించి, వీ
రనఘులుఁ బూజనీయు లని యాత్మఁ దలఁచి, తొలంచి శంక, బల్
వినయముతోడఁ బూజ సలిపెన్ రఘుచంద్రుల కాశ్రితశ్రమా
పనయనదక్షదోర్బలవిభాసితమూర్తుల, కంబుజాననా! ౩౨౧

క. మనయింట నలరుభూతే, శునిధనువును దేరఁ బంచి చూపింపుము చ
య్యాన నీరఘుకులవీరున, కని మంత్రికిఁ జెప్పి జనకుఁ డనెఁ గౌశికుతోన్. ౩౨౨

చ. కరమున శూలికార్ముకముఁ గైకొని తేఁకువ వంచి రాఘవుం
డరిజనభంజనుండు కొనయందు గుణంబు దగిల్చె నేని; సం
బరమున మత్కుమారి ననమానను సీత నొసంగి సమ్మతిం
బరిణయముం బొనర్తు రఘుభర్తకు, మౌనివరేణ్యా! నావుడున్. ౩౨౩

ఉ. లేనగ వొప్ప రాము నొకలీలఁ గనుంగొని యట్లె చేయుమా,
మానవనాథ! యెందు కనుమాన? మమేయపరాక్రమక్రముం
డై నెగడొందురామునకు నైశము చాపముఁ జూపు మంచు న
మ్మౌని వచించుచుండ నట మంత్రి నిజాధిపు నాజ్ఞచొప్పునన్. ౩౨౪

శ్రీరాముఁడు శివునివిల్లు విఱుచుట

సీ. అంచిత సత్వులఁ బంచసాహస్రసంఖ్యుల భృత్యులం బాపి, యున్నతంబు
కమనీయసౌవర్ణఘంటాశతయుతమ్ము మాణిక్యవజ్రాదిమండిత మగు
నా యుగ్రునిధనుస్సు మోయించి కొనివచ్చి రామభద్రుని యగ్రభూమి నిల్పి
రాఘవ! యియ్యదె రాజశేఖరువిల్లు పరికింపు మని ప్రీతిఁ బలుక దానిఁ
గీ. జూచి సంతోషియై, మునిఁజూచి పెదవి, విఱిచి యిదియెంతపనియనువిధముదోఁపఁ
గండువను గట్టిగా నడికట్టుఁగట్టి,యబ్రమున నందఁ గలవార లరయుచుండ. ౩౨౫

మ. అవలీలన్ నిజవామహస్తమున నిష్వాసావతంసంబు సం
స్తవనీయంబుగ లేవనెత్తి సువిలాసస్ఫూర్తి నాడించు చు
ద్దవిడిన్ రాఘవుఁ డల్లెత్రాడు కుడిచేతన్ వింటిపై కొప్పునం
దవిలించెన్ దివి వేల్పుమూఁక లరు దందం, జంద్రబింబాననా! ౩౨౬.

గీ. అఖిలహృత్సారుఁ డాజి నృపాత్మజుండు,లాఘవమ్మున జ్యాలత లాగి విడువ
నేమిచెప్పుదు సుదతి! మదీయధనువు,మొక్కలంపుఁ జేవచెడి రెండు ముక్కలయ్యె.

క. అక్కతన నొకమహాధ్వని, పిక్కటిలి రసాతలమును బృథివియు దివమున్
దిక్కులు విదిక్కులును నపు,డొక్కమొగి న్నిండుకొనియె నుగ్రపుభంగిన్. ౩౨౮

చ. అతివరొ! యాకసంబునఁ దదద్భుత మారయుచున్న దేవసం
తతి కుతుకమ్మునం గుసుమతండముఁ బైపయి గుప్పి వైదిక
స్తుతుల నుతించె రాఘవుని, దుందుభు లల్లన మ్రోఁగె, నప్సర
స్సతులు సురేంద్రుపంపునఁ బసందుగ నాడిరి పాడి రుబ్బుచున్. ౩౨౯

క. బెండన నా విల్లావిధి, రెండౌటలు సూచి నృపవరేణ్యుఁడు సంతు
ష్టుండై కౌఁగిటఁ జేర్చెను, రెండుకరమ్ములను బొదివి ప్రియకరు రామున్. ౩౩౦

క. అంతఃపురమున సీతా, కాంతామాత లిదె నేఁడు కన్యక కైన యా
కాంతుఁ డొదవె"నని విస్మయ, సంతోషమ్ములను బొందఁ జాలిరి, కాళీ! ౩౩.౧

సీ. చిఱునవ్వు మోముపైఁ జిందులు ద్రొక్క నెమ్మేను పసిండితో మేల మాడ
దివ్యభూషాప్రభల్ దిక్కులఁ దేర్ప ముత్యాల హారంబు లుయ్యాల లూఁగ
గమ్మలు గండభాగమ్ముల నలరింపఁ గాలియందియలు గల్లు రనఁగ
ఘనదుకూలము లసత్కటిమండలముఁ గప్పఁ జన్గవ పైఁటలో సరసమాడఁ
గీ. గనకమాలిక దక్షిణకరమునందుఁ, బూని రాముని డాయంగఁబోయి కంఠ
మందువైచి మహానంద మందె నపుడు, సుగుణసముపేత సీత విశుద్ధచరిత. ౩౩౨

ఆ. అంత జనకనృపతి కాంత లెల్ల గవాక్ష, రంధ్రములను దాశరథిని రాము
లలితభూషణాద్యలంకృతు భువనమో,హనునిఁ గాంచి మోదమంది, రువిద! ౩౩౩

వ. పిమ్మట, సర్వశాస్త్రవిశారదుం డగు మైథిలుండు గాధేయుం గని. ౩౩౪

క. కొడుకుల పెండిలిఁ జూడఁగఁ, గొడుకులఁ బ్రెగ్గడల సతులఁ గొని, తడయక యి
య్యెడకు దశరథేశుఁడు వచ్చెడుగతి శుభలేఖఁ బంపఁ జెల్లు నటన్నన్. ౩౩౫

చ. మునిపతి దాని కియ్యకొని భూరిజవంబునఁ బోవుదూతలం
బనుప, సమస్తముం గడచి వారు హుటాహుటిగా నయోధ్యకున్
జని, పదితేర్ల ఱేనిఁ గని, శర్వధనుర్దళనమ్ముఁ బుత్రికిన్
జనకుఁ డొసంగఁ బూనుటలు సర్వము గ్రక్కున విన్నవించుదున్. ౩౩౬

దశరథుఁడు సకుటుంబముగ మిథిలకు వచ్చుట

క. కొడుకు పరాక్రమమును విని, కడుసంతసమునను మునిఁగి గమనేచ్ఛం బ్రె
గ్గడలఁ గని, తడయ నేటికి, వడిఁ బయనము గండు తగినవారలతోడన్. ౩౩౭

క. మన రామభద్రునకుఁ దన, తనయ నొసఁగి పెండ్లి సేయఁ దలఁచి విదేహుం
డనిపెను వార్తాహరులన్, మనకొఱ కిదియెల్ల నల్ల మానిదయ సుఁడీ! ౩౩౮

క. తురగేభస్యందనభట, పరివారం బిపుడ చేరవలయును మిథిలా
పురమున కతిరయమున నా,కు రథం బాయితము సేసికొని రం డిటకున్. ౩౩౯

గీ. చేయ నేటికి జాగు? వసిష్ఠమౌని, సాగ్నియై భార్యతోడ ముందరుగు టొప్పుఁ
దనయ వైవాహికోత్సవధన్యవార్త, కలరు రాముని తల్లుల నందఱఁ గొని. ౩౪౦

వ. అని, యాదేశించి యెల్లరం బ్రయాణంబు సేయించి. ౩౪౧

గీ. వాయుజవమునఁ బోవునశ్వములఁబూన్చి, ధ్వజపటము గట్టి కట్టాయితంబుసేసి
తెచ్చినపసిండితేరెక్కి ముచ్చటలరఁ,దరలె మిథిలకుఁ బతి సుతోద్వాహమరయ.

వ. ఇట్లు సకుటుంబపరివారసైన్యముగ నేఁగి పురమ్ము వెలుపల విడియఁ, దదాగమన
వార్త కలరి మిథిలాపతి శతానంద పురస్సరముగ నెదురువోయి. ౩౪౩

గీ. లోకపూజితు దశరథభూకళత్రుఁ,బ్రీతిఁ బూజించె విధ్యుక్తరీతిఁ బిదప
ననుఁగుఁ దమ్మునితో రాముఁ డరుగుదెంచి,తండ్రిపాదాబ్జములకు వందనముఁ జేసె.

చ. తనకు నమస్కరించినసుతద్వయముం గని హృష్టచిత్తుఁడై
జనపతి వల్కె,రామ! వికసద్విమలాయతపంకజాభ మై
కనఁబడుచున్న దభ్యుదయకాలము గాన భవన్ముఖంబు; మహా
ని నిరుపమాన మహాకృపయె నేఁ డిలు సేరిచె నెల్లభద్రముల్. ౩౪౫

క. అని, మూర్కొని శిరముఁ, బునగ,పునరాలింగన మొనర్చి భూరిముదంబుం
గనె, బ్రహ్మానందము వొందిన యోగీశ్వరునివలె, ననిందితచరితా! ౩౪౬

క. తదుపరి జనకుండు శుభప్రదమును భోగాఢ్య మైనభవనంబున స
మ్మదమున విడియించె, సపుత్రదారుఁడయియుండెఁ బంక్తిరథుఁడును దానన్. ౩౪౭

## సీ తా క ల్యా ణ ము

గీ. అఖిలధర్మజ్ఞుఁ డగుజనకావనీంద్రుఁ,
డంత శుభదినమందుఁ గల్యాణయోగ్య
లగ్నమున సుముహూర్తకాలమున రాము
భ్రాతృయుతముగఁ దోడ్కొనివచ్చి ప్రీతి. ౩౪౮

సీ. నిస్తులంబు జగత్ప్రశస్తంబు విమలమణిస్తంభశతసమన్వితము నుతము
సుందరద్వారమ్ము శోభాకరమ్ము వితానచిత్రితము మోదప్రదమ్ము
కుసుమముక్తాఫలవిసరంబు వేదవిత్స్వర్ణభూషితవిప్రసంకులంబు
నిష్కకంఠసువాసినీసమావృతము భేరీదుందుభిధ్వానమేదురంబు
గీ. గీతనృత్తసమాకులంబై తనర్చు, పరిణయఁపు మండపంబున భవ్యరత్న
భాసితస్వర్ణపీఠంబుపైని రామ, భద్రుఁ గూర్చుండఁబెట్టె, హిమాద్రితనయ! ౩౪౯

సీ. అంతఁ బురోహితుం డగుశతానందుండు రాముని యుభయపార్శ్వములయందుఁ
జెల్వొందుచున్న వసిష్ఠగాధేయుల శ్రుతివిహితముగఁ బూజితులఁ జేసి

యందు యథావిధి నగ్నిఁ బ్రతిష్ఠించి ప్రజ్వరిల్లఁగఁజేయ, భార్యతోడ
జనకమహారాజు సమధిక శోభాఢ్య నతులమాణిక్యభూషితను సుతను
గీ. సీతఁ గొనివచ్చి రామునిచెంత కేఁగి, యడుగుఁ దమ్ములఁ గ్రమముగఁ గడిగిమూర్ధ
మున ధరించె, విరించి శంభులును మునులుఁ, దలలను ధరించునా పుణ్యజలము,లలన!

సీ. తదుపరి దుహితను దనకరంబునఁ గొని రామ! త్రిలోకాభిరామ! నేఁడు
స్వర్ణముక్తాదిభూషణవిభూషితఁ బద్మపత్రాక్షి సీత నాపట్టి నీమె
నిచ్చుచున్నాను నీ, కీవు గ్రహించి ప్రీతిని జెందు మనుచు విదేహనృపతి
యొసఁగెఁ గన్యకను రఘూద్వహునకుఁ దగఁ బరిణయశాస్త్రోక్తసరణి విడక
గీ. సాక్షతోదకపూర్వక, మగకుమారి!, ప్రియసుతను రాఘవునిచేతఁ బెట్టి మోద
మందె, గోవిందునకు రమాసుందరిని స,మర్పణము సేయువేళ క్షీరాబ్ధిపోలె.

క. ఔరసపుత్త్రిక నూర్మిళ, నారాజేంద్రుం డొసంగె నప్పుడు సుగుణాం
భోరాశికి లక్ష్మణున క,పారముదంబున, శిరోజభర్త్సితభృంగీ! ౩౫౨

గీ. అట్లె భరత శత్రుఘ్నుల కనుజసుతల, నయరతల శ్రుతకీర్తిమాండవుల నిచ్చె
దారసహితులు శుభకరుల్ వార లపుడు ద్యుతిఁ బ్రకాశించి రపరదిక్పతులు నాఁగ.

విదేహుఁడు వసిష్ఠవిశ్వామిత్రులతో సీతాజననాదికమును జెప్పుట

ఆ. అంత నారదోక్త మైనసుతోదంత,మలవసిష్ఠకౌశికులకుఁ దెలుపఁ
దలఁచి మైథిలుండు పలికె వారలఁజూచి, సదయులార! మనవి సలుపువాఁడ.

గీ. యజ్ఞభూమిని శుద్ధి సేయంగఁ దలఁచి, లాంగలంబున నేల దున్నంగ నేను
దివ్యలక్షణసముపేత భవ్యగాత్రి, బాలిక లభించె నాఁగటిచాలునందు. ౩౫౫

క. సీతాసంభవ యగుటన్, శీతాంశునిభాననమునఁ జెలగెడియా క
న్యాతిలకమునకుఁ బెట్టితి, సీతానామంబు మౌనిశేఖరులారా! ౩౫౬

ఉ. ఆ విమలేందుబింబముఖి నారసి హర్షముఁ జెంది పుత్త్రికా
భావముతోడ నాదు ప్రియభార్యకు నిచ్చితి సాఁకు మంచు, న
ద్దేవియుఁ బ్రేమపూరితమతిం బెనుపంగఁ బెరింగె లోకసం
భావితలీల లొప్ప సితపక్షసుధాకరరేఖ వైఖరిన్. ౩౫౭

వ. అంత నొక్కనాఁడు నే నేకాంతంబున నున్నసమయంబున. ౩౫౮

క. పాయక మహతీవీణన్, వాయించుచు నారదుండు ప్రభు శ్రీమన్నా
రాయణు లీలలఁ బాడుచు, నా యున్నెడ కేఁగుదెంచి నాచే మిగులన్. ౩౫౯

గీ. అర్చ లంది సుఖాసీనుఁడై సుఖాన్వి,
తుండు మహనీయుఁ డతఁడు నాతో "రహస్య
మభ్యుదయకారణం బగునట్టి విషయ,
మొకటి దెలిపెద విను" మంచు నొగి నిటు లనె. ౩౬౦

సీ. అఖిలేశ్వరుఁడు పరమాత్మ హృషీకేశుఁ డానందమయుఁడు భక్తాళిఁ బ్రోవ,
దేవకార్యార్థ సిద్ధికిఁ బంక్తికంధరు నడఁప, మాయామానుషాకృతి గొని
దశరథాధిపునకుఁ దా నాల్గువిధములఁ బుట్టి రాముఁడనఁ బొలుపుమిగులు
చున్నాఁడు, సీతనా యోగమాయ జనించి నీయింట నున్నది నిర్మలాత్మ!
ఆ. కాన సీత నెట్టు లైన శ్రీరామున, కిమ్ము పరుల కెవరి కీయవలవ;
దీమె సర్వజగదధీశ్వరుఁ డగురామ, భద్రునకు ననాదిభార్య సూవె. ౩౬౧

వ. అని చెప్పి య ద్దేవముని దేవలోకంబున కరిగె, నప్పటినుండియు. ౩౬౨

చ. సదమలగాత్రి సీత హరిసమ్మదకారిణి యైనలక్ష్మి యం
చెదను దలంచి రామునకు నీయమ నీయ నుపాయ మెద్దియో
కద? యని చింత నొంది యొకకార్య మొనర్పఁగ నిశ్చయించితిం
దుద, కది యెద్ది యన్న మునుధూర్జటి స్వీయపినాకచాపమున్. ౩౬౩

గీ. ఇల్లడగ మత్పితామహునింట నునిచెఁ, ద్రిపురసంహారకార్యంబు దీఱిన పయి,
నే నవల నైజబలమున నెల్లవారి, పరువుఁ బోఁగొట్టు న ద్ధనుర్వరముఁగాంచి.

క. పరిణయశుల్కముగా నే, ర్పఱిచిన సులభముగఁ బొసఁగు వాంఛిత మని యి
త్తెఱఁగునఁ గావించితి, "శం, కరు విలు మోపెట్టి కన్యకను గొనుఁ" డంచున్.

వ. పిదప, గాధిపుత్రునితో ని ట్లనియె. ౩౬౬

క. రాముఁడు కమలాక్షుఁడు వి, శ్వామిత్రమునీంద్ర! త్వత్ప్రసాదము కలిమిం
గామారిధనువుఁ జూచుట, కై మత్సదనమ్ముఁ జేరె, నభిమత మొదవెన్. ౩౬౭

జనకుండు రాముని సన్నుతించుట

వ. అని, రాముని దిక్కుమో మై. ౩౬౮

గీ. సీతతో నేకపీఠసంస్థితుఁ డ వయి స, హస్రకరుమాడ్కి వెలుగొందునట్టి నిన్ను
నయనపర్వంబుగాఁ గాంచునా జననము, సఫలమయ్యెను బో రామచంద్ర! నేఁడు.

సీ. జలజాసనుఁడు జగంబులు సృష్టి సేయుట భవదంఘ్రితోయంబుఁ బడసి కాదె
బలిచక్రవర్తి స్వర్నిలయాధిపతియౌట భవదంఘ్రితోయంబు వడసి కాదె

భర్తృశాపాశ్మరూప మహల్య వాయుట భవదంఘ్రిరేణువుఁ బడసి కాదె
సంసారబంధమోక్షణము గాంచుట బుధుల్ భవదీయపదపద్మ భక్తిఁ గాదె.

ఆ. నిఖిలజగములందు నీకంటె రక్షణకర్త యితరుఁ డెవఁడుఁ గానరాఁడు
అట్టి వాని నిన్ను నల్లునిఁగాఁ గన్న, మామకీనభాగ్య మే మనందు. ౩౭౦

గీ. తొడరి యోగు లెవ్వని పాదధూళియందు, భక్తినిలుపుటఁ గాల్పప్రభావ మణఁచి
భవభయము వాసి కైవల్యపదముఁ గాంతు; రట్టి నిన్నప్రమేయు మ దాత్మఁ గొలుతు.

క. య న్నామకీర్తనము సే, య స్మరించి దుఃఖదూరు లై పరమసుఖా
భ్యున్నతిఁ గాంతురొ వేలుపు, ల న్నిగమధ్యేయు శరణ మందితి నిన్నున్. ౩౭౧

సీ. అనిసన్నుతించి మహాత్ముఁ డౌ రామున కిచ్చె విదేహభూమీశ్వరుండు
తేరులు పదివేలు, దీనారములు నూఱుకోట్లు, కోట్లు నియుతంబు గుఱ్ఱములును
వారణేంద్రము లాఱువందలుఁ గాల్బంట్లు శతసహస్రంబుఁ ద్రిశతగుణితము
దాసీజనంబు, నంతటఁ గూఁతున కొసంగె దివ్యాంబరంబులు దివ్యరత్న

గీ. మౌక్తికోజ్వలహారముల్ మందసములు, దుహితృవత్సలుఁ డాతఁ డౌత్సుక్యమునను,
నల్లునికిఁ గూఁతునకు నిట్టు లరణ మిచ్చి, తక్కువారలఁ బూజించెఁ దగినరీతి.

క. అందఱ నీగతిఁ బరమా, నందంబున గౌరవించి నరపతి చేయిం
చెం దగఁ బయనము రఘురా, జేందుని దశరథునిఁ బౌరు లెల్లరుఁ బొగడన్.

వ. అట్లు వియ్యాలవారిం బ్రయాణంబు సేయించినసమయంబున జననీజనకులం బాసి పోవుటకు దిగులొందెడి జానకిం గవుఁగిటం జేర్చి బుజ్జగించుచుఁ దల్లు లి ట్లనిరి.

గీ. అత్తమామల కిరువుర కనుదినమును, శ్రద్ధ మీఱఁగ శుశ్రూష సలుపు మమ్మ!
పతి ననుసరించి సౌఖ్యంబు వడయుమమ్మ!, వదల కెపుడుఁ బతివ్రతాత్వముఁ, గుమారి!

వ. ఇట్లు తక్కినవారికిం జెప్పి, రనంతరంబున. ౩౭౨

గీ. రామగమనోద్భవంబు తూర్యస్వనంబు, ద్యుతలరణితవాద్యధ్వనితోడఁ గలిసి
భయముఁ గలిగించునది యయ్యెఁ బ్రాణికోటి, కెల్ల నధికమ్ముగా, శరదిందువదన!

చ. పురివిడి యోజనత్రయము వో రఘురాముఁడు, దుర్నిమిత్తముల్
విరివిగఁ గానవచ్చెఁ, బృథివీపతి వానిని గాంచి భీతుఁడై
గురువరుఁ జేరి మ్రొక్కి యివిగో; మనవైపున నెల్లెడఁ విప
త్కరశకునంబు లయ్యెడిని దత్ఫల మెద్దియొ చెప్పఁగా వలెన్. ౩౭౩

క. ఏకీడు మూఁడునో యని, శోకాకుల మయ్యె మది, విశుద్ధచరిత్రా!
పోకార్పు ఖీభయం బన, భూకాంతునితోడ మునిపుంగవుఁ డనియెన్. ౩౭౦

క. అవనీశ! నీకుఁ దోఁచెడు, నవశకునము లరయఁగా మహాభయ మొండు
ద్భవ మగునని తెలిపెడు, నై, న వినుము నీ వా విధంబునకు జంకకుమీ. ౩౭౧

క. మృగసంఘము శుభసూచక, ముగను బ్రదక్షిణము సేయ మొదలిడె నీకున్,
దిగు లొందఁగ నేల శుభం,బగు వైశమ భయము దీఱు, నవనీనాథా! ౩౭౨

పరశురామాగమనము

చ. అని ముని పల్కు.చుండుసమయంబున ఘోరతరానిలంబు భూ
జనములనేత్రముల్ మొగుడ సాధ్వసహేతుకపాంసువృష్టిచే
ఘన మగు బాధ గొల్పుచు నఖండజవంబున వీచె దానఁ దా
ల్మిని విడ కట్టులే చనియె మేదినిభర్తయు సైన్యయుక్తుఁ డై. ౩౭౩

వ. కొంత దూర మరుగు నంత వసిష్ఠునకు. ౩౭౪

గీ. కోటిసూర్యప్రతీకాశపాటవంబుఁ, జంచలాసంచయాంచితచ్ఛవి సమంబు
సవిధభూమిస్థితంబు దుస్సహతరంబు, నై నయొక్క తేజోరాశి గానవచ్చె. ౩౭౫

వ. త దవలోక నానంతరంబున. ౩౭౬

సీ. గొడ్డంట క్షత్రియకులము మాయించె నెవ్వాఁడు బిట్టల్క ముయ్యేడుమార్లు
బాఁపఁ డయ్యును ధనుర్బాణపరశ్వథధారియైయుండు సంతతము నెవ్వఁ,
డాత్మీయ ధైర్యశౌర్యాదుల మెప్పించి పరశువు నాచేతఁ బడసె నెవఁడు
కార్తవీర్యార్జునగర్వసర్వస్వనిర్మూల క్రియాచణమూర్తి యెవ్వఁ,
గీ. డట్టిఘనుఁ బ్రాంశు నీలాంబుదాభు శమన, సము జటామండలాంచితు సన్నిధిస్థు
నపరకాలమృత్యువుఁ బ్రభావిపులరాశి, యైనభార్గవుఁ గనె జమదగ్నిపుత్రు. ౩౭౭

ఉ. కట్టెదుటన్ మహోన్నతుఁడు కార్ముకహస్తుఁడు రేణుకాసుతుం
డట్టె కనంబడన్ దశరథాధిపుఁ డారసి భీతచిత్తుఁ డై
“కట్టలుకన్ వహింపక జగన్నుత! నన్నుఁ గటాక్షదృష్టిఁ జే
పట్టు” మటం చనేన్ మఱచి పాద్యము నర్ఘ్య మొసంగ నయ్యెడన్. ౩౭౮

వ. అని వెంటన. ౩౭౯

క. దండాకారముగా భూ, మండలపతి మ్రొక్కి మత్కుమారుని రాముం
జెండాడక రక్షింపుము, నిండారిన కరుణ, ధారుణీసురవృషభా! ౩౮౦

క. మీ రలిగిన నిలువఁగ నె, వ్వారికి నగు? వీఁడు పిన్నవాఁ, డేది యైనన్
నేరము నేరక చేసిన, సైరించి యనుగ్రహింపఁ జనును, మహాత్మా! ౩౯౧

క. అని భయవినయంబుల వం, దనపూర్వకముగ వచించుదశరథు పలుకుల్
వినక, రఘూత్తంసున కి, ట్లను నిష్ఠురఫణితి రేణుకాత్మజుఁ డలుకన్. ౩౯౨

పరశురాముఁడు శ్రీరాము నధిక్షేపించుట

మ. క్రమ మె ట్లయ్యెర! రాముఁడంచును మదాఖ్యన్ భూమిపై క్షత్రియా
ధమ! సంచారము సేయుచుంటి వట? స్వాధ్యాయంబు సద్విప్రసం
గమునం బోలెఁ దదన్యు చెంత వెలుగంగా నేర్చునే? లోకవం
ద్యము మన్నామము నిన్నుఁ జేరి యపవిత్రం బయ్యె నిస్తేజుఁడా! ౩౯౩

ఉ. నిక్కపురాజవంశమున నీవు జనించితి వన్న మాటయే
నిక్కము యేనిఁ; గట్టెదుర నిల్చి మగంటిమి ద్వంద్వయుద్ధమున్
జక్కఁ నొనర్పు, నామమున సామ్యము నందితి మేటి శౌర్య మం
దక్కట? కాంచఁగా వలదె యన్యులపై రిడుకొంట మాటలే? ౩౯౪

ఆ. ప్రాంతగిల్లి చేవఁ బాసిన భూతేశు, విల్లు విఱిచి మోహవివశబుద్ధి
నాకు దీటు వచ్చు నరుఁడు లేఁ డని నిన్ను, నీవ పొగడికొనెద వేమి? మూర్ఖ!

చ. సముఁ డగు వానితోఁ దొడరి శౌర్యము మీఱఁ బెనంగుచో; యశం
బమరును గాని హీనబలు నాజికిఁ బిల్చుట కాదు, నీ పరా
క్రమ మది యెట్టిదో యెఱిఁగి కయ్య మొనర్చెద, ముందు విష్ణుచా
ప మిదిగో దీని నెక్కిడుము, పై విశదం బగుఁ జుమ్ము రాఘవా! ౩౯౬

క. మోపెట్టఁ జాలకుండిన, భూపధ్వంసకుఁడ నేను బొలియించెద బా
హాపటిమ గడియలోపలఁ, బాపాశయ! మాగురుండు బళి? యని మెచ్చన్. ౩౯౭

చ. పరశుధరుం డిటుల్ పలుకు పట్టున నల్లలనాడె సాద్రియై
ధరణితలంబు, నల్గడలు దట్టఁపుఁజీఁకటి యావరించె, భూ
వరుఁడు నిరాశుఁడై కొడుకుపట్లఁ, బ్రపన్నజనావనుం బరా
త్పరుని స్మరించుచుండెఁ దనభావమునందు సుఖోపలబ్ధికై. ౩౯౮

వ. ఆసమయంబున. ౩౯౯

పరశురాముఁడు తేజోహీనుఁ డగుట

ఆ. రాముఁ డరసి పరశురాము వృథాజల్పుఁ, గినుకఁ జెంది యేది ధనువు దెమ్ము
చూత మనుచు నతనిచేతి నుండి గ్రహించె, సత్వరముగ విష్ణుచాప, మతివ! ౪౦౦

వ. అట్లు, గృహీతకార్ముకుం డై. ౪౦౧

ఉ. దేనిని లాఁతు లెవ్వరును ధీరత నెక్కిడఁ జాల రంచు నీ
మానసమందు నెంచి యసమానతఁ జాటుచు గర్వ మందెవో;
దాని భవన్ముఖాబ్జమున దైన్యము తాండవ మాడ నెక్కిడం
గా నిదె పూనినాఁడ వితగాదు మనుద్యమ మెన్నఁడుఁ, ద్విజా! ౪౦౨

క. అని విల్లువంచి గుణమును, గొనకుం దగిలించి పురుషకుంజరుఁడు మహా
హినిభం బగుశరముం గై, కొని వడి సంధించి విప్రకుంజరున కనెన్. ౪౦౩

గీ. మత్ప్రయుక్త శరం బసమాన మగుట, నెందు నేని వ్యర్థమ్ముగా దింత నిజము,
కాన లక్ష్యవస్తువును వేగముగఁ జూపు, మవనిదేవ! భేదించి యిం దరుగుదెంచు.

క. పాదయుగం బో; తపస్సం, పాదితసుఖదైకపుణ్యపదవియొ; చూపం
గాఁ దగు నీ బాణమునకు, లే దిఁక మన్నింపు, భూనిలింపప్రవరా! ౪౦౪

గీ. ఇహపరంబులరెంటియం దెద్దియేని, నొకటి నీకు నలభ్య మైయుండు నట్లు
సేయవలెఁ, గాన నాయాజ్ఞఁ జెప్పు మింక, విప్ర! నీ యిష్ట మగు నట్టి విధ మదేదొ.

పరశురాముఁడు శ్రీరాముని విష్ణునిఁగా నెఱిఁగి స్తుతించుట

చ. అనవుడు భార్గవుండు వికృతాననుఁ డై తనపూర్వవృత్తమున్
మనమున సంస్మరించి రఘునందనుతో నను, రామభద్ర! నీ
వనఁ బరమేశ్వరుండవు మహామహిముండవు సృష్టిరక్షణ
ప్రణిధనకారణుండవు శరణ్యుఁడ వాద్యుఁడ వే నెఱుంగుదున్. ౪౦౬

సీ. మున్ను చిన్నతంబున న్నేను వెన్నునిఁ దపమున నర్చింపఁ దలఁచి మదిని,
మంగళకరమును మంజులం బౌచక్రతీర్థంబునకుఁ బోయి, దేవదేవు
ననఘు మహాత్ము నారాయణు నేకచిత్తంబున దుష్కరతపముఁ జేసి
సంతోషపెట్టితి, నంతఁ బ్రసన్నముఖాబ్జుండు శంఖచక్రాదిధరుఁడు
ఆ. పంకజోదరుండు ప్రత్యక్షమై పల్కెఁ, దపమునుండి విప్రతనయ! లెమ్ము
భవ దుదారతపము ఫలియించె ధన్యుఁడ, వైతి మఱియు నొక్కఁ డాలకింపు. ౪౦౭

చ. ఎవని వధింపఁ గోరి తప మీవిధిఁ జల్పితొ యట్టి త్వత్పితృ
ఘ్ను, విమతుఁ గార్తవీర్యుఁ బ్రతికూలు మదాంధుని హైహయాన్వయున్
దివిజులు మెచ్చఁ జంపుము మదీయచిదంశముతోడఁ గూడి, భ
క్తివివశ కోర్కు లెన్నఁడును దీర్పక పోనవి యెట్టివేనియున్; ౪౦౮

గీ. రాజసంతతి నామీఁద రైణుకేయ!, చంపిముయ్యేడు మాఱులు సకలవసుధఁ
గశ్యపునకు దానం బిచ్చి కనలు మాని, శాంతచిత్తుండ వై యుండు, మంత నేను.

సీ. దశరథరాజనందనుఁడ నై రామాఖ్యఁ బరశక్తితోడ నుద్భవముఁ గాంచు
ధరణీతలమునఁ ద్రేతాముఖంబున, నప్పు డీక్షింపఁగలవు న న్నిద్ధచరిత!
రాజమండలవధార్థం బిప్పు డిచ్చిన మత్తేజ మానాఁడు మరలఁ గొందు,
నంతట నీవు బ్రహ్మకు నొక్కపగ లగునందాఁక భూలోకమందు బ్రతికి,
ఆ. మత్పదారవిందమకరందపాయి వై, పరమనిష్ఠతోఁ దపంబు సేయు
చుండు, మనుచుఁ దెల్పి యురగశయానుఁ డ, దృశ్యుఁ డయ్యె జగదధీశ! రామ!

క. గోవిందుఁ డన్నవిధముగఁ, గావించినవాఁడ నెల్ల కార్యంబులు, నీ
వా విష్ణుఁడవే చుమి; వా, ణీవరు ప్రార్థనముచే జనించితి విటులన్. ౪౧౨

సీ. మును నీవు నా కొసంగినదివ్యతేజంబుఁ గైకొంటి విప్పుడు కమలనాభ!
ప్రకృతిపారగుఁడవు బ్రహ్మాదులకు నలభ్యుఁడవు జ్ఞానస్వరూపుఁడ వైన
నిన్ను సర్వాత్ముని నే నెఱింగితి, నాదు పుట్టువు సఫలమ్ము పుణ్యమూర్తి!
అజ్ఞానజనితజన్మాదిభావవికారషట్కంబు నీయందు సంభవింప,
గీ. దరయఁ బరిపూర్ణుఁడవు గమనాదివర్జి, తుఁడవు నిర్వికారుండ వీశుఁడవు నీవు,
ని న్నెఱింగినవాని కన్నియును గలవు, లేనివాని కెం దేమియు లేదు సూవె. ౪౧౩

గీ. అగ్నియందు ధూమము జలమందు ఫేన,
జాల మెట్లట్లు నీయందు జలజనాభ!
త్వ ద్విషయయును మఱి త్వదాధార మైన,
మాయ సృజియించెడిని క్రియామండలంబు. ౪౧౪

సీ. మాయావృతుం డయి మను నరుం డెందాఁక నందాఁక నినుఁ దెలియంగ లేఁడు
స్వామి! విచారంబు లేమిచేఁ గలుగుట, జ్ఞానవిరోధిని యై నెగడుట
నజ్ఞాన మని చెప్ప నయ్యె నీమాయ, యేతత్కృతదేహాదితతిని సతముఁ
బ్రతిబింబితం బయి పరఁగుచిచ్ఛక్తి యీజీవలోకమునందు జీవుఁ డనుచుఁ
ఆ. జెప్పఁబడియె, దేహచిత్తాసుబుద్ధీంద్రి,యముల నిరభిమాని యైన దాఁకఁ
గాంచు మానవుండు కర్తృత్వభోక్తృత్వ,ములు సుఖంబు దుఃఖమును, రమేశ!

వ. దేవా! యాత్మకుఁ గర్తృత్వభోక్తృత్వసుఖదుఃఖాదిసంసృతియు, బుద్ధికి జ్ఞానంబును గలుఁగఁ జాలవు. అట్లగుటం జేసి, యవివేకంబున నారెండును గలిసి జీవుఁ డని వ్యవహరింపఁబడుచున్నది. జలాగ్నులకు మేళనము గల్గినప్పుడు జలమునం దగ్నిధర్మ

మగు నుష్ణత్వము దోఁచున, ట్లంతఃకరణమునం దాత్మసంబంధంబువలనఁ ద ద్ధర్మ మైనజ్ఞానము గన్పట్టుచున్నది. అట్లె జడ మగునంతఃకరణసంబంధమునఁ ద ద్ధర్మ ము లయిన సుఖదుఃఖాదు లాత్మయందుఁ దోఁచుచుండె. ౪౧౬

గీ. సారభవదీయపదభక్తసంగసుఖము, ననుభవింపంగ జనుఁ డెంతదనుకఁ జాలుఁ,
దంతదాఁక సంసారదుఃఖాళినుండి, మరలి పోనేరఁ డెన్నఁడు, మైథిలీశ! ౪౧౭

ఆ. శౌరి! సాధులోకసహవాసలబ్ధ మహా, నీదుభక్తి వడసి నిన్నుఁ గొల్చు
మనుజుఁ డెప్పు; డపుడ మాయ మెల్లగ వీడి, పోయి హీనదశను బొందు నిజము.

వ. మాయాదూరుం డైన మానవుండు నీ యథార్థస్వరూపము నెఱింగినసద్గురునిం జేరి తదీయోపదేశంబునను భవదనుగ్రహవిశేషమ్మునను మహావాక్యజ్ఞానమ్ము వడసి ముక్తుం డగుచున్నాఁడు. ౪౧౯

సీ. ఆకారణమున లక్ష్మీకాంత! నీభక్తి గాంచనివారికిఁ, గల్పకోటి
శతముల కైన మోక్షము గాని జ్ఞానంబు గాని తదన్యసుఖమ్ము గాని
సమకుఱు ననెడునాశయుఁ గూడ లేదు, కావున నవిద్యాదులఁ బో నడంచు
యుష్మత్పదాంభోజయుగళభక్తియు, భక్తజనుల చెల్మియుఁ బ్రతిజన్మమందు
గీ. నాకు దయ సేయు మయ్య! యీ లోకమందు, భక్తిరతు లయి త్వద్ధర్మపరమసుధను
గఁరియు సుజనులు తమబంధుకోటి నేల? సకలజగముఁ బవిత్రంబు సలుపఁ గలరు.

క. వందనము జగదధీశ్వర!, వందనము దయాంబురాశి! వందనము హరీ!
వందనము భక్తిభావన!, వందన మోరామచంద్ర! వరద! యనంతా!. ౪౨౧

గీ. భువనవిజిగీషు నింతకుఁ బూర్వ మేను, సారిది గడియించి యుంచిన సుకృత మెల్ల
ననఘ! నీ బాణమునకు లక్ష్యముగ నిచ్చి, నాఁడ నమ్మతిఁ గొని కృపఁ జూడు నన్ను.

శ్రీరాముఁడు భార్గవరాముని గటాక్షించుట

క. అని ప్రార్థించినఁ గరుణా, వననిధి భగవంతుఁ డఖిలవరదుఁడు రాముం
డనె సుప్రసన్నుఁ డై, ని, న్ననుగ్రహించితిని రేణుకాత్మజ! యింకన్. ౪౨౩

ఆ. సంశయింపఁ బోకు సరగునఁ దెలుపుము, హృదయమునను గోరునది సకలము
నొసఁగువాఁడ, ననుడు నుత్సాహభరితుఁ డై, భార్గవుండు రామభద్రుఁ బలికె.

సీ. తప్పక నామీఁదఁ దమ కనుగ్రహమున్న మాట నిక్కం బేని; మధువిదారి!
నీభక్తతతితోడి నెయ్యంబు భవదీయపదముల దృఢ మైనభక్తి గలుగు

నట్లుఁ బ్రసాదింపు, మదిగాక భక్తివిహీనుఁ డైనను నిత్య మే మనుష్యుఁ
డీ స్తోత్రమును బఠియించు నాతనికి విజ్ఞానంబు భక్తియుఁ జచ్చుతటని
గీ. సకలదురితాపహము భవత్స్మరణ మబ్బుఁ, గాక, యని రామభద్రుఁ డంగీకరింప
వలగొని నమస్కరించి పూజల గ్రహించి, యాజ్ఞఁ బొంది మహేంద్రాద్రి కరిగె, దేవి!

గీ. దశరథుం డంత ముదితుఁడై తనకుమారు, మరల బ్రతికినవానిఁగ మదిఁ దలంచి
కౌతుకంబునఁ బలుమాఱు కవుఁగిలించె, సమ్మదాశ్రుకణంబులు జాలుగట్ట.

రాముఁ డయోధ్య కేఁగి సుఖముండుట

చ. పదపడి వీటికిం జనియెఁ బార్థివుఁ డెంతయు స్వస్థచిత్తుఁడై,
సుదతి! తదీయపుత్రులు విశుద్ధచరిత్రులు దేవసమ్మతుల్
పొదలెడిమేడలందుఁ దమపొల్తుకలం గవఁగూడి విస్మయ
ప్రదసుఖదక్రియాతతివిరాజితు లై మని రాపురంబునన్. ౪౨౭

క. జననీజనకులఁ గొల్చుచు, జనకజతో వీట రామచంద్రుఁడు వెలిఁగెన్
వననిధిసుతతో మధుమర్దనుఁ డల వైకుంఠమునను దనరినమాడ్కిన్. ౪౨౮

వ. అంత నొక్కనాఁడు. ౪౨౯

గీ. తోయజాతాక్షి కైకేయి తోడఁబుట్టు, వగు యుధాజిత్తు తనమేనయల్లు భరతు
నిజపురమునకుఁ గొంపోవ నెమ్మి రాఁగ, నంపె శత్రుఘ్నుఁ దోడిచ్చి యవనివిభుఁడు.

గీ. కొడుకుతోడఁ గోడలితోడఁ గూడి తనరె, నంగనామణి కౌసల్య, మంగళాంగి!
దివిజనాథునితో శచీదేవితోడ, ముదమునం దేలియాడు న య్యదితి వోలె. ౪౩౧

సీ. సర్వేశ్వరాద్భుతసకలగుణాఢ్యుండు నిఖిలలోకస్తవనీయయశుఁడు
సర్వజగజ్జనసంతోషసందోహమూర్తి, యా శ్రీరామమూర్తి సీత
తోడ మనుష్యునిజాడ నున్నాఁ డయోధ్యానగరంబున, నరసి చూడ
నిరవధివిభవుండు నిత్యమాయానిరాసుఁడు నిర్వికారుండు శుద్ధమూర్తి
గీ. యఖిలనాథుఁడు మాయాప్రియానుకారి, యనుపముండు నిత్యశ్రీకుఁ డై వెలుంగు
సతత మాతండు, దీని నీమతి నెఱుంగు, మంబికా! బాలకాండమియ్యది ముగిసెను.

వ. అని పంచశరహరుండు మంచుమలపట్టి కెఱింగించె. ౪౩౩

కాండాంతపద్యములు

ఉ. ఆజిధరాతలేంద్రసముపార్జితపుణ్యఫలా! సమస్తనీ
రేజభవాండభూతగణహృన్నిలయస్థిత! దోర్బలాన ది

గ్రాజముదావహా! విబుధకంటకదుర్జయపూర్వదేవహా!
రాజకులైకరత్న! జనరంజనయత్న! నిరంజనాకృతీ! ౪౩౪

క. స్మరణవివిధభవికప్రద, సురుచిరవిగ్రహా! సమత్వసువ్యక్తబుధా
దరపావనభావన! చిర, పరిచితపద్మావిలాస! భక్తనివాసా! ౪౩౫

మాలిని.

నిరుపమసుఖమూర్తీ! నిర్వికల్పానువర్తీ!
విరచితమునివృత్తీ! వేదవేద్యప్రవృత్తీ!
చరణనమదుమేశా! సర్వలోకప్రకాశా!
పరిహృతభవజాలా! బోధకారుణ్యశీలా! ౪౩౬

గద్య.

శ్రీమద్భారద్వాజగోత్ర, సీతాంబికాపున్నయార్య చతుర్థపుత్ర,
రామచంద్రకరుణాపాత్ర, సూరిజనవిధేయ,
నారాయణనామధేయ ప్రణీతంబగు
నాంధ్రాధ్యాత్మరామాయణమున
బాలకాండము సంపూర్ణము.



శ్రీరస్తు

శ్రీ సీతారామాభ్యాం నమః

# ఆంధ్రాధ్యాత్మరామాయణము

## అయోధ్యాకాండము.

---



శ్రీగళధనుర్విదళనా!
భోగీంద్రవిభూషణైకపూజితచరణా!
ఆగమశిఖావిహరణా!,
రాగసరిస్మగ్నతరణి! రవివంశమణీ! ౧

వ. అవధరింపు మట్లు భవదీయబాల్యకథం దెలుపునాథుం జూచి భవాని. ౨

గీ. దేవదేవ! జగన్నాథ! దివ్యపురుష!
శంకర! దయానిధీ! రామచంద్రుఁ డేమి
చేసె నామీఁద? సకలంబుఁ జెప్పు మనుడుఁ,
బడఁతి కీరీతి వినిపింపఁ దొడఁగె మృడుఁడు. 3

నారదుఁడు, శ్రీరామునిఁ జూడవచ్చుట

క. అంతఃపురాంగణంబునఁ, గాంతమణీఘృణిపరీతకనకాసనమం
దెంతయు సంతసమున నే, కాంతముగాఁ గూరుచున్న కంజదళాక్షున్. ౪

సీ. మణిదండచారుచామరమున సీతచే, వీవఁగాఁ బడువాని వివిధభూష
ణాలంకృతుని గౌస్తుభాముక్తకంధరు, నసితోత్పలచ్ఛదశ్యామలాంగుఁ
దాంబూలచర్వణాత్తత్రిక్రియాళి మై, థిలికన్యతో వినోదించువాని
రామునిఁ జూడ శరచ్చంద్రవిమలుండు, నిర్మలస్ఫటికమణిప్రకాశుఁ
గీ. డైననారదమౌనీంద్రుఁ డంబరంబు, నుండి వైళమ దిగి సమక్షోర్వి నిలువ,
నురుతపోరాశి నవితర్కితోపగతుని, నరసి యాజానకీజాని యట్టె లేచి. ౫

మ. అతులానందమునం గృతాంజలియు సమ్యగ్భక్తియుక్తాత్ముఁడై
నతితోడం దల మోపి భూస్థలి నమస్కారంబు గావించి, దై
వతమానీ! భవదీయదర్శన మలభ్యం బన్న సంసారిసం
తతికిన్; దుర్విషయప్రలుబ్ధమతులౌ నాబోంట్ల మా కేటికిన్. ౬

క. సమధికతరసాంసారిక, తమస్థితున కేనిఁ గాకతాళీయముగా
నమరమునిచంద్ర! సజ్జన, సమాగమం బబ్బు ననుట సత్యము గాదే? ౭

ఉ. ఐనను బూర్వజన్మసుకృతాతిశయంబునఁ జేసి యివ్విధిన్
మానిశశాంక! సజ్జనసమాగమ మబ్బె మహాభవాంబుధిన్
నేను మునింగియుండినను నిస్తులతావకభవ్యదర్శనా
నూనవిశేషమే యిపు డహో? నను ధన్యుఁ బొనర్చె నెంతయున్. ౮

నారదుఁడు శ్రీరాముని బ్రశంసించుట

శా. ఏ నేకార్యము సేయ నిష్ట మయి స్వామీ! వచ్చినా రిందు స
ద్దానిం దెల్పుఁ డటన్న నారదుఁడు భక్తప్రాప్తితార్థప్రదున్
మౌనిధ్యేయుని రామునిం బలుకు, రామా! సంస్తువచ్ఛ్రీమ! యే
లా న న్నిట్టుల మోహపెట్టెదవు? లీలామానుషోక్తిచ్ఛటన్. ౯

క. నీసంగతి నే నెఱుఁగుదు, దాసజనులకడ దాఁచిన దాఁగునె లక్ష్మీ
వాస! యిపు డీవు పలికిన, "నే సంసారి" ననుపలుకు నిజ మె ట్లనినన్. ౧౦

సీ. జగదాదిభూత యేసతి యమ్మహామాయ, యిల్లాలు నీకు లోకేశ! రామ!
నీ సన్నికర్షముచే సరోజభవాదు లుదయించుచుందు ర య్యువిదయందు,
ఏమాయ ని న్నాశ్రయించి సదా త్రిగుణాత్మిక యై వెల్గు నట్టిమాయ
యనవరతంబు సితాసితలోహితకాయ లౌ ప్రజలను గాంచుచుండె
గీ. కల్లలాడుదువే? నీవు కమలనాభ! ప్రకటలోకత్రితయమహాభవనమందు
నిండుతమి నుండు బల్గృహస్థుండ వైతి, వింక దాఁచంగ నేటికి నిదియు వినుము.

సీ. నీవు విష్ణుండ, వీ నెలఁత మహాలక్ష్మి, శివుఁడవు నీవు, హైమవతి యీమె,
వనజాసనుఁడ వీవు, వాణి యీకల్యాణి, భాస్కరుండవు నీవు, ప్రభ మహీజ,
పవనుండ వీ, వీ శుభాంగి సదాగతి, రుద్రాణి యీమె, రుద్రుఁడవు నీవు,
శక్రుండ వీ, వీమె శచి, వరుణుఁడ వీవు, భార్గవి యీమహాభాగ, నీవు
గీ. నిర్ఋతి, వీయమ తామసి, నీరజారి, వీవు, శుభలక్షణాఢ్య రోహిణి జనకజ,
విత్తపతి వీవు, నిఖిలసంపత్తు సీత, యముఁడ వీవు, సంయమని యీయమ, మహాత్మ!

క. ఒకఁ డన నేటికి స్త్రీవాచక మఖిలము మంగళాంగి జనకాత్మజయే;
సకలేశ! నీవ పుంవాచకము సమస్తంబు మూఁడుజగములయందున్. ౧౩

క. ఆకారణంబునన్ ముల్లోకంబులలోన నెట విలోకించినఁ గా
నీ, కనరా దేమాత్రము, మీకున్ వెలియైన యది యమేయాకారా! ౧౪

వ. దేవా! భవదాభాసోదితం బైనయజ్ఞాన మవ్యాకృత మనం బడు. ఆయవ్యాకృతమున మహత్తత్త్వంబును, మహత్తత్త్వంబువలన నహంకారంబును, నహంకారంబువలన సర్వాత్మక మైన లింగశరీరంబును, జనించుచున్నది. మనోబుద్ధిచిత్తాహంకారంబులును, బంచసూక్ష్మభూతములును, బంచప్రాణములును, గర్మేంద్రియపంచకంబును జ్ఞానేంద్రియపంచకంబును, గలిసి జన్మమృత్యుసుఖాదులు గల లింగశరీర మని ప్రాజ్ఞులచే వ్యవహరింపఁబడెడు. ఆ లింగ దేహాభిమానియే, జీవసంజ్ఞచే జగన్మయుఁ డై లోకంబునఁ బ్రకాశించుచున్నాఁడు. అనిర్వాచనీయమును ననాదియు నగు నజ్ఞానమే; కారణరూపకూటస్థబ్రహ్మమునకు నుపాధిగాఁ జెప్పంబడు. స్థూలము, సూక్ష్మము, కారణ, మని మూఁడుశరీరము లాత్మకు నుపాధులై యొప్పు. ఈయుపాధిత్రయవిశిష్టుఁడు జీవుఁడనియు, విముక్తుఁడు పరమాత్మ యనియుఁ జెప్పఁబడును. రఘూత్తమా! జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాత్రయసంసారమునకంటె నీవు భిన్నరూపము గల చైతన్యస్వరూపుఁడ వైన సాక్షివి. ౧౫

క. నీయందు జగము పుట్టుట, నీయందే నిలిచియుంట నిఖిలమ్ముఁ దుదన్
నీయందె విలయ మగుటన్, శ్రీయుత! కారణము నీవ నిఖిలంబునకున్. ౧౬

గీ. త్రాడునందు ఫణిభ్రాంతి దవిలి నట్లు, జీవుఁ డని తన్నెఱింగినఁ జెందు భయము,
"నేను బరమాత్మ" నని మొడినిశ్చయంబు, గలుగుతోడనె భయదుఃఖములు దొలంగు.

సీ. దశరథపుత్త్ర! చైతన్యప్రకాశరూ, పుఁడ వీ, వఖిలదేహముల వసించు
బుద్ధుల కెల్ల విస్ఫురణఁ గల్గించి, యా యావృత్తు లుదయించునట్లు సేయు
చున్నావు, గాన యీయున్నసర్వప్రపంచమున కాత్మవు యథార్థ మిది, త్రాడు
నం దహిఁ బోలె, నీయందు నారోపింత్రు సకలంబుఁ బటుతరాజ్ఞానమునను,
గీ. నన్నియును నిన్నెఱింగిన నడఁగుఁ గాన, చెల్లు మీజ్ఞానమును నభ్యసింప సతము
భవదమలపాదభక్తిసద్భావులను ద, లంపఁ గ్రమముగ విజ్ఞానలక్ష్మి వలచు. ౧౭

క. అక్కటతన నీమెడం గడుఁ, జొక్కపుబత్తిగలవారె చూ; ముక్తులు, స
మ్యక్కరుణావర్ధితసుఖ, భాక్కు, లసదృశాద్భుతప్రభావులు రామా! ౧౮

క. నీభక్తభక్తకోటికి, నీభక్తజనంబులకును నీకును నిరతం
బే భక్తుఁడ రిక్తుఁడ, నన,ఘా! భద్రం బిమ్ము మాయఁ గప్పకు మెపుడున్. ౨౦

ఆ. నీదుబొడ్డుదమ్మి నెత్తిఁ బ్రభవించిన, బ్రహ్మ కేను నాత్మభవుఁడ నగుట
నీకు మనుమఁడను రమాకాంత! రక్షింపు, నన్ను భక్తజను ననారతంబు. ౨౧

నారదుఁడు రామునకు బ్రహ్మాదులప్రార్థనము దెలుపుట

చ. అని పలుమాఱు మ్రొక్కి ప్రమదాశ్రుకణంబులు జాఱఁ బంకజా
ననుఁ డనుపంగ నేను రఘుసత్తమ! వచ్చితి, నీవు రావణుం
డనుమటకై దివౌకసులు స్తోత్ర మొనర్పఁగఁ బుట్టినావు భూ
మి నిటు మనుష్యరూపమున మేదినిభార మణంచుపూన్కితో. ౨౨

ఉ. ఇప్పుడు రాజ్యభారము వహింప సమర్థునిఁగా నెఱింగి మీ
యప్ప నిన్నుఁ సమస్తభువనాధిపుఁ జేయఁ దలంచి యుండె, నా
చొప్పున కొప్పి నీవు సురసూదను రావణుఁ జంప కుండినన్
ముప్పగు, భూభరం బణఁపఁ బూర్వము పల్కిన పల్కు పొల్లగున్. ౨౩

ఉ. "మున్ను బయఃపయోధి కడ భూభరమున్ హరియింపు మంచు నె
న్నెన్నొ విధాల వేఁడికొన, నెంతయుఁ బ్రేముడిఁ గానవచ్చి యా
పన్నుల మమ్ము నే పలుకుఁ బల్కి మరల్చితొ; తద్విధంబు నే
య న్నలినాక్ష! పొ" మ్మని యజాదిసుపర్వులు చెప్పి రార్తితోన్. ౨౪

గీ. సత్యసంధుండ వీవె కా జగతియందు, యుష్మదీయప్రతిజ్ఞ వే ఱొండుభంగి
జరుగ కుండ నొనర్పు రాజ్యరమ కీవు, భర్త వగుటకు మున్న, శ్రీపతి! యటన్న.

వ. తొగలరాయనిం దెగడుమొగమ్మునం జిఱునగవు సొగసు గడియింప రామభ
ద్రుండు హిరణ్యగర్భునియర్భకున కిట్లనియె. ౨౬

క. లోకంబున నెది యైనను, నాకుం గనరాని దున్నె? నారద! మును నా
కౌకసుల కేమి చెప్పితి, నాకార్యముఁ జేతు సందియం బిఁక నేలా. ౨౭

గీ. విను, మతే మనఁ గాలంబు ననుసరించి,
వారివారిప్రారబ్ధంపుఁబటిమ దగ్గి
యడఁగు కొలఁది రాక్షససమూహస్వరూప,
భూభరముఁ దీర్తు నేఁ గ్రమమ్ముగఁ దపస్వి! ౨౮

చ. తడ వోసరింప నింక విను దానవనాథు వధింప జేసి నే
నడవికిఁ బోయెదన్ మునిజనాకృతితోఁ బదునాలుగేఁడు ల
య్యెడ నివసించి సీతఁ గొని యేఁగెడినేరము కారణమ్ముగా
నడఁచెద సైన్యయుక్తముగ నద్దురితాత్ముని నాహవంబునన్. ౨౯

క. అని ప్రతిన సలుప రాముఁడు, ముని ముమ్మాఱు చుట్టుఁదిరిగి మ్రొక్కి యనుజ్ఞం
గొని దివికిం జని శుభవార్తను దెలిపి సుపర్వులకు ముదంబు ఘటించెన్. ౩౦

గీ. రామనారద సంవాద మేమనుజుఁడు, విను స్మరించుఁ బఠించు నాతనికిఁ గల్గు
రాజితము వైరాగ్యపురస్సరంబు, నమరదుర్లభ మైనమోక్షము మృగాక్షి! ౩౧

వ. తదనంతరమున. ౩౨

దశరథుఁడు వసిష్ఠునితో రాముని యువరాజుం జేసెద ననుట

క. మునివర్య సద్గుణాకర, ననఘుని సర్వజ్ఞ నిజకులాచార్య వసి
ష్ఠుని ధీరుఁ బిల్చి దశరథుఁ, డనె నేకాంతమున నిట్టు లంబుజనేత్రా! ౩౩

శా. పౌరుల్ వృద్ధులు నైగముల్ సచివులున్ బాలుర్ సమస్తప్రజల్
శ్రీరాముం గొనియాడుచుండిరి జగచ్ఛ్రేయఃప్రదుం గా, మహో
దారుం గా, బలశాలిఁ గా, సుగుణుఁగా, దైవోపముం గాఁ, జతుః
పారావారపరీతసర్వధరణీభారార్హుఁ గా నెంతయున్. ౩౪

ఉ. కావున నెల్లవారికి సుఖప్రదుఁడై యనురక్తుఁడైన రా
జీవదళాక్షు రాము నభిషిక్తునిఁ జేయఁ దలంచినాఁడ సు
శ్రీవిలసిల్లురాజ్యమున సిద్ధము నే నన వృద్ధుఁడన్ మునీం
ద్రా! వధరింపు సర్వజనరంజనుఁ డేలుత నేల నింకఁబై. ౩౫

క. భరతుఁడు మాతులుఁ జూడఁగ, నరిగెను శత్రుఘ్నుతోడ నైనను సీతా
వరునకు నే నభిషేకము, జరపెద యువరాజపదవి సంధిల్ల, గురూ! ౩౬

క. మీ రనుమోదంబున సం, భారంబులు గూర్పవలయు భగవానుఁడ! నా
కోరికను దెలిపి తగ సీ, తారమణుని బిల్వఁ డిటకు ధన్యుఁడ నగుదున్. ౩౭

సీ. పట్టణమం దెల్లఁ బలురంగులపతాక, లెత్తింపవలయు, మునీంద్ర! స్వర్ణ
ముక్తామయవిచిత్రములు తోరణంబులు, గట్టింప నగును వేగమ, యిఁకేల
నందియం బని, మంత్రిసత్తముఁ బిల్చి సు, మంత్ర! నీ వీ మౌనిమండనుండు
చెప్పినచొప్పునఁ జేయుము సర్వంబు, రామచంద్రుని యౌవరాజ్యమునకు

ఆ. నధిపు తే పౌనర్తు ననుఁడుఁ, గార్యాకార్య, వేది యతఁడు పరమమోద మంది
యనుమతించి మునివరా! నియోగింపు మే, నేమి సేయువాఁడ నిప్వు డనిన. ౩౮

వ. సుమంత్రా! తేపు ప్రభాతం బగునప్పటికి రాజమందిరప్రథమకక్ష్యయందు నానా రత్నభూషణవిభూషితలు ననన్యలావణ్యమాన్యలు నగు పదునాలుగురు కన్యలును, నైరావతకులోద్భవంబును జతుర్దంతంబును స్వర్ణరత్నాద్యలంకృతంబు నగుభద్ర గజంబును, వచ్చియుండవలయు. నానాతీర్థోదకపరిపూర్ణ స్వర్ణకుంభసహస్రంబు ద్వారంబులం బ్రతిష్ఠింపవలయు. ద్వాదశనూతనవైయాఘ్రచర్మంబులును, రత్నదండంబు గలిగి ముక్తామణివిరాజితం బగునొక్క శ్వేతచ్ఛత్రంబును దెప్పింపవలయు దివ్యాంబరభూషణమాల్యానులేపనంబులు సిద్ధపఱుపం దగు, మఱియును. ౩౯

సీ. పూజితులై మునిపుంగవుల్ దర్భలఁ, జేఁబూని యట నివసింపవలయుఁ
జతురులౌ నర్తకీజనులును గాయకుల్ వైణికావళియు రావలె సుమంత్ర!
వివిధవాదిత్రప్రవీణులు వాయింప, నగును వాద్యములు నృపాంగణమునఁ
గరు లశ్వములు తేర్లు కాలుబంట్లాయుధయుతముగ వెలుపల నుండవలయు

గీ. నఖిలపూజోపకరణసమాద్భృతముగ, గోఱంత పడకుండ వైభవస్ఫురణ మీఱఁ
బూజ జరుగవలెన్ మనపురమునఁ గల, యెల్ల దేవాలయములందు, నిదియుఁ గాక.

క. పాయనివేడుక నానో, పాయనపాణు లయి విమలభావులు ధరణీ
నాయకులు వచ్చి మిగుల వి, ధేయత నిలువంగ వలెఁ బ్రతీక్షించు చటన్. ౪౦

వ. అని యివ్విధంబున జ్ఞానవర్తిలకుండును మహాతేజుండు నగునరుంధతీకాంతుండు సుమంత్రు నాదేశించి, పరమానందంబున సుందరం బగుస్యందనం బెక్కి, భాస్వరం బగుజానకీశ్వరుని మందిరంబు డాయం బోయి. ౪౧

గీ. దాఁటి కక్ష్యలు మూఁడు రథంబునుండి, యవనిపై డిగ్గి గురు వౌట నప్రతిహత
గమనుఁడై లోని కేఁగ రాఘవుఁ డెఱింగి, గురునిరాకకు సమ్మోదభరితుఁ డగుచు.

క. రయమున నంజలితో నా, స్మయదూరున కెదురు వోయి సాష్టాంగనతిన్
మెయి వొంగఁ జలిపి కాంచన, మయాసనాసీనుఁ జేసె, మంగళగాత్రీ! ౪౨

ఉ. జానకి హేమపాత్రమునఁ జయ్యనఁ దోయముఁ దెచ్చి పోయఁగా
మానిపదాబ్జముల్ గడిగి మంజులతజ్జలముల్ శిరంబునన్
మానినితోడఁ జల్లికొని, మాన్యుఁడ ధన్యుఁడ నైతిఁ దాపసే
శాన! భవత్పదాంబుజరజస్సహితోదకధారణంబునన్.

### వసిష్ఠుఁడు స్వవిషయనివేదనపూర్వకముగ రాముని౦ బొగడుట

వ. అని వినయంబునం బలుకుటయు నవ్వాచముని వల్లభుండు రఘువల్లభున కిట్లనియె.

ఉ. నీపదపద్మజాత మగు నీరముఁ దాల్చి శిరంబునందు గౌ
రీపతి ధన్యుఁ డయ్యె విపరింపఁగ మజ్జనకుండు బ్రహ్మయున్
నీపదవారిమూలముననే సకలాశుభదూరుఁ డయ్యె, నౌ
రా; పలుకంగఁ జెల్లు నొకో; రాఘవ! నీ కిటువంటి మాటలన్. ౪౭

సీ. త్రిదశులకార్యంబు దీర్ప భక్తులభక్తి, సిద్ధింపఁ జేయ మదోద్ధతు దశ
కంఠు వధింప సాగరపుత్త్రితో భూమిఁ, బొడమిన పద్మనాభుఁడవు, సర్వ
జగదధీశ్వరుఁడవు సర్వజ్ఞుఁడవు పరమాత్మవు విష్ణుండ వవ్యయుండ
వే నెఱుంగుదు రామ! యెందుకు దాఁచెద, నైనను దేవకార్యంబు కొఱకు
గీ. బయటఁ బడ వేయకుంటి గోప్యంబు, నిపుడు, శిష్యగతి నీ వెటుల్ మాయఁ జేయుచుంటి
వెల్ల కార్యంబు; లట్టులే యేనుగూడ, నోజ వలె ననుసరించుచునుంటి నిన్ను. ౪౮

క. భూకాంతులు విప్రులు మొదఁ, దేకువ సద్భక్తియుక్తిఁ దిరుగుం డనుచున్
లోకుల కుపదేశించుట, గా కన్యము గాదె యిట్లుగాఁ జేయుటకున్. ౪౯

వ. రామా! విచారించిచూచిన నీవు గురులకు గురుండవు. పితరులకుఁ బితామహుండవు. సమస్తభూతహృదయాంతరాళముల నిండియు నియామకుండ వై జగత్ప్ర
వృత్తిని నడపించుచు, వాఙ్మానసముల కందరానివాఁడ వై యుందువు. మాయాధి
ష్ఠాత వగుటకతంబున స్వాధీనసంభవంబును శుద్ధసత్త్వవికారంబు నగు శరీరంబు నంది
యోగమాయచే నీ మర్త్యలోకంబున మనుష్యునివలెఁ బొడకట్టుచున్నావు. ౫౦

శా. "పౌరోహిత్యము దూష్యజీవనము పాపప్రాప్తికిన్ మూల" మం
చో రామా! మదిలో నెఱింగియుఁ దదుద్యోగంబుఁ గైకొంటిఁ జు
మ్మీ "రాజీవభవుండు రాముఁ డనఁగా నిక్ష్వాకువంశంబునన్
శ్రీరామా ప్రియుఁ డుద్భవించు" నని నన్ జెప్పంగ విన్నాఁడ నై ౫౧

గీ. ఆశపడి భవత్సంబంధమందలి స్వామి, నీకు గురుఁడ నౌ భాగ్యంబు చేకుఱుటకుఁ
గాఁ బురోహితకృత్యంబు గర్హ్య మనక, యాచరించుచునుంటి, మహానుభావ! ౫౨

క. కూడని కృత్యం బని విడ, నాడక యుండుటను నేటి కబ్బెను నిన్నుం
గూడి గురుశిష్యభావము, తోడం జరియింపఁ గోర్కె దొఱకొనె రామా! ౫౩

గీ. సర్వలోకైకమోహిని చటులమూర్తి, భవదధీన మహామాయ భక్తవరద!
యెట్లు నన్నావరింపదో; యట్లొనర్పు, గురున కుపకారముం జేయఁ గోరు దేని.

చ. ఇదియొకఁ డేను గోరెద, మహేంద్రపదం బయినన్ మఱొండు నా
మదికి రుచింపఁ బోదు, కులమండన! నేఁడు ప్రసక్తి గల్గుటన్
గొదవడకుండఁ దెల్పితిని గోప్యము, మున్నెటఁ జెప్పనైతి, భూ
మిదయితుఁ డంప వచ్చితిని మేలగువార్తను నీకుఁ దెల్పఁగన్. ౫౫

చ. క్షితిపతి తేపు నీకు నభిషేకము సేయఁ దలంచినాఁడు భూ
పతిగ, మహీజతోడ నుపవాసివి గమ్ము శుచిత్వ మొప్పఁగన్
క్షితిపయి నేటిరేయి శయనింపుము కమ్ము జితేంద్రియుండ, వీ
విధము సమంజసమ్ము రఘువీర! మ ఱొక్కటి యాలకింపుమా. ౫౬

క. నీజనకునిసన్నిధికిన్, నేఁ జనుచుంటి నిదె రమ్ము నీ వృదయమునన్
రాజీవనేత్ర! యని చనె, రాజగురుం డరద మెక్కి రాజుం జూడన్. ౫౭

వ. పిదప సర్వజ్ఞుండును నీశ్వరుండు నగు రాముండు ప్రక్కనున్న సౌమిత్రిం జూచి
నవ్వుచు ని ట్లనియె. ౫౮

ఉ. తమ్ముఁడ! వింటె? యెల్లి మనతండ్రి మహోన్నత మైనయావరా
జ్యమ్మున కాధిపత్యము నొసంగఁ దలంచెను, నే నిమిత్తమా
త్రమ్ముగ నుండుఁ గర్తవును దత్ఫలభోక్తవు సర్వ మీవె, త
థ్య మ్మిది నీవు నాకు వెలిప్రాణమ వౌదువు గాదె? సర్వదా. ౫౯

వ. కావున నీవిషయంబుపట్ల విచారమనస్కుండవు గావలదు. ౬౦

చ. అని యనుజన్ముఁ బల్కి సుగుణాఢ్యుఁడు సువ్రతుఁ డాఁత డొజ్జ దె
ల్పినగతి సీతతోడ జరిపెన్ సకలం బుపవాస మాదిగా,
వనజదళాయతాక్షి! మునివల్లభుఁ డట్లు నృపాలుఁ గానఁగాఁ
జని వినిపించె నాతనికి సర్వముఁ జేసినకృత్య, మంతటన్. ౬౧

క. రామాభిషేక మెప్పుడు, భూమీంద్రుఁడు వలికె గురునిముందటఁ, గౌస
ల్యామానినికి సుమిత్రకుఁ,దా ముదమున నొక్కఁ డపుడె తడయక చెప్పెన్. ౬౨

ఆ. దాని నాలకించి తతహర్షసంపూర్ణ, లై నృపాలపత్ను లా యిరువురు
వార్త దెచ్చినట్టివాని కొసంగిరి, హార మొకటి శ్రేష్ఠ మైన దతివ! ౬౩

వ. పుత్రవత్సల యగు కౌసల్య ప్రీతచిత్తమ్మున రామునికిఁ గార్యసిద్ధి యగుకొఱకు
సర్వసంపత్ప్రదాత్రిని లక్ష్మీదేవి నుపాసించె, మఱియు. ౬౪

చ. "నిరతము సత్యవాది ధరణీపతి తా ననిన ట్లవశ్యముం
జెరపునొ; కాముకుండు రమణీమణి కైకకు వశ్యుఁ డౌటచేఁ
మతియొకభంగిఁ జేసెడినొ సమ్మఁగరా" దను చింతతోడ నా
వరగుణశీల కోర్కి ఫలవంతముగా నినుఁ గొల్చె, నీశ్వరీ! ౬౫

వ. ఇంతలో దేవతలు స్తోత్రకారిణి యైనవాణిం జేరి. ౬౬

దేవతలు మంథరాకైకేయీహృదయముల నావేశింపు మని సరస్వతిని గోరుట

సీ. మాతల్లి! వైళంబ మర్త్యలోకమునకు, నరిగి యయోధ్యఁ బ్రయత్న మొప్పఁ
గాఁబోవుజానకీకాంతునిపట్టాభి,షేకంబు గాకుండఁ జెడెడుకరణిఁ
గమలజు నానతిఁ గడఁగి కావింపుము, మంథరాకేకయాత్మజల యెదలఁ
గ్రమముగ నిల్చి, విఘ్నము సముత్పన్న మై,నంతట దివమున కరుగు దెమ్ము
గీ. మాయడలు దీఱు నీవు నిమ్మాడ్కిఁ జేయ, ననుడు "యుష్మన్మనోరథ మట్లు తీర్తు"
నని సరస్వతి మంథర నాక్రమించె, దశరథక్ష్మావిభుని రాజధాని కేఁగి ౬౭

ఉ. వంకర లైనమూఁ డవయవమ్ములు గల్గిన యన్నెలంత, వా
క్పంకజనేత్ర పూనుటను బట్టణముం గన మేడమీఁదికిన్
బింకము మీఱ నెక్కి, పృథివీధరనందన! పాఱఁజూచె న
య్యంకలుఁ జిత్రవస్తుసమలంకృత మైనపురంబు నత్తఱిన్. ౬౮

క. తోరణసంకుల మై శృంగారపతాకాభిరామఘన మై, విమలా
గారం బై సర్వోత్సవ,కారణ మగుపీఠుఁ గాంచి, కడువిస్మిత యై. ౬౯

వ. మరలి సౌధముఁ డిగివచ్చి దాదిం జూచి, తల్లీ! నేఁ డిదేమి పురం బంతయుఁ జక్కఁగ నలంకరింపఁబడి యున్నది? నూతనోత్సవోపేత యై యుబ్బుచుఁ గౌసల్య విప్రోత్తములకు వస్త్రములను వివిధవస్తువులను దానము సేయుచున్నది? పత్తనంబునఁ గల క్రొత్తవిశేషంబు లెవ్వి? యని యడిగిన నాపె యిట్లనియె. ౭౦

ఆ. పడఁతి! రేపు రామపట్టాభిషేకంబు, జరుప నిశ్చయించె జనవిభుండు.
దాన నగరమెల్లఁ దగున ట్లలంకరిం,పంగఁబడియెఁ గనులపండువుగను. ౭౧

వ. అనుటయుఁ దద్వచనశ్రవణంబునం జకితహృదయయై కుబ్జ, త్వరితగతి నేకాంతంబునఁ బర్యంకంబుపైఁ బరుండియున్న విశాలనేత్ర యగు కైకను డాయం బోయి, వాణీచోదితయగుట నిట్లనియె. ౭౨

మంథర కైకకు రామపట్టాభిషేకమునకు విఘ్నకరములగు వాక్యముల బోధించుట

చ. మసలకు లెమ్మిఁకం దెలివిమాలినదానరొ! కొంపమున్గె, దు
ర్వ్యసనముఁ గూర్చుకాల మిదె వచ్చె నినీ; దురదృష్టురాల! వె
క్కసమగుభీతి యుప్పతిలెఁ గానవు మత్తిలి యొత్తిగిల్లె," దెం
దు సవతుపచ్చుసుందరులు దోఁపరు నా"కని విజ్ఞపీఁగుచున్. ౨౩

క. రా నున్నవిప త్తెఱుఁగవు, మానిని! పరసేవఁ జేయ మనసే? తే పు
ర్వీనాథు ననుగ్రహమున, నౌనట పట్టాభిషేక మా రామునకున్. ౨౪

చ. అన విని వేగ లేచి ప్రియ మాడెడుకైక, సురత్నభూషితం
బును నిజపాదలగ్న మగుపుత్తడియందె నొసంగి కుబ్జ కి
ట్లను నిద యేమె హర్షసమయంబున నాపదఁ బల్కుచుంటివి; రా
ముని యభిషేక మన్నఁ జెలి! మూఁడుజగంబులు సంతసించెడున్. ౨౫

క. కన్నకొడు కైనభరతుని, కన్నను రాముండు ప్రియముగలవాఁడు, ముదం
బు న్నెరపువాఁడు, కౌసల్య న్న న్నొకరీతిఁ గాంచునట్టేఁడు గాఁడే? ౨౬

క. ప్రియముం బలుకుచు సతము వి, నయమున సేవించుచుండు నను, వాని శుభో
దయము భయహేతు వెట్లగు? నయయో యిటు పల్కవచ్చునా! దుర్హృదయా.

క. నీ కేమిభయం బా సీ, తాకాంతునివలనఁ గలిగె? దాఁచక చెపుమా!
నాకు నది మూఢ! యనినం, గైకపలుకు మదికి వెగటుగాఁ దోఁచుటయున్. ౨౭

వ. శారదావేశకారణవైరిణి యగు మంథర విషణ్ణస్వాంతయై కైకకు రాముని యెడం
గల ప్రేమలతను దనవాక్యైకపుణ్యాలవిత్రంబునం ద్రెంపఁ దలంచి, యిట్లనియె. ౨౮

సీ. నామాట నీమది నమ్ముము, పెనుభీతి నీ కిప్పు డొదవుట నిజము దేవి!
సతతంబు దా నిన్ను సంతోషపెట్టఁగఁ బ్రియవాక్యములు వల్క, బేల వగుచు
నమ్ముచుంటివె కాని నరపతి యంతస్సుఁ, గన వైత్రి, వాతండు కాముకుండ
సత్యవాదియు నయి సతి! నీకు మాటలఁ బ్రీతి ఘటించుచుఁ బెద్దభార్య
గీ. రామజననికి గొప్పకార్యములవలన, హిత మొనర్చుచు నుండె, వే యేల? దీని
మదిఁ దలంచియెచూ; మేనమామయింటి, కనుపుట రిపుఘ్నుతోభవ త్తనయుభరతు

చ. కలుగు సుమిత్రకుం గడు సుఖమ్ము తదగ్రసుతుండు రాముని౦
గలిసి మెలంగుఁ గానకొనఁగాఁగలఁ డాతఁడుఁగూడ రాజ్య, మెం
దుల కిఁక నీవు నీప్రియసుతుండును నిర్ధనసౌఖ్యశీలు రై
నలువురు నవ్వఁ జేడ్పడు దినంబులు వచ్చెను, కేకయాత్మజా!. ౩౦

క. వనవాసియొ; వధ్యుండో; యనుచరుఁ డో; యగుట నిక్క మాకౌసల్యా
తనయుని ముందఱ నీప్రియ, తనయుఁడు నామాట వినఁగఁ దలఁపవ యేనిన్.

క. నీసవతికిఁ గౌసల్యకు, దాసివలెం బరిచరింపఁ దగుదు వికఁ, సప
త్నీ సేవకంటె మరణము, వాసి సుమీ నిన్నువంటివారికిఁ గైకా!. ౮౩

క. దండక నీరేడేఁడులు, ఖండితముగ వానివృత్తి గైకొని శ్రీరా
ముం డుండుటకు, భవత్తన, యుం డిల నేలుటకు, నృపతి నొప్పింపవలెన్. ౮౪

ఆ. భయవిహీనురాల! పట్టఁపురాణి! నేఁ, జెప్పినట్లు నీవు చేసి తేని;
నీప్రియాత్మజుండు నిఖిలరాజ్యాధిపత్యము వహించు సంకటములు దొలఁగు. ౮౫

మంథర, కైకకు దశరథుఁడు వరము లొసఁగిన సందర్భము దెలుపుట

సీ. ఇంతకు ముందుగా నిందుల కొక్కయుపాయంబు నేను నాభావమందు
నిశ్చయించితి విన్మ, నిర్జరనాథుండు, మును సురాసురయుద్ధమున సహాయ
మగు మని యాచింప నంగీకరించి, మహారథుండును ధన్వియైన నీదు
ప్రాణేశ్వరుఁడు, ధనుష్పాణియై సైన్యయుతంబుగ నీతోడఁ దరలిపోయి

గీ. స్వర్గమున, కందుఁ గ్రూరరాక్షసులతోడ, బవర మొనరించుతఱిఁ దెగిపడియెఁ దేరి
కంటిమేఁ, కట్టులగుట సంగ్రామరతుఁడు, జనవిభుఁడు మూడఁడయ్యెను, జంద్రవదన!

ఉ. అప్పుడు నీవు తాలిమి స్వహస్తముఁ జొన్పి తదీయరంధ్రముం
గప్పి నిజేశుప్రాణములు గాచుతలంపున నిల్చియుంటి, వా
చొప్పున నుండఁగా; నరినిషూదనుఁ డాతఁ డమోఘుకాండముల్
గుప్పి సురారులం దునిమి కోమలి! యంతట నిన్నుఁ గన్గొనెన్. ౮౭

క. కని పరమాశ్చర్యాంబుధి, మునిఁగి ముదముఁ బట్టలేక మురియుచు నాలిం
గనమునఁ దృప్తుండై విను, మని నీతో నిట్టు లనియె నంబురుహాముఖీ! ౮౮

క. మదిఁ గలకోరికఁ దెలుపుము, తుద కది యెదియైనఁ దీర్తుఁ దొయ్యలి! నీ కి
య్యదనున రెండువరము లీ, యఁ దలంచితిఁ, గోరు మందియము నొందకుమీ. ౮౯

వ. నాపుడు నీ వందుల కామోదించి, ప్రియుఁడా! నీవు నాయెడఁ బ్రీతుండవై తివేని;
నా కిత్తు నన్న రెండువరంబు లక్కఱగల్గి నే నడుగు నందాఁక నిల్లడగ నీకడ నుంచు
మంటివి. అందులకు భూపురందరుం డంగీకరించి నిన్ను శిబిరంబున కంపె. ము
న్నెన్నఁడో; నీ వలనవిన్న యీవృత్తాంత మిప్పుడు స్మరణమునకు వచ్చి మహోప
కారమునకు మూల మైనది. కావున. ౯౦

సీ. తడయక క్రోధసౌధముఁ బ్రవేశించి పెల్లడరుకోపమున మైతొడవు లెల్లఁ
బుడమిపై వెదచల్లి, ముసుఁగిడి పలుకక, పలుకరించినఁ గ్రిందఁ బఁడుకొనుము,
జనవరుం డరుదెంచి సత్యప్రతిజ్ఞగావించి కోరిక నెఱవేర్చు నేని;
మన సిచ్చి మాటాడు మెనయు సౌఖ్యము, లన దుస్సంగసంభవదుర్భ్రమవశ
ఆ. యగుటఁ జేసి కేకయాత్మజ యదియెల్లఁ, దథ్య మనుచు నాత్మఁ దలఁచి పలికె
నిట్టితెలివి నీకు నెటనుండి వచ్చె, మున్నాన నెన్నఁడేను, గూనిదాన!. ౯౧

గీ. వక్రసుందరి! నీ వెటువంటిదాన, వౌర నీబుద్ధికుశలత? యస్మదీయ
సుతుఁడు భరతుండు ధారుణీశుండె యైన, గ్రామశత మిత్తు నీవె నాప్రాణసఖివి.

క. అనిచెప్పి కోపభవనం, బునకుఁ జని వడిఁ బోయి రోషపూరితయై మే
ని నగ లిలఁ బాఱవైచి మ,లినవస్త్రముఁ గట్టి పవ్వళించెను ధరపై. ౯౩

చ. పుడమిఁ బరుండి కేకయునిపుత్త్రిక కుబ్జను బల్కెఁ, రాఘవుం
డడవికిఁ బోవునంతవఱ కట్టిటు పక్కె మరల్ప లేవ తేఁ
పోడఁబడకున్న పక్షమున నూపిరి యైనను బాయుదాన, నా
యెడఁ గల ప్రేమ దేలవలె నేలిక కిప్డు, పరోపకారిణీ! ౯౪

క. నావుడు మంథర దేవీ! నీ వీపట్టుదలతోడ నిలువుము, దొరయై
యావనధిపరివృతాఖిల, భూవలయం బేలు సుతుఁడు, పొసఁగు శుభమ్ముల్. ౯౫

వ. నీకు మంగళంబు గాఁగల దనిచెప్పి నిజగృహంబున కరిగె. కైకయు గట్టిపట్టుదల
తోడ నుండెఁ గావున. ౯౬

సీ. గుణియైన సత్కృపాకూపారుఁ డైన స,దాచార సంపన్నుఁ డైన నీతి
విదుఁ డైన విద్యావివేకి యైనను విధివాదిదేశికపాదవనజసేవ
గావించువాఁ డైనఁ గడుధీరుఁ డైన మ,హితకిల్బిషౌఘబాధితమనస్కు
లగుదుర్జనులతోడ ననవరతంబు సమాహితుఁ డై స్నేహ మాచరింపఁ
గీ. బూనె నేని; వారల చెడుబుద్ధివలన, సహజసత్ప్రవర్తన మెల్ల సమసి తత్ప్ర
భావపరిభావితాత్ముఁడై పాపకార్య, పరతఁ దిరుగాడు వారలపగిది, మగువ! ౯౭

క. దుర్జనుల చెలిమి హితమగు, కర్జము గా దెపుడు మాసఁగాఁ దగుఁ గుబ్జా
దుర్జాతిబోధమునను వి,సర్జింపఁగ లేదె కైక సహజగుణంబున్? ౯౮

వ. తరుణీ! తరువాతికథ వినుము. ౯౯

గీ. అట్లు నరపతి రామపట్టాభిషేక, మంగళార్థంబు పౌరసుమంత్రముఖుల
కాజ్ఞ గావించి, తత్తత్క్రియల నొనర్చ, నంతిపురమున కరిగె హృష్టాత్ముఁడగుచు.

చ. అటఁ బ్రియురాలిఁ గానక ధరాధిపుఁ డేమిది? యంచు ఖిన్నుఁడై
కటకట! యెందుఁ బోయెఁ బ్రియకామిని నే నిలుసొచ్చునంతలోఁ
దటుకున నవ్వుమోమునను దా నెదు రయ్యెడి దిప్పు డెంత సే
పటి కిటు రాకయుండె? నని భావమునం దలపోసి యార్తితోన్. ౧౦౧

శా. దాసీవర్గము డాసి యొందరిగె మత్ప్రాణంబు నీరాణి నేఁ
డీ సౌధంబును వీడి, మున్ను బలె రాదీవేళ నాచెంత కో
దాసీభామినులార! యేదయిన వ్యత్యాసంబు గావించినా
నా? సర్వం బెఱిఁగింపుఁ డంచుఁ బలుకన్ వా రంద ఱాకోర్తిగన్. ౧౦౨

క. మారాణి క్రోధభవనముఁ, జేరెన్ నేఁ డలుక రాజశేఖర! మాకుం
గారణ మదేమొ తెలియదు, మీర యెఱుఁగవలయు నన్న మిగుల భయమునన్.

దశరథుఁడు కైకను బతిమాలుట

క. ఏదో యొకకీడిపు డాపాదిల్లు; నటంచు డిల్లపడి సతి డాయన్
మేదినిపతి చని హస్తము,చే దేహము మెల్లఁగా స్పృశించుచు ననియెన్. ౧౦౪

సీ. కనకపర్యంకాదికము వీడి పుడమిపై, శయనించు టేటికిఁ జంద్రవదన!
మన ముబ్బ నాతోడ మాట లాడక మనో, వ్యథ గూర్చె దేటికి? మధురవాణి!
సొగసుగ నగలుదాల్చుటమాని యొకరీతి, నున్నా విదేమిటి? కుత్పలాక్షి!
జిలుగుపుట్టముఁ ద్రోసి మలినాంబరంబును, గట్టితి వేటికిఁ గమలగంధి!
గీ. మున్నుబోలె నేఁడును నగుమోముతోడ, నెదురురా వేమిటికి? సమదేభయాన!
చెప్పు సకలంబు నీదువాంఛిత మదెట్టి,దైన నెఱవేర్తుఁ గాదనఁబోను వెలఁది!

క. కనుగానక నీ కహితము, నొనరించినవార లెవ్వ? రుర్వర స్త్రీలై
నను బురుషులైన దండ్యులు, హననార్హులు వారు నాకు, నంబుజవదనా! ౧౦౬

గీ. ప్రీతి నీ కెట్లుగల్గుఁ దద్విధము నాదు, సవిధమునఁ దెల్పు మిపు డవశ్యమును దేవి!
అది కడుంగడుదుర్లభమైన దైన, బలిమి సాధింతు క్షణములోపల నిఁకేల. ౧౦౭

ఉ. నామన సీ వెఱుంగవొకొ; నన్ను మనఃప్రియుఁగా స్వవశ్యుఁగాఁ
గామదుఁగాఁ దలంచెదవు గాదె సదా? యటు లయ్యు నేఁడు దుగ
ఖామయతప్తమానసునిఁగా నొనరించి యలంపఁ బూని నా
వేమిది? దీన నీకు ఫల మేమి లభించు శ్రమంబు గాకినీ? ౧౦౮

గీ. చెప్పు మెవని ధనాఢ్యుఁగాఁ జేయవలయు, నీకుఁ బ్రియకరుఁ డైయున్న నిర్ధనికుని?
ధనకనకవస్తువాహనఘనుఁ ద్వదహితు, నెవనిఁ గూటికిలేనివానిఁగ నొనర్తు? ౧౦౯

గీ. వధ్యు నెవ్వానిఁ బ్రోతు నవధ్యు నెవని,నల్కఁ బొలియింతుఁ దెలియంగఁ బలుకు కలికి!
పలుపలుకు లేల తప్ప కిప్పట్ల నాదు, ప్రాణముల నైన నిచ్చెద భయముఁ గొనక.

మ. వనితా! ప్రాణముకంటె నిష్టతముఁ డెవ్వాఁ డట్టిరాజీవలో
చనుఁ డౌ రామునిమీఁద నొట్టిడి ప్రతిజ్ఞం జేతు, నీ విష్ట మే
పని నన్ జేయు మటంచుఁ బత్ని వది భావ్యం బైనఁ గాకున్నఁ గా
దన కే పూన్కి నొనర్చుటల్ నిజ మిఁకేలా వీనిపై నల్గుటల్. ౧౧౧

క. అని పలుతెఱఁగుల వాంఛిత,మును నెరవేర్తు నని రాజముఖ్యుఁడు బలిమా
లిసఁ "దనవలలోఁ బడెఁ బ్రియుఁ," డని మోదముఁ జెందెఁ గైక, యగరాజసుతా!.

కైక దశరథునిఁ బూర్వదత్తము లగువరములకు ఫలములఁ గోరుట

గీ. ఉత్తముం డగురాముపై నొట్టుఁబెట్టి, హితముఁ బలుకుచునున్న భూపతికతమునఁ
దనతలఁపు నెగ్గఁగల దని తలఁచి కనులు, దెఱచి మెల్లగఁ బలికనెఁ దెగువమిగుల.

గీ. అధిప! సత్యప్రతిజ్ఞుఁడ వగుదు వేని, శపథము యథార్థముగఁ జేయఁ జాలు దేని
నాలసింపక మత్ప్రార్థితాంశ మిపుడె, సఫల మొనరింతు, వింకేల సంశయింప.

క. దేవాసురసంగరమున, నావలనం బ్రబలరక్షణముఁ గాంచి ప్రమో
దావృతమతి నాఁ డొసఁగితి, వీవు వరద్వయము నాకు, సిద్ధచరిత్రా! ౧౧౪

ఉ. అప్పుడ తద్వరద్వయము నక్కఱ గల్గినవేళఁ గొందు నే
నప్పటిదాఁక మీదుహృదయంబున నుంచుఁ డటంచుఁ బల్కుఱుం
జెప్పితి సువ్రతా! యిపుడు చేకుఱెఁ దద్గ్రహణార్హవేళ, వా
తప్పదు రే భవాదృశులు? ధారుణి క్రుంగిన మిన్ను వంగినన్. ౧౧౬

సీ. అం దొక్కవరమున నస్మత్ప్రియాత్మజు, భరతు నిప్పుడు గూర్పఁబడినసకల
సంభారములతోడఁ జను నభిషేకింప, యౌవరాజ్యమునకు నధిపుఁ గాఁగ,
రెండవవరమున శ్రీమంతుఁ డగురామ,చంద్రుండు మౌనివేషము ధరించి
జడలు వల్కములుఁ దోడవులుగా దండ,కారణ్యమున కేఁగి, యందుఁ గంద

గీ. మూలఫలముల నాహారముగ మెసవుచు, నోలిఁ జరియింపవలెఁ బదునాలుగేఁడు,
లాపయి మనోరథం బెట్టు లట్లు పురము,నందొ వనమందొ యునికి సేయంగవచ్చు.

ఉ. ఎందుల కింక జాగు కమలేక్షణు రాము నరణ్యసీమ కం
పం దగు వేకువన్, ధరణిపాల! విలంబ మొనర్తు వేని నీ

ముందఱం బ్రాణముల్ విడువఁ బూనితి, నన్నిటికిం దెగించితిన్
నిందకుఁ గాకుమీ యశము నింపుమి తొంటినుడిన్ దలంపుమీ. ౧౧౮

వ. నీవు సత్యప్రతిజ్ఞుండ వగుటయు నా కత్యంతప్రియం బనుడు. ౧౧౯

దశరథుఁడు రాము నడవికిఁ బంపఁగోరకు మని కైకను వేఁడుకొనుట

క. పవినిహతభూధరం బన, నవనిం బడి కనులు దెఱచి యల్లన దుఃఖా
శ్రువులఁ దుడిచికొని పెనువగ, గవియఁగ నిది యేమి పాడుకలఁ గాంచితినా? ౧౨౦

క. మఱి చిత్తవిభ్రమంబా? పురాభవాచరితదురితపుంజము నేఁ డీ
కరణి భయపఱుపసాగెన? యరయఁగ రా దెదియు ననుచు ననుకొను చేమో.

క. పులివలెఁ దన యెదుటం గల, కలికిం గనుఁగొని యిదేమి? కళ్యాణి! యమం
గళముగఁ బ్రాణహరం బగు, పలుకుం బలికితివి మున్ను బలికితె యిట్టుల్?

మ. అపరాధం బిపు డేమిచేసెఁ జెపుమా యజ్ఞాత్ముఁ డా రాముఁ? డే
ల్లపుడున్ నాకడ వానిమంచిగుణముల్ వర్ణింతువే కాదె? క
న్నపడంతిన్ నను నొక్కరీతిఁ గనుచున్ గావించు శుశ్రూష భ
క్తిపరీతుం డయి యంచు ము న్ననెద వింతీ! నేఁ డిదే మక్కటా. ౧౨౩

చ. రమణి! భవత్తనూజునకు రాజ్యముఁ గోరుదు వేని; నిత్తు ని
క్కముగఁ దదాజ్ఞమై నడచుఁగాత ధరాపరిపాలనమ్ము, సౌ
ధముననె యుండనిమ్ము గుణధాముని రాముని, న న్ననుగ్రహిం
పుము పెడత్రోవఁ ద్రొక్కకుము ముద్దియ! నీ కతఁ డెగ్గు సేయునే?. ౧౨౪

వ. అని పలుతెఱంగుల బతిమాలుచు. ౧౨౫

చ. కలఁగినచిత్త మశ్రువులు గ్రమ్మినకన్గవ బాధఁ గూర్చ భూ
తలపతి కైకకాళ్లఁ బడి దారుణచిత్తము వీడు మన్నఁ గ
న్గొలఁకులు సందె బాంధవముఁ గోరుచునుండఁగఁ దానుగొన్నకుం
దెలుసుకు మూఁడె కాళ్లనుగతిన్ సతి యెప్పటి భంగి నిట్లనెన్. ౧౨౬

కైక దశరథునితోఁ దననిశ్చయము దెలుపుట

ఉ. భ్రాంతుఁడ వయ్యె దేల నరపాలశిరోమణి! "నీదు కోర్కెఁ బ్రా
ణాంతమ యైనఁ దీర్తు" నని యంటివి గాదె? తదన్యభంగికిన్
స్వాంతముఁ ద్రిప్పుటల్ సుజనపద్ధతియే? శపథాన్యవర్తనుల్
గాంతురు చూవె ఘోరనరకంబునఁ గూలి యనేకబాధలన్. ౧౨౭

చ. నరవర! నారచీర లజినంబులుఁ దాల్చి మహీసుతామనో
హరుఁ డగురామచంద్రుఁ డుదయంబునఁ గానకుఁ బోవకున్నచోఁ;
గరళము మ్రింగియో గళము గట్టిగఁబట్టి యురిం దగిల్చియో
మరణము నొందుదానను జుమా భవదీయసమక్షమందునన్. ౧౨౮

గీ. ఎందులకు వట్టిమాటల నేమిఫలము, క్షితితలాధిప! విను తేల్చి చెప్పదానఁ
గౌసలేయుని యెడఁబాటో; కైకచావో; నీవు సూతు విద్యాది విధినిర్ణయంబు.

చ. సకలసభాంతరాళముల సత్యము దప్పనివాఁడ వంచు నూ
రక యఘోగర్తఁ గాంచితివి; రామునిపై శపథం బొనర్చియున్
త్రికరణశుద్ధిగా మఱొకరీతిఁ జరించి మదీప్సితార్థమున్
వికలము సేయు దేని రఘువీర! యధోగతి గల్గితీరెదున్. ౧౩౦

క. అని కైక వలుక దీనా, ననమున దుఃఖాబ్ధి మునిఁగి నరనాథుఁడు సం
జ్ఞను దప్పి మూర్ఛయలమ మృతునిగతిఁ బుడమిపయిఁ బడియెఁ దోయజనేత్రా!

క. ఈవిధమున శోకముచే, నావిభునకు రాత్రి గడచె నబ్దసమంబై,
దేవి! విను మంత దినకరుఁ, డావిర్భవ మొందువేళ యగుటయు, రక్తిన్. ౧౩౨

గీ. వందిజనమును గాయకబృందములును, గాన మొనరింప వల దని మానిపించి
ఘనతరక్రోధమును గొని కైకయుండె, మెల్లగా ఱిక్కగమి జాఱెఁ దెల్లవాఱె.

పట్టాభిషిక్తుఁ డగు రాముని దర్శించుటకుఁ బ్రజలు నిరీక్షించుట

క. ధరణీసురులున్ ధరణీశ్వరులున్ వైశ్యులు మహర్షిసత్తములున్ సుం
దరు లగుకన్యకలును సత్త్వరతఁ జేరిరి గౌరి! నియమితస్థానములన్. ౧౩౪

గీ. ఛత్త్రమును దివ్యమయిన వింజామరయు గజంబు గుఱ్ఱంబు మఱి పౌరజానపదులు
వారకాంతలు మున్నుగా వచ్చి రటకు, గురుఁడు దెలిపిన తెఱఁగునఁ గొఱఁత లేక.

సీ. "కనకరత్నకిరీటకటకముల్ గలవాని, నఖిలభూషణముల నలరువానిఁ
బసఁగ్రొక్కపచ్చనిపట్టుపుట్టమువానిఁ, గౌస్తుభాభరణవక్షంబువాని
మదనుల నూర్వుర నదలించుచక్కఁదనమువాని గజముపై నమరువాని
శ్యామలాంగమువాని సస్మితాస్యమువానిఁ, బట్టాభిషిక్తుఁడై పరఁగువాని
పంచపాది.
లలితలక్షణుఁ డగు నూర్మిళావిభుండు
భక్తిమైఁ దెల్ల గొడుగును బట్టుచుండ

నరుగుదెంచెడివాని మహాత్ము రాముఁ
గాంచుటెపుడో" యటంచుఁ గలసమస్త
జనులు నిదురింపమాని రుత్సాహమునను. ౧౩౬

చ. ఉదయమిఁ కెప్పుడో యగుట; యున్నతసన్నుత హేమపీఠమం
దుదయధరాధరేంద్రమున నొప్పు సముజ్జ్వలభానుమూర్తి నాఁ
బొదలు మహీసుతారమణుఁ బుణ్యు వరేణ్యునిఁ జూడఁ జాలు న
భ్యుదయము గల్గు టెప్డొ; యని యుండిరి బాలురు వృద్ధు లంగనల్. ౧౩౭

సుమంత్రుఁడు కైకను రాజు విచారమునకుఁ గారణ మడుగుట

వ. అయ్యవసరంబున సుమంత్రుఁడు భూకాంతుం డంతదాఁక లేవకుండుట నెఱింగి.

చ. కత మెది దీని కంచు మది గాఢముగాఁ దలపోసి, కానలే
క తడయఁగూడ దింక నని కైక గృహంబున కేఁగి మెల్లగాఁ
బతికి జయోక్తిఁ బల్కుచు సభక్తి శిరంబున మ్రొక్కి, ఖిన్నుఁడౌ
కతమునఁ బల్క కుండుటలు గన్గొని, యిట్లను గైకతో దుతన్. ౧౩౮

గీ. దేవి! కైకేయి! సతము వర్ధిల్లు మమ్మ! భూతలాధీశుఁ డెప్పటిరీతిఁ గాన
రాఁడు శోకభంగి నున్నాఁడు నేఁడు, కారణం బేమి నాన్నుడుఁ గలికి పలికె.

ఉ. రాతిరి రామ! రామ! యని రాఘవునే మదిలో స్మరించుచున్
భూతలనాయకుండు క్షణము న్నిదురింపక యట్టెయుండె, నా
హేతువుచేత స్వస్థత యొకింతయుఁ గానక యీవిధంబుగా
నీతఁడు గానిపించెడు, మ తేమివిశేషము లేదమాత్యుఁడా! ౧౪౧

గీ. రాముఁ జూచుబుద్ధి రాజున్న వాఁడు నీ, వేఁగి తోడితెమ్ము వేగ మతని,
ననుడు తేనియాన గొనక యే నెటువోదు, మానినీ! యటంచు మంత్రి వలికె. ౧౪౨

వ. అంత దశరథుండు రామసందర్శనలాలసుండు గావున నమ్మాట కంగీకరించి సుంద
రుం డగుకౌసల్యానందనుం దోడ్కొని ర మ్మనుటయు. ౧౪౩

క. త్వరితముగ నేఁగి సీతావరు భవనము సొచ్చి యద్దు వడముక, "నిను భూ
వరుఁ డరయుతలంపునఁ దెచ్చెదఁ దోడ్తె మ్మనుచుఁ బంపె శ్రీరామ! ననున్.

క. మంగళ మగు నీకున్ రఘు, పుంగవ! నాతోడరమ్ము పోదము వడిగా,
సంగతి తెలియదు గాని న్నినుం గోరుచు మనుజపతి మనోవ్యథ నుండెన్. ౧౪౪

రాముఁడు దుఃఖితుఁడగు తండ్రికడకుఁ బోవుట

చ. అనుటయు నొందు వల్కలక గుణాఢ్యుఁడు రాముఁడు స్యందనస్థుఁడై
యనుజుఁడు వెంటరాఁ గడురయంబున సారథియౌ సుమంత్రుతోఁ
జనెఁ జిత్రమందిరంబునకు సంభ్రమ మెంతయు మీఱ మధ్యక
క్ష్యను గురుఁ డాదిగాఁగలుగు నందఱఁ గన్గొనుచున్, సతీమణీ! ౧౪౬

క. చని తండ్రికడకుఁ దత్పద, వనజములకుఁ బ్రణతి సేయఁ బార్థివుఁ డాలిం
గన మొనరించెడి సంభ్రమ, మున లేచి కరములు సాఁచి పుత్రప్రేమన్. ౧౪౭

క. రామా! యని శోకంబున, నామెయి భూమిపయిఁ గూల, నయ్యో తండ్రీ!
యే మిది? యని దిగ్గున నా, శ్రీమహితుఁడు గౌఁగిలించి చేర్చెం దొడపై. ౧౪౮

క. ముమ్మరపుమూర్ఛ మునిఁగిన, నమ్మహిపునిఁ జూచి కాంత లందఱుఁ గడుశో
కమ్మును జెంది, రిదే మని, కొమ్మా! రభసమున నటకు గురుఁడును వచ్చెన్.

కైక రామునితో వరప్రదాన విషయము దెలుపుట

క. జనకునకు దుఃఖ మిట్లేల, జనియింప నేల? యని రామచంద్రుం డడుగన్
విని కైక పలుకు, నీవల్లనె దుఃఖం బుపశమించు నరనాథునకున్. ౧౫౦

గీ. రాజహిత మగు స్వల్పకార్యం బొకండు, చేయవలయును నిపు డాలసింపఁ గూడ,
దరయ సత్యప్రతిజ్ఞుఁడ వైన నీకుఁ, జనదె తండ్రిని సత్యసంధునిఁ బొనర్ప. ౧౫౧

సీ. సంతుష్టచిత్తుఁడై జనపతి మును నాకు, వరములు రెం డిచ్చె, వానిలోని
యంశమ్ము నీవశ మగుటచే నీతోడఁ, జెప్ప నెట్లో యని సిగ్గుఁబొంది
యున్నాఁడు, జనకుని యుద్దేశమునుబట్టి యనుకూలముగఁ బోవు టాత్మజునకుఁ
బరమధర్మము, సత్యపాశబద్ధుం డయి, తాపంబుఁ జెందు నీతండ్రి నిపుడు
గీ. నీవు రక్షింపవలయు నెన్నికడగండ్ల, కైన నోర్చి, పుత్రుం డన నత్యుదగ్ర
పున్నరకకూపముననుండి కన్నతండ్రి, నుద్ధరించెడివాఁ డని యుండెఁ గాదె?

రాముఁడు జనకునియాజ్ఞ యవిలంఘనీయ మనుట

క. కైకేయిమాట విని సీ, తాకాంతుఁడు శూలహతువిధంబున వ్యథితుం
డై, కార్య మొండు జనకుని, కై కావింపనిది నాకుఁ గలదే? తల్లీ! ౧౫౩

క. నాతో ని ట్లనె దేలా, మాతా! కా దని మఱొక్కమాటాడుదు నే?
మాతండ్రి సంతసింపఁగఁ, జేతఃప్రియముగ నెదేనిఁ జేయుదుఁ జుమ్మీ. ౧౫౪

చ. అసువుల నిచ్చెదన్, గరళ మైనను ద్రావెద, సీత నేని సం
తసమునఁ బాయుదున్, గనినతల్లిని రాజ్యము నుజ్జగింతు, నీ
వసుధను గన్నతండ్రి కగువాంఛను జెప్పకమున్న తీర్చువాఁ
"డసదృశుఁ డుత్తముం"డనుచు నార్యులచేఁ గొనియాడఁగాఁ బడున్. ౧౪౪

ఉ. చెప్పినమీఁదఁ గార్యమును జేసెడివానిని మధ్యమాఖ్యచేఁ
జెప్పుదు, రెంతచెప్పినను జేయనివాఁడు మలోపమేయుఁడై
చెప్పఁబడున్, విరుద్ధగతి నేమమొ? మాజనకుండు నాకుఁ దాఁ
జెప్పన దెల్లఁ దల్లి! నిరసింపక చేయుదు నిందఁ బాయుదున్. ౧౪౬

క. ఇది సత్యము సత్యము నా,మది యెప్పుడు ద్వివిధముగను మాటాడుట కో
ర్వదు, నేను జేయవలసిన, దెది తండ్రికి విహిత మెద్ది! యెఱిఁగింపు మనెన్.

వ. అప్పు డప్పాపాత్మురాలు రఘుపతిప్రతిజ్ఞ కుబ్బి యిట్లనియె. ౧౪౭

సీ. వీఁక నీ పట్టాభిషేకమ్ముకొఱకు నే సంభారములు నేఁడు సంతరింపఁ
బడియెనో; వానిచే భరతున కభిషేక మాచరింపఁగవలె నందు నొకట,
రెండవవరమున, శ్రీరామ! నీవు జటాధారివై మహాటవికిఁ దండ్రి
యనుమతిఁ జొప్పన నరిగి సత్వరముగఁ, గందమూలాశివై కడపవలయుఁ

గీ. బదియునాల్గేఁడు లచట, నీ సనియెచుమ్ము, తండ్రి కీవాచరింపఁగాఁ దగిన దిపుడు,
చెప్ప లజ్జించుచున్నాఁడు క్షితిశ లేశుఁ, డొప్పుకొందువో; కాదందువో; యటంచు.

క. నాపుడు రాముఁడు దేవీ! నీ వన్నవిధాన భరతునికె రాజ్య మగున్
నే వనమున కరుగుదు, నేఁడీ వసుధేశుండు పలుకఁ డేటికి నాతోన్. ౧౫౦

వ. అనుటయు. ౧౫౧

దశరథుఁడు రాముని గౌఁగలించుకొని యేడ్చుట

గీ. ఆలకించి తద్వచనమ్ము నగ్రభూమి,
నున్నకొమరునిఁ గన్గొని మన్నుతేఁడు
కొందలముఁ జెంది మఱియు నెక్కుడుగ, శోక
మిళిత మగునొక్కవాక్యంబుఁ బలికె నిట్లు. ౧౫౨

గీ. వనితకెంతయు లోనైనవాని భ్రాంత,హృదయుఁ దప్పుదుత్రోవఁ జరించు వానిఁ
జపలు నను నిగ్రహించి రాజ్యంబుఁ గొనుము, నీకుఁ బాపంబు దీన రానేర దనఘ!

ఆ. అట్లు చేయ నాకు నంట దసత్యంబు,వలనఁ గలుగుఘోరపాతకంబు
రామభద్ర! యని ధరావల్లభుఁడు దుఃఖ,తప్తచిత్తుఁ డగుచుఁ దల్లడిల్లె. ౧౫౪

ఉ. హా రఘురామ! హా త్రిభువనాధిప! హా ప్రియపుత్ర! హా మహా
వీర! ననుం బురిం గవదలి భీకరకాననసీమ కెట్లు వో
నేరుతు వత్స! బ్రతుక నేర్తు నెటుల్ నినుఁ జూడకుండ, ని
ష్కారణ మిట్టిపట్టుదల కైకకుఁ గల్గఁగ నేల దైవమా. ౧౬౪

క. అని తనయున కగుకీడున, కును దన పైపమికిఁ గైకకుచ్చితమునకుం
మన మెరియఁగఁ గౌఁగిట రాముని జేరిచి ముక్తకంఠముగఁ బలవించెన్. ౧౬౫

రాముఁడు తండ్రి నూఱడించుట

గీ. సజలపాణిని దండ్రిలోచనయుగళముఁ, దుడిచి మెల్లగ నూరార్చి కొడుకు నీతి
కోవిదుఁడు రాముఁ డిట్లనెఁ గువలయేశ!, యిందులకు నింతగా మదిఁ గుంద నేల?

క. నాతమ్ముఁడె రాజ్యమ్మును, బ్రీతిం బాలించుఁ గాక, విపినోర్వికి సం
ప్రీతిం జని మఱి వచ్చెద, నాతండ్రీ! ప్రతిన నెరపి నగరమ్మునకున్. ౧౬౭

చ. కనుఁగొను తండ్రి! రాజ్యమునకంటెను గాననమందు నున్న నా
కు నమరు సర్వసౌఖ్యములు కోటిగుణంబుగ, నీకు సత్యపా
లనమును దాన నౌ, మఱి యిలాపతిఁగా సుతుఁ జేయఁ గోరు మా
జననికిఁ గైకకుం గడుపు చల్ల నగుం గవని కేను బోవుటన్. ౧౬౮

క. వనవాస మన్నఁ గష్టం, బనియె తలంపంగఁ బోల దందు సుగుణముల్
జనకా! యెన్నియొ కల వీఁక, వనఁట విడిచి ధైర్య మూఁది పంపుము నన్నున్.

రాముఁడు తల్లి మేపు కరుగుట

సీ. నాయభిషేకంబునకుఁ దోడితెచ్చినసంభారశత ముపసంహరింపఁ
బడుఁగాక, ననుగన్నపడఁతిఁ గౌసల్యను నూరార్చి జానకి నూఱడించి
వచ్చి, తావకపాదవనజంబులకు వందనం బాచరించి యానందముగను
నడవికిఁ బోయెద, నని పల్కి తండ్రిని వలఁగొని మైథిలీవరుఁడు, మాతృ
గీ. దర్శనార్థము తద్దివ్యధామమునకు, నరిగి కన్గొనెఁ దనకు మే లబ్బుకొఱకు
విష్ణుపూజను భక్తిఁ గావించుచున్న, తల్లి నాశ్రితకల్పకవల్లి నపుడు. ౧౭౧

గీ. హోమమునుం గూడఁ జేయించి యుర్వీసురుల, కమితముగ ధన మిచ్చి మానమునుబూని
యాదిమధ్యాంతరహితు రమాధినాథు, హరిని ధ్యానించుచుండె నేకాగ్రబుద్ధి.

సీ. లో నున్న వాఁ డొక్కఁ డైనవాఁడును ఘనచిన్మూర్తియై ప్రకాశించువాఁడు
నానందమయుఁడు నిరస్తసర్వాతిశయస్వరూపంబున నమరువాఁడు

తన భక్తజనుల కందఁగరాని ఫల మైన సంఘటింపఁగఁ జేయఁ జాలువాఁడు
వాగగోచర మనవద్య మానందంబు యోగిజనంబుల కొసగువాఁడు
గీ. నైనవిష్ణుని నిజహృదయాబ్జమందుఁ, జేర్చి ధ్యానం బొనర్చుటఁ జేసి తన్నుఁ
జూడవచ్చినశ్రీరాముఁ జూడ కుండెఁ, గోసలేంద్రుని ప్రియపుత్రి, కుసుమగాత్రి!.

క. అంత సుమిత్ర మహీజా, కాంతునిఁ గని సంభ్రమమునఁ గౌసల్యకు, నో
యింతీ! రాముఁ డిదుగో నీ, చెంతకు వచ్చె నని చెప్పె, సింధురగమనా! ౧౨౪

గీ. రామనామంబు నాలించి రాజపత్ని, బాహ్యదృష్టిప్రవాహంబు వడసి తనయుఁ
గమలనయనునిఁ దిలకించి కౌఁగిలించి, ప్రీతిఁ దొడపయిఁ గూర్చుండఁ బెట్టికొనియె.

మ. శిరముం మూర్కొని నల్లగల్వలకు వాసిం గూర్చునెమ్మేను సుం
దరహస్తాంబురుహంబుచేఁ దడవుచుం నన్నన్న తండ్రీ! క్షుధా
తురుచందంబునఁ దోఁచుచుంటివి రసాస్తోకమ్ము మృష్టాన్నముం
బరమప్రీతి భుజింపు మన్నఁ, దెలియం మార్తాండవంశ్యుం డనున్. ౧౨౬

రాముఁడు తల్లికి నరణ్యప్రయాణమును జెప్పుట

గీ. జనని! నీ వన్నయట్లు భోజనము సేయఁ, దాఁడియానతిలే దీవిధముగ దండ
కాటవికి నిష్ట పొమ్మనె, నధిపతి మును,గైక కొసఁగిన వరములు కారణముగ.

క. భరతునకు రాజ్య మొసఁగెను, నరణ్య మిడె నాకు మునిజనాకృతిఁ బదియుం
మఱి నాలుగేఁడు లందే, చరియింపఁగ, నేను నల్లె చనఁగా నుంటిన్. ౧౨౭

చ. వగవకు మీవు, నే మరలివత్తుఁ జతుర్దశవత్సరాంత మె
న్నగునొ; తదుత్తరక్షణమ, యమ్మరో! నీ కిది సైపరాని దై
న గురుప్రియానతిం గడచునందనుఁ డింమను నందు నింద నొం
దఁగలఁడు గాన పోఁదలఁచినాఁడ, ననంగఁ దద్రుః వాక్యనన్. ౧౨౮

కౌసల్య రాముని నడవికిఁ బోవల దనుట

గీ. యువతి తత్క్షణంబ యుద్విగ్నహృదయనై, మూర్ఛవోయి తెలిసి, మునిఁగి దుఃఖ
వనధిఁ, దనువు శోకవహ్నిఁ దపింప నిట్లనియెఁ దనయుతోడ నస్రు లురల. ౧౩౦

గీ. ప్రియ మయి తనర్చులేఁదూడ విడిచిపెట్టి, యావు మఱి యెందు నిల్వని యట్లు, నేను
బ్రాణములకన్నఁ బ్రియుని నిం బాయుటకు సమర్థురాలనుగాను సత్యము కుమార!

క. వనవాసము చేయుటకై, తనయా! నీ వరుగుటలు యథార్థమయేం దో
డ్కొనిపొమ్ము వెంట నన్నును, నినువిడి జీవింపఁజాల నిమిషార్థంబుం. ౧౩౨

వ. మఱొండు కోరిక లే, దిదియును గాక. ౧౮౩

క. నరపతి ప్రసన్నుఁ డైనన్, భరతునియెడ; రాజ్య మతనిపా లైయును గా,
కరవిందనయన! నినుఁ బ్రియ,కరు నడవిఁ జరింపఁ బంపఁగా నేల కటా! ౧౮౪

సీ. నరపతి కైకకు వర మిచ్చిన ట్లైన, సర్వధనంబు నొసంగుఁ గాక
ని న్నిట్టు లలయింప నీవు వారలకుఁ గ్రూ,రత నొనర్చినయపరాధ మెద్ది?
తండ్రి గురుం డెట్లొ; తనయ! నేనును నీకు, నట్లె; విచారింప నధిక మౌదు
కానకుఁ బోఁ దండ్రియానఁ గొంటివి, బిడ్డ! యడ్డగించెద వలదంచు నేను
గీ. తల్లిమాట నుల్లంఘించి తండ్రిమాట,మీఁద వనవాస మొనరింపఁ బోదు వేని
నీవియోగదుఃఖము సైపనేర కిపుడె, యసువులు దొఱంగి యమపురి కరుగుదాన.

లక్ష్మణుఁడు తండ్రి యవివేకమునకుఁ గోపించుట

క. ఈసరణిన్ సుతవత్సల, కౌసల్య వచింప మనసు గలఁగుటయు సుమి
త్రాసుతుఁడు జగత్త్రియమున్, రోసమున దహించువాఁడునుం బలెఁ బలికెన్.

గీ. భ్రాంతమానసు నున్మత్తు భామినీవ,శంవదునిఁ దండ్రి బంధింతు, సత్వరంబ
భరతునిన్ వధియింతు సబాంధవముగ, నతని మేనమామలఁగూడ హత మొనర్తు.

చ. మునుపు సమస్తలోకముల బూదియొనర్చినరుద్రు విక్రమం
బు నొరయుమత్పరాక్రమముఁ బోలఁగఁ జూతురుగాక, యంచు రా
మున కను, దండకాటవికిఁ బొమ్మనినంతనె పోవ నీవు చే
సినయపరాధ మేమి? యభిషేకపుఁబూనికమీఁద నుండుమా. ౧౮౮

క. ఎడపక చెడుతలఁపున నీ, యెడఁ గీడుం గోరి విఘ్న మిప్పట్ల నొన
ర్చెడు దుష్టవర్తనుల మద, మడఁగించెద రామ! చాపహస్తుఁడ నగుచున్. ౧౮౯

రాముఁడు లక్ష్మణునకుఁ దత్త్వోపదేశము చేయుట

వ. అని పరుషంబులాడులక్ష్మణుం గౌఁగిలించుకొని కాకుత్స్థుండు రఘుశార్దూలా! నీవు శూరుండ వనియు నాదు హితమును గోరువాఁడ వనియు నే నెఱుంగుదు, నింతియ కాక. ౧౯౦

క. పలికినదానికి నెక్కుడు, సలుప వలఁతి వౌదు, వైన సమయముగా ద
ట్టులు సేయుట కిది; నడువఁగ, వలయును గానలకు వినుము పరమార్థమ్మున్.

సీ. మనకుఁ దోఁచెడియీసమస్తరాజ్యంబు దేహాదిక మెల్ల సత్యంబ యేని;
ఫలవంత మగును నీ పడెడి కష్టమ్ము, భో,క్తయు భోగ్యమును మిథ్యగా నెఱుఁగుము,

మేఘమాలికఁ దోఁచు మెఱుపులగమిపోలెఁ, జంచలంబులు భోగసంచయములు,
అగ్నిసంతప్తలోహస్థవారికణముచం,దమున నాయువుగూడ నశ్వరంబు,

గీ. భయదఫణిదంష్ట్రికలఁ జిక్కు-వడియు నీఁగ, గమికిఁ బాతరలాడెడి కప్పమాడ్కి-
జను లశాశ్వతభోగసంచయము వలఁతు, రనుజ ! కాలోరగగ్రస్తు లయ్యు నకట.

వ. నరుండు గడుంగడు శ్రమమున కోర్చియు దేహానుభవముకొఱ కహర్నిశము ధనార్జనాదికర్మతంత్రమ్ము నలుపుచున్నాఁడు. దేహము పురుషునికంటె భిన్నముగఁ జూడఁబడుచున్నది. పురుషభిన్న మగుశరీరాదికము జడ మగుటఁ జేసి, సుఖాది సాక్షాత్కారరూపభోగంబు సంభవింపనేరదు. ఆత్మ షడ్భావవికారరహితుఁడును బరిణామహీనుడుం గావున, నతనికిని భోగానుభవరూపపరిణామంబు గలుగఁజాలదు.

గీ. అరయ నధ్వగులకుఁ బ్రపయందుఁబోలె, దారుసంఘంబులకుఁ బాఱుతటినిఁ బోలె
నవని జనునకు మాతృపిత్రంగనాది, సంగమను చంచలంబు, లక్ష్మణకుమార !.

సీ. నీడచందంబున నిలుకడ లేనిది లక్ష్మి, యౌవనము జలమునఁ గల్గు
తరఁగపోల్కి- నశాశ్వతము, స్త్రీసుఖము స్వప్నసదృశ, మాయుష్యంబు స్వల్ప,మట్టు
లైనను "నా దిది దీనిచే సుఖియింతు," ననునభిమానంబు జనున కెపుడు
గల్గుచునున్నది, గంధర్వనగరంబుగతిఁ గల భాతి సంసృతి హుళిక్కి-,

గీ. తలఁప రోగాదివివిధబాధలకు నగ్గ,మైనసంసార మవివేకి నైనవాఁడు
గోరుఁ గాని వివేకి దాఁ గోరఁ డాత్మ, జన్మశతముల కేనియు సాధుశీల !. ౧౯౬

సీ. అబ్జబాంధవు గమనాగమనములచే, నాయు వేఁగుచునున్న దని యెఱిఁగియు,
ముసలితనంబున నుసురులు తనవంటి, వారు పాయుటఁ గనులారఁ గనియుఁ,
దనయాయువు నశించుననికాని తనకు ము,సలితనంబును జావు సంభవించు
ననికాని తలఁపఁడు మనుజుండు, వచ్చెడుదినమును వచ్చురాత్రియును దలఁచి

గీ. యది పరమసుఖదాయి యయ్యేది విశేష, భోగదాయిని యనుకొంచు మూఢబుద్ధి
సంతసించెడుఁగాని యాచనునదెల్ల, నాయువు గొఱంతవడు టనియె యెఱుఁగఁడు.

ఆ. పచ్చికుండలోని పాథస్సు పోలె నా,యువు క్షణక్షణమున కొకవిధముగఁ
దఱుఁగుచుండె రోగతతి శరీరమ్మును, బాధపెట్టెడిని విరోధు లట్లు. ౧౯౭

క. జర యీనినపులివలె ముం,దఱ నిల్చున్నయది మిగులఁ దర్జించుచు సో
దర! మృత్యువు వెనువెంటన, తిరుగాడెడు సమయసంప్రతీక్షాభిరతిఁ. ౧౯౮

వ. లక్ష్మణా! మనుష్యుండు కృమివిడ్భస్మసంజ్ఞితం బగు దేహంబునందుఁ దా నను నభిప్రాయము నొంది, "నేను జగత్ప్రసిద్ధుఁడ నగు రాజు"నని యాలోకంబునం దలంచుచున్నాఁడు. ౧౯౯

సీ. దేనిని నీ వభిమానించి లోకముల్, దగ్ధంబు సేయఁగాఁ దలఁచుచుంటి
వో; యట్టి దేహంబు సోదర! చర్మాస్థి, మాంస రేతోమూత్రమలమిళితము.
కాన వికారంబు గలదియు మాటుట, గలది యీకాయ మె క్కరణి నాత్మ
యగుఁ జెప్పు మయ్య! తదభిమాని కెపుడు రాగాదిదోషప్రాప్తి యగుట నిజము
గీ. వినుము "దేహమే"ననుట యవిద్యయందు, నేను దేహంబు నెన్నఁడుఁగాను జిత్స్వ
రూపుఁ డయినయాత్మ నను నిరూఢబుద్ధి, నే తలంతురు విద్యఁగా సిద్ధమతులు.

క. భవమున కవిద్య హేతువు, భవమును బాపంగ విద్య పరమౌషధ, మం
దువలన మోక్షార్థులు చేయవలయు యత్నంబు విద్య యలవడుటకు నై. ౨౦౧

వ. అట్టివిద్యాభ్యాసంబునకుఁ గామక్రోధాదులు శత్రువులు. వానియందు. ౨౦౨

గీ. శత్రుసూదన! క్రోధంబ చాలు మోక్షవిఘ్న మొనరింపఁగా; యదావిష్టుఁ డైన
జనుఁడు తలిదండ్రులను బంధుజనుల హితులఁ, దోడఁబుట్టువులం జంప నోడకుండు.

క. క్రోధమె సంసృతిబంధము, క్రోధమె హృత్తాపమున కగుం గారణ, మా
క్రోధమె ధర్మక్షయకర, మీ ధరఁ గావునఁ ద్యజింపు మీ వద్దానిన్. ౨౦౪

గీ. జనున కీక్రోధమే మహాశత్రు, వాశ వైతరణి, వేడ్క నందనవనము, శాంతి
నిర్జరులగోవు,గావున నీవు శాంతి, నొందు మట్లైన శత్రువు లుండఁబోరు. ౨౦౫

వ. సౌమిత్రీ! యాత్మ యన దేహేంద్రియమనఃప్రాణబుద్ధ్యాదులకంటె విలక్షణుఁడును,
శుద్ధుఁడును, స్వయంప్రకాశుఁడును, నవికారియు, నిరాకృతియు నై యున్నాఁడు.
అట్టి యాత్మను దేహేంద్రియమనఃప్రాణాదిభిన్నునిఁగ నెఱుఁగలే నంతదాఁక మను
ష్యుఁడు మృత్యుసంయుతుఁ డై సంసారదుఃఖసమూహంబునం బీడింపఁబడుచుండు.
అందుచే నీ వాత్మను బుద్ధ్యాదిభిన్నునిఁగ హృదయంబున భావింపుము. సమస్త
కార్యమ్ములను వెలుపలి కనువర్తింపు, మిదియుంగాక. ౨౦౬

సీ. నయరత! దుఃఖ మైనను సుఖ మైనను, బ్రారబ్ధ మంతయు ననుభవించు
చల సంసృతిప్రవాహమునఁ గూలినవాఁడ, వై, చేయఁగాఁ దగి నట్టి దఖిల,
మాచరింపుచు నున్న నంటకుండఁవు దాని, నీవు బాహ్యంబున నెల్లచోట్లఁ
గర్తృత్వ మందియుఁ గాకుత్స్థ! శుద్ధస్వభావంబు లోపలఁ బడసి తేనిఁ
గీ. గర్మపుంజలిప్తుండవు గావు నిజము, నేను నీ కెఱిఁగించిన దీని నెల్లఁ
జిత్తమున నెప్డు భావనచేయుచుండు, మొదవ దీ సంసృతిక్లేశ మొక్కపుడును.

రాముఁడు తల్లి నూరార్చుట

వ. అని తల్లియగు కౌసల్యాదికైక. ౨౦౭

క. మద్వాక్యములు నీమనమున, నుద్వేగము మాని సతము యోచింపుము, మో
క్షద్వారముఁ జూపును, సం,పద్విముఖత వలయు నెల్లవారికిఁ దల్లీ!. ౨౦౯

చ. వనమున కేఁగి నే మరలి వచ్చెడిదాఁకఁ బ్రతీక్ష సేయుచున్
జనని! వసింపు మింట, నిమిషంబు వలెం బదునాలుగేఁడులున్
జను, భవదీయదుఃఖమును సన్నగిలున్ జిరకాల ముండఁ బో,
దనవరతంబు నిల్వ నెదియైనను ధారుణిఁ బ్రాణికోటికిన్. ౨౧౦

చ. పడఁతి! సరిత్ప్రవాహమునఁ బడ్డ ప్లవంబుల కెట్టు; లట్టు లీ
పుడమిని గర్మమార్గములఁ బోయెడువారికి సర్వకాల మొ
క్కెడ నెడఁబాయ కుంట ఘటియింపదు, నేఁ బదునాలుగేఁడులుం
గడపి క్షణార్థముం బలె, సుఖమ్ముగ వచ్చెద నిన్నుఁ గాంచెదన్. ౨౧౧

గీ. అనుమతించి దీవించి న న్నంపు మమ్మ!
వనమునకు, భవదాశీఃప్రభావమునను
శ్రమముఁ బొరయక హాయిగా సంచరింపఁ
గలను, బితృగౌరవమ్మును నిలుపఁగలను. ౨౧౨

క. పలికి యిటు, జననిపాదం,బులపై రాముఁడు దండముం బోలెఁ బడన్
గలికి సుతు నెత్తి తొడ న,ర్మిలి నిడి దీవించెఁ బ్రియము మేకొనుభంగిన్. ౨౧౩

గీ. అరుగునప్పుడు నిల్చున్నయపుడు నిద్ర
పోవునప్పుడు నిను సర్వదేవతలును
ముగురుమూర్తులు గంధర్వముఖ్యు లెలమిఁ
గొడుక! రక్షించెదరుగాతఁ గూర్మి మిగుల. ౨౧౪

చ. అని తగుదీవెనల్ పలికి యాయమ బిగ్గ కవుంగిలించుకొం
చనిపెఁ బ్రయాణముల్ జలిపి, యప్పుడు లక్ష్మణుఁ డన్నకాళ్లకున్
మన మలరంగ మ్రొక్కి నయనంబుల సమ్మదబాష్పబిందువుల్
చినుకఁగ నీగతిం బలికెఁ జేడియ! గద్గదకంఠనాళుఁడై. ౨౧౫

క. నాసంశయంబు నీచేఁ, బాసెన్, నీవెంట నేను వని కరుదెంతున్
నీసేవఁ జేయుటకు, రామా! సదయుఁడ వగుమ దీని కనుమతి నిడుమా. ౨౧౬

క. లేనియెడ నిలువఁజాలను, బ్రాణత్యాగ మ్మొనర్తు ననపుడు, నట్లే
కానిమ్ము రమ్ము నాతోఁ, గానకు నని యనుమతించి కాకుత్స్థుఁ డటన్. ౨౧౭

రాముఁడు వనవాసవార్త దెలుప సీతకడ కరుగుట

క. ధరణీతనయకుఁ బ్రియసుం,దరి కి వ్విధ మెఱుఁగఁ దెలుపు దలఁపునఁ దన్మం
దిరమునకు నరిగె జననీ, వరసౌధము వాసి సమదవారణగతితో. ౨౧౮

గీ. ఆగతుం డగుప్రాణేశు నరసి, లేఁత,నగవు దొలఁకెడిప్రియవచనములు పలికి
కనకకలశోదకంబునఁ గాళ్లు గడిగి, చీరచెఱఁగునఁ దడియొత్తె క్షితికుమారి. ౨౧౯

క. తడియొత్తి, బత్తితో న,య్యడుగుందమ్ములను గనుల కద్దికొని ముదం
పడునెడఁద నణఁచిపెట్టుచుఁ, బడఁతీ! యిట్లనియె రామభద్రునితోడన్. ౨౨౦

సీ. సేన లేకుండ వచ్చితి రేల యొంటిగఁ? దెల్లనిగొడుగు రాజిల్ల దేమి?
వాయింప రేటికి వాద్యముల్ పనివాండ్రు? సామంతనృపులు రా రేమి వెంటఁ?
దలను గిరీటంబు ధరియింప రేటికి? మాతంగ మెక్కంగ మఱచినారె?
మణిభూష లెందుచే మై నలరారవు? సంభ్రమంబున రాని సంగతి యెది?
గీ. ఎందుఁబోయియుండి యిట కేఁగుదెంచితి, రెఱుఁగఁ జెప్పఁ డనుడు నినకులుండు
సుందరాననమున మందహాసము తొంకింప నిట్టు లనియె వెలఁదితోడ. ౨౨౧

మ. తరుణీ! నా కలదండకాటవిని దత్తంబయ్యె రాజ్యంబు భూ
వరుచేఁ, దత్పరిపాలనార్థ మయి పోవన్నేఁడు సంసిద్ధుఁడన్,
వరివస్యాకలనన్ మెలంగుచు మదంబా సన్నిధానంబునన్
జరుపంగాఁ దగుఁ గాల మీవు, మృషలన్ భాషింప మే మెప్పుడున్. ౨౨౨

ఉ. నావుడు భీతయై జనకనందిని యుల్లము డిల్లపాటునం
జేవ చెడంగఁ బల్కె నభిషేకము మీ కొనరింపనున్న ధా
త్రీవరుఁ డేటి కీవిపిని విధించెను దండక నుండ? నింతలో
భావము మాఱునంతటియుపద్రవ మేమి పొసంగెఁ దెల్పుఁడీ! ౨౨౩

వ. అనుటయు దినకరకులమండనుండు. ౨౨౪

క. వరమొసఁగెఁ గైకకున్ భూ,వరుఁ డెంతయుఁ బ్రీతి, దాన భరతునకీ రా
జ్యరమాధికారమును నా,కరణ్యవాసంబు వచ్చె నంబుజనేత్రా! ౨౨౫

ఉ. తొయ్యలి! నేను నయ్యెడఁ జతుర్దశవత్సరముల్ వసించు న
ట్లయ్యువతీలలామ తనయాహితుఁగా నను బుద్ధి నెంచి మా
యయ్యను గోరె, నాతఁడు దయాపరుఁడున్ ఋతవాది యాటచే
నియ్యకొనెన్ మఱేమి వచియింపఁగఁ జాలక పాపశంకియై. ౨౨౬

ఆ. అందు కతన దండకాటవి కే నిప్పు, డరుగుచుంటి విఘ్న మాచరింప
వలవ, దనిన భర్తవచనంబులకుఁ బొంగి, ప్రీతి మిగుల భూమిజాత వలికె. ౧౨౭

ఉ. మీ రొనరించు కార్యములు మేకొని చేయుదుఁ గాని విఘ్నముం
గూరుప నెంతునే పలుకఁ గూడునె నేఁ డిటు? నేను ముందుగన్
మీ రటుపైని గానలఁ దమిం జరియింపఁగ నేఁగు టొప్పు, నా
నే రఘువీర! న న్విడిచి యీవొకరుండవె పోఁ దలంచుటల్. ౧౨౮

రాముఁడు సీతతో వనవాసము కష్ట మని చెప్పుట

వ. అనినఁ బ్రీతుండై రామభద్రుండు ప్రియంబువలుకు ప్రియురాలి కిట్లనియె. ౧౨౯

గీ. చకితహరిణీవిలోచన! సమదసింహ, శరభశార్దూలముఖ్యదుష్టమృగపాళి
దర్శనాతిభయంకరదండకాట,వీస్థలికి వెంట నినుఁ గొని వెళ్లు టెట్లు?. ౧౩౦

సీ. ఉగ్రరూపులు మనుష్యులఁ జంపి భక్షించు రాక్షసుల్ గల రందు రాజవదన!
యడరుగూర్చెడువరాహాదు లం దెల్లెడ సంచరించుచునుండుఁ జపలనేత్రి!
శాఖావిమర్దసంజాతదవానలోపద్రవంబులు మెండు పద్మగంధి!
ప్రబలప్రభంజనభగ్నభూజధ్వనుల్ గడు భయప్రదములు పడఁతిమిన్న!
ఆ. నగరమందుఁ బోలె నగపడ రచ్చోట, నరులు గొప్పగొప్ప తరులు దక్క
ఎన్నివిధములం బరీక్షించి చూచినఁ, గాననంబు సౌఖ్యకరముగాదు. ౧౩౧

సీ. భక్షింపఁ గట్వామ్లఫలమూలములె కాని, కలికి! యపూపాదికములు లేవు
శయనింపఁ గఠినపాషాణంబులే కాని, రమణి! శయ్యోపధానములు లేవు
గమనింప భయదదుర్గమమార్గములె కాని, తనుగాత్రి! రమ్యపథములు లేవు
విహరింప ఘోరాటవీవీధులే కాని, తరుణి! క్రీడాపర్వతములు లేవు
గీ. చూడ భయమును గల్పించుచోట్లె కాని, సంతసం బిడుసుప్రదేశములు లేవు
ఆలకింపఁగ దుష్టమృగారవములె కాని తూర్యధ్వనులు లేవు కానలోన. ౧౩౨

ఉ. ఆఁకలి యయ్యె నేని ఫల మైనలభించుట కష్ట మందు, దే
వీ! కనరాదు మార్గ, మొకవేళఁ గనంబడు నేని; ముండ్లతో
నో; కఠినోపలవ్రతతినో; కడుఁగర్కశమై పదంబు ల
స్తోకము పీడవెట్టు నెటు చూచినఁ గష్టమె సంభవించెడిన్. ౧౩౩

క. స్ఫురితాంధకారదుర్గమ, హ్వారసంబాధంబు దంశపరివృతము భయం
కరఝిల్లీసంయుత ము,ర్వర దండకనాఁ బరఁగునరణ్యము, ముదితా! ౧౩౪

వ. మఱియు. ౧౩౫

ఉ. బహువిధదోషపూరితము పంచజనాళి కగమ్య మైన ద
గ్గహనము దూర మెంతయినఁ గాల్నడఁ బోవలె నెండ వాన దు
స్సహ మగుబాధ గూర్పఁ బరిచారిక లెవ్వరు వెంటరారు, ప్ర
త్యహ మిటు లుంట కోర్వఁగలవా? మృగశాబవిలోలలోచనా!. ౧౩౬

క. ఉసురులఁ బాయఁ గలవు రక్కసులం గనుఁగొంటివేనిఁ; గావున మాతో
నసితేక్షణ! రాఁజెల్లదు, వసింపు సౌధమున వదలి వనవాసేచ్ఛన్. ౧౩౭

క. మరల నను శీఘ్రముగ సుందరి! చూడంగలవు దుఃఖితస్త్వవు గాకి
ప్పరుసున నమ్మతిఁ గొని మమ్మరణ్యమున కంపు మన్న నవనీసుతయున్. ౧౩౮

సీత రామునితో భర్త ననుసరించుట భార్యకుఁ బరమధర్మ మని చెప్పుట

వ. భర్తృవచనంబులకు దుఃఖాకులయు నీషద్రోషరూషితయు నై నోరదరుచుండఁ
జండకరవంశ్యున కిట్లనియె. ౧౩౯

సీ. ధర్మజ్ఞుఁడవు దయాదాక్షిణ్యములుగల, ధన్యుఁడ వీ వెట్లు దలఁచినావు
త్వదనన్యయుఁ బతివ్రతయు నదోషయు ధర్మపత్నియు నైన నన్నుబాసిపోవ?
భయపెట్టెదవు చాల భవదీయసన్నిధి, నలరునా కెవఁడు కీ డాచరించు?
మీ రారగింపఁగా మిగిలిన వస్తువు, లమృతతుల్యములు నా కవియ చాలు
ఆ. నాఁకలి దొలఁగింప నధ్వశ్రమము దీర్ప, ముండ్లు ఱాలు దర్భ మొక్క లబ్జ
నయన! నీదువెంట నడచెడి నాకుఁ బూవులపుతోడ దీటు పడయఁగలవు. ౧౪౦

ఉ. కాననమందు మీకు నొకకష్టముఁ గూర్పను దగ్గసాయమున్
బూని యొనర్తు, బాల్యమున భూసురుఁ డొక్కఁ డనాగతాగత
జ్ఞాని ననుం గనుంగొని "వనంబున నుక్కివిజేశుతోడ నీ
కా" నని పల్కెఁ దల్లిపిత మట్ల యగుఁగా నిను వెంబడించెదగా. ౧౪౧

ఆ. విన్నదాన మున్ను విప్రులవలన రామాయణములు పెక్కులందు నొక్క
దానిలోన నేని జానకిగా వీడి శ్రీరాముఁ డరుగ లే దరణ్యమునకు. ౧౪౨

గీ. కాన నీవెంటఁ బఱతెంతు గహనమునకు, నన్నివిధముల నీకుఁ దోడై చరింతు
నన్ను డించిపోయినను బ్రాణములు విడుతు, నిపుడ భవదీయసన్నిధి నింతనిజము.

వ. అనవుడు ప్రాణేశ్వరీమనోనిశ్చయం బెఱింగి తదాగమనంబునఁ గృతాంగీకారుం
డయి రఘుపుంగవుండు. ౧౪౪

సీ. దేవి! యట్టులె యరుదెమ్ము నాతో దండ, కారణ్యసీమకు, హారములును
నాభరణంబులు నయ్యరుంధతి కిమ్ము, ధనము సర్వము విప్రతతి కొసంగు
మిఁక జాగుచేయకు మిపుడ ప్రయాణమ్ము గమ్మని పల్కి లక్ష్మణుని బంపి
వేదసంపన్నులై వెలయు కుటుంబవంతులను సుశీలుర నలఘుమతుల
గీ. విప్రవర్యుల భక్తిరావించి ప్రీతి, నగణితంబగుధనము దివ్యాంబరములు
ధేనుబృందశతంబును దివ్యభూష,ణాళియు నొసంగె గగనచరాళి పొంగ.

క. జనని యనుజ్ఞన్ మెలఁగెడు, పనివాండ్రకుఁ బౌరజానపదులకుఁ దన యిం
టనుగల సేవకులకు బుధ,జనులకు ధన మొసఁగె రామచంద్రుఁ, డహర్ణా!

క. విభుఁ డెంచఁగించినటుల ముని,విభుపత్ని కరుంధతికి సవినయముగ మణి
ప్రభలన్ శోభిల్లెడి నిజ, విభూషణములిచ్చె జనకవిభుసుత, మఱియున్. ౨౪౭

గీ. అపుడు సౌమిత్రి, కౌసల్యకాత్మజనని, నప్పగించి ధనుస్సు చేనంది వచ్చి
యన్నముందఱ నిల్చుండె నట్లు ముగ్వు,రడవికిం బోవ సంసిద్ధులైరి గౌరి!

సీ. శ్యామవర్ణుఁడు సహస్రమనోజసుందర, దేహుండు శ్రీరామదేవుఁ డాత్మ
సతియు సౌమిత్రియు సమ్మోదమునఁ దన,వెంబడిరా,రాజవీధియందుఁ
దిన్నఁగాఁ బోవుచుఁ దన్ను నత్యాశమైఁ గనుఁగొనుచున్న నాగరజనముల
గ్రామవాస్తవ్యులఁ గాంచి సంతోషించి, యాత్మసనూరుచి నఖిలదిశలు
ఆ. వెలుఁగఁజేయు, చంఘ్రివిన్యాసములచేత, భూమిఁ గడుఁబవిత్రముగ నొనర్చు
చేఁగెఁ దండ్రివేడ కింద్రాదిదేవతా,లోక మబ్బ, హరిణలోలనయన! ౨౪౯

వనమున కరుగనున్న సీతారామలక్ష్మణులం జూచి పురజనులు దుఃఖించుట

క. పురజనములు కైకేయీ, వరదానాదికము విన్నవారగుటఁ గడుం
దురపిల్లుచు, భార్యాసో,దరయుతుఁడై వీధి నరుగుదశరథరామున్. ౨౫౦

క. నుతగుణధామున్ వదనవి,జితసోము దినేశవంశశేఖరుఁ గని దుగ
ఖితమతులై యొండొరు లీ,విధమునఁ జెప్పికొని రపుడు విమలాపాంగీ! ౨౫౧

ఉ. అకటకటా ధరాధిపతి యగ్రకుమారుని సత్యసంధు ధూ
తకలుషు రామచంద్రుఁ బ్రియుఁ దక్షిణఁగా విపనాడినాఁడు కా
ముకుఁడయి, యిట్టికానిపనిఁ బూర్వ మొనర్చిరె యెవ్వరైన? వా
నికి నిఁక సత్య మెక్కడిది? నిర్మలవంశము నల్పుఁజెందెఁ జూ. ౨౫౨

ఆ. గీ. క్రూరకర్మురాలుఁ గుచరిత్ర మూఢాత్మ, గాక యున్నఁ గైక కాననమున
కెట్లు లరుగు మనియె హితుఁ బ్రియంకరు మహో,ద్దాము గుణసముద్రు రామభద్రు

క. జనులార! యింక మీఁదట, మన మియ్యెడ నుండఁ జనదు తన్మాపుత్రికతో
ననుజునితో రాముఁడు దాఁ, జనఁగోరినవిపినమునకుఁ జనుట హిత మగున్. ౨౫౪

ఆ. అడవి కేఁగవలసె ననువిచార మొకింత, యేని లేక, సస్మితాననమునఁ
గాలినడకఁ జనెడి కళ్యాణి జానకి, గరిమ నెల్లవారుఁ గాంత్రుగాత. ౨౫౫

సీ. జనకమహారాజతనయ త్రిలోకైక, సుందరి యెపు డైనఁ జూడఁబడెనె
మగవారిచే? నట్టిమానిని యీదిన, మందఱుఁ జూడ ననావృత యయి
నలువురనడుమఁ గాల్నడఁ బోవుచున్నది, రాముఁ డేనుఁగుల గుఱ్ఱముల విడిచి
యరుగుచునున్నవాఁ డటవీస్థలికిఁ బాద, చారియై, యట్టి ప్రశస్తగుణుల
ఆ. సర్వలోకహితుల జానకీరాముల, సుప్రసిద్ధలోకసుందరులను
గనుల కఱవుదీఱఁ గనుఁగొనుఁ డయ్య నేఁ, డిట్టిమంచితరుణ మింక రాదు. ౨౫౬

క. పెనురక్కసి సర్వవినా,శిని దుర్మతి కైక పేర క్షితిని జనించెన్
జనులార! దానిమూలం,బున నింత విపత్తు నేఁడు పుట్టెం గాదే?. ౨౫౭

గీ. పాదచారిణి యై చను పడఁతిఁ గన్న, రామునకు దుఃఖ మాపఁగారాని దగును
నిందు దైవము బలవంత మెంచిచూడఁ, దొడరు పురుషప్రయత్నంబు దుర్బలంబు.

దుఃఖితులైన ప్రజల వామదేవమహర్షి యూఱడించుట.

క. అని సజ్జనములు దీనా,ననులై శోకమున నుండ నడుమ నిలిచి యి
ట్లనె వామదేవనామక, మునిచంద్రుఁడు తత్త్వవాక్యముల వారు వినన్. ౨౫౯

సీ. శ్రీరామునకుఁ గాని సీతకుఁగాని శో,కింపకుఁ డే నెఱిఁగించు నట్టి
పరమరహస్యంబు పాటించి వినుఁడయ్య, రాఘవుం డాదినారాయణుండు
పరుఁడు విష్ణువు తత్ప్రభావ మమేయ మీ,జానకి లక్ష్మి నా జగతిఁ బరఁగు
యోగమాయ యటంచునూహింపుఁ డాత్మల, లక్ష్మణుం డహిపతి లలితభంగి
గీ. నమ్మహాత్మువెంట నిత్తఱి నరుగుచున్న
వాఁడు మాయాగుణంబులఁ గూడి తత్త
దాకృతివిశేషములు గల యతఁడువోలెఁ
దోఁచుచున్నాఁడు రాముండు ధ్రువము సుండి!. ౨౬౦

చ. ఇతఁడె రజోగుణంబు గొని యెల్లజగంబుల సృష్టిఁ జేయుచున్
శతధృతినాఁగఁ బిల్వఁబడు, సత్వగుణాన్వితుఁడై జగత్త్రయిన్
హితముగ నేలు విష్ణు వన నీతఁడె, రుద్రుఁ డనం దమోగుణా
వృతుఁ డయి యంతమందున దహించుఁ బ్రపంచము నెల్ల నీతఁడే. ౨౬౧

క. మును మత్స్యరూపము౦ గొని, మనువుఁ వైవస్వతుని సముంచితగతి నో
డను నిల్పి, ప్రళయ మంతము, గనువఱకుం గాచినట్టి ఘనుఁ డితఁడే చూఁడీ!

సీ. కడలిఁ ద్రచ్చెడువేళ నడఁగిన కవ్వంపుఁ,గొండను మోచినకూర్మ మితఁడె
ప్రళయంబునఁ రసాతలగతక్షితిఁ గోఱ, కొన లేవనెత్తినఘోణి యితఁడె
ఖరనఖంబుల హేమకశిపు వధించి త,చ్ఛిశువు నేలినసరసింహుఁ డితఁడె
యాచించి బలిదైత్యు నణఁచి స్వర్గము శత,మన్యున కిడినవామనుఁ డితండె
గీ. కార్తవీర్యార్జునాదిదుఃక్షత్రియులను, గండ్రగొడ్డఁట నఱికి భూకాంత కైన
భారమును దొలఁగించినపరశురాముఁ, డీ మహామహుఁడే చూండి! యింతనిజము.

ఉ. ఆదనుజారి సర్వభువనాధిపుఁడే యిపు డిట్లు రాముఁ డై
మేదిని జన్మ మొందె, కడిమిఁ సురవైరుల రావణాదులఁ
ఛేద మొనర్పఁగా గహనసీమకుఁ బోవుచునున్నవాఁడు బ్ర
హ్మాదిసుపర్వసంఘములు హర్షమునొంద జగచ్ఛుభార్థమై. ౨౬౪

క. దురితాత్ముఁ డైన దశముఖుఁ, బొరిగొన మానవుఁడు దక్కఁ బోల రితరు లె
వ్వరుఁ, దత్కారణమున నిక్కరణిఁ మనుజాకృతిని జగతి నుదయించెన్. ౨౬౫

క. మనుజపతిగూడ పూర్వము, తనయునిఁగా విష్ణుఁ బడయుతలఁపునఁ దపముం
బనిఁగొని చేసినకతనఁ, వనజాక్షుఁడు పుట్టె పుత్రభావము మీఱఁ. ౨౬౬

క. శ్రీరాముని మీ రిఁకపై, వేఱుగ భావింపవలదు విష్ణుఁడె, క్రతుభు
గ్వైరుల పేరడఁపఁగఁ దో,డై రా లక్ష్మణుఁడు కాన కరిగెడు నిపుడే. ౨౬౭

గీ. సీత జగముల నన్నింటి సృష్టిసేసి, పెంచి హరియించునట్టి శ్రీవిష్ణుమాయ
కాన దీనికి భూపతి గాని కైక,గాని కారకు లిసుమంతయైనఁ గారు. ౨౬౮

గీ. నారదుఁడు నిన్న ధారుణీభార మడఁచు, కొఱకుఁగా ముచ్చటించె దాశరథితోడ
"దండకకు తేపు పో నుంటిఁ దథ్య" మనుచుఁ, బలికె నాతండు దేవతపస్విఁ గూర్చి.

క. కావున సీతారాముల,కై విలపింపంగ వలదు కడు బాలిశులై,
కావించి జగద్ధితమును, వే వత్తురు వారులార! వెఱ పిం కేలా? ౨౭౦

ఉ. ఎవ్వరు రామ! రామ! యని యెప్డు స్మరించెద; రట్టి వారికిఁ
ద వ్వగు మృత్యుభీతి, భువనంబున నెట్టిభయంబు లేనియుఁ
జివ్వనఁ బాఱు; నట్టి మహనీయుఁడు రాముఁడు దుఃఖపాత్రుఁ డౌ
టెవ్విధి సంభవించుఁ? దమ మేర్పడునే రవియందు నెన్నఁడేన్. ౨౭౧

క. కలియందు రామనామము, వలనె యలవడును ముక్తి, పనుపడ దితరం
బులఁ గాన రాత్రులుం బవళులు భక్తి భజింపుఁ డఖిలలోకేశు నెదన్. ౨౭౨

సీ. పరమేశ్వరుఁడు జగద్భర్త మాయామానుషస్వరూపంబున జనన మంది
యనుకరించెడిని లోకాచారమును, భక్త, భజనార్థ మలపంక్తివదనుఁ జంపు
కొఱకును, దశరథుకోర్కెఁ దీర్పఁగ, దీని, నవనిజా రామరహస్య మెపుడుఁ
జింతించువానికిఁ జేకుఱు దృఢభక్తి, జ్ఞానపూర్వముగ రాఘవునియందు.
గీ. జానకీజానికిం బ్రియు లైనవారు, గాన మీ కెఱిఁగించితి దీని మీరు
తదితరులకడఁ దెలుపక దాఁచుఁ డనుచుఁ, జెప్పి చనె వామదేవుఁడు, స్ఫీతగాత్రి!

వ. వామదేవుని వాక్యంబులచే నందున్న ధరాబృందారకులును, దక్కువారును, శ్రీరా
ముని జగద్వ్యాపకుం డగుహరినిగా నెఱింగి మనంబులం గల సందేహగ్రంధిని బాసి
తదేకచిత్తులై ధ్యానించుచుండిరి. రఘూత్తముండు భార్యానుజోపేతుండై యని
వారితగమనంబున జనకునిభవనంబులోనికిం జని కైకం దిలకించి యిట్లనియె. ౨౭౪

గీ. అమ్మ! నీకుఁ బ్రియ మ్మగునడవి కేఁగఁ, బయనమై వచ్చినాము, భూపతి జనకుఁడు
పోయిరం డనిచెప్పినఁ బోవువార, మనుడు మదిలోన సంతోష మంది కైక. ౨౭౫

కైకపనుపున రాములు నారచీరలు ధరించుట

సీ. సరగున లేచి మూగురకు స్వయమ్ముగ, నారచీర లొసంగె వేఱువేఱ
రామభద్రుండును సౌమిత్రియును నంతఁ, గట్టుబట్టలు వీడి కాననమునఁ
బుట్టినవల్కలంబులను ధరించిరి, జానకి మాత్రము వానిఁ గట్టు
కొనునట్టివిధ మెఱుంగని దొటఁ జేసి కై, కొని, సిగ్గుచే రాఘవుని ముఖంబు
ఆ. పాఱఁజూడ నారచీర దాఁ జేకొని, మెలఁతతొంటిచీరమీఁదఁ జుట్టె
నధిపుభార్యలంద ఱది చూచి కలయంగ, నేడ్చి రొక్కపెట్ట నిందువదన! ౨౭౬

వ. వసిష్ఠుఁ డారోదనధ్వని విని క్రోధమునఁ గైకం జూచి బెదరించుచు. ౨౭౭

గీ. రామునిం గాదె దుర్మార్గురాల! నీవు, వనమునకుఁ బంపు నట్లుగా వరముఁ గొంటి?
వౌర? భూపుత్రి కేటికి నారచీర, లిచ్చితివి, నిన్నెచెఱచు నీ కుచ్చితంబు. ౨౭౮

చ. పతివ్రత యాట సీత కడుభక్తి నిజేశుని వెంబడించు నేఁ
సతమును దివ్యవస్త్రముల సమ్మతిఁ గట్టి విభూషణాళి భూ
షిత యయి భర్తకుఁ విపినసీమఁ జరింపఁగ నౌపథిశ్రమఁ
హితమతిఁ బాపి సమ్మదము నెక్కుడు గూర్చెడిఁ గాత, దుర్మతీ! ౨౭౯

## రాముఁడు సీతాలక్ష్మణులతో నడవికిఁ బోవుట

చ. అనుడు ధరాధినాథుఁ డపు డయ్యెడ నున్న సుమంత్రుఁ జూచి చ
య్యన నరదమ్ముఁ దెమ్ము మహితాత్ములు వీరలు తాపసప్రియుల్
వనమున కేఁగువార లని వారిఁ గనుంగొని వంత నెంతయుఁ
గనుఁగవ బాష్పబిందువులు గ్రమ్మఁగ నేడ్చెను వ్రాలి నేలపై. ౨౮౦

గీ. అంత మైథిలి రథ మెక్కె నతిరయమున, రామభద్రుండు గనుచుండ, రాముఁ డవల
వనఁట మునిఁగినతండ్రికి భక్తితోఁ బ్రదక్షిణము సేసి చనియె స్యందనముపైకి.

క. తూణీరంబులు రెండు కృపాణంబులు రెండు రెండు పటుచాపంబుల్
రాణమెయి హస్తములఁ గొని, యేణాక్షీ! సుమిత్రి పట్టి యెక్కె రథంబున్. ౨౮౨

వ. ఇవ్విధంబున రథాధిష్ఠితులై తేరు పఱపు మని సారథిని బ్రేరేచుటయు. ౨౮౩

క. "తోలకు తోలకు మొకక్షణకాలము నిల్పు" మని రాజు కాంక్షం బలికెన్
"దోలుము తోలు"మనుచు సీతాలోలుఁడు తఱిమె, రథ మతఁడు పోనిచ్చెన్.

మ. చన, దూరంబుగ జానకీవిభుఁడు, మూర్ఛం జెంది భూభర్త బో
రనఁ గూలెన్ భువి, నట్టివేళఁ బురివారల్, పిన్నలుం బెద్దలున్
ఘను లావృద్ధమహీసురుల్ రథము వెంటం బోవఁగాఁ జొచ్చి "హో
యనఘా! రాఘవ! నిల్వు నిల్వు, మని దీనాలాపముల్ వల్కుచున్. ౨౮౪

గీ. వివశుఁడై రాజు పరిపరివిధుల నేడ్చి, రామమాత యాకౌసల్యధామమునకు
నన్నుఁ గొనిచనుఁ డీస్మశాననిభ మైన, పాడుగృహమున నిల్చి నేఁ బ్రదుకఁ జాల!

వ. అని భృత్యులం జీరి మఱియు వారితో ని ట్లనియె. ౨౮౫

సీ. అచ్చట నైనచో నతిదుఃఖితుఁడ నగు, నాకు నింకను గొన్నినాళ్లు బ్రతికి
యుంట తటస్థించు, నూహింప రామవిరహితుఁడుగా దశరథుఁడు సేయఁ
బడె విధిచేత, నోభటులార! యిమ్మేన నిముసమేన్ బ్రాణముల్ నిలువఁ బోవు
శీఘ్రము నన్నందుఁ జేర్చుఁడు నాఁగ వారటు సేసి రంతట నవనివిభుఁడు

ఆ. పెద్దభార్య యిలు ప్రవేశించుతోడనె, నెక్కొనంగ మూర్ఛ నేలఁ గూలి
చాలకాలమునకు సంజ్ఞాన్వితుం డయి, యూరకుండె నేమియును బలుకక. ౨౮౬

చ. సతి! రఘురాముఁ డంతఁ దమసాతటినీ తట మొంది, యయ్యెడం
దతసుఖియై జగద్విభుఁ డతం డొకవృక్షముక్రింద సీతతో

హితముగ నిద్ర వోయె భుజియింపక నీరముఁ ద్రావి, లక్ష్మణుం
డతిహితుఁడై సుమంత్రయుతుఁడై విలు దాలిచి కాచు చుండఁగన్. ౨౮౯

గీ. ధర్మ మెఱిఁగినవాఁడును ధర్మబుద్ధి, యైనసౌమిత్రి యన్న న ట్లరయు చుండ
నగరమునను వసించుజనంబు లెల్ల,వచ్చి రఘుపుంగవుని సమీపమున నిలిచి.

క. మరలక రాము నయోధ్యకు, నరగునఁ గొనిపోవ మనము శక్తుల మైనన్
సరి; లేనిమొసల వనమున, కరుగుద మి మ్మహితుతోడ నని స్థిరమతులై. ౨౯౧

వ. ఉండి రంత. ౨౯౨

ఆ. వారినిశ్చయంబు శ్రీరాముఁ డెఱిఁగి యా,శ్చర్య మంది "పురికిఁ జనను నేను
వీరు వనఁటఁ గుడుచువా" రని సారథి,తోడ నిట్టులనియెఁ దోయజాక్షి!. ౨౯౩

చ. మన మిపు డేఁగఁగావలె సుమంత్ర! రథమ్మును దెమ్ము నాఁ దదా
జ్ఞను నతఁ డాశతాంగమును సత్వరమే తురగాళితోడఁ గూ
ర్చిన ముగు రెక్కి పట్టణముచేరువగా నొకకొంతదూర మేఁ
గినపిదప వనాధ్వమునఁ గీడ్పడ కొయ్యనఁ బోయి రంగనా!. ౨౯౪

ఉ. పౌరులు లేచి ప్రొద్దుటను బంకజమిత్రకులాబ్ధిసోమునిన్
శ్రీరఘురాముఁ గానక విశేషముగా విలపించి యూర? యే
దారిని బోయెనో;యనుచుఁ దద్రథనేమిగతాధ్వ మప్డు తా
రారయుచుం గ్రమమ్ముగఁ బురాగతులై నిరతమ్ము నాత్మలన్. ౨౯౫

వ. సీతాసమేతుం డగురామభద్రు ధ్యానించుచుండిరి. ౨౯౬

సీ. అట సుమంత్రుండును సాదరమ్ముగఁ దేరు, వడివడి నడపె రాముఁడు ధరాత్మ
జాసంయుతమ్ముగ సర్వసమృద్ధముల్, జనపదంబులు సూచుచును జని చని
శృంగబేరాఖ్యపురికి సమీపంబునఁ, దనరుగంగాతీరమునకుఁ జేరి
నయనపర్వముగ న న్నదిని విలోకించి, మ్రొక్కి సమంత్రకంబుగ మునింగి
గీ. చిత్త మానందమునఁ దేల శింశుపావ,నీజమూలంబునందుఁ బేరోజ రాఘ
వుఁడు సమాసీనుఁ డయ్యె, నప్పుడు మహేంద్ర, ముఖ్యనిర్జరసమితి ప్రమోద మొంద.

గుహుఁడు శ్రీరాముని సందర్శించుట

వ. అంత గుహుండు రామాగమనమహోత్సవము స్వీయజనంబులవలన విని చెలి
కాఁడును ప్రభువును నగురామభద్రుం జూచుతలంపున భక్తియుక్తుఁడై ఫలపుష్పా
దులం దీసికొనివచ్చి తదగ్రభూమి నునిచి దండంబు వదువున ధరణిపయిం బడి

నమస్కరించిన జానకీవల్లభుం డతని సత్వరంబు లేవనెత్తి యాలింగనం బొసంగు టయు గుహుండు కుశలం బడిగి చేమోడ్చు గీలించి యిట్లనె. ౨౯౮

ఉ. ధన్యుఁడ నైతి నే నిపుడు, తథ్యము నాదు కిరాతజన్మ మున్
ధన్యతఁ గాంచె, నీతనువుఁ దాఁకి కరమ్ము మద మొందితిన్ జగ
న్మాన్య! రఘుప్రవీర! భువనత్రయపావన! నిన్నుఁ బోల లే
రన్యులు; కింకరుండ నను సాదరదృష్టిని జూడ వేఁడెదన్. ౨౯౯

ఆ. బోయదొరతనంబు నీయధీనము సుమ్ము, యిచట నిల్చి మమ్ము నేలు మింక
రమ్ము పోవుదము పురమ్మున, కస్మద్గృహమ్ముగూడఁ బావనమ్మొనర్పు. 300

క. స్వాదువు లైతగుఫలమూ, లాదులఁ గొని తెచ్చితిని బ్రియంబునఁ గొనుమీ
నీదాసుఁడ నగునన్ను మ,హీదుహితృప్రియ! యనుగ్రహింపఁగ వలయున్. 30౧

చ. అనవుడు శృంగబేరనగరాధిపుతోడ ధరాత్మజావిభుం
డనియెఁ బ్రమోద మంది, సఖుఁడా! విను నా వచనంబు గ్రామ మై
నను గృహ మైనఁ ద్రొక్కఁ బదునాలుగువత్సరముల్ గతించుదాఁ
కను, బెరవారు దెచ్చినవి గైకొనఁజాల ఫలాదు లేమియున్. 30౨

క. ఈ నీ రాజ్యం బస్మద, ధీనమ నీ వనఁగ నా కతిప్రియుఁడవు మే
ధానిధివి సఖుఁడ విది నిజ,మా నని వచియించి దశరథాత్మజుఁ డటుపై. 303

గీ. మఱ్ఱిపాలు దెప్పించి లక్ష్మణసమేత,ముగ జటామండలం బతిమోదముగను
శిరమునం జక్క బంధించె గిరికుమారి!, దైవచిత్ర మదేమని తలఁప వచ్చు;

సీ. తదుపరి సలిలమ్ము ద్రావి, యంగనతోడ, ననుజుండు దర్భలు నాకు లెల్లఁ
గైకొని తెచ్చి చక్కఁగఁ బఱచినయట్టి పక్కపై నివసించెఁ బత్తనమున
మును మేడమీఁదఁ బోలెను, నందె నిదురించెఁ బ్రియురాలిచే సంస్కరింపఁబడిన
పాన్పునం దెట్లట్ల, పార్వతి! తర్వాత బాణతూణీరచాపాన్వితుండు
గీ. ధైర్యశాలి సౌమిత్రి హస్తమున ధనువుఁ,గొని ధనుర్ధరుఁ డైయున్న గుహునితోడ
ననతిదూరమునం దుండి యన్నిదిశలఁ, గనుఁగొనుచు నగ్రజాతునిఁ గాచుచుండె.

గుహుఁడు లక్ష్మణునితో రామవిషయికవిచారమును దెలుపుట

వ. ఆసమయంబున గుహుండు నిద్రితుం డగు రామభద్రుం దిలకించి తదవస్థం దలపోసి బాష్పవారిపరిప్లుతుండై సవినయంబుగ సౌమిత్రి కిట్లనియె. 30౬

ఉ. తమ్ముఁడ, చూచితే? విమలధామమునం బసమించుపైఁడి మం
చమ్మున మార్దవం బెనయు శయ్యఁ బరుండెడిభోగి రాఘవుం
డిమ్మెయి దర్భపత్రతతి నేర్చి యమర్చినయిట్టిపర్ణత
ల్పమ్మున నిద్ర వోయెడు నిలాప్రియపుత్రికతోడ, నక్కటా. ౩౦౭

క. శ్రీరాముని దుఃఖమునకుఁ, గారణముగ దైవమహిమఁ గల్పింపఁ బడెన్
ధీరాత్మ కైక, మంథర, పోరున నిటువంటిపాపమున కొడిగట్టెన్. ౩౦౮

క. ఎంతకు నేనియుఁ దగుజగ,జంత గదా కైక; యేమి సలుపనో; సీతా
కాంతునిఁ గాంతామణితోఁ, గాంతారంబునకుఁ బంపెఁ గఠినాత్మికయై. ౩౦౯

లక్ష్మణుఁడు గుహునకుఁ బరమార్థ మెఱింగించుట

క. అది విని లక్ష్మణుఁ డిట్లను, నిది యేటివిధంబు నీకు హిత మెఱిఁగింతున్
బదిలముగ వినుము సుఖదుఃఖదశల నొకనికి మఱొకఁడు కారణ మగునే? ౩౧౦

క. జనునకు సుఖదుఃఖంబులు, మును జేసిన కర్మమునన పొడముచు నుండున్
విను మొరులు గారు కర్తలు, ఘనమతు లిట్లనఁగ వింటిఁ గైవర్తపతీ!. ౩౧౧

చ. ధరణి, సుఖాసుఖంబులకు దాత మ ఱెవ్వఁడుఁ గాఁడు, భ్రాంతిమైఁ
బరుఁ డిడుచుండె నంచుఁ దలఁపం దగ దెన్నఁడు గాని దీని నే
నె రహి నొనర్చుచుంటి" నని యెంచుట యెల్ల వృథాభిమాన మం
దఱు నిజకర్మపుంజ మనుదారఁపుఁగట్టులఁ జిక్కి యుండుటన్. ౩౧౨

సీ. ఉపకారియును మిత్రుఁ డపకారియును నుదా,సీనుండు ద్వేషింపఁ జెల్లువాఁడుఁ
జుట్టంబు మధ్యస్థుఁ డిట్టివారలు గల, రైన వీ రెదియుఁ జేయంగ లేరు
వారలయందుఁ బెంపారు సుహృత్త్వాది, కములఁ గల్గించెడికర్మమె స్వయ
ముగఁ జేయుచు సమస్తమును, వారికడ నట్లు,దెలియంగఁ బడుచున్న దలఘుచరిత!
గీ. భువి స్వకర్మవశుం డగుపూరుషుండు, సుఖము దుఃఖ మెయ్యది యెట్లు సొప్పడు నది
యెల్లఁ దద్వశమున భుజియించి స్వస్థ,చిత్తుఁడై యుండవలయుఁ గొంచెమును బోదు.

వ. నాకు భోగప్రాప్తియం దిష్టంబును, భోగవివర్జనమునం దనిష్టంబును లేదు. దుఃఖము వచ్చినను, సుఖము రాకున్నను, వంత గొనక యొక్కచందంబున నుండుఁ గాని భోగవశ్యుఁడను గాను. ఏదేశమున నేకాలమునం దెందువలన నెవ్వానిచే శుభాశుభ రూప మగుకర్మ మాచరింపఁబడినదో; యా దేశకాలములయం దాకర్మఫలం బాతని కనుభవింపక తప్పదు. ౩౧౪

గీ. శుభఫలము లైన లేక యశుభఫలంబు, లైన నరునకుఁ బ్రాప్తించునపుడు హర్ష
శోకములుఁ జెందఁగా రాదు, సురలకైనఁ, దప్పఁగారాదు విధికల్పితం బఖిలము.

సీ. పుణ్యపాపంబులఁ బుట్టిన దేహంబు, సుఖదుఃఖయుతము, విశుద్ధచరిత!
కావున దేహంబు గలయంతవట్టును, సుఖదుఃఖములఁ బొందుచుండు నరుఁడు
ప్రాణికోటికి నహోరాత్రము లట్లు సుఖంబు వేఁగుమీఁద దుఃఖంబు, దుఃఖ
మేఁగిన సుఖమును నెప మీఁక కలిగెడు, నివిరెండు దాఁటరానివి తలంప
గీ. సుఖము నడుమ దుఃఖంబును సుఖము దుఃఖ,మధ్యమున నుండు నెప్డు దేహమునకు రెండు
సలిలమును గర్దమంబును గలిసి మెలిసి, వర్తిలెడిమాడ్కి, నోయి కైవర్తనాథ!.

వ. ఆకారణంబునం జేసి. ౩౧౭

క. శిష్టాచారులు జ్ఞాన వి,శిష్టులు సకలంబు మిథ్య చెల్లరె? యని సం
తుష్టాసంతుష్టులు గా, రిష్టానిష్టోపపత్తి యెడ ధైర్యమునన్. ౩౧౮

చ. అని గుహునకు సుమిత్రసుతుఁ డయ్యెడ నీగతి మాటలాడు చుం
డ నభము నిర్మలం బయి కనంబడె, నంత రఘూత్తముండు మే
ల్కని సమయంబునందు సలిలంబును ముట్టి సమాహితాత్ముఁడై
కని గుహు, "గట్టియోడఁ గొని గ్రక్కున రమ్మిటకున్ సఖా" యనెన్. ౩౧౯

గుహుఁడు రాములను గంగానదిని దాఁటించుట

ఉ. ఆవిభువాక్యమున్ విని స్వయంబుగ బోయలతోఁడు లక్షణ
శ్రీ విలసిల్లునట్టిదియుఁ జేవ గలట్టిది మంజులంబు నౌ
నావను దెచ్చి స్వామి! రఘునాథ! భవద్వచనానుసారినై
యీవిధి నుంటి దీనిపయి నెక్కుము తమ్మునితోడఁ గొమ్మతోన్. ౩౨౦

క. నేనే చుట్టంబులతో, నీ నది దాఁటింతు నిన్ను నిపు డెచ్చరికం
బూని, యని గుహుఁడు వలుకఁగ, నౌ నని యెక్కించె శుభగుణాన్విత సీతన్.

ఉ. తానును నావ నెక్కె రఘుతల్లజుఁ డగ్గుహు చేతులూఁది, శ
ర్వాణిరో! లక్ష్మణుడును శరంబులుఁ జాపము లెల్ల ముందు గాఁ
బైనిడి యెక్కె నౌక నటుపై, గుహుఁ డంతట బంధురాజితోఁ
దానె స్వయమ్ముగా నదిని దాఁటఁగఁ జేసెను వారిమూఁగురన్. ౩౨౧

క. గంగామధ్యమునకు నరు,గంగాఁ గల, మవనిజాత గనుఁగొని నుతి సే
యం గడఁగె నిత్తెఱంగున, రంగత్తుంగోరుబహుతరంగన్ గంగన్. ౩౨౩

సీ. దేవి! గంగానది! దివ్యస్వరూపిణి! కైకొను మిదె నమస్కార మమ్మ!
పదునాలుగేఁడులు వనవాస మొనరించి, మరలి శ్రీరామలక్ష్మణులతోడ
వచ్చినదాన నై వరుస సురాపల,లోపహారముల బహువిధబలులఁ
బూజింతు నాదరంబున ని న్ననుచు, నిట్లు,చెప్పుచు వారలు చేరి రవలి
ఆ. తీరమునకు నదిని దిన్నఁగ దాఁటి, య,వ్వేళ గుహుఁడు, నీదువెంట వత్తు
నానతిమ్ము లేనిచో నేను బ్రాణముల్, విడుతు ననుచు రామవిభునిఁ బలికె. ౩౨౮

క. అనవుడు సీతావల్లభుఁ,డనుఁ బదునా ల్గేండ్లు దండకారణ్యాతలం
బునఁ గడపి మరలివచ్చెద, ననుమానము మాను మిది యథార్థము సఖుఁడా!.

ఉ. నా వచనం బబద్ధమగునా? యని భర్తునిఁ గౌఁగిలించి సం
భావనసేసి పల్మఱుఁ, గృపామతితో మరలించె నప్డు సీ
తావరుఁ, డేమిచెప్పుదు; నతండును మిక్కిలి దుఃఖితప్తుఁడై
పోవఁగలేక పోయె గిరిపుత్రి! మరల్చుచు దృష్టి నింటికిన్. ౩౨౯

వ. అంత నచ్చట వారుమువ్వురును బవిత్ర మగు నొక్కమృగంబును వధించి పక్వమగు నట్లుసేసి నిర్వర్తితవైశ్వదేవదేవతాహోములై భుజించి, వృక్షమ్ముక్రింద నిద్రించి యారాత్రియంతయు సుఖమ్ముగఁ బుచ్చి, రనంతరము సీతాకాంతుండు భార్యానుజోపేతమ్ముగ భరద్వాజాశ్రమంబున కరిగి వెలుపల నిలిచి యం దొక్కవటువు దృగ్గోచరుం డగుటయు, బాలుఁడా! దశరథపుత్రుం డగురాముండు సీతాలక్ష్మణయుతుండై యరుదెంచి యాశ్రమంబునకు వెలుపల నున్నాఁ డని మునిసన్నిధానంబున నివేదింపు మనుడుఁ దద్వచనంబున వాఁ డతిత్వరితంబుగఁ బోయి ఋషివృషభు నంఘ్రులం బడి మ్రొక్కి యవ్విధం బెఱింగించె నప్పు డత్తాపసోత్తముండును.

### రాముఁడు భరద్వాజునిచేఁ బూజితుం డగుట

సీ. అతిరయంబున లేచి యర్ఘ్యపాద్యాదులఁ, గైకొనివచ్చి రాఘవుని కడకు
ననుజసమేతుఁ డై యలరువానిని గాంచి, విధ్యుక్తపూజ గావించి పలికె
రాజీవలోచన! రామ! నాపర్ణశాలకు దయసేయుము లలితభంగిఁ,
బాదరజస్సునఁ బరమపావనముగ, నొనరింపుమీ యని యుటజమునకుఁ
గీ. దీసికొనిపోయి తగఁ బూజసేసి భక్తి, నుత్తమాతిథిసత్కార మొగి నొనర్చి
మ త్తపము పూర్ణ మయ్యె యుష్మదసమాన,సంగతిని జేసి శ్రీరామచంద్ర! నేఁడు.

క. జరిగినదియు నీకమీఁదం, జరుగంగాఁ బోవు నదియు సకలంబును నీ
చరితము నాకుం దెలియును, బరమాత్మవుగా నెఱుంగఁ బడితివి నాచేన్. ౩౩౦

ఉ. ఎందుకు బ్రహ్మ వేఁడ మును పీ ధరణీస్థలి నుద్భవించితో;
యెందులకో వనోర్వి వసియించుటయు; ముం దిఁక నేమి చేయుదో;
సందియ మేల? య వ్విధము సర్వ మెఱుంగుదు నీయుపాసనం
బొందినజ్ఞానదృష్టి, రఘుపుంగవ! వేఱుగఁ జెప్ప నేటికిన్. ౩౩౦

క. నినుఁ బ్రకృతికంటెఁ బరునిన్, ఘనుని గకుత్థాన్వయు నిటు గాంచెడిపుణ్యం
బున కర్హుఁడ నైతిం గావున నేను గృతార్థుఁడను బ్రభూ! యని పలికెన్. ౩౩౧

రాముఁడు వాల్మీకిమునీంద్రు నాశ్రమమునకుఁ బోవుట

వ. అంత సీతాలక్ష్మణసమేతంబుగ శ్రీరాముండు భరద్వాజునకుఁ బ్రణామంబు గావించి, స్వామీ! మేము క్షత్రియజాతిం బొడమినవారము మీచే ననుగ్రహింపఁ దగినవార మని పలికె. ఇట్లు పరస్పరసంభాషణంబులం బ్రొద్దు పుచ్చుచు నారాత్రి య మ్మహామహుని సవిధంబునం గడపి, ప్రాతఃకాలమున మునిబాలురచే సమకూర్పఁబడినయుడుపంబున యమునానదిని దాఁటి భరద్వాజదృష్టమార్గంబున మునిముఖ్యుం డగువాల్మీకి యాశ్రమం బున్నచిత్రకూటాచలంబుఁ జేరి, యయ్యెడ ఋషిసంకులంబును నానామృగద్విజాకీర్ణంబును నిత్యపుష్పఫలాకులంబును బథిశ్రమాపనోదనసమర్థంబును నగు నాశ్రమంబును డాయం బోయి, యందు సమాసీనుఁడై యున్నతపస్సంపన్ను పదనాళీకంబులకుఁ శిరంబు సోఁక భార్యానుజోపేతుఁడై మ్రొక్కుటయు. ౩౩౨

సీ. లోకసుందరుని లక్ష్మీకాంతు జానకీ, లక్ష్మణోపేతుని లలితగాత్రు
మునివృత్తిసదను జటాముకుటమండితు హితుఁ గందర్పసన్నిభాకారు ధీరుఁ
గమనీయపంకజేక్షణు శుభలక్షణు రాముని న త్తపోరాశి చూచెఁ,
జూచిన తోడన సుందరీమణి! విస్మయానిమిషాక్షుఁడై యట్టె లేచి
గీ. కౌఁగిటం జేర్చి హర్షాశ్రుకలితదృష్టి, నాదరంబును భక్తియు మేదురముగ
నర్ఘ్యపాద్యాదికముల శాస్త్రానుసరణిఁ, బూజ గావించె నా లోకపూజితునకు.

వ. మఱియు. ౩౩౪

గీ. మధురఫలమూలముల భుజింపంగఁ బెట్టి
యమ్మునీశ్వరుఁ డుపలాలనమ్ము సేయ
నలరి రఘుపుంగవుఁడు వినయంబు గదురఁ
గరయుగంబును మోడ్చి యిక్కరణిఁ బలికె. ౩౩౫

రాముఁడు నివాసస్థలంబుఁ జూపు మని వాల్మీకి నర్థించుట

ఉ. దండక కేము వచ్చితిమి తండ్రి యనుజ్ఞఁ బురస్కరించు కొం
చొం డిఁక నేల? మీ రెఱింగియుండుట హేతువుఁ జెప్పనైతి, నే
నుండ సుఖాస్పదం బయిన యొక్కప్రదేశముఁ జూపు మయ్య! యీ
యండజయానతోఁ గలిసి యయ్యెడఁ బుచ్చెదఁ గొంతకాలమున్. ౩౩౬

వ. అనుడు నమ్మాట కమ్మునివరేణ్యుండు సస్మితాననుండై యిట్లనియె. ౩౩౭

వాల్మీకి రామున కుండఁదగినతావులను జెప్పుట

గీ. అఖిలలోకంబులకు శ్రేష్ఠ మగునివాస, సదన మీవె మహాత్మ! నిస్సంశయంబు
నీకు నెల్లభూతంబులు నిలయము లగుఁ, గాన సాధారణం బగుస్థాన మిద్ది. ౩౩౮

వ. "సీతాసమేతుండ నగు నా" కని విశేషస్థానంబు నడుగుటం జేసి తద్విషయమున
నీ కెద్ది నియత మైనగృహమో దానిం జెప్పెద నవధరింపుము. ౩౩౯

క. శాంతులు సమదృక్కులు గత,జంతుద్వేషులుఁ ద్వదీయచరణాబ్జంబుల్
సంతతము గొలుచువారల, స్వాంతము నీ కుండఁదగినసదనము, రామా!. ౩౪౦

క. ధర్మ మధర్మము లొనగు, కర్మములఁ ద్యజించి జనకకన్యాసహితున్,
నిర్మలు నిన్ను భజించెడి, ధార్మికుహృదయంబు సౌఖ్యధామము, స్వామీ!. ౩౪౧

క. నిను శరణముగాఁ గొని యే,మనుజుఁడు భవనీయమహితమంత్రజపంబుం
దనివినఁ జేయు నాతని, మనోఽంబుజము నీకు యోగ్యమందిర మనఘా!. ౩౪౨

క. నేను మఱి నాది యను నె,వ్వానికి నీ రెంచు లేవొ; వాంఛారహితుం
డే నరుఁడొ; వాని డెందము, జా నగుమందిరము నీకు జానకిరామా!. ౩౪౩

క. రాగద్వేషవివర్జితు, లాగమపారగులు గళితహంకారులు నౌ
యోగులచిత్తాంభోజము, బాగైననివాసభూమి భవహర! రామా! ౩౪౪

క. వేలిమియు మంటిగడ్డయు, బోలును సమబుద్ధితో నరయువారును ధీ
శాలు లగువారి డెందము, లీలాసౌధంబు మైథిలీప్రియ! నీకున్. ౩౪౫

గీ. మనము బుద్ధియు నీకు సమర్పణంబు, సేసి సతతంబు సంతుష్టిఁ జెందువారుఁ
ద్వత్పరిత్యక్తకర్ములు ధన్యు లైన, వారిహృదయంబు యుష్మద్విహారగృహము.

గీ. అప్రియముఁ బొంది ద్వేషింప, కల్ల ప్రియము
నంది సంతోషపడక, "మాయామయంబు

సర్వ" మని నమ్మి నిను గొల్చుజనునిమనము
నీ యునికి కర్హ మగునట్టినెలవు రామ !. 3౮౭

సీ. జన్మంబుమొదలగుషడ్వికారంబులఁ, దనయందుఁ గానక తనువునందుఁ
గాంచు నే మనుజుఁ, డాఁకలిని దప్పిని బ్రాణ, మందును, సుఖము భయంబు దుఃఖ
మును బుద్ధియందును, గనుఁగొను నెవ్వాఁ, డనిష్టసంసారంబు సృష్టిఁ జేయు
పుణ్యపాపములచే ముక్తుఁ డెవ్వం, డట్టిమనుజు మానసము నీ మందిరంబు.

పంచపాది. నిను సమస్తగుహాశయస్థుని ననంతు
సర్వగతుని వరేణ్యుని సత్యుఁ జిద్ఘ
నుని నలేపకు నద్వితీయుని నెఱుంగు
నరుని హృద్రత్నపీఠికాంతరమునందు
నుర్వరాపుత్రితోఁ గూడి యుండు మయ్య !. 3౮౮

మ. సతతాభ్యాసదృఢీకృతాత్ములును యుష్మత్పాదసేవా సుని
ష్ఠితులున్ నిర్మలనామకీర్తనఫలశ్రీనాథులౌ వారి హృ
చ్ఛతపత్రంబులు జానకీయుతుఁడవై సౌఖ్యంబుగా నిల్చి స
మ్మతి నీ వెప్డు మెలంగు మందువులు రామా ! భక్త కల్పద్రుమా !. 3౮౯

రాముని వాల్మీకి తనపూర్వచరిత్రము దెలుపుట

వ. ఇది యును గాక. 3౯౦

క. దేని ప్రభావమున ననమున, నే నైతినొ బ్రహ్మఋషిని నిట్టు; లద్దానిన్
నీ నామమ్మును నెవ్వఁ, డైనను వర్ణింపఁ జాలునా? శ్రీరామా !. 3౯౧

క. మును నేఁ గిరాతమధ్యం, బునఁ బెంపంబడితిఁ జెఱగుబోయలచేతం
గన ; నాకు బ్రాహ్మణత్వము, జననంబునఁ గాక కలదె చారిత్రమునన్. 3౯౨

క. శూద్రాచారరతుఁడ నయి, శూద్రాంగనయందుఁ గంటి సుతసమూహమున్
, భద్రాత్మక ! యంతర్భాగ, వద్రపుజను మొందలేనివాఁడ నగుటచే. 3౯3

క. పిమ్మట దొంగల సాంగ, త్యమ్మున దొంగ నయి సంతతమ్ము ధనుర్బా
ణమ్ములు ధరించి యడవిం, ద్రిమ్మరు జీవులకు మృత్యుదేవత నైతిన్. 3౯౪

క. ఒకనాఁడు మహాటవిలోఁ, బ్రకటానలసూర్యదీప్తి భాసిలు మునిస
త్తకమును సాత్మోత్తుగఁ గనులకుఁ బండువుగాఁగఁ గంటి, లక్ష్మీనాథా !. 3౯౫

చ. తఱిమితి వారి లోభమునఁ దద్గతవస్తువులన్ హరింపఁగా,
హరహర ? నిల్వుఁ డేఁగకుఁ డటంచు నదల్చెడు నన్నుఁ గాంచి త

స్కరపతి! మమ్ము నడ్డుటకుఁ గారణ మే మన వారు, జానకీ
వర! యపు డిత్తెఱంగునను బల్కితిఁ గర్మము పక్వ మౌటచేన్. ౩౫౬

ఉ. ఆఁకటఁ జొక్కువారు గల రాలును బిడ్డలుఁ దక్కువారలున్
నా కొకకొంతమంది, మునినాయకులార! సదా త దర్థమై
యీ కుధరాటవీస్థలి న దేపనిగాఁ జరి యించుచుండెదన్
మీకడ నున్నవస్తువులు నేఁడు హరింపఁగ వెంట నంటితిన్. ౩౫౭

వ. అనవుడు నమ్మహాత్ములు నతిజాగరూకులై యిట్లనిరి. చోరుఁడా! యొక్క హితమ్ము విను, మిప్పుడు నీవు నీయింటికిం బోయి "మిమ్ముఁ బోషించుకొఱకు నిరతముం బరధనాపహరణజీవహింసాదిదుష్కృత్యమ్ము లనేకమ్ము సేయుచుంటి. వానివలన నగుపాపఫలమ్ము గుడుచువా రెవ్వ?" రని భార్యాపుత్రాదుల నందఱఁ బ్రత్యేకముగ నడిగి వా రొసఁగుప్రత్యుత్తరముం దెచ్చి చెప్పుము. ౩౫౮

ఆ. నీవు వచ్చువఱకు నిల్చియుండెద మిందు, రయమునీఱఁ బోయిరమ్ము నాఁగ
నట్లె యనుచు మౌను లడుగుమన్నవిధాన, నడిగినాఁడ నింటి కరిగి నేను. ౩౫౯

వ. నాచే నడుగంబడి పుత్రమిత్రకళత్రాదులు. ౩౬౦

గీ. మాకొఱకు నీ వొనర్చినమాట నిజమె, యైనఁ బాపం బదెల్ల నీ యదియ చుమ్మి,
అనుభవింతుము ఫలము మే మంతె కాని, నీదు దురితంబుమాకు రానేర దనిరి. ౩౬౧

క. ఆ మాట వినినతోడన, నా మది నుదయించు విసుగునం జింతిలి శ్రీ
రామ! దయాపూరితహృత్, తీసుల నమ్మునుల మరలఁ జేరితి వడిగాన్. ౩౬౨

క. అంతఃకరణం బమ్ముని, కాంతుల సందర్శనమున గతకల్మష మై
యెంతయు శుద్ధిం గనె నే, నంతటఁ జాపాదికంబు నట విడి భక్తిన్. ౩౬౩

ఉ. దండము రీతిగా నడుగుఁదమ్ములపైఁ బడి మ్రొక్కి నన్నుఁ బ్రో
వుండు దయామతిన్ నరకభూరిపయోనిధిఁ గూలి యెట్లొ మీ
యండకుఁ జేరినాఁడఁ గలుషాత్ముఁడ యోగివరేణ్యులార! నా
కొండొకదిక్కు లే దనుచు నొక్కమొగిన్ మొఱవెట్ట నాఘనుల్. ౩౬౪

గీ. ఓయి! లే లెమ్ము మంగళ మొదవు నీకు, సత్సమాగమ మురుఫలసంయుతంబు,
మేటి యుపదేశ మొక్కటి మేము నేఁడు, చేతు మద్దాన మోక్షసంసిద్ధి యగును.

సీ. అని పల్కి యన్యోన్యమాలోచన మొనర్చి, యీబ్రాహ్మణాధముం డెంత యేని
దుర్వృత్తి గలవాఁడు దొడరి సదాచార, పరులచేత నుపేక్షఁ బడయఁ దగిన

వాఁ, డైన; శర ణని వందురుకతమున, గట్టిగ మోక్షమార్గమును వీని
కుపదేశ మొనరించి యుద్ధరింపం దగు, నని నిశ్చయాత్ములై యాదరమున

ఆ. రామ! నీ పవిత్రనామంబు వ్యత్యస్తవర్ణరూపమునను వఱలుదాని
నిచ్చి మేము మరలి వచ్చెడిదాఁక జపింపు మనుచుఁ జెప్పి వెళ్లి రంత. ౩౬౬

వ. నేను దివ్యదర్శను లగునత్తపోనిధు లుపదేశించినక్రమంబున నేకాగ్రమనస్కుండ నై య మ్మంత్రంబు జపించుచు బాహ్యవిషయంబులం దగుల కుంటి. అట్లు బహు దినంబులు గడువ నిశ్చలదేహంబును సర్వసంగపరిత్యాగంబును గలుగు నా మీఁదఁ బుట్ట మొలచె, నంత సహస్రయుగంబుల కాలం బరుగుటయు న ప్పరమర్షు లేడ్వు రును మరలివచ్చి. ౩౬౭

క. నను బయటికి ర మ్మనఁగా, విని దిగ్గున లేచి మంచువెలువడుదిననా
థుని యనువున వల్మీకం,బును వెలువడి వచ్చినాఁడ మును లరు దందన్. ౩౬౮

గీ. అపుడు నాతోడ ఋషిగణం బనియె నిట్లు, నీకు వల్మీకమందు జనించుట యను
నపరజన్మంబుగల్గిన దందువలనఁ, బొసఁగు వాల్మీకి నామంబు భువనమందు. ౩౬౯

క. అని దివ్యగతిం బోయిరి, మునివరులు, త్వదీయనామభూరిమహిమచే
తన యిట్టివాఁడ నైతిని, ననుమానము లేదు త్రిభువనావనశీలా! ౩౭౦

క. అనుజోపేతుని సీతా,వనితాయుతు రాముఁ బద్మపత్రాక్షు నినుం
గనుఁగొంటిని సాక్షాత్తుగ, ననఘా! ముక్తుఁడను, సందియము లే దిచటన్. ౩౭౧

వ. రామా! నీకు మంగళంబగుఁ గాక, భవ న్నివాసోచితప్రదేశంబు సూపెదఁ బోవు దము రమ్మా యని శ్రీమంతుం డగువాల్మీకి శిష్యపరివృతుండై చని చిత్రకూటాచ లంబునకును గంగానదికిని నడుమ నున్న స్థలంబుం జూపె, నంత జానకీలక్ష్మణ సహితుం డగురఘుపతి, తా నఖిలలోకములకు నివాసస్థాన మైనను నాకుభవ నిర్దేశితక్షితితలంబున విశాలకూటంబునఁ దూర్పు పడమరలుగ నొక గృహంబును దక్షిణోత్తరములుగ నొక్కమందిరంబును గట్టం జేసె. ౩౭౨

చ. మునివరపూజితుండు రఘుముఖ్యుఁడు లక్ష్మణజానకీయుతుం
డనఘుఋషీంద్రయుక్తుఁ డయి హాయిగ నందు వసించె, స్వర్గమం
దనిమిషసేవితుం డయి ప్రియంబుగ శచిఁ గూడి మెలంగు న మ్మహేం
ద్రునిగతి, నేమి చెప్పుదును దొయ్యలి! య య్యమితప్రభావమున్. ౩౭౩

వ. ఈ కథ యిట్లుండె, నక్కడ. ౩౭౪

సుమంత్రుఁడు దశరథునకు రామాదులను దిగవిడిచి వచ్చినవిధమును దెలుపుట

చ. అపుడు సుమంత్రమంత్రియు దినాంతమునందు నయోధ్యఁజొచ్చి బా
ష్పపరివృతంబు లోకనుల వస్త్రమునన్ వదనంబు గప్పి యు
ర్వీపతిని జూడఁగా నరిగె వెంపునే యరదంబు నిల్పి శై
లపతితనూజ! యెంతయుఁ గలంగఁగఁ జిత్తము తత్తరంబునన్. ౩౭౫

మ. జయశబ్దంబున సన్నుతించుచు నమస్కారంబు గావింప భూ
దయితుం డిట్లను దుఃఖితుం డయి సుమంత్రా! సాంగనాసోదరుం
డయి పుత్రుం డెట నున్నవాఁ డిపుడు కట్టా నిన్నెటుల్ వీడె ని
ర్దయుఁ బాపాత్ముని నన్ను నే మనిరి క్రోధస్వాంతులై మాగురుల్ ౩౭౬

వ. అని వారిం దలంచికొని. ౩౭౭

క. హా రామ! హా గుణాకర!, హా రవికులతిలక! హా ప్రియానద సీతా!
మీ రరయరు గద దుఃఖాంభోరాశి మునింగి చావఁబోయెడి నన్నున్. ౩౭౮

క. చిరకాలం బిటు దశరథ, ధరణీశుఁడు కుంది కుంది తతచింతాసా
గరమగ్నుం డయి యుండఁగ, నరసి సుమంత్రుండు పలికెఁ బ్రాంజలి యగుచున్.

సీ. రాముండు సీతయు సౌమిత్రి మువురును నాచేత నటు స్యందనమునఁ దీసి
కొనిపోఁబడి ముదంబున గంగయొద్దున శృంగబేరపురంబు చెంత నిలిచి,
రంత గుహాసీత మైనట్టిలఘుఫలమూలాదికముఁ జేత ముట్టి విడిచెఁ
గాని శ్రీరాముండు వానిని దినఁ డయ్యె, క్షితితలేశ్వర! వటక్షీరములకు

ఆ. గుహునిఁ బంచి యతఁడు గొనిరాఁగ వానిచే, జడల నెల్ల మకుటసరణి నతికి
పలికె నన్నుఁ జూచి స్వయముగ భవదగ్ర,పుత్రుఁ డాదరంబు వొడమ నిట్లు.

క. నాకోసము శోకించుట, నీకుఁ దగదు దండకావనీస్థలి మాకున్
సాకేతాధికసౌఖ్యము, చేకుఱుఁ గల దనుచుఁ బోయి చెప్పు సుమంత్రా!. ౩౮౧

ఉ. తల్లికి నాదు వందనముఁ దప్పక చెప్పుము మన్నిమిత్త మై
యుల్లమునందు నే డ్పుడిగి యూఱటఁ జెందుమగాత వృద్ధుఁడున్
బెల్లగుదుఃఖవారిధి మునింగినవాఁ డగునాదు తండ్రి తాఁ
జెల్లక యుండ భక్తిమెయి సేవ యొనర్చుచు నుండు టొప్పగున్. ౩౮౨

క. ఆక్షణమున నశ్రుపరీ,తాక్షి యయి ధరాకుమారి యనిమె నిజేశున్
వీక్షించుచుఁ గొంచెము దుః,ఖక్షీణగళస్వనమున, క్ష్మాతలనాథా!. ౩౮౩

సీ. అత్తమామల చరణాంబుజంబులకు దం,డప్రణామంబును నాకు బదులు
గా నొనర్పు మొకండు, కడువడిఁ జను మని, వా పోయి మిగుల నవాఙ్ముఖి యయి
నడచి యుంచుక బాష్పనద్ధనేత్రములతోఁ, బడవపై నెక్కెను బార్థివేంద్ర!
తిన్నగ గంగానదిని దాఁటి మువ్వురుఁ, గంటి కెందేనియుఁ గానరాని
ఆ. యంతదూర మేఁగునందాఁక నివ్వలి, యొడ్డునందుఁ జూచుచుండి నేను
ప్రబలశోకముననుఁ భవదంతికమునకుఁ, దిరిగి వచ్చినాఁడఁ దెలుఁగు లేమి. ౩౮౪

కౌసల్య దశరథుని దూఱుట

చ. అనవుడుఁ గోసలాత్మజ శుగంతరితాత్మిక యైన రేంద్రుతో
ననియె నిటుల్ ధరాధిప! ప్రియాంగన కైకయెడం బ్రసన్నతం
దనరి వరం బొసంగితివి, దానికి దానికె రాజ్య మిమ్ము నా
తనయుని రామచంద్రు నటు దండక కేటికిఁ బంపి తక్కటా?. ౩౮౫
గీ. చేతిమీఁదుగ సకలంబు సేసి యేమి, యెఱుఁగనట్టుల నూరక యేడ్చె దేల?
కన్నకొడుకుఁ బ్రియుంవదుఁ గాన కనుచు, నిర్దయులు గల్గిరే భువి నీవు దక్క.
క. నావుడు నరపతి గాయము,పై వైశ్వానరుని కీల పడినవడువునఁ
దేవీవచనములకు వా,పోవుచు నధికముగ నశ్రుపూర్ణనయనుఁ డై. ౩౮౭
గీ. వనఁట మునిఁగి చచ్చువానిని న న్నేల, దఃగఖపెట్టె దింకఁ, దోయజాక్షి!
యరుగఁ గలవు నాదుప్రాణంబు లిపుడె దే,హమ్ము వాసి, సందియమ్ము లేదు.

దశరథుఁడు కౌసల్యకుఁ దన శాపకారణమును దెలుపుట

క. మును జరిగిన కథ యొక్కటి, మనమునకుఁ వచ్చె నేఁడు మానిని! దానిఁ
విను మేను బాలభావం,బున శప్తుఁడ నైతి నొక్కమునివరు చేతన్. ౩౮౯
వ. అది యెట్లం టేని. ౩౯౦
సీ. యావనోద్రిక్తుండ నై యేను బూర్వంబు, ధనువు బాణంబులు దాల్చి కేల
యామినియందు వేఁటాడుశలంపుతోఁ, దిరుగుచు నొకనదీతీరమునను
ఘోరాటవిని గాఁచుకొని యుంటి నంతఁ దృషార్దితుఁ డొకముని యర్ధనిశిని
దనతల్లిదండ్రుల దప్పికఁ దీర్పంగ, జలమునిమిత్త మచ్చటికి వచ్చి
గీ. యుదకమునఁ గుంభమును ముంప నురుతరముగ,
శబ్ద మొం డుద్భవించె నో చంద్రవదన!
దాని విని మదేభము నీరు ద్రావుట యని,
మదిని దలపోసి ప్రారబ్ధమహిమఁ జేసి. ౩౯౧

చ. ఎడపక శబ్దవేదిశర మేసితిఁ జాపమునందుఁ గూర్చి, య
య్యెడఁ "గట? చచ్చినాఁడ" నను నెల్గు వినంబడె మానుషోక్తి, నె
య్యెడ నపరాధ మెవ్వనికి నే నొనరించి యెఱుంగ, నీక్రియం
బడఁ గత మేమి నాపయిని బాణము? దైవకృతంబ సర్వముల్. ౩౯౨

ఉ. నాజనకుండు నా జనని నా కొఱకై జలవాంఛ మీఱఁగా
రోఁజుచునుండు రేమి గతి? రూక్షశరంబునఁ గొట్టె నెవ్వఁడో
హా జగదీశ! యంటయును నవ్వడు నా చెవి నాటెఁ జిత్తనీ
రేజము సంచలింపఁగఁ గరిప్రవరాహతశాఖవైఖరిన్. ౩౯౩

క. ఆపరుషోక్తిని భయసంతాపము లుదయించె, విగతధైర్యుఁడనై మ
చ్చాపోద్గతశరవిద్ధుం, డౌ పురుషుని పార్శ్వమునకు నల్లనఁ బోతిన్. ౩౯౪

సీ. ఓ మహితాకార! స్వామి! నేదశరథుఁ,డను దప్పు సేసినాఁడను దెలియక,
నను గృపాదృష్టితోఁ గనుఁగొని రక్షింప,వలె నని తత్పాదవనజములను
గూలితి గద్గదోక్తుల, నంత నమ్ముని, ననుఁ గాంచి భీతినొందకు నృపాల!
బ్రహ్మహత్యామహాపాపంబు నిన్నంట, నేరదు, తప మతినిష్ఠతోడఁ
ఆ. జలుపుచున్న వైశ్యజనుఁడను గాని నే, ధరణిసురుఁడఁ గాను దాఁప నేల?
అంధు లిరువు రుండి రనఘ! యాఁకలి దప్పిఁ,గలుగువారు నన్నుఁ గన్నవారు.

క. వారలు నా రాకకునై, వారని తమిఁ గోరుచుంద్రు వసుధావర! నీ
వారయక వారి నిర్మల,వారిన్ సంతోషపెట్టవలయును త్రుటిలోన్. ౩౯౬

క. లేకున్న నిన్ను క్షణమునఁ, బోకార్చు నుదగ్రశాపమున నా జనకుం
డోకాశ్యపీశ్వరా! సుత,శోకాగ్నిజ్వాల చొఱనిచోటులు గలవే?. ౩౯౭

గీ. జల మొసఁగి వందనం బిడి, జరిగినకథ, సర్వమును జెప్పు మామీఁద జనవరేణ్య!
నీరు ద్రావకమున్న యీకారణం బెఱింగి రేనిఁ బిపాసచేతం గృశింత్రు. ౩౯౮

చ. వగచిన లాభ మేమయిన వచ్చునె? వేదన కోర్వఁ జాల నొ
క్కఁగడియ యేనిఁ, దన్నిశితకాండము దేహమునుండి లాగుమీ,
యగణితబాధ వాసి సుఖ మందుతఁ బ్రాణము లింక నంచు నీ
పగిది వచింపఁ దత్తనువుఁ బాయఁగఁ జేసితి వేగ బాణముల్. ౩౯౯

క. బాణంబు పెఱికినంతన, ప్రాణంబులు విడిచె వైశ్యబాలకుఁ డట, నో
యేణాక్షి! యేమి చెప్పుదుఁ, బ్రాణంబులు పోయి నట్ల యయ్యెను నాకున్. ౪౦౦

సీ. ఉవిద! నేనంత స్వచ్ఛోదకపూరిత, కలశంబు గైకొని కదలి పోయి
కనుఁగొంటి న బ్బాలకునితల్లిదండ్రుల, సంధుల వృద్ధుల నధిక మైన
క్షుత్పిపాసలఁ జేసి స్రుక్కినవారిఁ దో,యముఁ దెత్తు నని చెప్పి యరిగినసుతుఁ
డింతకు రా కుండె నేమొ? పుట్టంధుల, గతి లేనివారి దుఃఖితులఁ దృపను
గీ. సొమ్మసిల్లినవారల మ మ్ముపేక్ష,సేసె నొక్కొ? భ క్తిఁ బరిచర్య సేసి ముదముఁ
గొలుపుగుణరాశి నేఁ డిట్లు సలుపఁ గలఁడె,యంచుఁ గొమరుని కై తల్లడించువారి.

వ. అట్లరసి యా వృద్ధదంపతుల నికటంబున కరుగుటయు నందుఁ బురుషుండు నా
యడుగులచప్పు డాలించి తనతనయుఁ డను తలంపున. ౪౦౨

క. కొడుకా! యి దేమి? యింతటి,తడ వొనరించితివి నేఁడు దప్పికతమునన్
సుడి వడెఁ బ్రాణంబులు మా,కిడి పానీయంబు త్రాగు మీ వటుమీఁదన్. ౪౦౩

క. అని పలుకునతని సవిధం,బున కుత్కటభయము మదిని బొడమఁగ మెలమె
ల్లన పోయి కాళ్లపైఁ బడి, యనినాఁడ లతాంగి! యిట్టు లతివినయముగన్. ౪౦౪

క. అనఘా! కరుణింపు భవ,త్తనయుండను గాను నేను దశరథుఁడ నయో
ధ్యను బరిపాలించుచు నిల మనువాఁడను మఱియు దుష్టమతి నతిపాపిన్. ౪౦౫

మ. మృగయాసక్తుఁడ నై నిశిన్ మృగములన్ హింసించు చీ యున్న యా
పగఁ బొ ల్పారెడి రేవు చెంగట వసింపన్ శబ్ద మొం డయ్యెఁ దో
యగతం బై,యది యేన్గుగాఁ దలఁచి నే నాత్మన్, వధింపంగ నా
శుగతిన్ వైచితి శబ్దవేదశరమున్ శూ రావళీభీదమున్. ౪౦౬

ఉ. నాదు శరంబు వెంబడిన నా కు వినంబడె "హాహతోఽస్మి" యన్
నాదము, దాన భీతిలి మనంబు సరోజగతాంబుబిందువున్
మాదిరిఁ గోర నయ్యెడ కమందగతిం జని నేను గాంచితిన్
మేదినిఁ బడ్డహానిసుతు మిత్రసమాను జటావికీర్ణునిన్. ౪౦౭

చ. కనుఁగొనినంత గుండెలు వకావక లై చనునంతభీతితో
ననుఁ గరుణింపు మంచుఁ జరణంబులు చేతుల ముట్టి వేఁడ న
య్యనఘుఁడు వల్కె నాయెడఁ గృపాతిశయంబున బ్రహ్మహత్య దా
మొనయు" నటంచు దుఃఖమున మున్గకు వైశ్యుఁడ నేను భూపతీ!. ౪౦౮

క. మాతలిదండ్రుల కిరువుర, కీ తోయం బిచ్చి మ్రొక్కి యీ వతివినయో
పేతుఁడ వై ప్రార్థింపుము, పో తడయకు కాలకర్మము లలంఘ్యంబుల్. ౪౦౯

వ. అనవుడు. ౪౧౦

ఉ. ఆయనమాటచొప్పున మహాత్మ! నిశీథమునందు వచ్చితిన్
మీ యనురాగపాత్రు నతిమేధ్యచరిత్రునిఁ గన్నపుత్రునిన్
సాయకతీవ్రపాతమునఁ జంపితి నేరక యెగ్గు సేసితిన్
నా యవివేక మివ్విధి ననాథులఁ జేసెను మిమ్ముఁ జీకులన్. ౪౧౧

క. అపరాధిని శర ణంటిని, గృపతో రక్షింపవలయు నిఁక న న్ననుచున్
జలజాక్షి! కరుణరసభృ, ల్లపితంబుల వేఁడుకొంటి లావతి వారిన్. ౪౧౨

క. కొడు క్కీగ్గె బాణహతి నను, పిడుగున కెనవచ్చుమాట విని నావలనం,
బుడమిఁ బడి యొడ లెఱుంగక, యడలుచు నొక్కింతకాల మా పుట్టంధుల్.

క. మాసుతుఁడు పడినయెడకున్, గాసిలి యున్నట్టిమమ్ముఁ గడుశీఘ్రముగాఁ
దీసికొని పొమ్ము నావుడు, నాసరణిం జేర్చినాఁడ నచటికి వారిన్. ౪౧౪

వ. అట్లు చేర్చుటయు. ౪౧౫

చ. అకట కుమార! మమ్ము విడనాడి చనం దగవే? యటంచు మా
టికిఁ దనువున్ స్పృశించుచుఁ గడిందిగ నేడ్చిరి చాలసేపు బా
ష్పకలితనేత్రులై, పిదపఁ బల్కిరి నన్నుఁ జితిన్ రచింపు మం
చకపటచిత్త! తత్క్షణమ యప్పనిఁ జేసితి వారియానతిన్. ౪౧౬

క. దానిపయి వార లిరువురు, సూనునితోఁ జేరి రంతఁ జొప్పించితి వై
శ్వానరునిఁ దదనుమతి, నో,మానిని! బూదియయి చని రమరపదమునకున్.

క. ఆ వృద్ధుం డటు వోవుచు, నావలెఁ గాఁగలవు నీవు నందనశోకం
బీవిధి నినుఁ దెగటార్చును, నావచనంబున నటంచు నన్ను శపించెన్. ౪౧౮

దశరథుని మరణము

సీ. ఆ శాపకాల మోయంగన! యిపు డనివారితం బగుచు సంప్రాప్త మయ్యె
నని శుగాకులుఁ డయి, హారామ! హాసీత! హాలక్ష్మణా! సుగుణాఢ్యులార!
కైకేయి హేతువుగాఁ గలమృత్యువు, నొందితి మీదు వియోగమునను
నిదె కడసారి మీ కేడ్చుట యని పల్కి, నరనాథుఁ డపుడ ప్రాణములఁ బాసి
గీ. చనె దివంబున, కంతఁ గౌసల్య మున్ను, గాఁగలుగు రాజకాంత లాక్రందనంబు
చేయుచు నురస్థలంబులఁ జేత మోఁది,కొనుచు భువిఁ బడి యేడ్చిరి కోమలాంగి!

వ. అనంతరము ప్రాతఃకాలంబున మంత్రిపరివృతుం డై వసిష్ఠుఁ డచ్చోటి కరుదెంచి దశ రథుని కళేబరంబు తైలద్రోణియందుఁ బెట్టించి దూతలం గాంచి మీ రశ్వారూఢు లై త్వరితగతి యుధాజిన్నగరంబున కరిగి శ్రీమంతుఁడును బ్రభువు నగుభరతుని శత్రుఘ్నసమేతముగఁ దల్లిదండ్రు లైన కైకేయీదశరథులఁ గాంచుకొఱకు నా యాజ్ఞం దోడుకొనిరం డని చెప్పి పంచిన వా ర దేవిధంబునం బోయి యుధాజిత్తునకు మ్రొక్కి సానుజుం డయి యున్న భరతునిది క్కై,యి ట్లనిరి. ౪౨౦

క. భరతుఁడు శత్రుఘ్ను నితోఁ, బురికిఁ రావలె విచారమును మాని యతి
త్వరితముగ ననుచుఁ గులగురుఁ,డరుంధతీప్రాణనాథుఁ డంపెను మమ్మున్. ౪౨౧

భరతుఁ డయోధ్యకు వచ్చుట

చ. అనవుడు వారిమాటలకు నబ్బరతుం డతిభీతచిత్తుఁ డై
యనుజునితోడఁ గూడి గురునానతి మాతుపురంబుఁ బాసి వెం
టన చను దేర దూతలు కటా? నను నీక్రియఁ బిల్వనంపు లెం
దున కొ గురుం; డొకించుకయుఁ దోఁచక యున్నది నామనంబునన్. ౪౨౨

క. రామునకో; జనకునకో; యే మేనియుఁ గీడు మూఁడుటో; నిజ మనుచున్
దా మార్గంబునఁ జింతిలు, చామెయి నాతం డయోధ్య కరుదెంచె నతీ! ౪౨౩

వ. అట్లు వచ్చి జనసంబాధవర్జితం బై సకలోత్సవపరిభ్రష్టం బై చెన్నుదఱఁగియున్న నిజపురంబు నవలోకించి చింతాకులం బగుస్వాంతంబున రాజలక్షణవిహీన మగు రాజసదనంబు సొచ్చి యం దాసనాసీన యైయున్నతల్లి నొక్కర్తుకం గాంచి, తత్పదపద్మంబులు శిరంబు సోఁక సభక్తిఁ బ్రణతి గావించె, నంత నామెయు.

క. అరుదెంచిన ప్రియపుత్రుని; భరతునిఁ గని యట్టె లేచి పరమాదర సం
భరిత యయి కౌఁగిటం గొని, దరస్మితాననముతోడఁ దనతోడఁ జేర్చెన్. ౪౨౪

వ. అ ట్లంకస్థితుం జేసి. ౪౨౫

క. మా యయ్యకు సేమంబే, మాయమ్మ గుణాఢ్య కగునె మంగళము సదా,
మా యన్న సుఖియె? నిను న,నపాయునిఁ జూడంగఁ గంటి భాగ్యముకతనన్. ౪౨౬

భరతుఁడు తండ్రివార్తను దల్లి నడుగుట

గీ. అనుచుఁ జింతాకులేంద్రియుం డై యతండు, దూయమానమనంబునఁ దొడరి పల్కె-
నంబ! మాతండ్రి యెచ్చటి కరిగె? నొక్క, దానివే యుంటి వేల సౌధంబునందు.

ఉ. ఎప్పుడు నిన్ను వీడి వసియింపఁడు దాను రహఃప్రదేశమం,
దిప్పుడు నాకుఁ గానఁబడఁ డెచ్చటఁ జూచిన? నెందుఁ బోయె? మా

యప్పను గానఁజాలమికి నాత్మ జనించె భయంబు దుఃఖముల్
జెప్పఁగదమ్మ నాకు నృపశేఖరుఁ డుండినతావు చయ్యనన్. ౪౨౯

వ. అనుటయుఁ దనయునకు జనని యిట్లను. ౪౩౦

సీ. నామాట చెవిఁ బెట్టి నందన! విను మయ్య! యివ్విధి శోకింప నేల నీకు?
నశ్వమేధాదిమహాక్రతుకర్తలు, ధర్మశీలురు చనఁదగినగతికిఁ
జనినాఁడు భవదీయజనకుండు నడురేయి, సవతి యాకౌసల్యసదనమందు
నావుడు దుఃఖసంతప్తుఁ డైయాతండు నిలువఁ జాలక త్రోన నేలఁ గూలి
గీ. నాయనా! యెందుఁ బోయితి నన్ను దుఃఖ,జలధిలోఁ బడవైచి? భూచక్రమునకు
రా జయినరామునకు నాదరంబు మిగుల, నప్పగింపక యెట్టు లీ వరిగి తోకో?

తండ్రికై దుఃఖించు భరతుని గైక యూరార్చుట

క. తలముడి విడిపోవఁగ వి,హ్వలుఁ డయి పుడమిపయిఁ బడినయాత్మజునూర్జన్
బలిమి మెయి లేవ నెత్తి క,న్నులు దుడిచి, పడంతి యనే మనోరథ మిట్టుల్.

ఉ. ఊఱటఁ జెందుమీ తనయ! యూరక యీక్రియ దుఃఖ మొందఁగాఁ
గారణ మేమి గల్గె? నధికంబుగ నీకొఱ కేను సర్వమున్
గూరిచియుంటి దానిఁ గయికొమ్మన నాతఁడు తల్లిఁ జూచి, ధా
త్రీరమణుండు చచ్చెడుతఱిన్ జెపు మే మనిపల్కె నంబికా! ౪౩౩

సీ. అనుటయుఁ గైక యి ట్లనుఁ గుమారునితోడ, భయలేశ మేనిఁ గన్పడకయుండ
హారామ! హాసీత! హాలక్ష్మణా! యని, మఱిమఱి యేడ్చుచు మరణ మొందె
నావుడు, రాముండు నరనాథుచెంగట, లేకుండెనే? మైథిలియు సుమిత్ర
నందనుఁ డగపడ రెందుఁ బోయిరి నేఁ? డే,తెంగింపు మని యడుగంగఁ దనయుఁ,
గీ. డవనినాథుండు యౌవరాజ్యాభిషేక, మాచరింపంగ రాముని కాత్మ నెంచి
తత్ప్రియత్నంబు నొనర్చె నద్దాని నేను, జెఱిచితిని నిన్ను రాజుఁగాఁ జేయఁ దలఁచి.

క. మున్ను భవజ్జనకుండు ప్ర,సన్నుం డై వరయుగం బొసంగెను నాకున్
మన్నన, నం దొకవరమున, నన్నా! రాజ్యాధిపత్య మడిగితి నీకున్. ౪౩౫

క. రెండవవరమున రాముఁడు, దండకకుం బోయి మునివిధంబున నచ్చో
నుండునటులఁ గోరితి నా,తం డందుల కొప్పె సత్యతత్పరుఁ డగుటన్. ౪౩౬

గీ. రాజ్య మఖిలంబు నీ కిచ్చి రామచంద్రుఁ, డడవి కంపించె నీతండ్రి, యవనిసుతయు
నరిగె వెంటఁ బాతివ్రత్య మనుసరించి, తమ్ముఁడును బోయె నన్నపైఁ దగులుకూర్మి.

క. వాఁగలు మూఁగురు విపినము, సేరఁగ వారిని గుఱించి చింతిల్లుచు ధా
త్రీరమణుఁడు హా రామా! హా రామా! యనుచుఁ దుదకు నసువులు దొఱఁగెన్.

ఉ. అంబ కఠోరవాక్యములు నాతఁడు వజ్రపుదెబ్బఁగూలు వృ
క్షం బన నేలపైఁ బడి విసంజ్ఞుఁడు గాఁగ నెఱింగి కైక శో
కంబునఁ దెల్విఁ దెచ్చి, కొడుకా! యిటు దుఃఖము నొంద నేల? రా
జ్యం బఖిలంబు నీకు వశ మై విలసిల్లెడి కాలమందునన్. ౪౩౯

క. ఏడువఁగఁ దగినకాలము, నేఁ డటరా? మేలు గలుగ నేలకు నెల్లన్
ఱేఁడ వయి ప్రజల నేలుము, పా డొనరింపకుము కష్టపడితిని నీకై. ౪౪౦

వ. అని పల్కునక్కల్కిని దహించువాఁడుం బోలెఁ గోపంబునం జూచుచుం జూచి.

భ ర తుఁ డు కై క ను ది ట్టు ట

సీ. పతిని జంపినమహాపాపిష్ఠురాలవు, నీతోడ భాషింప నిరయ మబ్బు
నీదు గర్భమున జన్మించుట నేనును, బాపి నైతిని గదే పాపచిత్త!
విసమును మెసవియొ; వెఱువక చిచ్చునఁ, బడియొ; కౌక్షేయకపాతముననో;
యాత్మహత్య యొనర్చి యమపురి కరిగెదఁ, బతిఘాతుకీ! యిఁకపైనఁ జూడు
ఆ. మఱుగఁ గలవు భయద మైనకుంభీపాక, నరకమునకు మాట తిరుగఁ బోదు
మగనిఁ జిక్కువెట్టి భ్రమందించుసుందరి, గలదె? నీవు దక్క క్ష్మాతలమున. ౪౪౨

క. అని తిట్టి యచట నిలువక, జననుతచరితుం డతండు చయ్యన శ్రీరా
ముని తల్లిమేడ కరుగఁగఁ, గని యాయమ యేడ్చె ముక్తకంఠముతోడన్. ౪౪౩

వ. భరతుండును దచ్చరణంబులం బడి యడలె నంత సాధ్వియు యశస్వినియుఁ
గృశాంగియు నగురామమాత దీనవదనంబున నిజచరణతలనిపతితుం డగుసపత్నీ
సుతు లేవనెత్తి యాలింగనముఁ జేసికొని కనుదమ్ములు నీ రొలుకుచుండ ని ట్లనియె.

ఉ. నందన! నీవు దూరము చనన్ సకలం బిటు లయ్యె దీని కే
మందును? దల్లి చెప్పఁగ సమస్త మెఱుంగుదు వంబచేష్టితం,
బిందునిభాస్య యామనమహీసుతతోడ సుమిత్రపట్టితో
నందనుఁ డేఁగినాఁడు విపినంబున నుండఁగఁ దండ్రిపంపునన్. ౪౪౪

క. సంబద్ధజటలతోఁ జీరాంబరుఁ డై దుఃఖవనధి నడఁగారిన న
న్నుం బురమునను దృజించి గొనంబుల ప్రో వరిగెఁ గాననములకుఁ దనయా!.

వ. అని రాముని దలంచికొని. ౪౪౫

భరతుఁడు రామవనవాసవిషయ మేమియు దెలియఁగ నని యొట్టుపెట్టికొనుట

సీ. రఘువంశనాథ! శ్రీరామ! నీవు పరాత్పరుఁడవు నా కడుపునఁ బొడమినాఁడ
వైనను, నను శోక మావరించుచునుండె, విధి బలవంతంబు వే ఱేఁ కేల?
యని దుఃఖమునఁ గడు నడలెడుకౌసల్య, యడుగులు చేఁ బట్టి, యమ్మ! నాదు
పలు కాలకింపుము, భవదాత్మజాతుపట్టాభిషేకమును మాయమ్మ చేసి
గీ. నట్టి దొనఁ గే నెఱింగిన, నామె కేను, జెప్పి చేయించినను నన్నుఁ జెందఁ గాత
బ్రాహ్మణుల వేయిమందిని బట్టిచంపఁ, బ్రాప్త మగునంతటిమహోగ్రపాతకంబు.

క. జననీ! యరుంధతితోడన్, మునివరుని వసిష్ఠు ఖడ్గమునఁ జంపఁగ నె
క్కొనుకలుషము నా కబ్బుత, వనమునకున్ రాముఁ డరుగువార్త యెఱిఁగినన్.

వ. అని యిత్తెఱంగున బహుప్రకారంబుల. ౪౫౦

క. ఒట్టిడి యేడ్చినభరతుని, గట్టిగఁ గౌసల్య నిండుకౌఁగిట నిడి, నా
పట్టిని నడవికిఁ బంపిన, యట్టివిషయ మీవెఱుంగ వని యూరార్చెన్. ౪౫౧

వసిష్ఠుఁడు భరతు నూఱడించుట

గీ. అంత భరతుండు పురమున కరుగుదెంచె, ననినవార్తను విని మంత్రిజనముతోడ
గురుఁడు చని వేగి, రాజమందిరమునందు, నడలునాతని గని యనె సాదరముగ.

సీ. భరత! యిక్ష్వాకుకుల భవజ్జనకుఁడు దశరథుఁ డన సత్యపరాక్రముండు
సకలభూనేత, వార్ధకసమాలింగితుఁ, డైహికసుఖ మెల్ల ననుభవించి
యశ్వమేధాదిమహాయజ్ఞములు నస, మానదక్షిణలతోఁ బూని చేసి,
హరియైన శ్రీరాము నాత్మజుఁగాఁ బొంది, యమరేంద్రు నర్ధాసనమున నుండ
గీ. నెంచి, త్రిదశాలయమ్మున కేఁగెఁ దాదకు, నట్టివానికి నీ విట్టు లడల నేల
నిష్ఫలంబుగఁ, జావు జన్మించునర్వ, జంతువుల కున్న దే కదా! వింత యేమి? ౪౫౩

వ. అదిగాక, ముక్తుఁ డెప్పుడును శోచ్యుఁడు గాఁజాలఁడు. ఆత్మయన, వినాశరహిత మై
నిత్య మై యుండు. జన్మముచేఁ బరిశుద్ధుఁ డగువాఁ డాశాదిసద్గితుఁడై వికార
దూరుఁడై నిరాకారుఁడై నిరంజనుఁడై విరాజిల్లు. ౪౫౪

క. తను వన జడ మపవిత్రము, వినశ్వరము; రాజతనయ! వినుము విచారిం
చిన నిందు శోకమునకున్, గనరా దవకాశ మించుకయు నెపుడేనిన్. ౪౫౫

చ. సుతులును దంద్రులున్ హితులు సుందరులున్ మృతి నొందఁ జూచి, "పో
యితిరె మముం ద్యజించి" యని యేడ్తు రురస్థలి మోఁదికొంచు మూ

ఫలములు; రాజనందన! తలంపఁగ సారము లేనిసంసృతిఁ
మతిఁ జొనుపంగఁ బోరు జనమాన్యచరిత్రులు జ్ఞాను లెన్నఁడున్. ౪౫౬

సీ. సంసారబంధంబు సడలిన వైరాగ్య, హేతుక మగుశాంతి యెలమిఁ గల్గు
సౌఖ్యంబు లభియించు, జననాథనందన! జన్మంబు గలిగినజంతుతతికి.
మృత్యువు వెనువెంట మెలఁగుచుండును గాన, జన్మవంతుల కెల్లఁ జావు త్రోయ
రాని దెత్తఱి, స్వకర్మవశంబున సమస్త, జీవధారులకును జావు పుట్టు

గీ. కలు లభించుచు నుండు, విజ్ఞానమునను, బండితులు వనఁటఁ జెందరు బంధుమృతికి,
నంతరించె బ్రహ్మాండకోట్లల్లె స్రష్టు, లెన్నియో నాశ మొందెఁ బోకున్న దేది?

గీ. ఇంకిపోఁగల వంబుధు లెల్లఁ గూలుమ, హీధరంబులు నుగ్గగు నిట్టిమహిత
వస్తువులె నిల్వ వన క్షణభంగుర మయి, యెసఁగు నీజీవితముపయి నేటియాస?.

క. చలపత్త్రాంతరసంస్థిత, జలబిందుప్రకరణి సురుఁగు సమయాసమయ
మ్ములు లేక యాయు వొకత్రుటిఁ, గలుగంగా నేల నమ్మకము నీ కచటన్?.

వ. దేహి యగువాఁడు ప్రాక్తన దేహసముద్భవం బగుకర్మవశంబున మరల దేహవంతుఁ డగుచున్నాఁడు. తిరిగి తద్దేహోద్భితకర్మంబునం జేసి యట్లె దేహంబు గల్గు చుండు. ఇట్లాత్మ కెపుడును శరీరప్రాప్తి యగుట నిక్క మని చెప్పి మఱియు ని ట్లనియె. ౪౬౦

గీ. పన దఱఁగి చినిగిపోయినబట్ట వదలి, క్రొత్తదానిని మైఁ గట్టుకొను విధాన,
మొదిమి సడలినప్రాగ్దేహమును దొఱంగి, క్రొత్తదానఁ బ్రవేశంబు గొనును దేహి.

క. కావున నిందుల కేడువఁ, గావచ్చునె? యాత్మ కిల నొకానొకతఱి నేఁ
లేవు చుమి జననవృద్ధులు, చావును నివి నిశ్చయముగ సదమలచరితా!. ౪౬౧

వ. ఆత్మ యన షడ్భావరహితమై సత్యప్రజ్ఞానవిగ్రహమై బుద్ధ్యాదిసర్వోపాధివివర్జితమై యొక్కటియై యుత్కృష్టమై యానందరూపమై యద్వితీయమై సదా వెల్గుచుండు. నిన్ను నీ వట్టివానిఁగా గట్టిగ నెఱింగి దుఃఖంబు మాని పైతృకక్రియాతత్పరుండవు గమ్ము. నానెగుండిగ నుంచినతండ్రిశరీరంబు సమాత్యపురస్సరముగ బహిస్థితమ్ము సేసి, యస్మదాజ్ఞానుసారముగ యథావిధిఁ దత్త్క్రియ లాచరింపఁ గడంగుము లె మ్మనినఁ గులగురుసంబోధితుం డై భరతుండు. ౪౬౩

భరతుండు దశరథున కుత్తరక్రియలు సేయుట

సీ. అజ్ఞానజనితమహాదుఃఖమును బాసి, గురువరువాక్యానుసరణి, నాహి
తాగ్ని యాతండ్రిదేహంబు యథావిధి, జ్వలదనలజ్వాల సంస్కరించి,

కర్మలోపంబును గానీక జరుపు చే,కాదశాహస్సు రా గరిమ మిగుల
భుజియింపఁ బెట్టెను భూసురశ్రేష్ఠుల, వేదపారగులను వేలకొలఁది

గీ. మఱియుఁ దండ్రిని నుద్దేశించి మణులు గోస,హస్రములు గ్రామములుఁ బ్రశస్తాంబరములు
బహుళధనమును నొసఁగె సంభరితభక్తి, బ్రాహ్మణోత్తములకు, నద్రిపతికుమారి!.

వ. తదుపరి సహోదరగురుమంత్రిపరివారయుతుం డై భరతుండు రామస్మరణనిరతం
బగుచిత్తంబున నిజభవనంబున నుండి. ౪౬౫

మ. చనె రాముండు మహాటవిన్ నిలువఁగా సౌమిత్రితో సీతతో,
మనముల్ రక్కసిపోల్కి నంబిక దహింపం జొచ్చె నివ్వేళ ద
ర్శనమాత్రంబున; నింక సుస్థిరత రాజ్యం బెల్లఁ బోఁద్రోసి రా
ముని మందస్మితభాసితాననను వనమ్ముం జేరి సేవించెదన్. ౪౬౬

క. సీతాసమేతు ననుజో,పేతు జగద్ధితవిచారు విమలాకారున్
ధూతోగ్రకలుషవారున్, స్ఫీతయశస్సారుఁ జేరి ప్రీతి భజింతున్. ౪౬౭

క. అని యెంతయుఁ జింతించుచు, ననఘుని శ్రీరాముఁ గొలువ నరిగెడుబల్ పూ
న్కి నెఱుంగఁ జేసె నంతట, మునిముఖ్యుఁ డరుంధతీవిభుఁడు రభసమునన్. ౪౬౮

వసిష్ఠుఁడు పట్టాభిషిక్తుఁడవు కమ్మని భరతునకుఁ జెప్పుట

వ. మునిమంత్రిపౌరజనసమేతంబుగ దేవసభాసన్నిభం బైననృపసభం బ్రవేశించి యందు
శతానందుచందంబున సమాసీనుఁడై శత్రుఘ్నసహితు భరతుం బిలిపించి కృతాభి
వందను నతనిఁ గూర్చుండ నియమించి దేశకాలోచితంబు లగువాక్యంబుల నిట్లనె.

గీ. దశరథునిశాసనంబునఁ దడయ కేము, నీకొనర్తుము పట్టాభిషేక మిప్పు
డడిగె మీయమ్మ నీకొఱ కవనినాథు, "రాజ్య మఖిలంబు ని"మ్మని రాజపుత్ర!

గీ. సత్యసంధుండు దశరథచక్రవర్తి, తాను మున్నన్నమాటను దప్పలేక
యీయకొనెఁ గాన మునులచే నీవు మంత్ర,పూర్వకాభిషేచనమును బొందు వత్స!.

భరతుఁడు తనమనోనిశ్చయము నెఱిఁగించుట

వ. అనుటయు భరతుం డిట్లను. ౪౭౨

క. నా కేల రాజ్య? మఖిల,శ్రీకిన్ రాజాధిరాజు సీతావిభుఁ, డా
లోకేశునకే; మేము ద,యాకర! భృత్యులము సందియం బిఁక నేలా?. ౪౭౩

క. పోవుదము తేపు వేకువ, దీవరముగ రాముఁ దోడితెచ్చుపనికిఁ గాఁ
గేవలము మీరు నేనును, రావలసినతల్లులును నరణ్యస్థలికిన్. ౪౭౪

క. పెనురక్కసి కేకయరాట్తనూజ రావలను పడదు, తక్కినజనముల్
దినకరకులమండనదర్శనలోలుభు లైనవారు రావచ్చు, గుహా! ౪౭౫

గీ. మాతృసంబంధ ఘోరకల్మషము జాఱఁ
గైక నిప్పుడ వధియింతుఁ గాని; "వీఁడు
కామినీ హంత" యని రఘురామమూర్తి
నన్ను క్షమియింపఁ డను భయంబున్న దొండు. ౪౭౬

సీ. ఎల్లి యె త్రైసను నేఁగెనఁ గాల్నడ, దండకాటవికి సోదరునితోడ;
దయసేయుఁ డీరు లేదా? పూనుఁడు మునీంద్ర! యేను సీతాపతి యేఁగి నట్లు
నారచీరలు పాలుపారంగ ధరియించి, ఫలమూలముల క్షుత్తుఁ బాపికొనుచు
భూశాయి నై జటాపుంజమ్ము దాలిచి, వరదుఁడు మాయన్న మరలి పురికి
గీ. వచ్చుదాఁక శత్రుఘ్నుతో వనమునంద, యుందు నని పల్కి యాగుణి యూరకుండ
నచటివా రెల్లఁ గడుముదితాత్ము లగుచు, భరతుఁ గొనియాడి రౌనని, గిరికుమారి!

వ. అంతఁ బ్రభాతకాలంబునం బయనమై చనుభరతుని వెనువెంట సుమంత్రచోది
తులై గజాశ్వపురస్సరు లగుసైనికు లరుగఁ దొడంగిరి. మఱియుఁ గౌసల్యాది రాజ
భార్యలును, వసిష్ఠాదిబ్రాహ్మణోత్తములును, బ్రయాణం బై రిట్లు సర్వ సైన్యంబు
పుడమిం గప్పుచున్నదో; యన ముందువెనుకల నుభయపార్శ్వంబులను బలసి
కొలువ శత్రుఘ్నచోదితమై శృంగబేరపురంబు సేరి తత్సమీపవర్తి యగుగంగా
తటంబున నెల్లెడ విడిసి నప్పుడు. ౪౭౭

గుహుఁడు భరతుని రామద్రోహినిగాఁ దలఁచుట

క. భరతుఁడు తనగ్రామమునకు, నరుదెంచె నటన్నమాట నాలించి గుహుం
డతిముఱి శంకితమతి యై, కరము విచారించె నెద, నగప్రియపుత్రీ! ౪౭౮

గీ. ప్రబలసేనాయుతమ్ముగ భరతుఁ డిప్పు, డరుగునంశముఁ బరికింప నవిదితాత్ముఁ
డైనరామభద్రున కెద్దియేనిఁ గష్ట, మొనరుపం బోలు నే మొకో? యనుచుఁ దోఁచె.

క. చని యటకుఁ దన్మనంబుం, గనఁదగుఁ, బరిశుద్ధుఁ డైన గంగానది దాఁ
టును బడవలసాయమ్మున, ననువుగఁ; గాకున్న; నెదిరి యని యొనరింతుర్. ౪౮౧

వ. అని జ్ఞాతులం బిలిచి. ౪౮౨

క. దాయాదులార! మీరు స, మాయత్తత నెల్లకడల నరయుచు నిలువుం
డాయుధపాణులతో నని, ధీయుక్తి వచించి గుహుఁ డతిత్వరితగతిన్. ౪౮౩

గుహుఁడు భరతునిసన్నిధి కేఁగుట

వ. వివిధోపాయనంబుల నపరిమితంబుగ గ్రహించి ధనుర్ధరులును బహువిధాయుధ హస్తులు నగుబంధుజనులతో రఘుకులజాతునికడకుం బోయి, స్వసంగృహీతోపాయనంబులఁ దదగ్రభూమి నునిచి. ౪౮౪

సీ. నారచీరలుగట్టి నవ్యజటామకుటోత్తమాంగము గల్గి యుర్విమీఁద
శత్రుఘ్నుతో మంత్రిజనులతోడను సమాసీనుఁడై యుండినశిష్టచరితు
రామ! రామ! యటంచు రఘుసత్తమునిఁగూర్చి, యడలువానిని ఘనశ్యామలాంగు
భరతుని వీక్షించి, శిర మంట భూస్థలిఁ, దనపేరు సెప్పి వందన మొనర్ప
ఆ. లేవఁ దీసి కౌఁగిలించి గాఢమ్ముగ, నాదరమునఁ గుశల మడిగి పలికె
సఖుఁడ! యిందు రామచంద్రునితోఁ గూడి, యుండునట్టియోగ మొదవె నీకు.

భరతుఁడు గుహునిఁ బ్రశంసించుట

చ. అమలమనస్కుఁడుం ద్రిభువనావనుఁడుం గరుణాళుపూర్ణ జగ
ద్విమతవిదారి యైనరఘువీరునికౌఁగిటఁ జేరు మేటిభా
గ్యము లభియించె నీకు సఖుఁడా! కృతకృత్యుఁడ వైతి వీవు ధ
న్యము భవదీయజన్మము మహాత్ముఁడు నిన్గని మాట లాడుటన్. ౪౮౬

క. అనుజసతీయుతుఁ గులవ, ర్ధనుని మదగ్రజుని నెచట దర్శించితి? వెం
దు నిలాప్రియసుతతో న,య్యనఘుఁడు నిదురించెఁ? దెలుపు మఖిలము సుకృతీ!.

వ. నన్నుం గొని చని యాయాప్రదేశమ్ములం జూపింపుము. ౪౮౮

క. అని తలఁచి తలఁచి శ్రీరాముని నశ్రుపరీతనయనముల నానిశిఁ బు
చ్చెను గుహునిఁ గూడి భరతుం, డనఘుం డగ్రభవుఁ డతని కగపడినకడన్. ౪౮౯

భరతుఁడు, రాముఁ డుండిపోయిన తావులం దిలకించుట

వ. అంతఁ బ్రాతఃకాలంబున. ౪౯౦

సీ. అన్న నిద్రించినయట కేఁగి కుశసమాస్తృత మయి జానకీదేహవిస్ఫు
రద్విభూషణలగ్నరమణీయహేమబిందూజ్జ్వలం బయి పొలుపొందు పుడమి
వీక్షించి, శుష్కహృదయుఁడై విలపించె, నక్కటా సుకుమారి యైనసీత
జనకనందిని రామచంద్రునితో మేడ, నభినవరత్నపర్యంకమందుఁ
గీ. దతశుభంకరకోమలాస్తరణమునఁ బరుండు నట్టిది; యెట్లు పరుండెఁ గర్క
శంబు దుస్సహకుశవిస్తరంబునందుఁ, గష్టపడు, చిది మత్పాపగరిమ గాదె?. ౪౯౧

గీ. కలుషరాశికి నెనయగు కైకకడుపు, నందుఁ బొడమితి నాఁబ్రతు కెందు కిస్సి?
నా నిమిత్తము, పరమాత్ముఁ డైనరామ, చంద్రునకు నింతటివిపత్తు సంభవించె. ౪౯౨

క. వనమున నున్నను రాముని, ననుదినమును వెంట నంటి యతిమోదమునన్
జనుధన్యుఁ డగుసుమిత్రా, తనయుని జన్మంబు ధన్యతమ మహోరా?. ౪౯౩

క. దాసజనకల్పకం బగు, శ్రీసీతాజీవితేశు శిష్యుల శిష్యుం
డౌ సన్నుతచరితున కే, దాసుఁడ నైనన్ జననము ధన్యతఁ గాంచున్. ౪౯౪

గుహుఁడు భరతునకు రాముని యునికిఁ దెలుపుట

చ. వరగుణుఁ డాతఁ డిచ్చట నివాసముఁ జేసెనొ; నీ వెఱుంగు దే
ని రహి సమస్తముం జెపుము, నే నెటు లేనియుఁ దోడికొంచు రా
నరుగుచు నున్నవాఁడను రయంబున నావుడు నాతఁ డిట్లనెన్
భరతుని నిర్మలాత్మునిఁగ భావమునం దలపోసి ప్రీతిమై. ౪౯౫

ఉ. నీ వతిధన్యమూర్తివి వినిశ్చలనిర్మలదీర్ఘభక్తి సీ
తావరు నంఘ్రులందు వసుధాసుతయందు సుమిత్రపట్టిపైఁ
గేవల మిట్టు లబ్బుట; నృకేసరి! రామపదారవిందసం
సేవన మబ్బుపుట్టువు లచింత్యనిరంతరసౌఖ్యపాత్రముల్. ౪౯౬

సీ. చిత్రకూటాద్రికిఁ జెంగట మందాకి, నీనికటమున మునిప్రవరుల
యాశ్రమపదమునం దవనీకుమారితో, ననుజుండు లక్ష్మణుం డనుచరింప
నున్నాఁడు సర్వదేవోత్తముఁ డఖిలేశుఁ, డగురాఘవుండు సుఖైకవృత్తి
నచటికి నేఁగు మియ్యడియ గంగను దాఁటఁ, దగిన తావని త్వరితముగఁ బోయి
గీ. నావ లేఁబది దెచ్చి సైన్యమును బుచ్చి, కడపె స్వయముగ రాజనౌకను వసిష్ఠ
భరతశత్రుఘ్నులను రామభద్రుజనని, నందు నెక్కంగఁ జేసి యమందగతిని. ౪౯౭

క. ఇతరస్త్రీలను గైకను, హిత మగుమఱియొక్క నావ నెక్కించి సుఖ
స్థితి నడపఁగఁ గైవర్తక, పతి యాజ్ఞాపించెఁ దగినబంధుజనములన్. ౪౯౮
వ. ఇట్లు గుహుండు దాఁటింప. ౪౯౯

భరద్వాజుఁడు భరతునిం బ్రశ్నించుట

ఉ. ఓజ నదిం దరించి సుగుణోత్తరుఁ డా భరతుండు దా భర
ద్వాజుని యాశ్రమంబునకు దవ్వుగ సైన్యము నిల్పి సానుజుం
డై జతనంబు మీఱ ముని నారయఁ బోయి నిజాశ్రమంబునన్
శ్రీఁ జెలువారువాని మునిశేఖరుఁ బ్రజ్వలదగ్నిసన్నిభున్. ౫౦౦

వ. భరద్వాజుఁ గూర్చున్నవానిఁ గనుంగొని నిస్తులభక్తి సాష్టాంగనమస్కారంబు గావించుటయు, జటివరుం డతని దశరథసుతునిఁగాఁ దెలిసి ప్రీతిపూర్వకంబుగాఁ బూజించి కుశలం బడిగి జటావల్కలధారణమ్మునకు శంకించి యిట్లనియె. ౫౦౧

చ. ఇపుడు సమస్తరాజ్యమున కేలికవై ప్రజ నేలునట్టి నీ,
వపగతరాజలాంఛనుఁడ వై జడలల్లియు నారచీరలం
గృపణతఁ గట్టినాఁడ విది యేమి? తపస్విజనానుకూల మీ
విపినము ధారుణీశ! వినిపింపు యదర్థము వచ్చినాఁడవో; ౫౦౨

భరతుఁడు తన నిశ్చితాభిప్రాయమును భరద్వాజునకు విన్నవించుట

చ. అనవుడు సాశ్రునేత్రుఁ డయి యబ్భరతుం డను నెందు మీ రెఱుం
గని దిసుమంత యైనను జగంబునఁ గల్గదు; నీవు సర్వభూ
తనిచయసంస్థితుండవు యథార్థము సుమ్ము మహానుభావ! యై
న నిటులఁ బృచ్ఛసేయుటలు నన్ను ననుగ్రహపాత్రుఁ జేయుటల్; ౫౦౩

గీ. ఓమునీంద్ర! కైక యొనరించినట్టి శ్రీ, రామరాజ్యవిఘ్న మేమి; విపిన
వాసముఖ్య మేమి; భవదంఘ్రిపంకేజ, యుగళసాక్షి నే నెఱుఁగను జుండి! ౫౦౪

గీ. అనుచు మునిపాదములు ముట్టి యార్తితోడ, ననియె నే నపరాధినో; యనపరాధి
నో; నిజం బెఱుఁగంగ నర్హుఁడవు నీవ; మన్మనోనిశ్చయము విను మానితిలక! ౫౦౫

సీ. రాజాధిరాజు శ్రీరాముఁ డుండఁగ నాకు, దుర్భరరాజ్యంబుతోఁ బ నేమి?
కింకరుండను జానకీకాంతునకు సదా, నే నందువలన మానీంద్ర! తత్ప
దాంతికమున కేఁగి యభివందన మొనర్చి, బహువిధరాజ్యసంభారములను
నర్పించి యభిషేక మచ్చోటనే వసిష్ఠాదులతోఁ బౌరజానపదుల
గీ. తో నొనర్చి యయోధ్య కతుల్య రామ,చంద్రు లక్ష్మీవిభునిఁ గొనిచనుద, నీచ
సరణి దాసుఁడ నై పరిచర్య సల్పు,చుందు నిజ మిందు సందియ ముండ దనుడు.

క. ఆమాటలు విని మౌని, గ్రామణి కౌఁగిటను జేర్చి రాజకుమారుఁ
బ్రేమ శిరంబును బుడుకుచు, హైమవతీ! పొగడి పలికె నతివిస్మితుఁ డై. ౫౦౭

గీ. వత్స! యిదియెల్ల నా కిదివఱకె జ్ఞాన,దృష్టిమహిమఁ దెల్లమ్ముగఁ దెలియవచ్చె
దుగఖపడకుము రామభద్రునకు నీవు, మేటిభక్తుండ వైతి సౌమిత్రికంటె. ౫౦౮

భరద్వాజుఁడు సైన్యయుతముగ భరతునకు విందు సేయుట

క. సేనాసహితుఁడ వగు నీ,కే నాతిథ్యం బిడంగ నెంచితి మదిలోఁ,
గాన భుజియించి నేఁ డిట, జానకివిభుకడకు తేపు చనఁదగు ననఘా!. ౫౦౯

వ. అని పలికి యతం డందుల కనుమతింప జలంబులు ముట్టి హానంబున హోమ
గృహాస్థితుం డై కామప్రదుం డగునభ్భరద్వాజుండు కోరికల నపారముగఁ గల్పించు
వేల్పుటావుం దనమనంబున స్మరించుటయు. ౫౧౦

సీ. ఆ ధేను వెవరి కెయ్యది యిష్ట మది యెల్ల, మునిమానసమునఁ బ్రమోద మొదవ
వర్షించె నప్పు డవ్వారిగ, శాస్త్రోక్త, శిష్టానుసరణి వసిష్ఠహాని
ముఖ్యునిఁ బూజించి ముందుగఁ, దరువాత, భరతు సైన్యోపేతుఁ బరమహాని
తుష్టుఁ గావించె విందున, నిందుముఖి! యట్లు, సురలోకముం బోని సుభగ మైన
గీ. యమ్మహాముని యాశ్రమమందు నొక్క,దనముఁ బుచ్చి వేగుటయు వందన మొనర్చి
యనుజయుతముగ వెడలి తదాజ్ఞఁ బడసి, భరతుఁ డేఁగెను శ్రీరామభద్రుఁ జూడ.

వ. అట్లు చిత్రకూటశైలంబు డాయం జని సైనికుల దూరంబున నుండ నియమించి
రామసందర్శనాకాంక్షియై శత్రుఘ్నసుమంత్రగుహులతో స్వయముగ నేఁగి
యందుఁ గలతపస్విమండల మెల్ల వెదకి, యెందును రామచంద్రుని మందిరంబు
గానక సీతాలక్ష్మణసమేతుం డగుసాకేతాధిపుం డెచ్చటనున్నాఁ డని జడదారుల
నడుగ వార లిట్లనిరి. ౫౧౨

క. అదె; శైలమునకు వెనుకఁగ, నది కుత్తరభాగమునఁ గనంబడు సీతా
హృదయేశుఁడు నివసించెడి, సదనంబు వివిక్తదేశసంస్థిత మగుచున్. ౫౧౩

భరతుఁడు రామాశ్రమముం బ్రవేశించుట

సీ. అని చూప రమ్యకాననమండితము, కోవి, దారపున్నాగాదితరుభరితము
నేత్రపర్వంబు పవిత్రతరం బతి,భాసురం బఖిలతపస్వినికర
సంసేవితము రామచంద్రాభిరామంబు, లాలితభూజాగ్రలగ్నవల్క
లాజినం బగుమైథిలీజానిగేహంబు, కన్నులపండువుగాఁగఁ జూచి
గీ. పట్టరాని సంతసమునఁ బరవశుఁ డయి, తత్సమర్పితదృష్టి సోదరమునివర
యుతముగానాశ్రమప్రాంగణోర్వి డాసె,విమలహృదయుఁడుభరతుండుకమలవదన!.

వ. సీతారామపదాబ్జచిహ్నితంబును, బవిత్రంబును, శుభకరంబు నగునయ్యాశ్రమ
పదంబు ప్రవేశించుడు. ౫౧౫

క. అంకుశవజ్రధ్వజసిత, పంకేజప్రముఖదివిజభావితశుభరే
ఖాంకితము లడుగుజాడలు, శాంకరి! కన నయ్యె రామచంద్రుని వచటన్. ౫౧౬

గీ. చూచి తద్రజస్సు సోఁకంగ మెయినిండఁ, బుడమిమీఁదఁ బడి రిపుఘ్నుతోడ
"నెట్టిభాగ్య మబ్బె నిప్పుడు మన" కని, పొరలి పొరలి మఱియు భరతుఁ డపుడు,

క. తొలిపల్కులు బ్రహ్మాదిసురలు నెవ్వని దివ్యచరణరజమున కై ని
చ్చలు వెదకుదురో; యారఘుతిలకు పదాబ్జాంకితప్రదేశముఁ గంటిన్. ౫౧౮

వ. ఏతత్ఫలంబునంజేసి పుణ్యవంతులలో నగణ్యపుణ్యవంతుండ నైతి నని తనలోఁ
దా నుప్పొంగుచు సమధికప్రేమరసాప్లుతాశయుండును రామధ్యానపరచేతస్కుం
డును నై, వెక్కస మై పొంగి పొరలు నానందబాష్పధారల నురమ్ము గరమ్ముఁ
దడియుచుండ మెల్లన లోనికిం జనియె, నట్లు చని. ౫౧౯

భరతుఁడు శ్రీరామునిం గాంచుట

సీ. భరతుండు గాంచె నత్తఱి సుఖాసీను, దూర్వాదళశ్యాములు, వారిజాయ
తాక్షుఁ బ్రసన్నవక్త్రాంబుజు, నవవల్కలాంబరుఁ దరుణారుణాభతేజుఁ
బ్రధ్వీసుతాముఖార్పితనేత్రు లక్ష్మణసేవితచరణరాజీవయుగళు
లోకైకవంద్యు జటాకిరీటు మనోజకోటిసుందరు రఘుకులపవిత్రుఁ
గీ. గాంచి, యిది యేమి యిటు లుండె? నంచుఁ గన్ను
లార నేటికిఁ గనుఁగొంటి నంచు, శోక
మును ముదంబును బొడమఁ జయ్యనఁ బరు గిడి
గట్టిగా రెండుకాళ్లను బట్టికొనియె. ౫౨౦

సీ. పదపల్లవంబులం బడి యట్లు బిగబట్టి కొనియున్నతనతమ్ముఁ గాంచి భరతు
నిజభక్తినిరతుని నజినజటాధరు, వ్యగ్రచిత్తంబున నరసి, తోన
దీర్ఘబాహుండు రఘుతిలకుండు నెయిరు, కరములఁ బై కెత్తి కౌఁగిలించి
కనుదామరలఁ దొలంగినసమ్మదోదకకణములఁ దడిపి, యంకమ్ముమీఁదఁ
ఆ. గూరుచుండఁ బెట్టికొని యంతి కంతకుఁ బ్రేమ నెక్కొనంగఁ బెక్కుమార్లు
పరమయోగిదుర్లభం బాత్మపరిరంభణం బొసంగె, విమలనలిననయన!. ౫౨౧

చ. తదుపరి దల్లు లందఱును దప్పికచేఁ బరిపీడితాంగ యై
మొదవు జలాంతికంబునకుఁ బోవువిధంబున రామభద్రునిఁ
గదియఁగఁ బోయి రాతురతఁ, గాంచి స్వమాతను లేచి మ్రొక్కెఁ ద
త్పదములు సోఁకఁగా శిరము, భవ్యచరిత్రుఁ డతండు సుందరీ!. ౫౨౨

క. ఆగతి నడుగులఁ బడుసుతుఁ, గౌఁగిట నిడి మిగుల దుఃఖకర్శిత యయ్యెన్
నాగేంద్రగమన, యట్లె సమాగతమాతలకు మ్రొక్కె నతివినయముగన్. ౫౨౩

క. అంగన! యంతట రవికులపుంగవుఁడు వసిష్ఠమౌనిపుంగవుఁ గని సా
ష్టాంగనమస్కారరిచి యుప్పొంగుచు ధన్యుండ నైతిఁ బుణ్యచరిత్రా!. ౫౨౪

వ. అని పలుమాఱు పలికి తగువిధంబున నెల్లరం గూర్చుండఁ బెట్టి గురునితో నిట్లనియె.

క. ననుఁగన్నతండ్రి కుశలియె, వనమునకుం దన్నుఁ బాసి వచ్చుకతమునన్
బెనువనఁట మునిఁగి యతఁ డే,మని నాతోఁ జెప్పు మనియె ననఘా! చెపుమా!

వ. నావుడు దీనవదనంబున జనకుని క్షేమం బడుగుసీతావల్లభున కరుంధతీవల్లభుం డిట్లను. ॥ ౨౭

రాముఁడు పితృమరణమునకు దుఃఖించుట

సీ. నీతండ్రి మితిలేనినీయెడఁబాటుచేఁ, బరితప్తచిత్తుఁడై పవలు రేయి
నిన్ను లక్ష్మణు నవనీపుత్రిని దలంచి, వాపోయి తుదకు స్వర్వాసి యయ్యె,
ననవుడుఁ గర్ణశూలాభ మై భయద మై, చెవినాట గురుమాట చిత్త మెరియ
హా హాతోఽస్మియటంచు నడలుచు సౌమిత్రి,యుతముగ శ్రీరాముఁ డుర్విఁ గూలెఁ
ఆ. దల్లులంద అపుడు గొల్లున వాపోయి, రితరజనులుగూడ నేడ్చి రట్టె
కొంతతడవు, రాముఁ డంతటఁ దనతండ్రిఁ, దలఁచుకొనుచు నిట్లు దల్లడిల్లె. ॥ ౨౮

క. అయ్యో నాయన! నను విడి, యెయ్యెడ కేఁగితివి కరుణ కిక్కవు గద; నా
కు య్యాలింపఁగ రాదే, దయ్యముచే వెక్కసముగఁ దలఁపఁగఁ బడితే; ॥ ౨౯

గీ. దిక్కులేనట్టివాఁడ నైతి నిఁకమీఁద, నో మహాబాహు! భువి మనియుండు టెట్లు?
దివికి నీ వేఁగఁ గూర్మి నన్నెవరు దొంటి,గతిని లాలించువారలు కన్నతండ్రి!

వ. అని రాముండు విలపించునవసరంబున. ॥ ౩౧

రామలక్ష్మణులు పైతృకక్రియ లాచరించుట

ఉ. సీతయు లక్ష్మణుండును విశేషముగాఁ బలవించి రావయిన్
స్ఫీతయశోవిశాలుఁడు వసిష్ఠుడు దుఃఖముఁ బాప శాంతవా
గ్వ్రాతముచేఁ, బవిత్రులయి వారలు గంగకుఁ బోయి పూత మహా
నాతటినీజలంబులను నందఱు స్నాన మొనర్చి, రంగనా!. ॥ ౩౨

గీ. ఉదకకాంక్షు లైనయుర్వీపతికి నప్పు, డెల్లవారు జలము లిచ్చి రంత
జానకీవిభుండు సౌమిత్రితోఁగూడి. శ్రద్ధమిగుల వేదసమ్మతముగ. ॥ ౩౩

వ. గారపండ్లతోడను దెలికపిండితోడను జేయఁబడి తేనియం దడిపినపిండంబులఁ దండ్రి కొసంగి, "మే మెయ్యది దినుచుంటిమో; యదియ కదా మీకు నీయవలసిన" దని పితరులం గూర్చి చెప్పుచు, దుఃఖాశ్రుపూర్ణలోచనుం డై మరల స్నానం బొనర్చి నిజాశ్రమంబున కరిగె. ॥ ౩౪

క. వా రందఱు బహుకాలము, భూరమణునిఁ గూర్చి మిగులఁ బొగులుచు నల్లే
నీరముల మునిఁగి యుటజము, చేరిరి దీనాననముల, క్షితిభృత్పుత్రీ! ౫౩౫

క. ఆనాఁ డెల్ల భుజించుట, మాని నిరాహారు లగుచు మఱుదినమున గం
గానద్యమలోదకముల, స్నానము గావించి యున్న సందర్భమునన్. ౫౩౬

భరతుఁడు రాజ్యముం గొమ్మని రాముని వేఁడికొనుట

సీ. భరతుండు జానకీపతి సన్నిధికిఁ బోయి, యోమహాభాగ! శ్రీరామచంద్ర!
యనఘ! నీవే నిన్ను నభిషేక మొనరించుకొను మెవ్వ రిందుఁ గా దనెడివారు
జనకునివలన వచ్చినసర్వరాజ్యంబుఁ, బాలింప నా కెట్లు పాడి యగును?
ఈవు జ్యేష్ఠుఁడవు కాదే? తండ్రి యుండఁగా, నెట్లో; నీ వుండఁగా నట్లె నాకు
గీ. లేదు రాజ్యాధికార, మనాదిగ మన,క్షత్రజాతిని జ్యేష్ఠుఁడే సకలరాజ్య
మునకు నధికారి యై జగజ్జనుల నేలుచుంట యాచార మై వచ్చుచుండె, నన్న!.

చ. అడవుల సంచరించుసమయం బిది గాదు, సమస్తయజ్ఞముల్
విడువక చేసి కామదుల వేల్పులఁ సంతసపెట్టి సంతతిం
బడయుము వంశవృద్ధి, కటుపై సుతు రాజ్యమునందు నిల్పు, మ
ప్పడు వనవాసముం జరుపఁ బూనుము, వీని ననుగ్రహింపుమీ. ౫౩౮

ఉ. తమ్ముఁడ, యుష్మదాజ్ఞఁ దలఁ దాల్చి మెలంగెడునట్టివాఁడ, మా
యమ్మ నినుం వనంబునకు నంపఁగఁ జేసినదుండగమ్ము భా
వమ్మున నించుకైనఁ దలపం దగ దెప్డుఁ, బ్రసన్ను మైన చి
త్తమ్మున మమ్ముఁ బ్రోచు టిఁకఁ దప్పదు తప్పదు, జానకీపతీ!. ౫౩౯

క. అని పలుకు చన్నయడుగులు, తనతలపైఁ జేర్చి భక్తి దగఁ గైకేయీ
తనయుఁడు దండాకృతిఁ బడియెను భూస్థలి రాము నెదుట, హిమగిరితనయా!.

రాముఁడు భరతునకుఁ బిత్రాజ్ఞ యనుల్లంఘనీయ మని చెప్పుట

సీ. రాముఁ డమ్మెయిఁ గాళ్ల వ్రాలినయనుజన్ము, వేవేగ కరముల లేవ నెత్తి
యొడిమీఁద నిడికొని యుత్తమతద్భక్తి, దర్శనోద్ధస్నేహతరళితార్ద్ర
నయనుఁడై పల్కెఁ దిన్నఁగ, వత్స! యాలింపు, నీవు చెప్పిన దెల్ల నిజమె కాని
యిది మొదల్ పదునాలుగేఁడులు దండకారణ్యంబునం దుండి రమ్ము పిదపఁ
గీ. బురికి, నందాఁక రాజ్యంబు భరతునికి నొసంగితి నటంచు నాతోడ జనకుఁ డనియె
నందుచే నీకు సకలరాజ్యంబు, నాకు, దండకారణ్యరాజ్యంబుఁ దప్పని యవి.

క. కాన యెటువంటియాపద, లైనను మనతండ్రి చెప్పి నట్లు మెలంగం
గా నగు మన కిరువురకును, బూని మఱొక్కగతి నడువఁ బోలదు భరతా!.

గీ. తండ్రిమాట నుల్లంఘించి, తా స్వతంత్రుఁ, డై చరించు నేమానవుఁ; డట్టివాఁడు
బ్రతికియుండియు నిల మృతప్రాయుఁ డగు మ,హోగ్రనరకంబునం గూలు నుసురు పాసి.

క. పాలింపు మీవు రాజ్యము, పాలింతుము మే మరణ్యభాగము, పితృవా
క్పాలనము సద్యశమునకు, మూలము నా, నతఁడు రామమూర్తికి ననియెన్.

సీ. మూఢమానసుఁడు కాముకుఁడు స్త్రీవిజితుఁడు, భ్రాంతాత్ముఁ డున్మాదపరవశుండు
మనతండ్రి; యట్టివాఁ డనినది యెల్ల స,త్యం బంచుఁ గైకొనఁ దగదు, పండి
తుఁడు భ్రాంతచిత్తుని నుడివోలె, శ్రీరామ! యే నేడ? భూభార మేడ? మోయు
టేడ? నానెత్తిపై నెందుకుఁ బెట్టెదు? దయఁ జూడు మనుఁడు సీతావిభుండు,
గీ. జనకుఁ డీ వన్నరీతిని జడుఁడు కాము,కుఁడును జేడియవలఁ దగుల్కొనినవాఁడు
నై పలుకలేదు; నాతోడ నిపుడు సత్య,వాది యేటికి నళ్లీలవాది యగును?. ౫౮౫

క. "కైకేయికి మున్నిచ్చెదఁ, గాక యనిన ప్రతిన నెఱపకయ పోయినచోఁ
జేకుఱు నరకం" బని సుగు,ణాకర! యిటు లాచరించె; నన్యము గలదే?. ౫౮౬

క. అనృతమ్మువలన నరకం,బునకంటెన్ భయము హెచ్చు వాడమును జూ; స
జ్జనులకు, నిదిగా కత్తెఱఁ,గున కే నట్లె యని యొప్పకొంటిని, వత్సా!. ౫౮౭

చ. వసుధఁ బ్రశస్తి నున్న రవివంశమునం దుదయించి, యన్నమా
ట నలుపఁ జాల కెట్టు లకటా మృష లాడి పురంబు సొత్తు? వం
గనమున కప్రతిష్ఠ నిడుకంటె నరణ్యపు టున్కి సౌఖ్య మై
పొసఁగదె? తమ్ముఁడా! తిరుగఁబో దిఁక నామన మంచుఁ బల్కినన్. ౫౮౮

వ. భరతుం డిట్లను సువ్రతుఁడా! నీ వన్నట్లు నీకు బదులుగఁ బదునాలుగేం డ్లేను
జటావల్కలధారి నై వనవాసంబు సేసి వచ్చెద, సుఖంబుగ రాజ్యంబునకుఁ
బ్రభుండ వై ప్రజాపాలనంబు నిర్వర్తింపు, మనుడుఁ గౌసలేయుండు. ౫౮౯

సీ. అనుఁగుఁదమ్ముఁడ! విను మనతండ్రి రాజ్యంబు, నీకె యొసంగెను, నాకు వనము
నిచ్చె, నే నందుల కిష్టుడు వైపరీ,త్యముగఁ గాననమునఁ కంపి నిన్ను
నీరాజ్యమును గొంటి నేని; మున్నటియట్ల, సత్యభంగము నాకు సంభవించు
నేటి కీమాట లీ వేఁగు మయోధ్యకుఁ, బాలింపుమీ మేము వచ్చుదనుక
గీ. ననుఁడు నేఁ గూడ వత్తు నీ వెనుక లక్ష్మ,ణుని విధంబున నీదుసేవను బొనర్తు
నిందులకు నేఁడు సమ్మతిఁ జెంద వేని; విడుతుఁ బ్రాణముల్ ప్రాయోపవేశమునను.

వ. అని పల్కి భరతుండ దేవిధమ్మున నొనర్ప మనంబునం గృతనిశ్చయుం డై. ౫౫౧

గీ. పఱచి దర్భల భూమిపైఁ, బ్రాఙ్ముఖముగ, నెండలోఁ గూరుచుండె, నర్థేందునిటల!
తమ్ముఁ గుఱ్ఱకుఁ గల పట్టుదలను జూచి, విస్మితుం డయి రఘుకులవీరుఁ డపుడు.

వసిష్ఠుఁడు భరతునకు దేవరహస్యముం దెల్పుట.

క. కడకంటిసైగ సేయఁగ, జడదాగులతోఁడు దవ్యచరితుఁడు గురుఁ డే
ర్పడ నివ్వతునునఁ దెలుపఁగఁ, దొడఁగె రహస్యముగ భరతుతోఁడఁ బడఁతీ!.

క. కర మాశ్చర్యకరం బౌ, పరమరహస్యంబు దెలియఁ బలికెద వినుమీ
నరనాథకుమారా! నీ, వెఱుఁగవు వైకుంఠనాథుఁ డీరాముఁడె పో. ౫౫౪

గీ. తమ్మిచూలి యాచనమీఁద దశశిరస్కు, నణఁప ధరణీతలంబున నవతరించె
నాజికోడుకయి, యోగమాయయు విదేహు, కూఁతురై యుద్భవించెను సీతయనఁగ.

క. ఉరగపతి లక్ష్మణుం డై, భరతా! నిరతంబు రామభద్రుని వెంటం
దిరిగెడు, నిప్పుడు రావణుఁ, బొరిగొనఁ బోయెదరు విపినభూమికి మువురున్.

సీ. కౌసలేయుఁడు దండకను గాపురం బుంట, నీకు రాజ్యం బబ్బ నీదుతల్లి
యధిపుఁ గోరుట యెల్ల నమరకల్పితము, కాకున్నచోఁ; నామె యిట్లెన్నఁడైనఁ
బల్కంగఁ దొందరపడునె? యెక్కుడిమాట, లివి; వత్స! వనమున కేఁగు రాము
మరలించుపూనిక మాని మహాసైన్యమాత్యయుతంబుగా మరలి పురికి

గీ. నరుగు మీవు, దశగ్రీవు నఖిలబంధు, సహితముగఁ జంపి రాముండు సత్వరముగ
రాఁగలం, డన నత్తపోరాశిమాట, కధికవిస్మయమును జెందె, నాతఁ డంత. ౫౫౭

భరతుఁడు రామునిం బ్రార్థించి తత్పాదుకలం బడయుట

వ. ఆశ్చర్యరసోల్లసితమ్ము లగులోచనమ్ములతో నన్నను డాసి, ౫౫౮

గీ. అఖిలలోకైకపూజ్యంబు లైననీదు, పాదుకల నొసంగుము రాజ్యపాలనమున,
కేను దత్సేవఁ జేయుచు నీవు వచ్చువఱకు వేచియుండెద నరపాలచంద్ర! ౫౫౯

క. అని దివ్యపాదుకల రాముని పాదాంభోజయుగళమునకుం దొడుగఁగ,
గని యనుజభక్తి కలరుచు, వనితా! సీతావిభుండు వాని నొసంగెన్. ౫౬౦

ఉ. అన్న యొసంగ రత్నసముదంచితపాదుకలన్ గ్రహించి తాఁ
గన్నులఁ బ్రీతి నద్దికొని కైకకుమారుఁడు చుట్టివచ్చి, వి
ద్వన్నుతుఁ డైనరామునకుఁ బల్మఱు మ్రొక్కి విశేషభక్తి నీ
తెన్నున నాత్మనిశ్చయముఁ దెల్పెను గద్గద మైనవాక్కుతోన్. ౫౬౧

క. పదునాలుగేండ్లు గడచిన, తదుపరిదినమందు నాకు దర్శన మొసఁగన్
సదయుఁడ వై రాకుండిన, సొద సొచ్చెద నిక్క మిది, విశుద్ధవిచారా! ౫౬౨

చ. అనవుడు జానకీరమణుఁ డట్లనె వత్తు ననుంగుఁ దమ్ముఁడా!
మనమున సంశయింపకుము, మంత్రిపురోహితబాంధవాళితో
జనములతో నయోధ్యకుఁ జయ్యనఁ బొమ్మన నావిధంబుగా
ననఘుఁ డశేషు వేఁ బయన మయ్యెను, సయ్యెడఁ గైక యొయ్యనన్. ౫౬౩

కైక రామునియెదుట స్వయంకృతాపరాధమునకుఁ బశ్చాత్తాపపడుట

వ. నయనయుగళంబునుండి యశ్రుబిందువులు తొరఁగ మోడ్పుకేలుతో నేకాంతమ్మున
సీతాకాంతున కిట్లనియె. ౫౬౪

సీ. పురుషోత్తమా! దుష్టబుద్ధి నై మాయా వి,మోహిత మగుమనమ్మునఁ దెలియక
యాచరించితిని బట్టాభిషేకమునకు, విఘ్న మానాఁడు, నా విన్నపంబు
నాలించి క్షమియింపు మయ్య! దౌర్మార్గ్యంబు, సజ్జనుల్ భువి క్షమాసారులుగద?
నీ వన నిజముగ నీరేజగర్భాది, సురలకుఁ దెలియనిసరణి మెలఁగు
గీ. చాది గనరాక పరమాత్మ వై వెలుంగు, విష్ణుఁడవు; కపటమానుష వేష మూని
ముంచుచున్నావు జగ మెల్ల మోహవార్థి, శ్రీమహోద్దామ! తారకనామ! రామ!

క. అనఘ! భవత్ప్రేరిత మై, జన మఖిలము మంచి చెడ్డ సలిపెడు, స్వేచ్ఛం
గొనక త్వదధీన మై యుం,డిన యీజగ మేమిసేయు? నీ సముపేక్షన్. ౫౬౬

వ. కృత్రిమఁపుబొమ్మలు కుహకేచ్ఛానుసారముగ నర్తనంబు గావించుకైవడి బహు
రూపిణి యైనమాయానర్తకి భవదధీన యై నీయాజ్ఞం జేసి ప్రపంచరంగస్థలం
బున నాట్యమ్ము సలుపుచున్నది. నేను దేవకార్యోన్ముఖుండ వగు నీచేఁ బ్రేరితు
రాల నై పాపహృదయమున నట్టిచెట్ట కొడిగట్టితి. ౫౬౭

క. సురసమితికి సైత మగో,చరుండ వగునిన్నుఁ దెలియఁ జాలితి నన్నుం
బరిరక్షింపు మనంతా! వరద! జగన్నాథ! నీకు వందనము హరీ!. ౫౬౮

క. భవదీయ జ్ఞానామల, నవఖడ్గక్షతిని ద్రెంపు నందనవిత్తా
ద్యవిరళ మైత్రీపాశముఁ, దవిలి నిన్నున్ శరణు వొందెదను విశ్వేశా!. ౫౬౯

రాముఁడు తత్త్వబోధమునఁ గైకేయిం దేర్చుట

వ. అనుటయు. ౫౭౦

గీ. అలరి కైకేయిమాటల కమ్మహాత్ముఁ, డాననంబునఁ జిఱునగ వంకురింపఁ
బలికె, నోతల్లి! యోమహాభాగ! నన్నుఁ, గూర్చి నీవన్న దెల్ల నిక్కువమె చుమ్ము.

క. నే ననుపంగ సరస్వతి, యానాఁడు సుపర్వకార్య మగుకొఱకు కట్టుల్
నీ నోటినుండి వెడలెను, దీనన్ నీకోప మేమి? దేవీ! చెపుమా. ౫౭౨

చ. చను మిఁక నీవు, నన్ను ననిశంబు హృదిన్ భజియింపు మెల్లవ
స్తునిచయమందు స్నేహమును దోఁపఁగ నీయకు, మస్మదీయభ
క్తిని ద్వార ముక్తి గాంచెదవు దేవి! సమానముగా సమస్తముం
గనుఁగొనుచుండు, లే వెచట నాకుఁ బ్రియాప్రియముల్ జగంబునన్. ౫౭౩

వ. ఇంద్రజాలికుఁడు స్వకల్పితంబు లగు సమస్తవస్తువులు మిథ్యాభూతంబు లనియెడు నిశ్చయ ముండుటచే, వేనియందును బ్రీతిద్వేషములు లేక యుండువడువున నేనును లోకముపట్ల శత్రుత్వమిత్రత్వములు లేనివాఁడనై తదనుసరణముం బొందు చుండు. తల్లీ! యస్మన్మాయామోహితబుద్ధులు నన్ను మనుష్యాకృతి గలవానిఁ గను సుఖదుఃఖాదు లనుభవించు వానిఁగను దలంచుచున్నారు గాని యథార్థము మాత్ర మెఱుంగుట లేదు. సంసారబంధచ్ఛేదక మగు మద్విషయికజ్ఞానము మహాభాగ్యంబున నీ కుదయించినది. దీనినే స్మరియించుచు మందిరంబున నుండుము. కర్మపాశంబు లేశంబును నిన్నంటఁజాల దరుగు, మన నానందవిస్మయంబు లావరింపఁ గేకయరాజపుత్రి జానకీకళత్రునకుఁ బ్రదక్షిణంబు సేసి నూఱుమారులు ధారుణిం బడి నమస్కరించి చనియె. అట్లు రాముని మానసంబున ధ్యానించుచు మాతృభ్రాతృగురుమంత్రిపురస్సరంబుగఁ ద్వరితగమనమ్మున నయోధ్య కరిగి యుదారబుద్ధిగల భరతుండు పౌరజానపదుల నెల్లర న్యాయమార్గంబున నందె యుండ నియమించి శత్రుఘ్నునితోఁ దాను నందిగ్రామంబున కేఁగి యుట. ౫౭౪

భరతుఁడు శ్రీరామపాదుకల నర్చించుట

సీ. కౌసలేయుని పాదుకల నిరంతరము సింహాసనమం దుంచి యతులభక్తి
ననవద్యగంధపుష్పాక్షతాద్యఖిలరాజోపచారముల రఘూత్తముఁ డను
భావనతోఁ బూజ గావించుచున్ జటావల్కలధారియై బ్రహ్మచారి
యై ఫలమూలంబు లాహారముగఁ జితేంద్రియతయు భూతలశయన మమర

గీ. దొడ్డవ్రత మూని శత్రుఘ్నుతోడఁ గూడి, యవనిఁ గలిగెడిరాజకీయాంశములను
నమ్మహాపాదుకలకు సమంచితగతి, విన్నవించుచు వర్తించె, నన్నుతాంగి! ౫౭౫

క. కోరుచు రాముని రాక య, నారతమున్, గతదినగణనము చేయుచు సీ
తారమణార్పితమతి యై, గౌరీ! బ్రహ్మర్షికరణిగా నతఁ డుండెన్. ౫౭౬

రాముఁ డత్రిమహర్షిని దర్శించుట

సీ. శ్రీరాముఁ డంతటఁ జిత్రకూటాచల,మునఁ గొన్నినాళ్లుండి మునులు గోర్కెఁ
దనయున్కి నిగ్రహించి దర్శనాపేక్షచే, సతతంబుఁ బురవాసిజనము రాఁగ
సమ్మర్ధమును గాంచి "సాగ దిక్కడ నున్న మనకార్య"మనుచు నెమ్మదిఁ దలఁచి
దండకాగమనతత్పరత నగ్గిరిఁ బాసి, జానకీలక్ష్మణసంయుతముగఁ

గీ. పౌరసంబాధవర్జితపరమసుఖ ని,వాస మగు నత్రియాశ్రమపదముఁ జేరి
నిజతనుద్యుతి వన మెల్ల నిండిపర్వఁ, గూరుచున్నమునీంద్రుఁ గన్గొనె, నపర్ణ!

క. కని, దండమువడువున వం,దనముం గావించి నేను దశరథరాజ
న్యుని తనయుండ రాముండ వం,దనముం బొనరించుచుంటిఁ దాపసవర్యా!. ౫౭౮

చ. జనకుని పూన్కిఁ దీర్ప మునిచంద్రమ! దండక కేను వచ్చితిన్
ఘన మగుమీదుదర్శనము గల్గె నగణ్యనివాసహేతువై,
వినుతికిఁ గాదు నే నతిపవిత్రుండ నైతి భవత్కృపావలో
కనమున నన్న శ్రీపతినిగా మదియందు నెఱింగి రామునిన్. ౫౭౯

క. అస్తోకభక్తి బుధలోకస్తవ్యుఁ డమ్మౌని పూజ గావించెను వి
ధ్వస్తాఘు రఘుకులాంబుధి, కౌస్తుభరత్నమ్ము నుచితగతి, నళిచికురా! ౫౮౦

వ. తదనంతరమున వన్యమూలఫలాదుల నాతిథ్యం బిడి సుఖాసీను లగుసమ్మువ్వురం గని పరమానందంబున ననసూయాగమనంబుం డిట్లను రామా! కడుంగడు వృద్ధురాలును విశేషధర్మజ్ఞయు ధర్మమునం దధికప్రీతిగలదియుఁ జిరకాలతపస్వినియు ననసూయాభిధాన యగునాసహధర్మిణి లోన నున్నది. తద్దర్శనంబు జానకీసుందరి కవశ్యాచరణీయంబు నావుడు, రాఘవుం డంగీకరించి దేవీ! లోని కేఁగి యమ్మహాపతివ్రతకు మ్రొక్కి మ్రక్కున రమ్మని సీత ననుప. ౫౮౧

అనసూయ సీతను సత్కరించుట

ఉ. ఆమె ముదంబునం జని తదంతికసీమకు, దండమో యనన్
భూమిని వ్రాలి మ్రొక్కుటయుఁ బొంగుచు నెమ్మి బయల్పడంగ, బి
డ్డా! మిథిలేంద్రపుత్రి! నను డగ్గఱు మంచుఁ గవుంగిలించి సు
శ్రీమహితంబులున్ దివిజశిల్పికృతమ్ములు నేత్రపర్వముల్. ౫౮౨

గీ. అయిన రెండుకుండలముల నధికభక్తి, నిచ్చె, విమలదుకూలంబు లిచ్చె రెంటి
నంతఁ దనియక మరల దివ్యాంగరాగ, మా శుభానన యొసఁగి యిట్లనె భవాని!

క. కాంతారంబున నీకపయి, నెంతటిశ్రమ మొందియున్న నీ మైపూఁతన్
గాంతిం బాయక నీతను, వెంతయు శోభిల్లుచుండు నిందునిభాస్యా!. ౫౮౩

క. పాతివ్రత్యము ముందుగ, సీతా! శ్రీరాము వెంట స్థిరమతిఁ జనుమీ
నీతో నతఁ డిలు సౌఖ్యోపేతుం డయి చేరుఁగాక విశ్వము వొగడన్ ౫౮౫

క. అని చెప్పి రామమూర్తికి, ననుజసతీయుతముగా సమంచితముగ భో
జన మిడి, కేల్మోడుపుతో, ననసూయాదేవి యిట్టు లనె వినయోక్తిన్. ౫౮౬

గీ. భువనములఁ జేసి వానిని బ్రోవ నీవ, యమరనరతిర్యగాదిరూపములు దాల్తు,
వయినఁ దద్దేహగుణముల యంటుఁ గొనవు, సర్వమోహిని మాయ త్వజ్జన్మభూమి.

వ. అని యనసూయ పలికె నని చెప్పి. ౫౮౮

కాండాంతపద్యములు

చ. సకలసుఖప్రదానదివిషద్ధరణీరుహభాసమానపా
దకమలనిత్యవాసముదితశ్రుతిపారగయోగిధీషడం
ఘ్రిక! కరుణామిళల్లలితదృగ్యుగళా! శమముఖ్యసద్గుణ
ప్రకటితచారుశీల! నిరుపాధికవర్తన! పుణ్యకీర్తనా!. ౫౮౯

భుజంగప్రయాతము.

మరున్నాథనీలోపమ ప్రోజ్జ్వలాంగా!
పరాభూతసంగా! విపత్సాశభంగా!
విరాధాదిదైతేయ వీరాపహర్తా!
పరిశ్లాఘ్యవార్తా! ప్రపంచైకకర్తా! ౫౯౦

క. విస్తృతభుజసారా! వి
ధ్వస్తాసురవార! హీరహరిశుభ్రయశో
విస్తార! భక్తజనతా
నిస్తారకఖేల! ధారిణీపరిపాలా! ౫౯౧

గద్య.

శ్రీమద్భారద్వాజగోత్ర, సీతాంబికాపున్నయార్య చతుర్థపుత్ర,
రామచంద్రకృపాపాత్ర, సూరిజనవిధేయ,
నారాయణనామధేయ ప్రణీతంబగు
నాంధ్రాధ్యాత్మరామాయణంబున
నయోధ్యాకాండము
సంపూర్ణము.



శ్రీ ర స్తు

శ్రీ సీతారామాభ్యాం నమః

# ఆంధ్రాధ్యాత్మరామాయణము

అ ర ణ్య కాం డ ము



శ్రీ భానుసహస్రసద్యుతి,
వైభవ! వైభవవిఘూతవాసవ! నవభు
క్త్యాభవనిదాన! దానర
మాభాసితమూర్తి! విమలమంజులకీర్తీ!. ౧

వ. దేవా! భవుండు భవాని కిట్లనియె. ౨

సీతారామలక్ష్మణు లత్రియాశ్రమమునుండి దండకారణ్యముం జొచ్చుట

క. దిన ముండి యందు నుదయం,బున స్నాన మొనర్చి యత్రిమునిసత్తము వీ
డ్కొని చనువాఁడై, యీక్రియ, ననియెన్ శ్రీరాముఁ డ మ్మహామహుతోడన్.

గీ. మౌనిమండలమండితం బైనదండ,కాటవికిఁ బోఁ దలంచి మే మందఱమును
బయన మైతిమి సెల విచ్చి బాటఁ జూప, భవ్యచరిత! మీ శిష్యులఁ బంపవలయు.

సీ. అనుటయు నమ్మాట కమ్ముని నవ్వి సురాశ్రయ, లోకాభిరామ! రామ!
నిఖిలలోకములకు నీవ మార్గముఁ జూపు వాఁడవు, నీకు నెవ్వాఁడు త్రోవఁ
జూప సమర్థుఁ డౌ జ్యోతిర్మయాకార! యట్లైన నిప్పు డీ వందఱవలె
నభినయించుచునుంటి వజ్ఞాన; మందుచే దారిఁ జూపింతురు వీ రటంచు

గీ. శిష్యుల కనుజ్ఞ నిడి రఘుశ్రేష్ఠు వెంటఁ
దా నరిగి కొంతదూర, మాతఁడు ముదమున
మరలుప, ముదంబున నిజాశ్రమమున కేఁగెఁ
ద న్నిరుపమాద్భుతగుణంబు లెన్నికొనుచు. ౪

క. అరిగి, యటనుండి క్రోశము, సరిద్వరం బొందు దోఁపఁ జతురులకుఁ ద
త్తరణోపాయం బరయఁగ, నరసిరుహాక్షుండు రామచంద్రుం డనియెన్. ౭

ఆ. ఉన్నదా లేద? యీనది నుత్తరింపఁ,జాలు సదుపాయ మో మునిచ్ఛాత్రులార!
మీ రెఱింగినఁ జెపుఁడన్న వార లదిగో, యోడ యొక్కటి దృఢమైన దున్న దిచట.

వ. ఏతత్సహాయమ్మునం జేసి. ౮

క. మేమే మిము దాఁటింతుము, రామా! రండనుచు నోడ రాముఁడు సీతా
సౌమిత్రు లధిష్ఠింపఁగ, హైమవతీ! త్రుటిని జేర్చి రవ్వలియొడ్డున్. ౯

వ. ఇట్లు. ౧౦

చ. నదిని దరింపఁ జేసి రఘునందను మెప్పును గాంచి యంతయే
ముదమున నాశ్రమంబునకుఁ బోయిరి తాపసశిష్యు, లంత భీ
తిదమును ద్వీపిసింహముఖతీక్ష్ణ మనేకమృగప్రకీర్ణ ము
గ్రదనుజసేవితం బయిన కానకుఁ జేరిరి వారు మూగురున్. ౧౧

గీ. ఈలపురుగుల రొదలకు నెల్లకడలు, మాఱుమ్రోయుచునుండ రోమములు నిక్కఁ
బొడువ నడ లొందఁజేయు నొక్కెడను నిల్చి, మేదినీపతి వల్కె సౌమిత్రితోడ. ౧౨

చ. ఇఁకఁబయి జాగరూకత వహించి చరణ్ వలె నేను మిమ్ముఁ బా
యక, యనుజా! ధనుర్ధరుఁడ వై వెనుకం జనుదెమ్ము నీవు, పూ
నిక ధను వెక్కుపెట్టుకొని నే నిదె ముందరఁ బోదు, సీత యా
త్మకుఁ బరమాత్మకు న్నడుమ మాయగతిన్ మనమధ్య వచ్చెడున్. ౧౩

ఉ. దండకయందు నెందు సముదగ్రనిశాచరబాధ మెండుగా
నుండు నటంచు మున్ను వినియుంటిని సోదర! నీవు మాత్ర మీ
యండజయానఁ బాయక సమాహితచిత్తముతోడ రమ్మికే
ముండిన నేమి? యంచుఁ బురుషోత్తముఁ డేఁగెను వారు వెంటరాన్. ౧౪

వ. అట్లు సార్ధయోజనం బరుగ, ౧౫

ఉ. నీరజషండమండితము, నిస్తులనిర్మలదివ్యగంధవాః
పూరితమున్, సదద్భ్రమరపుంజమనోజ్ఞము, దృప్తిపర్వక
ల్హారచరన్మరాళనివహాంచిత మై పొలుపారు నొక్కకా
సారము గానవచ్చె మృగశాబవిలోచన! వారి కయ్యెడన్. ౧౬

రామాదులకు విరాధుఁడు గానవచ్చుట

గీ. దానికడ కేఁగి సలిలంబు ద్రావి ముగురు, నీటికి సమీపముగఁ జెట్టునీడ విశ్ర
మించి రొక్కింతతడవు భూమిధరపుత్రి!, అంతఁ గననయ్యె నొకమహోగ్రాసురుండు.

సీ. క్రకచాతినిశితదంష్ట్రావిడంబితముఖ మవలోకశీలుర కార్తి నిడఁగఁ
బ్రళయమేఘార్భటిఁ బరిహసించెడు గర్జ లఖిలజీవులకు భయమ్ముఁ గూర్ప
నగ్రశూలగ్రథితానేకమానుషం బగుశూల మడర వామాంసమందు
విపినగోచరగజద్వీపిలులాయాది జంతుసంతతులు భక్ష్యములు గాఁగ
గీ. దమకు నభిముఖుఁడై వచ్చు నమితసత్త్వ, దైత్యు నట్టికనుంగొని దళితవైరి,
వీరుఁడు రఘూద్వహుఁడు వేగ విల్లు ఘూని, సజ్య మగుదాని,నవె ననుజన్ముతోడ.

చ. అదె కనుగొంటె లక్ష్మణ! మహాచలకాయుఁడు రక్కసుం డొకం
డెదురుగ వచ్చుచుండె మన కెంతయు భీతుల కార్తి గూర్చు, చిం
తఁ దడయు టేల సజ్య మగు కార్ముకముల్ ధరియించి నిల్చు, నీ
మది కలఁగన్ భయంపడకు మానిని! యంచు మహీజఁ బల్కుచున్. ౧౯

ఉ. బాణము నొక్కదాని బడబాజ్వలనప్రతిభాతిశాయిఁ దాఁ
దూణమునుండి కైకొని యతుల్యుఁడు రామవిభుండు నిల్వఁగా
క్షోణిధరంబుమాడ్కి, దనుజుండు గనుంగొని వారిమూగురన్
శ్రేణియొనర్ప కిట్లనియెఁ గేరుచు నెట్టన నట్టహాసియై. ౨౦

రామవిరాధసంభాషణము

చ. జడలును నారచీరలును జాపనిషంగములున్ ధరించి యీ
యడవుల మౌనివేషముల నంగన నొక్కతెఁ గూడి దుర్మదం
బడరఁ జరించుచుంటి, రకటా నదుఁ బిన్నలుగాఁగ నాకుఁ దోఁ
చెడు మది; మీర లెవ్వరు? వచింపుడు డింపుడు చాపరోపముల్. ౨౧

క. నానోటఁ బడ్డకబళము, లైనారలు చాల జక్క నగువారలు; కా
లానుగతి తప్పి చనఁగా, నేనే; బ్రహ్మాదిసురల కైనఁ దలంపన్. ౨౨

క. భీకరమృగసేవిత మగు, నీ కానకు నేమిపనికి నేతెంచితి, ర
య్యా; కడు సుకుమారులు మృతి, నేకుతె మీ కిపుడు నన్నుఁ జేరుట వలనన్.

చ. అనవుడుఁ బిన్ననవ్వు నగి యంబుజమిత్రకులావతంస మ
ద్దనుజున కిట్లనున్ వినుము దానవ! రాముఁడ నేను, వీఁడు నా

యనుజుఁడు లక్ష్మణాఖ్యుఁడు, ప్రియాంగన యీవిడ సీత, కానఁగన్
జనకునియాన వచ్చితి ననభ్యులఁ ద్వాదృశులన్ వధింపఁగన్. ౨౪

విరాధుఁడు రామలక్ష్మణుల నధిక్షేపించుట

చ. దశరథసూతిపల్కులకుఁ దద్దయు వాఁడు మహాట్టహాసియై
యసదృశశక్తిముం దెలిచి హస్తములన్ శితశూల మూని నా
యసమును నన్ను నీ వెఱుఁగ వక్కట సర్వజగత్ప్రసిద్ధుఁడన్
మశకము లట్లు జీవులఁ దెమల్చెడుయోధుఁడ నే విరాధుఁడన్. ౨౫

క. నావలనిభయముచే మును, లీ వనముం బాసి పోయి రెందే, మీకున్
జీవించునాస యుండిన, భావంబుల వినుఁడు మిట్టిపడక హితంబున్. ౨౬

చ. లలనను డించి యాయుధములన్ విడి కాలికి బుద్ధిఁ జెప్పఁ, డిం
దులకు ససమ్మతిం గొని ననుం జెనకంగ దురాగ్రహంబునం
దలఁతుర యేని నిప్పడ క్షుధాజ్వలితం బగు జాఠరాగ్నికిన్
బలిగ గ్రసింతు మిమ్ము సులభంబుగఁ, జూడుఁ డటంచు నుద్ధతిన్. ౨౭

రాముఁడు విరాధుని వధించుట

క. సీతాగ్రహణాతురుఁ డై, దైతేయుఁడు పరువువాఱఁ దద్దిశ, నాలో
సీతానాథుఁడు నవ్వుచుఁ, జేతుల రెండిటిని దునిమె శితభల్లమునన్. ౨౮

ఉ. అందుల కుగ్రుఁడై కడుభయం బగుతీరున నోరు విప్పి, రా
ఘ్నందను వైపుఁ బర్విడఁ గనద్విశిఖంబునఁ దత్పదద్వయం
బుం దెగ నేసె నచ్చెరువు పుట్ట రఘూద్వహుఁ, డంతఁ బోక య
మ్మందుఁడు ప్రాకెఁ గ్రూరఫణి మాదిరి నోట గ్రసింప రామునిన్. ౨౯

గీ. రాక్షసుం డిట్లు తనమీఁద రాఁగఁ జూచి, గిరిశిఖరసన్నిభంబుఁ దచ్ఛిరము నఱకె
నర్ధచంద్రబాణంబున, నదియు రుధిరపూరితం బయి బోరనఁ బుడమిఁ బడియె.

విరాధుఁడు పూర్వరూపమును బడసి రాముని స్తుతించుట

సీ. అపుడు జానకి ముదం బంది రాముని సమాలింగితుఁ జేసె దోర్లీలఁ బాగడె,
మించి దేవతలు మ్రోయించిరి దుందుభు, లాడిరచ్చరలు మోదాతిశయత
గంధర్వకిన్నరగణములు కీర్తించె, నంత విరాధు దేహంబునుండి
యతిసుందరాకృతి నలరారి తప్తకాంచనచారుభూషణసమితి వొదం
గీ. దివ్యవస్త్రాస్రతుం డయి తేజరిల్లు, పురుషుఁ డొక్కఁడు వెడలి యంబురుహమిత్రు
కరణి నెదురుగ గగనభాగమున నిలిచె, నచ్చెరువుఁ జెందఁ దా ముప్వ రచలపుత్రి!.

చ. అతివిమలాత్ముఁ డాతఁడు దయాకరునిం బ్రణతార్తిహారి నం
చితుని భవప్రభావము నశింపఁగఁ జేసెడువాని దీనశో
క్షతపరిహారునిన్ జనకజాహృదయాంబుజచంచరీకు నీ
గతి నుతియించె భక్తిమెయిఁ గట్టువలెన్ భువి వ్రాలి మ్రొక్కుచున్. ౩౨

సీ. రాజీవదళనేత్ర! రామ! లోకారాధ్య! కృపతోడ నాదు విన్నపము వినుము
విమలప్రకాశుండ విద్యాధరుఁడ నేను మున్ను కారణకోపమూర్తి యైన
దుర్వాసుచేత శప్తుఁడ నైతి విభ్బంగి మనుజాది నగుచుఁ గ్రుమ్మరఁగ; నేఁడు
గాంచితి మీదయాకలన శాపవిముక్తి, నిఁకమీఁద సంసార మీఁగ నాదు
గీ. తలఁపు భవదీయపాదపద్మముల నిల్చుఁ,గాక, నీ కథామృతమును గర్ణపుటము
తనివి దీఱఁగ నిరతంబుఁ ద్రావుఁగాక, వాణి త్వన్నామకీర్తనపరతఁ గనుత. ౩౩

క. పాదార్చనమునఁ గరములుఁ, బాదయుగప్రణతి శిరముఁ బ్రత్యహమును న
త్యాదరమున వర్తించుత, నీదుకరుణఁ జేసి రామ! నిస్తులనామా! ౩౪

సీ. ధన్యాత్మునకు విశుద్ధజ్ఞానమూర్తి కాత్మారామునకు సకలాధిపతికి
జానకీజాని, కజ్ఞానతమోదామనిధికిఁ గృపాబ్ధికి నీకు వంద
నంబు సమర్పింతు నన్నుఁ బ్రపన్ను రక్షింపుము భవదాజ్ఞచే మహాత్మ!
దేవలోకమున కిదే పోదు; నీమాయ నాదిక్కు మరలకుండఁగ నొనర్పు
ఆ. మనుచు విన్నవించి నంతఁ, బ్రీతాత్ముండు సుప్రసన్నుఁ డయి రఘుప్రభుండు
వేగ పొమ్ము పురికి విద్యాధరా! నన్నుఁ, గోరువారి కెదియుఁ గొఱత వడదు.

శ్రీరాముఁడు పుణ్యలోకమునకుఁ బోవ విరాధున కనుజ్ఞ నొసఁగుట

క. మాయాదోషగుణంబు లనాయాసముగా జితంబు లయ్యెను నీచే
ధీయుత! మద్దర్శనమున, నేయెడ నినుఁ బోలు జ్ఞానులే లేరు సుమీ. ౩౫

ఉ. ముక్తిని గాంచఁగాఁ గలవు పో పురుషర్షభ!, దుర్లభంబు మ
ద్భక్తి గలట్టివారు సులభంబుగ మోక్షముఁ జూఱఁగొంద్రు, స
ద్భక్తిపరుండ వీవు నిరపాయత నీకు లభించు నద్ది నా
యుక్తిని; నింక నేఁగు మన నుబ్బుచు నాతఁడు వోయె మిన్నునన్. ౩౬

చ. అరిదమనుండు రాముఁడు భయావహు రక్కసు నుక్కడంచు, ట
త్తెఱఁగున శాపముక్తిఁ గని దివ్యవరంబుల నొంది యమ్మహా
పురుషుఁడు పూర్వరూపమునఁ బోవుట మున్నుగ నీకథన్ సవి
స్తరముగఁ గీర్తనన్ జలుపు ధన్యుఁడు చెందు నభీప్సితార్థముల్. ౩౭

క. దివి కటు వోవ విరాధుఁడు, యువతీసోదరులతో రఘూత్తముఁ డరిగెన్
వివిధసుఖాధ్యము శరభంగు వనంబును జేర, మౌని కుంజరుఁ డంతన్. ౩౯

శరభంగమహర్షి రామాదులం బూజించుట

క. అనుజాంగనాయుతమ్ముగఁ, దనకడకున్ వచ్చుదశరథకుమారుఁ గనుం
గొని సంభ్రమ మడరంగ లేచి యెదుర్కొని భక్తిఁ బూజ సేసె నతనికిన్. ౪౦

వ. పిదప నమ్మువ్వుర విష్టరాసీనులం గావించి, కందమూలఫలాదులఁ గృతాతిథి సత్కారుం డై మునివరుండు ప్రీతచేతమ్మున భక్తపరాధీనుం డగుకౌసల్యాసూనున కిట్లనియె. ౪౧

సీ. పరమేశ్వరుఁడ వీవు, భవదీయసందర్శనాకాంక్షి నై తపం బాచరింప
నీ యాశ్రమంబున నే నుంటిఁ జాలకాలమునుండి, మైథిలీరమణ! యిప్పు
డస్మత్తపోలబ్ధ మగుపుణ్య మంతయుఁ దమ కిత్తు దాన మోక్షమును గాంతు
నని సమర్పించి రామునకు నాత్మీయసత్కర్మఫలంబు నుదారబుద్ధి
ఆ. నవనిజానమేతుఁ డప్రమేయుం డగు, రాముపాదములకుఁ బ్రణతి సల్పి
చితిని బేర్చి యందుఁ జేరెను శరభంగమౌని నిరభిమాని మధురవాణి! ౪౨

శరభంగుఁడు బ్రహ్మపదప్రాప్తిఁ గాంచుట

వ. అట్లు చిత్యధిష్ఠితుం డై. ౪౩

సీ. రాము నశేషహృద్రాజీవనిలయు, దూర్వాదళశ్యాములు వనజనేత్రుఁ
జీరాంబరాన్వితు స్నిగ్ధజటాకలాపుని లక్ష్మణాన్వితు భూమిపుత్రి
కానహాయునిఁ ద్రిలోకస్తుతిపాత్రు నారాఘవు మదిని జిరంబుఁ దలఁచి
జగతిపై శ్రీరామచంద్రునికంటె దయాళుండు లేఁ, డతఁ డాశ్రితౌఘ
గీ. కామగవి, నిక్క మీమాట కాకయున్న, నన్ననన్యభావంబుతోఁ దన్నుఁ గొల్చు
చున్నవానిఁ దనంతఁ దాఁ జూడరాఁ దలంచునే? మించుకృప నా తలం పెఱింగి.

క. తనువును దహించికొని యఘమును బాసియు బ్రహ్మలోకమున కరిగెదు నన్
గనుచుండుఁ గాక యిపుడు సురనియంత, జగత్ప్రభుండు రాముఁడు దయతో. ౪౫

క. జలదము నడుమఁ దటిల్లత వలె నెవ్వని యెడమతొడను వసుధాసుత భా
సిలుచుండు, నమ్మహాత్ముఁడు, నిలుచుంగా కెపుడు హృదయనిలయమునందున్.

వ. అని పలుతెఱంగుల ధ్యానించి, పురస్థితుం డయిన యయ్యనఘుం దనివి దీఱం జూచుచు నగ్నినిఁ బ్రజ్వలింపఁ జేసి, పంచభూతాత్మక మగుతనదేహమును దత్కీలల కాహుతిగా నిచ్చికొని శరభంగుండు దివ్యశరీరధారియై పరమేష్ఠిలోకంబున

కరిగె. అంత దండకారణ్యవాసు లగుతాపసు లందఱు రామసందర్శనార్థము తదాశ్రమమునుం జేరవచ్చుటయు, మాయామానుషవేషు లయిన సీతారామ లక్ష్మణులు వినయవినమితాంగులై వారికి నమస్కరించి, రంత వారు సకలహృదయ స్థితుండును ధనుర్బాణధరుం డగురఘుకులమండనుని నాశీర్వచనంబుల నభినందించి ప్రాంజలులై యిట్లనిరి. ౪౭

దండకారణ్యవాసు లగుఋషులు రాముని బ్రశంసించుట

చ. ధరణిభరంబు వాపఁగఁ బితామహు ప్రార్థనఁ బుట్టినావు నీ
వరయఁగఁ బంకజోదరుఁడ, వా రమ యీ రమణీలలామ, మే
మెఱుఁగుదు మింత లక్ష్మణుఁ డహీశ్వరు నంశము, శంఖచక్రముల్
భరతరిపుఘ్నులై యనుజభావముఁ గాంచిరి, మైథిలీపతీ!. ౪౮

ఉ. కావున ముందు తాపసులకష్టముఁ దీర్పఁగఁ బోలు మానిరా
జీవిత మైనయీవిపినసీమ సమస్తము సక్రమంబుగా
నీవు గనుంగొనన్ వలయు, నీ కపు డేర్పడు మాపయిన్ దయా
భావము; రమ్ము పోదము కృపాకర! తమ్మునితోడఁ గొమ్మతో. ౪౯

శ్రీరాముఁడు తపోవనముం జూడఁ బోవుట

మ. అని వా రందఱు విన్నవింప నటులే యం చా దినేశాన్వయుం
డనుజుండున్ సతి వెంటరా మునులతో నవ్వేళ దివ్యత్తపో
వనముం జూడఁగఁ బోయి, యొక్కెడ శిరోవ్రాతంబు లెన్నేనిఁ దోఁ
చిన నుర్వీపతితమ్ములై, యనె మునిశ్రేణి న్విలోకించుచున్. ౫౦

గీ. అస్థిభూతమ్ములై తల లక్కటకట?, పుడమి దొరలాడుచున్న వేర్పడఁగఁ దెల్పుఁ
డెవరి వివి? యిట్టు లగుటకు హేతు వెద్ది?, యనుడు రామున కిట్లనె మునిగణంబు.

క. పరులవి గా వివి జగదీశ్వర! మానుల మస్తకములు, సమదాతిభయం
కరరక్షోభక్షితములు, దురితాత్ము లొనర్పరాని దుండగ మున్నే? ౫౨

చ. కొదుకక విఘ్నముల్ సలుపఁగోరి సమాధిని నభ్యసించు వే
ళఁ దపసులం గలంచి కడులావుమెయిం దినుచుం జరింతు రీ
పదములఁ గ్రూరరాక్షసు, లభంగురవిక్రమ! వారిఁ జంపి మా
యిదు రుడిగింపు మయ్య! భవదాగమనంబున కింత గొప్పదే? ౫౩

వ. అని భయదైన్యంబు లుప్పతిల్ల మునివల్లభులు జానకీవల్లభుని నసురవధార్థంబు ప్రార్థించుటయు. ౫౪

ఉ. ఎక్కడిభీతి మీ కిఁక యథేష్టముగాఁ జరియింపుఁ డెల్లెడన్
రక్కసిమూఁకలన్ శరపరంపరలం బొలియింతుఁ జీమయుం
ద్రిక్కకయుండఁగా నని ప్రతిజ్ఞ యొనర్చె వలాహకార్భటిన్
నెక్కొను సంతసంబున మునిప్రవరాంగము లుబ్బఁ, బార్వతీ!. ౫౫

చ. అతివ! కృతప్రతిజ్ఞుఁ డయి యా రఘురాముఁడు మౌనులెల్ల సం
తతమును బూజ సేయ వసుధాసుతతోడ సుమిత్రసూనుతో
హితముగఁ గొన్నియేండ్లు వసియించి యటం గ్రమ భంగిఁ జూచె నం
చితనయనైకపర్వములు శ్రేష్ఠము లౌ సకలాశ్రమంబులన్. ౫౬

వ. ఇట్లరయుచుఁ బ్రఖ్యాతంబును ఋషిసంకులమ్మును సర్వర్తుగణసంపన్నంబును సర్వకాలసుఖావహంబు నగునగస్త్యశిష్యుఁ డయిన సుతీక్ష్ణుని యాశ్రమంబున కేఁగుటయు, రామమంత్రోపాసనాతత్పరత్వమున నున్న యత్తపస్వి తద్దర్శనంబున కుప్పొంగి వేగమ యెదురేగి తోడ్తెచ్చి, విష్టరాసీనుం జేసి భక్త్యుత్కంఠితంబు లగునయనంబుల నా లోకైకపూజ్యుని యథావిధిగఁ బూజించి యిట్లని ప్రార్థించె.

సుతీక్ష్ణుఁడు శ్రీరాముని సన్నుతించుట

సీ. అనఘాత్మ! దేశకాలాపరిచ్ఛేద్య! కళ్యాణగుణాకర! యజహరాది
బర్హిర్ముఖాశ్రితపదపద్మ! సంసారసాగరోత్తరణచంచత్ప్రభావ!
యవనిజాకామ! లోకైకాభిరామ! రామా! భవన్మంత్రంబు ననుదినంబు
జపియించుచుంటిని గృపతోడఁ దిలకింపు నను భవద్దాసదాసునిఁగ నిపుడు
పంచపాది. నిఖిలజగ దగోచరుఁడ వౌ నీవు స్వీయ
మాయకలిమి భార్యాపుత్రమందిరాంధ
కూపమునఁ గూలి, మలమూత్రకుత్సిత మగు
నీశరీరమ యే ననియెడు భ్రమమున
కగ్గమగు నన్నుఁ గావంగ దగ్గఱితివి. ౫౭

చ. అనఘ! సమస్తభూతహృదయంబులు నీవు వసించుపట్లు; త్వ
న్మనుజపహీనమానసుల మాయను ముంచెదు, భక్తి మంత్రసా
ధనపరు లైనవారి సతతంబును బ్రోచెదు మాయఁ ద్రోసి, భూ
పునిగతి సేవకుం దగినపోల్కి ఫలం బిడుచుందు వారికేన్. ౫౮

వ. ఈశ్వరా! నీ వొక్కండవె ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములకుం గారణంబవు, సత్వరజస్తమోగుణాత్మిక యగుభవన్మాయచే వివిధవిశ్వాకృతిం దోఁచుచున్నావు. ౬౦

గీ. సలిలపాత్రగతుం డగుచండభాను, కరణి, మోహితాత్ములకు నొక్కండ వయ్యుఁ
దోఁచుచుందువు వివిధాకృతుల మహాత్మ! యాశ్రితుల కిట్టిచిక్కు లెం దైన లేవు.

సీ. అజ్ఞానదూరుండ వగునీదుచరణారుణాబ్జంబు నిపుడు ప్రత్యక్షముగను
గనుచుంటి దృగ్రూపమున; నెట్టితఱి నైన ఖలచిత్తులకు నీవు గానరావు,
భవదీయమంత్రజపశ్రీవినిర్మలహృదయున కెప్పుడు నెదుట నిల్తు,
వెన్నంగ రూపవిహీనుండ వైనను మాయావిశంబనామహిమఁ గన్న
గీ. నీ మనుష్యవేషము కమనీయచాప, బాణ మై, మారకోటిసుభగ మయి స్మిత
చారుముఖ మయి కరుణారసార్ద్రహృదయ, మై కనంబడుచున్న దత్యద్భుతముగ.

సీ. పంటవలంతివాల్గంటికూరిమిబిడ్డతోడ నీడితగతిఁ దోఁచువాని
నిరతోర్మిళాప్రియనియతసంసేవితసదమలచరణాంబుజములవాని
నల్లగల్వలడాలు గొల్లఁగొనం జాలి మెఱుగారు చక్కనిమేనివానిఁ
గృష్ణాజినం బుత్తరీయ మై తగువాని, నేనికి నెదురింపరానివాని
గీ. ఘను ననంతగుణుం బ్రశాన్తుని మదీయ, భాగధేయము నగురామభద్రు నిన్ను
ననుదినము సంస్మరింతు ప్రేమ కాంచరింతు, ఖండితమహాఘసముదాయ! కౌసలేయ!

వ. దేవా! యోగిపుంగవులు నీరూపంబు నశేష దేశకాలాద్యుపాధివిరహిత మైనదిగను, నిరవధిక చైతన్యప్రకాశ మైనదిగను దెలిసినఁ దెలియుదురు గాక. నేఁడు ప్రత్యక్షముగఁ గానవచ్చుచున్న యీదివ్యరూపంబ నాహృదయంబున నిదిమొదలుగఁ బ్రకాశించెడుత, మింతకుఁ దక్క యవాఙ్మనసగోచర మగునితరరూపంబు గోరఁబో నని సంస్తుతించిన సుతీక్ష్ణునకు సస్మితముఖంబుతో రఘుముఖ్యుం డిట్లనియె. ౬౪

శ్రీరాముఁడు సుతీక్ష్ణుని సంభావించుట

క. నన్ను నుపాసించుటవల, నన్నిర్మల మగుభవన్మనం బెఱుఁగుదు నే
నిన్నుఁ గనవచ్చితిని వి, ద్వన్నుత! నాభక్తి ముక్తిదం బై పరఁగున్. ౬౫

గీ. మోక్షసాధన మది దక్క ముజ్జగముల, నన్య మెద్దియుఁ గానరా దరసిచూడ,
దురితచరితుల కెంతయు దురవగాహ, మై యలభ్యంబు నై యులరారుఁ జూవె. ౬౬

క. నిరపేక్షకులకు నస్మ, చ్ఛరణాగతులకు మదీయసన్మంత్రజపా
దరులకు నొరులం గొలువని, నరులకుఁ బ్రతిదినము నేఁ గనంబడుచుందున్. ౬౭

సీ. మునినాథ! త్వత్కృతంబును మత్ప్రియంబు నౌనీస్తోత్రమును బఠియించు నెవఁడు,
వానికి నాయందు భక్తియు నిర్మలజ్ఞానంబుఁ గలుగు నిస్సంశయముగ
మ దుపాసనంబునఁ దుదిమొద లేనియుద్దండసంసారంబునుండి విడుపు

నందితి, పీ శరీరాంతంబునందు నీ కబ్బు మత్సాయుజ్య, మనఘ! యిపుడు
గీ. గురు నగస్త్య మానివరుఁ గాంచి, యచ్చటఁ, గొంత కాల ముండఁ గోరుచున్న
యది మనంబు, నన్ను నాస్థలంబునకుఁ గొంపొ మ్మటంచు నాజిపుత్రుఁ డనఁగ.

వ. సుతీక్ష్ణుం డి ట్లనియె. ౧౯

చ. అతులితభావ! తే పచటి కట్టులె పోవఁగవచ్చుఁ జుమ్మ; మా
నితిలకు నమ్మహాత్ముఁ గని నేఁటికి నెంతయుఁ గాల మయ్యె, న
క్కతమున నేను గూడ మునికాంతునిఁ జూడఁగ వత్తు నీ నిశి
హితముగ నిందుఁ బుచ్చుము మదీప్సితమున్ నెఱవేర్పు, నావుడున్. ౨౦

చ. ముని యనినట్లు సేయి యటఁ బుచ్చి యతం డరుదేర సీతతో
ననుజునితోఁ బ్రభాతసమయంబునఁ గుంభజుఁ గూడి ముచ్చటిం
పను గడుఁ దీవరింప నిజమానస మా రఘుభర్త మెల్లగాఁ
జనియెఁ దదీయసోదరునిసద్మముఁ జేరఁగ, శైలకన్యకా! ౨౧

క. మధ్యాహ్నంబున నిట్టు ల, యోధ్యాధిపుఁ డిల్లుసేర నుబ్బి జపతప
స్స్వాధ్యాయపరుం డజ్జటి, విధ్యుక్తార్చనము సల్పి విం దొనరించెన్. ౨౨

శ్రీరాముఁ డగ్రి యాశ్రమమునకుఁ బోవుట

సీ. మునిసమర్పితము లౌ మూలఫలాదుల ముప్వురు భుజియించి ముదము మిగుల
నరిగిరి మఱునాఁడు ఖరకరోదయమున సర్వర్తుఫలపుష్పధూర్వహంబు
నానాపతంగౌఘనాదిత, మఖిలమృగావళిమిళితంబు, దేవనాథు
నుద్యానతులితంబు హృద్యంబు బ్రహ్మర్షి దేవర్షి సంఘసంసేవితంబు
గీ. లలిత తాపసమందిరాలంకృతంబు, నపరసత్యలోకభ్రాంతి కాస్పదంబు
నైనవాతాపిదమనుని యాశ్రమమున, కాసుతీక్ష్ణునిఁ గూడి, శీతాద్రితనయ!. ౨౩

వ. అ ట్లరిగి. ౨౪

క. వెలుపలన నిలిచి మునివరుఁ, బలికె రఘుపతి సుతీక్ష్ణ! త్వరగాఁ జని లో
పలి కీవు మేము వచ్చుటఁ, దెలుపుము చుళుకీకృతాంబుధి కగస్త్యునకున్. ౨౫

చ. అనుడు మహాప్రసాద మని యాయన నైశమ లోని కేఁగి, రా
ముని ప్రియభక్తకోటియుఁ దపోధనపాళియుఁ జుట్టియుండ నా
సనమునఁ గూరుచుండి రఘుసత్తమమంత్రగతప్రభావమున్
మన మలరంగఁ దెల్పు మునిమాన్యునిఁ గుంభజుఁ గాంచె భక్తితో. ౨౬

వ. కని సమీపించి యప్పండితోత్తముండు దండాకారంబుగఁ బ్రణతి సల్పి, వినయావనతాంగుఁడై గురూత్తమా! దశరథపుత్రుండు రామభద్రుండు సీతాలక్ష్మణోపేతముగ వచ్చి భవద్దర్శనార్థంబు మోడ్పుఁగేలుతో నాశ్రమంబు వెలుపల నిల్చి యున్నాఁడని విన్నవింప, మౌనీ! నీకు మంగళమగుఁగాక. మన్మనస్థితుం డగు రాముని దడయక తోడ్కొనిరమ్ము. నే నమ్మహామహునే, ధ్యానించుచుఁ దదాగమనమ్ముఁ గోరి యిం దుంటి, నని పల్కి యుల్లాలారి స్వయమ్ముగ లేచి మునిమండలంబు గొల్వ నిండుభక్తితో ద్రుతగతి రఘుపతి కెదురు వోయి. ౭౭

ఉ. ర మ్మిఁక నాశ్రమంబునకు రామ! శుభం బగుఁగాక, నాదుభా
గ్యమ్మున నీ సమాగమము గల్గెఁ, బ్రియాతిథి వౌచు మత్కుటీ
రమ్మున కిప్డు వచ్చుటఁ గరమ్ము శుభంకర మీదినమ్ము నా
కెమ్మెయి నంచుఁ బల్కె,ముని కేర్పడ మ్రొక్కిరి వారు మువ్వురున్. ౭౮

క. హర్షసమాకులుఁడై పురు, షర్షభుఁ డవనిఁ బడి ప్రణతి సల్పఁగ, హస్తా
కర్షితునిఁ జేసి లేపి, మ, హర్షి భుజాశ్లేష మిచ్చె, నతులితభక్తిన్. ౭౯

క. సీతేశతనుస్పర్శో, ద్భూతాతిశయప్రమోదమునఁ గన్నులు ప్ర
స్ఫీతోదకమయములుగా, నాతఁడు దనచేత రామహస్తముఁ గొనుచున్. ౮౦

అగస్త్యమహర్షి, పూజాపూర్వకముగ శ్రీరాముం గొనియాడుట

క. తన నెలవునకుం గొనిచని, ఘనచరితు సుఖోపవిష్టుఁ గావించి మహా
వినయమునఁ బూజ సేసెను, ననుపమగతి హృష్టచిత్తుఁడై ననఁబోఁడీ! ౮౧

సీ. వన్యంబు లగుభోజ్యవస్తువుల్ గొనితెచ్చి భుజియింపఁ బెట్టి నప్పురుషసింహు,
నంత నేకాంతమునందుఁ గూర్చుండినయిందునిభాస్యు సీతేశుఁ జేరి
భగవానుఁ డగుఘటోద్భవుఁడు కేల్మోడ్చి యిట్లని విన్నవించె మోదాంతరంగుఁ
డగుచు, లోకేశ్వర! యలనాఁడు పాలమున్నీటిలోఁ బండిననీవు భూ భ

గీ. రం బడఁప రావణుం జంప స్రష్టచేతఁ, బ్రార్థితుఁడ వైనది మొదల్ తపస్వి నగుచు
మనమున న్నిన్నె తలఁచుచు మునులఁ గూడి, యిందు నిల్చితి మీదర్శనేచ్ఛఁ జేసి.

సీ. సృష్టికిఁ బూర్వంబు శ్రీరామ! నీ వొకండవె నిరుపాధికుఁడవును నిర్వి
కల్పుఁడ వై యుంటి, గమనింప నిన్నాశ్రయించి త్వద్విషయ యై యొసఁగుమాయ
శక్తినాఁ బరఁగు, నాశక్తి నిర్గుణుని నిన్నావరించుకొని యున్నట్టి వేళ
నవ్యాకృతం బని యనఁబడు వేదాంతపరినిష్ఠితులచేతఁ, బరమపురుష!

గీ. కేవలం బది మూలప్రకృతి యనియును,
మాయ యనియును భువిఁ గొంతమంది యందు,
రదియుఁగాక బంధన మవిద్యాభవంబు
లనఁగఁ జెక్కుఁ జేప్లాశక్తి కనఘ! కలవు. ౮౩

వ. అయ్యాది నీచే నెంతయు సంక్షుభిత యై మహత్తత్త్వమును గలిగించుచున్నది. భవ త్ప్రేరిత మగుమహత్తత్త్వమునుండి నేను, నాది, యనునభిమానరూప మైనయహం కారంబు పుట్టె. మహత్తత్త్వావృత మగునయ్యహంకారంబు ముత్తెఱంగు లై సాత్త్వి క,రాజస, తామస, నామంబులఁ బిలువంబడు. రామా! యందుఁ దామసాహంకా రంబువలన సూక్ష్మభూతము లయినశబ్దస్పర్శరూపరసగంధగుణంబు లుదయించె. ఏతద్గుణపంచకమునుండి క్రమమ్ముగ నుత్తరోత్తరాధికగుణంబులుగల పృథి, వ్య, ప్తేజో, వా, య్వాకాశంబు, లనియెడి స్థూలభూతములు వొడమె. ఇంద్రియం బులు రాజసాహంకారంబువలనను, నింద్రియాధిష్ఠానదేవతలును మనస్సును సాత్త్వికాహంకారంబువలనను, నుత్పన్నంబు లయ్యె. వానివలన సర్వవ్యాపకుం డును లింగరూపుఁడు నయినహిరణ్యగర్భుఁ డావిర్భవించె. అంత, స్థూలభూత సమూహమ్మునుండి విరాట్టు పుట్టెను. అతనినుండి స్థావరజంగమాత్మక మగునీ జగత్తు వెలువడె. కాలక్రమమునను గర్మక్రమమునను దేవతిర్యఙ్మనుష్యగణంబు ల వ్విరాట్పురుషునియందు దుద్భవించె. ౮౪

సీ. లలి రజోగుణ మూని విలసితసర్వప్రపంచకారణ మైనబ్రహ్మ వైతి,
సత్త్వగుణం బూని జగదవనంబు గావించెడి శ్రీమహావిష్ణు వైతి,
తమిఁ దమోగుణ మూని క్రమముగ నఖిలంబు రోషాగ్నిఁ గాల్చురుద్రుండ వైతి
వనఘ! నీ విట్లు మాయాగుణభేదంబుకతనఁ ద్రిమూర్తులఁ గై కొనెదవు,

గీ. బుద్ధిజము లైనతద్గుణంబులను రామ,భద్ర! పొడమె జాగ్రత్స్వప్ననిద్ర లనెడి
వృత్తు లొకమూఁడు, వానిపొం దేమి లేని,యవ్యయుఁడవు చిన్మూర్తివి సాక్షి వీవు.

గీ. జగము చేయుట యనునాట జరుప మదిఁ ద,లంతు వెప్పుఁడప్పుడ గుణవంతుపోల్కి
మాయ నంగీకరింతు, వా మాయ విద్య,యని యవిద్యయని ద్వివిధ మై వెలుంగు.

చ. అనఘ! ప్రవృత్తిమార్గమున నాస్థఁ బదం బిడువా రవిద్య కె
ప్పుడు వశవర్తు లౌదు, రటు పోక నివృత్తిపథాభిలాషు లౌ
జనులఁ, ద్రయీశిఖార్థము విచారణ సేసెడివారి, నీదు భ
క్తి నభిలషించువారి, వినుతింతురు విద్య నెఱుంగువారిఁ గాఁ. ౮౭

గీ. రామచంద్ర! విద్యాభ్యాసరతులు నిత్య,ముక్తు లనఁ జెల్లుదురు, భవాంభోధిమునిఁగి
వెతలఁ బడుదురు నిరతం బవిద్యకు వశు, లై ప్రవర్తిల్లువారు దుఃఖాదికముల. ౮౮

క. భవదీయభక్తిరతులకు, భవదద్భుతమంత్రపఠనపరులకు లభ్యం
బగు విద్య లోకమున రా,ఘవ! చేకుఱ దన్యులకు నొకానొకతఱి నేన్. ౮౯

గీ. కాన ముక్తులు నీభక్తి గలుగువారె; సందియము లేదు శ్రీరామచంద్ర! తావ
కీనపదభక్తిపీయూషహీనమతికి, సమకుఱదు ముక్తి కోటిజన్మముల కైన. ౯౦

క. పలుపలుకు లేటి కిఁక రఘు,తిలకా! సారంబు నీకుఁ దెలిపెద భువి ని
ర్మలసజ్జనమైత్రియు మో,క్షలక్ష్మికిఁ సాధనంబుగాఁ జెప్పఁబడెన్. ౯౧

సీ. శత్రువునందు మచ్చరము, మిత్రునియందు ననురాగమును, లేని యట్టిసములుఁ
జటులరాగద్వేషజన్మకారణ మగునాశకు లోఁబడనట్టిఘనులు
దారపుత్రాదులందలిమమకారంబు నవహితమతిఁ బాయునట్టిబుధులు
నంతరింద్రియనిగ్రహము బహిరింద్రియనిగ్రహమ్మును గల్గునిపుణమతులు
ఆ. దుష్టసంగవర్జితులు భవత్పదభక్తి, గలుగువారు నిఖిలకర్మసమితి
వదలినట్టివారు బ్రహ్మతత్పరులును, సత్పురుషులు, రామచంద్ర! జగతి. ౯౨

గీ. ఆపద సుఖంబుఁ బైఁబడ్డయప్పు డొక్క,విధమున మెలఁగువారు, నివృత్తనిఖిల
కామనులు యమాద్యారుగుణకలితు లల్ప,మునను సంతుష్టి గాంచువా రనఘ,లీశ!

క. ఎప్పుడు సత్సంగతి యగు, నప్పుడె నీకథల వినుటయం దభిరుచి యౌఁ
దప్పక, నరునకు దానం, జొప్పడు నీయందు భక్తి, సుజనధ్యేయా! ౯౪

గీ. భక్తి వొడమఁ గానె ప్రభవించు దృఢతర, జ్ఞాన, మిద్ది చతురసమ్మత మగు
ముక్తిమార్గ, మనఘమూర్తి! యక్కాలమునఁ, జేతు లొగ్గి మనవి సేయువాఁడ.

సీ. అలవడఁ గాక నా కనురాగరూప మహాభక్తి నీయెడ, భవద్భక్తజనుల
చెలిమి గల్గెడుత విశేషించి, నా జని సఫలంబు నీదు దర్శనము కలిమి
నే నాచరించినయెల్లజన్మమ్ములు సఫలంబు లయ్యెను స్వామి! దీర్ఘ
కాలం బనన్యసంకల్పమనమ్ముతోఁ గావించినట్టి యఖండతపము
గీ. నకు ఫలం బెన్న భవదర్శనంబ కాదె?, సీతతో నస్మదీయమహాశ్రమ నిల్వు
మింక, నిల్చున్న వేళల నేఁగువేళఁ, దలఁపు నీయందె నిల్చునట్టు లొనరింపు. ౯౬

అగస్త్యుఁ డింద్రగోపితము లగు నాయుధంబుల శ్రీరామున కొసంగుట

చ. అని వినుతించి కుంభభవుఁ డమ్మహనీయు రమాకళత్రు, నా
తని కయి వేల్పుఱేఁడు మును దాఁచినయట్టియమోఘచాపమున్

ఘనమణిభూషితం బయినఖడ్గము నక్షయబాణతూణముల్
గొనబుగ నిచ్చె రామ! యివిగో కయికొ మ్మని, సుందరీమణీ!. ౯౭

వ. అ ట్లొసంగి. ౯౮

క. మాయామనుజాకృతి నీ, వీ యవనిని నవతరించు టెల్ల భువికి వ్రేఁ
గై యలజడిఁ గూర్చెడి దైత్యేయప్రకరంబులను వధించుటకె సుమా. ౯౯

క. ఈసాధనములఁ గైకొని, వీసర పోకుండఁ జంప వెడలుము వారిన్,
కౌసల్యాసుతపఃఫల!, నీ సమధికమహిమ వర్ణనీయము జగతిన్. ౧౦౦

వ. ఇచటికి రెండుయోజనముల దూరంబున గోదావరీతటమ్మునందుఁ బుణ్యకానన మండిత మగుపంచవటియను నొక్కయాశ్రమం బున్నయది. నీ వచ్చో నిలిచి ప్రతిజ్ఞాకాలశేషంబు గడపందగు. దేవకార్యంబు లన్నియు నందె చక్కఁబెట్టఁ దలంపు మనుడు, సర్వజ్ఞుఁడును సర్వేశ్వరుండు నగుసీతాపతి కుంభజాతుని సమంజసవచనములకును, దత్త్వార్థసమన్విత మగుస్తోత్రంబునకును సంతసించి, యవ్విరించికల్పునితోఁ గొంతతడవు సంభాషించి, తత్ప్రదర్శితమార్గగామి యయ్యె నని చెప్పి, శూలి కొండరాచూలి కిట్లనియె. ౧౦౧

### శ్రీరామాదులు జటాయువుం జూచుట

గీ. అట్లు పోవుచు శ్రీరాముఁ డపుడు వృద్ధు, నుర్వీధరశృంగమో; యనునూహకుఁ దగి
నట్టివాని జటాయువు నరసి, యేమి, చిత్ర మిది? యని విస్మితచిత్తుఁ డయ్యె.

చ. ధను విటు లెమ్ము లెమ్ము కడుదర్పమునన్ మనముందు నిల్చె ని
మ్మునిజనభక్షకుం డసురముఖ్యుఁడు; వీని వధించి నేఁడు కా
ననము సుఖప్రదమ్ముగ నొనర్చెద సోదర! నాఁగ రామచం
ద్రునివచనంబున న్భయము దోఁపఁగఁ బక్షివతంస మి ట్లనెన్. ౧౦౩

చ. ఇనకులవార్ధికౌస్తుభమ! యేను వధార్హుఁడఁ గాను జుమ్ము; నీ
జనకున కెంతయున్ సఖుఁడ; ఈస్థలియందు జటాయు వన్నపే
రునఁ జరియించు గ్రద్దను, విరోధము నాయెడఁ జూప కయ్య! శో
భనములు గల్గెడు న్నను భవత్ప్రియకృత్తముఁగా నెఱుంగుమీ. ౧౦౪

ఉ. నీకుఁ బ్రియం బొనర్చుటకు నెమ్మదిఁ గోరి వసించుచుంటి నీ
శ్రీకర మైనపంచవటిచెంగటఁ; దమ్ముఁడు నీవు వేఁటకై
యే కడ కేనిఁ బోయినపు డేను మహీమహిళాప్రియాత్మజం
దేఁకువఁ గాచియుండి భవదీయకృపం గనువాఁడ నింకపై. ౧౦౫

ఉ. నావుడు సంతసించి రఘునందనుఁ డెంతయు స్నేహబుద్ధితో,
నో విహగావతంస! విను మొక్కటి సీతలఁ బెట్టు లట్టులే
యీ వనసీమ మా దరిని నిందె మెలంగి హితం బొనర్పుమీ
యీ, వని కౌఁగిలించికొని యేఁగెను బంచవటిం గనుంగొనన్. ౧౦౬

వ. ఆవిధమున. ౧౦౭

శ్రీరాముఁడు భార్యానుజోపేతుఁడై పంచవటియం దుండుట

సీ. భువనైకభర్త రాముఁడు జానకీలక్ష్మణులతోడఁ జని, యందు లలిత మగుచుఁ
బనసకదంబామ్రబహువిధఫలవృక్షభరిత మై, యెంతయుం బావన మయి,
మానవసంచారహీన మై, రోగవర్జిత మంబు, గోదావరీస్రవంతి
యుత్తరతటమున నున్నట్టియొకచోటు వీక్షించి యయ్యెడ విడిది గల్గి,
గీ. యున్కి కనుకూల మగుగృహం బొండు గట్టఁ, జేసి తమ్మునిచే, నివసించె నందు
నతిసుఖమ్ముగ మైథిలి నలరఁజేయు, చమరపతి నాకలోకమ్ము నందుఁబోలె. ౧౦౮

గీ. పండితుఁడు లక్ష్మణుఁడు రామపాదపద్మ, సేవనాసక్తియుక్తిమైఁ జిత్త మొప్ప
ననుదినముఁ గందమూలఫలాదికములు, వారలకుఁ దెచ్చియిచ్చుఁ బర్వతకుమారి!

క. కనుమూయక రే యంతయు, ధనువును బాణములుఁ గేలఁ దాల్చి తగన్ మే
ల్కాని యుండు నగ్రజాతున, కును వదినెకుఁ బ్రబలరక్షఁ గోరుచు మదిలోన్.

గీ. ఉవిద! గోదావరీపవిత్రోదకముల, నహరహము మువ్వురును స్నాన మాచరింత్రు,
నాథునకును మఱందికి నడుమఁ జేరి, హాయిగా రాకపోకలు సేయు సీత. ౧౧౧

గీ. ప్రతిదినము పార్శ్వమున సుమిత్రాసుతుండు, నిర్మలోదక మాకు దొన్నియలఁ దెచ్చి
పూటపూట సీతారాఘవుల కొసంగు, గౌరి! యీరీతి సుఖముగఁ గాల మరుగ.

లక్ష్మణుఁడు శ్రీరాముని ముక్తిసాధనముం గూర్చి ప్రశ్నించుట

వ. ఒకనాఁడు సౌమిత్రి. ౧౧౩

క. ఏకాంతస్థితు జ్ఞానమ, యాకారుం బరముఁ ద్రిజగదాధారుని సీ
తాకాంతుఁ జేరఁ జని విన, యాకుంచితగాత్రుఁ డగుచు ననె ని ప్పగిదిన్. ౧౧౪

చ. ననుఁ గరుణింపు భక్తునిఁగ, నా మనవిన్ విను పుండరీకలో
చన! భగవంత! ముఖ్య మగుసాధన మెద్దియొ ముక్తి కేఁగ; దా
నిని గడుసంగ్రహంబుగను నీవలనం దెలియంగఁ గోరినాఁ
డను నినుఁ గొల్చియుండుదును దాపక నా కెఱిఁగింపు మిత్తఱిన్, ౧౧౫

గీ. ఓరఘూత్తమ! విజ్ఞానయుతము నగుచు, నతులభక్తి వైరాగ్యబృంహితము నైన
జ్ఞాన ముపదేశ మొనరింపు, జగమునందుఁ, గలుగఁబోఁ డన్యుఁ డెవఁడు నీకంటె వక్త.

శ్రీరాముఁడు తమ్మునకుఁ దత్త్వజ్ఞానోపదేశముం జేయుట

సీ. అనుటయు శ్రీరాముఁ డానందముం బొంది, ప్రియసోదరుం జూచి ప్రీతి వత్స!
మానవుం డెద్దాని మది నెఱింగినమాత్ర వైకల్పికభ్రాంతి వదలిపెట్టు
నట్టిపరమరహస్యం బగుపరమాత్మ నెఱిఁగింతు విను సమాహితమతి వయి,
యందును ముందు మాయాస్వరూపమ్మును, దదుపరి జ్ఞానసాధనముఁ దెల్పి
ఆ. పిదపఁ జెప్పువాఁడ విజ్ఞానసమ్మిత, మైనజ్ఞానమును, భయాపహారి
యగుచు జ్ఞేయవస్తు వౌ పరమాత్మ, న,టంచుఁ బలుకఁదొడఁగె మించుఁబోడి!

రాముఁడు లక్ష్మణునకు మాయాస్వరూపముం జెప్పుట

ఆ. ఆత్మ కాని జడము లగుశరీరాదుల, నాత్మ యనెడునిశ్చయంబె మాయ,
జననమరణరూపసంసార మిది యెల్ల, దానివలనఁ గల్పిత మగుచుండె. ౧౧౮

వ. వంశతోషీ! యనాది యగుమాయకు విక్షేపావరణంబు లనెడి రెండురూపంబులు గలవు. అందు మొదటి దగువిక్షేపముచే మహత్తత్త్వము మొదలుకొని చతుర్ముఖబ్రహ్మపర్యంతము నగునమస్తజగత్తు స్థూలసూక్ష్మాదినానావిధభేదములతోఁ గల్పింపబడుచున్నది. రెండవ దైనయావరణము, నిఖిలజ్ఞానరూపము నావరించుకొని యుండు. ఇయ్యది మాయాస్వరూపంబు. ౧౧౯

రాముఁడు సౌమిత్రికి దేహాత్మవివేకము నెఱింగించుట

సీ. భ్రమముచేఁ ద్రాడున ఫణి కల్పితం బైనపగిదిఁ, గేవలపరబ్రహ్మమందుఁ
గల్పింపఁ బడియె జగం బెల్ల మాయచే, సమధికమతి నధిష్ఠానతత్త్వ
మును విచారించినఁ గనరా ద దెద్దియు, జనులు చూచెడునది వినునదియును
దలఁచెడునది సమస్తంబు స్వప్నమనోరథంబుల గతి యథార్థంబు గాదు.
గీ. ఈశరీరము; సంసారవృక్షరాజ, మునకుఁ గూఁకటివేరు, తన్మూల మగుచుఁ
బుత్రదారాదిబంధంబు వొడమె, దేహ, మొకటి లేకున్నఁ దోఁప దాత్మకు మఱొండు.

వ. లక్ష్మణా! దేహము స్థూల మనియు, సూక్ష్మ మనియు, ద్వివిధంబు. అందు స్థూలభూతము లగుపృథివ్యప్తేజోవాయ్వాకాశము లయిదును గూడి స్థూలదేహమయ్యెను. ప్రాణాదుల కాశ్రయము లైనయపంచీకృతసూక్ష్మభూతము లైదును, నహంకారబుద్ధులు రెండును, వాక్పాణిపాదపాయూపస్థము లనెడికర్మేంద్రియంబు లేనును, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లనుజ్ఞానేంద్రియంబు లైదును నీపదునేడును గలిసి సూక్ష్మదేహ మయ్యె. ౧౨౦

క. ఘనచైతన్యోజ్జ్వల మగు, మనమును మూలప్రకృతిని మహితులు క్షేత్రం
బని దేహం బని వాడుదు, రినకులసంతోషకర! సమిద్ధవిచారా! ౧౨౨

గీ. వీనికం టెను భిన్నుఁడై వెలయువాఁడు, జీవుఁ, డాతండె నాశముఁ జెందని పర
మాత్మ! యీ జీవపరమాత్ము లందు భేదభావ మొప్పదు పర్యాయపదము లగుట.

రాముఁడు, సౌమిత్రికి జ్ఞానసాధనములఁ దెలుపుట

వ. ఇంతదనుక నిదిధ్యాసనమున కై, దేహాత్మవివేకమును, జీవవిచారమును, దెల్పితి. ఇఁక నా జీవు నెఱుంగం దగు సాధనముల వినుము. దంభహింసాదుల వర్జించుటయు, గర్వంబు లేమియుఁ, బరు లొనరించు నాక్షేపాదికమునం దోర్పును, నందఱి యెడ ఋజుభావంబును, మనోవాక్కాయనిరూపిత మగుసద్భక్తితో నుత్తమగురుసేవనం బాచరించుటయు, బాహ్యాభ్యంతరసంశుద్ధియు, సత్కర్మంబులం దచలబుద్ధియుఁ,ద్రికరణశిక్షణంబును, విషయానపేక్షయు, నహంకారత్యాగమ్మును, జన్మజరాద్యాలోచనంబును, భార్యాపుత్రవిత్తాదులయం దాసక్తి మాని వాని ముట్టకుండుటయు, నిష్టానిష్టసమయంబులం జలింప నీక చిత్తంబు నేకరీతిగా నుంచుటయు, సర్వరూపుఁడ నై రామాఖ్య నున్న నాయందుఁ బరిత్యక్తాన్యవిషయిక మగుబుద్ధియు, జనవిరహితపరిశుద్ధప్రదేశనివాసంబును, సంసారలంపటు లయిన మానవులతోడి చెలిమి వీడుటయు, నిరంతరం బాత్మను గుఱుతెఱుంగఁ బ్రయత్నించుటయు, నుపనిషదర్థవిచారంబును, జ్ఞానోదయంబునకుఁ బరమసాధనంబు లై చెల్లు. ఏత దన్యంబులగుగుణంబులవలన సంసారంబు వొడము. జ్ఞానసాధనంబు లిట్టి వని యిపుడు దెల్ల మయ్యెఁ గదా? యిఁక జ్ఞాన మెట్టి దన? ౧౨౪

రాముఁడు సౌమిత్రికి జ్ఞానస్వరూపమును జెప్పుట

సీ. ధీర! బుద్ధిప్రాణదేహమనోఽహంకృతులకంటె నేను భిన్నుఁడను నిత్యుఁ
డను జిదాత్మను శుద్ధుఁడను బుద్ధుఁడ నటన్న దృఢనిశ్చయప్రాప్తి దేనివలనఁ
గాంచుచుండెనో; దాని జ్ఞానమ్ముగా నిశ్చయించితి, నియ్యది యెట్టివేళ
వచ్చుఁ బ్రత్యక్షానుభవమున; కప్పుడ విజ్ఞాన మనుపేర వెలయఁ గలదు.

గీ. ఆత్మ యెల్లెడఁ బరిపూర్ణుఁ డవ్యయుండ, హీనబుద్ధ్యాద్యుపాధిరహితుఁడును బరిణామముఖవర్జితుఁడుఁ జిదానందరూపుఁ, డద్వితీయుఁ డేకాకృతి నలరువాఁడు. ౧౨౫

క. జడము లయిన దేహాదుల, విశదక నిజదీప్తిఁ బఱపి వెలిఁగించుచు నుం
డెడివాఁ, డెందును గప్పం, బడనిఘనుం డాత్మ యగును భవ్యవిచారా! ౧౨౬

వ. మఱియు నతండు సత్యజ్ఞానాదిలక్షణుండును, నసంగుండును, స్వప్రకాశుఁడును, సమస్తద్రష్టయు నై యపరోక్షజ్ఞానంబునఁ దెలియంబడుచున్నాఁడు. ఆచార్యా

గమోపదేశమ్ములం జేసి, జీవాత్మపరమాత్మల కైక్యజ్ఞాన ముదయించినతోడన సంసృతిమూల మగుసజ్ఞానము కార్యకారణములతోఁ బరమాత్మయందు లయము నొందు. అవిద్యాలీనరూప మైనయాయవస్థయె ముక్తియని చెప్పంబడు. ఇది యాత్మయం దుపచారమాత్రంబ కాని వాస్తవము గానేరదు. ౧౨౮

గీ. జ్ఞానవిజ్ఞానవైరాగ్యసహితముగను, నర్కకులదీప! పరమాత్మ నైననాదు
మోక్షరూప మియ్యది తుదముట్ట నీకుఁ, జెప్పఁగాఁబడె నాచేతఁ జిత్త మలర.

గీ. ఐన నాయందు భక్తిలే నట్టివారి
కేను చెప్పిన జ్ఞానవిజ్ఞానమోక్ష
ములు గదుర దుర్లభము లని తలఁచువాఁడఁ
దక్క మీవచనము సుమిత్రాకుమార!. ౧౨౯

సీ. రేయిఁ గండ్లున్నవారికిఁ గూడ వస్తువుల్ గనరాని పోల్కి, సాధనము లభ్య
సించినఁ దుర్మోహచిత్తులై మత్పాదభక్తి లేకున్న లాభంబు లేదు,
వస్తుసంతతి దీపహస్తులకుం దోఁచుకరణి, నాపైభక్తి గల్గె నేని
నీ పరమాత్మస్వరూపముక్త్యావస్థ యంచితం బయి ప్రకాశించు ననుజ!
గీ. పూర్వజన్మార్జితం బగుపుణ్యమునన, కాని మద్భక్తి వొడమదు మానవులకు,
నిర్మలం బగుభక్తి జనించుట కయి, కారణం బొండు గలదు చక్కనిది వినుము.

రాముఁడు సౌమిత్రికి భక్తి సాధనములఁ దెలుపుట

సీ. నాదుభక్తులచెల్మి, నాసేవ, నాదాసజనులకుఁ బరిచర్య సలుపుటయును
నేకాదసుల సమాహితచిత్తులై యుపవాసాదికములఁ దీర్పం దలఁచుట
నా యుత్సవంబుల నన్నుఁ గీర్తించుట, నాకథాశ్రవణం బొనర్పఁ జదువ
నితరులకుం జెప్ప నెపుడుఁ గాంక్షించుట, స్థిరబుద్ధి నన్నుఁ బూజించుటయును
గీ. విమలమన్నామభజన మత్యమలబుద్ధి
నాచరించుటయును, నన్మదర్పణముగఁ
గార్యము లొనర్చుటయు నా యఖండభక్తి
గలుగుటకుఁ గారణములు, లక్ష్మణకుమార!. ౧౩౧

క. పై నెఱిఁగించినవిధమున, మానవుఁ డెవ్వాఁ డొనర్చు మత్ప్రియ మిల; న
వ్వానికి దృఢభక్తి యగుఁ, దాని మిగులు జ్ఞానసాధనము లే దెందున్. ౧౩౨

గీ. ఉరుకలుషదాహమద్భక్తియుక్తజనుఁడు, జ్ఞానవిజ్ఞానవైరాగ్యసహితుఁ డగుచు
మీఁద ముక్తిని గాంచు సౌమిత్రి! నీదు, ప్రశ్నమున కుత్తరముఁ దగఁ బలికినాఁడ.

క. మానసమున నచలితుఁడై, యీనాతత్త్వమును నిలుపు నెవ్వఁడు; మోక్ష
శ్రీనిరుపమసుఖ మందం,గా నర్హుం డతఁడ; పరులు గారు, కుమారా! ౧౩౪

క. ఈతత్త్వమ్మును దెలుపకు,మేతఱిని మదీయభక్తిహీనునకు, గుణో
పేతా! మద్భక్తునకుం, బ్రీతి మిగులఁ బిలిచి యైన విన్పింపఁ దగున్. ౧౩౫

క. మానిని! శ్రద్ధాభక్తుల,తో నిత్యము దీనినిం జదువు నెవ్వం, డ
జ్ఞానపటలాంధకారము, భానునిగతిఁ ద్రోసి ముక్తిపద మతఁ డొందున్. ౧౩౬

సీ. నిరతంబు గట్టిపూనికతోడిమది గల్గి, చెదరనిసజ్జనసేవ మెలఁగి
యమలినచేతస్కు లతిశాంతచిత్తులు భక్తిభావంబునఁ బరఁగువార
లతులితమత్సేవనాభిరతాత్ములు నిర్మలజ్ఞాననిర్నిద్రబుద్ధు
లనవద్యు లఖిలశుభాన్వితుల్ సుగుణవిభ్రాజితు లైనమద్భక్తజనుల
గీ. స్నేహము సదానురక్తి నార్జించు నెవఁడు
వానియఱచేత మోక్షంబు వఱలుచుండు
నేను వశ్యుఁడ నై చరియింతు నతని
కన్య మిఁకఁ బల్క నేల? సౌజన్యనిలయ! ౪౩౭

వ. అనవుడు నాత్మవిషయిక మగునగ్రజోపదేశమునన్ సంఛిన్నసంశయుం డై సౌమిత్రి
సుఖం బుండె. ౧౩౮

శూర్పణఖ రామునిం జూచి మోహించుట

సీ. ఆకాలమున నొక్క రాకాసి కామరూపిణి జనస్థానవాసిని బలాఢ్య
దండకం దిరుగుచునుండి యొకప్డు దివ్యగోదావరీతీరమందుఁ
బంచవటికి సమీపమునఁ బద్మాంకుశకులిశాదరేఖలఁ బొలుపుమిగులు
రాముని యడుగు లారసి మన్మథపరీతహృదయ యై తన్మృదుపదసరోజ
గీ. భవ్యలావణ్యమున మోహవశ్యయగుచు, నితరమును జూడకయ తదర్పితముఁ జేసి
దృష్టి, మెలమెల్లగా నరుదెంచె రామ,భద్రు నాశ్రమభూమికి, విద్రుమోష్ఠి! 

క. వచ్చి, యచట జానకితో, మెచ్చుగఁ గూర్చున్నవాని మీనాంకనిభున్
లచ్చియనుఁగు రాముని నా,కుచ్చితురా లరసి మరునిగుఱికిం గుదు రై. ౧౪౦

ఉ. ఎవ్వనివాఁడ వీవు? మఱి యెవ్వఁడ? వెందుల కిందు నిల్చినా
వి వ్విధి నారచీరలును నేవము లౌజడలున్ ధరించి? నీ
కి వ్వనిఁ దీర్పఁగాఁదగిన దెయ్యది? నా కెఱిఁగింపు మా పనిం
బువ్విలుకానిజోడ! నినుఁ బోలినవారలు గానరా రిలన్.

క. దానవిని నేను శూర్పణఖానామమునం జరింతుఁ గ్రవ్యాదవిభుం
డైనమహాబలశాలి ద, శాననుఁడు మదగ్రజాతుఁ, డనుపమహాసా! ౧౪౨

క. ఈ వనభువి నంతయు ర, క్షోవల్లభుఁ డిచ్చె నా కకుంఠితగతి, స్వే
చ్ఛావిధి ఖరసోదరుతో, నే వసియింతు నిటఁ దాపసేంద్రులఁ దినుచున్. ౧౪౩

క. తెలుపు మిఁక నీదు కథ విన, వలయును నీవేళ వక్త్రవర! యని పలుకం,
బాలదిండి నెఱతుకకు రఘు, తిలకుం డిట్లనియెఁ దనదు తెఱఁ గెఱుకపడన్. ౧౪౪

గీ. ఏను రామాభిధేయుఁడ నిల నయోధ్య, నేలు దశరథనామభూపాలసుతుఁడ,
జనకరాట్ప్రియపుత్రి యీచారుగాత్రి, నాకుఁ గడుఁగూర్చునిల్లాలు, సోఁకువెలఁది!

క. నాకంటెఁ జిన్నవాఁడు శు, భాకారుం డితఁడు లక్ష్మణాభిఖ్యుం, డో
రాకాసి! యిచ్చటికి నీ, వేకార్యము వలచి వచ్చి తెఱఁగింపు మనన్. ౧౪౬

వ. కందర్పజ్వరపీడిత యై శూర్పణఖ యిట్లనియె. ౧౪౭

క. రా రమ్ము శైలముల శృంగారవనంబులను నన్నుఁ గలిసి రమింపన్,
సారసనయనుని నిను విడ, నేరను మరుకాఁక కాఁగ నేరను రామా! ౧౪౮

సీ. అనవుడుఁ గడకంట నవనిజం జూచుచు, రక్కసి కనియెఁ జిర్నగవు నిగుడ
నేనాఁడు గాని న న్నెడఁబాయఁ జాలక, వె న్నంటుచున్న యీసన్నుతాంగి
కళ్యాణి యున్నదిగద నాకు భార్యగ; సవతిపో రెట్లీవు సైఁపఁ గలవు?
వెలుపల మావాఁడు లలితశరీరుఁ డున్నాఁ, డాతఁ డైనచో నాతి! నీకు
గీ. నన్నివిధముల ననురూపుఁ డైనభర్త, కాఁ గలఁడు, వానితో నీవు గలిసి మెలఁగి
యిష్టసౌఖ్యములం జెందు మేఁగు మని వ,చింప రాముఁడు, సౌమిత్రిఁ జేరి యదియు.

క. ఓ యందగాఁడ! చూచితె; నాయందము భర్త వగుము నాకిఁక మీఁదన్
మీ యన్న యానతిచ్చెను, హాయిగ సుఖ మనుభవింత మన్యోన్యంబున్. ౧౫౦

క. ఆలస్య మేల నీవయి, బాళిన్ వచ్చితిని సౌఖ్యపడఁ దలఁచినచో
లేలెమ్ము పోద మని మరు, కోలలకుం జిక్కి పల్కె ఘోరాకారన్. ౧౫౧

లక్ష్మణుఁడు శూర్పణఖను బరిహసించుట

ఉ. రక్కసిఁ జూచి యిట్టు లనె రాముని తమ్ముఁడు, రామమూర్తికిన్
నిక్కము నేను దాసుఁడను నీవు ననుం బతిఁగా వరించె దే
నొక్కట దాసి వౌదు వయయో తలపోయఁగ నింతకంటె వే
ఱొక్కటి దుఃఖ మున్నదియె? యోర్తు వెటుల్ కడుసాధ్వి వక్కటా. ౧౫౨

క. బానిసకాని న్ననుఁ గొని, బానిసకత్తె వగు టేల? పాపము నీవున్ ;
మానక రామునె పొందుము, దానవి! యఖిలేశ్వరుం డతఁడు భద్ర మగున్.

వ. అనుటయుఁ దిరిగి రామునికడ కరిగి దుష్టమానస యగునద్దశముఖునిభగిని
క్రోధస్వాంతంబున. ౧౫౪

క. నను నటునిటుఁ ద్రిప్పెదవే; యనవస్థితుఁడ వయి యెఱుఁగ వస్మచ్ఛక్తిన్,
గనుచుండ నీవు నీయం, గన మ్రింగెద నంచు వికృతకాయముతోడన్. ౧౫౫

లక్ష్మణుఁ డన్నయానతిచే శూర్పణఖ ముక్కుచెవులం గోయుట

ఉ. ఆమెయిఁ బర్వువాఱి వసుధాత్మజ మీఁదికి గ్రాసకాంక్ష, శ్రీ
రాము ననుజ్ఞ ఖడ్గముఁ గరంబునఁ దాలిచి శీఘ్రవిక్రమ
స్థేముఁడు లక్ష్మణుం డసురశీర్షము చేఁగొని ముక్కునుం జెవుల్
వే మొదలంటఁ గోసి విడిపించె సురల్ వినుతింపఁ బెంపఱన్. ౧౫౬

సీ. అంత రక్కసి భీకరారావ మొనరించి యొడ లెల్ల నెత్తుటఁ దడియ శీఘ్ర
గతి నఱచుచుఁ బోయి ఖరదానవునిముందుఁ బరుషాక్షరములతోఁ బడినఁ జూచి
ఖరతరోక్తులు వల్కెఁ గ్రవ్యాదుఁ, డిది యేమి చెల్లెలా! డాపక చెప్పు మిపుడ
మృత్యువక్త్రానువర్తి యగువాఁ డెవ్వఁ డీ విధి వికృతాస్యఁ గావించె నిన్ను?
గీ. దండధరకల్పుఁ డైన నాతని వధింతు, ననఁగ వానికి ననియె శూర్పణఖ రాముఁ
డనెడివాఁడు సీతాలక్ష్మణాన్వితముగ, మనవనంబున నున్నాఁడు మనుజుఁ డొకఁడు.

శూర్పణఖ, రామునిజయింపఁబోవ ఖరునిం బ్రేరేచుట

క. దండక దానవభయ మం, చుండనియక, గౌతమీతటోర్విఁ బొలుచు నా
తం డానతి యిడఁగాఁ, ద, మ్ముం డిట్లొనరించె ఖడ్గమున నన్ను ఖరా! ౧౫౮

ఉ. ఉత్తమరాక్షసాన్వయసముద్భవముం గలవాఁడ వేని, లో
కోత్తరశూరుఁ డన్నబిరు దొందితి వేని; ననుం గుఱూపఁ గా
నిత్తఱిఁ జేసినట్టిధరణీశ్వరపుత్రుల శత్రులన్ మదో
న్మత్తుల నేఁడు నోయి పరిమార్పవలెన్ భుజదర్ప మేర్పడన్. ౧౫౯

క. వారల రక్తము నేఁ దని, వారం ద్రావెదను సోదరా! తడయక నీ
వా రామలక్ష్మణులఁ గడు, పారం దిను, మిట్లు సలుపవైతివయేనిన్ ;. ౧౬౦

చ. అసువులఁ బాసి నీ యెదుట, నంతకు చెంతకుఁ బోయెదం, జతు
ర్దశభువనైకశూరుఁ డగుదానవనాథునితోడఁ బుట్టి, మా

నిసి యొకఁ డీక్రియ న్నను వర్ణి విక్రుతాస్యను జేసి పంప న
ట్లు సయితు జీవముల్ విడ, కెటుల్ మొగ మెత్తి చరింతు నీపయిన్. ౧౬౧

ఖరదూషణాదులు శ్రీరాముని మార్కొనుట

సీ. అనవుడు ఖరుఁడు క్రోధాక్రాంతచిత్తుఁ డై యే నుండ నీ కేటి కింత చింత
సోదరీ ! యని దాని నూరార్చి, పదునాల్గువేలరక్కసులను భీమకృతులఁ
బగతురం బొరిగొనఁ బదుఁ డని నియమించి, దూషణత్రిశిరులతోడ బహు వి
ధాయుధమ్ములు పూని యా రఘువీరునిమీఁదికిఁ బోయె నున్మాదమునను
గీ. వారికోలాహలము చెవిం బడఁగ రామ, విభుఁడు దమ్మునిఁ గనుఁగొని వింటె?గొప్ప
ధ్వని వినంబడుచున్నది దనుజపాళి, మనలఁ జెనకుట కై వచ్చుమాట నిజము. ౧౬౨

ఉ. వారికి నాకు నిప్పు డనివారితఘోరరణంబు చెల్లెడిన్
శూరవరేణ్య! యీ పుడమిచూలిని దోడ్కొని వేగ యా గుహం
జేరి వసింపు మందు, ఖలచిత్తుల వానిజఘాంసులన్ దయా
దూరుల నెల్లసోఁకులను ద్రుంపఁగ నోరితి నే నొకండ నే; ౧౬౩

క. సోదర! యీవిషయములో, నేదియు బదు లాడఁగూడ దీ, విదుగో నా
మీఁద నిడితి నొట్టనుడు స,మాదరమతి సీతతో గుహకుఁ జనె నతఁడున్. ౧౬౪

శ్రీరాముఁడు ఖరదూషణాదులం జంపుట

చ. పరికరబద్ధుఁ డై యసురభంజనకాముఁడు రాముఁ డొక్కని
ష్ఠురధను వంది కేల దివిఁ జూచెడువేలుపుమూఁక కెంతయే
గరువముఁ గూర్పఁ జాలి, రిపుఖండనపాండితి గల్గుతూపులం
దఱుఁగని తూణికాద్వయము దాలిచి మూఁపున, నిల్చె నత్తఱిన్. ౧౬౫

ఉ. రాక్షసు లొక్కపెట్ట రఘురామునిపైఁ బఱతెంచి యుల్కమై
వృక్షశిలాచయంబుల ననేకవిధాయుధపాళి వైవ, లో
కక్షయకీలికల్పశితకాండపరంపర నుగ్గు సేసె రా
మక్షితిజాని లీల క్షణమాత్రములోనన వాని నన్నిఁటిన్. ౧౬౬

ఉ. పిక్కఁడిమూఁక నెల్ల నొకవేయిశరంబుల మృత్యుదేవతా
గారముఁ జేర్చి, శూరు లని గర్వముఁ గొన్నఖరుం ద్రిశీర్షునిన్
గ్రూరుని దూషణుం గఱకుఁగోలలఁ గూలఁగ నేసి వారితోఁ
గూరిచె, నర్ధయామమునకుం బని దీఱెను రామభర్తకున్. ౧౬౭

క. గుహనుండి వచ్చి బయటికి, మహీసుతను రాముసకు సమర్పించి, ధరా
నిహతుల దైత్యులఁ గనుఁగొని, యహో; యనె సుమిత్రితనయుఁ డతివిస్మితుఁడై.

చ. జనకనృపాలనందన ప్రసన్నముఖాంబుజ యై రఘూద్వహుం
దనవిభుఁ గౌఁగిలించుకొని, తత్తనుసిక్తశరవ్రణంబు లె
ల్లను మెలమెల్లగాఁ దుడిచె, లావఱి చచ్చినవారిఁ గాంచి శూ
ర్పణఖ రయంబునం బరుగువాఱెను నగ్రజుఁ డేలులంకకున్. ౧౬౯

వ. అట్లు పోయి, ౧౭౦

ఉ. ఆ మ్మగలంగ మోఁదికొని రోఁజుచు నేడ్చుచుఁ బంక్తికంఠుపా
దమ్ములచెంత నిండుసభ ధారిణిపైఁ బడ, సాధ్వసార్త యై
యుమ్మలికర్ణ మునింగినసహోదరి నారసి రావణుండు, లే
లె మ్మిఁక ముక్కునుం జెవులు లేనివికార మిదేమి? చెల్లెలా! ౧౭౧

ఉ. ముందఱిము ప్పెఱుంగకయ మూర్ఖత ని న్నిటు చేసినట్టి య
మ్మందుఁ డెవండు తెల్పు? బలమర్దనుఁడా? యముఁడా? కుబేరుఁడా?
సుందరి! నీళ్లరాయఁడ? వసుంధరకుర్క బలి యిత్తు నెవ్వఁ డై
నం దలగొట్టి యీక్షణము, నాబలశౌర్యము లీ వెఱుంగవే? ౧౭౨

శూర్పణఖ, రావణుని దూఱుట

క. అని పలుక శూర్పణఖ యిట్లనుఁ బరకల్పితపరాభవానలము క్రమం
బున వృద్ధిఁ బొంది దేహమ్మును గాల్పం దొడఁగఁ బంక్తిముఖుఁ గన్గొనుచున్.

సీ. మత్తెక్కి కడుబుద్ధిమాలి స్త్రీలకు లొంగి పొరి సంతతముఁ దాగుఁబోత వగుచు
సర్వకార్యములఁ బుంస్త్వము లేనివానిచందమునఁ గన్పట్టుచున్నావు నేఁడు
నీ వెట్లు రాజు గానేర్తువు చారచక్షుర్విహీనుఁడవు? నా సుద్ది వినుము,
రాక్షసవైరి యా రాముండు ఖరుని దూషణుని త్రిశీర్షునిఁ జంపె, నట్లు
గీ. పిశితభక్షకులం జతుర్దశసహస్ర,సంఖ్యవారలఁ జక్కాడె సమదలీల,
మానిసంఘములకు జనస్థాన మెల్ల, భయవిరహితముగాఁ జేయఁబడియె నిపుడు.

గీ. అయినవారు మహాశూరు లందఱుఁ బగ,
వారిచేఁ బడి మడియు, నీ వరుస నేమి
యెఱుఁగ కున్నాఁడ, వందుచే నేను నిన్ను,
మూఢుఁడ వటంటి నన దశముఖుఁడు పలికె. ౧౭౫

క. రాముఁ డన నెవ్వఁ డసుర, స్తోమము నెందుల కతండు దునుమాడెను? వా, రేమియి హతులై రకటా, సామాన్యులె? శౌర్యవిజితశత్రుసమూహుల్. ౧౭౬

వ. నా కా విధమంతయుఁ దడయక కెఱిఁగింపుము. దైత్యహంత యగునాపగతుని సమూలముగ నమయించి, నీవగపుఁ దీర్తు ననవుడు, నచ్చెనఁటిరక్కసి పొలసు దిండిమొకిమీాని కి ట్లనియె. ౧౭౭

శూర్పణఖ రావణునకు రామాదుల వృత్తాంతమును జెప్పుట

సీ. ఏ నొక్కతతి జనస్థానమ్ము విడనాడి, గౌతమీతీరంబు గానఁబోతి
నట మున్ను మౌనిజనాశ్రయం బగుప్రదేశం బొకఁ డలరుఁ బంచవటి యనఁగ
నాయాశ్రమంబున నను గిడ శ్రీఁ బోల్చి కమలంబులనుబోలుకనులు గల్గి
ధనువును బాణముల్ ధరియించి వల్కలంబులు గట్టి వెంద్రుకల్ జడగ ముడిచి
గీ. తనకు ననురూపుఁడును బిన్న తమ్ముఁ డయిన, లక్ష్మణునితోడ, రెండవలక్ష్మి నాఁగఁ
బరఁగు సుందరాననయగు భార్యతోడ, నలరుచున్నట్టి శ్రీరాముఁ డరయ నయ్యె.

గీ. దైత్యవల్లభ! దేవగంధర్వనాగ, మానవాంగనలం దెందుఁ గాని యట్టి
సుందరాంగిని వినలేదు చూడలేదు, తత్తనుప్రభ వని దగద్ధగ వెలిఁగెను. ౧౭౯

ఉ. ఆ సుదతీలలామ భవదర్ధశరీరిణిఁ జేయ నెంచి పే
రాసను గైకొనం జనఁగ, నగ్రజునానతిఁ దమ్ముఁ డీక్రియం
గోసెను ముక్కునుం జెవులుఁ, గుందుచు నే నపు డార్తనై ఖరుఁ
డాసి వచింప నాతఁడు రణంబున కేఁగెను దైత్యపాళితోన్. ౧౮౦

వ. అ ట్లేఁగి. ౧౮౧

గీ. రాము నెదురించి బెదరించి రణ మొనర్చి, భీమవిక్రమదానవస్తోమయుతము
గా గతప్రాణుఁ డయి కూలె క్షణములోన, నా మహాబలశాలి బాణాగ్నిఁ గమరి.

క. అతనికి మన నగునేని, దితిసుతు లన నేల దనుజధీరా! లోక
త్రితయము నిమిషార్ధములో, హత మొనరింపంగఁజాలు నని తోఁచె మదిన్.

క. ఆ కులుకుంగుబ్బెత మఱి, నీకుఁ భార్య యగునేని; నీ జీవిత మ
స్తోకఫలాన్విత మగు, నటు, గాకున్న నిష్ఫలంబుగాఁ దలఁపఁదగున్. ౧౮౪

గీ. సర్వలోకైకసుందరి సరసిజాక్షి, సీత నెట్లైన నాలిఁగాఁ జేసికొనెడి
యత్నముం జూడుమా దనుజాధినాథ!, మైన నొక వెర వెఱిఁగించుదాన వినుము.

శా. సాక్షాద్రామునిముందు నీకు నిలువన్ శక్యంబు గా, దందుచే
నక్షీణాసురమాయకల్మిఁ దఱితో నాశూరు కన్గప్పి య
బ్జాక్షిన్ జానకిఁ దెచ్చి తద్రతిసుఖైకానందముం బొందుమీ
రక్షోవల్లభ! యన్యదారగమనప్రాముఖ్య! జాగేటికిన్. ౧౮౬

గీ. అనుచుఁ బలికెడిచెల్లెలి నసురవిభుఁడు, మంచిమాటల మఱి దానమానములను
నూఱడిలఁ జేసి చనె నిజాగారమునకుఁ, బ్రబలచింత రే యట నిద్ర వడయఁ డయ్యె.

### రావణుఁడు రాముని గూర్చి విచారపడుట

సీ. మాయురె? యే మిది మానవమాత్రుఁ డొనొక్క రామునిచేత నుక్కు దక్కి
బలవీర్యదర్పసంపన్నుండు ఖరుఁడు నా యనుజుండు సైన్యసమన్వితముగఁ
జంపంగఁ బడువాఁడె? చర్చింప రాముండు పరమాత్మ యగుఁగాని నరుఁడు గాఁడు,
బ్రహ్మచేఁ బూర్వంబు ప్రార్థింపఁబడి నన్ను సైన్యసమేతుని సంహరింప
గీ. నాత్మలో నెంచి బలసమూహములతోడ, మానవాకృతిఁ బూని భూమండలమున
వాసి కెక్కిన దగురఘువంశమందు, నిపుడు ప్రాదుర్భవించినాఁ డింత నిజము.

సీ. పరమాత్మచేఁ జంపఁబడుట కే నోఁచినఁ బూజ్య మా వైకుంఠరాజ్య మెల్లఁ
బరిపాలన మొనర్తు వ్యతిరేక మైన నీరాక్షసరాజ్యమే రహి వహింతుఁ
జిరకాల, మె ట్లైన సెగి లే దిప్పట్లఁ, గడువడి రాముఁ డున్నెడకుఁ బోదు,
నని యివ్విధంబున నఖిలరాక్షసనేత పరమేశ్వరుఁ డగుశ్రీహరిఁగ రాము
గీ. నెఱిఁగికొని, భక్తిచే నెన్నఁ డీశ్వరుండు, తగఁ బ్రసన్నుఁడుగాఁడు తొందరగ, వైర
బుద్ధినే యేను నా హరిం బొందువాఁడ, ననుచు నిశి నిశ్చయించెఁ దా నబ్జవదన!

క. మతిమంతుఁడు రాత్రించర, పతి యిటు యోచించి తనదుభావమునఁ, దుదం
గృతనిశ్చయుఁ డై రఘుపతి, సతిఁ దెచ్చెడిపట్ల, నబ్జసఖుఁ డుదయింపన్. ౧౯౦

### రావణుఁడు మారీచునింటికిఁ బోవుట

గీ. ఒక్క తే రెక్కి రయముగ నుప్పుకడలి, యవలిదరి నున్న మారీచు నరయఁ బోయె,
వాఁ డచట మౌనివలె జటావల్కలములఁ, బూని, యాసురవృత్తివిహీనుఁ డగుచు.

గీ. ప్రకృతిగుణభాసకుఁడు గుణరహితుఁ డైన, యా పరాత్మను దనమదియందుఁ జేర్చి
ధ్యాన మొనరించుచుండె నిస్తంద్రముగ, సమాధి చాలించి నంత నమ్మానుషాది.

చ. తనయిలు సేరవచ్చినశతక్రతువైరిని రాక్షసేశ్వరుం
గని, రయ మొప్ప లేచి కుతుకంబునఁ గౌఁగిటఁ జేర్చి పూజలం

దనిపి యథావిధిఁ సముచితం బగుగద్దె సుఖోపవిష్టుఁగా
నొనరిచి, పల్కె నిక్కరణి నూహకురామిని వానివచ్చుటల్. ౧౯౩

సీ. ఓదశగ్రీవ! నీ వొక్కరుఁడవే రథ మెక్కి వచ్చుట కేమిహేతు వయ్య?
ఏదియో యొకకార్య మెడఁదఁ దలంచుచుఁ జింతాపరునిమాడ్కి నెంతయేనిఁ
గన్పట్టుచున్నావు; విన్పింపు మది రహస్యంబు గా దేని ముఖ్యముగ నాకు
ననుఁ జూప మంటనిన్యాయకార్యం బైన మున్మాటి కేను బ్రియ మ్మొనర్తు
గీ. ననుడు, మారీచుతోడ ని ట్లనియె నతఁడు, ధర నయోధ్యాధినాథుఁడు దశరథాఖ్యుఁ
డైనయొకరాజు గలఁడు తదగ్రసుతుఁడు, రామనాముండు సత్యపరాక్రముండు.

సీ. ఆరాముఁ డాత్మభార్యయు లక్ష్మణానుజుఁడును వెంబడింపఁగ జనకు నాజ్ఞ
మునిజనప్రియ మగువనమున కరుదెంచి యుద్దండదండక నురుభావ
హం బైనపంచవట్యాశ్రమంబున వసియించినాఁ, డాతనియింతి సీత
లోకైకమోహిని లోలాక్షి, మారీచ! నిరపరాధుల భయంకరపరాక్ర
గీ. ముల నిశాటుల ఖరునితోఁ బిలుకుమార్చి, భయవివర్జితుఁ డై దుస్స్వభావుఁ డతఁడు
గోసె ముక్కును జెవులు నే దోస మెఱుఁగ, నట్టి నాచెల్లెలికి నిఁకే మనఁగవచ్చు.

రావణుఁడు మారీచునితో రాముభార్యను దేవలయు ననుట

వ. కావున న మ్మదాంధుని దుష్క్రియకుం బ్రతిక్రియఁగ నాతం డాశ్రమంబున లేని
తఱిఁ దత్ప్రాణప్రియ యగుసీతను భవత్సహాయమ్మునం గొనిరాఁ దలంచితి.

క. మాయామృగరూపముఁ గొని, యా యాశ్రమతలమునుండి యావలకుం గొం
పోయినచో రాకొమరుల; ధీయుత! జానకిని నేను దెత్తు సుఖవుగన్. ౧౯౭

క. నా కీ సాహాయ్యము శ్రద్ధాకలితుండ వయి చేసి తదుపరి నిష్టం
బాకరణి నుండు మనవుడు, నాకివిరోధిఁ గని విస్మయముతోడిమదిన్. ౧౯౮

మారీచుఁడు రావణునకు శ్రీరామపరాక్రమముం జెప్పుట

వ. మారీచుం డి ట్లనియె. ౧౯౯

ఉ. అక్కట? నీదుకొంప మొదలంటఁగఁ గూల్చెడి యీవిధంబు న
య్యక్కరణీయ మంచు భవదాత్మకుఁ దెల్పినవాఁ డెవం డొకో?
నిక్కము శాత్రవుం డనఁగ నీ కతఁడే; వధియింపు మాతనిన్,
ఎక్కడి రాముభార్య? హరియించుట దెక్కడ? నీవు, రావణా! ౨౦౦

సీ. నా మాట విను దైత్యనాయక! చెవియొగ్గి, మహితరామపరాక్రమమును దలఁచి
యిప్పుడుగూడ నాయెద దిగు లొందెడుఁ, బదిపదాఱేఁడుల ప్రాయ మందె

కౌశికుయజ్ఞంబుఁ గావఁగాఁ జనుదెంచి యొకబాణమున నన్ను నుదధియందు
నూఱుయోజనముల దూరంబునం బడవైచెఁ, దదాదిగ భయముఁ జెంది

గీ. యా యమానుషకృత్యు మే యాత్మలోన,
మఱిమఱి తలంచుకొని చాపమండితుఁ డగు
రాముఁ గనుచున్నవాఁడ సర్వదిశలందు,
రామమయ మయ్యె జగ మెల్ల, రాక్షసేంద్ర! ౨౦౧

చ. తెలియక, తొంటివైర మది తీవరపెట్టఁగ దండకాటవిన్
మెలఁగుచు నొక్కనాఁడు రజనీచరనాయక! యేను వాఁడికొ
మ్ములుగలజింకరూపుఁ గొని పోయితి రామునిమీఁది కద్దిరో
చలిపెడుపూన్కి మూఁదృశు లసంఖ్యముగా నను వెంబడించిరా. ౨౦౨

క. సీతాలక్ష్మణయుతుఁ డగు, సీతేశుం జెనకుబుద్ధి శీఘ్రగతిం బో
నా తెఱఁ గెఱిఁగి యతం డొక, శాతశరము వైచె నన్నుఁ జంపుతలఁపునన్. ౨౦౩

ఉ. రాక్షసనాథ! తద్ఘనశరంబు మహాశనివోలెఁ దాఁకఁగా
వక్షము, గిఱ్ఱునం దిరుగువాఱుచు నంబుధిఁ గూలినాఁడ మం
థక్షితిభృత్తు చందమున, నాఁడు మొదల్కొని తద్భయంబుచే
నీక్షితి నుంటి "రాముఁ డిట కెన్నఁడు రాఁ"డను గట్టినమ్మికన్. ౨౦౪

సీ. తతభోగ్యవస్తుసంతతిగూడ భయదాయకం బయి నామదిఁ గానఁబడుట
రామునే; చూతు హృద్రాజీవమున నెల్లకాలంబులం, దిది గాక వినుము
రాజు రత్నంబును రమణియు రథము మున్నగు రకారాదిశబ్దగణ మకట?
చెవి సోఁకి నంత రాఘవుఁడె స్మృతికి వచ్చి వెఱ పుప్పతిలుచుండె వింశతిభుజ!

గీ. నన్నుఁ గడముట్టఁ జేసెడిపన్నుగడను, నాతఁడే యిందు వచ్చినాఁ డనెడి శంక
వెలుపలికిఁ బోవుపను లెల్ల విడిచిపెట్టి,నాఁడ, మన మేడ? శ్రీరాముఁ డేడ? తేఁడ.

ఉ. నిద్దురయందుఁ గూడ రఘునేత నె నెమ్మదిలోఁ దలంచుటన్
గ్రద్దన స్వప్నమం దతఁడు గన్పడ భీతిలి బోధితుండ నై
యద్దమ రేయి, వేగువఱ కట్టులె చూచుచుఁ గూరుచుండుదున్
నిద్దురమాని మంచమున నే, నిఁక నేమని చెప్ప నేరుతున్?. ౨౦౫

క. కావున శ్రీరామునిపై, నీ విపు డాగ్రహము విడిచి నిజగృహమునకుం
బోవుట లెస్స చిరాగతమై వెలయు సురారికులము నడగార్పకుమీ. ౨౦౬

క. ఈ తెఱఁగుఁ గొనక వైరాన్వితుఁడ వై రాముఁ జెనక నీ వేఁగుదు వే
నై తేయకులము భస్మీభూతం బగునని యెఱుంగుము దశగ్రీవా! ౨౦౭

ఉ. మే లెఱింగించుచుంటి వినుమీ చెవి యొగ్గి మదీయభాషితం,
బేల వృథాప్రయాస, మఖలేశ్వరుఁ డై తగు రామభద్రుపై
వైళమ వైరబుద్ధి విడి భక్తి భజింపుము, భక్తలోకముం
బాళి ననుగ్రహించెడికృపానిధి యాతఁ, డరాతిభంజనా! ౨౦౯

మారీచుఁడు రావణునకు దేవరహస్యముం జెప్పుట

సీ. మున్ను నారదమహాముని ముఖమున విన్నట్టివిషయంబు గల దొండు వినుము దాని,
నాదియుగంబున నబ్జగర్భుఁడు వేఁడఁ బరమేశ్వరుఁడు రమాప్రాణవిభుఁడు
హరి దోఁచి, "నీ వేమి యడిగెదు చెప్పుము నెఱవేర్తు" ననిన వాణీవరుండు
"కమలాక్ష! మనుజదేహముఁ బూని భువి నీవు దశరథరాజన్యతనయుఁడ వయి,
గీ. పుట్టి, జగదపకారి యై పొగరు మిగులు, దశముఖుని సంహరింపుమీ తడయ" కనిన
నట్టులే యని యతఁ డేఁగె నఁట, యదేవి,ఘముగ నొనరింప నేటికిఁ దక్కు నతఁడు.

ఉ. ఆముని మాటఁ బట్టి నిజ మారసినన్ మనుజుండు గాఁడు శ్రీ
రాముఁడు; నిర్భయుండును నిరామయుఁ డవ్యయుఁ డైన విష్ణువే
యీమెయి మానుషాకృతి వహించి వనస్థలి కేఁగుదెంచెఁ జూ;
భూమిభరం బడంచు తమిఁ, బొమ్ము సుఖమ్ముగ నింక నింటికిన్. ౨౧౧

వ. అనవుడు మారీచునకు నిశాచరచక్రవర్తి యి ట్లనియె. ౨౧౨

రావణుఁడు తననిశ్చయమును మారీచునకుఁ దెలుపుట

ఉ. నీ వనినట్లు రాఘవుఁడు నీరజగర్భునిచేతఁ బ్రార్థితుం
డై వడి నన్నుఁ గూల్ప మనుజాకృతిఁ గైకొని వచ్చియున్న ల
క్ష్మీవిభుఁ డైనచో; గృహము సేరిన మిన్ననఁ బాఱినన్ ననుం
దా వధియింపకే విడఁడు తథ్యవచస్కుఁ డతండు గావునన్. ౨౧౩

మ. సతినిం దెచ్చినఁ దేకయున్నను ననుం జంపంగ నేతెంచు, నీ
హిత మింకేటికి నాటు? బోటి నిపుడే యేఁ దెత్తు నిక్కంబు, చ
చ్చితినా కయ్యమునందు; విష్ణుపదముం జేకొందు, లే కాతఁ డే
హతుఁ డైనన్; భయవర్జితుండ నయి సౌఖ్యం బందుదున్ సీతతో. ౨౧౪

సీ. జా గేటి కిఁక మహాభాగ! లె మ్మింద మా, జింకవు గమ్ము విచిత్రగతుల
రామలక్ష్మణుల శీఘ్రమ మాశ్రమమునుండి, కడుదవ్వు గొనిపోయి విడిచి యచట
మున్నటివలె సుఖమ్ముగ నుండు మవ్వల, నేఁగు మీమీఁదట నెద్ది యైన
భయదాయకం బగుపల్కుఁ బల్కెద వేని, నీకృపాణంబున నిందె నిన్ను

గీ. సంహారింపుదు నిదియ నిశ్చయ మనవుడు, "రాముచేఁ జచ్చినన్ భవార్ణవముదాఁటి
పరమపద మందుదును; దుస్స్వభావుఁ డితఁడ, చంపినన్ ఘోరనరకంబు సంభవించు"

క. అని మారీచుఁ డొకించుక, తనమది యోఁచించి శైలతనయా! శ్రీరా
మునివలనిమరణమే మేలను దృఢనిశ్చయముతో రయంబుగ లేచెన్. ౨౧౮

గీ. లేచి, దశకంధరుం జూచి లేఖవైరి!, చెప్పు భవదాజ్ఞఁ జేయుదుఁ దప్ప కనియె,
నంత రథ మెక్కి వా రిర్వు రరిగి రపుడు, రామభూకాంతు నాశ్రమభూమిఁ జేర.

మారీచుండు మాయాహరిణముగ మారుట

వ. తదనంతరము మాయాప్రాచుర్యుఁ డగుమారీచుండు. ౨౧౯

సీ. ఇంద్రనీలములకు నెనవచ్చుకనులు, రిక్కము లట్లు వెలుఁగుశృంగముల జంట
మణిసమానము లై యమరునాల్గుగిటలుఁ, దొలకరిమెఱపుతోఁ దొడరుకాంతి
చూచువారలచూపు దోఁచుకొనం జాలు సొబగుమోమును, వెండిచుక్క లొప్పు
శుద్ధజాంబూనదసురుచిరప్రభ గలమాయాకురంగ మై మంజువాణి!
గీ. రాఘవాశ్రమమునకుఁ గురంగట వసుధాప్రియాత్మజాదృష్టిపథంబునందుఁ
బడెడుతెఱఁగున నందమౌ నడక నమర, సువిరోధి లో నుబ్బంగఁ దిరుగఁజొచ్చె.

క. నిముసము పరుగిడు, నిలుచున్, నిముసము, దాపునకు వచ్చు నెటి భయమున దూ
రము దొలఁగు నీక్రియన్ సీత మోహపడ సంచరించె దైత్యుండు, సతీ! ౨౨౦

రాముఁడు, యథార్థస్వరూపము నగ్నియందు డాచి ఛాయామాత్రముగ నుండు మని సీతతోఁ జెప్పుట

సీ. తదుపరి రాముండు తనజాయ నపహరింపఁ జెడుతలంపునఁ గైకసీసుతుండు
ప్రౌఢిమైఁ బన్ను నపన్నాగ మంతయు, నెఱిఁగి, జానకితోడ నిట్టు లనియె
నేకాంతమునఁ, గాంత! యిదె పంక్తిముఖుఁడు సన్న్యాసివేషమున నిన్న పహరించి
కొనిపోవఁ దాఁ బొంచికొని యుండె నీయంతికమ్మున కిపుడ రాఁగలఁడు సూవె?
గీ. అస్మదీయాజ్ఞ నీవు త్వదాకృతి గల, ఛాయ నుటజంబునం దుంచి జ్వాలనునందు
నొరులకుం గానరాకుండ నొక్కయేఁడు, నిలిచియుండుము వేలుపుఁగొలము మెచ్చ.

క. రావణు నణఁచినమీఁదట, నీ వెప్పటిపగిదిఁ బడయనేర్తువు నన్నున్,
దేవీ! నావుడు నట్లే, కావించెద ననుచు జనకకన్యామణియున్. ౨౨౧

క. తనమాయారూపంబును, ననువొందఁగ నచట నునిచి యంతర్ధానం
బును బొందెఁ దాను ననలంబున లక్ష్మణుఁ డెఱుఁగకుండఁ, బూర్ణేందుముఖీ!

మాయాసీత, కపటహరిణమును దెచ్చి యిమ్మని రామునిం గోరుట

ఉ. అంతట భూమిజాత కపటాకృతిఁ గొన్నదియై నిజోటజ
ప్రాంతమునం జరించెడికురంగము నారసి నవ్వుచున్ మనగ
కాంతునిఁ జేరఁగా నరిగి కన్గొను రాఘవ! మోదహేతువై
యంతట నింతటం దిరుగు నా హరిణమ్ము నుదంచితాకృతిన్. ౨౨౪

గీ. రత్నభూషిత మై పసఁ గ్రక్కు మేను, చిత్రబిందువులం గ్రొత్తచెల్వు వడసె
లేల్లకున్ సాజ మగుభయలీల యించు, కేనిఁ గనరాక తిరిగెడు నిది, హృదీశ!

క. క్రీడామృగముగ నా కీ, లేడిం గొనితెచ్చి యిండు లేలెం డిఁక, రా
ట్చూడామణి! యీకోరిక, యీడేర్పుఁడు నేఁ, డనుగ్రహింపుఁడు కరుణన్. ౨౨౬

వ. అనుటయు. ౨౨౭

రాముఁడు, సీతాసంరక్షణంబునం దప్రమత్తుండవై యుండు మని లక్ష్మణునితోఁ జెప్పుట

ఉ. సమ్మతిఁ జెంది యందులకుఁ, జాపముఁ గైకొని రాముఁ డేఁగుచుం
దమ్మునిఁ జూచి మాయికులు దానవు లుగ్రతరప్రదర్శనుల్
ద్రిమ్మరుచుందు రి వ్వని, నధీరను మత్ప్రియ జానకిం బ్రయ
త్నమ్మునఁ గాచుచుండు త్వరితమ్ముగ నే నిదె పోయివచ్చెదన్. ౨౨౮

సీ. నీ యిష్ట మటుపై, ననిందిత యీసీత, రహిం నీకు నెంతయు రక్షణీయ,
నావుడు సౌమిత్రి, దేవ! రఘూత్తమ! యిది హరిణంబుగా దింత నిజము
మారీచుఁ డనువాఁడు మాయామృగాకృతి, మనల వంచింప నిచ్చ్చోటికి వచ్చి
నాఁడు; లేకున్న నెన్నం డైన నిట్టిమృగంబును వినకాని కనియుఁగాని

ఆ. యుంటిమే? యొకింత యోచింపు మని పల్క, నతఁ డయేని నిపుడ హాత మొనర్తు
హరిణ మైనఁ దెత్తు నవనిజావిశ్రామ, హేతువునకు సంశయింప నేల. ౨౨౯

వ. అని పల్కి రఘుపతి మఱియు. ౨౩౦

రాముఁడు లేడి వెంటఁ బోవుట

క. పోఁగలను గురంగముఁ గొని, రాఁగల నొక్కత్రుటిని సోదరా! మీ వదినెన్
బాగుగ నారయు మని వే, వేగ చనియెఁ గపటమృగము వెంటన్ రమణీ! ౨౩౧

గీ. లోకసమ్మోహినియు జగదాకృతియును
నైన మాయ కాశ్రయుఁ డెవ్వఁ? డట్టి నిర్వి
కారుఁడును బూర్ణుఁడును జిదాకారుఁ డయ్యు
హరిణమును బట్టికొనుకాంక్ష నరిగెఁ, గాళి! ౨౩౨

గీ. "కమలనాభుఁడు భక్తానుకంపి" యనెడి
నుడి యథార్థము సేయ రాముఁడు మహీసు
తాప్రియార్థము కపటకృత్యం బటంచు
సకల మెఱిఁగియు నీగతిఁ జనియె నపుడు. ౨౩౩

గీ. కాకయుండిన ; సంపూర్ణకాముఁడు విది, తాత్మరూపుఁడు బరమాత్మ యైనరామ
చంద్రునకు నిజ్జీతోఁగాని జానకీల, తాంగితోఁ గాని పనియేమి ? మంగళాంగి !

వ. అట్లు తనవెంట నంటినజగముకంటికొలముసామిని లక్ష్యపెట్టక యమ్మాయా
సారంగంబు. ౨౩౪

రాముఁడు మారీచుం గడతేర్చుట

చ. ఒకతఱిఁ జెంతఁ దోఁచుచు, మఱొక్కక్షణంబునఁ బర్వువాఱు, చిం
కొకతఱి లీన మై యొదిగియుండుచు, నాపయి దూర మేఁగు, చీ
రకముగఁ ద్రిప్పి త్రిప్పి యవురా యన నెంతయు నేనిదవ్వు తీ
సికొని చనంగ, లక్ష్మణుఁడు చెప్పినచొప్పు మదిం దలంచుచున్. ౨౩౬

సీ. క్రవ్యాదుఁ డితఁడు టక్కరివేస మూనినాఁ, డని నిశ్చయించి సీతాధిపుండు
శర మొండు పొదినుండి సరగున లాగి వింటనుగూర్చి మృగరూపమున గమించు
మారీచుపై వైవ, గౌరి! కృత్రిమరూపుఁ బాసి తొల్లింటి రూపంబుతోడ
"హా లక్ష్మణ! హతుండ నైతి మహాబాహు! చెచ్చెర వచ్చి రక్షించు నన్ను"
గీ. ననుచు రామునిచందాన నార్తరవముఁ, జేసి భువిఁ గూలి జీవంబువాసి యతఁడు
పరమయోగులు సైతము పడయఁజాల, నట్టి శ్రీవిష్ణుసాయుజ్య మందఁ జాలె.

చ. ఖలమతి యైనఁ, దా మరణకాలమునం దెవనిన్ స్మరించి ని
స్తుల మగుతత్పదంబునకుఁ దోడనె యేఁగి సుఖించునో; తదీ
యలలితవిగ్రహంబుఁ గనులారఁగఁ గాంచుచుఁ దచ్ఛరాహతిం
బొలిసినదానవుం డటులు వోవుట యేమి విచిత్ర? మంగనా! ౨౩౭

మారీచుఁడు సద్గతికిఁ బోవుటను జూచి దేవత లాశ్చర్యపడుట

ఉ. ఆతనిమేనినుండి యొకయద్భుతతేజము లేచి లోకముల్
ప్రీతిని గాంచుచుండ రఘువీరుశరీరము సొచ్చె, నిర్జర
వ్రాతము మింట మూఁగి యవురా? తొలిబామున గొప్పపుణ్య మీ
పాతకి చేయఁబోలు; నిటు పొల్పడునే? యటు గాకయుండినన్. ౨౩౮

క. మునిభక్షకుండు ఖలుఁ డీ, దనుజుం డేది చేసి తుదకుఁ దా నేది వొందెఁ
వినుఁ డిది యెల్ల రఘూద్వహు, ననుపమమహిమమ్ముగాక యన్యం బున్నే?.

సీ. మున్ను నరాది రామునికలంబకహతిఁ గడలిలోఁ బడి భయకంపితుఁ డయి
విడనాడి నిజగేహవిత్తాదికం బెల్ల హృది రాముని సంస్మరించుకొనుచు
నఖిలపాతకదూరుఁ డై బిద్దునెడ న ద్దయాళు దివ్యాకృతి నరయ నోమి
కడ నైక్యముం జెందెఁ, గాన బ్రాహ్మణుఁ డైన నసురుఁ డైనను దురితాత్ముఁ డైన
గీ. ధార్మికుం డైనఁ జచ్చెడుతఱిని రామ,భద్రుని దలంచి కాంతురు పరమపద, మ
టంచు నన్యోన్యమును మాటలాడికొనుచు, నమరులు త్రివిష్టపమునకు నరిగి రంత.

గీ. నా యెలుఁగు మాడ్కి "హా! లక్ష్మణా!" యటంచుఁ
బల్కి యితఁ డీల్గినాఁ డేమిఫలము దీనఁ
గల్గునో; నాదుమాటయ కాఁ తేఁ ంచి
వెలఁది జానకి యేమి కాఁగలదొ కట్ట. ౨౪౨

వ. అని తలపోయుచు రవికులుండు చింతాకులమానసుం డై దవ్వునుండి యుటజమ్ము
నకు మరలె. అట సీతయుఁ బ్రియకంఠస్వానానుకారి యగుమారీచాక్రందనము
శ్రవణతాడితం బగుడు మహాభీత యై దిగు లడరునెడందతోఁ గడువడి సౌమిత్రిం
జూచి. ౨౪౩

సీత, లక్ష్మణుని రామునికి సహాయముగఁ బొమ్మనుట

సీ. పోపొమ్ము లక్ష్మణా! పాపపురక్కసుచే నెద్దియో ముప్పుఁ జెందినాఁడు
మీయన్న, హాలక్ష్మణా! యని యెలుఁగెత్తి యఱచుట వినకుంటివా? యి దేమి
య ట్లూరకుండెద వతిరయంబునఁ బోక; యాలస్య మొనరించునట్టితెరుఁగు
మా యిది? యనిపల్క, నతఁ డనె, దేవి! య య్యది మదగ్రజునివాక్యంబు గాదు
గీ. ఉసురువాయుచు నెవ్వఁడో యసుర యొకఁడు
పలికినాఁ డీక్రియఁ భ్రాంతిపడకుఁ దలఁచి
కనలినం ద్రుటి మూఁడులోకములఁ జెఱచు
వాఁడు మాయన్న యిటు దీనవచనుఁ డగునె? ౨౪౪

సీత, లక్ష్మణుని నిందించుట

వ. అనవుడు జనకనందిని కుపితయై నయనకల్హారంబులనుండి బాష్పకణంబు లురలు
చుండ ని ట్లనియె. ౨౪౫

ఉ. ఓకుటిలాత్మ! యగ్రజున కొప్పమి రా మదిఁ గోరుచుంటి వా
నీకథ యంతయుం దెలిసె, నీవు రఘూత్తమనాశకాంక్షియా

కైకకొమారుసంపునను గానకు వచ్చితి సాధువైఖరిన్
శ్రీకరుఁ డన్న దీజెనతఱిన్ ననుఁ జేకొనఁబోవు కోరికన్. ౨౮౬

క. తల్లిక్రిందు లయిన ధరణీ,తలము, ననుం గవయఁ జాలుదశ గలుగదు పో
ఖలచిత్త! నీకు; జీవం,బులఁ బాయుదు నిదిగో చూడు పొఁ గేమిటికిన్. ౨౮౭

క. నన్నుం గొనుయత్నములో, నున్నా వని యెఱుఁగఁ డో రఘూద్వహుఁ; డా వి
ద్వన్నుతునిఁ దక్క ముట్టను, నిన్నున్ భరతుని మఱెవ్వనిం గాని; ఖలా! ౨౮౮

గీ. అనుచుఁ జేతులఁ దల మోఁదికొనుచుఁ బెక్కు,గతుల దూఱె మఱందిని గపటసీత,
శివశివా!! యెట్టిమాట లీచెవులతోడ, వినవలసివచ్చె నని మనోవీధి నడలి. ౨౮౯

వ. సుమిత్రానందనుండు సీతదిక్కు మొగం బై. ౨౯౦

గీ. కఠినురాల! న న్నిట్టు లుగ్రముగఁ బలుక,న్యాయమే? యీవు చెడితివి నాశ మొందఁ
గలవు సు మ్మని వనదేవతలకు నామె, నప్పగించి కుందుచు నన్న నరయఁబోయె.

రావణుఁడు సన్న్యాసివేషమున సీతకడకు వచ్చుట

సీ. అది సందుగాఁ గొని యసురనాయకుఁడు ద,శాస్యుండు భిక్షువేషము ధరించి
దండకమండలుధారియై వైదేహి,చెంగటి కేఁగ, వీక్షించి వాని
యతి యని భక్తితో నర్చించి వే కంద,మూలఫలాదుల ముందుఁ బెట్టి
స్వాగతంబు నొసంగి, యోగీశ్వర! భుజింపు, మీఫలాదుల విశ్రమించు మిచట
ఆ. వచ్చు నావిభుండు వైళమ నీకు వి,శేషభంగిఁ బ్రియముఁ జేయఁగలుగు
నిష్ట మగున యేని నించుక నిల్వు మ,టన్న దానవేంద్రుఁ డనియె నిట్లు. ౨౯౨

ఉ. ఎవ్వతె వీవు పంకజదళేక్షణ! నిష్కలుషా! భవద్విభుం
డెవ్వఁడు దైత్యసేవ్య మగునివ్వనధారుణి నీకు నిల్వఁగా
నెవ్విధి సంభవించె? వచియింపుము నీచరితం బదెల్ల, నే
నవ్వల నాదువృత్తము సమస్తము మంగళగాత్రి! తెల్పెదన్. ౨౯౩

సీత, రావణునకుఁ దనువృత్తాంతమును జెప్పుట

వ. అనవుడు జానకి యి ట్లనియె. ౨౯౪

సీ. దశరథుం డన నయోధ్యాపతి శ్రీమంతుఁ, డోకగొప్పరా జుర్వి నొప్పు, నతని
యగ్రనందనుఁడు రామాభిఖ్యుఁ డఖిల,లక్షణలక్షితుఁడు సూవె జటివరేణ్య!
యే నామహాభాగు నిల్లాల జనకభూ,నేతృపుత్రిని బేరు సీత యండ్రు
కడుఁ బ్రీతిఁ దనమీఁదఁ గల పిన్నతమ్ముఁ డు,న్నాఁడు లక్ష్మణుఁడు మన్నాథునకును

గీ. నాన యానతిమైఁ బదునాలుగేండ్లు, దండకాటవిఁ గాఁపుర ముండ వచ్చి
నాము మూఁగురమును మేము, నాకు నింక, నీ తెఱం గెఱిఁగింపు, మనింద్యచరిత!.

రావణుఁడు తాను వచ్చినవిషయము సీతతోఁ జెప్పుట

వ. అనుటయు న క్కుటిలుండు. ౨౫౬

ఉ. ఓకమనీయగాత్రి! వినవో నను మున్ను; పులస్త్యు మన్మఁడన్
సోఁకుల నేలువాఁడఁ గడుశూరుఁడ రావణనామధేయుఁడన్
నీ కొఱకై సరోజశరునిం గరుణించితి వాఁడిగల్గు పూ
బాకులకాఁకచే మిగుల బాధలు వెట్టిన భావికాంక్షమై. ౨౫౭

చ. నినుఁ గొనిపోవ వచ్చితిని నీరజలోచన! నాదు వీటికిన్,
మునివలె నున్న రాఘవుని మూలమునన్ సుఖ మేమిగల్గు? నీ
మనమునఁ బాఱఁ జూడు, మసమానుని నన్ను వరించి భోగరా
శి ననుభవింపుమీ యడవిఁ జెందినకొండలపాటు డిందఁగన్. ౨౫౮

వ. అని పలికిన నించుకభయ మంది రాఘవపురంధ్రి. ౨౫౯

సీత రావణుని నధిక్షేపించుట

క. అనరానిమాటలను న, న్ననుచుంటివి మంచిచెడ్డ లరయక; శ్రీరా
మునివలన నాశ మెనయుదు, వనుమానము లేదు దానవాధమ! యింకన్. ౨౬౦

ఉ. ఓపిక చేసి యొక్కక్షణ ముండఁ దలంపుము, సానుజన్మఁడై
నాపతి రాఁగలం డసురనాయక! రామునిభార్య నైన న
న్నోపఁ డెవండునుం జెనక? నుర్వి మృగేంద్రుసతిన్ శశంబునాఁ,
బాపపుఁగార్యమున్ జలిపి ప్రాణముఁ బాయఁగ నేల కూళవై. ౨౬౧

ఉ. "ధీరుఁ డనంగ నేన;" యనుదీమస మెంతగ నీకుఁ గల్గినన్
సారము లైననావిభుని శస్త్రములన్ ధృతి దూలుచున్ సమి
ద్ధారుణిఁ గూలఁగాఁ గలవు తథ్యము నావుడుఁ గ్రోధమూర్ఛితుం
డై రజనీచరేంద్రుఁడు నిజాకృతిఁ జూపెను రాముదేవికిన్. ౨౬౨

రావణుఁడు సీత నెత్తికొనిపోవుట

సీ. పదిశిరంబులును నిర్వదికరంబులు గల్గి కాలమేఘద్యుతి గడలుకొనఁగ
గొప్పకొండను దీటుగోరు నాతనిభయదాకృతిఁ గాంచి భూతావళియును

వనదేవతలు భీతి వడి, రంత నఖముల భూపుత్రి నిల్చినభువిఁ బగిల్చి
కరములనెత్తి తూకము సరిచూచి రథంబుపై నిడుకొని త్వరితగతి ద,
గీ. శాస్యుఁ డాకాశపథమున నరుగుచుండ, హా రఘూత్తమ! హా లక్ష్మణా! యటంచు
నేడ్చుచుఁ దీనురా లయి యిలనుగాంచు,చుండె భూజాత పెనుభీతియొదవనపుడు.

జటాయువు రావణునితోఁ దలపడుట

చ. పవినిభ మైనముక్కు నఖభల్లములుం గలయట్టి దా జటా
యువు విని సీతరోదనము, నుర్వి ధరాగ్రమునుండి లేచి పో
యి వడి నదల్చు చాసురగణేశ్వరుఁ గూడఁగఁ బాఱి నిల్వు మీ
వెవఁడవు నాదుబారిఁబడి యెవ్వనికిం జనరాదు, మూర్ఖుఁడా! ౨౬౪

గీ. యాగమున మంత్రపూతమై యలరు నా హ,
విస్సు శునకంబు హరియించు విధమునం; ద్రి
లోకపతిభార్యఁ గొనిపోవ నీకుఁ దగునె?
రామలక్ష్మణవిరహితాశ్రమమునుండి. ౨౬౫

క. ఆయిరువురు లేమిఁ జై, తేయా! నీ యాట సాగెఁ దెల్లము, కాదేఁ
నీయాకృతి విడి యింతకు, హాయిగఁ ద్రిదివమున నుండవా? పితరులతోన్. ౨౬౬

వ. అని మఱింత క్రుద్ధుం డై పతంగపుంగవుండు. ౨౬౭

క. తన తీక్ష్ణతుండమున దను,జుని తేరిఁ బడఁగఁ బొడిచెఁ జూర్ణముగాఁ, జం
పెను దురగంబులఁ బదతాడనములఁ, బొడిసేసె విలు దృఢం బగుశక్తిఁ. ౨౬౮

రావణుఁడు జటాయువు ఱెక్కల నఱకుట

ఉ. దాని కతండు మండిపడి, దానవనాథు ననుం గణింప కే
పూనితి విట్టిచేఁత, కగుఁ బో; నిను దూఱిన లాభ మేమి? నా
చే నశియింప నీకు విధి చేసినకట్టడ యట్టు లుండె, నీ
తో నని చేఁత తుచ్ఛముగఁ దోఁచెడు నాకుఁ, బులుంగురాయఁడా!. ౨౬౯

వ. అని తూలనాడి. ౨౭౦

క. ఆ క్షితిసుత నొకచో నిడి, కౌక్షేయక మంది కేలఁ గనలుచు ధీమ
త్పక్షీంద్రుని పక్షంబులు, రక్షోనాయకుఁడు నఱికె రభసగతి సతీ!. ౨౭౧

చ. ఉవిద! జటాయు వంతఁ గొనయూపిరితో రుధిరమ్ము గ్రమ్మఁగా
భువిఁ బడియెఁ గూలెఁ, దక్షణమ భూతనయన్ మఱి యొండు తేరిపై

దివిజరిపుండు నిల్పుకొని ధీరతఁ బోవుచునుండ నామెయుర్వ్
దివులున రామ! రామ! యని దీనశరణ్యునిఁ గాన కెచ్చటన్. ౨౭౩

సీత రావణుని రథముమీఁదఁ బోవుచు దుఃఖించుట

సీ. హా రామ! లోకనాథా! మనోవల్లభ! కంటికిఁ గడవెడు గాఁగ నేడ్చు
నన్నుఁ జూడవు గదా? నాగతి చివర కిట్లైనది? రక్కసుం డపహరించి
కొనిపోవునీదుభార్యను నన్ను వేవచ్చి విడిపించికొనిపొమ్ము తడయ కింక
ధీవిశారద! మఱంది! మహాభాగ! లక్ష్మణ! యపరాధంబు సలిపినాను
గీ. శూలములవంటి మాటలఁ దూలనాడి,తిని; నిను న్నిల్వనీకపోతిని భవద్ధి
తంబుఁ బెడచెవి నిడితి బన్నంబు వడితిఁ, గరుణ నన్నింటి క్షమియించి కావుమయ్య!

సీత, సొమ్ములమూటను సుగ్రీవాదులకడఁ బడవిడుచుట

చ. పతి చనుదెంచు నేమొ యనుభావమునం బలవించుచున్, మరు
ద్గతి నడపన్ దశాస్యుఁడు రథంబు, నధోముఖి యై వెలంది ప
ర్వతశిఖరస్థవృక్షచరపంచకముం దిలకించి భూషణ
వ్రతతిని దీసి గట్టి ముడివైచెను జించినచీరకొంగునన్. ౨౭౪

క. ముడివైచి వారికడఁ బడ,విడిచెన్ శ్రీరామునకు సవిస్తరముగ నా
గొడవ నెఱిఁగింపుఁ డని విన,బడునట్లుగఁ బలికి, హైమవతి! యామీఁదన్. ౨౭౫

గీ. అంబునిధి దాఁటి, తనటెంకి యైన లంక,కరిగి యంతఃపురమున రహస్య మగు న
శోకవని నుంచి చెలులను జుట్టునిలిపి,సీత నారయుచుండెఁ దా మాతృబుద్ధి. ౨౭౬

ఉ. మెండుగఁ జిక్కి దైన్యమున మిక్కిలి స్రుక్కి దురంతచింత నో
రెండఁగ మై నలంకృతి మఱెద్దియుఁ జేర్పక విహ్వలాంగి యై
యుండెను రామ! రామ! యని యూరక యేడ్చుచు రాక్షసాంగనా
మండలమధ్య సింహగణమధ్యవసద్ధరిణీవిధంబునన్. ౨౭౭

దీనముఖుండై వచ్చు తమ్మునింజూచి రాముఁ డాలోచించుట

సీ. అట రఘూద్వహుఁడు మాయావియుఁ గామరూపియు నగుమారీచు బిద్దఁ జేసి
స్వాశ్రమోన్ముఖుఁ డయి వచ్చుచుఁ దననిమిత్తము రయంబునఁ గడుదవ్వునుండి
వాడుమొగంబుతో వచ్చెడువాని దీనత విస్తరిల్లఁ గన్పట్టువాని
ననుజుని లక్ష్మణుం గని పాప మీతండు మత్కృతం బగు కృత్రిమంపు సీత
గీ. నెఱుఁగఁడు, సమస్త మెఱిఁగియు నేను మోస,పుచ్చి యితనిన్నిమూఢునిపోల్కి వగచు
చుంటి, నేమియుఁ జేయక యూర కింటఁ, గూరుచుండిన దనుజాళి గూలు టెట్లు?

ఉ. కాముకురీతి దుఃఖమునఁ గ్రాఁగుచు సీతకు నేడ్తు నేని నే
నీమెయిఁ దద్గవేషణసమీహితబుద్ధిని బోవవచ్చు లో
కామయకారి యైనయసురాధిపు వీఁడు చోఁఱంగఁ, బిమ్మటన్
భూమిని గూల్తు నద్దనుజుఁ బుత్రకళత్రహితాన్వితంబుగన్. ౨౪౯

ఉ. అందఱ భ్రమందఁ జేసి, శిఖియందు మదాజ్ఞను నిల్చియున్న పూ
ర్ణేందుముఖిన్ ధరాసుతను నే మరలన్ గయికొంచుఁ బోయెదం
దొందరగా నయోధ్య, కిటు తోయజసూతినుతిన్ నరాకృతిం
బొందితి, మర్త్యలోకమునఁ బుచ్చెద నీక్రియఁ గొంతకాలమున్. ౨౫౦

గీ. అవని మాయామనుష్యుఁడ నైననాదు, చరిత రామాయణము వినఁ జాలి, భక్తి
మార్గమునఁ బోవువారి కేమాత్ర మైన, శ్రమము లేకయ మోక్షసౌఖ్యము లభించు.

రాముఁడు సీతను వదలి రాఁదగ దని లక్ష్మణునిపై విసిగికొనుట

చ. అని మది నిశ్చయించి మహితాత్ముఁడు రామవిభుండు డాయ వ
చ్చినయనుజన్ముతో ననియె, సీతను మత్ప్రియ నొంటి డించి రా
నను వగునే? కుమార! యిపు డంత ప్రమాద మదేమి వచ్చె నా
యనుమతిఁ గూడఁ దాఁటుటకు? నక్కట యెన్నివిధాలఁ జెప్పితిన్. ౨౫౧

క. ఎటు పాఱఁజూచినం దట, తట గుండియ గొట్టుకొను నుదగ్రాటవి, నెం
తటినిర్దయుఁ డైనను నీ, యటులను విడనాడివచ్చునా యొకయబలన్? ౨౫౩

క. రాక్షసగణాపహృత యో! భక్షిత యో; యగుట ధ్రువము పడఁతుక, తద్వీ
క్షణము యుగము నా, కిఁక,నీక్షింతు మొ లేమొ? యేమి యిడుమలు గలవో;

వ. అనిన సుమిత్రానందనుండు ప్రాంజలి యై సీతాదుర్భాషణ మగ్రజున కివ్విధి
నెఱిఁగించె. ౨౫౪

లక్ష్మణుఁడు తనలోపము లేమిని దెలుపుట

సీ. అన్న! నావలన నే యపరాధమును లేదు, భవదీయశరహతిఁ బడినసోఁకు
హాలక్ష్మణా! యని యఱచిన, నా మాట మీమాటగా మది మెలఁత దలఁచి
నను దక్షణంబ పొమ్మని కంటఁ దడివెట్ట నమ్మ! యయ్యది కృత్రిమాసురాప
లపితమ్ము మాయన్న లపితమ్ము గాదు స్వస్థవు కమ్ము భయముఁ జెందకు మటంచుఁ
గీ. బలుగతుల నూఱడించి నప్పటికి వినక, యామహాసాధ్వి నను దూఱె నవి భవన్ని
కటమునం జెప్పఁ దగినవాక్యములుగావు, చేరితిని మిమ్ముఁ జెవులుమూసికొని పిదప.

వ. అనుటయుఁ గౌసల్యానందనుండు, ౨౫౬

గీ. అయిన నిప్పట్ల ననుచిత మైనపని నొ,నర్చితివి సత్య మని నమ్మి నాతిమాట
జానకిని సుందరాస్యను గానలోన,వదలి వచ్చుట గూడ దేవరున నైన. ౨౮౮

రాముఁడు సీతను గూర్చి విలపించుట

క. మనకు మరలఁ గనఁబడునో; కనఁబడదో; యేమి కీడు గా నున్నదియో
యనుజా! తోఁచకయున్నది, దనుజోపద్రవ మదెట్లుఁ దప్పదు సుమ్మా. ౨౮౯

క. అని చింతాపరుఁ డై త,మ్మునితోఁ ద్వరితముగ నుటజమున కరిగి యచటన్
జనకసుతం గానక పెను,వనటన్ విలపించె రామభద్రుఁడు దేవీ! ౨౯౦

సీ. ఓ ప్రియురాల! యయ్యో? యెందుఁ బోతివి, కనులార మున్నటికరణి నాశ్ర
మోర్విఁ గన్పడకుంటి, వొక వేళ నను మోసపుచ్చఁ జాతురి మీఱ నెచ్చ టేని
డాఁగితివా? నన్ను డాయంగ రారమ్ము నినుఁ బాసి నిముసంబు నిలువఁ గలనె
యని విలపించుచు నప్పుడ వనభూమి విసువక సకలంబు వెదకియు వన
గీ. దేవతలను బక్షులను మృగావళులను, సీతజాడ మీ రెఱిఁగినఁ జెప్పుఁ డనుచు
నడిగియు సమస్త మెఱిఁగిన యాఘనుండు, కడకు భార్యనోయినపోక గానఁడయ్యె.

సీ. ఆనందరూపుఁ డై యలరారువాఁ డయ్యుఁ దొయ్యలికొఱకు నై దుఃఖ మొందె
నిశ్చలుం డై సదా నిలిచెడువాఁ డయ్యుఁ బడఁతినిమిత్తము పరువు వాఱె,
మమకార మనుమాట మఱి లేనివాఁ డయ్యు, నాభార్య యనుచు ననంగసాగె
మహాదహంకారవిరహితుఁ డయ్యును "నేను, భూసుత" యను భేద బుద్ధి నూనె
గీ. ఆస్థ లేనివాఁ డయ్యు మాయానుగతిని, సంగిగాఁ దోఁచుచున్నాఁడు జడమతులకు
నాత్మవేత్తలచే నట్టు లరయఁ బడఁడు, రామభద్రుండు, పర్వతరాట్కుమారి!.

రాముఁడు జటాయువును రాక్షసునిఁగాఁ దలఁచి చంపఁబోవుట

చ. ఇనకులసత్తముండు వన మెల్లను రోయుచు సానుజన్ముఁ డై
తునిఁగినవిల్లునుం గొడుగుఁ ద్రుంగిన తేరును గూబరమ్ము ధా
త్రి నొకటఁ గాంచి, లక్ష్మణ! మదీయకళత్రముఁ గొంచుఁబోవువా
ని నని జయించి తాఁ గొనిచనెన్ మఱియొక్కఁడు నిక్క మింతయున్. ౨౯౩

క. అని కొంతదూర మరుగన్, ఘనశైలనిభుండు రుధిరకలుషితకాయుం
డు నగుజటాయువు రఘునం,దనసుందరదివ్యదృక్పథంబునఁ బడియెన్. ౨౯౪

వ. అప్పుడు రాముండు సౌమిత్రిం జూచి. ౨౯౫

మ. ఇతఁ డే మంగళదర్శనన్ జనకజన్ హింసించి భక్షించి కా
హుతి గావించి వివిక్తభూశయనుఁ డై యున్నాఁడు బలతృప్తిఁ, జూ

చితివా లక్ష్మణ! యీనిశాచరు నిదే శిక్షించెదం జాపముల్
శితభల్లమ్మును దెమ్ము తె మ్మనుడుఁ బక్షిశ్రేష్ఠుఁడుల్ భీతుఁడై. ౨౯౮

జటాయువు తన యవస్థను రామునకు విన్నవించుట

చ. కట కట! జానకీశ్వర! స్వకర్మముచేతన చావనుంటిఁ జం
పుట యిఁక నేల నన్నుఁ? గృపఁ బూనుము కల్గు శుభంబు నీకు సం
కటహరణా! జటాయువునుగా నను నాత్మ నెఱుంగు, మర్విజం
గుటిలుఁడు రావణుండు గయికొంచుఁ జనెల్ వినువీధి లంకకున్. ౨౯౯

సీ. అ ట్లేఁగుతఱి సీత యాక్రోశ మొనరించె నది విని కడుమోస మయ్యె ననుచు
ముట్టి రక్కసుఁ దఱుముకొనిపోయి యదల్చి సమరంబునందు గుఱ్ఱములఁ జంపి
ధనువు ఖండించి రథమ్ము చెక్కలు సేసి కడకు నవ్వీరుని ఖడ్గధారఁ
బడితి ఱెక్కలు దెగి, ప్రాణముల్ విడఁబోవుచున్నాను జగదీశ! నన్నుఁ జూడు
గీ. మనుడుఁ గంఠగతప్రాణు నమితదీనుఁ, బతగపతిఁ గాంచి దుఃఖాశ్రుపరివృతాక్షుఁ
డై కరంబుల నివురుచు నంగకములు, రాఘవుఁడు పల్కె నత్యంతపారసము చింద.

గీ. మ న్నిమిత్తము నీప్రాణ మానములను, వ్యయ మొనర్చితి నీకంటె నాప్తబంధు
వెవఁడు నాకు? సతిల్ హరియించి నట్టి, ఖలుని జాడను దెల్పు మకల్మషాత్మ!.

వ. అనుటయు. ౩౦౦

జటాయువు సీతజాడను రామున కెఱిఁగించుట

క. సన్ననిమెలుంగుతో నోట న్నెత్తురు గ్రక్కుచనె జటాయువు భుజద
ర్పోన్నతిని మిన్నుముట్టిన, మన్నీఁ డొకయసుర వనధిమధ్యను లంకన్. ౩౦౧

క. కలఁ, డతనిపేరు రావణుఁ, డలఘుమతీ! దక్షిణముగ నవనీతనయన్
బలిమిఁ గొని చన్న దాతఁడె, పలుకంగాఁ జాల నింకఁబయి నొకపలు కేన్. ౩౦౨

చ. అసువులఁ బాయనుంటి భవదగ్రతలంబునఁ, బాపదూర! పూ
ర్వసుకృత ముంటఁ జేసి నినువంటిమహాత్మునిఁ జూడఁగంటిఁ జ
చ్చు నమయమందు, విష్ణుఁడవు శుద్ధుఁడవుం బరమాత్మ వీవు; మా
నిసి వయి పుట్టినావు ధరణీభరముల్ హరియించు పూన్కిమై. ౩౦౩

గీ. బొంది విడి ప్రాణవాయువుల్ పోవుతఱిఁ బ్రసన్నజనరక్షణా! నిన్నుఁ గన్నవాఁడఁ
గాన ముక్తుఁడ నైతి నొక్కపరి మీఁదఁ, జేతులుంచు నీపదమును జేరఁ బోదు.

### రాముఁడు జటాయువునకు దహనాదిక్రియలు సేయుట

వ. అనిన నందుల కా కౌసల్యానందనుం డంగీకరించి పక్షీశ్వరు భక్తియుక్తుల కచ్చెరు వందుచుఁ ద్రిభువనక్షేమంకరం బగునిజహస్తంబునఁ దదంగం బాపాదమస్తకంబు స్పృశించె. తోడన యప్పక్షిఱేఁడు జీవమ్ము వాసి యిలం గూలె, నంత భక్తగోచరుం డశ్రులోచనుం డై నచ్చినచుట్టంబు పోల్కి కొంతవట్టు వాపోయి, సుమిత్రానందనానీతకాష్ఠసమూహంబున శవమ్మును దహించి, యమ్మలికమ్ముతోఁ దమ్ముండును దానును స్నాన మ్మొనర్చి, యడవిం గలమృగంబు నొక్కదాని బాణహతిం బ్రాణ మ్మెడల్చి తన్మాంసఖండంబులు లేఁతపచ్చికం బోలుపు మిగులు నిలపై వేఱువేఱ నిలిపి, "పక్కులెల్ల నీ పాలసుముక్కుల మెక్కుం గాక, పక్షిశ్రేష్ఠుం డగు జటాయువు కడుంగడుఁ దృప్తి వడయుఁ గాక" యని మఱియు నిట్లనియె. ౩౦౫

క. నాపదముఁ జేరుము జటా, యూ! పోపొ మ్మేల జాల, మురుతరసంవి
ద్వ్యాపితమత్సారూప్యము, వే పడయుదు శంక దక్కి విశ్వము వొగడన్. ౩౦౬

వ. అని విరమింపఁ దదీయానుగ్రహవిశేషంబున నజ్జటాయువు. ౩౦౭

### జటాయువు దివ్యరూపధారియై రాముని సంస్తుతించుట

సీ. శంఖద్యుతియు గదాచ్ఛవియుఁ జక్రప్రభ పద్మదీప్తి కిరీటభాసురతయు
దివ్యభూషణజాలదీర్ఘరోచులు మేనికాంతితోఁ గలిసి యాకసము వెలుఁగఁ
జేయఁ, గటిస్థలిఁ జెలువారఁ బీతాంబరంబు దివ్యాకృతి రహి వహించి
భానుసన్నిభమును భాస్వరం బగువిమానమునఁ దాదృశరమారమణపార్ష
గీ. దులోకనల్వురు తగఁ దన్నుఁ గొలువ యోగి
సంస్తులు మీఱఁ గూర్చుండి జలజనాభు
నాదిమధ్యాంతరహితు సీతాధిపుని ను
తించెఁ జేతులు మోడ్చి విధేయుఁ డగుచు. ౩౦౮

సీ. మితిలేనిసుఖమున మెలఁగెడువాని, నక్షయరమాప్రదకటాక్షములవాని,
నజమహేంద్రాదిదివిజులదుఃఖముఁ దీర్చువాని, నరర్షభుఁ డైనవానిఁ
గరములఁ జాపమ్ము శరములుఁ గలవాని నీహితంబుల నెల్ల నిచ్చువాని
ముజ్జగంబుల మోహమునముంచుచక్కనిరూపంబు వాని, సూర్యు లోకనూర్వ
గీ. రసఁ బ్రకాశించువాని, నిత్యమును నీవిమ్రానిమొదట వసించెడువాని, శరణ
మొసఁగువాని రఘూద్వహు నసమభక్తి, సంస్మరింతును సేవింతు శరణు సొత్తు.

సీ. ఎవనినామము భవాటవికి దవానలం, బఖి వాదులకు నెవం డర్చనీయుఁ,
డసురసహస్రకోట్యంతకుం డెవ్వఁ, డెవ్వసమేను యమునాస్రవంతి నేలు
ననుకంపకుర్ వరుణాలయ మెవఁ,డెవం డవిరతభవభావనాతిదూరుఁ,
డెవ్వఁడు సంసృతి కెడ మైనమునులచేత నిరంతరముఁ జూడఁదగినవాఁడు,
గీ. సారహీనసంసారవిస్తారజలధి, సుఖముగా దాఁటఁజేయు నే శుద్ధచరితు
నంఘ్రియుగపోత, మట్టినీ కాదిదేవు,నకుఁ బ్రణతి సేతు దయయుంచి నన్నుఁ బ్రోవు

సీ. శాంకరీశంకరస్వాన్తమ్ములు నివాసమందిరంబులు గాఁగ మసలువాఁడ!
యాపదం జిక్కినయట్టిజీవులఁ బ్రోవ గోవర్ధనముఁ గేలఁ గొన్నవాఁడ!
దేవతలును బూర్వదేవతాగణము సంతతముఁ బూజించుపాదములవాఁడ!
సురలకు వరము లాదరముతో నిచ్చి ముప్పుల నన్నిఁటిని ద్రోసిపుచ్చువాఁడ!
గీ. పరుల ధనదారలకు నాశపడక మెలఁగి, పరగుణవిభూతులకు ముదంపడి పరహిత
మాచరించుపుణ్యాత్ముల కనుదినంబు,గొలువఁదగువాఁడ రామ! నిర్ దలఁచువాఁడ!

చ. చిఱునగ వంద మిబ్బడిగఁ జేయ విరాజిలు నీదుమోముఁదా
మర హృది నిల్చుఁగాక సుసమాచణ మై తెలిదమ్మి కెచ్చటం
బరపతి వుట్టనీనిగతి భాసిలు నీకనుదోయి తెన్నునర్
నిరతము నిల్తుఁగాక ధరణీతనయాహృదమైకమందిరా! ౩౧౨

వ. దేవపతిస్తోత్రపాత్రుండ వగుదేవా! నీ వీప్రపంచంబున నంబుపూరితంబు లగు
భాండంబులం దనేకవిధంబులఁ గాన్పించుభానుబింబంబుభంగి, సత్వరజస్తమస్సు
లనెడిగుణత్రయమ్మునఁ జుట్టంబడి, హరిహరబ్రహ్మ లనురూపభేదమ్ములం బ్రకా
శించుచున్నావు. అట్టినిస్తుతు లిన్నుం బ్రస్తుతి గావింతు. ౩౧౩

క. బలభిన్నీలశరీరా!, సులలితచారిత్ర! సుజనసులభా! సదయో
జ్జ్వల! చామీకరమణికుండలమండితకర్ణయుగళ! ననుఁ గృపఁ గనుమా. ౩౧౪

సీ. శతపథబ్రాహ్మణోదితసముపాసనాలభ్యుని, యోగిలలామహృదయ
నిరతవిభాసుని, స్మరశతకోటిసమానసుందరగాత్రు మానసీయు
నార్తిహారుం బ్రభు ననవద్యు రఘుకులసత్తము నిన్ను నే శరణుసొచ్చి
నాఁడ, నం చిటుకొనియాడ జటాయువు, జానకీవిభుఁడు ప్రసన్నుఁ డయి య
గీ. నియె నిటుల్ శుభం బగుగాత నీకు నరుగు, మస్మదీయవైష్ణవధామ మనఘ! దీని
విన్నఁబఠియించినర్ వ్రాసికొన్న నన్నుఁ, జెందు మత్స్మృతి యగు మృతినొందువేళ.

గీ. అనుడు శ్రీరామువాక్యమ్ము నాలకించి,
సమ్మదాకులుఁ డై పక్షిసత్తముండు

రఘువరేణ్యసామ్యము నంది బ్రహ్మపూజి
తమ్మగుపదంబునకుఁ బోయెఁ దలిరుఁబోఁడి!. ౩౧౬

వ. తరువాత. ౩౧౭

రామలక్ష్మణులు కబంధుని బాహువులు ఖండించుట

చ. అడలుచు జానకిన్ వెదకు నాసమెయిన్ మఱియొందు గానకన్
వడి ననుజన్మతోడ రఘువల్లభుఁ డేఁగఁగ నందు వింత గొ
ల్పెడు వికృతాకృతిం బరఁగులేఖవిరోధి యొకండు గానఁగాఁ
బడియెఁ గబంధనాముఁడు కృపారహితుండు కురంగలోచనా!. ౩౧౮

సీ. కనులు ముక్కులుఁ జెవులును దల కనరావు, వక్షస్థలమునందు వదన ముండు
నామడదూరమ్ము వ్యాపించు బాహులు, తనచేతఁ బడ్డసత్వముల నెల్ల
హింసించి తినుఁ గలహంసగామిని! యట్టి, దిట్టచేతుల మధ్యఁ దిరుగుచుండి
తమ్ము భ్రమింగఁ దలంచు తత్ప్రయత్నముఁ జూచి, తమ్మున కనియె సీతావిభుండు
గీ. తలయుఁ గాళులు లేవెదం గలదు నోరు, హస్తములు పెద్ద చిక్కె నయ్యాదిసమస్త
మారగించుచున్నాఁడు సమస్తజంతుకోటికిన్ మృత్యువనఁ గనుఁగొంటె వీని.

ఉ. నందియ మేటి కీతనిభుజంబులమధ్యను జిక్కినాము నేఁ
డెందుల కైనఁ బోవుటకు నించుక మార్గము లే, దిఁ కేమిచే
యం దగు నిత్తఱిం గటకటా మన మీతని వాతఁ గూల కె
ట్లుందుము చేతులం బొదువుచుండె ననన్ గని లక్ష్మణుం డనున్. ౩౨౦

క. ఇంతగఁ జింతిల నేల ర,వంతకు మన మిరువురమును నవ్యగ్రత ఖం
డింతము వేర్వేఱుగ బల,వంతా! యీనిర్జరారిబాహులు రెండున్. ౩౨౧

క. నావుడు సమ్మతిపడి సీ,తావరుఁ డురుఖడ్గధార దక్షిణభుజముం
దీవరముగ నఱకె, నటులె, కావించెను దమ్ముఁ డెడమకై, గజగమనా!. ౩౨౨

గీ. దాని కాశ్చర్యపడి భువిఁ గాని దివిని, గాని మద్భుజచ్ఛేదమ్ము పూని చేయు
శూరు లెన్నఁడు లే రహో మీర లెవరు?, తనరుచున్నారు నిర్జరోత్తములకరణి.

రాముఁడు కబంధునకుఁ దనవృత్తాంతమును దెలుపుట

క. అని సోఁకు వలుక నవ్వుచు, వనజాతాంబకుఁడు రామభద్రుఁ డనె నయో
ధ్యను నేలెడి శ్రీమంతుఁడు, ఘనుఁడు దశరథాఖ్యనృపతి గలఁ డాతనికిన్. ౩౨౪

క. తనయుండను నే రాముఁడ, ననుజుఁడు నా కితఁడు లక్ష్మణాఖ్యుఁడు, బుద్ధిం
గొనియాడఁ దగినవాఁ డిటు, విను నాసతి సీత జనకవిభుసుత యలరున్. ౩౨౫

ఉ. అచ్చరకన్నులర్ మిగులునాలలసం బలుగాక సోఁకొకం
డచ్చోటువాసి మేము మృగయార్థము సాగినవేళ వేచి తా
ప్రుచ్చిలి కొంచుఁ బోయె, భయముం గలిగించెడు ని వ్వనంబునం
దచ్చపలాక్షి కై తిరుగు చంతట, నియ్యెడ నీ భుజంబులన్. 3౨౮

క. చుట్టుఁ బడి ప్రాణ రక్షకు, నెట్టనఁ దెగనఱకినాము నీ వెవఁడవు? నీ
కిట్టి వికారాకార మ, దెట్టు లొదవె? ననఁ గబంధుఁ డిట్లు వచించెన్. 3౨౯

కబంధుఁడు రామునితోఁ దనకు శాపముగలిగిన విధమును జెప్పుట

గీ. అనఘ! రాముఁడ వైన నీ వంతికమున, కరుగుదెంచుట జననమ్ము సార్థకమ్ము,
పూర్వ మేను గంధర్వవిభుండ, యావ,నమునఁ జక్కఁదనమున నున్నతుఁడ నగుచు.

గీ. విధిని దపమునఁ బ్రీతుఁ గావించి చావు,లేనివరమును బడసితి, దానఁ బొగరు
మిగిలి సౌందర్యవతు లగు మగువల హృద,యము లపహరింపఁ దిరిగితి నన్నికడల.

వ. అంత నొక్కనాఁడు. 330

క. అష్టావక్రమహర్షిని, శిష్టాచారుఁ గని యపహసింపఁగ, నతఁ"డో
దుష్టా! యసుర వగు"మని ని,కృష్టపుశాపం బొసంగెఁ గెరలెడుకినుకన్. 331

ఉ. అంతట నేను గాళ్లఁ బడి, యయ్య! మునీంద్ర! కృపాసముద్ర! శా
పాంతముఁ జెప్ప మంచువినయంబున వేఁడఁగఁ, "ద్రేత నిందిరా
కాంతుఁడు పుట్టి దాశరథిగా, భవదాయతబాహుయుగ్మమున్
వింతగఁ ద్రుంచు నాఁడె నిను వీడును దానవరూప" మం చనెన్. 33౨

గీ. ఆతపసి నోటినుండి శాపాక్షరములు,వెలువడిన తత్క్షణంబ న న్నలమి కొనియె
దానవాకృతి, రామ! యంత నొకనాఁడు, కులిశపాణి నెదిర్చితిఁ గ్రోధమునను.

క. కుపితుఁ డయి యాతఁ డశని, ప్రపాత మొనరించె శిరముపయి, నప్పుడు నా
దు పదద్వయముం దలయుఁ గ,డుపులోఁ జొరఁబడియె, సకల లోకారాధ్యా!

గీ. వారిజాసనుఁ డొసఁగినవరము కలిమి,వజ్రపుందెబ్బ దినియును బ్రదుకఁగంటి,
నోరులేని న న్నుందఱుఁ బొఱఁజూచి, సదయులై దేవనాథ! యాచంద మేమి?

గీ. ఇతఁడు ముఖము లేకుండిన నెట్లుబ్రతుకు,నదియకద; తినఁ ద్రాగ ముఖ్యావయవ మ
టంచు బలవైరి నడుగ వీక్షించి నన్ను, నతఁడు సదుపాయముగ నిట్టు! లనె మహాత్మ!

క. కడుపున నోరుండును, న్యా,మడపొడవున బాహుయుగ మమరుఁ బొ మ్మింక, నా
వుడు నచ్చి వసించితి ని, య్యెడఁ జిక్కినజీవకోటి నెల్ల మెసవుచున్. 33౭

వ. నేఁడు మదీయపూర్వజన్మపుణ్యంబునం జేసి మీచే ఖండితబాహుయుగళుండ నై యిడుమలం గడవం జాలితి. రఘుకులాలంకారా! తడవు సేయక కాష్ఠాగ్నిసమావృత మగుపల్లపునేలం బెట్టి నన్ను దహింపుము. నేను బూర్వరూపముం బడసి సీతాపహరణవృత్తాంతముం దెలిపెద ననుడుఁ, దమ్మునిచే నొకగర్తంబు దీయించి యందు నాకబంధుం జేర్చి కృపాళుం డగుజానకీలోలుండు కట్టెలఁ దహించుటయుఁ ద ద్దేహమ్ము నుండి, ౩౩౯

కబంధుఁడు స్వస్వరూపముం బడసి రాముని వినుతించుట

క. స్మరసన్నిభదేహుఁడు ప్రస్ఫురదఖిలాభరణజాలశోభితుఁడు మహా
పురుషుఁ డొకఁడు వెలువడి రఘువరు చుట్టుం దిరిగి మ్రొక్కి బద్ధాంజలియై.

వ. భక్తిచే డగ్గుత్తికవడు వాగ్గరిమంబున ని ట్లనియె. ౩౪౦

సీ. అనఘ! శ్రీరామ! నిన్నాద్యంతరహితు ననంతు వాక్కునకును స్వాంతమునకు
గోచరింపని వానిఁ గొనియాడఁ గోరుచున్నది సంభ్రమంబున నామనంబు
నీ రూపు తెలియరానిది, వ్యక్త మగు ప్రపంచంబునకంటె భిన్నంబు, జ్ఞాన
మహితంబు స్థూలసూక్ష్మతనువిలక్షణ, మీ వొకండవు దక్క యితర మెల్ల
గీ. జడ మనాత్మస్వరూపంబు, జగదధీశ!, కావునఁ వ్యతిరిక్తు ని న్గాంచి యిట్టిఁ
డని తెలియఁజాలుటకు జడ మైన నా మనంబునకు శక్తిలేదు తథ్యంబు రామ!.

వ. బుద్ధికిని దద్గతం బగునాత్మప్రతిబింబమునకును గల యభేదంబ జీవుఁ డని చెప్పఁబడియె. నీవు బుద్ధ్యాదిసర్వప్రపంచమునకు సాక్షి యయినపరబ్రహ్మవు. అవాఙ్మనసగోచరుఁడవును, వికారదూరుఁడవును, సకలాత్మ వగునట్టి నీయం దఖిలప్రపంచం బజ్ఞానవశమ్మున నారోపింపఁ బడుచుండె. దేవా! నీ స్థూలసూక్ష్మశరీరంబులు క్రమంబుగ సర్వస్థూలసమష్టి యగువిరాట్టును, సర్వసూక్ష్మసమష్టి యగు హిరణ్యగర్భుఁడు నై, యున్నారు. ౩౪౧

గీ. జరిగినది జరుగుచున్నది జరుగనున్న, దగుజగత్తంతయును ధ్యాత కగపడు నెట;
నట్టి నీసూక్ష్మదేహంబు ధ్యాతృమంగళం బెపుడు భావనావిషయంబు చూవె?

వ. మఱియు నొకదానికంటె నొక్కటి పదిరెట్లధికప్రమాణము గలమహదాది సప్తతత్త్వంబులచే నావృతమై, యొఱపంటి యండరూపమున నున్ననీస్థూలశరీరమునందు విరాట్సంబంధి యగుభావనాస్థాన మలరారు. నీవే సర్వమునకు మోక్షదాతవు. లోకంబులు యుష్మదవయంబులుగా స్మృతంబులు. అ దెట్లన్న; నీ పాదమూలంబు పాతాళంబు, నీ మడమలు మహాతలంబు, పిక్కలు తలాతలంబు, మోఁకాళ్లు సుతలంబు, తొడలు వితలంబు, జఘనంబు భూమ్యతలంబులు, నభంబు

నీ నాభి, జ్యోతిస్సులు నీ యురస్థలంబు, మహర్లోకంబు నీ గళమ్ము, జనలోకంబు భవన్ముఖంబు, తపోలోకంబు నీ నొసలు, సత్యలోకంబు త్వచ్ఛిరోనిష్ఠితంబు.

సీ. లోకేశ! యింద్రాదిలోకపాలకులు నీ కరములు, కర్ణముల్ కడలు, నోరు
పావకుం, డశ్వినీదేవతల్ ఘ్రాణరంధ్రములు, భాస్కరుఁడు నేత్రంబు, తార
కానాథుఁడు మనంబు, కాలంబు బొమముడి, రుద్రుఁ డహంకారరూపుఁ, డంత
కుఁడు దంష్ట్రికావాసి, యుడుపాళి దంతాళి, పలుకులు ఛందస్సు, లలఘుచరిత!

గీ. మనము గీష్పతి, మోహాఖ్యన్మాయ నవ్వు, సకలసృష్టి యపాంగమోక్షణము, ముందు
వైపు ధర్మంబు, వైనుకటివైపు అధర్మ, మీవు గానిది లేదణు వేని, రామ!.

క. కను మూసికొనుట రాతిరి, కనుదెఱచుట పగలు, మేనఁ గలనరములు స
ర్వనదుల్, సప్తసముద్రము, లనఘా! నీకుక్షి, నందియ మ్మిఁక నేలా? ౩౪౮

గీ. ఓషధులు వృక్షములును నీరోమలిరోమ, పంక్తి, వర్షంబు రేతస్సు, భవ్యరూప!
జ్ఞానశక్తిసమష్టియె నీ నిరుపమ, మహిమ; నీస్థూలదేహక్రమ మిది దేవ!. ౩౪౯

ఆ. దీనియందు మనము స్థిరముగ నునిచి, యుపాసనమ్ము సేయుభవ్యమతులు
పడయఁగలరు సులభభంగి మోక్షము, నింత,కన్న మిన్నయైన తెన్ను లేదు.

గీ. విమలభక్తిరసాతిరేకమున మేన, నిగుడుఁ బులకలు దేని ధ్యానించి నంత;
నా మహాస్థూలదేహము నందుచే భ,జించుచున్నాను నెమ్మదిఁ జేర్చి స్వామి!.

వ. దేవా! భవదీయస్థూలరూపమ్మును భావించినతత్క్షణంబ మోక్షంబు హస్తామలకం, బది య ట్లుండుగాక. ౩౫౦

సీ. ధనువును బాణముల్ ధరియించి నారచీరలుఁ జడ లొకవింతచెలువుఁ గూర్ప
నింపుయౌవనమున నెగడొంది, యింద్రనీలంపుఁ జాయకుఁ దలవంపుఁ దెచ్చి
సౌమిత్రితోఁ గూడి జనకజాన్వేషణ మాచరించెడి యీ మహత్తర మగు
భవదీయరూపంబుఁ దవిలి భజింతు, నియ్యదియ నామనమున ననుదినంబు

గీ. నిలుచుఁ గాత, సర్వజ్ఞుఁడై నిటలనయనుఁ, డద్రినందనతోఁ గూడి యహరహంబు
నెడతెగక ధ్యానముం జేయు టీ యమేయ, మంగళాకృతినే కదా; మైథిలీశ!.

వ. ఇదియుఁ గాక య మ్మహాదేవుండు. ౩౫౧

ఉ. శ్రీరమణీయకాశిక వసించి ముముక్షువు లైనవారికిం
గూరిమి బ్రహ్మవాచక మకుంఠితతేజము రామ! రామ! యన్
తారకమంత్రరాజము సదా యుపదేశ మొనర్చుచున్ మహా
గౌరవపాత్రతం బడయఁ గంటిని నే" నని మోద మందెడున్. ౩౫౩

క. కావున నన్యములేటికి, నీవే పరమాత్మ వగుట నిశ్చయ, మయినన్
దేవ! భవన్మాయావృతి, చే వాస్తవ మెఱుఁగ లేరు క్షితిఁ గల్గుజనుల్. 3౫౪

క. సకలజగత్కారణ! సూర్యకులోద్భవ! లక్ష్మణాశ్రయా! సీతానా
యక! ముక్తిదాయకా! దీనకృపాళూ! నీకు వందనము పరమాత్మా! 3౫౫

గీ. ఓ యయోధ్యాధినాథ! నితోజ్జ్వలాంగ!, దీను భక్తుని నను దయాదృష్టిఁ జూచి
పాలనము సేయు మయ్య! యేపట్లఁగాని, మాయ నాచెంతఁ జేరఁగా నీయకయ్య!

శ్రీరాముఁడు కబంధు ననుగ్రహించుట

వ. అని యిట్లు వినుతించి యూరకున్నగంధర్వునకుఁ గాకుత్స్థుం డిట్లనియె. 3౫౭

గీ. నీవు చూపినభక్తిచే నీ వొనర్చి, నట్టినుతిచేత సంతుష్టి నందినాఁడ;
యోగిగమ్య మనాదియు నుత్తమ మగు, మత్పదంబున కేఁగుము, మహితచరిత!

గీ. ఉపనిషత్సమ్మతము భవదుక్తము నగు, నీ స్తవం బన్యకాంతావిహీనబుద్ధి
మనన మొనరించి యజ్ఞానజనితభవము, గడచి నిత్యానుభవగమ్యుఁ గాంచు నన్ను.

వ, అని యనుగ్రహించె నివ్విధంబున. 3౬౦

సీ. వర మందె జానకీవరునిచే గంధర్వుఁ, డీ ప్రదేశమునకు నెదుటియాశ్ర
మంబున శబరియన్ మగువ యొకర్తుక, భవదంఘ్రియం దతిభక్తి గలది
భక్తిమార్గంబునం బండితురాలుండి యున్నది నీ వామెయొద్ద కరుగు,
మవనిజావృత్తాంత మంతయుఁ దన్మాల, మున విశదం బగు ననఘ! రామ!
గీ. అనిపలికి, యర్కసన్నిభ మగువిమాన, మునను బోయె విష్ణుస్థానమునకు, రామ
నామసంస్మరణమ్మునన్ గలుగుఫలము, వింటివే కద? ముఖజితవికచకమల!

వ. అంతట. 3౬౧

శబరి శ్రీరాముని బూజించుట

క. ద్వీపిమృగరాజముఖమృగ, దీపితభయదవని విడిచి తిన్నగఁ జనె సీ
తాపతి శబరి నెలవునకు, నాపడఁతుక గాంచి లక్ష్మణాన్వితు రామున్. 3౬౩

క. అత్యంతహర్షమున వడిఁ, బ్రత్యుత్థానమ్ముఁ జేసి, ప్రమదాశ్రుకణా
ద్ధత్యనయనయై భువిఁ బడెఁ, గాత్యాయని! యతని పాదకమలము లంటన్, 3౬౪

వ. తదనంతరమున స్వాగతాభినందనంబు గావించి, సుఖాసనాసీనుం జేసి, నిర్మలోద
కమ్మున నన్నదమ్ముల యడుగుఁదమ్ములు భక్తిమెయిఁ జక్కఁగాఁ బ్రక్షాళించి,

తజ్జలప్రోక్షణమునఁ బవిత్రితోత్తమాంగి యై, యర్ఘ్యపాద్యాదికములు యథా శాస్త్రముగ జరపి, రామలక్ష్మణసపర్యాలబ్ధి కాత్మ నెంతయుం బొంగుచు.

గీ. చందనానులేపనమున సమ్మిళితము, నయి సుగంధపూర్ణము నయి యలరునలరు గమిని దన్మహనీయపాదముల నునిచి, పూజ గావించె శబరి యపూర్వభంగి.

గీ. బత్తియును సంతసము మదిఁ బాదుకొనఁగ, జానకీశుఁ కర్పించెఁ దాను దన్ని మిత్తముగఁ దెచ్చియుంచినయుత్తమఫలములను బీయూషసన్నిభముల వెలంది!.

వ. ఇత్తెఱంగునఁ దనచే నతిథిసత్కారంబు వడసి సౌమిత్రిసమేతమ్ముగా నుపవిష్టుం డైనరఘుశ్రేష్ఠు నెదుర నిల్చి చేతులు మోడ్చి, యప్పరమభక్తురా లిట్లనియె.

శబరి, రామునిసన్నిధిని స్వవృత్తాంతమును నివేదించికొనుట

సీ. ఇనవంశసత్తమ! యిది విను, సదుపదేశముఁ జేయుమహానిసత్తములు నాదు
గురువు లున్నా రిందుఁ గొందఱు, వారికిఁ బెక్కువే లేఁడులు విదితభక్తి
శుశ్రూషఁ గావించుచుండితిఁ బిమ్మట సత్యలోకమున కై చనుచువారు
"రమణి! నీ వీ యాశ్రమమునందె నిలుము సమాహితచిత్తవై యనఘమతి పు
గీ. రాణపురుషుఁడుఁ బరమాత్మ రాముఁ డసుర
విసరమును గసిమసఁగ వివేకధనుల
మునుల మనుపంగ దశరథతనయుఁ డగుచు
వసుధ జనియించియున్నాఁడు వచ్చు నిటకు. ౩౧౯

క. కలఁ డిపుడు చిత్రకూటా, చలలలితాశ్రమమునందు జగదీశుఁడు ని
శ్చల మయినధ్యాననిష్ఠఁ, నిలువుము దేహమ్ము రక్షణీయము నీకున్. ౩౨౦

గీ. ఆమహాత్ముని దర్శన మైనతోడ, నే; శరీరము శిఖి కిచ్చి యేఁగఁగలవు.
తత్పదంబున" కని నాకు దయ దలిర్పఁ, దెల్పినా రది యాదిగ దేవ! నేను. ౩౨౧

వ. భవదీయధ్యానైకపరాయణనై గురూపదేశమార్గమ్మున మీరాక కెదురు చూచు చుంటి, నాయొజ్జలకు సైతము నలభ్యం బగుభవద్దివ్యదర్శనంబు మత్పూర్వపుణ్యాం బున నేఁడు పడయుంజాలితి. ౩౨౨

గీ. స్త్రీని మూఢను హీనజాతిని జనించి, నట్టిదానను. నప్రమేయాత్మ! నీదు దాసజనులకుఁ దద్దాసదాసులకును, దాసిగా నుండఁ దగుయోగ్యతయును లేదు.

గీ. అట్టిచో; నిఁక నీకుఁ బ్రత్యక్షభంగి, నేను దాసురా లగు టది యెట్లు పొసఁగుఁ? బరము నిను మనోవాగగోచరునిఁ జూచు, టకరణి సంభవించెనో? యిట్టినాకు.

క. ఏ నేమిచేతు నిత్రుతి, దీనను, నినుఁ బొగడు టెట్లొ తెలియదు నాకుఁ
దీనావన! రక్షింపం, బూనుము నాపాలికల్పభూజమ వీవే. 3౭౫

రాముఁడు శబరికి, నాయనుగ్రహముసంపాదించుటకు భక్తియె ముఖ్యసాధన మని చెప్పుట

వ. అని ప్రార్థించుశబరికి రఘువరుం డిట్లనియె. మతిమంతురాలా! పుంస్త్రీ విశేషము గాని, బ్రహ్మచర్యాద్యాశ్రమంబులు గాని నన్నుఁ బొందుటకుం గారణములు గాఁజాలవు. భక్తియే ముఖ్యకారణముగఁ దెలిసికొనుము. 3౭౬

క. వేదాధ్యయనంబున యజ్ఞాదులఁ దక్కుఁగలసత్క్రియల నైన ననుం
బైదలి! కనఁ జాలరు మత్పాదాంభోజాతయుగళభక్తివిహీనుల్. 3౭౭

నవవిధ మగుభక్తిసాధనప్రకారము

వ. కావున భక్తిసాధనమును సంక్షేపముగఁ జెప్పెద వినుము. నాయందు భక్తిగలుగుటకు సజ్జనసాంగత్యంబు ప్రథమసాధనంబు, మత్కథాలాపంబు ద్వితీయంబు, తృతీయంబు మద్గుణకీర్తనంబు, నా తత్త్వముం గఱపు నుపనిషద్వాక్యములకు వ్యాఖ్యాన మొనర్చుట చతుర్థసాధన మనం బరఁగు. 3౭౮

క. ఏ ననుతలఁపునఁ గపటము, నూనక యాచార్యుఁ గొలుచు, టురుపుణ్యకృతుల్
మానక చేయుట, యైదవ, యై నెగడుఁ జుమీ యమనియమాదులు గూడన్. 3౭౯

సీ. తరుణి! నా పూజయందలి నిష్ఠ షష్ఠంబు, కల్పసంగదితాంగకములతోడ
వాసి మన్మాత్ర ముపాసించు టేడవయది, మామకీనభక్తార్చనంబు
నిఖిలభూతంబుల నే ననుతలఁపు బాహ్యార్థవిరాగితో మంతరింద్రి
యబహిరింద్రియనిగ్రహం బష్టమము, నాదు తత్త్వవిచారంబు దలఁపఁ దొమ్మి
గీ. దవది, భక్తిసాధన మిట్లు నవవిధమ్ము, లతివ కైనఁ దిర్యక్కుల కైన నరున
కైన నాయందుఁ బ్రేమచిహ్న మగుభక్తి,యొదవు నవవిధసాధన మొదవు నేని;

వ. భక్తి వొడమినయుత్తరక్షణమునంద మత్తత్త్వానుభవంబు గలుగఁ గలదు. అనుభవసిద్ధి గాంచినవారి కాజన్మముననె మోక్షంబు లభించు. అందుచే మోక్షప్రాప్తికి భక్తియ పరమసాధనం బని దృఢముగ నిశ్చయింపఁ బడె. 3౮౧

గీ. ప్రథమసాధన మబ్బినభవ్యమతికిఁ, గ్రమముగాఁ దక్కినవి యెల్లఁ గలుగఁగలవు.
అక్కతన భక్తియే ముక్తి యని గ్రహింపఁబడియె శుభలక్షణా! బుధపాళిచేత.

క. నాయందు భక్తి వొడముట, నీయొద్దకు వచ్చినాఁడ నెలఁతా! మోక్ష
శ్రీయుత వగుదువు సందియ,మే యిట? మద్దర్శనంబు వృథగా దెపుడున్. 3౮౩

గీ. నీ వెఱుఁగు దేనిఁ జెప్పుము నీరజాక్షి,
సీత, యొం దున్న దెవ్వనిచేత నపహ
రింపఁబడె? నాకు నెంతయుఁ బ్రియముఁ గూర్చు,
నది సుమీ; యన్న రామున కనియె శబరి. ౩౮౪

శబరి రామునకు సుగ్రీవునితో స్నేహ మొనర్పు మని చెప్పుట

గీ. జగముఁ బుట్టించువాఁడవు సర్వ మెఱుఁగు, నట్టివాఁడవు నీ తెలియనిది గలుగ
దైన న న్నడిగితివి లోకానుసరణ, బుద్ధిఁ, దెల్పెద విను రామ! పాలఁతిజాడ, ౩౮౫

సీ. సీత దశగ్రీవుచే నపహృత యయ్యెఁ, గలదిప్పు డామె లంకాపురమున,
మన మున్నచోటికి మఱియు దాపుగఁ బంప, యనుసరోవర మలరారు, దాని
కడ ఋశ్యమూకాఖ్యఘనశైల మొకఁ డొప్పు, నా కొండపై వానరాధిపుండు
శూరవరేణ్యుఁడు సుగ్రీవుఁ డన్నయా, వాలిభయంబున లీల దక్కి
గీ. యాప్తమంత్రిచతుష్టయ మనుసరింప
నధివసించుచునుండె మహానుభావ!
యచటి కేఁగుటకుఁ జంకు నా బలారి
కొమరుఁడు మతంగమౌనిశాపమునఁ జేసి. ౩౮౬

వ. కావున నీ వప్పర్వతంబునకుఁ బోయి. ౩౮౭

క. ఆ సుగ్రీవకపీంద్రుని, తో సఖ్య మొనర్పుమీ; యతుల్యుఁ డతఁ డనా
యాసముగ నీదు కార్యముఁ, దా సాధింపం గలండు, దశరథరామా! ౩౮౮

శబరి రామానుగ్రహముచే మోక్షమును బడయుట

చ. వరనృపమౌళి! రామ! భగవంత! త్వదగ్రమునందుఁ జిచ్చులో
నుఱికి యొడల్ దహించికొని యుత్తమ మైనభవత్పదంబు స
త్వరముగఁ జేరఁ బోయెదఁ గృపామతి నిల్వు మొకింత కాల మా
వల, కని వేఁడి యంత రఘువల్లభు వీడ్కొని వహ్నిలోఁ బడెన్. ౩౮౯

గీ. తత్క్షణమె భస్మమై యవిద్యాకృతభవ, బంధ మెడలించికొని రామభద్రుకరుణ
నన్యదుర్లభ మగుమోక్ష మందె శబరి, యేమి పుణ్య మొనర్చెనో; యెఱుఁగరాదు.

పరమేశ్వరుండు పార్వతిని బ్రబోధించుట

సీ. లోకనాథుండు భక్తైకవత్సలుఁడు రాముఁడు ప్రసన్నుం డైనఁ బడయరాని
దొకటి యున్నదె? ముక్తి నొందెను దక్కువజాతి జన్మించినశబరి గూడ,

సుకృతు లుత్తములు భూసురులు రామధ్యానపరు లయి ముక్తికి నరుగుదు రని
పలుకు టెంకేల? తద్భక్తియ ముక్తి, యి ప్పట్ల సంశయమతి పతితుఁ డగును

గీ. గాన యపరిమితోత్సాహకలిత వగుచుఁ, దనివి తీఱంగ వాంఛితార్థములఁ బితుకు
శ్రీరఘూత్తము పాదకుశేశయముల, జంట మదినిల్పి సేవింపు చంద్రవదన!. ౩౯౧

శా. నానాజ్ఞానవిశేషరూప మగుమంత్రశ్రేణి వర్జించి, యీ
శానాస్మద్ధృదయైకపీఠనిలయుం డై వెల్గుశ్యామాంగు సీ
తానాథుం బ్రియురాల! కొల్వుము సముద్యద్భక్తియుక్తిఁ నితాం
తానందప్రదవైష్ణవాలయము నిత్యం బున్కిప ట్టయ్యెడిన్. ౩౯౨

వ. అని చెప్పి. ౩౯౩

కాండాంతపద్యములు

చ. శమితభవాగ్నితాప! గురుశాబ్దికతార్కికవాగ్దురాప! చి
త్సమధికరూప! నిర్దళితసజ్జనదుర్భరపాప! భానువం
శమహితదీప! విశ్వహితచారుమృదూక్తికలాప! నిర్మలా
గమసువిభావ్య! భవ్యగుణకారణ! పోషితభద్రవారణా!. ౩౯౪

అంబురుహవృత్తము

చారుదరస్మితవక్త్రసరోరుహ! సన్మునీంద్రముదావహా!
మారుతిసారమనస్సరసీచరమాణహంస! రఘూద్వహా!
క్రూరనరాదశిరోదళనోద్యమకోవిదాస్త్రపరంపరా!
స్ఫారవిశుద్ధయశోలతికావృతసాంద్రలోకసముత్కరా! ౩౯౫

క. శ్రవణమననాదిసుగమ, స్తవనీయాకార! ప్రకృతిసంకలితజగ
ద్వ్యవహారదూర! మరణో, ద్భవరూపామయభిషక్ప్రధాన! నిదానా! ౩౯౬

గద్య.

శ్రీమద్భారద్వాజగోత్ర, సీతాంబికాపున్నయార్య చతుర్థపుత్ర,
రామచంద్రకృపాపాత్ర, సూరిజనవిధేయ,
నారాయణనామధేయ ప్రణీతంబగు
నాంధ్రాధ్యాత్మరామాయణంబున
నరణ్యకాండము
సంపూర్ణము.



శ్రీ రస్తు

శ్రీ సీతారామాభ్యాం నమః

# ఆంధ్రాధ్యాత్మరామాయణము

## కిష్కింధాకాండము



శ్రీప్రమథనాథనుద్ధాం,
తప్రమదారత్నసన్నుతపదాంభోజా!
దీప్రాంబకవినిహతభూ,
ధ్రప్రాయాసురనికాయ! తాపసగేయా! ౧

### రామలక్ష్మణులు పంపాసరోవరముం గాంచుట

వ. దేవా! భవుండు భవాని కిట్లనియె. అంతట సీతాకాంతుం డూర్మిళాకాంతునితోడ శబరీకథితపథానువర్తి యై మెల్లగా నరిగి, క్రోశమాత్రవిస్తీర్ణంబును నగాధస్వచ్ఛజలపూర్ణంబును వికసితకమలకల్హారకుముదోత్పలభాసితంబును జాలపదచక్రవాకకారండవమండలమండితంబును జలకుక్కుటకోయష్టిక్రౌంచసంచయనాదోపనాదితమ్మును నానావిధకుసుమవిసరలతావితానఫలసముదయవిలసితంబును సజ్జనమనోనిర్మలంబును సమగ్రపుష్పితపుష్కరకింజల్కపుంజవాసితమ్మును సరశ్శ్రేష్ఠంబు నగు పంపం గాంచి విస్మితుం డగుచు నందు మునింగి, మార్గాయాసమ్ము నపనయింపం జాలుసలిలమ్ముం గ్రోలి. ౨

గీ. ఆకొలనిగట్టునం జల్లనైనబాట, ఋశ్యమూకాద్రి ప్రక్కగా నేఁగె నగజ!
అట్లు చనువారి నరసి శైలాగ్రవాసి,యైనసుగ్రీవుఁ డధికభయమ్ముఁ జెంది. ౩

### సుగ్రీవుఁడు రామలక్ష్మణులకడకు హనుమంతునిఁ బంపుట

వ. గట్టుకొట్టకొనకుం బోయి కరువలిపట్టి కా రాచదిట్టలం జూపుచు నిట్లనియె. ౪

సీ. చలికాఁడ! యా వీరశేఖరు లెవ్వరు? శరచాపహస్తు లై జడలు ముడిచి
నారచీరలు గట్టి నగశోభఁ జెట్లపొంకమ్మును గనులారఁ గనుచు మేటి

నడకల వచ్చుచున్నారు; జితేంద్రియుల్, నేఁ డెట్టియాపద మూఁడు నోక్కో;
వాలి పంపఁగ నన్ను వధియింప వచ్చినా రేమొ? విప్రాకృతి నీవు బ్రహ్మ
గీ. చారి వై వారిచెంతకుఁ జని, తదీయ, మానసమ్ము నెఱుంగుము మాటలాడి, చెడుతలఁపుగల్గువా రగునెడల సంజ్ఞఁ, జేయుమీ మెల్లగాఁ గొనచేతితోడ. ౫

క. మన కేవిపత్తు గలుగని, యనువున వినయావనతుఁడ వై వారివిధం బు నెఱిఁగి రమ్ము శుభ మ్మగు, నన సమ్మతిఁ జెంది మారుతాత్మజుఁడు దగన్. ౬

క. పను వై సీతావల్లభు, కడకుఁ వడిఁ బోయి వినయకలితాంగకుఁ డై యడుగులఁ బడి మ్రొక్కి యనెం, బడఁతీ! తనశబ్దశాస్త్రపాండితి దోఁపన్. ౭

హనుమంతుఁడు రామలక్ష్మణులతో సంభాషించుట

సీ. పురుషోత్తములు వీరపూజితుల్ యౌవనవంతులుఁ బద్మినీకాంతుపోల్కిఁ
గడ లెల్ల నిజదేహకాంతిచే వెలిఁగించువారు మీ రిర్వు రెవ్వార లౌర!
భువనత్రయంబును బుట్టించువారుగ నామది నమ్ముచున్నది, జగత్తు
నకు హేతుభూతులు సకలాత్మకు లగుప్రధానపూరుషు లసమానులార!
గీ. యవని కొదవిన పెనుభార మపనయింప, భక్తజనులను బాలింప, భవ్యమాను షాకృతులఁ బూని మాయచే నతివిలాస,ముగఁ జరించుచు నున్నట్లు బుద్ధిఁ దోఁచె.

చ. జగతిని మీరు చిన్మయులు, క్షత్రియవేషములన్ జనించి, యీ
జగదుదయంబు రక్షణము సంక్షయముం బొనరింపఁ బూనిన
ట్లుగఁ బొడకట్టెదుర్; సకలలోకసముద్గతభూతచిత్త స
ద్మగులును బ్రేరకత్వమహిమస్ఫురదీశ్వరు లన్న మీరె కా; ౯

క. ఆయాలోకంబులలో, హాయిగ విహరించి యవని కై డిగునరనా
రాయణఋషిపుంగవు లని, నాయూహ; సమస్తలోకనాయకులారా! ౧౦

ఉ. ఓ హరివీరులార! జగదున్నతులార! మదీయభావమం
దూహలమీఁద నూహలు పయోధితరంగము లట్లు పుట్టెదున్
శ్రీహరిసాక్షిగా నఖిలసేవితముల్ భవదంఘ్రులు, లిందు సం
దేహము లేదు మీవిధముఁ దెల్పుఁ డనల్పకృపాప్రపూరితుల్!. ౧౧

వ. అనుటయు రామభద్రుండు తమ్మునిం జూచి. ౧౨

చ. అమలినకాంతితోఁ బొలిచి యద్భుత మై తగుబ్రహ్మచారిరూ
పము గలయీతనిం గనుము, వ్యాకరణంబు సమస్తముఖ

స్థముగఁ బఠించినాఁడు పలుసార్లిది నిశ్చయ మీ వచఃప్రయో
గము వివిధాంశసమ్మితము కన్పడ దిం దపశబ్ద మొక్కఁడేన్; ౧౩

రాముఁడు హనుమంతునితోఁ దన సమాచారమును దెలుపుట

వ. అని పల్కి జ్ఞానవిగ్రహుం డగురఘుగ్రామణి సామీరి కిట్లనియె. ౧౪

గీ. రాముఁడను నేను దశరథరాజసుతుఁడ, నాదుతమ్ముండు లక్ష్మణనాముఁ డితఁడు
పితృవచనగౌరవమ్ముచే విపినమున వసింప వచ్చితి భార్యయాసీతతోడ. ౧౫

చ. ముగురము దండక న్నిలువ ముక్కిడిరక్కసుఁ డొక్కఁ డెవ్వఁడో
ముగుదను ముచ్చిలించికొనిపోయె వటూత్తమ! య న్నెలంతఁ గా
నఁగఁ జనుదెంచినా మిటకు, నవ్యతనూరుచి గోచరించు నీ
దగువిధ మెట్టి? దెవ్వనికి నాత్మభవుండవు! మాకుఁ దెల్పుమీ. ౧౬

హనుమంతుఁడు, సుగ్రీవునితోఁ జెలిమిసేయు మని రామునితోఁ జెప్పుట

వ. అనుటయుఁ బవనతనయుండు. ౧౭

సీ. అగచరరాజు మహామతి సుగ్రీవుఁ డనుసుప్రసిద్ధుఁ డీయద్రిపైన
సచివచతుష్టయసహితుఁడై నివసించియున్నాఁడు, కడు దుర్నయుఁ డగువాలి
యాతని కగ్రజుం, డనుజు నిల్ వెడలంగ నంపి తత్సతి నిపు డపహరించె.
అన్నభయమ్మున నాతఁ డీ ఋశ్యమూకాఖ్యశైలమును సమాశ్రయించె,
గీ. నంజనాగర్భజాతుండ ననిలసుతుఁడ, నేను, హనుమంతుఁ డనిపిల్తు రెల్లవారు,
సచివపదమున సుగ్రీవుసవిధమందుఁ, బాయకుండుదు నిరతంబుఁ, బ్రభువతంస!

క. నీ వాతనితోఁ జెలిమిం, గావించుట యుక్త మెల్లగతులన్, యుష్మ
ద్దేవిని గొనిపోయినదు,ర్భావునిఁ జంపుటకు సాయపడఁగలఁ, డనఘా! ౧౯

ఉ. సమ్మత మేని నిందులకుఁ జయ్యనఁ బోదము రండు తత్సమీ
పమ్మున కన్న, రాముఁ డను, వానరపుంగవ! మేముగూడ నేఁ
డమ్మహితాత్ముతోఁ జెలిమి నందుటకే చనుదెంచినాము త
థ్యమ్ముగ నాకు మిత్రుఁ డగునాతనికార్యముఁ దీర్తు నెట్టిదేన్. ౨౦

సీ. నావుడుఁ బవమాననందనుం డుబ్బుచు నిజరూపమున ముందు నిలిచి యపుడు
మీ రిద్ద రనఘాత్ములార! నాభుజములపై నధిష్ఠింపుఁడు, భ్రాతృభీతిఁ
బ్రెగడలతోడ సుగ్రీవుండు డాఁగినయచలాగ్రభూమికి నరుగుద మని
యురుభుజంబులను వా రిరువు రధిష్ఠింప గిరిమూర్ధమునకు సత్వరమ యెగిరి

గీ. యొకతరుచ్ఛాయ డించి యం దుండ వారు
భానుజునిఁ జేరి యంజలిఁబట్టి యనియె
నద్రిచరనాథ! నిర్భయ మగును గాత
మేలు చేకుఱుఁగా కింక మీఁద నీకు. ౨౧

హనుమంతుఁడు సుగ్రీవునితో రామలక్ష్మణులతోడి స్నేహము కర్తవ్య మని చెప్పుట

క. శ్రీయుతులు రామలక్ష్మణు, లీ యెడకున్ వచ్చినా రధీశులు వారిన్
డాయఁగఁ బోదము లెమ్ము త్వదీయస్నేహమ్ముఁ గూర్చితిని నీ కనఘా!. ౨౨

చ. అనలుని సాక్షిగా నిలిపి, యా రఘువీరునితోడ సఖ్యమున్
బొనరుపు మయ్య! శీఘ్రముగ, భూరిపరాక్రమశాలి యాతఁడే
పని కయినన్ సమర్థుఁడన భాస్కరసూతి ప్రమోదచిత్తుఁడై
చనె నినవంశమండనుని సన్నిధికిం బవమానసూనుతోన్. ౨౩

క. చని చెట్టుకొమ్మ నొక ద్దానిని దానే విఱిచి యా యనిందితునకు నా
సనముగ నిడియె ముదంబున, వనితా! సౌమిత్రి కట్లె వాయుజుఁ డునిచెన్. ౨౪

క. ఆవిధి లక్ష్మణుఁడును సుగ్రీవున కొకవృక్షశాఖ ఛేదించి యిడెన్
దేవీ! యెల్లరుఁ గడుమోదావిష్టాత్ము లయి యుండి, రాసమయమునన్. ౨౫

సుగ్రీవుఁడు రామునకు సీతాభూషణములను దెచ్చి చూపుట

సీ. వనవాస మొనరింపవచ్చుట జనకపుత్త్రిని గోలుపోవు టాదిగ రఘూత్త
మునిచరితము సాంతముగ నూర్మిళాప్రియుఁ డెఱిఁగింప నాలించి యినసుతుండు
రామున కిట్లను రాజేంద్ర! జనకజాన్వేషణ మేను గావింపఁ గలను
శత్రుఘాతికి నీకు సాయమ్ముఁ జేసెద శక్తికొలంది నిస్సంశయమ్ము.
గీ. ఏను గన్నవిశేష మొక్కింత గలదు, దాని వినిపింతు విను మొక్కతరుణమందు
సచివజనములు గొల్వ నీ యచలశిఖర, దేశమునఁ గూరుచుండి యాకాశవీథి. ౨౬

క. ప్రకటగతిఁ దేరిపై నిల్చుకొని యొకానొకఁడు గొంచుఁబోవఁగ సుదతీ
నికరతిలకాయమానను, నొకసాధ్విని జూచినాఁడ నుత్తమచరితా! ౨౭

సీ. ఆయమ, రామ! రామా! యని యఱచుచు మముఁ గాంచి పర్వతాగ్రమున నొడలి
నగలెల్లఁ దీసి మూటగఁ గట్టి పయ్యెదకొంగునఁ, గ్రిందఁ గన్గొనుచు నార్త
నాదంబు మిగులంగ మా దరిఁ బడవైచి పోయె రక్కసుఁడు గొంపోవ, నాథ!
యంత నే రయమున నాభూషణంబుల దాఁచియుంచితి గుహాంతరమునందుఁ

గీ. గల విభుఁడుగూడ సీతవో కావొ; వానిఁ, బొలఁజూడుము నీ వని పలికి భాను
సూతి, తోడనె దశరథసూతిముందు, దేవి! తద్భూషణగ్రంథిఁ దెచ్చిపెట్టె. ౨౮

వ. అంత రాముండు. ౨౯

క. మూట ముడి విప్పి, తొడవులు, బోటి వగుట నెఱిఁగి యేడ్చెఁ బొరిఁబొరి నెదపై
గాటముగ నదిమికొని యప్పాటన్ సీతా! యటంచుఁ బ్రాకృతుని గతిన్. ౩౦

లక్ష్మణుఁ డన్న నూఱడించుట

వ. ఆసమయంబున, ౩౧

క. వ్యగ్రుఁ డయి పడఁతి కడ లేదు, నగ్రజు నూఱడిలఁ జేసి, యనె లక్ష్మణుఁ, డీ
సుగ్రీవుసహాయమున దశగ్రీవునిఁ జంపఁగలవు సమరములోనన్. ౩౨

క. తొందరలోనే నీ ప్రియసుందరినిం బొందఁగలవు సువ్రత! వాపో
వం దగ దిటు త్వాదృశున కనం దపనజుఁ డనియెఁ దనమనస్థితి దెలియన్. ౩౩

రామసుగ్రీవులు సఖ్యము చేసికొనుట

క. విమతున్ దశకంధరుఁ గయ్యమునం గడతేర్చి సీత నర్పించెద నీ
కు, మహాత్మ! యిదియ పో తథ్యముగా నాప్రతిన యనుడు ననిలజుఁడు వడిన్.

గీ. వారి యిరువురి చెంతఁ బావకునిఁ బ్రజ్వలింపఁగాఁ జేసి తగఁ బ్రతిష్ఠింపఁ, జెల్మిఁ
జేసి రొండొరు లగ్నిసాక్షిగఁ గరములు, సాఁచి కౌఁగిలించికొని నిష్కపటమతులు.

సుగ్రీవుఁడు రామునకుఁ దన వృత్తాంతము నివేదించుట

క. పిమ్మట రఘుతిలకుసమీపమ్మునఁ గూర్చుండి ప్రొద్దుపట్టి నిజోదం
తమ్మును నాతనిపైఁ గల, నమ్మకమునఁ జెప్పఁ దొడఁగె, నగరాజసుతా! ౩౬

సీ. వినుపింతు నాకథ విను మయ్య చెలికాఁడ! వాలిచేఁ గావింపఁబడినదాని,
మయునికుమారుండు మాయావి యనుదుర్మదాంధుఁ డొకప్డు కిష్కింధఁ జేర
వచ్చి, కయ్యమునకు వాలిని బిల్వ నమ్మాట కాతఁడు సహింపంగ లేక
క్రోధతామ్రాక్షుఁ డై గురుసింహనాదమ్ముతోఁ బురి వీడి శత్రువును దాఁకి
గీ. పొడిచె దృఢముష్టి, దనుజుఁ డప్పోటుచేత
బడలి తా నుండుగుహదిక్కు పరుగు వాఱ
వీడక మదగ్రజుండును వెంటఁబడియెఁ
బర్విడితి నేను గూడ నప్పాపివెనుక. ౩౭

ఉ. అంతట నమ్మదాంధుఁడు గుహాంతరముం జొరఁ బాఱె, నగ్రజుం
డంతకు పోల్కిమండి, "యనుజా! యిట నుండుము నీవు; లోని కే
నెంతయుఁ బోయి వత్తు"నని యేఁగెను వెల్పల నిల్పి నన్ను న
త్యంతరయంబునం బగతు నంతము నొందఁగఁ జేయ, రాఘవా! ౩౮

సీ. అట్లేఁగి యొకనెల యగుదాఁక వెడలిరాఁ డాయె, రెండవనెలయందు రక్త
మేరు తీరున గుహాద్వారమ్మునుండి రాఁదొడఁగె, నే నది చూచి యొడలు పరిత
పింప రక్కసునిచే బిద్దె నగ్రజుఁ డని విలపించి పెనుబండ బిలమువాఁత
ద్రోసి, యింటికి వచ్చి దుష్టరాక్షసునిచే మాయన్న గుహలోన మ్రందె ననుచుఁ
గీ. జెప్పితిని, దానికిం గడుఁ జింత నొంది, సచివు లగుకపులంద ఱే సమ్మతింప
కున్నఁ గపిరాజ్యమున కెల్ల నన్ను నధిపుఁ, జేసి పట్టాభిషేకంబుఁ జేసి రనఘ!.

క. పరిపాలించితి రాజ్యం, బరిభంజన! కొంతకాల, మంతటఁ ద్రిదశే
శ్వరసుతుఁడు వచ్చి నన్నుం, బరుషంబులు పలికెఁ గొన్ని పటుకోపమునన్. ౪౦

క. తలయెత్తరాని మాటలఁ, బలుతెఱఁగుల దూఱి ముష్టిపాతంబుల న
న్నలయింపఁ బురమువిడి కాల్కొలఁదిం బాఱితిని భీతిఁ గొని, దాశరథీ!. ౪౧

చ. తిరిగి సమస్తలోకము లధీరునితీరున ఋశ్యమూకభూ
ధరమును నాశ్రయించితిఁ దుదిన్ నృపసత్తమ! వాలి యిందు రా
వెఱచు మతంగమౌనిపతి పెట్టినశాపముఁ జేసి, నాదు సుం
దరిని దదాది మోహవశతం గొని భోగము లందుచుండెఁ జూ; ౪౨

రాముఁడు సుగ్రీవున కభయ మొసంగుట

సీ. ఆకారణమున నే నర్కవంశోత్తమ! యిల్లాలు నిల్లు మ ఱేమి లేక
ప్రబలదుఃఖంబునఁ బరితపించుచు వసియించితి నిక్కొండ, నిపుడు మీదు
శ్రీపాదపద్మముల్ చేతముట్టెడుపుణ్య మొదవుటచే సుఖాస్పదుఁడ నైతి
నావుడు వికచరాజీవనేత్రుఁడు రాముఁ డడలి సంగడికాని కైననేగి,
గీ. కర్కనందన! నీభార్య నపహరించి, నట్టిపగవాని వాలిని నస్మదీయ
బాణహతి వధియింతు శుభం బొనర్తు, నని ప్రతిజ్ఞగావించెను నతనియెదుట.

సుగ్రీవుఁడు రామునిబలమ్ముం బరీక్షించుట

వ. అందులకు సూర్యనందనుం డిట్లనియె. ౪౪

క. బలవంతులలో నెల్లన్, బలవంతుఁడు వాలి చిక్కఁపడఁ డమరులకే
దలఁదాఁటుఁగాని; నీ వెట్టు, పొలియింపం గలవు వాని, భూపశ్రేష్ఠా! ౪౫

సీ. చెప్పెద నమ్మేటిచేవ నాకర్ణింపు, బలవదగ్రేసర! భానువంశ్య!
దుందుభి యనెడుదైత్యుఁడు మహాకాయుఁ డద్భుతసత్త్వుఁ డొకఁ డెనుపోతురూపు
ధరియించి కిష్కింధ దరియంగ నొకనాఁటిరే వచ్చి భీషణారావ మడర,
ననికి వాలిని బిల్వ నది సహింపక కోపదీపితుం డాతఁ డాటోప మొప్ప
గీ. డాసి, కొమ్ములు వట్టి పుడమిని ద్రోసి,యొక్కకాల దేహమ్మును ద్రొక్కిపట్టి
కరములన్ మెలివెట్టి తచ్ఛిరముఁ బెఱికి, యసమునర్గ నిట్టనిగిడి తా విసరి వైచె.

వ. అట్లు విసరంబడి య ప్పొలదిండితల మతంగమహానియాశ్రమసమీపంబునం బడి ప్రపాతవేగంబునం జేసి యటనుండి యొక్కయామడదూరం బెగిరి యంద కూలె. అక్కతన జడదారిదిట్టయున్కిపట్టునం దంతటను బైనుండి రక్తధార లొలికె.

ఉ. అత్తెఱఁ గంతయుం గని క్రుధాకులుఁడై మునిపుండరీకుఁ, "డు
న్మత్తుఁడ వైతి వింకఁ బయి నాయచలంబునఁ గాలువెట్టఁ గా
వత్తువయేనిఁ దత్క్షణమ భగ్నశిరస్కుఁడ వౌచు నా నుడిం
జత్తు" వటంచు వాసవికి శాప మొసంగెను దూషణాంతకా! ౪౮

ఉ. ఆ ఋషిచే శపింపఁబడి నప్పటినుండియు ఋశ్యమూకముం
జేరఁగ రాఁ డతండు నృపశేఖర! దాని నెఱింగి నేను సం
చారము సేయుచుంటి నవిచారముగా నిట, నల్ల దుందుభి
క్రూరనరాదుమస్త మదిగో తిలకింపు మహీధరాభమున్. ౪౯

గీ. దాని విసరివేయఁ దగుసమర్థుఁడ వేని, వాలివధమునందుఁ జాలుదీవు
రామ! యనుచుఁ దచ్ఛిరంబు శైలనిభంబుఁ, జూపె రవిసుతుండు, చూచె నతఁడు.

వ. చూచి, ౫౦

క. స్మితముఖుఁడై యా శౌర్యాన్వితుఁ డాతలఁ గాలిబొటనవ్రేల గిరిరా
ట్సుత! దశయోజనదూర, క్షితిఁ బడ నెగఁ జిమ్మెఁ జూడఁ జిత్రం బయ్యెన్. ౫౧

రాముండు సప్తతాళముల ఛేదించుట

సీ. అందుల కాశ్చర్య మంది సుగ్రీవుండు, మంత్రులుం దానును మైథిలీశు
భక్తపరాయణు బహువిధంబుల "బాగు బా" గని శ్లాఘించి పలికె మఱియుఁ
దతసారవంతముల్ తాలవృక్షము లేడు గల వవె వానిని గనుము రామ!
చేఁ దట్టి యొక్కొక్కచెట్టును నవలీల విగతపత్రములఁ గావించె వాలి
గీ. వీని నన్నింటి నీ వొక్కవిశిఖమునను, గొట్టి బెజ్జ మొనర్తువేని కులిశపాణి
కొడుకు నీచేత నాజిలోఁ గూలు ననెడి, నమ్మకము గల్గు నాకు మనంబునందు.

చ. అనవుడు నట్టులే యని మహాబలుఁ డాయనఘుండు కేలఁ గై
కొని ధనువుర్వ శిలీముఖముఁ గూరిచి యయ్యెడఁ దాలసప్తకం
బును దునిమెం, దదంబకము భూజశిలోచ్చయధారిణీవిభే
దన మొనరించి వచ్చి నెలఁతా! పొదిఁజేరెను దొంటిరీతిగన్. ౫౩

సుగ్రీవుండు రామచంద్రుని సన్నుతించుట

గీ. ఆ యమానుషకృత్యంబు నరసి పరమ,విస్మితుం డయి తరుచరవీరుఁ డర్కి-
పట్టఁజాలనియుబ్బునఁ బలికె రామ,భద్రుఁ ద ద్దివ్యదర్శనోన్నిద్రబుద్ధి. ౫౪

వ. దేవా! నీ వన; ౫౬

క. జగములకు నెల్ల నాయకుఁ, డగుపరమాత్మ విట సందియము దోఁపదు నా
యగణితపూర్వార్జితపుణ్యాగరిమచే నీదుమైత్రి యలవడె నిట్టుల్. ౫౭

సీ. నిన్ను మహాత్ములు నిరతంబు భజియింత్రు సంసారబంధంబు సడలు కొఱకు
మోక్షదాతను జ్ఞానమూర్తిని నినుఁ బొంది, యీహేయసంసార మేట్లు గోరఁ
దలఁతు? భార్యాపుత్రధనరాజ్యరూప మా నఖిలంబు నీదు మాయాకృతంబు
కావున మోక్ష మొక్కటి దక్కయన్యంబు నేను వేఁడ ననుగ్రహింపు నన్ను
గీ. మట్టికొఱకుఁ బాతరలాడుమానవుండు, పెన్నిధానమ్ముఁబోలె జగన్నివాస!
పడయఁ గంటి నానందానుభవుని సుజన,పాలకుని నిన్ను మామకభాగ్యమునను.

సీ. నఱకంగఁ బడిన దనాద్యవిద్యాసముద్భవదృఢమామకబంధ మిప్పు
డరయ నీ సంస్కృతి యజ్ఞదానతపఃక్రియాదులచే వృద్ధి నందుఁ గాని
నాశ మొందదు? జగన్నాయక! భవదంఘ్రిదర్శనం బొదవినతత్క్షణంబ
యడఁగు నిశ్చయ, మెవ్వఁ డర్ధక్షణము బుద్ధి నీ యందు నిల్పును నిశ్చలముగ;
గీ. వానికి ననర్థమూల మజ్ఞాన మఖిల, మప్పుడ నశించు, శ్రీరామ! యందువలన
నామనంబు నీయందు ననారతంబు, నిల్చుఁగాక మఱొక్కెడ నిలువఁ బోక. ౫౯

గీ. మధురముగఁ బాడు రామ! రామా! యటంచు
నిముస మెవ్వని నాల్క? మానిసి యతండు
బ్రహ్మఘాతుకుఁ డైన సురాపుఁ డైన
నఖిలపాతకదూరుఁ డౌ, నఘవిదారి!. ౬౦

క. దారసుఖాదిక మొల్లను, వైరివిజయ మంతకు మును వాంఛింపను, సం
సారచ్ఛేదకభక్తిని, గోరెద నీయందు భక్తగోచర! సతమున్. ౬౧

సీ. ఈపాడుసంసార మెటనుండి నా కబ్బె నీదగుమాయచే గాదె? రామ!
యేనును నీయంశ మే కాని యన్యుండఁ గాను, గావునఁ దావకీనపాద
భక్తిని దయచేసి, భవసంకటమునుండి తొలఁగింపు మీదీనుఁ, దొల్లి నాదు
మానసంబును భవన్మాయ గప్పినవేళ నహితులు హితులు మధ్యస్థు లనుచుఁ
గీ. బలుతెఱంగులఁ దోఁచెఁ బ్రపంచ, మిపుడు
యుష్మదంఘ్రిదర్శనసుకృతోదయమున
బ్రహ్మముగ సర్వమును గానఁబడెడుఁ గాని;
యరులు మిత్రు లెవ్వరును దోఁపరు, మహాత్మ!. ౬౨

క. మనుజుఁడు, నీమాయఁ దగుల్కొనియుండిన యన్నినాళ్లు లోఁబడి యుండుం
ఘనసత్త్వాదిగుణంబుల, కనఘా! తద్గుణవిరహితుఁ డగునంతాఁకన్. ౬౩

క. అరి మిత్రోదాసీన, స్వరూపమున వివిధగతుల జగ మగపడు, న
త్తెఱఁగునఁ గనఁ బడువఱకున్, మరణభయము దప్పఁ బో, దనురనుతచరణా!

వ. కావున దేవా! యవిద్యోపాసకుండు కన్నుగానని చీఁకటిం బడుచున్నాఁడు. ఏత
త్పుత్రదారాదిబంధంబు సర్వంబు భవన్మాయామూలంబ కాదె? యింకఁ బ్రస
న్నుండ వై, నీదాసి యగుమాయను నాపయిం గవియకుండ వారింపుము. ౬౫

సీ. నా మనం బెపుడు శ్రీరామ! తావకపాదపద్మంబు లెంకిగాఁ బడయుఁ గాక,
నా కరంబులు జగన్నాథ! యుష్మద్భక్తజనులకు శుశ్రూష సలుపుఁ గాక,
నా మేను, జానకీకామ! త్వదీయాంగసంగసౌఖ్యముఁ గొనంజాలుఁ గాక,
నా నాల్క, దేవ! త్వన్నామసంగీతకథాసుధారసమును ద్రావుఁ గాక,
గీ. నీదుదివ్యమూర్తి నీదాసజనుల భ,వత్స్వరూపమునను వఱలుగురునిఁ
గాంచుఁగాక సర్వకాలంబు నాకన్ను,దోయి, సుజనలోకదుఃఖహరణ! ౬౬

క. నాచెవి, పుట్టుక మొదలగు, నీచారిత్రాంశముల వినెడుఁగాక, ఖలా
గోచర! త్వదాలయమునకు, నాచరణము లనవరతము నడచుంగాతన్. ౬౭

చ. అవయవముల్ త్వదీయచరణాబ్జపరాగపవిత్రతీర్థముం
దవిలి ధరించుఁగాక, వినతాతనయధ్వజ! శర్వపద్మసం
భవముఖదేవసేవితభవచ్ఛరణంబునకున్ సమగ్రభ
క్తివశత మ్రొక్కుఁగావుత మదీయశిరం బఘరాశి దూలఁగన్. ౬౮

వ. అని వేఁడికొనుటయు. ౬౯

రాముఁడు విరక్తిమార్గమున కభిముఖుఁడైన సుగ్రీవుని ననునయించుట

సీ. తన్నుఁ గౌఁగిటఁ జేర్చికొన్న పుణ్యమున నిర్ధూతాఖిలాఘుఁడౌ తోయజాప్త
నందనుఁ గని చిఱునగవున మోహంబు గల్గించునిజమాయఁ గార్యసిద్ధి
కొఱకు నాతనిపయిఁ బఱపుచు దశరథనందనుం డిట్లనె, నన్నుఁ గూర్చి
నీవు పల్కిన దెల్ల నిజము మిత్రమ! "యగ్నిసాక్షిగ సఖ్యమ్ము నాచరించి
గీ. యేమి యుపకార మొనరించె రాముఁ డల్ల, వానరేంద్రున"కని యెల్లవారు నన్ను
నాడుకొందు రీయపవాద మబ్బుఁగాన, పిలువు మీ వేఁగి వాలిని గలని కిపుడు.

క. నీ కొదవుఁగాక శుభము గుణాకర! యొకబాణముననె యహితు వధింతున్
శ్రీకపిరాజ్యమునం దభిషేకింతును నిన్ను నాలసింపక లెమ్మా. ౨౧

వాలిసుగ్రీవులు పెనఁగుట

క. అనవుడు రవిజుఁడు సమ్మతిఁ గొని కిష్కింధోపవనము గొబ్బున డాయం
జని, భయదధ్వని సేయుచు, ననికిఁ రారమ్మటంచు నగ్రజుఁ బిలిచెన్. ౨౨

క. తమ్ముం డఱచుట విని కోపమ్మునఁ గను లెఱ్ఱవడఁగఁ ద్వరితగతిన్ సా
ధమ్ము వెడలి యతనిసమీపమ్మునకుం బోయె వాలి, పాటలగంధీ! ౨౩

ఉ. అమ్మెయిఁ బైకివచ్చెడి నిజాగ్రజు ఱొమ్మున బాహుముష్టిపా
త మ్మొనరించె నర్కజుఁడు, దాని కతండు క్రుధాకులాంగుఁడై,
తమ్మునిఁ గొట్టె వజ్రకలిత మ్మగుముష్టియుగమ్మునన్ మహో
గ్రమ్ముగ, నాతడుం బొడిచెఁ గ్రమ్మఱ, నీక్రియ వార లిర్వురున్. ౨౪

వ. పోరుచుండి రాసమయంబున వాలివధాకాం[illegible]యై యున్న రాముండు. ౨౫

గీ. అన్నదమ్ము లచ్చొత్తినట్టు లొక్క తీరున నభేదరూపు చెన్నారఁ దనకుఁ
గానవచ్చెడువారలఁ గాంచి, పరమ, విస్మితుం డయ్యెఁ బర్వతవిభుకుమారి!. ౨౬

సుగ్రీవుఁడు వాలివలనిపరాభవమునకు రాముని యెదుట విచారపడుట

సీ. ఆత్మసఖుం డగునర్కసూతికి విపత్తొకవేళఁ గల్గునేమో యటంచు
సంశయపడి రామచంద్రుండు శరముఁ బ్రయోగింప కూరకయుండె, నపుడు
నెత్తురు గ్రక్కుచు నెక్కొనుభీతిఁ బేరెము వాఱె సుగ్రీవుఁ, డమరరాజ
పుత్రుండు దనగృహంబున కేఁగె, నంతట రామున కిట్లనె రవికుమారుఁ
గీ. డేను గడతేరుకోరిక మానసమున, నీకుఁ గల దేనిఁ జంపుము నీవె చేతు
లార; భ్రాతృరూపుం డగువైరిచేత, నేల చంపించెదవు జగదీశ! నన్ను. ౨౭

చ. క్రియలను దగ్గమాటలను గీల్కొనఁ జేసితి వస్మదాత్మఁ బ్ర
త్యయమును నాదిలోన ; శరణాగతవత్సల ! సత్యసంధ ! యే
ల యిపు డుపేక్షఁ జేసితివి లాఁతిపయి న్ననుఁ బోరఁ బంచి ? దు
ర్జయుఁ డగువాలితోఁ బెనఁగఁజాలుదునా మును నే నెఱుంగనా?, ౭౯

రాముఁడు సుగ్రీవుని రెండవమాఱు వాలిపై కంపుట

క. నావుడు సాశ్రువిలోచనుఁ, డై వడిఁ గౌఁగిటను బొదవి యర్కజు, రామ
క్ష్మావిభుఁడు పలికె సఖుఁడా !, నీవు భయంపడఁగ వలదు నిక్కము వినుమీ.

క. మిము నేకాకారులఁ గని, యమిత్రుఁ డితఁ, డితఁడు మిత్ర మని తెలియం జా
లమి నిన్నుఁ గూల్తు ననుభీ,తి మెయిఁ గా విడఁజాల నైతి దీప్తశరంబున్. ౮౦

ఉ. ఇంతియ కాని వేఱుతలఁ పెద్దియు లే దని నమ్ము మామక
స్వాంతమునందు, ని న్నెఱుఁగఁజాలెడిచిహ్నము నీకు నిప్పుడే
యింతును గ్రమ్మఱం జని మదోద్ధతు నగ్రజుఁ బిల్వు, తెప్పపా
టంతటిలోన జూడఁగల వాతని నిర్గతజీవుఁగా, సఖా !. ౮౧

గీ. అనుజ ! రాముఁడ నేను నీ కయి ప్రతిజ్ఞ
సలుపుచున్నాను విను మొక్కక్షణములోనఁ
ద్వదహితు వధింతు నని యినతనయు నూఱ
డించి రఘుపతి సౌమిత్రిఁ గాంచి పలికె. ౮౨

సీ. తమ్ముఁడ ! యీ భానుతనయుని గళమునఁ బొలుపారఁ బూచినపూలదండ
వైచి రయమ్ముగ వాలిమీఁదికిఁ బంపు నావు, డగ్రజునియానతి నతండు
పుష్పమాలికఁ జుట్టి పోయిర మ్మంచు సంప్రీతితోఁ బంపె, సుగ్రీవుఁ డేఁగి
మరల శబ్దము భయంకరముగఁ జేసి యన్నను బిల్వ నాశ్చర్యమును గినుకయుఁ
గీ. జుట్టికొనఁ జక్కఁగా నడికట్టు గట్టి, యరిని బోరిగొనుపూన్కి శక్రాత్మజుండు
పోవుచుండఁగఁ బోనీక పొదవి పట్టి, తార యీరీతిఁ దెల్పె హితంబు దేవి !. ౮౩

తార వాలిని సుగ్రీవుపైకిఁ బోవల దనుట

క. నీ విప్పు డెంతమాత్రముఁ, బోవల దది యేమొ శంకపొడమెడు నన్మ
ద్భావమున జీవితేశా !, స్త్రీవచనం బనక చెవిని జేర్పుము దీనిన్. ౮౪

క. తేజము చెడ నీచేతఁ బ,రాజితుఁ డై, యిపుడ చని మరల రయమున ని
న్నే జగడమునకు రవిజుఁడు, తాఁ జీరుట సంశయింపఁ దగినది కాదే ?. ౮౫

క. ఆతనిరాకడఁ జూడ మ,హాతేజుఁ డొకండు సాయ మైనట్టులు నా
కై తోఁచుచున్న దతఁ డెవఁ,డో; తద్విధ మేము తెలియ కుఱుకుట తగునే?.

వాలి తారకు ధైర్యము చెప్పుట

వ. అనవుడు తారకు వాలి యిట్లనియె. ౮౭

సీ. ప్రియురాల! నీ వెంత బేల వన్యుఁ డెవండొ సాయ మయ్యె నటన్న సందియమ్ము
వీడుము నాచేయి విడిచిపెట్టుము పొమ్ము శత్రునిపైఁ జని సంహరించి
యేను వెంటనె వత్తు నెందుల కీ జాగు? వానికిఁ దో డగువాఁ డెవండు?
ఒకవేళ యెవ్వఁడే నూఁతగా నిల్చిన నిరువురం బొలియింతు నింత నిజము
గీ. సుందరీ! దుఃఖ మొందకు శూరుఁ డైన, వాఁడు తన కెంతయుం బగవాఁడు వచ్చి
చివ్వకుం బిల్వఁ గవియక సిగ్గుమాలి, యింటఁ గూర్చుండుటకు నెట్టు లిచ్చగించు?

తార వాలితో సుగ్రీవునకు రామసాహాయ్య మున్నదని చెప్పుట

ఉ. నావుడుఁ దార పల్కెఁ గపినాయక! నే నొకమాట చెప్పెదన్
నీ వది యాలకించి పయి నిల్చిన నిల్వుము దాయ డాయఁగాఁ
బోవలె నేనిఁ బొమ్ము; వనభూమికిఁ దా మృగయార్థ మేఁగి య
చ్చో విననట్టి యంశమును సూనుఁడు నా కెఱిఁగించె నివ్విధిన్. ౮౯

సీ. దశరథాత్మజుఁ డయోధ్యాపతి శ్రీమంతుఁ డైన రాముఁడు లక్ష్మణానుజన్ము
తో భార్య యగుసీతతో దండకాటవి కరుదెంచినాఁ డఁట; యచట రావ
ణాసురుఁ డాసతిన్ హరియించె నఁట; నిజాంగనజాడ దెలియమి ననుజుఁ గూడి
వెదకుచు నా ఱేఁడు తుద ఋశ్యమూకవాసి యగునీతమ్మునిఁ జేరినాఁడు,
గీ. దినకరాత్మజుఁ డతనితో ననలు నెదుటఁ, జెలిమిఁ గావించెఁ బ్రీతిమైఁ "గలనిలో వ
ధించి వాలిని నిను ధరాధిపతిఁ జేతు",నని ప్రతిన సల్పె నీదాయ కా ఘనుండు. ౯౦

క. ఈనిశ్చయమున రాఘవ,భానుజు లుండి రఁట; ప్రాణవల్లభ! నిక్కం
బౌ నిది; యటు కాకున్నం,దా నిపు డోడి చని మరలఁ దలఁపడు నేలా? ౯౧

వ. అందుచే సర్వవిధంబుల వైరంబు మాని సుగ్రీవుం దోడ్తెచ్చి యువరాజపదంబునం
దభిషేకింపుము. దాశరథిని శరణువేఁడి తదనుగ్రహంబునకుఁ బాత్రుండవై యంగ
దుని నన్నుం గపిరాజ్యంబును గులంబును రక్షించికొమ్మని చెప్పి. ౯౨

గీ. కన్నుగవనుండి బాష్పముల్ గాఱ నాథు,కాళ్లపైఁబడి నతి సల్పి కరయుగమునఁ
బాదములు పట్టుకొని యేడ్చె భయము దోఁప,నిందుముఖి!యంత వాసవనందనుండు.

వాలి, తారకుఁ దనమనోనిశ్చయమును దెలుపుట

సీ. సుదతిని గవుఁగిటం బొదివి స్నేహమున సుందరగాత్రి! నీ వాఁడుదాన వగుట
నూరక భయపడుచున్నావు; నా కేమి భయము లే దిందు; నీపల్కినట్లు
రామభూజాని తా సౌమిత్రిఁ గూడి వచ్చినది నిజం బేనిఁ జెలిమి యొదవు
నాకు నాఘనునితో, నలినాక్షి! మును వింటి "రాముఁడు భూమిభారము హరింప
గీ. నవతరించినసకలలోకాధినాథుఁ,డయిన నారాయణుం"డని, యాత్మపక్ష
మనియుఁ బరపక్ష మనియుఁ బరాత్ము డైన, యామహాత్మునికడ భేద మరయరాదు.

ఉ. ఆయతభక్తియుక్తిని దదంఘ్రులకుం బ్రణమిల్లి యా బుధ
ధ్యేయు నపవ్యపాయు మనయింటికిఁ దోడ్కొనివత్తు సాధ్వి! త
న్నే; యెదఁ గొల్చువారలకు నెంతయు వశ్యుఁడు భక్తిగమ్యుఁ, డా
హా యతఁ డిల్లు మెట్టినఁ గృతార్థుల మైతిమి కా తలంపుమీ; ౯౫

వ. అట్లు గాక. ౯౬

గీ. భానుజుఁడు తానుమాత్రమె బవరమునకు
సరగు దెంచినచోఁ ద్రుటిఁ బొరిగొనియెద
ననికి రమ్మని పిల్చెడు నహితుఁ దెచ్చి
యావరాజ్యాధికృతికి నెట్లర్హుఁ జేతు? ౯౭

గీ. అఖిలలోకసమ్మతుఁడ నై యలరుశూర
వరుఁడ నే, నొక్కభీరువుకరణి లేఁత
మాట లాడుదునే? యేడ్పు మాని దేవి!
యింట నుండుము, రిపుఁ గూల్చి యిపుడ వత్తు. ౯౮

వ. అని యిత్తెఱఁగున, సాశ్రులోచన యై శోకించుతార నూఱడించి, యాఖండల
నందనుం డధికజవంబున సుగ్రీవునిం జంపుతలంపునం బోయె, నంత భీమవిక్రముం
డయినప్రభాకరాత్మజుండు. ౯౯

గీ. తన్నుఁ దాఁకంగ వచ్చెదునన్న మీఁది, కలుక రెట్టింప నెగిరి విహంగము గతిఁ
గీడ్పడని పూన్కి మైఁ బిడికిళ్లఁ బొడిచె, గళమునం బూలదండ రాజిలుచు నుండ.

గీ. ఆతఁడును నట్లె దృఢముష్టిహతి నలంచె
నందులకు సైఁప లే కర్కనందనుండు
మరలఁ గొట్టెఁ బురందరాత్మజునిఁ జేతి
కొలఁది, వాలియు మఱి మోఁదెఁ బలము మీఱ. ౧౦౧

క. ఇవ్విధంబున. ౧౦౨

క. తన్నుం జూచుచుఁ దమ్ముం, డన్న నిజభుజాబలంబు సరయుచుఁ బోరం
గన్నారఁ గాంచె శౌర్యస,మున్నతుఁడు దినేశవంశ్యుఁ డుత్తమచరితా!. ౧౦౩

వ. కని, పరుల కరయరాకుండ నొక్కతరుషండంబునం దొదిగి యుండి నిషంగమ్ము నుండి బాణమ్ముం దీసి కుంభసంభవదత్తం బగుజంభారిచాపంబున సంధించినవాఁ డై. ౧౦౪

సీ. కర్ణంబు దాఁక నాకర్షించి, తెప్పవే,యక వాలి నారసి యతనిఱొమ్ము
గుఱిపెట్టి విడిచె నెక్కుడుకోపమున మహాబలుఁడు శ్రీరాముండు, కలువకంటి!
యతివేగవంతమ్ము నశనిసన్నిభము నౌ నాయంబకం బేఁగి యవనితలము
కంపింప వైరివక్షంబును భేదించె దాన నాతం డురుధ్వానమునను

గీ. మీఁది కెగిరి యంతట నేలమీఁదఁ గూలి, శవముఁ బోలె ముహూర్తము సంజ్ఞదక్కి
యుండి, యాపయిఁ జేతన నొంది కనులు, విచ్చిచూచెనంతలో విస్మయముగ.

సీ. ఎడమచేత ధనుస్సుఁ గుడిచేత బాణమ్ముఁ బట్టి వల్కలములు గట్టి జడలు
ముకుటమ్ముగాఁ జుట్టి ప్రకటవక్షమ్మున వనమాలికాభూష వఱలుచుండ
నతిసత్త్వసుందరాయతభుజంబులు నవదూర్వాదళాంచితద్యుతియు మిగుల
రవిపుత్రుఁడును సుమిత్రాసుతుండును నిరుప్రక్కల సేవింపఁ బంకజముల

గీ. వంటికన్నులవాఁడు వెన్నంటి తన్నుఁ, గొలుచువారల కూఁత నై నిలుచువాఁడు
మోహనాకారుఁ డగురామమూర్తి గాన,వచ్చె నగ్రతలంబున వారిజాక్షి! ౧౦౫

శరహతుఁ డగువాలి శ్రీరాము నాక్షేపించుట

వ. అట్లు కన్పట్టినసురాసురజేగీయమానుఁ జానకీజానిం జూచి గర్హించుచు మెల్లగఁ గపీంద్రుఁ డిట్లనియె. రామా! న న్నిట్లు నిహతుం జేయుటకు నేఁ జేసినయపరాధం బేమి? వృక్షషండంబునం దదృశ్యుండ వై యుండి నాపై శరప్రయోగంబు చేయుటఁ జూడ క్షత్రియధర్మం బెఱుఁగక యిట్టియకృత్యమునకుం బాలుపడితి వని తెల్ల మగుచున్నది. ౧౦౬

సీ. దొంగతెఱంగున సంగరం బొనరించి, యేమి కీర్తిని గడియింపఁ గలవు?
మనువంశమందుఁ బుట్టినక్షత్రియుఁడ వేని, నీవు నా కెదు రయి నిలిచి కయ్య
మొనరించి శత్రుల నొంచెదివాఁడ వీసీ? లేఁతపని యిటు చేసినావు;
తపనపుత్రుఁడు త్రవ్వి తల కెత్తినది యేమి? యే నాచరింపని దేమి చెపుమ?

గీ. రామ! నీ భార్య దండకారణ్యమందుఁ, బంక్తికంఠునిచే హరింపఁ బడె ననియుఁ
ద న్నిమిత్తము భాస్కరతనయుని శర,ణొందినా వనియును వినియున్నవాఁడ.

చ. సకలజగమ్ములం గడుఁ బ్రశస్తికి నెక్కిన నా బలం బొకిం
చుకయు నెఱుంగ వయ్యెఁ; యిటు చూడుము నేను దలంచికొన్న నో
సకులు ససైన్యు సాప్తు దనుజప్రభు బద్ధునిఁ జేసి లంకతో
నొకత్రుటిలోన నీయెదుట నుంచెడివాఁడను మాట లేటికిన్. ౧౦౯

గీ. ధర్మశీలుండ వని ధరాతలమునందుఁ, బొగడఁ బడుచుంటి విదియేమి బుద్ధి నీకుఁ?
గోఁతిని వాత మ్మొనర్చి కిరాతు భంగి, నేమి ధర్మ మార్జించెదు రామ! చెపుమ?.

క. "నిను భజింపఁగ నే నీ,పనికిం బూనితి" నటంచుఁ బల్కుడు పన్నక్
దినరాదు కోఁతిమాంస, మ్మనఘా! యిఁక నన్నుఁ జంప నగుఫల మున్నే ?.

ఉ. పుట్టితి సూర్యవంశమునఁ, బుణ్యవిదేహనృపాలుపట్టిఁ జే
పట్టితి విందుహరాళి విలు భగ్న మొనర్చి, కుమారతాదశన్
ధట్టుఁ డటంచుఁ బేర్వడితి తాటక గీటడఁగించి, యిట్టి నీ
వెట్టులఁ జెట్లలో నొదిగి వేసితి బాణముఁ? జెప్పు మిన్నిరో; ౧౧౨

రాముఁడు వాలియాక్షేపమునకు సమాధానముం జెప్పుట

వ. అని బహువిధమ్ముల భాషించు కపీంద్రునకు రామచంద్రుం డిట్లను. ౧౧౩

గీ. ధర్మరక్షణబుద్ధిఁ గోదండపాణి, నై చరించుచునుంటి నీ యవనియం, ద
ధర్మశీలునిఁ జంపి స్వధర్మము నెఱ,వేర్చుటయె నాదుపని కపివీర! వినుము. ౧౧౪

సీ. అరయఁ దోఁబుట్టుభార్యయు నాఁడుతోఁబుట్టు వును గూఁతురును గోడలును సమాన
లీ నల్వు, రిందులో నేమె నైనను మూఢబుద్ధిఁ గామించెడిపూరుషుండు
పరమపాతకి; వధింపం దగినట్టివాఁ డతఁడు రాజన్యసంతతి, కరణ్య
గోచర! నీవు నాకోటిలోఁ జేరి నీ పిన్నతోఁబుట్టువుప్రియతరుణిని

గీ. గొని బలాత్కారముగ జగజ్జనము తెగడఁ, దమి రమించుచునున్నా వధర్మబుద్ధి
నందుచేత ధర్మజ్ఞుఁడ నైన నేను, ని న్నిటు వధించితిని ధర్మనిష్ఠబుద్ధి. ౧౧౫

గీ. కపి వగుట నీకుఁ దెలియదు గాని; లోక,మును మహాత్ములు సంచారమునఁ బవిత్ర
వంతముగఁ జేయుచుందురు, వారి నెపుడుఁ, దెలియ కిటు లధిక్షేపించి పలుకరాదు.

వాలి శ్రీరాముని బరంధాముని గాఁ దెలిసికొని వినుతించుట

క. ఆవాక్యమ్మును విని ల,క్ష్మీవిభుఁగా రాము నెఱిఁగి మిగిలిన భీతిన్
వేవేగ మ్రొక్కి పలికెం, దా వానరవల్లభుం డతంద్రితభక్తిన్. ౧౧౭

క. పరమేశ్వరునిఁగ నిను నే, నెఱిఁగితిని మహానుభావ! యిపు, డింతకు ము
న్నెఱుఁగక పలికినపలుకులఁ, గరుణ క్షమింపంగవలయుఁ గరుణాభరణా! ౧౧౯

గీ. అనఘ! నాభాగ్య మే మని యందు? నీ నిశితకలంబకహతి విశేషించి యుష్మ
దీయసన్నిధిఁ బ్రాణముల్ వాయుచుంటిఁ, దలఁప మునిదుర్లభము భవద్దర్శనంబు.

చ. పరవశుఁ డయ్యు నేయనఘపావననామము సంస్మరించుచున్
మరణముఁ జెంది మానవుఁడు మానితమోక్షపదంబుఁ గాంచు? న
ప్పరముఁ బ్రసన్నరక్షణుఁ గృపాళుని నిన్ను మదగ్రభూమి ని
ట్లరసినవాఁడఁ జచ్చుసమయంబున నింకఁ గొఱంత గల్గునే? ౧౨౦

సీ. నిన్నాదిపురుషుఁ డౌ నీరజోదరుఁగా, సీతను మంగళాకృతిఁ దనరు లక్ష్మిఁ
గాఁ దెలిసితిఁ, బద్మగర్భుండు వేఁడ దశాస్యుని వధియింప నవతరించి
నా వీ విధంబున, దేవ! నీపదమునకై పోవుచున్నా నా కానతిమ్ము
పసివాఁడు మత్తుల్యబలుఁ డంగదుఁడు గలఁ డతనిపై దయ యుంచు మనఘచరిత!

గీ. తాపహర మగుమీచేతఁ దాఁకి తనువు, ఱొమ్మున న్నాటుకొన్న బాణమ్ముఁ బెఱుకు
మింతకంటెఁ గావలసిన దేమి లేదు, జానకీకామ! రాక్షసజనవిరామ! ౧౨౧

వాలి స్వస్వరూపముం బడయుట

క. అనవుడు రాముం డట్లే, యని శరముం బెఱికి మేను హస్తమున స్పృశిం
చెను, దోడనె కపిరూపము, వనచరపతి దొఱఁగి యమరవల్లభుఁ డయ్యెన్. ౧౨౨

చ. అలరఘుపుంగవోత్థితశరాభిహతుం డయి వాలి చంద్రశీ
తలము సుఖాకరంబు నగుతన్మృదుపాణి విమృష్టదేహుఁడై
యలరి, యనన్యలభ్యము మహామునిలోకదురాప మైన ని
స్తులపద మొందె భానుజుఁడు చోద్యపడన్, గిరిరాజనందనీ! ౧౨౩

క. పరమాత్ముఁ డైనసీతా, వరుచే బవరమునఁ గూల వానరపతి, వా
నరు లందఱుఁ గిష్కింధకుఁ, బఱుగెత్తిరి కాల్గొలంది భయవిహ్వలు లై. ౧౨౪

గీ. పరుగు వాఱి తారను జేరి పల్కి రిట్టు, లో మహాభాగురాల! సంగ్రామసీమ
వనచరేంద్రుండు హతుఁ డయ్యె వగచు టుడిగి, కొడుకు నంగదు రక్షించికొనఁగదమ్మ!

సీ. సచివులందఱకు నాజ్ఞాపింపు మిఁక జాగు దగదు కోటకు నాల్గువైపులందుఁ
గలనాల్గువాకిళ్ల తలుపులు మున్నగువానిని మూయించి పట్టణంబు
రక్షించికొందము రాజ్ఞి! యంగదు రాజుఁగాఁ బ్రతిష్ఠింపుము కపుల కెల్ల,
నావుడుఁ దార, వానరనాథు నిహతుఁగా వినినతోడనె శోకవివశ యై క

రముల వక్షమ్ము శిర మధికముగ మోఁది
కొనుచు దుఃఖించె "రాజ్యంబు కొడుకు రాజ
ధాని ధనమును నా కేల? ధవునితోడ
నిపుడ పోయెద" ననుచు మృగేంద్రమధ్య!. ౧౨౬

తార పతిమృతికి దుఃఖించుట

వ. ఇ ట్లేడ్చుచు నప్పుడంతుక విడివడిన కేశపాశమ్ముతో, వికల మైనచిత్తమ్ముతో, వివర్ధమానశోకమ్ముతో, జీవితేశ్వరుని కళేబరం బున్నచక్కటికిం బోయి, నెత్తుటం దోఁగి ధూళిం గప్పఁబడిన యహితగహనకీలి యైనవాలిం గాంచి గుండియ వగులఁ నాథా! నన్నుం బాసిపోయితే; యని తత్పదంబులపయిం బడి యాక్రందించుచు ముం దున్న రఘునందనుం విలకించి యి ట్లనియె. ౧౨౭

క. ఏ శరమున నిమ్మహితుఁ గ, తాసుం గావించినావొ; యాశరమున నీ
తేశా! నన్నుం జంపుము, భాసితిసాలోక్యసుఖము పడయఁగ నేర్తున్. ౧౨౮

సీ. నాభర్త సర్వదా నన్నుఁ గోరుచునుండు, నేను లేకున్న స్వర్గాన నైన
సుఖపడఁ డాతఁ డించుకయు, భార్యావియోగమ్మునఁ గలుగు దుఃఖమ్ము నీకు
ననుభవమే కదా? యనఘాత్మ! విభునకుఁ దడయక న న్నిమ్ము, దానివలన
నీకు లభించుఁ బత్నీదానఫల మసి సుగ్రీవు ది క్కయి సుదతి పలికె.
గీ. సవితృనందన! నాపతిం జంపి నీకు, భానుకులుఁ డిచ్చినట్టిసాపత్న్యవర్జి
తం బయినరాజ్యమును రుమాతన్విఁగూడి, సుఖముగా నేలికొను మింక సుఖవిగమ్ము.

రాముఁడు తారను దత్త్వోపదేశమునఁ దేర్చుట

వ. అని పలుతెఱంగులఁ బలవించుతారను దత్త్వజ్ఞానోపదేశంబున నాశ్వాసింప నెంచి మహామనస్కుం డగురాముండు దయతో నిట్లను. భీరురాలా! దుఃఖంబున కవిషయుఁ డగుభర్తను గూర్చి వ్యర్థముగ నేల దుఃఖించెదవు. నీ పెనిమిటి యీదేహమా? లేక దేహముకంటె భిన్నుఁ డగుజీవుఁడా? యథార్థముగఁ జెప్పుము. దేహ మనఁగాఁ బంచభూతస్వరూపంబును జర్మమాంసరుధిరాస్థిమయమ్మును గాలకర్మ గుణసంపన్నంబును నై యున్నది. అట్టి హేయ్యవస్తువు నీకుం బ్రీతివిషయ మె ట్లగు? ఒకవేళ. ౧౩౦

గీ. ఈశరీరమె నాజీవితేశుఁ డనుచు, వనజనేత్ర! యంగీకరించినను శోక
మందవలసినపనియె లేదది యిపుడును, నీసమక్షమునందుఁ గాన్పించుచుంట.

సీ. అటుగాక, జీవుని నాత్మఁగాఁ దలఁతువేని; భామిని! యతఁడు నిరామయుండు
జననంబు నొందఁడు చావఁడు నిలువఁడు సర్వగతుండు నాశనము లేని
వాఁ డొక్కఁ డై యెప్పవాఁ డద్వితీయుండు షడ్భావదూరుఁ డసంగుఁ డమలుఁ
డానందమయుఁడు బుద్ధ్యాద్యగోచరవర్తి, కాంత! యాకాశంబు కరణి నంటు
గీ. లేని వాఁడు, నిత్యుండు విజ్ఞానమయుఁడు
పురుషుఁడును స్త్రీయు మఱియు నపుంసకుండుఁ
గానివాఁడు నిర్మలుఁ డట్టివానిఁ గూర్చి
శోక మొందకు మాతఁ డశోచ్యుఁ డబల!. ౧౩౨

వ. అనవుడు వాలియిల్లా లిట్లను. రామా! దేహము కట్టెవలె జడ మనియు, జీవుఁడు నిత్యుఁడును జ్ఞానస్వరూపుఁ డనియుఁ జెప్పితివి. అట్లయిన నీ సుఖదుఃఖాదికము గలవాఁ డెవ్వఁడో; తెలియఁ బడ కున్నాఁడు. నన్ననుగ్రహించి నా కీయర్థంబు దేటపడం దెలుపు మన రాముం డి ట్లనియె. దేవీ! దేహేంద్రియములపట్ల "నేను దేహమను, నావి యింద్రియము"లను నహంకారమమకారంబు లుండునంతవఱకు నవివేకి యైనజీవునకు సంసారము గలుగుట నిశ్చయము. విషయంబుల స్మరించు వానికిఁ గలయందుఁ గన్నట్లు తత్తద్విషయప్రాప్తి జాగ్రదవస్థచేఁ దక్కి తినయుం తఁ దా నివర్తింప న, ట్లజ్ఞానబలమున నీ యహంకారమమకారాదిసంబంధముచే మిథ్యగా నారోపింపఁ బడినసంసారము జ్ఞానమునం దక్క స్వయముగ నశింపఁ జాలదు. రాగద్వేషాదిసంకుల మయినసంసారము యథార్థ మైనది కాకున్నను ననాది యగునవిద్యాసంబంధంబునను దత్కార్యము లయినశరీరాదులయందలి యహంకారమువలనను సంభవించుచున్నది. కాంతామణీ! యంతఃకరణమే సంసారమునకు మూలకారణము. సుఖదుఃఖభోగరూప మైనబంధన మద్దానికే కలుగుచున్నది. జీవుఁడు మనస్సుతో నైక్య మంది దానికిని దనకుం గలభేదముం దెలియఁజాలక, యదియే తా నని భ్రమపడుటంజేసి తన్నిష్ఠము లయినసుఖదుఃఖ భోగము లొందుచున్నాఁడు. ౧౩౩

సీ. అరుణత్వ మాదిగాఁ బెరరంగు లెవియు నిక్కంబుగఁ దనయందుఁ గలుగకున్న
ధవళస్ఫటిక మలక్తకముఖవస్తుసంతతిసమీపము నొంది తత్తదుచిత
వర్ణాకృతిం దోఁచు వైఖరి, జీవుఁ డింతైన సంసృతిగోష్ఠి లేనివాఁ డట్టిఁ
డయ్యును బుద్ధీంద్రియాదులకడ నుండు కారణంబున నటఁ గలుగు నట్టి
గీ. సంసరణము తనకుఁ గలచందముననుఁ, దోఁచుచున్నాఁడు తొయ్యలి! దూరదృష్టి
నరయుచో నొకపరమాణు వంత యైన, నంట దీభవమాలిన్య మాత్మ కెపుడు.

వ. జీవుఁడు తనయుపాధి యగునంతఃకరణమును గ్రహించి, తద్ధర్మము లైనరాగద్వే
షాదులను సేవించుచు, సత్త్వరజస్తమోగుణబద్ధుఁడై పరవశత్వమున సంసార
మును బొందుచుండెడి. ఇదియుఁ గాక యతండు మొదట మనోగుణంబుల నూఁది
తదుపరి గుణానురూపముగ బహువిధము లయినసాత్త్వికరాజసతామసకర్మ
ములం బొంది, యాపయిం గర్మానుగుణ్యంబు లగునుత్తమమధ్యమాధమలోకం
బులఁ గాంచుచున్నాఁడు. ఇట్లు జీవుండు కర్మవశుండై ప్రళయ మగుదనుక జనన
మరణాదులఁ జెందుచుంట సిద్ధము. ౧౩౪

గీ. కర్మములఁ గర్మజన్యసంస్కారములను, బద్ధుఁడై జీవుఁ డెంతయుఁ బ్రళయమం ద
నాద్యవిద్యావిలీనత్వ మంది యుండు, నిందు సందియపడవల దిందువదన!. ౧౩౫

గీ. లీన మైయుండి యావిధి లేమ! సృష్టి, కాలమునఁ బూర్వవాసనాకలితమాన
సములతోఁ బుట్టు మరల నీసరణి సవశుఁడై కులాలచక్రము పోల్కి నతఁడు దిరుగు.

సీ. పుణ్యావశమున నెప్పుడు నాదుభక్తులు శాంతచిత్తులు నగుసత్పురుషుల
సఖ్యమ్ము దొరకు నాసమయంబునను భక్తి యుదయించు నాయందు నుత్పలాక్షి!
యాపయి దుర్లభ మగుమత్కథాశ్రవణాసక్తి, క్రమముగా నబ్బు నంతఁ
గష్టమ్ము లేకయ కలుగు మద్రూపవిజ్ఞానమ్ము, పిదప నాచార్యకరుణఁ
గీ. దత్త్వమస్యాదివాక్యతాత్పర్య మెఱిఁగి,
యాద్య నానందరూపు దేహాదిభిన్ను
నద్వయుని సత్యు నాత్మను స్వానుభవము,
వలనఁ దెలిసి తోడనె ముక్తి వడయఁగలఁడు. ౧౩౭

గీ. అతివ! సత్యంబు దెల్పితి నస్మదుక్త, మైన దీని నాలోచించు ననవరత మె
వండు; సంసారదుఃఖముల్ వానినెట్టి, సమయమం దేని బాధింపఁ జాలవు సుమి.

క. పరిశుద్ధహృదయ వై సుందరి నే నెఱిఁగించినట్టి తత్త్వమును సమా
దరమునఁ దర్కింపుము, నిన్నొంపరయావు దుఃఖములు కర్మపుంజము దొలఁగున్.

సీ. తొంటిపుట్టువున నతుల్యమహాభక్తి నాయెడఁ జూపఁజాలితి పడఁతిమిన్న!
దాన నీ కీనాఁడు దర్శనం బిచ్చితి మునిదుర్లభం బగుముక్తి గలుగ,
ననిశంబు నారూపు ధ్యానించి నేఁ దెల్పినట్టిమార్గమ్ము ననన్యబుద్ధి
మననంబు సేయుము మానిని! దేహధారణకు నవశ్యకర్తవ్యము లగు,
గీ. పనులు నీ వొనర్చినను దత్ఫలము లయిన
పాపపుణ్యముల్ నిను స్పృశింప వని పలుక,

విని సమగ్రముగాఁ దార విస్మిత యయి
గౌరి! దేహాభిమానదుఃఖమును బాసె. ౧౮౧

వ. అట్లు వానరస్త్రీ యయ్యును బరమేశ్వరుం డగురఘూత్తముని సమాగమము క్షణ
కాల మొందినమాత్రం గలిగినయాత్మానుభవమున కలరి, తదీయపాదారవిం
దంబులకు వందనం బాచరించి, యనాది యగుసంసారబంధంబునుండి విడివడి
నిర్మలమానసమ్మున జీవన్ముక్తురా లయ్యె, అంత సుగ్రీవుండును. ౧౮౨

సుగ్రీవుం డంగదునిచే వాలి కుత్తరక్రియలు జరిపించుట

గీ. దాశరథివక్త్రనిర్గతతత్త్వవిషయ,మఖిలము సమాదరంబున నాలకించి
విగళితాజ్ఞానపటలుఁడై యగజ! స్వస్థ,చిత్తమున నుండె నప్డు రఘూత్తముండు.

సీ. మృతుఁడైనతండ్రికి సుతుఁ డొనర్చెడిపారలౌకికక్రియ లఖిలంబు నేఁడు
చేయింపు మంగదుచేత మీయన్నకు నపగతాసునకు నాయాజ్ఞఁ జేసి
శాస్త్రచోదిత మగుసరణి, నావుడుఁ బ్రొద్దుపట్టి సమ్మతిఁ జెంది, బలయుతులును
గడుముఖ్యులును నగుకపులచే సకలరాజోపచారములతో నులివు మిగులఁ

గీ. బుష్పకవిమానవాహనమ్మునయి సన్న,నెత్తిపెట్టించి ప్రెగ్గడ లెల్లపౌరు
లంగదుఁడు తారయును విప్రు లరుగుదేర,సరిగ నిఖిల మ్మొనర్చెఁ బ్రయత్న మొప్ప.

గీ. స్నాన మొనరించి జానకీజానిసవిధ,మునకు మంత్రులు వెంటరాఁ బోయి, తత్ప
దాంబుజంబుల కెఱఁగి హృష్టాత్ముఁ డగుచు, ననియె నీరీతి సుగ్రీవుఁ, డచలతనయ!

సీ. రాజేంద్ర! వానరరాజ్యంబు సర్వసమృద్ధిమంతము నీవ యేలు మింక
దాసుండనై సుమిత్రాసుతువైఖరి బహుకాల మేను మీపాదయుగము
సేవించుచుండెద, నావుడు జానకీపతి చిఱునగవునఁ బలుకు, మిత్ర
మా! భేద మున్నదే మనలోన మనకు? నేనే నీవు సందియ మేమిలేదు.

గీ. అరుగు మిఁక నాలసింపక, యస్మదాజ్ఞ, భవ్యవానరరాజ్యాధిపత్య మూను
మీవ స్వాయముగ నభిషేక మొనసి; యేను,రాను బదునాలుగేండ్లు పురంబు చొరఁగ.

క. నా తమ్ముఁడు లక్ష్మణుఁ డిదె, నీతో రాఁ గలఁడు పురి కనిందితచరితా!
ప్రీతిగ నభిషేకింపుము, భ్రాతృతనయు నంగదు యువరాజపదమునన్. ౧౮౩

వ. నే నీసమీపంబునం గలకొండపయిం దమ్మునితో వర్షర్తు వేఁగువఱకు నివసింతు.
నీవును గొంతకాలము నగరంబున నిలిచి పిమ్మట సీతాన్వేషణమునకుఁ బ్రయ
త్నింపు మనుడు, సుగ్రీవుం డది విని తదీయపదపంకేజంబులకు సాష్టాంగదండ
ప్రణామంబు సేసి, దేవా! మీ యానతి యెట్లట్ల సలుపంగలవాఁడ నని తదను

మతిం బడసి సౌమిత్రితోఁ గిష్కింధకుం బోయి, యందు రామాజ్ఞానుసారంబుగ సర్వంబు నిర్వర్తించె. అంత లక్ష్మణుండు తపనతనయుచేఁ దగుభంగిం బూజితుండై తత్పురమ్ము వీడి రయంబున నన్నసన్నిధి కరుదెంచి కృతప్రణాముఁడై కొలిచి యుండె. సీతాకాంతుండును. ౧౪౮

రాముఁడు ప్రవర్షణాచలము పై వసించుట

సీ. అనుజునిఁ గూడి యెత్తై విశాలం బయి పరఁగు ప్రవర్షణగిరిశిఖరము
నకుఁ జని యందు సుందరమును వర్షవాతాతపసమానంబు నతిసమీప
వర్తితఫలమూలవంతంబు దీప్తిమంతమ్మును స్ఫటికమయమ్ము నైన
యొకగుహం గని తమయునికి కయ్యది యోగ్య మైనదిగా మదియందుఁ దలఁచి
గీ. మౌక్తికోపమజలపూరమహితపల్వలంబు ఘనపుష్పమూలఫలంబుఁ జిత్ర
వర్ణమృగపక్షిగణసముత్కీర్ణము నగు, తన్నగంబున వసియించెఁ దలిరుఁబోఁడి.

గీ. అలఘుమణిమయగుహలందు ననుజుతో విలాసముగ సంచరించుచు, లలితపక్వ
మూలఫలములఁ దినుచు సమ్మోదమునను, గడపెఁ బ్రావృడ్దినమ్ము లా గట్టుమీఁద.

సీ. నిర్ఘోషములు మధ్య నిగుడఁ దటిల్లతల్ గర్భమ్ములందుఁ బొంకమ్ముఁ జూప
గాలితాఁకుడు చేతఁ గదలెడిజలపూరితాభ్రముల్ కనకమయంబు లైన
పృష్ఠాస్తరణములు బృంహితంబులు గలగజయూధములవలెఁ గానిపించి
యచ్చెరువుం గూర్చె నవనిజాభర్తకుఁ, జెలువారు లేఁతపచ్చికను మేసి
గీ. మొరను దిని పుష్టిఁ గని ముద మొనసి లేళ్లు, ఖగము లంతట నుఱుకుచుఁ గని రఘుప్ర
వీరుఁ జక్కఁగఁ గన్నులు విప్పి కదల,కుండె ధ్యాననిష్ఠులు మునులో యనంగ.

చ. కొని మనుజాకృతిన్ ధరణిఁ గొండలఁ గానల సంచరించు నే
వ్వునిఁ బరమాత్ము రాముఁ దమబుద్ధి నెఱింగి సమస్తసిద్ధులున్
ఘనమృగపక్షిసంఘములుగా జనియించి భజించి రవ్విభున్,
వనజదళాక్షి! యంత నొకనాఁడు సుమిత్రసుతుండు భక్తి మై. ౧౫౨

లక్ష్మణుఁడు కర్మమార్గమును గూర్చి రాముని బ్రశ్నించుట

వ. ఒక్కెడ నొక్కఁడ ధ్యానతత్పరుం డై యున్నయన్నను డాసి సమాధి చాలించిన తోడనె ప్రణమిల్లి, ప్రణయమ్మునం జేసి సవినయమ్ముగ ని ట్లనె. స్వామీ! మున్ను మీ రెఱిఁగించినగీతలవలన నా మనంబునం గల యనాది యగునజ్ఞానం బునం బొడమినసంశయమ్ము మూలముట్టుగ నశించె. ౧౫౩

గీ. కర్మమార్గంబుచేత జగమ్మునందు, యుష్మదారాధనమ్మును యోగిజనులు
సల్పు టెవ్విధమునన్నో; యాచంద మిపుడు,విన మన స్సయ్యెఁ దెల్పుము,విశ్వవంద్య !.

సీ. ఇదియ మోక్షమునకు హితసాధనం బని యెప్పుడు యోగులు చెప్పుచుండ్రు,
వ్యాసనారదవారిజాసనాదులు సైత మారీతిఁ బల్కుదు రప్రమేయ !
ముక్తి బ్రహ్మక్షత్రముఖ్యవర్ణములకు నెల్లయాశ్రమములకిచ్చునదియు
లలనలకును శూద్రులకు సులభముగ మోక్షోపాయ మైనదియు నగుతావ
గీ. కీనపూజావిధాన మనూనభంగిఁ, జెప్పు మఖిలోపకార మై చెల్లునట్లు
దయను దమ్ముండ భక్తుండ నయిన నాకు, నాపు డీగతిఁ బల్కె సీతావిభుండు.

రాముఁడు లక్ష్మణునకుఁ దన్నర్చించువిధమును జెప్పుట

వ. అనుజా ! మత్పూజావిధానంబు ప్రసిద్ధంబును ననంతమ్ము నై యొప్పు. అయినను
దెలియం గోరితివి గాన సంగ్రహమ్ముగ నామూలాగ్రముగ వినిపింతు వినుము.

సీ. తన దగుగృహ్యసూత్రమునందుఁ జెప్పినసరణి మానవుఁ డు ద్విజత్వ మొంది
మద్భక్తియుక్తుఁ డై మంచిగురుని శ్రద్ధ దర్శించి నాదుమంత్రమును బడసి
యాయన చెప్పినయట్లు మెలంగుచు నిర్మలమతి నహర్నిశము నన్నె
యర్చింపవలె, నగ్నియం దైన సూర్యుని యం దైనఁ బ్రతిమాదులందు నైనఁ
గీ. జిత్తపద్మమం దైనఁ బూజించు టొప్పు, మాని సోమరితనము, కుమార! మఱియుఁ
జేయఁదగును సాలగ్రామశిల నయినను, బూజ సలుపంగఁబూనిన పూరుషుండు.

క. తనశుద్ధికొఱకు మృల్లేపన మాదిగఁ గలుగుస్నానపద్ధతిఁ దీర్పం
జను వేదపురాణోదిత, ఘనమంత్రంబుల నుపస్సు గదిసినవేళన్. ౧౪౯

గీ. అంత బుధుఁ డగువాఁడు సంధ్యాదినిత్య,విధి ముగించి, పై నెంతయు విమలబుద్ధిఁ
గర్మసిద్ధికిఁగాను సంకల్ప మొనరు,పఠవలయు మొట్టమొదట, నిష్పాపహృదయ!

వ. తదుపరి నేనే యనుబుద్ధిఁ దనగురుని భక్తిమైఁ బూజింపవలయు. సాలగ్రామశిలయం
దభిషేకంబును, బ్రతిమాదులయందుఁ బ్రోక్షణమ్మును గర్తవ్యములు. శాస్త్ర
ప్రసిద్ధము లగుగంధపుష్పాదులఁ గావింపఁబడునాపూజ సిద్ధిదాయిని యై చెల్లు.
దంభవర్జితుం డై గురూపదిష్టమార్గమ్మున మదీయపూజావ్రతపరతంత్రత మెలంగి
యజించుట సమంజసంబు. ౧౫౦

సీ. గరిమతో నెంతె చక్కగ నలంకృతి విగ్రహములకుఁ జేతురో; యంతప్రియము
నాకుఁ గల్గును గులనందన! యగ్నియం దర్చించుచో వేల్వ నఘ హవిస్సు

చే, రవియందుఁ బూజించుపక్షమున సంస్కృతభూమి యోగ్యంబు కేవలంబు,
శ్రద్ధతో నాభక్తజనుఁ డొసంగునవి నీ కెల్లను దృప్తిసేయంగఁ జాలు,
గీ. నన్ను; నిఁక గంధపుష్పాక్షతాదికమును, భక్ష్యభోజ్యాదికమును జెప్పంగ నేల?
పూజ నొనరించువాఁడు మున్ముందు వేయు,నెల్లద్రవ్యంబులను గడియించి పిదప.

గీ. ధరణి దర్భాసనము వైచి దానిమీఁదఁ, బఱచి కృష్ణాజినముఁ దానఁ బఱచి వస్త్ర,
మమలమతి దేవునెదుట నయ్యాసనమునఁ, గూరుచుండంగవలయు నకుంఠితగతి.

వ. అట్లాసనాధిష్ఠితుఁ డై యకారాదిపంచాశద్వర్ణములచే బహిర్న్యాసమును నాంత
రన్యాసమును గావించి, యనంతరమునఁ గేశవాదిచతుర్వింశతినామములతో
న్యాస మొనర్పవలయు. ఆమీఁదఁ దత్త్వన్యాసమును నిర్వర్తించి, పైని గ్రమముగ
విష్ణుపంజరన్యాసమును మంత్రన్యాసమును జలుపఁదగు. ప్రతిమలు మున్నగువాని
యందుఁ బ్రతిదిన మతంద్రితుఁ డై పూర్వోక్తసరణి న్యాస మాచరించుట విధియై
యొప్పు. ౧౬౩

క. తనయెదుట వామభాగం,బునఁ గలశము నుంపవలయుఁ, బుష్పాదికముం
దనకుఁ గుడివైపు నిలుపం,జనుఁ బూజాకాంక్ష నున్నజనుఁడు, కుమారా! ౧౬౪

క. క్రమముగ నర్ఘ్యమునకుఁ బా,ద్యమునకు మధుపర్కమునకు నాచమననిమి
త్తముఁ దనకడ నాలుగు పా,త్రము లుంచుకొనంగఁ జనును, దళితారికులా! ౧౬౫

క. భానునిగతి నిర్మల మగు, మానసకమలమున జీవమర్యాదను బా
ల్పా నాకళ ధ్యానింపం,గా నగుఁ దద్వ్యాప్త మాత్మకాయం బనుచున్. ౧౬౬

క. ప్రతిమాదులయందును దద్గతి నావాహనము చేయఁగా వలయు ననా
రతము మదీయకళఁ జే,ఱుతలఁపు లేకుండఁ దన్నిరూఢాత్మకుఁ డై. ౧౬౭

చ. అనుదిన మర్ఘ్యపాద్యముల నాచమనాదుల స్నానవస్త్రలే
పనముల భూషణంబులను వాడనిపూవులఁ బూజ సేయఁగాఁ
జను, నటు గాకయున్నఁ దనశక్తి కొలందిగఁ ద్యక్తదంభుఁ డై
యనుజ! హితోపచారముల నర్చితుఁ జేయఁగఁ బోలు నన్నిలన్. ౧౬౮

సీ. ధనవంతుఁ డేనిఁ జందనకుంకుమాగరువులతోడఁ బచ్చకప్పురముతోడ
మంగళకరము లై మంచివాసన గల్గుపూలతోడను మంత్రపూర్వకముగఁ
బూజింపవలె నిత్యమును, ధూపములచేత నైవేద్యములచేత నవ్వరుచులఁ
బొలుచునీరాజనములచేత విరివిగఁ జలుపంగఁ దగు ఘటజన్మసంహి

గీ. త్రోదితదశావరణపూజ, సోదర! విను, మీశ్వరుఁడ నేను, నాకు నహీనమోద
కారణము శ్రద్ధ,యయ్యది గలమనమున, నఖిలము మదర్పణమ్ముఁ జేయంగవలయు.

సీ. మంత్రకోవిదుఁడు హోమముఁ బ్రయత్నమున విధ్యుక్తభంగిని జేయు టొప్ప ననఘ!
ఆగమవిత్తముఁ డగువాఁడు హోమంబుఁ గుంభజోదితరీతిఁ గుండమందు
మూలమంత్రముననో; పురుషసూక్తముననో; లలిఁ దీర్పఁగావలె, లౌకికాగ్ని
యందైన నౌపాసనాగ్నియందైన హవిస్సుఁగాఁ జరువును వేల్వఁ దగును
గీ. మేల్మిబంగారువన్నె నెమ్మేను గల్గి, దివ్యభూషణాలంకృతిఁ దేజరిల్లు
నన్ననలమధ్యవర్తిఁగా నెన్ని హోమ,కాలమున ధ్యాన మొనరింపఁగావలయును.

వ. పిదపఁ బార్షదుల కెల్లరకు బలి నిడి, హోమశేషంబు పూర్తిసేయునది పదఁపడి
నన్ను ధ్యానించుచు వాఙ్నియమంబున మదిలో మంత్రమును స్మరించుచుఁ గమ్మని
తావి గుబులుకొనుకర్పూరాదులం జేర్చిన తాంబూలంబు ముఖార్పణంబు సేసి ప్రీతి
యుక్తుఁడై జపించునది. ౧౭౧

గీ. అస్మదర్థము స్తోత్రపాఠాదికమును, నృత్తగీతాదికము నాచరింపఁ జనును
మానసమ్మున నను నిల్పి మహిఁ బ్రణామ, మాచరింపంగఁ దగును దండాకృతిగను.

సీ. ఏ నిచ్చినట్లుగా నెద నెంచి భావనామయ మలభ్యం బగుమత్ప్రసాద
మును శిరంబునఁ జేర్చికొని కరంబుల నస్మదంఘ్రియుగ్మముఁ దలయందు నునిచి
"నను ఘోరసంసారముననుండి రక్షింపు" మని పల్కి మ్రొక్కంగ నగును సుజనుఁ,
డామీఁద మును బోలె నల్ప్రత్యగాత్మను ధ్యానం బొనర్చు చుద్వాసనంబు
గీ. చేయునది లక్ష్మణా! యేను జెప్పినట్టి, రీతిఁ దప్పక నన్ను నర్చించుసుకృతి
యుభయలోకసంసిద్ధిఁ దా నొందఁగలఁడు, నా యనుగ్రహమున జగద్ధ్యేయసరణి.

క. దినదినమును నాభక్తుఁడు, ననుఁ బైవిధమున యజించినం దప్పక పొం
దును మత్సారూప్యమ్మును, ననుఁగుందోఁబుట్టు! సందియము లే దిందున్. ౧౭౪

వ. రహస్యమై యుత్తమమై పరమపావనము నై యనాదిగ యోగిజనానుష్ఠితంబై
యొప్పునదియు స్వయముగ నాచేఁ జెప్పఁబడినదియు నయినయీపూజావిధాన
మును సదా పఠించువారికిని వినువారికిని బూజాఫలంబు సర్వంబు సంప్రాప్తించు
నని పరమాత్మ యగురాముండు శేషాంశసంభూతుండును మహానుభావుండును
నిజభక్తుండు నగుసౌమిత్రి యడుగ సర్వోత్తమం బయినకర్మయోగంబుఁ జెప్పె.

గీ. కాళి! యీరీతిఁ గర్మయోగమును దెలిపి, యంతలో మాయ నూఁది "యే మైథిలి వకట
జానకీ!" యని ప్రాకృతుసరణి నేడ్చి, పలవరించుచు నిద్దుర పడయఁ డయ్యె. ౧౭౬

హనుమంతుఁడు సుగ్రీవునకు హితము నెఱిఁగించుట

వ. ఈ మధ్యలో నటఁ గిష్కింధయందు బుద్ధిమంతుం డగుహనుమంతుండు "నీ కెంతయు
ననుకూలం బయినయొక్క హితం బెఱిఁగింతు, విను" మని కపికాంతునితో
నేకాంతమ్మున ని ట్లనియె. ౧౭౯

గీ. ఒనరుపంబడె నీకు ననుత్తమోపకార మాదిలో జానకీకాంతుచేత
దాని నీవు కృతఘ్నుచందమున మఱచి,నట్లు నాకుఁ దోఁచెడు వానరాధినాథ!.

సీ. నీకొఱ కయి జగదేకవీరుని జగత్ప్రియసమ్మతుని నింద్రతనయుఁ జంపె
రాజుఁగా నినుఁ గపిరాజ్యంబునను నిల్పె దుర్లభురా లగుతోయజాక్షిఁ
దారను బొందితి వారాముకతమున నమ్మహాత్ముఁడు పర్వతాగ్రమందు
వసియించి యూర్మిళావరునితోఁ బెనుచింత నాత్మకార్యము గొప్ప దగుటఁ జేసి
గీ. యరయుచున్నాఁడు నీరాక కనిశ మనిమిషాక్షుఁ డై, నీవొ; సుందరులందుఁ దగిలి
కామభోగైకవాంఛ నొక్కటియుఁ దెలిసి,కొనక యున్నావు;కటకటా; కోఁతి వగుట.

క. సీతాన్వేషణమును నేఁ,జేతు ననుచు మొదటఁ బ్రతిన సేసి, యుపకృతిం
జేతమున మఱచి మిన్నక,యీతీరున నునికి ధర్మువే? కపిరాజా! ౧౮౦

క. ని న్నెంతయు గొప్పగఁ ద,త్సన్నిధిఁ గొనియాడి నీదుసఖ్యంబున కా
యున్నతులఁ దొలుతఁ దెచ్చితి, నన్నా! యిపు డిట్టిచేఁత కాగ్రహపడరే? ౧౮౧

ఆ. అరిని సంహరించి యధిపునిఁ జేసి యా,లిని నొసంగినట్టిఘనుఁడు సఖుఁడు
భార్య వోయి యడవిఁ బలవించుచుండ నీ,వలె నుపేక్షఁ జేయువాఁడు గలఁడె? ౧౮౨

క. "నీమాటమీఁదఁ గాదా, మే మాతనిసఖ్యమునకు మేకొంటి" మటం
చా మహితులు న న్నడిగిన, నే మని వచియింతుఁ జూచు టెట్టులు వారిన్?

క. "పని దీఱె నాకఁ డేటువో,యిన నా కిఁక నేమి" యనుచు నెంచితివో; యే
రును దాఁటి తెప్పఁ గాల్చుట, చన, దిదియునుగాక మొదటిసంగతి వినుమా.

క. ఒకనీస్నేహమె వృత్రాం,తకసుతుఁ జంపుటకుఁ గారణము గాదు నృపా
లకమాళికి; నాతని దుష్టకృతులునుం గారణములు సవితృకుమారా! ౧౮౫

క. వాలివలె నిన్ను నేలం, గూలంగా నేయు, నతనికోల్తల కెవడుం
జాలఁ డనుట తెల్లము, దుశ్శీలుర సైపండు తగినశిక్ష యొనర్చున్. ౧౮౬

సుగ్రీవుఁడు వానరులం బిలువనంప హనుమంతున కాజ్ఞాపించుట

క. అనవుడు భయవిహ్వలుఁ డై,దినకరతనయుండు, మారుతీ! నీ వెఱిఁగిం
చిన దెల్ల నిజము పొరపడి,తిని జా గిం కేల? చేయఁ దివురు మదాజ్ఞన్. ౧౮౭

సీ. పదిదిక్కులకుఁ దగఁ బంపుము పదివేలమందివానరుల, వా రంద ఱేఁగి
తోడితెత్తురుగాక యేడుదీవులలోనఁ జరియించుచెట్టుద్రిమ్మరుల నెల్లఁ
బదునైదుదినములు పరిమితి వెట్టితిఁ గపివీరు లియ్యది గడవకుండ
రావలె, రానివారలు నాకు వధ్యులు, లేదు సంశయ మని, యీఁదపట్టి
ఆ. కాజ్ఞ సేసి యినజుఁ డంతగపురము సొచ్చెఁ, దడయ కపుడె మంత్రితల్లజుండు
పండితుండు నైనపావని పంపించెఁ, దరుచరులఁ దదాజ్ఞ దశదశలకు. ౧౮౮

చ. త్వరపడి వాయుసూనుఁ డటు త మ్మనుపఁగ జని రొక్కమై గుణా
కరులుఁ బరాక్రమాంబుధులుఁ గార్యవిధాయిధురీణు లు
ద్ధురపవమానమానసగతుల్ నృపకల్పితదానమానము
ద్భరితులు వానరోత్తములు పర్వతసన్నిభకాయు లెల్లెడన్. ౧౮౯

రాముఁడు సీత జాడ దెలియమికిఁ జింతిల్లుట

గీ. అచట మణిసానుభూమి శైలాగ్రమందు, నున్న రాముఁడు సీతావియోగజనిత
శోకభరము సహింపఁగా లేక విగతధైర్యుఁ డై పల్కె నంజ సోదరునిఁ జూచి.

చ. అరయుము తమ్ముఁడా! జనకజాత్మజ నాప్రియురాలు రాక్షసే
శ్వరహృత యయ్యె, నేఁటికిని జచ్చినదో; మఱి యేమియైనదో;
యెఱుఁగను, నిశ్చయించుట కొకింతయుఁ జాలకయుంటిఁ, దత్తలో
దరి సుఖవార్త దెల్పెడియతండ సుఖప్రియదాత యీతఁడౌన్. ౧౯౧

సీ. నా తపఃఫలము సాధ్వీతిలకంబు జానకి యెచ్చటైనఁ బ్రాణంబుతోడ
నున్నట్లు దెలిసిన నుఱికి తేఁగలను బయోనిధినుండి పీయూష మట్లు
నా ప్రతిజ్ఞను లక్ష్మణా! విను, కనుగాన కవనీజ నేమూర్ఖుఁ డపహరించి
కొనిపోయె నాతనిం గొడుకులతోడ వాహనములతోడ సైన్యములతోడ
గీ. మామకీనబాణాగ్ని కిధ్మముగఁ జేసి
బూది గావింతు, నాలిఁ గొంపోవ నొకఁడు
రాచకొలమునఁ బుట్టియుఁ జూచు చూర
కొనుటకంటె నైచ్యం బున్నె కువలయమున. ౧౯౨

రాముఁడు సీతావియోగమున కడలుట

వ. అని సీతం దలంచికొని. ౧౯౩

క. దానవునియింట శోకానూనవ్యథ నుంటివా; ననుం గానక చం
ద్రానన! యెట్లోర్చి తయో, ప్రాణంబులు దాల్చి? మనయభాగ్యమ కాదే?.

వ. అనంతరము చంద్రు నుద్దేశించి. ౧౯౫

చ. నిను నుపమించు మోముగలనీరజలోచన సీత దూర మై
చనుటను నాకు భానుసదృశంబుగఁ గన్పడుచుంటి వీవు, త
త్తనువు స్పృశించి ముందుగను దానఁ గడుంగడుఁ జల్లనై సుఖం
బు నిడుభవత్కరాళి నను ముట్టుము చంద్ర! విలంబ మేటికిన్. ౧౯౬

రాముఁడు సుగ్రీవుని కృతఘ్నతకుఁ గోపించుట

వ. అని సుగ్రీవు నుగ్గడించి. ౧౯౭

క. దయమాలి విరహశోకా మయపీడితు దుర్దశానిమగ్నుని న న్నా
రయ కున్న వాఁడు భానుత,నయుఁడును నిదియేటి మేటినాయ మ్మపురా ?. ౧౯౮

సీ. గతకంటకం బగుకపిరాజ్యముం బొంది, కాంతలు గొల్వ నేకాంతమందు
సతతసురాపానరతిఁ జొక్కి యతికాముకుం డయి సుగ్రీవుఁ డుండఁ బోలు,
నట్టికృతఘ్నుఁ డే యూతఁడు గాకున్న ? శరదాగమంబు దా నెఱిఁగియుండి
రాఁ డేల ? నా ప్రియురాలిని వెదుక, న న్నాదుర్యుపకారి భోగాతిశయత

ఆ. మఱచినాఁడు దుష్టమతి, వాలి నె ట్లట్లు,వానిఁ జంపుదును సబాంధవముగఁ,
బాడువడునుగాతఁ బట్టణమ్ము మదీయ,బాణవహ్నికీల రాణ దక్కి. ౧౯౯

లక్ష్మణుఁడు సుగ్రీవునిం జంపఁ బయలు వెడలుట

వ. అనుటయు సూర్మిళాజాని. ౨౦౦

ఉ. ఆవిధి నన్న రుష్టుఁ డగు టారసి, యిప్పుడ నేను బోయి సు
గ్రీవుని దుష్టమానసుని గీటడఁగించి నిమేషమాత్ర నీ
తావర! వత్తు నీదుసవిధంబున కానతి యిం డటంచు సం
ధ్యావిభవానుకారినయనప్రకటీకృతకోపమూర్తి యై. ౨౦౧

క. అమ్ములపొది చాపము ఖడ్గమ్మును జే నంది యరుగఁగా నుంకింపం
దమ్ముని తీవ్రము గని మోస మ్మగునని తలఁచి రామచంద్రుఁడు పలికెన్. ౨౦౨

రాముఁడు లక్ష్మణుని శాంతునింజేసి కిష్కింధకుఁ బంపుట

క. తొందరపడి ప్రియసఖు రవినందను మ్రందింతు వేమొ; నాయన! తగ దా
చందము, బెదిరింపుము "నిన్నుం దునుమఁడె వాలిగతి" ననుచుభయదముగన్.

వ. అ మ్మాట కతం డే మనునదియుఁ దెలిసికొని రమ్ము. మీఁద సర్వమ్మును నేన
చక్కంబెట్టుదు ననుటయు వల్లెయని. ౨౦౪

క. ఘనవిక్రమముఁ డాతఁడు వో,యె నతిత్వరితముగఁ గపుల నెల్లరఁ గ్రోధా
గ్నిని గాల్చువాఁడు బలె గిరి,తనయా! కిష్కింధ కై యుదగ్రాకృతితోన్. ౨౦౬

సీ. ప్రాకృత యగుతనభార్యకై వందుప్రాకృతు నట్లు సర్వజ్ఞుఁ డయ్యు
నెన్నఁడుగాని త న్నెడఁబాసి యుండనికలుములజవరాలు గలిగియుండి
దీపితజ్ఞానస్వరూపుఁ డయ్యును రామభద్రుండు జానకీప్రమదకొఱకుఁ
బలవించెఁ బెక్కురీతుల, గౌరి! మాయఁ దదీయకార్యముల నతిక్రమించి
గీ. నట్టివాఁడు బుద్ధ్యాదుల కరయసాక్షి, రాగముఖ్యవిరహితుఁ డా రాముఁ; డెట్లు
గలుగు నతనికి రాగాదికార్య మయిన,దుఃఖ,మరయంగ నిది మహాద్భుతము సుమ్ము.

క. జలజాసను నుడి నిజముగఁ, జలుపఁగ, దశరథనృపాలచంద్రునకుఁ దపః
ఫల మొసఁగ, మానవాకృతి, జలరుహనాభుండు పుట్టె జగతీస్థలిపై. ౨౦౭

సీ. అందఱు జనులు మాయామోహితాత్ము లై యజ్ఞానవృత్తిఁ జిక్కి రక్కటకట?
వీరికి మోక్ష మేవెరవున లభ్యమౌనని మదిఁ దలఁచి రామాయణాఖ్య
కథను సమస్తలోకమలాపహమును జగంబునఁ దగఁ బ్రకటంబు సేయ
మనుజచేష్టలఁ దగులొ్కని రాముఁ డన వ్యవహారార్థసిద్ధి కై యవసరముల
గీ. మోహమును గ్రోధమును గామమును వలసిన
యట్లు గొనుచు గుణాత్యక్తుఁ డయ్యు గుణగ
ణానురక్తుఁ డో యనుభంగి నాతఁ డబల!
పరవశుల లోకులను మోహపఱచుచుండె. ౨౦౮

వ. దేవీ! యథార్థ మరసిన నతండు జ్ఞానస్వరూపుండును, జ్ఞానరూప మగుశక్తిగల వాఁడును సాక్షియు నైయున్నాఁడు. గుణసంపర్కం బెన్నఁడు నతనికి సంభవింపదు. కావున నాకాశ మెప్పుడు దేనితో నంటకుండు భంగి, రాముఁడును గామక్రోధాదిస్పర్శము లేకయు విరాజిల్లు. ఇత్తెఱఁగున సనకాదిమునివరేణ్యులు, కొంద ఱుమాత్రము శ్రుతివాక్యవిచారంబునం బరోక్షజ్ఞానమ్ము వడసి తదనంతర మపరోక్షజ్ఞానంబు గలిగి, యాత్మసాక్షాత్కారరూప మగునానంద మనుభవించుచు న్నారు, మఱియు. ౨౦౯

క. అమలమతులు భక్తులు ని,త్యముఁ జక్కఁగ నెఱిఁగి యుందు రతనిఁ, దదనురూ
పముగ భగవంతుఁ డజుఁ డు,త్తముఁ డతఁడును దోఁచుచుండుఁ దలిరుంబోడీ!.

లక్ష్మణుఁడు వానరుల భయపెట్టుట

వ. అనంతరవృత్తాంతం బాకర్ణింపు మట్లు శత్రుఘ్నాగ్రజుండు కిష్కింధానగరప్రాంతమున కేఁగి, శాఖామృగవ్రాతంబులు భీతిల్లుభంగి భీషణమ్ముగ జ్యాఘోషమ్ము చేయుటయు. ౨౧౧

సీ. కలఁగి తద్ధ్వనిఁ బామరులు వానరులు కోటబురుజులపై నుండి యరసి యతని
తాలును జెట్లుఁ గరంబులఁ గైకొని కిలకిలారావంబు సలిపి, రంత
సౌమిత్రి తత్కపిసంచలనముఁ జూచి క్రోధతామ్రాక్షుఁ డై గుణము వింటి
కొనకుఁ దగిల్చి శస్త్రనిపాతముల వారి సంహారింపఁగఁ బోవు సమయమందు
గీ. మంత్రిముఖ్యుఁడు వాలికుమారుఁ డంగ,దుఁడు సుమిత్రాత్మజుని నాగతునిఁగ నెఱిఁగి
వచ్చి రయమున వారించి వానరులను, వందన మొనర్చె నూర్మిళావరుని డాసి.

వ. అంతఁ బ్రియవర్ధనుం డగులక్ష్మణుం డతనిం బరిరంభించికొని యి ట్లనియె. ౨౧౩

గీ. రౌద్రమూర్తి యైనరాఘవుఁ డంప ల,క్ష్మణుఁడు వచ్చెననుచు సత్వరముగ
నాదురాకఁ దెలుపు నాయన! మీ పిన,తండ్రికడకుఁ బోయి తడయవలదు. ౨౧౪

వ. అనవుడుఁ దారేయుం డట్లయని యివ్వానం జని. ౨౧౫

క. మనపురివాకిటివెలుపలఁ, గనుఁగవజిగి కెంపుసొంపుఁ గడకొత్తఁగఁ గ్రో
ధనుఁ డై లక్ష్మణుఁ డున్నాఁ,డని సుగ్రీవునకుఁ దెలిపె నద్రికుమారీ!. ౨౧౬

సుగ్రీవుఁడు హనుమంతుని సౌమిత్రికడకుఁ బంపుట

క. అది విని యాతరుచరపతి, మది గలఁగ భయంబుఁ జెంది మంత్రివరుఁ గో
విదు హనుమఁ బిలిచి యనె నం,గదుతో నీ విపుడు వినయకలితుఁడ వగుచున్.

క. చని రామానుజుకడ, కాతని కోపం బుపశమింపఁ దగుపల్కుల నో
య్యనఁ బలుకుచు మనమందిర,మునకుం దోడికొనిరమ్ము పో, మ్మనిలసుతా!.

సుగ్రీవుఁడు లక్ష్మణుని శాంతుం జేయఁ దారను బంపుట

క. అనిచెప్పి పంపి మారుత,తనయుని దినకరసుతుండు తారం గని యో
యనఘాత్మురాల! నీవును, జనుమా కుపితాత్ము నతని శాంతునిఁ జేయన్.

ఆ. మిగుల జాలి వొడముమెత్తనిమాటల, ననునయించి కోప మడఁగఁ జేసి
నంత నాకుఁ జూపు మంతగపురమునకుఁ, దోడితెచ్చి బ్రతుకువాఁడ ననుడు.

వ. అందుల కమ్మందగమన సందేహింపక లక్ష్మణానయనార్థ మటనుండి కదలి మందిర
మధ్యకక్ష్యం బ్రవేశించె, నింతలో హనుమంతుం డంగదాన్వితుం డై దాశరథిని
డాసి భక్తిమై శిరంబు సోఁకఁ బ్రణతి సల్పి స్వాగతంబు వలికి యిట్లనియె. ౨౨౧

హనుమంతుఁడు లక్ష్మణుని బురిలోనికిఁ దోడ్తెచ్చుట

సీ. రారమ్ము జగదేకవీర! మహాభాగ! నిస్సంశయమ్ముగ నీగృహంబు
సొచ్చి తారాదుల శుద్ధాంతకాంతల నినజునిం గని మీఁద నేమి యాన

తిత్తువో; యదియెల్ల నేను గావించెదఁ బరుని చందమున వెల్పలన నిల్చి
మాటలాడుట ధర్మమా? యని భక్తితోఁ గరముఁ బట్టికొని లక్ష్మణుని బురము

గీ. నడుమనుండి వాయుజుఁడు తిన్నగఁ గొనిచన
నుభయపార్శ్వస్థవానరయూథనాథ
సౌధములఁ గాంచుచుఁ శక్రసదనసదృశ
రాజభవనమ్మునకుఁ బోయె రమణి! యతఁడు. ౨౨౨

వ. అంతకు మున్ను మధ్యమకక్ష్యయం దవధానంబున నున్న చంద్రవదనయు, నశే
షాభరణభూషితాంగియు, సురతాతిరేకమునం బైకొన్న మైకంబున నెఱ్ఱనై రాణిం
చునేత్రకోణంబులు గలదియుఁ, గరరుహానిర్జితతార యగుతార, తన్ను సమీ
పించినసౌమిత్రిం జూచి నమస్కరించి మందస్మితపూర్వకమ్ముగ నిట్లనియె. ౨౨౩

తార, లక్ష్మణునితో సుగ్రీవునిపై నాగ్రహింపకు మని చెప్పుట

గీ. బావ! రారమ్ము నీకు శుభంబు గలుగుఁ, గాక, భక్తవత్సలుడ వఖండశాంత
మూర్తి వీ వేటికిటు కోపమును వహించి, నావు, భర్తృఁడుఁ భృత్యుఁ డౌ నాథుపైని.

ఆ. కపివరుండు పెద్దకాలంబు తెలిపి లేనట్టిదుఃఖభరమె యనుభవించె
దుఃఖరాశినుండి తొలఁగించి సుఖిని గావించినా రనుగ్రహించి మీరు. ౨౨౫

క. చిరకాలవిరహ మగుటఁ, సురతాసక్తమతి నుండి సుగ్రీవుఁడు, రా
మఱచెను రఘుపతిసేవకుఁ, గరుణాకూపార! తప్పుగాఁ గొనకు మెదన్. ౨౨౬

క. నానాదేశములం గల, వానరులక్షణమునంద వత్తురు, నిఖిలా
శానివసదద్రినిభక, ప్యానయనార్థముగ రవిజు నానతిమీఁదన్. ౨౨౭

గీ. దశసహస్రంబు లేఁగిరి తరుచరేంద్రు, లఖిలకపియూథపులతో స్వయముగ వచ్చి
యూహావక్షోణి దనుజసమూహములను, దశముఖునిఁ జంపుఁ దపనసందనుఁడు నిజము.

క. చనుదెంచు నిపుడు నీతోఁ, డనె సీతానాథుఁ డున్నెడకుఁ, బోదము ర
మ్మనఘా! యంతఃపురగతు, వనితాసుతమిత్రయుతు దివాకరజుఁ గనన్. ౨౨౯

క. కనలున నీ వరుదెంచుట, విని, కనుఁగొన వెఱచి యిల్లు వెడలనినా నా
థున కభయదాన మిడి తోఁ, డ్కొని పొ మ్మన నతఁడు విగతకోపుం డగుచున్.

సీ. తారయు మారుతి తనవెంట రా నేఁగి, యంతఃపురమ్మున, కందు రుమను
గాఁగిలించుకొని సుఖముగఁ బరుండి తన్నారసి భీతిమై నట్టిలేచు

మార్తాండనందను మదవిహ్వాలితనేత్రుఁ, గని రోషమునఁ బల్కెఁ గలుషచిత్త!
మహితాత్ము రాముని మఱచిపోతివి; వాలిఁ, జదిపినశర మిప్పు డెదురుచూచు
గీ. చున్నయది నీ నిమిత్తమై, యన్న చన్న
త్రోవనే నిన్నుఁ బంపును బ్రదు ల్గడంచి,
యనుఁడు వీరుఁడు హనుమంతుఁ డనియె నపుడు,
మిగులఁ బరుషోక్తు లాడుసౌమిత్రితోడ. ౨౩౧

హనుమంతుఁడు లక్ష్మణునితో సుగ్రీవుఁ డపరాధి కాఁ డని తెలుపుట

గీ. ఇట్లు మాటాడుచుంటి విదేమి చెపుమ?,యితఁడు నీకంటె సీతేశునెడలఁ జాల
భక్తిగలవాఁడు, మీయన్న పనికిఁ దగిన,యత్న మొనరించుచున్నాఁ డహర్నిశమ్ము.

చ. మఱచినవాఁడు గాఁడు కులమండన! కోట్లకొలంది వీరవా
నరులను బిల్వఁ బంపెను, వినమ్రత దిక్కులనుండి వారు వ
చ్చి రరుగో? చూడు మీక్షణమె సీతను రోయఁగఁ బోదు, రామహీ
వరుని సమస్తకార్యములు భాస్కరసూనుఁడు చక్కఁ బెట్టెడిన్. ౨౩౩

వ. అనవుడు సుమిత్రాత్మజుండు. ౨౩౪

క. "అరయక పరుషము లాడితి, నరరే? తన మిత్రుకార్యమం దవహితుఁడై
నెఱవేర్పం దివిరెడి యీ, పరోపకారి" నని సిగ్గుపడియెను గాంతా! ౨౩౫

సుగ్రీవుఁడు లక్ష్మణుని గౌరవించుట

గీ. అంత సుగ్రీవుఁ డర్ఘ్యపాద్యాదివిధులఁ, బూజఁ గావించి కౌఁగిటం బొదివి యతని,
రామదాసుండ నే నామహామహుండు, నన్ను రక్షించె నాఁడు ప్రసన్నబుద్ధి.

క. నిమిషార్ధములోనన లోకముల స్వతేజమునఁ బూది గావించుపరా,
క్రమనిధి శ్రీరాముఁడు; సైన్యము నేను నిమిత్తమాత్ర మని తలఁపఁదగున్.

సుగ్రీవహనుమల్లక్ష్మణులు రామునికడ కేఁగుట

సీ. అనుటయు లక్ష్మణుం డనె మహాభాగ! కోపమ్మున నిన్నన్న పలుకు లాత్మ
నెంచఁబోకుము క్షమియింపుము, చెలిమియ హేతు వింతకుఁ, బోద మిపుడు రమ్ము
ప్రభు వైన శ్రీరామభద్రుండు జానకీవిరహశోకార్తిని వివశుఁ డగుచు
నున్నాఁడు కానలో నొంటరిగా, నాలసించరా దన సమ్మతించి దివ్య
ఆ. రథము నొక్కదాని రయముగఁ దెప్పించి, తాను లక్ష్మణాన్వితముగ నెక్కి
జానకీశు సన్నిధానమ్మునకుఁ బోయె, రవిజుఁ డపుడు శైలరాట్కుమారి!. ౨౩౮

వ. అవ్విధంబున హనుమత్ప్రధాను లగునీలాంగదాదిమంత్రులును, ఋక్షవానరా నీకంబులును, బరివేష్టింప శ్వేతచ్ఛత్రంబులును వింజామరలును శోభిల్ల, భేరీ మృదంగధ్వానమ్ములు తన రాక ముందుగ రఘుపతికి నెఱింగింపం జని. ౨౩౯

సీ. శ్యామలగాత్రు విశాలనేత్రు సుశాంతుఁ జైలాజినాంబరుఁ జారుమంద
హాసమోహనవదనాంబుజాతుని జటామాళివిరాజితు •మహితు భూసు
తావియోగాగ్నిసంతప్తుని మృగపక్షిగణసమాలోకనకలితదృష్టి
భూభృద్గుహాద్వారభూమిని శాతిపైఁ గూర్చున్నవాని రఘుప్రవరుని
ఆ. నరసి దూరమంద, యరదంబు డిగి రయ, మార వచ్చి భక్తిమీఱఁ దత్ప
దాగ్రసీమ వ్రాలి, యభివందనముఁ జేసి, రంబుజాక్షి! లక్ష్మణార్కసుతులు. ౨౪౦

వ. ఆ సమయమ్మున. ౨౪౧

గీ. సర్వధర్మవిదుఁడు జానకీపతి హేళి, తనయుఁ గౌఁగిలించికొని తదీయ
కుశల మడిగి చెంతఁ గూర్చుండఁ జేసి యుబ్బున యథోచితముగఁ బూజ చేసె.

సుగ్రీవుఁడు రామునకు వానరసైన్యముఁ గూర్చి చెప్పుట

వ. పిదప సుగ్రీవుండు రఘుగ్రామణియనుగ్రహవిశేషంబున కచ్చెరు వడి, నిజబుద్ధి లతిక తత్పదభక్తికుసుమగుచ్ఛావనమితయై విరాజిల్ల నిట్లనియె. దేవా! యా వచ్చుచున్న వానరమహాసైన్యము నవలోకింపుము. కులాచలాదిసముత్పన్ను లును, మేరుమందరసంకాశులును, నానాద్వీపనదీనదకాననాద్రినివాసులును, బర్వతాభ్రభమోత్పాదనానుకూలాకారులును, స్వేచ్ఛారూపధారులును, నసంఖ్యా కులు నగునీకపు లందఱు దేవాంశసంభవులు, యుద్ధకుశలులు. ౨౪౩

క. కొందఱు మదగజసత్త్వులు, గొందఱు దశనాగబలులుఁ గొందఱతిబలుల్
కొంద ఱయుతవారణబలు, లిందుం గలవారిలోన, నినవంశమణీ!. ౨౪౪

సీ. కాటుకప్రోవువైఖరి నల్లనగువారు, బంగారుతో దీటు వడయువారు
స్వచ్ఛస్ఫటికశిలవలెఁ దెల్లనగువారు, రక్తాంతవదను లై క్రాలువారు
రమణీయదీర్ఘవాలముల నొప్పెడివారు దానవసన్నిభు లైనవారు
ఫలమూలముల మెక్కి బ్రతికెడువారు వీ రందఱుఁ గయ్యమం దాసఁ జేసి,
గీ. సకలదిక్కులనుండి గర్జలు మిగులఁగ, రభసగతి వచ్చుచున్నారు, రామ! శిరము లందుఁ జేరిచి యుష్మదీయాజ్ఞఁ జేతు, రెట్టి దైనను వెనుకంజ నిడరు ధ్రువము.

సుగ్రీవుఁడు రామునకుఁ గపివీరుల నిరూపించి చెప్పుట

క. ఇతఁ డెలుఁగుబంటులకు రా, జతిశూరుఁడు జాంబవంతుఁ డస్మత్సచివో
న్నతుఁ డేకకోటిఋక్షుల, ధృతిఁ బరిపాలించుచుండుధీశాలి! ప్రభూ! ౨౪౬

క. అరయు మతఁడు హనుమంతుఁడు, మరుత్పుతుఁడు బలపరాక్రమంబుల లోకో
త్తరుఁడు మతిమచ్ఛిఖామణి, వర తేజశ్శాలి మంత్రివర్యుఁడు, స్వామీ! ౨౪౮

సీ. నలుఁడు నీలుండు మైన్దద్వివిదులు గజగవయగవాక్షులు గంధమాద
నుఁడు శరభుఁడు సుషేణుఁడు వలీముఖుఁడును దారుఁడు పనసుండు దధిముఖుండు
మహితసత్త్వుఁడు హనుమంతునిజనకుండు గురుబలశాలి కేసరియు నాదు
మొనకాండ్రు, సామాన్యముగ ముఖ్యులం జెప్పినాఁడ; నవేకు లున్నార లింక,
గీ. వీరలు మహాత్ములును మహావీరు లమర,నాథతుల్యులు శౌర్యమునను రఘువర!
యొక్కొకరియాజ్ఞ మెలఁగుచునుండుఁ గోటి, కోటిసంఖ్యాక మైనవనాటబలము.

గీ. అధిప! వీ రందఱును నిర్జ రాంశభవులు, భయము భక్తియు మీఁఅ నీ పనువు సేయు,
వార, లా కనఁబడునట్టిశూరుఁ డంగ,దాఖ్యుఁ డల వాలికొడుకు తేజోఽధికుండు.

క. బలమునఁ దండ్రికిఁ దుల్యుఁడు, ఖలరాక్షససైన్యశమనకల్పుఁడు శౌర్యో
జ్జ్వలుఁ డవని సుప్రసిద్ధుఁడు, కల నసఁ బందువుగ నెంచుఘనుఁ డతఁ డనఘా!.

గీ. ఇపుడు దెల్పినవారుగా కితరు లెంద,ఱో కలరు; నేఁడు మీకొఱ కుసురులకును
నాసపడక పోరొనరించి యశముఁ గాంచు, పూన్కి నిలిచిన వా రిందుఁ బురుషసింహ!.

క. కొండల బండలఁ బూని య,ఖండముగాఁ బోరువారు కడిమి నహితులం
జెండాడుచండవిక్రము, లొం డనక భవద్వశు లయి యుండెడువారల్. ౨౫౧

క. "మీ రీపని చేయుం" డని, మీ రాజ్ఞాపింపుఁ డన, సమీచీనం బీ
సూరసుతువాక్య మని యా, భూరమణుఁడు హర్షబాష్పపూర్ణనయనుఁ డై. ౨౫౩

ఆ. కూర్మిఁ గౌఁగిలించికొని నేను జెప్పఁగా, నేల సఖుఁడ! సకల మెఱుఁగు దీవు
కార్యగౌరవంబు, గాన సమ్మత మేని, నబల నరయఁ బంపు మయ్య! వీరి. ౨౫౪

సుగ్రీవుఁడు సీతను వెదకుటకు వానరులఁ బంపుట

క. అనవుడు ముదితాత్ముం డయి, కని రం డవనిజను నెల్లకడల ననుచుఁ బం
పెను బలవంతుల వానరు,లను వానరవల్లభుం డలఘుగతి, రమణీ!. ౨౫౫

వ. ఇట్లు నానావిధంబు లగువానరయూథంబుల సర్వదిక్కులకుం బంపి. ౨౫౬

సుగ్రీవుఁడు హనుమదాదుల దక్షిణదిశకుఁ బొమ్మనుట

గీ. కార్యసాధకులును బరాక్రమఘను లగు, జాంబవంతుని హనుమంతు శరభు నంగ
దుని సుషేణుని నలుని మైందుని ద్వివిదుని, బిలిచి యిట్లాన తిచ్చెఁ గపిప్రభుండు.

చ. అరుగుఁడు మీర లందఱుఁ బ్రయత్నముతో నలదక్షిణాశ, కం
దరయుఁడు నాల్గువైపుల శుభాంగి రఘూత్తము దేవి జానకిన్,
మరలి మదంతికంబునకు మాసములోపల రండు, పొందు స
త్వరమున నస్మదాజ్ఞను, బ్రధానముగాఁ దలపోయుఁ డాత్మలన్. ౨౫౮

సీ. జానకివార్తఁ దేలేనిచో నొకదివసంబు మాసమ్ముపై జరిగె నేనిఁ
బ్రాణాంతికం బగుభయదదండము విధించెదను నే నని నొక్కి చెప్పి భీమ
విక్రమవానరవీరాష్టకమును బ్రయాణము సేయించి యర్కసుతుఁడు
మ్రొక్కి రాముని పార్శ్వమునఁ గూరుచుండె నంతట రాఘవుఁడు ప్రయాణమగుచున్న
గీ. మారుతాత్మజుఁ గాంచి నా పేరు చెక్కి, యున్న యుత్తమ మైనయీ యుంగరమ్ము
నిమ్ము గుఱుతుగ సీతకు నిద్ధచరిత ! యన్యు లారయకుండ రహస్యముగను. ౨౫౯

రాముఁడు హనుమంతునితోఁ బ్రత్యేకముగఁ జెప్పుట

వ. అని మఱియు. ౨౬౦

క. ఓకపిసత్తమ ! వినుమా, యీ కార్యంబునకు నీవ యేడుగడవు, నీ
ధీకుశలత నే నెఱుఁగుదుఁ, బో; కలుగు శుభంబు మార్గమున నెల్లయెడన్. ౨౬౧

క. అని పలుకుచు నుత్సాహం, బినుమడిగా వీఁపు దట్టి యిచ్చె నతనికిం
దన యంగుళ్యాభరణం, బనిలజుఁడును జనియె వార లందఱితోడన్. ౨౬౨

హనుమదాదులు సీతను వెదకుట

గీ. తపనసంభవుముదల సీతాలతాంగి
నెమక నీ గతి నంగదప్రముఖు లేఁగి
తిరుగు చం దందు వింధ్యభూధరముమీఁదఁ
గాఱుకొనియున్న యొకమహాగహనసీమ. ౨౬౩

సీ. లేళ్ల నేన్గుల నవలీలఁ గైకొని పొట్ట నిండించుకొనుధరణీధరాభ
భీషణాకారుని దోషాచరేంద్రు నొక్కనిఁ గాంచి, రందులోఁ గపివరేణ్యు
లొకకొండ ఱితఁడు తప్పక రావణుం డని కిలకిలారావంబు సలిపి పొదివి
పిడికిటిపోటుల మడియంగఁ జేసి, పంక్తిగ్రీవుఁ డింతటిదేబె యగునె ?
గీ. కాఁ డనుచు మఱియొకగొప్పకానఁ జొచ్చి
యందు నందఱు వడిచెడి యధికతృషను
నాలుకలు పీఁక లోనికిఁ దాలువులును
బెదవు లెండఁగ నుదకంబు వెదకికొనుచు. ౨౬౪

క. అందుఁ గల దేమొ యని మును, ముం దరుగుచు నెందు సలిలముం గానక యిం
కెందు లకనియసువులమెడ, సందేహించుచు మఱొక్కచక్కికిఁ బోవన్. ౨౬౫

హనుమదాదులు పిపాసావశులై పర్వతగుహం బ్రవేశించుట

గీ. గడ్డిచేతను బొదలచేఁ గప్పఁబడిన, యొకమహాగుహ దోఁచె, నందుండి యార్ద్ర
పక్షముల హంసలును గ్రౌంచపక్షిగణము, వెడలివచ్చుచునుండు నవ్విధముఁ జూచి.

క. జల మున్న దిచట, లేదేని, సలిలకణస్పర్శ మెట్లు సమకొను నీ ప
క్కలతెక్కల ? రండీ ! లో,పలికిం బోద మని హనుమ ముందఱఁ జనియెన్.

గీ. అతనివెంటఁ దక్కినవార లరిగిరి ముది,తాత్ము లయి కాఱుచీఁకటియాట నొకరి
చేతు లొకరు పట్టికొని, యీరీతి నంధ,కారమునఁ జాలదూరమ్ము గడచి పోయి.

సీ. రత్నోపమాంబుసరస్సుల, వేలుపు,మ్రాకులతోడ సమానము లయి
పక్వఫలావళిభారమ్ముచే వంగి, లలితమధు,ద్రోణకలితము లయి
యలరుభూజముల, సమస్త గుణోపేత,ములు మణివస్త్రాదిపూరితములు
దివ్యభక్ష్యాన్నసందీప్తముల్ మనుజవి,రహితంబు లగుమందిరములు నరసి
గీ. మిగుల నాశ్చర్యపడి యీ యమేయవైభ,వోన్నతికిఁ గత మేమొ యిందుండనోచు
కొన్నవా రొనరించిన పున్నె మెట్టి,దో? వసించినవా రెవ్వరో? యటంచు.

వ. తమలోఁ దా మనుకొనుచుఁ జన నొక్కదివ్యసౌధంబునం గనకాసనసమాసీన యై నిజదేహప్రభలఁ గడ లలంకరించుచు యోగ మవలంబించి ధ్యానంబున నున్న వల్కలధారిణి యగునొకయోగిని గన్పట్టుటయు, వా రంద ఱామహాభాగకు భయభక్తు లొప్పఁ గృతప్రణాము లై నిలుచుండి, రంతఁ దద్విధం బవలోకించి యామె వారి కిట్లనియె. ౨౭౦

గీ. ఎందులకు వచ్చినారు మీ రెచట నుండి, వచ్చుచుంటిరి తెల్పుఁ డెవ్వారి దూత ?
లస్మదీయావసథ మగమ్య మిది దీన, నౌర? యేల ప్రవేశించి నా రనవుడు. ౨౭౧

హనుమదాదులు స్వయంప్రభకుఁ దమవృత్తాంతము నెఱింగించుట

వ. దేవీ ! యవధరింపు మని పవనజుం డిట్లనియె. ౨౭౨

క. శ్రీమంతుఁడు దశరథుఁ డను, భూమీంద్రుఁ డయోధ్య నేలుపుణ్యుఁ డొకం డీ
క్ష్మామండలిఁ గలఁ డతనికి, రామాఖ్యుం డగ్రసుతుఁడు రాజిలు మహిమన్.

ఆ. తండ్రియానఁ దలను దాల్చి తమ్ముఁడుఁ దన్వి, నీడ వోలెఁ దన్నుఁ గూడి రాఁగ
నడవి కరిగె నాతఁ, డట దశాస్యుఁడు ఖలుం, డపహరించె సీత నమలచరిత !.

క. తదుపరి సానుజుఁడై నిజ, సుదతి వెదకికొనుచుఁ జేరె సుగ్రీవుని; న
భ్యుదయకర మగుచుసఖ్యం, బొదవెను నుభయులకు, నంత నుత్సాహముతో.

వ. సుగ్రీవుండు రామజాయాగవేషణార్థమ్ము. ౨౪౬

క. మముఁ బొం డని పంపెఁ దదా,జ్ఞమెయిఁ గా మే మడవిఁ జొచ్చి జానకికై స
ర్వము శోధించుచు దాహం బధికముగ నగుడుఁ దాళఁ జాలక యుదకకాంక్షన్.

క. దూరితి మీ భీకరగుహఁ, బ్రారబ్ధము మంచి దగుట నందఱము సిటం
జేరితి, మిది మాచరిత ము, దారగుణా! తెల్పు నీ విధము సకలంబున్. ౨౪౮

ఉ. ఎవ్వతె వమ్మ! నీ విచట నెందుల కుంటివి చెప్పు మమ్మ! నీ
మవ్వపుఁడెంకియుఁగా భువనమంగళరూపముఁ గన్నయంత దా
దవ్వులఁ బాఱె మామకపథశ్రమ? నీ మహిమం బదెట్టిదో
యెవ్వఁడె ఱుంగునమ్మ! దయ నించుక మాపయి నింపు మమ్మరో!. ౨౪౯

చ. అనవుడు నామె హృష్టమతి యై, ఫలమూలములన్ యథేచ్ఛగాఁ
దినుఁడు సుధోపమాన మగుతియ్యనినీరముఁ ద్రావి రండు మీఁ
దను వినిపింతు నాదుచరితం బఖిలంబును నాదనుండి, చ
య్యనఁ జనుఁ, డన్న నట్లె యని హర్షముతోఁ గపివీరు లందఱున్. ౨౫౦

ఉ. కమ్మనిపండ్లు దుంపలు సుఖమ్ముగఁ బొట్టలు నిండ మెక్కి, స్వ
చ్ఛమ్మగుతోయ మాత్మలఁ బ్రశంస యొనర్చుచు దప్పిదీఱఁ బా
నమ్మును జేసి, యోగినిఁ గనం జని తన్నికటంబునందుఁ గే
ల్దమ్ములు మోడ్చి నిల్చిరి కథాశ్రవణాదరచిత్తవృత్తు లై. ౨౫౧

స్వయంప్రభ హనుమత్ప్రముఖులకుఁ దనపూర్వకథను జెప్పుట

వ. ఆ సమయంబున దివ్యదృష్టి గలతపస్విని పావమాని కి ట్లనియె. ౨౫౨

ఆ. కలదు తొల్లి విశ్వకర్మకూఁతురు హేమ, యనఁగ దివ్యరూప మమరు రమణి
యనుపమాననృత్యమునఁ బ్రీతునిం జేసె, నావెలంది దేవదేవు గిరిశు. ౨౫౩

ఆ. అభవుఁ డలరి దివ్యవిభవసమ్మిత మమే, యమ్మ నీ పురమ్ము నపు డొసంగె.
ఆమె యుండె నిందు నయుతాయుతాబ్దముల్, శ్వసనతనయ! సంతసమ్ము మీఱ.

సీ. ఏను నెచ్చెలిని నా హేమకు నన్ను స్వయంప్రభయంద్రు, దివ్యాభిధాన
గంధర్వవరుఁడు న న్గన్నతండ్రి, రమేశుభక్తురాలను, మోక్షపదము గోరు

దానను, వనచరోత్తమ! పూర్వ మొకనాఁడు సత్యలోకమునకుఁ జనుచుఁ దాను
నామేలు దలపోసి ననుఁ జూచి, "సఖి! సమస్తప్రాణిగణవర్జిత మగునింటె
గీ. నిలిచి తప మాచరింపుము నీవు, నాశరహితుఁ డగువిష్ణు వవనిభారమ్ముఁ బాప
దాశరథిగా జనించి త్రేతాయుగమునఁ, గాననస్థలిఁ జరియింపఁగాఁ గలండు. ౨౮౫

క. ఆయన జాయను వెదకుచు, నీయెడ కరుదెంచెదరు కపీంద్రులు వారి
ధ్యేయులఁ బూజించి యథాన్యాయంబుగ, రామదర్శనార్థము పొమ్మా. ౨౮౬

క. ధృతి నమ్మహనీయుని సంస్తుతించి సద్భక్తి యోగిసులభంబును శా
శ్వతము నగువిష్ణుపద మంచితగతి నొందఁగల" వనుచుఁ జెప్పెను నాతోన్.

స్వయంప్రభ హనుమదాదులను వెలుపలికిం జేర్చుట

క. కావున నేఁ బోవలె నీ,తావరు దర్శించుటకు హృదయ మిపు డెంతో
తీపరపడుచున్నది యో, పావని! మీ రంద ఱొక్కపరి నేత్రములన్. ౨౮౮

గీ. గట్టిగా మూయుఁ డీగుహఁ గడచి బయటి, కేఁగఁ గల, రన వా రట్టులే యొనర్చి
యుత్సుకత మీఱ మున్ను దామున్న వనముఁ, జేరి తద్దివ్యశక్తి మెచ్చిరి మనముల.

స్వయంప్రభ రాముని సందర్శించి సన్నుతించుట

సీ. అంత నిర్మలచిత్త యైనస్వయంప్రభ గుహఁ బాసి వడి రఘూద్వహుని సన్ని
ధానంబునకుఁ జని తపనజలత్న్మణాన్వితముగ నలరు నావిగ్రహంబుఁ
గనులారఁ జూచి చక్కఁ బ్రదక్షిణము సల్పి మహిమీఁద వ్రాలి పల్మాఱు మ్రొక్కి
కొసరి మే నెల్ల గగ్గురుపాటు చెంద డగ్గుత్తిక వడినవాక్కున వచించె
గీ. రాజపూజిత! నీ దాసురాల నేను
దర్శనార్థము వచ్చినదాన నిటకుఁ
బెక్కువేలేండ్లు మిముఁ జూచు ప్రేమ గుహను
దుష్కర తపం బొనర్చితి ద్రుహిణవినుత!. ౨౯౦

ఉ. పండెను నా తపం బసురభంజన! మాయకు దవ్వగా సదా
యుండెడువాఁడవుర్ బయల నొప్పవు గ లోపల భూతకోటియం
దుండియుఁ గానరానినిను యోగిజనార్చితుఁ గన్నుదోయికిం
బండువుగాఁగఁ జూచి పదపద్మములం బడుభాగ్య మబ్బుటన్. ౨౯౧

సీ. క్రొత్తవేసము వేసికొని తెరలోన బయటి కేఁగుదెంచెడి నటునిఁ గాంచి
త న్నిజాకారంబు ద్రష్ట లేకరణి గుర్తింపఁగాఁ జాలరో తెలివి మాలి,

యట్టులే; యోగమాయా యవనికఁ గప్పఁబడి మానుషస్వరూపము ధరించి
నట్టి నిన్నారసి యజ్ఞానదృక్కులు నీ నిజాకారంబు గానలేరు
ఆ. భాగవతుల కెలిమి భక్తియోగవిధంబుఁ, దెలుపునిచ్చ నీవు దిగితి విలకు
నట్టినీదునిశ్చయాకృతిఁ దామసి,నైన నా కెఱుంగ నౌనె? రామ!. ౨౯౨

సీ. ఉర్విపై నెవఁ డైననొకఁడు తావకయథార్థాకృతి నరసిన నరయుఁగాక
నాకు మాత్రము రఘునాయక! యాకోర్కె లేదు, మోహానకళామేదుర మగు
నీ యీశుభాకృతి పాయక హృత్సరసీజంబునం బ్రకాశించుఁగాక
ఘనతరమోహంబుఁ గనఁజేయునదియు, భవాంబుధు లింకించునదియు జ్ఞాన
గీ. సముచితోపాయ మైనట్టిసత్పథంబు,చూపి నడపించునదియు నిస్తులము నగుత్వ
దీయపదయుగ్మమును గంటి దేవపదము, నైత మొకలెక్కగా నెంచఁ జాలకుంటి.

సీ. ఆలు బిడ్డలు ద్రవ్య మాదిగాఁగలసంపదలఁ జూచికొని పొంగి తనకు నవియ
యుద్ధారకము లని యూహించు జనుఁడు, సర్వమును త్యజించినవారిసొమ్మ
వైన నిన్నొకతూరి యైన నోరారఁ బిల్చెడుమహాభాగ్యంబుఁ బడయలేఁడు,
నిష్కించనద్రవ్యనిధికి నివృత్తప్రవృత్తిమార్గునకుఁ బవిత్రునకును
గీ. రహితగుణునకు స్వాత్మాభిరామునకు గు,ణాత్మునకు నీకు వందన మాచరింతు
మానుషవిడంబనముఁ జూపునీనడవడిఁ, గానఁజాలఁడు రామ! యెుకానొకఁడును.

గీ. ఆదిమధ్యాంతవర్జితుం డంతటను స,మానసంచారియును నియామకుఁడుఁ గాల
రూపి యైయొప్పుపరమపూరుషునిఁగా ని,నుం దలంచుచునున్నాను డెందమందు.

వ. దేవా! నీకు శత్రుండుగాని మిత్రుండుగాని తదన్యుండుగాని యొకఁడును లేఁడు.
భవన్మాయాపిహితాత్ములు నిన్ను శత్రుమిత్రోదాసీనవంతునిఁగ నెంచి భ్రమించు
చున్నారు. జన్మంబు లేక కర్తృత్వాదుల వలనం బోక, సన్నిధానమాత్రమున
సమస్తమునకు నియంత వగు నీ దేవతిర్యఙ్మనుష్యాద్యవతారప్రవర్తన మంతయు
మాయావిడంబనయె కాని మఱొండు గాదు. ౨౯౬

క. జననమరణరహితుని ని,న్ననఘ! కథాశ్రవణభాగ్య మలవడి కృతులై
మనుటకు జను, లిల జనియిం,చినవానిఁగఁ గొంతమంది చెప్పుదు రార్యుల్; ౨౯౭

సీ. పంక్తిరథుని తపఃఫలముగఁ బొడమితి వందురు కొందఱు, కొంద ఱల్ల
కౌసల్య ప్రార్థింపఁగాఁ బుట్టినా వందు, రజుఁడు దుష్టాసురవ్యథితభూమి
భారం బపనయింపఁ బ్రార్థింప నీశ్వరుఁ డీ రాముఁడుగ నరాకారమునను
నుదయించినాఁ డందు రొకకొంద, ఱె ట్లైన నీ గీతములఁ బాడ నేర్చువారు

గీ. నీకథల్ చెవులార వినెడుజనులును, సంసృతిపయోధి దాఁటించి సమధికసుఖ
సీమకుం జేర్చుసిద్ధసంసేవితభవ,దంఘ్రిపోతంబు గాంచెద, రమలమూర్తి!.

క. నిను మాయావ్యతిరిక్తుని, ఘనుని గుణాశ్రయుని నెఱుఁగఁగా నేగతి నే
ర్తును; ద్వన్ద్వాకరాగుణబద్ధను ముగ్ధను నేను నాఁడుదానను, దేవా!. ౨౯౯

గీ. అరయ శబ్దాదులకు విషయంబు గాని, వాఁడవు విభుండ వగుసీ స్తవంబు సేయ
నా, కౌకవరాకికిం దగునా! సురేంద్ర, వందితామేయపాదారవిందయుగళ!.

క. శరచాపధారి వై భ్రాస్కరపుత్రాదులు మహీధ్రచరులుఁ గొలువ సో
దరయుతముగ వెలిఁగెదిరఘు,వరునకు నీ కాచరింతు వందన మనఘా!. ౩౦౧

క. అని, యోగిని గొనియాడినఁ, బ్రణతార్తిహరుండు రామభద్రుఁడు కృపతో
ననె, భక్తురాల! నీ దగు, మనోరథం బేమి చెప్పుమా? నెఱవేర్తున్. ౩౦౨

వ. నావుడు భక్తివైభవంబు పెంపున స్వయంప్రభ యిట్లనియె. ౩౦౩

స్వయంప్రభ ప్రసన్నుఁ డగురామునకుఁ దనమనోరథము నివేదించుకొనుట

చ. చెదరనిభక్తి నాకు దయసేయుము నీ యెడ, నెన్నఁ డేని దు
ర్హృదయులతోడిచెల్మి ఘటియింపకు, తావకభక్తకోటిలో
సదయుఁడ వై ననుం గలిపి శాశ్వతసౌఖ్యముఁ గూర్చు మెందునే
నొదవిన నెట్టిరూపమున నున్నను; నాశ్రితలోకవత్సలా!. ౩౦౪

సీ. మామకరసన శ్రీరామ! రామా! యని భక్తిమై ననిశముం బలుకుఁ గాక,
మనసు, లక్ష్మణభూమిసుతాసహిత మై శ్యామలవర్ణ మై చారుపీత
వాసఃపరీత మై వరశరాసనశిలీముఖపాణి యై జటామకుటభాస్వ
దుత్తమాంగం బయి యుజ్జ్వలాంగదతులాకోటిముక్తాహారకుండలాది

ఆ. భూషణాఢ్య మగుచు భావనమోహన మగు, మీస్వరూపమును దమిఁ స్మరించు
గాక, యింతకన్న నాకు వేఱువరమ్ము, వల దటన్న రామభద్రుఁ డనియె. ౩౦౫

రాముఁడు స్వయంప్రభ ననుగ్రహించుట

ఉ. కోరినయట్లు నీకు సమకూరును సర్వము, వేడ్కమై తప
శ్శ్రీ రహిమించునట్టి బదరీవనికిం జను, మందుఁ నన్నె ని
ష్ఠారతి సంస్మరించు చవిచారముగా నివసింపు మాపయిం
జేరెద వీవు దేహముఁ ద్యజించి ననుం బరమాత్ము నంగనా!. ౩౦౬

వ. అనుటయు నా స్వయంప్రభ. ౩౦౭

గీ. అమృతసారసన్నిభ మగునా మృదూక్తి, విని యపుడ బదరీతరువిసరజుష్ట
తీర్థమున కేఁగి రాము మదిం దలఁచుచుఁ,బరమపద మొందెఁ దుద మేనుబాసి దేవి!.

వ. అక్కడ హనుమదాదికపీశ్వరులు మైథిలీపరిమార్గణశిథిలీభూతసంధిబంధులై కర్తవ్యనిర్ధారణాసమర్థంబు లగుమనంబుల విచారపడుచు, ఛాయానిరంతరంబు లగుతరుషండంబులక్రిందఁ గూర్చుండి, రప్పుడు వానరర్షభుం డగునంగదుండు తక్కువారిం జూచి యిట్లనియె. ౩౦౯

అంగదుఁడు హనుమదాదులతోఁ దనవిచారమును దెలుపుట

క. మనరాజు మన కొసంగిన, దినములు ముప్పదియు గుహను దిరుగుటతోఁ జె
ల్లెను జానకిపోఁబడిఁ గన్గొన మైతిమి, విభుని యాన కుంఠిత మయ్యెన్. ౩౧౦

గీ. ఇపుడు కిష్కింధ కేఁగుదు మేని "నన్మదాజ్ఞ నుల్లంఘనము సేసి రార వీర"
లని యకృతకార్యులగు మనలను వధించుఁ, జండకోపంబుతోడ మార్తండసుతుఁడు.

గీ. చెప్పిపంపిన కార్యంబుఁ జేతు మేని; గడువు కడచనినను నేమి బెడఁద లేదు
రెంటికిం జాలనట్టివారిని నృపుండు, శిక్షితులఁ జేయ కేల యుపేక్ష సేయు.

సీ. అందు ముఖ్యమ్ముగ నాయన కేను శత్రునిపుత్రుఁడను మిముఁ ద్రుంప కొక్క
వేళ వీడినను న న్విడువఁ; డీ సాకుచే నంతంబు నొందించు నన్నలార!
నా పయి సుగ్రీవునకుఁ బ్రీతి యె ట్లుండు నకట; రాముఁడు దయ నరసి ప్రోచె
నామహనీయు కార్యము నైత మిత్త్రుఁజేఁ జేయనైతిని వేఱె చెప్ప నేల?

గీ. కాన నన్ను వధింపంగఁ గలుషచిత్తుఁ, డయినపినతండ్రికిది నెప మయ్యెడు నిది,
యంబ కెనయగునన్న భార్యను గవుఁగిటఁ, జేర్చి క్రీడించువాఁ డేమిచేయ వెఱచు?.

క. మువ్వూటికి నే నరుగను, జు మ్మాదుర్మార్గుకడకుఁ, జూడుం డిటఁ బ్రా
ణమ్ముల నేదో యొకచందమ్ముగ విడనాడువాఁడ దరుచరులారా! ౩౧౪

క. అని జాలివొడమఁ బలుకుచుఁ, గనుఁగవ నశ్రువులు జాలుగట్టఁగ దీనా
ననుఁ డగు తారాతనయుని, గని పొటపొట బాష్పవారికణములు రాలన్. ౩౧౫

వ. కొందఱు వానరులు దుఃఖసంతప్తహృదయు లై యి ట్లనిరి. ౩౧౬

సీ. ఏము గల్గఁగ దిగు లేటికి నీకు? నీ ప్రాణరక్షణము దప్పక యొనర్పఁ
గల మయ్య!యిది కల్లగాఁ దలంపకు మయ్య!యంగదా!మనము భయమ్ము దొఱఁగి
యీగుహాలో నుంద, మిందలి పురము సమస్తసౌభాగ్యప్రశస్త మింద్ర
నగరోపమాన మెన్నా ళ్లున్నఁ గొదువ లే దని యిట్లు వార లన్యోన్యముఁ గడు

గీ. మెల్లగను మాటలాడి, రమ్మెయి నభస్వదాత్మజుఁడు నయకోవిదుఁ డట్టె వాలి
తనయు నాలింగనముఁ జేసికొని తదీయ, భయవినాశనకరముగఁ బలికె నిట్లు.

హనుమంతుఁ డంగదునకు ధైర్యము చెప్పుట

మ. "నను సుగ్రీవుఁడు సంహరించు" నని యన్నా! యిట్లు భీతిల్లఁగాఁ
జనునే? వీరి దురుక్తులన్ వినకు; భాస్వత్ప్రీతి నిన్ బ్రీతితోఁ
గనుఁ దారాతనయుండ వౌట; మఱియున్ గారాబమున్ జూపు, రా
మునకుం దమ్ముని మీఁదికంటె వెలయుం బ్రేమ నీ యందునన్. ౩౧౯

గీ. నిత్యమును వృద్ధిఁ బొందెడు నీ పయి రఘువరునకుం గలకూరిమి వాలితనయ!
ఇంచుకయు నీకు భయము లే దినతనూజు, వలనఁ గాని శ్రీరామునివలనఁ గాని.

చ. మనమునఁ గోరి నీ హితము మాటికిమాటికిఁ జెప్పుచుంటిఁ గా
వున నిఁక నన్య నీ వడుగఁ బోకుము వత్స! "గుహన్ వసించుచో
మన కరిభీతి లే" దనెడి మాటఁ దలంపు, మభేద్య మంచుఁ గ
ల్గునె రఘువీరు బాణములకున్ భువనత్రయమందు నెన్నఁడేన్? ౩౨౦

క. హిత మని దుర్బోధ మ్మొ,గతి నిప్పుడు నీకుఁ జేయుఘను లేక్రియఁ బ
ర్వతగుహ నుందురు నీతో, సతీసుతాదికము విడిచి! చాలికఁ జాలున్. ౩౨౧

హనుమంతుఁ డంగదునితో దేవరహస్యముం దెలుపుట

సీ. మఱియొక్క గుహ్యతమము రహస్యము వినిపించెద నాయనా! వినుము దాని
మానవుం డని రాము మది నెంచఁ బోకు మవ్యయుఁడు సాక్షాద్రమావల్లభుండు,
సీత యందఱవంటి చేడియ గాదు శ్రీహరి మాయ, జనులమోహమున ముంచు
భగవతి, యూర్మిళాపతి యన విశ్వంబుఁ బడగలపైఁ దాల్చు పన్నగపతి

గీ. యైన శేషుండు చూవె, ముఖ్యముగ భువన, రక్షణ మొనర్చు వీ రెల్ల రాక్షసాళి
నణఁపఁ బుడమి మాయామానుషాకృతుల జ,నించినారు ప్రార్థింప వాణీవరుండు.

సీ. కోఁతుల మని యనుకొనకుము మన మెల్ల వైకుంఠనాథుఁ డౌ వనజనాభు
పార్షదులము, వానరర్షభ! స్వేచ్ఛమై పరమాత్మ మానవభావ మొంద
మనమును దన్మహామాయచే నిట్లు వానరరూపమునఁ బుట్టినార మిలను,
మున్ను జగన్నాథు మునివంద్యుఁ దపమున నర్థి నారాధించి యతని చే న

గీ. నుగ్రహింపంగఁబడి యోగినుతము పార్ష,దత్వమును బొంది పరమమోదమ్ము గంటి,
మిపుడు మాయానుకారి యై యొసఁగు నా ర,మాపతికె సేవఁ గావించి మహితభక్తి.

క. మరలం జని వైకుంఠ న,గరి కందు సుఖాన నుండఁ గల మంగద! త
త్తఱ యేల? యనుచు గాలి కొ,మరుఁ డాశ్వాసించె వెఱపు మాన్పి, లతాంగీ!!.

హనుమదాదులు సముద్రతీరమునం గూర్చుండి విచారపడుట

వ. అంత వారటనుండి కదలి వింధ్యాచలంబు దరియ నరిగి యందుండి మెల్లగ దక్షిణాంబుధితీరంబున రఘుపతిజాయను రోయుచు, మహేంద్రశైలసంబంధియుఁ బావనంబు నగు నొకతిప్పం జేరి యవలోకితసముద్రులై, తదీయదుష్పారతకును గభీరతకును భయవర్ధనతకును మిగుల నులికిపడి యింక నేమిచేయుద మని చింతాకలుషితంబు లయినస్వాంతమ్ముల నెల్లరును దానియొద్దనం గూర్చుండి పరస్పర మిట్లాలోచించుకొనిరి. ౩౨౭

క. గిరిగహ్వారపరివర్తము, హరించె నెలదినములను దశాస్యుఁడు గానీ
ధరణీసుత గానీ; యెప్పుసునఁ గనరా రిదేమిపాపమొ కట్టా; ౩౨౮

క. దండించుపట్ల రేఁడవ, దండధరుం డనుచుఁ జెప్పఁ దగియెడు నమ్మా
ర్తాండసుతుఁడు; నిక్కమ్ముగఁ, జెండాడును మనల నేమిచేయుద మయయో.

ప్రాయోపవేశమునఁ బరున్న వానరుల భక్షింప సంపాతి వచ్చుట

సీ. సవితృకుమారుచేఁ జచ్చుటకంటె నందఱమును నన్నపానములు మాని
మరణమ్ముఁ గోరుచు మహి శయనించుటయే శ్రేయ మని నిశ్చయించి యచట
దర్భలఁ గొని వచ్చి తగఁ బఱచికొని సోలుపుగఁ బరుండి రాకపు లపర్ణ!
యింతలో నచట మహీధరసదృశ మహాగ్రద్ధ యొక్కటి తిన్నగా మహేంద్ర
గీ. పర్వతగుహాంతరమునుండి బయటికిఁ జను,దెంచి ప్రాయోపవేశసుస్థిరత నున్న
వానరుల జైఖరిం జూచి మేను పొంగ, నిట్టు లనుకొనె సన్ననియెలుఁగుతోడ.

క తమి దీఱ మెసఁగ నాహా,రము చిక్కెన దిచట మత్పురాభవకృతపు
ణ్యము ఘనము వీరిఁ దినియెదఁ, గ్రమమున దినమునకు నొక్కొకఁడు భక్ష్యమగున్.

క. ఊరకొన నేటి కిఁకఁ దినఁ, బ్రారంభింతు నని తగ విహగపతి డాయఁగా
వా రది విని భయపడి యా, రౌరా మన కెంతపాటియాపద మూఁడెన్. ౩౩౦

హనుమదాదులు జటాయువు కృతకృత్యతను దలపోయుట

సీ. మనల నెల్లరను గమ్మఁగ భుజింపంగల దీగ్రద్ద సందేహ మేమిలేదు
శ్రీరాముకార్యమా చేయలేకుంటిమి గడువులోపలఁ గపికాంతుఁ జేర
నోఁచకపోతి మయ్యో; చిట్టచివఱకు మనప్రాణములు దక్కుమార్గ మైన
వెదకికొనకపోతి మిదిగో యీ నీచపుగద్దనోటం బడి బిద్ది శమను

గీ. నగరముం జేరc బోవు చున్నాము నేడు,
ధర్మమతి పండితుం డరిదమనుc డౌ జ
టాయు వెంతటి పుణ్యాత్ముc డౌర? రామ
మూర్తి కార్యార్థముగc బ్రాణములను బాసి. 33౧

వ. యోగిదురాప మగుమోక్షంబు నొందె, నని వారు దమకు వచ్చినదురవస్థకు వగవc, దద్భాషణంబులు నిజభ్రాతృకథాప్రతిపాదితంబు లగుట నాలించి వీరివలన సర్వ మెఱుంగ నగునని సంపాతి వారి కిట్లనును. 33౨

అంగదుఁడు సంపాతికి జటాయువు వృత్తాంతమును దెలుపుట

సీ. మీ రెవ్వ రనఘాత్ములార! కర్ణములకు నమృతతుల్య మగుజటాయు వనెడి
నా కూర్మితమ్ముని నామంబుc బలుకుచున్నారు; తత్కథయెల్ల నాకుc జెప్పc
డేను భక్షింతునం చెదల భీతిల్లకుc డరయమి మొదట మి మ్మారగింపc
దలcచి వచ్చితి, నావిధ మ్మింక నేటికి? మిత్రుల మైతిమి మీరు నేను
గీ. నావు డంగదుc డా గృధ్రనాథు నన్ని, ధానమున నిల్చి, దశరథాత్మజుఁడు శ్రీమ
హితుఁడు రాముఁడు సీతామహిళను గూడి, దండ కాటవిc జొచ్చె సోదరునితోడ.

ఉ. అందు వసించి యొక్కసమయంబునc దమ్ముఁడుc దాను వేట వో
నం దిదె యంచు రావణుc డసభ్యుఁడు దోcచి బలాత్కృతిన్ ధరా
నందన సాధ్విc గొంచు గగనస్థలిc దేరునc బోయె, నశ్రువుల్
చిందcగ రామ! రామ! యని చీరుచు సారెకు నేడ్చె నామెయున్. 33౪

సీ. ఆ యేడ్పు విని పతగాధిపుండు ప్రతాపశీలి మహాబలశాలి యగు జ
టాయువు పంక్తికంధరు తేరి కడ్డమై నిల్చి యదల్చుచు నిష్ఠురోక్తి
నుగ్రాహవ మొనర్చి యుర్విc గూలెc దసీయబాణహతిన్ గతప్రాణుc డగుచు
రామార్థముగc, బక్షిరాజ! రాఘవుc డంత నింతిని వెదకు చయ్యెడకు వచ్చి
గీ. నా కొఱకు సీతc డసువులపోక కొప్పి, నాc డిలం గలcడే యిట్టివాc డటంచు
నగ్నిసంస్కారముం జేసి యాక్షణంబ, యాత్మసాయుజ్య మొసcగె దయార్ద్రబుద్ధి.

అంగదుఁడు సంపాతికిc దాము వచ్చిన విధము నెఱింగించుట

వ. పిమ్మట మహాబలుం డయినసుగ్రీవుం గానc బోయి, యగ్నిసాక్షిగ నాతనిసఖ్యం బున కనుమతించి, తత్ప్రేరణమున సురాసురదురాసదు వాలి నొక్కకోలం గూల నేసి, కపిరాజ్యదానంబున నతనిం బ్రీతుc గావించె. అప్పు డహర్పతితనయుండు సత్త్వ సంపన్నులగుకపిసమూహములను మమ్మును బిల్చి జానకి నన్వేషించి, నెల

ముగియక మున్న రండు. రానివారు వధ్యు లగుదు రని యాజ్ఞాపించె, నయ్యానం జేసి మేము వనమ్మునం గ్రుమ్మఱుచు నొక్క గుహాంతరంబునం జిక్కువడి దిక్కు గానక తిరుగుచుండ గడువు నెల కడచనియె. సీతారావణులలో నొక్కరి నైన నింత వఱకుం గన్నవారము కాము. ౩౩౬

ఉ. ఆశ నిరాశఁ జేసికొని యందఱ మీలవణాబ్ధితీరమం
దీ సరణిన్ మృతిం గనుటయే కడుమే లని నిశ్చయించి, ప
క్షీశ! పరుండి యుంటి మెదియేని భుజించుట గూడ దంచు, నీ
వా శుభగాత్రి జాడను దయన్ వినిపింపు మెఱింగియుండినన్. ౩౩౭

క. మాపాలిజీవగఱ్ఱవు, నీ పుణ్యం బవని వర్ణనీయము, సంపా
తీ! పడఁతి తెఱఁగుఁ దెలిపిన; జ్ఞాపకముం దెచ్చికొమ్ము గండము దప్పన్. ౩౩౮

క. అనుటయు నంగదు పలుకులు, విని హృష్టాత్ముఁ డయి గృధ్రవిభుఁ డిట్లను విం
టిని బెక్కువేలయేం డ్లేఁ, గినమీఁదట భ్రాతృవార్త, గిరిచరులారా!. ౩౩౯

క. ఎవఁ డని తలఁచితిరో; జటా, యువు నాప్రియసోదరుం; డహా? తచ్చరితం
జెవి వేసితి రిందులకై, యవిరళమతిఁ జేతు వాక్సహాయము మీకున్. ౩౪౦

సంపాతి జటాయువునకు నివాపోదకం బొసఁగుట

క. సురిగినతమ్మునికిన్ ముం, దఱ నిన్నిజలంబు లిచ్చి, తదుపరి మీ కే
నెఱిఁగింతుఁ గార్యసిద్ధికిఁ, దెరు వగుశుభవచన మొందు, ధీరవిచారుల్. ౩౪౧

క. నను నీటిచెంగటికిఁ గొని, చనుఁ డన నట్లె యని వారు జలనిధితీరం
బునకుం జేర్చిరి, కృతమ, జ్జనుఁ డై తజ్జలములందు సంపాతి దగన్. ౩౪౨

వ. జటాయువునకు నివాపాంజలి నొసంగి, మరల వారలసహాయమున స్వస్థానమ్మునకుం జేరి సంతోషపెట్టుచు వారితో నిట్లనియె. ౩౪౩

సంపాతి యంగదాదులకు సీతజాడ నెఱిఁగించుట

గీ. అలరు నొకపట్టణము లంక యనఁ ద్రికూట, భూధరాగ్రమునందు నప్పురి నశోక
వని మహీసుత సీత పెన్వగను బొగులు, చున్న, దసురాంగనలు గావఁ జుట్టుమూఁగి.

క. జలధినడుమ శతయోజన, ముల దవ్వునఁ గానఁ బడెడిఁ బుర, మదిగో మై
థిలియుం గన్పడుచున్నది, బళిబళి! మాఱుకడ దీనభావముతోడన్. ౩౪౫

ఆ. గ్రద్ద నగుటఁ జూడఁగలను దూరపుఁ జూపు, సంశయించు టుచితసరణి గాదు
నాదుపల్కు మీరు నమ్ముఁడు తడయక, కార్యమునకు నింకఁ గడఁగుఁ డేల. ౩౪౬

సీ. ఉరుజవంబున శతయోజనవిస్తీర్ణ వనధిని లంఘించువాఁడె; రాము
రామ నారసి మఱి రాఁగలవాఁడు; తమ్ముని వధించినదురాత్ముని దశాన
నుని నేనొకండనే తునుముదుఁ గాని; ఱెక్కలు పోయినవి కపికాంతులార!
దాఁటఁ బూనుఁడు ప్రయత్నమున నదీనాథు రఘుపుంగవునిచేత రావణుండు
గీ. మడియుట ధ్రువంబు, మున్నిఁటిఁ గడచి లంకఁ, జొచ్చి, ధరణీకుమారిని జూచి, మాట
లాడి తిరిగి రానోపెడివాఁ డెవండొ; నిర్ణయింపుఁడు మీలోనఁ దూర్ణముగను.

క. అనవుడు వేడుకపడి య, వ్వనచారులు పల్కిరి భగవంతుఁడ! మాకున్
వినిపింపుము నీవృత్తాం, బును ప్రారంభించి సాంతముగ నివ్వేళన్. ౩౮౮

సంపాతి, యంగదాదులకు నిజవృత్తాంతమును జెప్పుట

వ. అని యడిగిన విను డని సంపాతి తనపూర్వచరిత్రంబు తేటపడ నిట్లనియె. ౩౮౯

గీ. సోదరుఁడు మేను నా జటాయువును, యౌవనమున బలగర్వమున నిర్వ్వరమును గూడి
తెలియఁబూన్కి పరస్పరబలము మింటి, కెగసితిమి పటువిఖ్యాతిచే జగము దూల.

వ. అట్లుద్గమించి. ౩౯౧

సీ. "సూర్యబింబము దాఁక సురవర్త్మమున కేఁగి వత్త" మటంచు నుద్వృత్తి బహుస
హస్రయోజనదూర మశ్రమమ్మునఁ బోతి, మనుజుఁ డచ్చోటఁ జండాంశుదీప్తి
సంతప్తుఁడై వివశత నుండ ఱెక్కలం గప్పితి నతని పైఁ గలుగుజాలి,
దానిచే నేను నిర్దగ్ధపక్షుఁడ నయి కూలితి నీ వింధ్యశైలము పయి
ఆ. మూర్ఛఁ గొంటి దూరమువనుండి పడుటఁ, బ్రాణములు వచ్చె మూఁడునాళ్ల, కేను
నెఱుఁగనైతి దేశగిరికూటములు పక్షయుగము గాలి భ్రాంతి యొదవు కతన. ౩౯౨

ఉ. కన్నులు మెల్లగాఁ దెఱచి కాంచితి నం దొకయాశ్రమంబు, వి
ద్వన్నుతశోభతోఁ బొలుచుదానిఁ, దదంతిక భూమిఁ జేరఁగాఁ
దిన్నఁగఁ బ్రాఁకి పోయితి నదే నొకమే లగునంచు నత్తఱిన్
నన్నటఁ జంద్రముండు మునినాయకుఁ డారసి విభ్రమంబునన్. ౩౯౩

సీ. ఇదియేమి? సంపాతి! యిపుడు నీ కీ వికృతాకార మెందుల కబ్బె? నింత
కష్ట మెవ్వానిచేఁ గల్గె? నయ్యో; నిన్ను మును పే నెఱుంగుదు ఘనతరబల
శాలివై యుంటివి, కాలి పోనేల ఱెక్కలు సమ్మతం బేనిఁ దెలుపు మనుచు
నడుగ నేఁ జేసిన దంతయుఁ జెప్పి యాయనకడఁ గొంతసే పట్టె యేడ్చి
గీ. యంటి, మానిశార్దూల! దవానలమున, దగ్ధమగుచున్నయది నాదుతనువు, బ్రతుకు
టెట్లు ఱెక్కలు లేకున్న? నేమిగతి యిఁకఁ గృపామతితో మీరు గావ రేని.

సంపాతి, తనకుఁ బూర్వము చంద్రమౌని యుపదేశించిన
తత్త్వమార్గమును నంగదాదులతోఁ జెప్పుట

క. అని వేఁడికొన దయార్ద్రిన,యనముల ననుఁ జూచి, నాయనా! నామాటల్
వినుము, విని మీఁదఁ దలఁపున, కనుకూలమ్ముగ నొనర్పు మని చెప్పె నిటుల్. ౩౫౫

గీ. దేహమూలము దుఃఖ,మా దేహమయినఁ, గర్మజన్య, మే నను బుద్ధి కాయమందుఁ
గలుగుకతమునఁ గర్మంబు గలుగుచున్న, దిలను బూరుషునకు, దీని నెఱుఁగు మాది.

సీ. తనువునం దే ననుతలఁపె యహంకార మనఁబడు, నది యవిద్యాభవం, బ
నాదియు జడమును నై యున్న, దగ్నిలో నెఱ్ఱఁగాఁ గాల్చిన యినుపగుండు
నందు నయస్సును నగ్నియు విడఁదీయ నలవిగానట్లుగాఁ గలిసియున్న
కైవడిఁ, జిత్తహంకారంబునం బ్రతిబింబించి యుండు నుదంచితగతి.
గీ. ఆయహంకృతితోడ దేహంబునకుఁ బ్రాప్తసంగుఁ దాదాత్మ్యసంబంధసరణి, యుందు
వలన దేహము చేతనవంతముగఁ గనులకుఁ దోఁచుచున్నది పక్షికులవతంస!.

వ. ఆత్మకు నహంకారబలంబున నేను దేహము ననియెడిబుద్ధి వొడముచున్నది. సుఖ
దుఃఖాఫలం గల్పించునీ సంసారంబు తన్మూలంబకాని వే ఱొండుగాదు. వికారశూ
న్య మగునాత్మకు మిథ్యాభూత మైన దేహతాదాత్మ్యసంబంధముచే "నేను దేహ
మను నాచేఁ గర్మము లాచరింపఁబడుచున్న" వని జీవుండు సర్వదా సంకల్పించి
పను లొనర్చుచుఁ బరతంత్రుం డగుటం జేయునది లేక, తత్కర్మజన్యఫలంబులచే
బద్ధుఁ డగుచున్నాఁడు. మఱియుఁ బాపపుణ్యస్వరూపుఁ డై స్వర్గాద్యూర్ధ్వలోక
ములందును నరకాద్యధోలోకములయందును దిరుగుచున్నాఁడు. ౩౫౮

గీ. యజ్ఞదానధర్మాత్మక మైనసుకృత, మధికముగఁ జేసితిని దివి కరిగి నేను
నఖిలసుఖముల హాయిగ ననుభవింపఁ,గల" ననుచు జీవుఁ డెంతయుఁ దలఁచుచుండు.

పిండోత్పత్తి ప్రకారము

సీ. ఆవిధి, "సుకృతి నే" నను భ్రాంతి బహుకాల మమరలోకంబున నధికసౌఖ్య
మును బొంది, పుణ్యనిర్మూలన మైనంతఁ దన కిచ్చ వొడమకుండినను గర్మ
చోదితుం డై కూలు శుభ్రాంశుమండలమం, దటనుండి నీహారసహితుఁ
డై భూమిపైఁ బడి యట వడ్లలోనుగాఁగలగింజలం జిరకాల ముండి
గీ. యన్న మై నాల్గువిధముల నారగింపఁ,బడును బురుషులచే, నటుపైని వీర్య
మై వదలఁబడు స్త్రీయోనియందున ఋతు,కాలములయందు విహగలోకప్రధాన!.

వ. అట్లు వదలంబడి యోనిరక్తంబునఁ గొంచెముగఁ జేరి ద్రవరూప మై కలలసంజ్ఞను
నిలుకడం గాంచు. ఆమీఁద నయిదురాత్రుల కది బుద్బుదాకారంబు వడసి సప్తమ
రాత్రంబునకు మాంసఁపుముద్ద యగు. ౩౬౧

సీ. పదునైదుదినముల కది రుధిరంబునఁ దడుపంగఁబడు, నిరువదియు నైదు
నిశలకు మొలకలు నిగుడు, నాపైఁ గంఠమును దలయును మఱి మూఁపు వీఁపుఁ
గడుపును గ్రమముగాఁ గల్గు మాసమునకుఁ, బాణిపాదంబులుఁ బ్రక్కలు మొల
మోఁకాళ్లునుం బొడమును రెండునెలలకు, సత్యంబు మూఁడుమాసములలోన

గీ. నవయవంబుల కీళ్లగు, నన్నిఁ వ్రేళ్లు, నాల్గునెలలకు నుదయించు, నాస చెవులు
నయనములు దంతపంక్తియు నఖములు మఱి,గుహ్య మైదవనెలను గల్గును, ఖగేంద్ర!

క. విను, కర్ణరంధ్రములు గుద, మును మేఢ్రంబును నుపస్థమును నాఱవ దై
న నెలఁ గలుగు, నేడవనెలఁ, దనురోమము లొదవు మఱియుఁ దలవెండ్రుక లౌ.

క. ఎనిమిదవమాసమందునఁ, బనుపడు స్పష్టముగ నవయవవిభాగం, బి
ట్లనవరతము స్త్రీగర్భం,బున నే గర్భంబు వృద్ధిఁ బొందెడుఁ బక్షీ! ౩౬౪

వ. జీవుఁ డైదవమాసమందె సాకల్యముగఁ జైతన్యమును బొందు. నాభిసూత్రము
నందలి సన్ననిరంధ్రమూలమున జననీభుక్తాన్నసారమును ద్రాగుచు గర్భస్థ మగు
పిండ మాత్మీయకర్మబలంబునం జావక బ్రతికియుండు. ఆసమయంబునం దీ జీవుఁడు
దాను మున్నెత్తినసమస్తజన్మములను నందుఁ జేసినకర్మములు దలఁపునకు రా,
జఠరానలదహ్యమానుం డగుచు నిట్లనుకొనఁదొడంగు. ౩౬౫

గర్భస్థుఁ డగుజీవుని విచారము

సీ. అగణితయోనిసహస్రంబులం బుట్టి దారాపుత్రాదిబంధమ్మును బశు
బాంధవరూపసంబంధంబు లనుభవించితిఁ గోట్లకొలఁదిగఁ, దతకుటుంబ
పోషణాసక్తిచేఁ బోరాని పోకడల్ వోతి న్యాయాన్యాయరీతి ద్రవ్య
మార్జించితిని, స్వప్నమం దైన నారాయణుని బిల్చుటకు నోఁచుకొనకపోతిఁ,

గీ. బరమ పాతకి నై పొంగిపడితి నాఁడు, నేఁడు; తత్కర్మఫల మయి నిర్భర మగు
గర్భవాసదుఃఖ మిట్లు గ్రమ్ముకొనఁగ, నుమ్మలించుచునుంటిఁ జేయునది లేక. ౩౬౬

సీ. అస్థిర మైన దేహమునందు స్థిరపదార్థమునంటుఁ బోలె లోభమును బూని
చెడ్డకార్యమ్ములే చేసితి, నే బాగుపడు పనిఁ జేయఁ బాల్పడఁగ నైతి,
నని పలుతెఱఁగులఁ దనకర్మమున నైసయలజడి కగ్గమై యకట నాకు
నరకోపమాన మై కరము భీకర మగునీగర్భమునుండి యిలను బడెడి

ఆ. సుకృత మెపుడు గల్గు? నికమీఁద సర్వదా, యేను విష్ణుమూర్తి నే యజింతు
వెకలితనపుఁబనులు వెనుకటివలెఁ జేయఁ, బోను జాలుఁ జాలు బుద్ధివచ్చె. ౩౬౭

వ. అనియిట్లు బహుగతులఁ జింత సేయుచు, జీవుండు బహిర్గమనసమయసంజాతయోని
యంత్రప్రపీడచే వంత రెండింతలుగా, నరకంబునుండి కూలుపాతకిరీతిని, దుర్గంధ

భూయిష్ఠ మగు వ్రణంబునుండి పడుపురుపుకరణిని, గర్భమ్మునుండి ధరణిపయిం బడుచున్నాఁడు. ఆగతిం బతితుండై యెప్పటిచొప్పున బాల్యము మున్నగునవస్థా విశేషంబుల నొదవుదుఃఖములం బొందుచుండు. సంపాతీ! యీ పద్ధతి సర్వజనసాధారణ మగుటం జేసి. ౩౧౯

సీ. అందఱు నేఁ జెప్పినట్టిమార్గమునకు బద్ధులు, నీవు నాభంగి నిడుమ
లందినవాఁడవే; యౌవనాదులలోనఁ బొందుదుఃఖమ్ముల గొడవఁ జెప్పఁ
గడఁగిన నెంతయేఁ గాలంబు పట్టుఁ, గావున వాని విడనాడితిని ఖగపతి!
యీ విధి దేహంబ యే ననునధ్యాసమునఁ జేసి నరకమ్ము మున్నగునవి
గీ. గర్భవాసాదిదుఃఖముల్ గలుగుచున్న, వభినివేశతఁ, గాన దేహద్వయాన్య
ప్రకృతికి నతీతు నిర్వృతిప్రదుని నాత్మ, నెఱిఁగికొనవలె సుఖపడ నెంచువాఁడు.

వ. అని చెప్పి యమ్ముని మఱియు నాతో ని ట్లనియె. గృధ్రపతీ! దేహాదులయందు మమకారంబు వోనాడి, యాత్మజ్ఞానంబు సంపాదించు టుత్తమమార్గంబు. ఆత్మను, జాగ్రత్స్వప్నాద్యవస్థలచే విడువంబడి సత్యజ్ఞానాదులే లక్షణముగాఁ దగి, సర్వదోషరహితుండై జ్ఞానస్వరూపుఁడై సదాశాన్తుఁడై వెల్గువానిఁగ నిర్ధరించుకొనవలయు. ౩౨౦

సీ. నిష్కలంకుఁ జిదాత్ముని నెఱింగినంతన యజ్ఞసంభవశరీరాదికలిత
సమధికాహంకారమమకారరూపమోహము సమూలమ్ముగ సమయు, మీఁదఁ
గాయంబు ప్రారబ్ధకర్మబలంబున నిలిచియుండును గాక పోలియుఁగాక
హాని లేదద్దాన, జ్ఞానికి నజ్ఞానకల్పితసుఖము దుఃఖమును గలుగ
ఆ. వక్కలతమున నీవు ప్రారబ్ధము నశించు, వఱకు నొడలిపొత్తు వదలకుండ
సౌఖ్యముగ మెలంగు సంపాతి! కుబుసంబుఁ, బాయునట్టి త్రాఁచుపాముకరణి.

చంద్రమోముని సంపాతికి భవిష్యద్వృత్తాంతము దెలుపుట

క. మఱియొకపరమహితము విను, పరమాత్ముఁడు మాధవుం డవనిపయిఁ ద్రిదశ
సరసిజభూప్రార్థన నవ, తరింపఁగాఁ గలఁ డయోధ్య దశరథసుతుఁడై. ౩౨౧

చ. అనుజు సుమిత్రపట్టిని నిజార్ధశరీరిణి సీతఁ గూడి దు
ర్జనుఁ డగుపంక్తికంధరునిఁ జంపఁగ దండక కేఁగుదెంచు, న
వ్వనిఁ గలయాశ్రమంబునను వా రనుజన్ములు లేనివేళ మె
ల్పునఁ జనుదెంచి వాఁడు గొనిపోవును దొంగవలెన్ మహీసుతన్. ౩౨౩

క. కొనిపోయి లంకనాఁ దగు, తనపురమున నుంచఁగలఁడు, తత్సతి నరయన్
దిననాథసుతుని యాజ్ఞన్, వననిధితీరంబుఁ జేరవచ్చెదరు కపుల్. ౩౨౪

గీ. అందు వారలతోడ నీ కగు సమాగ, మం బొకానొకకతమున, మైథిలీస్థి
తిని యథార్థముగా నాఁడు దెలుపు మీవు,తదవలోకాభిరతుల కత్తరుచరులకు.

క. ఆక్షణమ మరల నూతన, పక్షంబులు మొలచు, దిగులుపడి నవయకు మో
పక్షీశ!" యనుచు మునిహ,ృత్యక్షము బోధించె నాకు, నగచరులారా! ౩౨౬

సంపాతికి మరల ఱెక్కలు మొలచుట

చ. ఇదె కనుఁగొండు మానిపతి యెయ్యది తెల్పె నదేవిధమ్ముగా
మృదువులు నూతనమ్ము లగుఱెక్కలు రెండును మేనఁ దోఁచె, న
భ్యుదయము గల్గు మీకు; నిఁక భూమితనూజను మీరు గాంత్రు, దాఁ
టఁ దరముగానివార్నిధి దృఢం బగుపూనిక దాఁట నెంచుఁడీ! ౩౨౭

సంపాతి, గగనమార్గమునఁ బోవుట

సీ. ఏను బోయెద నింక వానరులార! మీ రనుమానమును బెట్టికొనకుఁ డెంత
మాత్ర; మెవ్వనిపేరు స్మరియించినంతన పరమపాతకియు నపరిమిత మగు
సంసారవారాశిఁ జయ్యన దాఁటి, యుత్తమము శాశ్వతము నౌకమలనాభు
సంస్థానమున సుఖసంగతి నుండునో; యట్టిసురధ్యేయుఁ డఖిలలోక
గీ. సృష్టిరక్షణశిక్షణశీలుఁడైన, భవ్యునకు రామునకుఁ బ్రేమపాత్రులు మఱి
భక్తులును నైనమీ కొకపాటియుప్పు,కడలి దాఁటుట యేపాటికార్య మెన్న?

క. అని చెప్పి గగనపథమునఁ, జనె గృధ్రాధీశుఁ డైనసంపాతి, ధరా
తనయ నరయుబలుతమి నంత నమితహర్షాత్ము లయిరి తరుచరు లగజా! ౩౨౯

వ. అట్లుపొంగి, నిర్వక్రనక్రచక్రభయంకరంబును, నుత్తుంగతరంగసంగతంబును, గగనంబు పగిది దుర్గ్రాహంబు నై తమయెదుట ఘూర్ణిల్లుమహార్ణవంబుం జూచి, మన మిద్దాని నెత్తెఱంగున నుత్తరింపం గల మని యొండొరులు సంభాషించుచుండ వినుం డని తారేయుం డిట్లనియె. ౩౩౦

అంగదుఁడు సముద్రమును దాఁటుటకుఁ గపులఁ బ్రోత్సహించుట

క. కృతవిక్రము లతిశూరులు, మతిమంతు లమోఘబలసమగ్రులు మీరల్,
ధృతి మీలో నెవఁడు సరి, త్పతిఁ జతురత దాఁటి చేసిపని యొనరించున్? ౩౩౧

ఉ. నిక్కము వార్ధి దాఁటి ధరణీతనయం గని వచ్చువాఁడె యీ
తక్కినవారిప్రాణములు దక్కఁగఁ జేసినవాఁడు; వానితో
నొక్కఁడు సాటిగాఁడు మహిమోన్నతి గల్గునుగాన; బల్మిఁ బెం
పెక్కినవాఁ డెవండొ యతఁ"డే"నని నా మునుముందు నిల్చుతన్. ౩౩౨

క. మన కన నేటికి రామున, కును సుగ్రీవునకు నెల్లకోఁతులకుం జ
కృన్నిప్రాణదాత యీపని, నొనరించినవాఁడు, వేఱుయోచన లేలా? ౩౮౩

ఉ. చచ్చిన నేమివచ్చు? నటు చావక యెట్టులొ పొట్టఁబోసి కొం
చచ్చట నచ్చటం దినము లారడి వుచ్చిన లాభ మేమి? భూ
భృచ్చరులార! కీర్తి గడియించిన సార్థకమౌను బుట్టు, వీ
ముచ్చట లేల? మెందు బలముం బ్రకటింపుఁడు కార్యసిద్ధి కై. ౩౮౪

క. ఇదివఱకు మనకుఁ దుద మొద, లెదియుం గనరామిఁ జావ నెంచితి, మిపు డ
య్యది రుడిగెఁ ద్రోవ చిక్కెన, యది కార్యంబునకు, నింక నరయుఁడు వలఁతిన్.

వ. అని యి ట్లుత్సాహంబు పుట్టించుమాట లెన్ని చెప్పినను వా రొకరిమొగం బొకరు
సూచుచు నేమియుఁ బలుకక మిన్నకుండుటం గని యంగదుండు మఱియు నిట్లనియె.

క. తెలియంబలుకుఁడు మీమీ, బలమును వేర్వేఱ నృపునిపని నెగ్గుట, క
వ్వల నెవ్వఁడు సాధింపం, గలఁడో కనుగొంద మేల, కాలము జరపన్? ౩౮౭

కపులు తమతమబలమును బ్రకటించుట

సీ. నావుడుఁ బదియోజనములదూరము మొదలుకొని యొకరికంటె నొకరు మఱి ప
దేసియోజనము లధికముగ దాఁటుదు మని వేఱువేఱుగా నద్రిచరులు
తమతమబలము నత్తఱిఁ జెప్పి, రొకజాంబవంతుఁడు మాత్రము వనధి నించు
కంత కొఱంతగా నంతయు లంఘింతు నని యిట్లనెఁ, ద్రివిక్రమావతార

గీ. మపుడు, భూమానలక్షణ మైనవిష్ణు,పాద మిరువదియొకమారు ప్రౌఢిమైఁ బ్ర
దక్షిణించితి, నిపుడు వార్ధక్య మగుట, సడలె సంధులు తరియింపఁ జాల జలధి. ౩౮౮

వ. అనినఁ దారేయుండు తనబలం బిట్లని చెప్పె. ౩౮౯

క. మున్నీటియవలియొడ్డు జ, వోన్నతిఁ జేరుటకు శక్తియున్నది, మఱి రా
నున్నదొ లేదో; నే నెఱుఁ, గ న్నేరను నన్నలార! కార్య మిఁ కెట్లో? ౩౯౦

వ. అనుడు జాంబవంతుం డతని కిట్లనియె. ౩౯౧

గీ. అధిపతివి నీవు మాకు నియామకుఁడవు, నిను నియోగించుటకు మేము నేర, మెంత,
కైనను సమర్థుఁడవు నిజ మే నెఱుఁగుదుఁ, గాని యిపు డేమిచేయంగ నౌను? మనకు.

అంగదుఁడు మరణమే శరణ మనుట

సీ. అనవుడుఁ దారేయుఁ డను మన మీపనియం దసమర్థుల, మకట యొక్కఁ
డైనను లేఁడు నే నని ముందు దిగుశూరుఁ, డందఱ మందఱ మైతి, మింకఁ

బ్రతుక శక్యముగాదు, పని దీర్పఁగారాదు, మరణంబ శరణంబు మాట లేల?
శయనింత మెప్పటిచందాన దర్భాసనంబుల, నావుడు జాంబవంతుఁ

గీ. డో కుమార! తొందరపడఁ బోకు, కార్య,సిద్ధి యగు, దానికిం దగు నిద్ధబలుని,
నీకుఁ జూపింతు నని యటనిలిచియున్న,యనిలతనయునిఁ గాంచి యి ట్లనియెఁ గాళి!

జాంబవంతుఁడు హనుమంతుని నుబ్బించుట

సీ. హనుమంత! యిది యేమి? యతికష్ట మగుకార్యభారంబు వచ్చి పైఁబడినవేళ
మాటాడ కుంటివి మందునిమాడ్కి, నల్వురఁ జేరరాక దవ్వుగను నిల్చి
తీసమయంబున, నిటు శక్తిచూప కుపేక్ష చేయుట ధర్మవే తలంప?
పవమానవీర్యసంభవుండ వమ్మహానీయునంతటిబలము నీయందుఁ గలదు.

గీ. రామకార్యార్థ మే చుమీ భూమిఁ బుట్టి,నాఁడ వనిలునకుఁ నందనప్రసక్తి;
లోటుపాటులు లేనివనాటుఁడవు భ,వత్పరాక్రమ మమితంబు బాల్యమంద ౩౯౪

చ. దినకరుఁ డేఁగుదేరఁ గని తియ్యఁగఁ బండినపం డటంచు నా
త్మను దలపోసి కైకొన నుదగ్రజవంబున నైదునూర్ల యో
జనములు మింటిపై కెగసి సన్నుతి గంటివి పుట్టినంత నే?
హనుమ! భవద్బలంబును మహామహిమంబును జెప్ప నేరి కౌ? ౩౯౫

క. లే లెమ్ము సువ్రతా! యిఁక, నాలస్యము సేయఁబోకు మధిపతికార్యం
బోలి నొనరించి మా,ప్రాణాలను దక్కించు మయ్య! నావు డతండున్. ౩౯౬

హనుమంతుఁడు సముద్రోల్లంఘనమునకు సమ్మతించుట

గీ. పరమహర్షితుఁ డై పొంగి పంకజాస,నాండముఁ బగుల్చునట్లు భయంకరముగ,
సింహనాద మొనర్చి నిల్చెను ద్రివిక్ర,మాపరావతారం బన, నంబుజాక్షి! ౩౯౭

వ. నిల్చి వారితో నిట్లనియె. ౩౯౮

సీ. లంఘించి తోయధి లంక భస్మముఁ జేసి సకులు దశగ్రీవు సంహరించి
జానకిం దెత్తు, లేదా? నికృష్టుం డైనదైత్యేంద్రు కుత్తుకం ద్రాడు గట్టి
కుడిచేత మెలివెట్టి యెడమచేతను లంక గిరియుతంబుగఁ బెల్లగించి తెచ్చి
రాము ముం దుంతు, లేదా; మంగళాంగిని సీతను జూచి వచ్చెదను, భీతిఁ

గీ. జెందకుం, డిందు నెదియేనిఁ జేసి వత్తుఁ
గాని, మరలి వ్యర్థమ్ముగ రాను, నిక్క
మనుఁడు, జాంబవంతుఁడు బళి? యాంజనేయ!,
భవదమృతసూక్తి మముఁ దేర్చెఁ బ్రతికినాము. ౩౯౯

క. నీ వన్ని చేయుదువు, మన, కా విధ మిపు డేల సీత ననవద్యాంగిన్
జీవోపేతను గనుఁగొని, రా వైళము; భద్ర మగు నరాతిధ్వంసీ! ౮౦౦

జాంబవంతుఁడు ప్రయాణోన్ముఖుఁ డైన పావనిం దీవించుట

ఉ. రక్కసు వీటిపై కరుగు రామునితోఁ జని, నీ పరాక్రమం
బక్కసుదీఱ శాత్రవవధావసరమ్మునఁ జూపవచ్చు, నీ
కెక్కడిసామ్య మన్యులు? మహీసుతవార్తను దెచ్చి రాము న
మ్మక్కృపఁ గాంచఁగాఁ గలవు; వ్యర్థము లౌనె భవత్ప్రయత్నముల్? ౮౦౧

ఆ. ఆకసమునఁ బోవునపుడు శుభం బగుఁ,గాక, రామదేవు కార్యమునకుఁ
బయన మైననిన్నుఁ బవనుండు వెనుకొని, వచ్చుఁగాక, జగము మెచ్చుఁగాక.

వ. అని యాశీర్వదించి పంపఁ గపిసింహంబు మహేంద్రపర్వతశిఖరం బధిరోహించె.

సీ. శైలరాజంబుతోఁ బోలికగలవాఁడు కొలఁదికి మీఱినబలమువాఁడు,
మెఱుఁగారుమేల్మిబంగరురంగుమేనివాఁ డుత్సాహమునఁ దూఁగుచున్నవాఁడు,
దివ్యఫణీంద్రాభదీర్ఘబాహులవాఁడు చంద్రికాధవళహాసంబువాఁడు
కడునెఱ్ఱనై సొంపుగా తెఱుమోమువాఁ డంభోధిపై దృష్టి యమరువాఁడు
గీ. నంజనాగర్భశుక్తిముక్తాయమానుఁ, డనిలుని తపఃఫలంబు మహాత్ముఁడు కపి
రత్న మతఁ డట్లు గిరిశిఖరమున నిల్వ,నాతి! కనుఁగొని వెఱ గందె, భూతకోటి.

వ. అని చెప్పి, ౮౦౨

కాండాంతపద్యములు

చ. నిజభజనానురక్తజననీరజబాలదివాకరా! బుధ
వ్రజపరిగీయమాననిరవద్యనిరూఢగుణాకరా! భవ
ప్రజనితశుష్మివారణపరాయణ! పక్షికులైకనాయక
ధ్వజ! నిరతాగమప్రణుతవైభవ! ధూతనమత్పునర్భవా! ౮౦౩

మాలినీవృత్తము

జనకవచనపాలా! జానకీచిత్తలోలా!
వినిహతరిపుజాలా! వేదవిఖ్యాతఖేలా!
ప్రణుతనయనఫాలా! ప్రాజ్ఞలోకానుకూలా!
వనధిపరివృతేలావ్యాప్తతాఖండశీలా! ౮౦౪

క. భృశవికసితసరసిరుహాస
దృశదృగ్రుచినిచయశమితతీవ్రార్తినమ
ద్వశ! విశదయశోదిక్కృత
శశభృచ్ఛరహీరహారతుషారపటీరా! ౪౧౮

గద్య.

శ్రీమద్భారద్వాజగోత్ర, సీతాంబికాపున్నయార్య చతుర్థపుత్ర,
రామచంద్రకృపాపాత్ర, సూరిజనవిధేయ,
నారాయణనామధేయ ప్రణీతంబగు
నాంధ్రాధ్యాత్మరామాయణంబునఁ
కిష్కింధాకాండము
సంపూర్ణము.



శ్రీరస్తు

శ్రీ సీతారామాభ్యాం నమః

# ఆంధ్రాధ్యాత్మరామాయణము

## సుందరకాండము



శ్రీలలితదయారసమిళి
తాలోకప్రాపితోన్నతాఖిలసంప
జ్జాలా! కౌసల్యాదే
వీలాలితబాల! భువనవిశ్రుతశీలా!.

వ. దేవా! భవుండు భవానికి ట్లనియె. ౨

### హనుమంతుఁడు సముద్రమును దాఁటుట

క. నూఱామడల వెడల్పుగ, భీరమకరనికరనిలయ-భీషణ మగునం
భోరాశి దాఁటఁ బోవుచు, మారుతి యానందమగ్నమానసుఁ డయ్యెన్. 3

క. నాభాగ్యమె భాగ్యము సీ,తాభగవతి నరసి కుశలదశ రామునకుం
బ్రాభవ మొప్పఁగఁ జెప్పెడి, యీభారముఁ గపులు నా పయిం బెట్టుటచే. ౪

క. అని పరమాత్మను రామునిఁ, దనమనమునఁ బరమభక్తిఁ దలఁచుచు స్మేరా
ననమున "జానకికిన్ జయ", మని జయశబ్దంబుఁ జేసి యనె, హైమవతీ!. ౫

చ. నను గగనాధ్వగామిని వనాటు లమోఘము రామముక్త మా
ఘనశర మట్లు చూచెదరు గాక, యిదే యిపుడే రఘూత్తమాం
గనను విదేహరాట్సుతను గన్గొనఁ గల్గుదు వెండి రాముని౦
గనుఁగొనఁ గల్గుదున్ నిజముగా నిఁక ధన్యుఁడ నేను ధన్యుఁడన్. ౬

సీ. మరణకాలమున నేమహానీయుపేరు స్మరించి, యపారసంసృతిపయోధి
సులువుగా దాఁటి నిస్తులతదీయపదంబు వైకుంఠమును బొందువాఁడొ మనుజుఁ;
డట్టిరామునిదూత నై తదంగాంగుళీయకము గల్గినవాఁడ నయ్యు నేను
నామహితాత్మునే ధ్యానించి, యీ స్వల్పతోయధి నుత్తరింతు నను టేమి
గీ. గొప్ప యని బాహువులు సాఁచి కుత్తుక సరి
చేసి, పాదముల్ ముడిచి, దృష్టిఁ బయి నిల్పి
తోఁక నిగిడించి హుమ్మని యాకసమున
కెగసె నంగదాదులు బళిరే యనంగ. ౭

వ. అ ట్లెగసి దక్షిణాభిముఖుం డై. ౮

హనుమంతుని సామర్థ్యమును బరీక్షించుటకు సురలు సురసను బంపుట

సీ. అబ్రాశి మీఁదుగా నతిజవమ్మున మింటఁ బోవునావాయుజుపోకఁ జూచి
వైమానికశ్రేణి, "వాయువేగుఁడు మహాబలవంతుఁ డీ కపితిలకుఁ డొకఁడె
యరుగుచున్నవాఁ డాలంకఁ జొఱ శక్తుఁడా యశక్తుఁడ? చూత మైన" ననుచు
నాలోచనము సల్పి, యనిలజబలపరీక్షార్థమ్ము నాగుల జనని యైన
ఆ. సురస నంపి, "రేఁగుచున్నవానరవీరు, నడ్డగించి, యించు కంతవిఘ్న
మాచరించి బలము ధీచాతురి నెఱింగి, రమ్ము మరలఁ దత్క్షణ"మ్మటంచు. ౯

వ. ఇట్లు. ౧౦

క. ఘనకౌతూహలమున సుర,లనుపఁగ హనుమద్ధృతిఁ దెలియఁ, నతిశీఘ్రముగాఁ
జని బాట కడ్డ మై యిట్లనె ముందఱ నిలిచి సురస యతివిరసముగన్. ౧౧

క. ఆఁకటిపెల్లున సుడివడు, నా కాహారముగఁ జేసినారు నిర్జరు నా
కౌకసులు; నోరు సొఱుము వృథాకాలక్షేప మేల? తరుచర! యనుడున్. ౧౨

ఉ. నీ వనినట్లె చేతు జననీ! విను నావచనమ్ము, రామధా
త్రీవరు నాజ్ఞచొప్పునఁ దదీయసతీమణి సీతఁ గానఁగాఁ
బోవుచునుంటి, నాపనిని బూర్తి యొనర్పక నిల్తు నేని దో
షావళి చుట్టుముట్టికొను, నక్కట; దుర్మృతి సైఁప నేర్తునే?. ౧౩

క. భూపతి యాజ్ఞకుఁ దప్పిన, పాపిష్ఠుఁ గృతఘ్ను నన్ను భక్షించినచోఁ
బాపము రాదే నీకును?, గాపురుషునిఁ గుక్క లైనఁ గదియవు తినఁగన్. ౧౪

సీ. ఈమెయి నీనోట నేఁ బ్రవేశింతు నే; నుభయులకును సుఖ ముండఁ బోదు
చావు నా కెట్లును సంసిద్ధ మంబ! దెబ్బలు కొందువయొ దొర దలఁచుకొన్నఁ?

గా దన్న నెదిరింపఁగా శక్తి యున్న దే? నీముందు నే నెంత నిశ్చయముగ
సీతను జూచి, తత్క్షేమసమాచార మధిపున కెఱిఁగించి యవల వచ్చి
గీ. తావకమనోరథముఁ దీర్తు దారి యొసఁగు
మడ్డగింపకు వందన మాచరింతు
నని ప్రణతిపూర్వకముగ నా హనుమ కార్య
సాధనమునకుఁ బలుక లక్ష్యముగఁ గొనక, ౧౫

వ. సురస యిట్లనియె. ౧౬

ఉ. నీ టకటొంకుమాటలు వనేచర! నాకడఁ జెల్ల, పేటి కి
చ్చోటను బాపపుణ్యముల సుద్దు? లనార్యము జాఠరాగ్ని నా
నోటను జొచ్చి పొ మ్మొఁటులనో; యటు సేయవయేని నేన బా
హాటముగా గ్రసించి జఠరానలముం శమియింపఁ జేయుదున్. ౧౭

ఆ. చంపువారికడకు సమయంబు దాఁటిన, మరలి వచ్చువారు మహిని గలరె?
ఎదుటఁ దోఁచుఫలము నెద్ది భక్షింపక, విడిచిపుచ్చునట్టివెఱ్ఱు లెవరు?. ౧౮

క. అని పరుషముగాఁ బలికిన, హనుమంతుం, "డేమి దీని యఁతిశయ" మని లో
ననుకొని, సురసా! య ట్లయి, న నోరు దెఱువు మతిరయమునం బోవలయున్.

క. వినకుంటి వెంత చెప్పినఁ, బనియున్నది నిలువ వలనుపడ "దూఁ కాని"
మ్మని యెదుట నిలువఁబడె నో, జనదీర్ఘాంగుఁ డయి యపుడు సారసనయనా!.

హనుమంతుఁడు సురసాగర్భమును జొచ్చి వెడలుట

సీ. మారుతాత్మజు రూప మారసి ఫణిమాత, తనవక్త్రి మైదుయోజనము లంత
వెడలుపు గావించె, వెంటనే యాతండు పదియోజనముల రూపంబు దాల్చె,
వింశతియోజనవివృతాస్య యయ్యె నాగాంబ, త్రింశద్యోజనాంగుఁ డయ్యెఁ
దరుచరవీరుఁ, డంతట సర్పజనని యాననము నేఁబదియోజనములు దెఱచెఁ,
ఆ. దద్విధంబుఁ గాంచి తత్క్షణ మంగుష్ఠ, మాత్రుఁ డగుచుఁ బావమాని వదన
గహ్వరంబు సొచ్చి క్రమ్మఱ వెలువడి, యెదుట నిల్చి సురస కిట్టు లనియె. ౨౧

ఆ. మాట త్రోసివేత మర్యాదగా దని, నోరు సొచ్చి నీవు కోరినట్లు
నిర్గతుండ నైతి, నీకుఁ బ్రణామంబు, పోయివత్తు సెలవుఁ బొంది, దేవి! ౨౨

వ. అనవుడు నాగజనని యిట్లనియె. ౨౩

ఉ. పొ మ్మిఁకఁ బొమ్ము రాముపనిఁ బూర్ణముసేయుము, నేను నీదుస
త్త్వ మ్మది యెట్టిదో తెలియువాంఛ సురల్ పనుపంగ వచ్చినా

నిమ్మొయి, నీకు దుర్ఘట మొకింతయు లే, దవనీసుతం బ్రబమో
దమ్మునఁ జూడఁగాఁగలవు, దాశరథిం గననేర్తు వవ్వలన్. ౨౪

క. అనిపలికి, దేవలోక, మ్మున కాయమ వోయె, వాయుపుత్రుండును తీ
ఝ్వన గగనపథమునం జనె, వినతానందనుని మాడ్కి, విమలేందుముఖీ! ౨౫

సముద్రుఁడు మైనాకుని బ్రోత్సహించుట

వ. ఆసమయంబున మణికాంచనసమంచితంబై తనలోనణఁగి యున్న మైనాకశైలమ్ముం
గని సముద్రుం డిట్లనియె. ౨౬

సీ. మైనాక! వాయుకుమారుఁడు బలశాలి హనుమ శ్రీరాము కార్యంబుఁ దీర్ప
నుఱుకుచున్నాఁడు గ్రచ్చఱ సహాయుఁడవు గ మ్మీ మ్మొ వానికి సంశయింపవలదు,
మును సగరాత్మజుల్ నను వృద్ధి సేసినకతమున నేను సాగరుఁడ నైతి,
నా సగరాన్వయమందు లోకేశుండు రాముండు దశరథరాట్సుతుఁ డుగఁ
గీ. గలిగినాఁ, డా మహాత్ముని కార్యసిద్ధి, కొఱకె నేఁ డొంటి నీగాడ్పుకొడు కరిగెడు,
లెమ్ము తోయమ్మునుండి వేగమ్ము నీ పయిని నొకించుక కూర్చుండి యేఁగుఁ గాక.

గీ. పయనమా కడుదీర్ఘ, మాపయిని గగన, గమన, మందులో నొక్కండు, గట్లుచెట్లు
లేనివట్టిజలంబు, కాలాన దెందుఁ, గ్రింద, నందుచేఁ గడుశ్రమ మొందఁ బోలు.

క. రామునిపనికై పోయెడి, సామీరి పథిశ్రమంబు సడలించిన నెం
తే మేలు గల్గుఁ దడయకు, నా, మైనాకుం డలరి వనధిపల్కులకున్. ౨౭

మైనాకుఁడు తనపై విశ్రమింప హనుమంతుని బ్రార్థించుట

వ. సమున్నతుండై నానావిధమణిమయంబు లగుశిఖరంబులతో నర్ణవగర్భంబునుండి
యావిర్భవించి, పర్వతోపరిభాగంబున మనుష్యాకృతిం బొడకట్టి గాడ్పుపట్టి కిట్లనియె.

ఉ. ఓ కపిసింహా! నాదుపలు కొక్కటి నీచెవిఁ జొన్పు, మేను మై
నాకుఁడఁ ద్వత్పితృసఖుండనయనమ్మునకై ననుఁ బొమ్మటంచు ర
త్నాకరుఁ డంప వచ్చితిని, నాపయి నించుకసేపు నిల్వు, లో
కైకమహోపకార మగునట్టిపనిం బొనరింపఁ బూని తౌ. ౩౦

క. అమృతోపమానములు ప, క్వము లీఫలములు భుజించి తుణ మిందుఁ బథి
శ్రమ మడఁగ విశ్రమించి సు, ఖముగాఁ బోఁగలవు మీఁదఁ, గపికులతిలకా! ౩౧

క. జగదీశు కార్యము సే, యఁగ నేఁగెడుపుణ్యమూర్తి వనిలజ! నీ ప
ద్యుగళస్పర్శ మొదవుచో, నగణితము మదీయసుకృత మని భావింతున్. ౩౩

క. రారమ్ము కూరుచుండుము, వేఱె తలంపకుము సర్వవిధముల నీ మేల్
గోరెడిపరమాప్తుఁడ నన, మారుతి యీగతిని బలికె మైనాకునితోఁ. ౩౪

సీ. జానకీపతి పని సాధింపఁ జనునాకు ఫలభక్షణం బెట్లు వలనుపడును
గృతకృత్యుఁబోల్కి హాయిగ విశ్రమించు టేగతి సంభవించు? నొక్కత్రుటి యైన
నిల్చుంటఁ జెల్లదు, నీవు పుణ్యాత్ముఁడ వని కరాగ్రంబున నతనిశిఖర
మాదరంబున ముట్టి, యటుకొంతద వ్వేఁగ హనుమంతు నీడ ఛాయాగ్రహంబు
గీ. బలిమిమెయిఁ బట్టె, దేవి! యప్పాపచరిత, పేరు సింహిక, భీకరాకార, కడలి
లోన నెప్పుడు నివసించి పైనఁ బోవు, వారి భక్షించు నీడను బట్టిలాగి. ౩౫

హనుమంతుఁడు ఛాయాగ్రహమును జంపుట

సీ. కపిసింహుఁ డటు సింహికాగృహీతుం డయి ముందుఁ బోలే “కిదేమో విచిత్ర,
మే విఘ్నకారిచే నావేగ మిటు కుంటువడె? నేమియును గనఁబడుటె లేదు?
ఆశ్చర్య మగుచున్న దౌర! మంత్రావరుద్ధభుజంగముభంగి స్తంభ మట్లుఁ
గదలలేకుంటి” నంచుఁ దలంచి క్రిందివైపునకు దృష్టిని మరల్చెను భవాని!
గీ. అంత ఘోరరూపిణి పర్వతాభదేహ, సింహిక గనంబడిన మహారంహ మొప్ప
జంయమునం బడి కిన్కతోఁ జరణములనె, మరణ మొందించి దివికిఁ దా మరల నెగసె.

వ. అ ట్లెగసి, తరుచరహార్యక్షుండు దక్షిణాభిముఖుం డై పోయి, నానావిధఫలభూజ
విరాజితంబును, నశేషమృగపక్షిసంకులమ్మును, నిష్పన్నవీరుత్పరివృతంబును, నేత్ర
పర్వంబు నగునంభోరాశిదక్షిణతీరంబు సేరి, యం దుండి యనేకప్రాకారశోభితం
బై నిరవధికపరిఘావేష్టితం బై త్రికూటాచలమూర్ధమ్మునం బొంక మ్మగులంకా
పురంబును దర్శనీయ మైనదాని దర్శించి. ౩౬

హనుమంతుఁడు లంకాపురప్రవేశోపాయము నాలోచించుట

సీ. “ఏను బ్రవేశించు టెట్టు లీలంకను గడునసాధ్యంబుగాఁ గానిపించెఁ
బగ లందు మేని బొత్తుగ వీలుగాదు గే యైనను నీయున్కి నరుగఁదగదు
సూక్ష్మదేహముఁ దాల్చి చొచ్చెద, రావణపాలితం బైనయీపత్తనంబు
సొబ గేమి?” యని మరుత్సూనుఁ డాలోచించి, పంకజబంధుండు క్రుంకుదాఁక
ఆ. నం దె యుండి రాత్రి యగుటయుఁ బురిఁ జేరి, పరు లెఱుంగరానిభంగి స్వల్ప
కాయుఁ డగుచు మెల్లగాఁ బ్రధానద్వార,మందుఁ గాలువెట్టె, సుందరాంగి! ౩౭

వ. తత్క్షణంబునఁ దద్రక్షణమ్మున కందు నివసించియున్న రాక్షసీవేషధారిణి యగు
సాక్షాల్లంకాపురి రామకింకరు హుంకృతి నదల్చుచు నిట్లనియె. ౩౮

మ. నిలురా రాకుము నీ వెవండవు నను౯ లెక్కింప కీరాత్రిఁ దె
క్కలికాఁడుం బలెఁ జొచ్చి యేమి నలుపంగానుంటి వస్మత్పురి౯,
బళిరే? వానరరూపు లోనికి నినుం బంపించునం చెంచితే?
తులువా! నాకనుగప్పి పోవుట కశక్తుం డెంతవాఁ డేనియున్. ౮౦

క. లంకిని న న్నెఱుఁగవు నీ, విం కేడకుఁ బోదు? వనుచు నెట్టనికన్నుల్
మంకెనవిరి నొరయఁగఁ బెను, కింకం దన కాలఁ దన్నెఁ గేసరిపుత్రున్. ౮౧

క. ఆ తన్నున దానిబలం, బేతన్మాత్ర మ్మటంచు నెంచి నభస్వ
త్సూతి తనవామముష్టి౯, భూతలమునఁ గూలఁబడఁగఁ బొడిచె, నవజ్ఞన్. ౮౨

లంక, బ్రహ్మోక్తిని హనుమంతునకుఁ దెల్పుట

క. ఒక్కమొగి నోట నెత్తురు, గ్రక్కుచు క్షణ మూఁడి లేచి కపికాంతునితో
నిక్కరణిఁ బలికె లంకిని, యక్కమలాసనునివాక్య మవగత మగుటన్. ౮౩

సీ. అనఘ! యథేచ్ఛగా నరుగు మెందుల కింక? నీకు మంగళ మగు నిశ్చయంబు
కడిమిమై నేఁడు లంకను జయించితివి ని న్నాఁగువాఁ డీ పురమందు లేఁడు
తోయజాసనుఁడు నాతోఁ జెప్పె మున్ను "ధాత్రీతలమున నిర్వదియెనిమిదవ
త్రేతాయుగమున నాచేతఁ బ్రార్థితుఁ డయి యాదినారాయణుఁ డవ్యయుండు
గీ. రాముఁ డనఁ బుట్టు భూమిభారము హరింప, దశరథాధీశ్వరునకు, సీతయన జనక
వేశ్మమున యోగమాయ యావిర్భవించు, నంత భార్యానుజోపేతుఁ డై యతండు.

సీ. అడవికిఁ బోఁగలం, డట మహామాయ యాధరణిజ౯ హరియించు దశముఖుండు
పిదప సుగ్రీవుని ప్రియమిత్ర మయ్యెడు రామభద్రుం, డంత రవి సుతుండు
జానకి౯ వెదుకంగ వానరులం బంపఁగలఁ, డందులో వీర్యకలితుఁ డొకఁడు
నీయొద్ద కరుదెంచు రేయి, నీతర్జనభర్జనములకుఁ దా భయము గొనక
ఆ. పొడువఁగలఁడు నిన్నుఁ బిడికిటఁ, దన్ముష్టి, హతిని నీకుఁ బీడ యలమినపుడ
నాశ మొదవు దనుజనాయకునకు నిక్క, మనఘురాల!" యనుచు నగచరేంద్ర!

ఆ. పాపరహిత! బ్రహ్మపలికినపగిది స,ర్వమును జరిగె నీకఁ గొఱంత లేదు,
విజితయగుట లంక విజితంబు సర్వంబు, దేవిఁ జూడఁ బొమ్ము తీవరముగ. ౮౬

వ. దశగ్రీవు నంతఃపురంబునం దుత్తమ మగుక్రీడోద్యాన మొండు గలదు. అద్దాని నడుమ వేల్పుమ్రాఁకులతో నిండినయశోకవన మలరారుచుండు. తద్వనంబు మధ్య మహోన్నతం బగుశింశుపావృక్షం బక్షిపర్వంబు సేయు. ౮౭

క. ఆనగము మొదట జానకి, దానవకామినులు ఘోరదర్శిను లెపుడుం
బూనిక రక్షింపఁ బతి,ధ్యానైకాత్మ యయి యున్న దనిలకుమారా! ౪౮

క. చను మచటి కా జగన్మాతను జూడుము కన్నులారఁ, దడయక శ్రీరా
మునికడకుఁ జని సమస్తంబును జెప్పుము సుకృతి వగుదువో; హనుమంతా! ౪౯

వ. ఇదియుం గాక. ౫౦

సీ. నేను గృతార్థ నైనా నిప్డు, చిరకాలమునకు సంసృతిపాశమోచని యగు
రాఘవస్మృతియు దుర్లభతరతద్భక్తసహవాసమును గల్గె, జానకీసుఁ
డాత్మఁ బ్రసన్నుఁ డై యధివసించునుగాక, యనుచుఁ దిరోహిత యయ్యె లంక,
యగచరశార్దూల మంబురాశిని దాఁటినప్పుడ యెడమక న్నదరె సీత,
గీ. కదరె వామభుజంబు దశాననునకు, నదరె మఱియు వశ్యేంద్రియుఁ డైనరామ
భద్రు దక్షిణపార్శ్వంబు ప్రమద మొదవ, నంబికా! విను మంత వాతాత్మజుండు.

వ. సముత్కృష్టశోభా శోభిల్లు జగద్వేదనాకరుపుటభేదనంబులోనికిం బ్రవేశించి,
సూక్ష్మశరీరంబునం బురంబు నల్గడలుం దిరిగి చూచి పుడమిచూలిం దిలకించు
తలంపున రాజభవనంబున కేఁగె, నందు. ౫౨

క. కలతావు లెల్లఁ జూచియు, నెలఁతలమానికముఁ గాననేరక, లంకో
క్తులు దలఁచుకొనుచు మదిఁ గరువలికొమరుఁడు వడి నశోకవనికిం జనియెన్. ౫౩

సీ. కల్పవృక్షముల ననల్ప మై, మణిమయసోపానములతోడ సొంపునింపు
నడబావులుం గల్గి, నానాపతంగమృగప్రకీర్ణం బయి, కనకసౌధ
ముల దర్శనీయ మై, ఫలభరానమ్రశాఖాగ్రపాదపనికరావృత మయి
యంద మౌనావనమందలి ప్రతివృక్షమున వివేకమున భూపుత్రి నరసి,
ఆ. యవలి కేఁగఁ గాన నయ్యె నాకాశంబు,నొరయునట్టిదియు ననుత్తమంబు
దైత్యరాజపూజితము మణిస్తంభశ,తాన్వితంబు దేవతాలయంబు. ౫౪

వ. తదీయవైభవవిశేషంబున కక్కపికంఠీరవుండు విస్మితుం డై దానిం గడచి మఱి
కొంత దవ్వేఁగి, నిరవకాశనిబిడపత్రంబును నదృష్టాతపంబును స్వర్ణవర్ణవిహంగమ
సమాకీర్ణంబును సమున్నతంబు నగుశింశుపావృక్షంబు నీక్షించె. తన్మూలతలంబు
నందు. ౫౫

హనుమంతుఁడు సీతను జూచుట

సీ. దశకంధరనియుక్తదనుజాంగనల మధ్య నుస్సురస్సురని పరున్న దాని
సంస్కార మొదవమిఁ జడగాఁగఁ బెనవేసికొని సోరుదొలఁగినకురులదానిఁ

ప్రాణేశ్వరుని నెడఁ బాసి నప్పటినుండి యుపవాసములఁ జిక్కి యున్నదాని
మలినాంబరము దాల్చి కళలేనిమోముతో నేప్రొద్దు లోలోన నేడ్చుదానిఁ
గీ. దగినరక్షకుఁ బడయనిదాని, రామ!, రామ! యని పల్కుదాని, ధరాతలంబు
నొందినట్టిదేవతయన నొప్పు దాని, జానకిని గాంచె నా హనూమానుఁ డగజ!

గీ. కాంచి, చెట్టెక్కికొమ్మలం గలుగునాకులందు డిటముగఁ గూర్చుండి,యరసి మరల
ధన్యుఁడను ధన్యుఁడను నేను ధరణిసుతను, గంటి, రాముని పనిసేయఁగంటి,మంటి.

హనుమంతుఁడు తనకృతార్థతకు నుబ్బుట

*క. సకలభువనంబులకు నా, యకుఁ డగు శ్రీరామభద్రు నర్ధాంగిని మా
మకపూర్వపుణ్యమునఁ గా,నక కానక కంటి నిపుడు, నా కొరు లెనయే? ౫౮

క. నాతలఁ దన్నినశౌర్యో,పేతులు కపివరులు లేరె పెక్కురు? నాకే
సీతాదర్శన మబ్బుట, సీతేశు ననుగ్రహ మని చెప్పఁగ నొప్పున్. ౫౯

*ఉ. ఎక్కడ నేను? నాదుబల మెక్కడ? సంద్రము దాఁటు టేడ? యీ
చక్కి నిశాచరేంద్రుపురి సర్వము జంకనుమాట లేకయే
యొక్కటి రాత్రిఁ గ్రుమ్మరుట యేడ? కృతార్థుఁడ నైతి నంచు నే
నిక్కడఁ బొంగు టేడ? యిదియెల్లఁ దదీయమహత్త్వమే యగున్. ౬౦

సీ. అని సర్వమునకు రాముని యనుగ్రహమె మూలం బని మదిని దలంచుచుండు
నంతలోఁ గిలకిల యను రవ మంతగపురము వెలుపలఁ బుట్టె నమితముగను
నిదియేమి యని వానరేంద్రుఁ డాకులలోనఁ బరుఁకుఁ గనరానిభంగి డాఁగి
పదిశిరంబులును నిర్వదికరంబులు గల్గి కాటుకప్రోవును దీటుగోరు
గీ. నల్ల నగుమేనితో నంగనాసహస్ర, పరివృతుం డయి తా నున్న పాదపంబు
వైపుగా వచ్చుచున్న రావణునిఁ జూచి,యద్భుతాక్రాంతమానసుం డయ్యెఁ గాళి!

రావణుని స్వప్నవృత్తాంతము

సీ. ఇంతకు మున్నె లంకేశుండు నాకు రాఘవునిచేఁ జావు శీఘ్రముగఁ గల్గు
టెట్టు లొకో; హరియించితిఁ బ్రియసతిం "దన్నిమిత్తం బైన దండువెడలి
నాపయి రాకుండునా?" యనునూహ, నయ్యదియు వ్యర్థం బయ్యె; నమ్మహాత్ముఁ
డిటకు రాకుండుట కేమి కారణము? సర్వజ్ఞున కొకరు చెప్పఁగవలయునె?
గీ. యనుచుఁ దనమానసమున నహర్నిశము ర,
ఘూత్తమునె చింతసేయుచు నుండు, నట్టు
లుండి,యానాఁడు నిదురయం దొక్కస్వప్న,
మపరరాత్రమ్మునను గాంచె నద్భుతముగ. ౬౧

వ. ఆకలయందు. ౬3

గీ. "కామరూపధరుం డగుకపి యొకండు, సూక్ష్మతనుం డయి సీతను జూచుచుండెఁ
జెట్టుపై నుండి" యని తన్నుఁ జేరి రామమూర్తి చెప్పినట్లుగ దశముఖుఁ డెఱింగె.

చ. కల నిజమాటయుం గల దొకానొకవేళను, నేను బోయి ము
ల్కులు కెనయైనపల్కులను క్షోణిజకుఁ వ్యథఁ గూర్చి దుఃఖముం
గలుగఁగఁ జేతుఁ దద్విధముఁ గాంచి వనేచరుఁ డేఁగి వెంటనే
తెలుపును రామభద్రునకుఁ దీరు మనీప్సిత మంతమీఁదటన్. ౬౪

క. ఈవిధి నాలోచించుచు, రావణుఁ డటు సీతకడకు రయమునఁ బోయెఁ
దేవీ! పరివేష్టితరమ, ణీవరమంజీరకింకిణీరవ మగరన్. ౬౬

గీ. ఆనినాదము విని భయ మంది సీత, ముడిచికొని యవయవములు, ముఖము వంచి
చిత్తమును బ్రాణవిభునందుఁ జేర్చి కనుల, నీరు గార్చుచునుండె నంభోరుహాక్షి!

రావణుఁడు సీత యెదుట రాముని దూఱుట

వ. అప్పుడు దశాననుం డచ్చంద్రాననం జూచి యిట్లనియె. ౬౭

సీ. సుందరీమణి! నన్నుఁ జూచి వ్యర్థంబుగ నడఁగియున్నా వేమి? యూర్మియందు
రాముండు సానుజుఁ డై మృగంబుల మధ్య నడవి నున్నాఁడు గదా యిపుడును;
నాతని వ్యవహార మతిచిత్ర మొకవేళఁ గనవచ్చు నొకవేళఁ గానరాఁడు
రాముని గన్గొని రం డని నేను బంపించితి దూతలఁ బెక్కుమార్లు
గీ. వారు కాలీచపడఁగ సర్వమును రోసి, యెందుఁ గనరామి వ్యర్థులై యేఁగుదెంచి,
రించు కైనను నీపయి నిచ్చలేని, వాని కేడ్చెదు సుఖ మేమి వచ్చుఁ దాన. ౬౯

వ. ఇదిగాక. ౭౦

సీ. నిన్నిట కేఁ దెచ్చి యెన్నినా ళ్లాయెను? జీవించియున్నచో; నీవిభుండు
వెదుక రాకుండునే? వెలఁది! నీ కాతనిపై నున్నయట్లు నీపైని బ్రేమ
యాతని కున్నట్టు లగపడ, దుభయుల కుండిన దాంపత్య మొప్పగాని
యీ వొక్కదాని వి ల్లింతగాఁ బొరలాడిన నే మగు నక్కటకట?
గీ నీ వలనికౌఁగిలింతల సేవల సుఖ, మొంది, నీ విట్టు లాపద నొంది కుంద
నాదుకొన రానినిర్దయు నతికృతఘ్ను, పేరు దలఁచెద వెంతటి బేల వబల!.

గీ. త్వత్కృతాఖిలభోగముల్ తావకీన, ఘనతరగుణావళియును దా ననుభవించి
యుండి, నీగతి నరయక యున్నవాఁ డతండు నిర్గుణుఁ డధముఁ డింతయు నిజంబు.

30

సీ. అనురాగహీనుఁ డేలా వచ్చు? నదిగాక మాని, మూఢుండు నిర్మముఁడు పరుఁడుఁ
ద్వంద్వముఖుఁడు నరాధముఁడు నిస్సత్త్వుఁడు మానిని! పండితమానవంతుఁ
డగువాని కేడ్చి యే మనుభవింపంగల? విస్సి నేఁ దెల్పెడిహితము వినుము
నీమీఁదియాశతో నిల్చినవాఁడ రక్షశ్శ్రేష్ఠుఁడను త్రిజగత్ప్రభుండ

గీ. నేను; ననుఁ బ్రీతిఁ బొందు మాపైని నీకుఁ, గలుగుభోగభాగ్యముల వైఖరిని జూడు,
మెందులకుఁ గొఱగాని యమ్మందమతిని, గట్టికొని యేమిసౌఖ్యంబుఁ గంటి, వతివ!

క. న న్నేలు మమరకిన్నర, పన్నగగంధర్వయక్షభామలు నీ క
న్నన్నల వర్తింతురు మో, పిన్నికరములోన నీవ శ్రేష్ఠవు, ముదితా! ౨౮

ఆ. తెలియ లేవుగాని తెఱవ! బిడౌజుఁ డేక, వ్రేలుపెట్టి చూప వెఱచు నన్నుఁ,
గొఱంత యేమి గలదు కోరి వరింపుము, వచ్చుసిరిని ద్రోయువారు గలరె? ౨౯

సీత రావణుని దూషించుట

వ. అని పలుతెఱంగులం బ్రలపించుపౌలస్త్యదండిరాయని యవాచికంబుల కులికి, రాఘవ యోష రోషవతి యై పరపురుషసంభాషణంబు సమక్షంబునం బతివ్రత కనుచితం బగుటఁ జేసి తృణమ్ము నొకదాని మధ్యస్థముగఁ జేసి యధోముఖంబున నిట్లనియె.

సీ. నీప్రగల్భము లింక నిల్పుము రావణ! యింతటిమొనగాఁడ వేని; నాఁడు
బాహాటముగ రాక పడిమాటి తేటికి? మాయసన్యాసిగా మాన మేది
భయపడినావు నాభర్తను జూచి, యీమాట యథార్థమ్ము మఘమునందు
నలరుహవిస్సు దొంగిలుకుక్కమాదిరి నన్న దమ్ములు లేనియపుడు పొంచి,

గీ. నన్న పహరించినావి దేనా మగటిమి; పొంగిపడకుము తత్ఫలమ్మున గుడుతువు
నేఁడొ రేపొ రఘూత్తము నిష్ఠురాస్త్ర, నిహతి నిలఁ గూలకుందువే? నీవు నీచ!

క. ఏనాఁడు రామశరహతి, దానవ! నీమేను ఖండితం బగునో; నీ
వానాఁడుగాని యెఱుఁగ వమానుషముగ నమ్మహాత్ముమహిమము, మఱియున్.

క. శరవహ్ని నింకఁ జేసియొ, నుర వగుసేతువును గట్టియో; సాగరమున్
దరియించి కయ్యమున నినుఁ, బొరిగొన రాఁగలఁడు నావిభుఁడు సానుజుఁ డై. ౨౯

చ. అనృతముగా దిదెల్లఁ గనులారఁగఁ జూతువు ముందుఁ, దొందరిం
చినఁ బని యౌనె? నీసుతుల సేనల నిన్ను వధించి యాజిఁ, గై
కొనిచను నన్న యోధ్యకు నకుంఠితలీల సురాళి మెచ్చ, నే
మనుకొనినావొ; రాముని మహత్త్వ మచింత్యము, రాక్షసాధమా! ౩౦

క. ఎఱుఁగక తలపెట్టితివో; యెఱిఁగియె తలపెట్టినావొ; యెటు లైనను నీ
మరణంబు నిశ్చయము దు, శ్చరితా! యమదర్శనంబు సమకూరును లే? ౩౧

చ. అనవుడుఁ దన్ను లెక్కఁగొన కాయమ తీవ్రత దోఁపఁ బల్కుటన్
విని కను లెఱ్ఱఁజేసి యతివేలరుషన్ దశకంఠుఁ, డౌర? కా
మిని యని యూరకున్న సుతి మించుచు నున్న దటం చుదగ్రతం
దనకరఖడ్గ మెత్తి, వసుధాసుతఁ జంపఁగఁ బోయె నంబికా! ౮౨

రావణునకు మందోదరి హితము దెలుపుట

వ. అప్పుడు భర్తృహితైషిణి యగుమందోదరి జీవితేశ్వరు స్త్రీవధోద్యుక్తు నివారించి యిట్లనియె. ౮౩

సీ. అమరకాంతలలోన నహిభామినులలోన గంధర్వసతులలో గణ్యతగల
సుందరు లెందఱో సుఖపెట్ట నున్నారు మదరాగనేత్ర లై మమత మిగుల,
నిన్నుఁ దప్ప వరింప నేర రన్యుని వారు, లేఁతతనంపు టీచేఁత లేల?
కడుదీనురాలు నెప్పుడు నేడ్చునది చిక్కి శల్య మైనదియు నసహ్యము నగు
ఆ. నీ మనుష్యకాంత కేటి కింతశ్రమమ్ము, చాలు విడువు మింకఁ, జంపఁ బోకు,
"పంక్తిముఖుఁడు మర్త్యభామను గోరె" నన్, పలుకు విన్న జగమె పరిహసించు.

క. నిర్జరుల వెట్టిగొనియెడి, యూర్జితుఁడవు స్వల్పమునకు నొగ్గుట తగునే?
దార్జన్యము పరువగునే?, యార్జించినకీర్తి పోదె; యసురాధీశా! ౮౫

వ. అని యిట్లు హితం బెఱింగింప నిలింపవైరి చంపకనాసను జంపుతలంపు మాని, యందుఁ గలవికృతాస్యలం గొందఱఁ గాంచి వారితో నిట్లనియె. ౮౬

ఉ. ఈ కలకంఠి, యీసుదతి, యీవికచాంబుజపత్రనేత్ర తా
నా కనుకూలయై ప్రియమునన్ స్మరసౌఖ్యము లిచ్చుభంగి మీ
ధీకుశలత్వ మేర్పడఁగఁ దేర్చుఁడు చూపుచు సామదానముల్,
కైకొనకున్న నిష్ఠురముగా భయపెట్టఁగఁ బూనుఁ డాపయిన్. ౮౭

క. మాసద్వయమ్ములో నాకీసతి వశ్య యగునేని హితభావమునం
దా సౌఖ్యసమన్విత యై, యాసురరాజ్యరమ నేలు హాయిగ నాతోన్. ౮౮

క. రెండునెలలపై నిట్లే, మొండితన మ్మూని శయనమున కొప్పనిచో;
ఖండించి తెండు ప్రొద్దుటి, తిండికి నోం డేల? మీ కిదే యాజ్ఞ సుఁడీ. ౮౯

క. అని యంతఃపురి కరిగెను, వనితాయుతుఁ డగుచుఁ బంక్తివదనుఁడు, దనుజాం
గన లంత మూఁగికొని తర్జనముల సీత భయపెట్ట సాగిరి, గౌరీ! ౯౦

### రాక్షసస్త్రీలు సీతను భయపెట్టుట

క. ఓయువతీ! పరికించితె?, నీ యౌవన మేఁగుచుండె నిష్ఫలముగ, దై
తేయవిభుఁ గూడి సఫలము,సేయు మని యొకర్తు పలికెఁ జెవిఁ గటువుగన్. ౯౧

*క. నీ వెంతవెఱ్ఱిదానవు, దేవేరిఁగఁ జేతు ననుచుఁ ద్రిజగత్పతి తా
నై వచ్చి వేఁడినను సం,భావింప వటంచు నొక్కభామిని యనియెన్. ౯౨

*క. రమణీ! కోరుటె తడవుగ, సమస్తమును దెచ్చియిచ్చు, జగమందు నసా
ధ్యము లే దస్మద్విభునకుఁ, దమిఁ గవఁగూడు మని యొక్కదానవి చెప్పెన్. ౯౩

క. చిలుకకుఁ జెప్పినచొప్పున, నలుకిఁ గొనక యెంతదూర మనునయఫణితిం
దెలిపిన విన కున్నది ప్రల్కులఁ గా దిఁక ననుచు నొక్కక్రూర వచించెన్. ౯౪

గీ. ఏల యాలస్య మొనరించు, టీ ధరా కు
మారి ప్రత్యవయావమును వేఱువేఱ
విభజన మొనర్చి ఛేదింప వెడలుఁ డిపుడ
యనుచు నొక్కరక్కసి వాఁగె నాగ్రహమున. ౯౫

క. కత్తి పయి కెత్తి సీతను, మత్తత వధియింపఁ బోయె మఱియొక్కతె, రే
కెత్తుకొనుక నిం కొక్కతె, మిత్తివలెం గానిపించె మిడిగ్రుడ్లొప్పన్. ౯౬

ఆ. భయదవక్త్రి యొకతె భయపెట్టె నొకరట్టె, తెఱచి హుంకరించి, గిరికుమారి!
యవనిపుత్రి నట్టు లడలించు రాక్షస,సతులు వికృతముఖుల చందమరసి. ౯౭

### త్రిజటా స్వప్నము

వ. చకితహృదయ యై త్రిజట యనువృద్ధరాక్షసి రూక్షేక్షణంబుల వారి నివారించి
యిట్లను. ౯౮

సీ. కడుఁ గ్రొవ్వి యొడ లెఱుంగక మిట్టిపడకుఁడు పాపిష్ఠరాక్షసభామలార!
మే లగునామాట లాలింపుఁ, డీగతి మగనికై యల్లాడుమానవతిని
సీతను బెదరింపఁ జే టబ్బు మ్రొక్కుఁ డందఱు, నాకు నొక్క స్వప్నమ్ము వచ్చె,
రాజీవనేత్రుండు రాముండు తెల్లని యైరావతము నెక్కి యనుజుతోడ

గీ. లంక సర్వముఁ గాల్చి, యాలమున రాక్ష
సేశ్వరునిఁ జంపి, యంకమం దీమె నుంచి
కొని మహానందమగ్నుఁ డై కొండతలను
హాయిగా నుంటఁ గనుగొంటి, నదియుఁగాక. ౯౯

సీ. మే నెల్ల నిండార నూనెఁ బూసికొని దిగంబరుఁ డగుచు నిజాస్యమాలి
కను జేతఁ గొని సుతుల్ మనుమలు వెంటరా గోమయపూర్ణ మాగుంటఁ జొచ్చె
మనమహారాజు, కామినులార! తదనుజన్ముఁడు విభీషణుఁడు ప్రమోదమాన
సంబున రాముని సన్నిధి నిల్చి సద్భక్తి నామహనీయు పాదములను
గీ. గొలుచుచుండఁగఁ జూచితిఁ దెలిసితిఁ బయి, సర్వవిధముల శ్రీరామచంద్రమూర్తి
సైన్యయుతముగ దశకంఠు సంహరించి, తగ విభీషణునకు దొరతన మొసంగు.

క. లంకమునఁ బెట్టికొని యే, ణాంకముఖిని జనకతనయ నాత్మపురికి ని
శ్శంక రఘువరుఁడు చనఁగలఁ, డింకేటికి మిన్నకుండుఁడీ! మీ రెల్లన్. ౧౦౧

వ. అనుటయుఁ ద్రిజటావాక్యంబుల కులికి పొలసుదిండిపొలంతుకలు బెదరించుటలు
మాని నిద్రావశమ్మున నందందు మైమఱచి యుండిరి. జానకియు, దానవస్త్రీభీషణ
భాషణంబులకు భీతిల్లి తుది స్వప్నవృత్తాంతమ్ము శ్రవణగోచరము గామిం జేసి
మిగుల దీనయై రక్షకునిం గానక, కాయంబు దుఃఖవ్యాపృత మై తాపంబు రేఁపెట్టఁ
గర్ణాంతాయతలోచనంబు లశ్రుపూర్ణంబు లయి దృష్టి నిరోధింప విచారపడుచుఁ
దనలోఁ దా నిట్లనికొనియె. ౧౦౨

సీత విచారపడుట

గీ. ఉదయ మగునేని ప్రాణంబు లుండనీరు, చంపి భక్షింతు రింత నిశ్చయము, వీరి
వాతఁ బడకుండ నిపుడె జీవముఁ దొఱఁగుట, కేదిపదుపాయ? మక్కటా యేమి సేతు.

వ. అని శోకప్రవాహం బనివార్యం బై ముంప మునింగి, గొంతెత్తి పెద్దపెట్ట రోదనము
సేయుచు మరణంబునం గృతనిశ్చయురా లయ్యు స్వాంతమున కుపాయాంతరమ్ము
దోఁపమిం జిరకాలము తరుశాఖ నవలంబించి యుండె. అట్లుండి. ౧౦౪

సీ. ఉరి పోసికొని మైన నోడ లుజ్జగింతు, రాముని బాసి రాక్షసాంగనల నడుమ
నెన్నాళ్లు జీవించియున్న ఫలం బేమి? యతిదీర్ఘ మై త్రాడు ననుకరించు
నాజడ యుద్బంధనమునకు నుపయోగపడఁగల దదియ యిప్పటికిఁ ద్రోవ
యని నిశ్చయాత్మిక యగుజానకీదేవి పసుపాటు లన్నియుఁ బవనజుండు
గీ. చూచి, కొంచె మాలోచించి, సూక్ష్మరూపుఁ, డై మహీజకు వినఁబడునట్లు మెల్ల
మెల్లగా రామువృత్తాంత మెల్ల మొదటి, నుండి పలుకంగఁదొడఁగె, వేదండగమన!

హనుమంతుఁడు సీత వినునట్లు రామకథను జెప్పుట

సీ. ఉర్విలోపలఁ గలం డొకమహారాజు దశరథాభిధానుఁ డిక్ష్వాకువంశ
సంభూతుఁ డమరేంద్రసఖుఁ డయోధ్యాధీశుఁ డామహీపతికి శ్రీరామలక్ష్మ
ణభరతశత్రుఘ్ననామధేయులు నల్వు రాత్మజుల్ గలరు, వారందఱు శుభ

లక్షణోపేతులు లలితభావులు గుణవంతులు సురసముల్, వారిలోనఁ

గీ. బెద్దవాఁ డగురాముండు పితృవచనము,వలన దండకాటవికిఁ దా వచ్చె లక్ష్మ
ణానుజుండును బ్రియభార్య యైనసీత,యును ననుసరించి రాఁగ నత్యుత్సుకతను.

వ. అట్లువచ్చి గౌతమీతీరస్థ మగుపంచవటీక్షేత్రమ్మునం బర్ణశాల నేర్పఱచికొని
యందు వసించి యుండ. ౧౦౭

ఆ. ఆ ఘనుండు లేనియపుడు మహాభాగ,యైన జనకపుత్రి నపహరించె
రావణుఁ డనుదుష్టరాక్షసుఁ డంతఁ బ్రి,యావియోగదుఃఖితాత్ముఁ డగుచు.౧౦౮

వ. రామమూర్తి యత్యంతార్తుఁడై నెల్లెడ నిల్లాలికై తిరుగుచు, నొక్కచో నేలంగూలి
యున్నపక్షి యేని జటాయువుం గని యాతని స్వర్గస్థుం జేసి, తదనంతరము ఋశ్య
మూకంబు చేరవచ్చె, నంత నట. ౧౦౯

క. ఇనతనయుఁడు సుగ్రీవుం, డనితరగమ్యుండు శూరుఁ డగునావిదితా
త్మునితోడఁ జెలిమి చేసెను, ననలునిఁ బ్రజ్వరిలఁ జేసి యగ్రతలమునన్. ౧౧౦

వ. అంత మిత్రకులరత్నమ్ము మిత్రకళత్రమ్ము నపహరించినయపాత్రు నింద్రపుత్రు
వాలిని వధించి, వానరరాజ్యంబునం దర్కజు నభిషేకించి కృతకృత్యుం డయ్యె,
నయ్యెడ. ౧౧౧

క. వానరపతి సుగ్రీవుఁడు, వానరులం జేరఁ బిలిచి పది దిక్కులకున్
జానకిని వెదుకఁ బంచె న,హీనముగా, వారిలోన నే నొక్కండన్. ౧౧౨

సీ. మార్తాండసుతుకడ మంత్రిఁగా నుందు, సంపాతి చెప్పినమాటఁ బట్టి వడిగ
శతయోజనాయామజలధి లంఘించి లంకను జొచ్చి యందు సీతను గనుఁగొన
లేక, తిన్నగ నీయశోకవనముఁ బ్రవేశించి, యీయిరుగుడుచెట్టు వెదకి
కనుగొంటి దీనిక్రిందను వందురుచునున్నదాని దుఃఖనిమగ్న యైనదానిఁ

గీ. దనమనోనాథుని స్మరించుదాని రాము,మహిషి నవనీకుమారిని, మాయురె; కృత
కృత్యుఁడను నేనటంచు నీరీతిఁబల్కి, వాయుసుతుఁ డూరకొనియెఁ బర్వతకుమారి!

వ. రఘువల్లభువల్లభ యదియెల్లఁ గ్రమమ్ముగ నాలించి స్మేరమానసయై యిట్లు తల
పోసె. ఔరా! యీవినవచ్చిన దే మైయుండు. ౧౧౪

సీ. ఆకాశముననుండి యనిలునిచేఁ జెప్పఁబడియెనా? లేక స్వప్నంబ? కాక
మన్మనోవిభ్రమమా? సత్యవృత్తాంత మే యగునా? నిశ్చయింపరాదు
దుఃఖమ్ముకతన నిద్దుర నాకు వచ్చుటలేదు, కావునఁ గల గాదు, దీని
నెల్లను నిజముగా నెఱుఁగుచుంటిని భ్రమ మనుమాట వట్టి,దే యనఘచరితుఁ

గీ. దమృతమున కెనవచ్చు వాక్యములఁ జెవుల, పండువుగఁ బల్కె నో ప్రియవాది యమ్మ
హానుభావుఁడు నాహృదయం బెలర్ప, నాథుదయ యున్న నెదుటఁ గానఁబడుఁ గాక.

హనుమంతుఁడు సీతకుఁ గాన్పించుట

క. అని పలికిన నామాటఁ బ్ర, వనతనయుం డాలకించి, పత్రసమూహా
మ్మునను౦డి తిన్నగా దిగి, జనకజకట్టెదుట నిల్చె సముచితభంగిన్. ౧౧౬

వ. అప్పు డప్పడమిచూలు తన యగ్రతలంబున మోడ్పుకేలుతో నున్నకలవింక ప్రమాణశరీరు నరుణవక్త్రుఁ బీతవర్ణుఁ గృతాభివందను వాయునందనుం దిలకించి.

క. ఆసురమాయాబలమున, నీసరణిం గోఁతి యగుచు నియ్యెడ నన్నున్
మోసముఁ జేయఁగ దశకం, ఠాసురుఁ డే వచ్చె నని భయంపడె, దుర్గా! ౧౧౭

క. అని మదిఁ జింతించుచు వం, చినమోమున నూరకుండె సీత, నభస్వ
త్తనయుఁడు మరల ననెన్ నీ, మనమునఁ గలసంశయమ్ము మానుము, దేవీ! ౧౧౮

సీ. ఏ నట్టివాఁడను గా నెంతమాత్రమ్మున్, దశముఖుం డని నన్నుఁ దలఁపఁబోకు,
పరమాత్మ కోసలప్రభువు రాఘవుఁడు నా స్వామి, యా ఘనుని సేవకుఁడ నేను,
తరుచరేశ్వరుఁడు భాస్కరనందనుం డగు సుగ్రీవు ప్రెగ్గడన్ శుభచరిత్ర!
భూతకోటికిఁ బ్రాణభూతుఁడు పవనుండు ననుఁ గన్నవాఁ డిది నమ్ము మమ్మ!
గీ. యనుడు, "రామదాసుఁ డను నే" ననుచు నీవు
చెప్పుచున్నావు; మిగుల విచిత్ర మయ్యె,
మనుజులకు వానరుల కెట్లు మైత్రి గుదిరెఁ
దెలుపు మని సీత యన, ముందు నిలిచి హనుమ. ౧౨౦

వ. ప్రీతుం డై యిట్లని చెప్పఁ దొడంగె. ౧౨౧

గీ. శబరి ప్రేరేపఁగా రామచంద్రమూర్తి, ఋశ్యమూకాచలంబున కేఁగుదెంచె,
నందు నివసించు రవిజుఁ డాయన్నదమ్ములను గనుంగొని భయము లోఁ బెనఁగొనంగ.

క. ననుఁ బంపె రామునంత, స్సును దెలియుట కై, తదాజ్ఞ చొప్పున నద్దే
వుని సన్నిధికిం బోయితి, వినయమ్మున బ్రహ్మచారివేష మ్మమరన్. ౧౨౩

గీ. పోయి, రాముని సద్భావమును నెఱింగి, నాదుమూఁపులమీఁద నాసోదరులను
నుంచికొని తెచ్చి సుగ్రీవుఁ డున్న యెడకుఁ, జెలిమి ఘటియించితిని వారి కలఘుభంగి.

సీ. అంతట సుగ్రీవునర్థాంగిఁ జేకొని యిచ్చమై సుఖియించు నింద్రతనయు
వాలిని రామభూవరుఁ డేకశరమునఁ దునిమి వానరరాజ్యమునఁ దదనుజు

శ్రీమీఱఁగా నభిషేకించెఁ, బిమ్మట నతఁడు, వీరులును మహాబలు లగు
కపులను నిను వెదుకంగ దిక్కుల కంపె, నేనును వారితో నేఁగుచుండ
గీ. నాదరంబున రాఘవుం డనియె నంజ, నాకుమార! నాకార్య మంతయును భవ ద
ధీన మనుట యథార్థంబు, దేవితోడఁ, జెప్పు మొప్పఁగ మామకక్షేమవార్త. ౧౨౨

హనుమంతుఁడు రాముని మాటలు సీతతోఁ జెప్పుట

క. నినుఁ దల్లిఁగ భావించుచు, ననవరతము వినయసహితుఁడై యుచితసప
ర్యను జేయులక్ష్మణుఁడు సుఖ, మున నున్నాఁడనుచుఁ దెల్పుము, కపిశ్రేష్ఠా! ౧౨౩

క. మన్నామాంకితముద్రిత, మెన్నఁదగిననుద్దుటుంగ్రమిది దీని నభ
స్వన్నందన! సీతాలో, కోన్నతచరితకు నొసంగు మొగి గుఱుతునకై. ౧౨౪

క. అని వ్రేలినుండి యుంగర, మును జయ్యనఁ దీసి, పురుషముఖ్యుఁడు నాచే
తను బెట్టె, భద్రముగఁ దెచ్చినవాఁడను జూడు దీని, శీతాంశుముఖీ! ౧౨౫

హనుమంతుఁడు రామముద్రికను సీతకు సమర్పించుట

క. అనిచెప్పి రామముద్రిక, వనితామణి కిచ్చి మ్రొక్కి బద్ధాంజలియై
యనిలకుమారుఁడు దూరం, బున నిల్చె భవాని! యంత భూపుత్రికయున్. ౧౨౯

క. పతిపావననామాంకిత, నుతాంగుళీయకముఁ గాంచనోంచితి నని య
ద్భుతహర్షాత్మిక యై పా, ర్వతి! కన్నుల కద్దికొని శిరంబునఁ దాల్చెన్. ౧౩౦

సీత హనుమంతునిఁ బొగడుట

గీ. తాల్చి, యానందబాష్పముల్ ధారగట్ట, నిట్లనెఁ గపీంద్రుఁ గన్గొని, యిద్ధచరిత!
నాకుఁ బ్రాణదానంబు నొనర్చినట్టి, దాత వీవు; నీసముఁ డున్నె? భూతలమున.

క. కడుబుద్ధిమంతుఁడవు, భక్తుఁడ వస్మద్వల్లభునకుఁ, దోరపుఁబ్రియ మే
ర్పడఁ గలుగఁ జేసితివి, నీ, యెడ నమ్మిక మెక్కు డామహీపతికిఁ, గృతీ! ౧౩౨

క. కాకుండిన మతియొక్కని, నాకడ కేరీతిఁ బంపు నాథుఁడు? గుణర
త్నాకర! కనులారఁగ నా, శోకమయం బగునవస్థఁ జూచితికాదే? ౧౩౩

సీత హనుమంతునితోఁ దనకష్టముల రామునకుఁ జెప్పుమనుట

క. నావృత్తాంతం బంతయు, దేవసమున కద్దయానిధికి దయ గలుగం
గా వినిపింపుము, దొరకఁడు, నీవంటిమహోపకారి; నిర్మలచరితా! ౧౩౪

సీ. ఇఁక రెన్నెలలుమాత్ర మిట్లు ప్రాణముతోడ నుందు, నీలోన రఘూత్తముండు
రాఁ డేని; దుష్టుఁ డౌ రావణుఁ డలుక నన్ జంపించి తినుట నిశ్చయము కాన

కీశనాయకుని సుగ్రీవుని వానరసేనాధిపతులను శీఘ్రగతిని
దోడ్కొనివచ్చి పెన్దురమున సైన్యపుత్రామాత్యయుతముగ నసురనాథు
ఆ. బిల్కుమార్చి నన్ను విడిపించు టెంతయుఁ, దనకు శూరమణికిఁ దగినకార్య
మనియుఁ బొగడఁదగిన దనియు వాయోడక, జీవితేశ్వరునకుఁ జెప్పు మనఘ! ౧౩౫

క. అది యిది యన నేటికి దశ, వదనుని వైనఁ గలనఁ గూల్చి, ప్రాణేశుఁడు న
న్నుఁ దరింపఁజేయువిధమున, సదాగతికుమార! నీవు చలుపఁగవలయున్. ౧౩౬

క. శర్మదుఁడ వగుచు వాచా, ధర్మమ్మును బొందు మనుడుఁ, దనుచరవరుఁ డా
నిర్మలచరితకు నిట్లనె, మర్మము లేకుండఁ గుసుమమంజులదేహా! ౧౩౭

హనుమంతుఁడు సీతకు ధైర్యము చెప్పుట

సీ. తల్లి! నీ వెంతమాత్రము దిగులొందకు క్షోణీశ్వరుని నేను జూచినప్పఁ
డున్నట్టివైఖరి నూహింపఁగా, లక్ష్మణార్కతనూజసైన్యాన్వితముగ
వేవేగ సాయుధుండై వచ్చి, బలిమి నీయసురేంద్రు గదనమునఁ గెలిమసంగి
నిను నయోధ్యకుఁ దీసికొనిపోఁగలం డని నమ్మిక ముదయించె నాకు, ననుడు.
గీ. ననిలపుత్ర! యమేయాత్ముఁడైన రాము, భద్రుఁ డగచరసేనాధిపతులఁ గూడి
దుస్తరం బగులవణపాథోధి దాఁటి, యెట్లు రాఁగలఁ? డిది నమ్ము టెట్లు నేను?

వ. అనిపలికిన సాధ్వీచూడామణికిఁ గపిశిరోమణి యిట్లనియె. ౧౩౯

క. పురుషర్షభు లగుసోదరు, లిరువురు నామూఁపు దోయి నెక్కి మరుద్వీ
స్ఫురణను రాఁగల రిచటికిఁ, బొరయక శ్రమ యించుకైన; భూమికుమారీ! ౧౪౦

ఉ. భానుకుమారుఁ డద్రిచరభర్త వనాటబలంబు గొల్వఁగా
మానసవేగుఁడై గగనమార్గమునన్ జలరాశి దాఁటి చం
ద్రానన! నీనిమిత్తముగ నాత్మబలం బసమాన మంచు వై
మానికకోటి మెచ్చఁ దునుమాడఁ గలండు నిశాచరౌఘమున్. ౧౪౧

క. అనుమానింపకు మమ్మా, యనుజ్ఞ నిడి నన్నుఁ బంపు మమ్మా సౌమి
త్రిని గూడి యున్నరామునిఁ, గనఁబోయెద నమ్మ మేలు గాఁగల దమ్మా. ౧౪౨

క. నిను వెదకుట కై పంపిన, వనచరు లందఱును రిత్తవార్తలు చెప్పన్
వనఁటం బడి నారాకకు, విను మెంతగ నచట వారు వేచెదరో; సతీ! ౧౪౩

ఉ. నే నిపు డందుఁ బోయి జననీ! త్వరపెట్టెద నమ్మహాత్ములన్
భానుకులాగ్రగణ్యుల భవత్సవిధంబున కేఁగుదెంచుచం

కొంటి. అమ్మహాభాగ్యంబు చేకుఱెఁ, గాన నా కిప్పు డాహారంబు గావలయు. నీ దృష్టిగోచరంబు లగునీఫలంబులు పారణయోగ్యంబు లగుఁ గదా? యని యామె చే ననిపించుకొని. ౧౬౨

సీ. ఫలములు కడుపార భక్షించి, జానకి యడుగుల కెఱఁగి, యాయమ పనుపఁగ
నటనుండి కొంత ద వ్వరిగి, "కార్యార్థ మై వచ్చినదూత యెవ్వాఁడుగాని;
యేలిక పని కించు కేని విరోధంబు లేనట్లుఁ బనిచినదానికంటె
నేమాత్ర మైనను నెక్కుడు చేసిపో నగు, నట్లుగానిచో నధముఁడ యగు
గీ. కాన నేఁ గొంచె మధికముగా నొనర్చి, దశముఖుని జూచి మాటాడి తదుపరి రఘు
పతికి నీవార్త విన్నవింపంగఁ బోదు", నని మది న్నిశ్చయించె, సింహావలగ్న!. ౧౬౩

హనుమంతుఁ డశోకవనమును బాడుసేయుట

క. తలఁచి యిటు, ధారిణీజన్ముల నన్నిఁటిఁ బెఱికి కన్నుమూసి తెఱచులో
పల నయ్యశోకవనమును, జెలువమునకుఁ బాపి పాడుసేసె నెలంతా!. ౧౬౪

క. క్షితిపుత్రికానివాసో, చితభూజము దక్క తక్కు చెట్లెల్ల మరు
త్సుతబాహువాతహతుల౯, వితథములై నేలఁగూలె విస్మయ మొదవన్. ౧౬౫

చ. వనము సమస్తముం బెఱికివైచెడివాయుజుఁ గాంచి రాక్షసాం
గన, లితఁ డెవ్వఁ డేమిటికిఁగాఁ జనుదెంచినవాఁడు? కోఁతిగాఁ
గనఁబడుచున్నవాఁడు కడు గర్వితుఁ డప్రియకారి యంచు సీ
త నడుగ, నామె వారి కనెఁ దద్విధ మేమి యెఱుంగ నట్లుగన్. ౧౬౬

క. దానవకల్పితమాయను, దానవు లగుమీకె యెఱుఁగఁ దగుఁ జుమి దుఃఖా
నూనవ్యథచేఁ దెరలెడి, నే నెట్టులు వీని నెఱుఁగ నేర్తును జెప్పుఁడా!. ౧౬౭

వ. అనుటయు. ౧౬౮

హనుమచ్చేష్టితమును రాక్షసస్త్రీలు రావణునకుఁ దెలుపుట

చ. అసురసతుల్ భయంపడి రయంబున నద్దశకంఠుఁ జేరి, రా
క్షసకులనాథ! బాహుబలశాలి యమేయపరాక్రముం డొకం
డసదృశవానరాకృతిని నందినవాఁ డయి సీతతో నెదో
గుసగుసలాడి యాడి తుదకుం బెకలించె నశోకవాటికన్. ౧౬౯

క. అమ్మెయిఁ బోయినను విశేషమ్మే యగు నట్లుగాక, చైత్యప్రాసా
దమ్ము విఱుగఁ బొడిచె, సమగ్రమ్ముగఁ జక్కాడె నచటి కావలివారిన్. ౧౭౦

ఉ. చేయఁగరాని యింతపని చేసి లవంబు భయంబు లేక, తా
హాయిగ నందె యుండె, నిదియంతయుఁ దెల్పఁగవచ్చినాము దై
తేయపతీ! యటంచుఁ గడుదీనముఖంబుల విన్నవింప, నౌ
రా? యిటు లయ్యెనా యని తదప్రియవార్తకు సైఁప కమ్మెయిన్. ౧౭౧

సీ. కడువడి లేచి, యక్కపిఁ బట్టితెం డని భటులను బదికోట్లఁ బంప, వారు
చని, రట నిర్భగ్నచైత్యసౌధప్రథమాంతరాసీనుఁ డై యద్రిసన్ని
భాకార మమర లోహస్తంభ మొక్కటి లీల నాయుధముగాఁ గేలఁ బూని
యుంచుక త్రోఁక నాడించుచు నెజ్జనివదసబింబము పగవారిఁ గలఁప
గీ. భయదవైఖరిఁ గనుపట్టి పవనతయుఁ, డభిముఖంబుగఁ దోతెంచునమ్మహా ని
శాటనికురంబమును జూచి సంతసించి సింహనాదంబు గావించె, సింహమధ్య!.

క. ఆనాదంబును విని దను, జానీకిని గాఢమూర్ఛ నంది తెలిసి ర
క్షోనిచయఘాతి యగు న, వ్వానరశార్దూలుఁ గాంచె భయదాకారున్. ౧౭౩

మ. కని నానావిధభీషణాస్త్రవితతిన్ గ్రవ్యాదు లవ్వాయునం
దను నొప్పించిన, మంద హాసి యయి యాతం డుద్ధతిన్ లేచి, యొ
క్కనిమేషమ్మున దోమపెండు గతి రక్షశ్చక్రమున్ సర్వమున్
దునిమెన్ జాగ్రదుదగ్రముద్గరహతిన్ దోస్సార మేపారఁగన్. ౧౭౪

చ. పనిచినకింకరుల్ జముని పజ్జకుఁ బోయినవార్తఁ గైకసీ
తనయుఁడు విన్నవాఁ డయి నితాంతరుషన్ మఱి గాఢ్పపట్టి పై
కనిచెను యూథనాథులను నైదుగురం గడుదుర్మదాంధులం,
జని నృపునాజ్ఞ వారు విరసంబులు వల్కుచు డాయ నక్కపిన్. ౧౭౫

క. ఓహో వచ్చితిరా? యని, లోహస్తంభహతి దివిజలోకము విజయ
వ్యాహారమయముగాఁగా, నా హరివీరుండు చంపె నప్పంచకమున్. ౧౭౬

చ. అసురులు విన్నవింప విని యాచెడువార్త మఱింత క్రుద్ధుఁ డై
యసురవిభుండు, "మీ రరిగి యాతనిఁ గైకొని రం"డటంచు మం
త్రిసుతుల నేడ్వురం బనుప, నిక్కుచుఁ బోయిరి పూర్వభంగి నా
శ్వసనసుతుండు చక్కడఁచె స్తంభహతిం బయివచ్చువారలన్. ౧౭౭

చ. మిడుకుచుఁ గిన్క నిట్లు తనమీఁదికి వచ్చినవారి నెల్లరన్
విడువక యుక్కకంబమున వ్రేసి మృతిం గనఁజేసి పూర్వ మె

య్యెడ నివసించె నయ్యెడకు నేఁగి మఱెవ్వరు వత్తురో; ననుం
దొడరఁగ నంచుఁ దా నిలిచి త్రోవఁ గనుంగొనుచుండెఁ, గోమలీ!. ౧౭౮

### అక్షకుమారుని మరణము

వ. అంత బలవంతుండును బ్రతాపశాలియు నైనయక్షకుమారుండు జనకునిపంపున సైన్యసమేతముగఁ బఱతెంచుటయుఁ దద్విధం బరసి. ౧౭౯

క. ఆ కపి సముద్గరుం డై, యాకాశంబునకు నెగసి, యాతనిశిరముం
జేకొలఁదిఁ బగులమోఁదెను, నాకౌకసు లలర దనుజనాథుఁడు బెదరన్. ౧౮౦

చ. హతునిఁగఁ జేసి యీసరణి నక్షకుమారుఁ, దదీయసైన్యమున్
ధృతి నదలించి, ముద్గరపుదేవతకున్ బలియిచ్చె, నంతటన్
సుతు మృతివార్త కర్ణములు సోఁకఁగ సోఁకులఱేఁడు దంశితా
డితభుజగంబు నా నులికి డెప్పర మై కన లావరింపఁగన్. ౧౮౧

ఉ. పెద్దకొమారు నింద్రజిని బిల్చి, యిదే చనుచుంటిఁ బుత్ర! నీ
ముద్దులతమ్మునిం జదియమోఁదినశత్రుని చెంత, కాతనిన్
గ్రద్దనఁ జంపెయో; బిగియఁగా దృఢరజ్జువులం దెమల్చి సం
బద్ధుని జేసియో; నిమిషమాత్రన తెచ్చెద నీదు చెంతకున్. ౧౮౨

క. ఒక కోఁతిగాఁడు వననా, శకుఁ డయి బలగముల నెల్లఁ జక్కాడి కుమా
రకుఁ బొట్టఁ బెట్టికొన; మి, న్నక విడుచుట తగునె? శూరునకు నెపు డేనిన్.

వ. అనవుడుఁ దండ్రికిఁ దనయుం డిట్లనియె. ౧౮౪

సీ. ఓ మహామతి! నాయనా! మాను దుఃఖమ్ము, బ్రతికి నే నుండ నిప్పగిది దీన
వచనముల్ పలుకంగవచ్చునే నీవు? మద్భుజశక్తి నెఱుఁగవే? పోయి యిపుడ
యనుజహంతకుని బ్రహ్మాస్త్రపాశంబున బంధించి తెచ్చి నీపాదభూమి
నిలిపెదఁ గను మంచుఁ బలికి, రథం బెక్కి పలలాశిసందోహపరివృతుఁ డయి.
గీ. వీరవిక్రముఁ డమరారివిభుకుమారుఁ, డంజనానందనునిఁ జేర నతిరయాగతిఁ
జనియె భేరీధణంధణధ్వనులు సైన్య, కలకల మ్మేకమై నిండ గగనతలము.

### హనుమంతుఁ డింద్రజిత్తుచేఁ బట్టువడుట

వ. అంత వీర్యవంతుండు హనుమంతుఁ డమ్మహాధ్వానమ్ము నాలించి, బాహాస్తంభంబున లోహస్తంభంబు పూని విహగపతివిధమ్మున నంబరమ్మున కెగసె, నాసమయంబున. ౧౮౬

సీ. మేఘనాదుఁడు డాసి మింటఁ ద్రిమ్మరుచున్న కపికేసరిని సాయకముల నొవ్వ
నేసి, శిరోభాగ మెనిమిదిశరముల, నాఱింట ఱొమ్మును నంఘ్రియుగము,
నేకాంబకంబునఁ దోఁకను భేదించి, యుత్సాహమును దెల్ప నుగ్రభంగి
సింహనాద మొనర్చె సింధురగమన! యందుల కతిహర్షచిత్తుఁ డయి హనుమ
గీ. ముసలమున సారథిని ముందు గసిమసంగి, రథ్యముల రూపడంచెను రథము నుగ్గు
నూచగాఁ గొట్టె విరథుగా నాచరించె, క్షణములోపల, నంత నిశాచరుండు. ౧౮౭

వ. తత్క్షణంబ వే ఱొక్కతే రెక్కి, ౧౮౮

క. సముచితవైఖరి బ్రహ్మాస్త్రముఁ గొని బంధించి ప్లవగసత్తము దానన్,
రమణీ! తోడ్కొనిచనె విక్రమ మొప్పఁగ దండ్రియున్నకడ కుబ్బుమెయిన్.

సీ. ఏమహాత్ముని దివ్యనామంబు సతతంబు జపియించుమనుజు లజ్ఞానజనిత
కర్మబంధమునుండి గ్రక్కున విడివడి ఖరకరకోటిభాసురము శివము
నైనవైకుంఠమ్ము నంది సుఖింతురో; యట్టి శ్రీరామపదాంబుజంబు
హృత్పద్మమధ్యయం దేవేళఁ జక్కఁగా నిల్పి వినిర్ముక్తనిఖిలకర్మ
గీ. బంధనుఁ డయి జీవన్ముక్తపదవి నున్న, శ్వసనపుత్రుండు బంధింప సాధ్యుఁ డగునె
త్రాళ్లచేఁ గాని, లేక యేతాదృశాస్త్ర, బంధములఁ గాని, చంద్రికాభవ్యహాస!

సీ. రావణి యిట్లు కొంపోవఁ బోయెడివాని, ధృతపాశబంధసంతతుల వాని
భీతచిత్తునిమాడ్కి బెదరుచూపులఁ బురం బట్టట్టుఁ జూచెడునట్టివాని
వనచరసింహుఁ గన్గొన నలువైపులనుండి వెంబడివచ్చుచున్న పౌరు
లతికోపహృదయులై, యక్కట యెందఱ మ్రింగినాఁడవుర! నీపొంగు క్రుంగు
గీ. సమయ మిదె వచ్చె, నీ కింకఁ జావుమూఁడెఁ, జిక్కితివి పక్కివోలె, నం చొక్క పెట్ట
ముష్టితలముల గబగబమోఁది రపుడు, చేడె! యాసన్నమరణుల చేష్ట లివియ.

చ. కమలజు నస్త్ర మష్ట క్షణకాలము బద్ధునిఁ జేసి గాడుపుం
గొమరుని, దద్వరంబునను గొబ్బున నాతనిఁ బాసిపోయెఁ, నా
క్రమము నెఱింగియుం దరుచరప్రవరుం డెదఁ జేయనున్న కా
ర్యము చెడు నంచుఁ దా నరిగె నల్పపుఁ ద్రాళులఁ జిక్కి యత్తఱిన్. ౧౯౨

వ. అట్లింద్రజిత్తు మరుత్తనయుం గొనిపోయి. ౧౯౩

ఆ. కొలువుదీఱి నడుమఁ గూర్చున్న జనకుని, ముందుఁ బెట్టి, క్రోఁతిముక్కడీఁడు
వీఁడె వచ్చినాఁడు విధివరంబునను బంధించి మించి నేను దెచ్చుకతన, ౧౯౪

క. పేర్గాంచినట్టిరాక్షస, వర్గంబులఁ జదిపె సులభవైఖరి, నేత
ద్దోర్గర్వనిహతుఁ డనుజుఁ డ, నర్గళ మీప్లవగుశౌర్య, మసురాధీశా! ౧౯౪

వ. ఈవిషయమ్మున మనమంత్రులతో యోచించి, సామాన్యుం డని త్రోసి పుచ్చక, విధివిధానముగఁ దగినదండనము వీనికి విధింపుఁ డని పలుక, విని దానవవిభుండు తనముం దున్నయంజనాచలసంకాశుఁ బ్రహస్తుం దిలకించి. ౧౯౫

ఉ. ఎందుల కీతఁ డొంటరిగ నిం దరుదెంచెనో? యెందునుండి తా
నెందుల కేఁగువాఁడో? వన మెల్లఁ బెకల్చినహేతు వేమొ? య
స్పందత నాగతిన్ మననిశాచరులన్ జగదేకవీరులన్
క్రుమందఁగఁ జేయు టేటికో? సమస్తము వీనిని బృచ్ఛసేయుమా. ౧౯౬

వ. అని పలుకుటయు నతండు సామీరిది క్కేగి సమాదరంబున నిట్లనె. ౧౯౭

చ. వనచర! భీతిఁ బొందకు లవంబును, నెవ్వని యానచోప్పనం
బనివడి వచ్చినా విట? కబద్ధముగా దఖిలాధినాథుఁ డా
దనుజవరేణ్యుసన్నిధి యథార్థముఁ బల్కు_దు వేని; నిప్పడే
నిను విడిపించి పుచ్చెదను నే, నన మారుతి హర్షచిత్తుఁ డై. ౧౯౮

హనుమంతుఁడు రామపరాక్రమము రావణునితోఁ జెప్పుట

వ. సచివుని వచనంబు సరకుసేయక, ౨౦౦

చ. పగతుని ముజ్జగంబులకు బాధ యొనర్చెడువాని రావణున్
మగటిమిఁ జూచి, రాముఁ బలుమాఱు మదిన్ స్మరియించుచుం గ్రమం
బుగ రఘునాథుసచ్చరితమున్ వినిపింపఁ దొడంగె" నేమి యీ
తెగువ?" యటంచుఁ గొల్వు తనధీరతకుం దల యూఁపుచుండఁగన్. ౨౦౧

సీ. రావణ! యిఁక వినరా! సర్వ మెఱిఁగింతు, నణు వైన నాకు భయమ్ము లేదు,
పొంచి కుక్క హవిస్సుఁ బోలె, నెవ్వాని యర్ధాంగలక్ష్మిని నీవు దొంగలించి
తెచ్చితివో; యట్టిదివ్యమూర్తి యశేషహృద్వాసి సకలలోకేశ్వరుండు
రామభద్రుండు నాస్వామి, తత్సన్నిధి దూతను నేను వాతూలభవుఁడ,
గీ. ఆమహాత్ముఁడు ఋశ్యమూకాద్రిఁ జేరి,కీలిసాన్నిధ్యమందు సుగ్రీవుతోడ
మైత్రి గావించి యతనినమ్మకముకొఱకు,సప్తతాళవిదారణచంచు వయ్యె. ౨౦౨

వ. పదంపడి, ౨౦౩

క. తనమిత్రుని శత్రుం డగు, ననిమిషపతిసుతుని వాలి నణఁచె నొకశరం
బున, వానరరాజ్యశ్రీ,కి నతని నధిపతిఁ గాఁ జేసె ఖేచరు లలరన్. ౨౦౪

వ. వాలి యెవరందు వేని. ౨౦౫

*క. కరములు శిరములు నలుగఁగ, నిరుచంకల నదిమిఁ పట్టి, యిస్సి; చతుస్సా,
గరముల ముంచి కడుఁ గని, కరమున నిను వదలినట్టికపిరాజు చుమా. ౨౦౬

చ. నిరుపమవిక్రముండును వనేచరభర్తయు నైనయాప్రభా
కరతనయుండు బాహుబలగర్వితవానరయూథకోట్లచేఁ
బరివృతుఁ డై ప్రవర్షణముపై రఘుపుత్రులఁ గొల్చియున్నవాఁ
డరి వగు నీపయిం గినుక నంది, యిఁ కే మని యందు, రావణా!. ౨౦౭

సీ. సీతను వెదకుట కాతండు వానరోత్తముల ననేకుల దశదిశలకుఁ
బంపించె, నటు పంపఁబడినట్టివారిలో నే నొకండను బవమానసుతుఁడ,
నవనిజ నందందు నరయుచుఁ దిన్నఁగా వచ్చితి నిచటి, కా సచ్చరిత్ర
దర్శనం బైనది దశకంఠ! కపి నౌటఁ జాపల్యమున వృక్షసమితి విఱిచి
గీ. వీటిఁ బుచ్చితిఁ బాలుపారుతోట నెల్ల, దాని సైఁపక నను జంపఁ దలఁపుతోడ
నసురు లుగ్రధనుర్బాణహస్తు లగుచుఁ,గదన మొనరింప నాపయిం గవియుటయును.

ఉ. ఏ నది చూచి వారిఁ బొలియించి శరీరముఁ గాచికొంటిఁ జూ
దానవనాథ! యారసిన ధర్మమ కా యిది ప్రాణికోటికిన్
మేను ప్రియంబు గావుటను, మేఘరవాహ్వయుఁ డంతవచ్చి నా
పైసి, విరించనాస్త్రదృఢపాశమునన్ బిగియించి నన్నిటుల్ ౨౦౯

ఉ. కైకొని వచ్చినాఁ డిటకుఁ, గాంచనగర్భువరంబు కల్మి నన్
దాఁకిన యుత్తరక్షణమ తాఁ జనె నస్త్రము వీడఁబాఱి, నా
కా కథ సర్వముం దెలియు, నట్లయినం గరుణారసార్ద్రధీ
పాకమునన్ హితమ్ము దెలుపం జనుదెంచితి బద్ధు వైఖరిన్. ౨౧౦

హనుమంతుఁడు రావణునకు హితము చెప్పుట

వ. అది యెయ్యదియందు వేని; సావధానుండ వై వినుము. ౨౧౧

సీ. ధర్మంబువలన సద్గతియు, నధర్మంబువలన దుర్గతియును, బడయులోక
పద్ధతిఁ దెల్విమైఁ బరికించిచూడు, మెప్పుడును రాక్షసబుద్ధిఁ బూనఁబోకు,
సంసృతిబంధంబు సడలించి స్వస్వరూపానుసంధానంబు నలవరింపఁ
జాలుహింసాదివర్జనరూపదైవమార్గమ్మునఁ బొమ్ము శుభమ్ము గలుగుఁ.

గీ. బ్రాహ్మణుఁడ వందు నుత్తమవంశసంభవుఁడవు విశ్రవసుని కుమారుఁడవు ధనదు
తమ్ముఁడవు బ్రహ్మమనుమఁడ వెమ్మెయి నరసినను లోటున్న దే? కైకసీకుమార!

సీ. "దేహమే నే" నని యూహింతువే మదిఁ; బయివిషయమ్ములఁ బట్టి నీవు
రాక్షసుండవు గావు, రావణ! దేహేంద్రియాదిభిన్నుం డగునాత్మ ననుచుఁ
దలఁచుచో నప్డును దానవుండవు గా వటంచుఁ జెప్పఁగ నేల? యదియుఁ గాక,
నిర్వికారత నున్న నీకు శరీరబుద్ధీంద్రియదుఃఖాదు లెవియు లేవు,
గీ. నీ వటయుఁ గావు, నిద్రితునికిఁ గనఁబడు,వస్తువులభంగి నజ్ఞానవాసిత మగు
నీ శరీరాదిసంతతి యెల్ల మిథ్యగాని మఱి వేఱుగాదు, రాక్షసవరేణ్య! ౨౧౩

వ. ఇదిగాక, యద్వితీయుండ వగుట నీకు వికారంబు దూరంబై యుండు. వికారకారణం బగునజ్ఞానంబును నట్టిదియ. ఆకాశంబు పృథివ్యాదిసమస్తభూతవ్యాపి యయ్యును దద్గుణంబు లయినగంధాదులతో నంట నట్లు, నీవు దేహగతుఁడ వయ్యు గగనమునకన్న సూక్ష్ముండ వైనకారణమునఁ దద్ధర్మము లగుదుఃఖాదులతోఁ బొరయఁ జాలవు. ౨౧౪

సీ. ఏను దేహేంద్రియప్రాణశరీరసంకలితుండ ననుభ్రాంతి గలుగుకతన
నఖిలబంధంబుల కగ్గమా, నటుగాక, జ్ఞానస్వరూపుండ నేను, జావు
పుట్టుకల్ నాయందుఁ బొడమ, వానందభావుఁడ నని తెలిసి ముక్తుఁ డగు జనుఁడు
ధరణీవికార మూపరమాణుసంతతి నైన దేహమ్మును నాత్మగాదు,
గీ. ప్రాణ మన మనకుం దోఁచుపవనుఁడె చుమి,
మన మహంకారకార్యంబు, మఱియుఁ బ్రకృతి
కార్య మైనమహత్తుచేఁ గలిగె బుద్ధి,
కాన యివి యెవ్వియును నాత్మ గావు కావు. ౨౧౫

వ. పులస్త్యపౌత్ర! యాత్మ సర్వదా జ్ఞానానందస్వరూపుఁడును జన్మాదివికారరహితుఁడును దేహాద్యఖిలకార్యవిలక్షణుఁడును సకలమునకు నియంతయు విభేపుఁడును వివిధోపాధులచేతను దద్ధర్మములచేతను నంటఁబడనివాఁడు నై యున్నాఁడు. ఏతాదృశునిఁగ నాత్మ నెఱింగి నరుం డీసంసారంబునుండి ముక్తుఁ డగుచున్నాఁడు. కావున బుద్ధిమంతుఁడా! నీ కాత్యంతిక మగుమోక్షసాధన మెఱిఁగింతు. సావధానుండ వై యాకర్ణింపుము. ౨౧౬

సీ. పద్మనాభునియీఁదిభక్తి నైర్మల్యంబు నిచ్చు బుద్ధికి, దాన నచ్చ మైన
జ్ఞానమ్ము ఘనముగఁ గల్గు, విశుద్ధతత్త్వానుభవం బగు నక్కతమున,

రూఢిగ ని ట్లపరోక్షసాక్షాత్కార మొదవినపైఁ దనయునికిఁ దెలిసి
పరమపదస్థుఁ డై భాసిల్లు, నందుచే, దనుజాధినాథ! నీవును బురాణ
గీ. పురుషు లక్ష్మీమనఃప్రియు హరి నచింత్యుఁ, బ్రకృతికి నతీతు శ్రీరాము భక్తసులభు
భక్తి భజియింపు మూర్ఖతఁ బాఱఁదోలు, మీసడింపకు నాహితం బింక నైన.

చ. అరి యనుబుద్ధి వీడి, శరణాగతవత్సలుఁ డైనయాపరా
త్పరు నెద సంస్మరింపు, సుతబాంధవలోకము నీదు వెంట రా
ధరణిజ ముందుఁబెట్టుకొని తన్నికటంబున కేఁగి మ్రొక్కి, "దా
శరథి! యనుగ్రహింపు"మని సాధ్విని జానకి నప్పగింపుమీ. ౨౧౮

చ. "పడఁతిని దొంగలించినయపాత్రుని న న్నెటు సైఁచు"నంచు నీ
యెడఁదఁ దలంపఁ బోకు మసురేశ్వర! దీనత వచ్చి కాళ్లపైఁ
బడినపు డాతఁ డెంతపగవాఁ డయినం గరుణించితీరు రా
ముఁడు, భవభీతియుం దొలఁగిపోవుఁ దదద్భుతదర్శనమ్మునన్. ౨౧౯

సీ. అద్వితీయుఁడు హృదయాకాశవర్తి పరాత్మయు సుఖరూపుఁ డమలుఁ డైన
శ్రీరాము మనమున స్థిరభక్తి ధ్యానింపఁ జాలనిజనుఁ, డెట్లు చాలు బహుళ
దుఃఖవీచీపూర్ణదుస్తరపాథోధిఁ దరియింపఁ? గైకసీతనయ! నాదు
హితము నీచెవి కెక్కదేని; నజ్ఞానమహాగ్ని చే మండుచున్నట్టి నిన్ను
గీ. వీఁక రక్షించుకొనలేవు, నీకు నీవ, వైరి వగుదువు, స్వకృతపాపమ్ముకతన
నంత కంత కధోగతి కరుగఁగలవు, ముక్తి పొందుట కవకాశ ముండ దింక. ౨౨౦

రావణుఁడు హనుమంతుని భయపెట్టుట

వ. అని హితోపదేశమ్ము సేయ. ౨౨౧

చ. అమృతము వోలె రుచ్య మగునాత్మహితంబును నాలకించి, పం
క్తిముఖుఁ డమృష్యమాణుఁ డయి తీవ్రరుష న్నిజనేత్రకోణర
క్తిమ సభ సంచలింపఁ గపికేసరిమోమునఁ జూపు నిల్పి, య
క్రమములు పల్కెఁ గొన్ని; యవుఁగా? మతిశూన్యులు తత్త్వ మొంతురే? ౨౨౨

క. కొదుకక నిర్భయగతి నా, యెదుట నెటుల్ వదరుచుంటి, వీ వగచరులం
దధముఁడవు దుష్టబుద్ధివి, మదాతిరేకంబ నీకు మరణముఁ గూర్చెన్. ౨౨౩

క. అడవిం ద్రిమ్మరుమీరా, ముఁ డెంతవాఁ? డోకనరాధముం, డర్కజుతో
మడియింతు నాదురాత్ముని, గడిలోపల శితకలంబకప్రబలహతిన్. ౨౨౪

క. వానర! యిప్పుడు నిన్నుం, జానకి నాపైని బిట్టు నమయించి, సుమి
త్రానందనయుతముగ మీ, జేనిం రాఘవుని సంహరించెద మీఁదన్. ౨౨౫

ఆ. అచిరకాలమునసె యాతనిమిత్రు సుగ్రీవు శౌర్యధనుని గీటడంతుఁ
గపిగణాన్వితముగఁ, గ్రవ్యాదవిభుని విక్రమ మెఱుంగ వనుడు, గాడ్పుపట్టి. ౨౨౬

రావణుఁడు హనుమంతునిఁ జంప నాజ్ఞాపించుట

సీ. తెరలి యంతంతకుఁ బెఱిగెడి కోపాగ్ని దానవుఁ గాల్చుచుండంబు దోఁప
నిట్లనె, నధముఁడా! యీబెదరింపుల జడియుదునే? నాకు సమరమందుఁ
గోటిరావణు లైన దీటుగారేటికి, శ్రీరామునకు నేను సేవకుఁడను
గడలేని పటుపరాక్రమము గల్గినవాఁడఁ, బెడఁత్రోవఁ ద్రొక్కకు చెడియె దనుచు,
గీ. మండిపడి దశకంఠుఁ డమ్మాట, కొక్క, యసురుఁ బార్శ్వగతుం జీరి యాజ్ఞ చేసె
ఖండఖండములుగ వీనిఁ జెండు మనుచుఁ, జుట్టములు మిత్రు లన్యులుం జూచి యలర.

వ. ఇట్లు రాకాసులమొకమీఁడు ముదలఁ గావించిన. ౨౨౮

విభీషణుఁడు దూతను జంపరా దనుట

ఉ. ఆయుధపాణి యై వడి మహాసురుఁ డాతనిఁ జంపుపూనికన్
డాయఁగ నివ్వారించి, సుగుణమ్ములప్రోవు విభీషణుండు, దే
వా! యసురాధినాథ! వధ కర్హుఁడు గాఁ, డొరునానమీఁదుగా
నీయెడ కేఁగుదెంచె నితఁ, డిట్లు భవాదృశు లాచరింతురే? ౨౨౯

క. పరనృపుఁ డంపినవానరుఁ, బరాక్రమాఢ్యునకుఁ జంపఁ బాడియగునె యె
క్కరణిఁ బరికించినను? ధర్మరహస్యము వినుము చంపమానుము దూతన్. ౨౩౦

చ. ఎవనిని నేఁడు నీవు వధియింపఁగఁ బూనితొ; వాఁడు వాయుసం
భవుఁ డితఁ డిందు నీకతనఁ బ్రాణముఁ బాసిన, రామమూర్తి కీ
వివరముఁ దెల్పువా రెవరు? విశ్వజనైకవిగర్హితంబు దూ
తవధ, క్రుధాతిరేకమున ధర్మము దప్పినఁ గీర్తి మాయదే? ౨౩౧

సీ. కాన హింసించుట మాని, యంతటిపని మఱియొండు చేత సమంజసంబు,
కోఁతుల కుచిత మౌగుఱుతు నాలోచింపు, మద్దానఁ జిహ్నితుఁ డై యితండు
చనుగాక రాముని సన్నిధి, కిత్తెఱఁ గంతయుఁ జూచి క్రుద్ధాత్ముఁ డగుచు
నా రఘూద్వహుఁడు రయంబున సుగ్రీవుతో రాఁగలం డిందు దుర మొనర్ప,
గీ. నీ కతనితోడిపెనకువ నిక్క,మనినఁ,దమ్ముని హితోక్తి నాలించి దశముఖుండు
పలికె, వానరులకుఁ దోఁకపైని ప్రేమ,మొం డని ప్రతీతి గలదు భూమండలమున.

### రావణుఁడు హనుమంతుని తోఁక గాల్పించుట

వ. అట్లగుటం జేసి, యాచెట్టుద్రిమ్మరిపుచ్ఛమ్మునకుఁ బ్రయత్నమ్మున గుడ్డలుమున్న
గునవి దట్టముగఁ జుట్టి నిప్పుముట్టించి నగరంబునలువైపులం ద్రిప్పి శాస్తి చెప్పి
విడిచిపుచ్చుఁడు. వానరసేనానాయకులు దిలకింతురుగాక, యనుడు వల్లెయని కొం
దఱు రక్కసులు. ౨౩౩

సీ. వడి లేచి హనుమంతువాలంబు నూనెలోఁ జక్కఁగాఁ దడిపినజనుపనార
గుడ్డలతోడఁ బెక్కుతెఱంగు లగునితరాంబరమ్ములతోడ నట్టె గట్టి
గాఁ జుట్టి కేకలు గంతులు వైచుచు నించుక యగ్గిముట్టించి కొనకుఁ
బటిమగల్గినరజ్జుపంక్తిచే బంధించి మూఁగి కదలకుండ లాగిపట్టి
గీ. చోరుఁ డితఁ డనిచాటుచు, బోరుకలఁగ, వాద్యముల మ్రోఁగఁజేయుచు వాఁడువీఁడ
నక కరంబుల మోఁదు చందఱును నగర,మంతటను ద్రిప్పి రాకపికాంతు, నింతి!.

క. మది నించుక యెదియో చే, యఁ దలంచినవాఁడుగాన నసురులచెయువుల్
విదళింపఁ జాలియును న, య్యదనుసఁ దా మిన్నకుండె ననిలజుఁ, డువిదా! ౨౩౫

వ. ఉండి, యాతుధానానీతుం డై పడమరవాకిటి కుఱంగటికిం జనినతోడన సూక్ష్మా
కృతిఁ బొంది, దృఢబంధంబులు విడివడుటయు మీఁదం బర్వతాకారుం డగుచు
గోపురోపరిభాగమ్మునకు రయమ్మున నెగసి. ౨౩౬

క. ఉరవడి స్తంభం బొం డటఁ, బెఱికి నిమేషంబులోనఁ బీచ మడంచెం
గరిమఁ దనరక్షణమునకుఁ, బఱతెంచినవారి నెల్లఁ బల్లవపాణీ! ౨౩౭

### లంకాదహనము

సీ. పదపడి తాఁ జేయవలసినదాని విచారించి హనుమ ప్రాసాదముకొన
నుండి పురిం గాల్చునుత్సాహ మలమ మే నెల్ల, నింటింటిపై కెగిరి యెగిరి
గనగనమంటలు గ్రక్కెడి మహితవాలంబుచే లంకాపురం బఖిలముఁ
గోటబురుజులతోఁ గొమరారుమేడలతోడఁ దోరణములతోడ విపక,
గీ. బూది గావించె, హాతాత! పుత్ర! నాథ! యనుచు గొల్లున నేడ్చుచు నందునందుఁ
బఱువువాఱుచుఁ జల్లార్చు వెరవులేక, గుండెలను బాఁదుకొని చచ్చుచుండి, రగజ!

గీ. సౌధములమీఁదనుండి రాక్షసవనితలు, బగబగమనిమండునగ్గిలోఁ బడెడువేళ
దైవతాంగన లనుబుద్ధి దగులుచుండెఁ, జూచువారికి, నంజనాసూనుమహిమ. ౨౩౯

క. సదమలబుద్ధి విభీషణు, సదనం బొక్కండు దక్క సర్వంబును బూ
డిద గావించె మరుత్సుతుఁ, డది యట్టిద? రామభక్తి కడ్డము గలదే? ౨౪౦

వ. అట్లు వింశతిబాహుని వీడు దహనజ్వాలల కాహుతిఁ జేసి, యటనుండి యుద్గమించి.

ఉ. నీరధి కేఁగి తోయముల నిప్పులు గ్రక్కెడితోఁక ముంచి చ
ల్లారిచి స్వస్థచిత్తుఁ డయి యక్కపిసత్తముఁ డుండె, వాయుభ
ట్టారకుఁ డాత్మమిత్ర మగుటం, గొనియాడుట భూమిజాత, స్వా
హారమణుండు చల్లనయి యాతనివాలముఁ గాల్ప కుండెఁ బో. ౨౪౨

సీ. మనసారగ స్మరించుమాత్ర నెవ్వనిపేరు పాతకౌఘంబులఁ బాఱఁదోలు,
నాధ్యాత్మికంబును నాధిభౌతికమును నాధిదైవికము నా నవనిఁ బరఁగు
తాపత్రయం బనుదహనంబుగూడ దహింప దెవ్వనిదయాదృష్టి ప్రాల
నీలోకమున; నట్టియిద్ధమూర్తికి రఘుభర్తకు నచ్చినభక్తుఁ డైన
ఆ. శ్వసనతనయుఁ డెట్లు సంతప్తుఁ డగుఁ బ్రక్క, తానలమున? నొక్క యనలమనుచుఁ
బలుక నేల యెదియు బాధింపఁ జాల దొకించు కేని; విశ్వహితచరిత్ర! ౨౪౩

హనుమంతుఁడు మరల సీతకడ కేఁగుట

చ. తదుపరి వాయుసూతి వసుధాసుతఁ జేరి నమస్కరించి దే
వి! దయ ననుజ్ఞ నిమ్ము రఘువీరుని సన్నిధి కేఁగుచుంటి, నా
విదితబలుండు నిన్నరయ వేగమ తమ్మునితోడ రాఁగలం,
డెదఁ గుదు రీకు దుఃఖమున, కీపలు కొక్కటి చూడు మేటికిన్. ౨౪౪

వ. అని యమ్మహాదేవికి ముమ్మఱు ప్రదక్షిణమ్ము సేసి మ్రొక్కి పోవ నుద్యుక్తుఁ డై
మఱియు నిట్లనియె. ౨౪౫

చ. అరిగెదఁ దల్లి! నీకు శుభ మబ్బుత, శ్రీఘ్రమ రామభద్రునిన్
మఱఁదిని లక్ష్మణున్ దపననందనునిం బదివేలకోట్ల వా
నరులను జూడఁగాఁగలవు, నావుడు శోకభరంబునం గృశో
దరి యగుభూమిజాత కపితల్లజుఁ గన్గొని పల్కె నీక్రియన్. ౨౪౬

సీత హనుమంతుని ప్రశంసించుట

క. నినుఁ జూడఁగ దుఃఖము మఱి, పునరున్ వచ్చినది, నీవు పోయె దిపుడు, రా
మునివార్త వినక యిఁకఁబయి, మను టెట్టులు? నాకు వేఱుమార్గము కలదే?

*క. కప్పురపుంబలుకులు నీ, చెప్పెడివాక్యము లు నీవు సిద్ధఘుటిక వౌ
దప్పా! నీ వట కరుగుట, తప్పనిసరి యగుటచే ముదల యీవలసెన్. ౨౪౭

వ. అనుఁడు హనూమానుం డిట్లనియె. ౨౪౮

ఆ. అట్టు లేని దేవి! యటు వీడి నామూఁపు, మీఁద నెక్కి మీవు శ్రేద ముడిగి,
క్షణములోన రామచంద్రునితోఁ గూర్తు, నిష్టపడిమె దేని నిందుఁ బకును. ౨౫౦

వ. నావుడు జానకీదేవి యిట్లను. ౨౫౧

సీ. రామభద్రుఁడు సాగరంబు నింకించియో; బాణమయంబు లౌ పంజరముల
బంధించియో; కపిబలములతో దాఁటి పగతుని దైనయీ పట్టణంబుఁ
గడిమి ముట్టడివైచి కయ్యంబున దశాస్యుఁ బొలియించి నన్నుఁ గొంపోవు నేని;
శాశ్వతం బగుకీర్తి సమకుఱుఁ గలదు, గావున నీవు పొమ్ము ర మ్మనుము వేగ,
ఆ. అంత దనుక నెట్టులైనను బ్రాణముల్, వాయకుండ బిగ్గఁబట్టుదాన
ననుచు సెల వొసంగ నభివందన మొనర్చి, హనుమ చనియెఁ బర్వతాగ్రమునకు.

వ. మున్నిటియొడ్డున కరుగుటకై మహాబలుం డయిన యమ్మహాబలనందనుం డుక్కున నక్కొండం బాదంబులం ద్రొక్కి, హు మ్మని గగనమ్మున కెగిరి పవన జవమ్మునం బోయె. తదీయపాదపీడనంబునఁ ద్రింశద్యోజనోన్నతం బై యొప్పు నప్పర్వతంబు క్రుంగి భూమికి సమానం బయ్యె. మదవతీ! తదుపరివినుము. ౨౫౩

హనుమంతుని రాకకు జాంబవదాదులు సంతోషించుట

గీ. అంబరము మధ్యమునుండి మహారవం బొకండు గావించె, విని దాని గాలికొడుకు
వచ్చె నని కపు లందఱుఁ బరమమోద, చిత్తు లగుచుఁ బ్రతిధ్వనుల్ చేసి రపుడు.

క. పని చక్కఁబెట్టి మారుతి, మనలకు సంతోషపఱుప మరలె నటం చా
ధ్వనివలనఁ దెలియ నయ్యెడిఁ, గనుఁ డడుగో; సంశయింపఁగాఁ దగ దిఁకపై. ౨౫౪

క. అని వారు పరస్పర మని, కొనుచుండఁగఁ బావమాని కొండతుదం జ
య్యన డిగ్గి, చూచివచ్చితి, మనజానకి నింక భయము మానుఁడు మీరల్. ౨౫౬

క. దానవుని పట్టణం బు, ద్యానవనోపేతముగ సమర్పించితి వై
శ్వానరునకు నాహుతిగా, దానవపతితోడఁ గొంతతడవు కొలువులోన్ ౨౫౭

వ. హితాహితంబులం గూర్చి భాషించితి. కాని, యతండు మూర్ఖత మానఁ డయ్యె. అంత సీతాదేవి యనుజ్ఞ నంది మరలి పఱతెంచితి. ఈపై మన మిందుఁ దడయ రాదు. రామసుగ్రీవులసన్నిధికిం బోవుద మనుటయు, హృష్యన్మానసులై. ౨౫౮

సీ. మాట దక్కించిన మహితుండ వీ వని గట్టిగాఁ జేతులఁ గౌఁగిలించి
కొనిరి కొందఱు, వాలమును ముద్దిడిరికొంద, ఱానందమున నృత్య మాచరించి
రొకకొంద, ఱిట్లు పెల్లుబ్బునఁ బ్రస్రవణాద్రికి హనుమతో నరుగుచుండఁ
దపనజరక్షితం బుపమానరహితంబు మధువనంబును గాంచి, మహితచరిత!

గీ. యాఁకటం జిక్కి యున్నార మాజ్ఞయైనఁ, దృప్తి దీఱ ఫలంబులఁ దిని సుధా స
మాన మగుతేనెఁ గ్రోలి యాపైని రాము,సానుజునిఁ జూడఁ బోదము సమ్మదమున.

హనుమదాదులు మధువనముం జొచ్చుట

చ. అని యువరాజు నంగదుని నందఱుఁ గోర, ననన్యసాధ్య మా
పని యొనరించినాఁడు మనపావని, వీని యనుగ్రహంబునం
దినుఁడు ఫలాదులం దనివి దీఱఁగఁ దేనియఁ ద్రావుఁడీ, విళం
బన మొనరింపఁ బోకుఁ డని పల్కె నతండు, సతీమతల్లికా! ౨౬౦

వ. ఆమాటకుఁ బ్రమోదమేదురహృదయులై. ౨౬౧

చ. వనమును జొచ్చి, యందు దధివక్త్రనియోజితపాలకావళిన్
మనమున లెక్కగాఁ గొనక, మైథిలివార్త దలంచుకొంచు నూ
ల్కొనుతమకంబులన్ మధువుఁ గ్రోలిరి లొట్టలుగొట్టికొంచు, నే
మని వివరించువాఁడ, సతి! యప్పటివారి విచిత్రచర్యలన్. ౨౬౨

క. ఆవైపరీత్య మంతయుఁ, గావలివాం డ్రరసి కినిసి కమ్మని తేనెం
ద్రావెద "రెఱుఁగ రొకో; సు, గ్రీవాజ్ఞ" నటంచుఁ గొట్టిరి సముద్ధతులై. ౨౬౩

సీ. దానికి జాంబవత్ప్రముఖులు కోపించి, త్రుళ్లకుఁ డని పిడికిళ్లఁ గాళ్ల
తాఁకులఁ బాలకతతిని జూర్ణముచేసి, మధువుఁ గ్రోలిరి తృప్తి మట్టుపడఁగ,
నది గని దధిముఖుం డర్కజు మాతులుం డత్యంతకుపితుఁడై యాక్షణమున
వనపాలకుల వెంటఁగొని పోయి సుగ్రీవునకుఁ జూపి పెక్కుదినములనుండి
గీ. యస్మదీయరక్షణమున నలరునీదు,మధువనము నష్ట మయ్యెఁ, గుమారుఁడైన
యంగదుని మూలమునఁ, బవనాత్మజాతు,కారణమ్మున వీరి కీగతులు గలిగె. ౨౬౪

చ. అని పలుకన్ బ్రహృష్టమతియై రవిసూనుఁడు వాయుసూతి సీ
తను గనివచ్చినాఁ డిది యథార్థము; కానియెడన్ మదీయ మా
వనమును దేఱిజూచుట కెవండు సమర్థుఁడు? చూడ నందునన్
హనుమయె కార్యసాధకుఁ డహో కృతకృత్యత యేమిచెప్ప నా?. ౨౬౫

వ. అని మురియుచుండ నంతలో జానకీకాంతుం డిట్లనియె. ౨౬౬

క. వనచరవల్లభ! సీతా, వనితాచరితాన్వితంబు వచనం బేదో;
యనుచుంటి వేమి విషయము, కనివచ్చిరె? యెవ్వ రైనఁ? గామిని గలదే?. ౨౬౭

సుగ్రీవుఁడు రామునితో హనుమదాదులు సీతను జూచివచ్చి రని చెప్పుట

సీ. నావుడుఁ బల్కె సుగ్రీవుండు, దక్షిణదిగ్యాత్ర కై చన్నధీరమతులు
చూచివచ్చిరి మహీసుతను, మారుతిముఖ్యు లలరుచు మధువన మాక్రమించి
ఫలముల నన్నిఁటి భక్షించి తేనియఁ గ్రోలినా రఁట, వనపాలకులను
గొట్టినా రఁట రఘుకుంజర ! స్వామికార్యముచేయ కందఱియట్ల వీరు
గీ. వ్యర్థు లై రేనిఁ గన్నెత్తియైనఁ జూడఁ, జాల రస్మద్వనం, బిటు సంచరింప
గుండె లున్నవె? వేయిపల్కు లేఁక నేల, యావనిపుత్రిక కనుపట్టె ననుట ధ్రువము.

వ. అని వనపాలకుల దిక్కై. ౧౧౯

క. భయపడకుఁ డింక మీరలు,రయమున నాయానఁ బోయి, రం డని వారిం
బ్రియమునఁ గొని తెం డిచటికి, నయోనిజాకుశలవార్త నడుగుద మనినన్. ౧౨౦

ఉ. వారు ప్రసాద మంచుఁ జని వాయుజనంబునఁ దోఁటఁ జేరి సా
మీరిని దక్కువారిఁ గని మేధ్యచరిత్రుఁడు రాజు భానుజుం
డా రఘురామలక్ష్మణసమన్వితుఁ డై మిము నెల్లఁ జూడఁగాఁ
గోరుచునున్నవాఁడు కపికుంజరులార ! చనుం డతిత్వరన్. ౧౨౧

వ. అని చెప్పుటయు. ౧౨౨

క. గగనమున కెగసి చని ముం,దుగ నమవఁగఁ బవనజాంగదులు కడుశీఘ్రం
బుగ రాఘవరవిజులు పొం,గఁగ వ్రాలిరి వారిముందుఁ, గంజదళాక్షీ !. ౧౨౩

హనుమంతుఁడు రామాదులతో సీతాసందర్శనాదికమును దెలుపుట

సీ. అంతట హనుమంతుఁ డనఘ! రఘూత్తమ ! క్షేమమ్ముగా నున్నసీతఁ గంటి
నని ముందుఁబల్కి సాష్టాంగమ్ముగా మ్రొక్కి,యటుమీఁదఁ గపినాథుఁ డైన ప్రొద్దు
కొమరున కభివందనముఁ జేసి రాముని దిక్కయి రాజేంద్ర! దేవి సీత
మఱిమఱి నీదుక్షేమ మ్మడిగినది, శోకాకుల యగుచు నశోకవనము
గీ. నడుమ నున్నట్టిశింశుపానగముక్రిందఁ
బొలసుదిండినెలంతలు బొబ్బరించు
చెపుడుఁ దనచుట్టునిలువంగ నెలమి దక్కి
పుడమిఁ గూర్చున్నయది జగత్పూజ్యచరిత ! ౧౨౪

సీ. మైథిలి తుద కిన్నిమంచినీ ళ్లేనియుఁ ద్రావక నిరశనవ్రతముఁ బూను
కారణమ్మునఁ జేసి కడుఁజిక్కియున్నది, హారామ! రామ! రామా! యటంచు

మీపేరు దలఁచుచు వాపోవుచున్నది, మున్నటి దైన యా మురికిగుడ్డ
దప్ప వేఱొండువస్త్రము లేదు, సంస్కారమొదవమి నెఱికురు లొక్క జడగఁ
ఆ. బెనచికొనిన, వొడలి పెం పెల్లఁ జెడినను, దివ్యతేజమునను నవ్య మగుచు
నలరఁజేసె నన్ను నామహాదేవి యా, కృతివిశేష, మఖిలకీర్తనీయ! ౨౭౫

వ. ఇట్లు పుడమిపట్టిం జూచి మెలమెల్లగ నూఱడించి సూక్ష్మరూపుండనై వృక్షశాఖలమధ్య నొదిగియుండి భవదీయవృత్తాంతంబు వినిపింపఁ దలంచి నీపుట్టువు మొదలుకొని. ౨౭౬

సీ. తండ్రియానతిమీఁద దండకాటవికి నీ వరుదెంచుటయు, రావణాసురుండు
మీరాశ్రమమునకు దూర మైనపుడు భూపుత్రిని గైకొనిపోవుటయును,
మార్తాండసుతునితో మైత్రిఁ జేయుటయును, శరపాతమున వాలిఁ జదుపుటయును,
రవిజుఁడు సీత నారయుటకుఁ బ్లవగుల నంపించుటయును, దదాజ్ఞ నమిత
గీ. సత్త్వ లరిజయశీలురు శౌర్యరాసు, లగచరులు సకలదిక్కుల కరుగుటయును,
నందు నే నొక్కఁడనుమాత్ర మబ్ధి దాఁటి, యిందువచ్చితి ననియును, నిదియుఁగాక.

సీ. ఏను సుగ్రీవుని హితమంత్రి ననియు, రాఘవుని సేవించుకింకరుఁడ ననియు,
మద్భాగ్యవశమున మైథిలి గాన్పించినదిగాన నాకష్ట మఖిలము సఫ
లం బయ్యె ననియు, నీలాగున నేఁ బల్క, విని సమస్తము దేవి కనులు దెఱచి
చెవి కమృతంబును జిత్తతాపోపశమంబు శుభాతురమంజులంబు
గీ. నయినయాకథ వినిపించినట్టి యాతఁ, డిది నిజంబుగ జరిగిన దేని; నిపుడ
నాకుఁ గనఁబడి తీరునుగాక జీవ, దాయి యగుఁగాత మని పల్కె, ధరణినాథ! ౨౭౮

వ. అంత నేను సూక్ష్మవానరాకారుండనై ద్రుమాను డిగి సీతాభగవతికి నమస్కరించి, కరమ్ములు ముకుళించి దూరముగ నిలువం బడితి, నప్పుడు. ౨౭౯

క. నను, నీ వెవ్వఁడ? విట కేపని కయి చనుదెంచి? తెవరు పంపించినవా?
రునికి యెది? యెట్లువచ్చితి, వనునివి మొదలుగను జాల యడిగె, మహాత్మా! ౨౮౦

ఉ. ఏనును వాని నెల్లఁ గ్రమ మేర్పడ నామెకు విన్నవించి కొ
న్నా, నటుమీఁద మీ రపుడు నాకు నొసంగిన యంగుళీయకం
బానతమూర్తి నై తగ సమర్పణ చేసితి, దాన నన్ను నెం
తేనియు నమ్మి మోదమున నిట్లనియెన్ రఘువంశపావనా!. ౨౮౧

సీ. నాయనా! హనుమంత! నాయవస్థను జూచినావుగా; రేల్పవ ల్లీవిధమున
నలుకుచు దనుజకాంతల బెదరింపుల, వందురుచున్నాను, వడిగఁ బోయి

రఘుపతి కిది చెప్పి రక్షింప రమ్మను, మనుడు నందులకు నిట్లంటి, రామ!
యారామమూర్తి నీయందలి చింతతోఁ దోఁచకయున్నాఁడు, తోయజాక్షి!
ఆ. ఎందుఁ బోయినదియు నెఱుఁగ కహోరాత్రములు దురంతదుఃఖమున మునింగి
యున్నవాఁడు, నీస్థితి న్నేను త్వరితంబ యేఁగి చెప్పవాఁడ నింత నిజము. ౨౮౨

క. వినినంతనె రాఁగలఁ డా, ఘనుఁ డనుజునితోడఁ దీక్ష్ణకరతనయునితో,
వనచరసేనానులతోఁ, దునిమి విరోధులను నిన్నుఁ దోడ్కొని పోవన్. ౨౮౩

చ. చదిపి దశాననుం గలన సైన్యయుతంబుగ, నిన్న యోధ్యకున్
ముదమునఁ గొంచుఁబోవు రఘుముఖ్యుఁడు నందియ మేల? నన్ను నీ
హృదయవిభుండు నమ్మునటు లిమ్మది యే నొకయానవాలుఁ, బో
యెద నన వేణిబంధమున నింపులుగుల్కెడి యాశిరోమణిన్. ౨౮౪

క. తనకుఁ బ్రియ మయినదాన్ని, మన మలరఁగ నిచ్చి చెప్పె మఱి గుఱుతునకై,
మును జిత్రకూటమున జరి, గిన కాకాసురునికథను, కీర్తితచరితా!. ౨౮౫

క. పిమ్మటఁ బాష్పమ్ములు కను, దమ్ములఁ బొటపొటని జాఱ ధరణిజ, నా క్షే
మ మ్మలరఘుపతికి సమ, గ్రమ్ముగ నెఱిఁగింపు మనియెఁ, గంజదళాక్షా!. ౨౮౬

సీ. మఱఁదికి నల్ల సేమముఁ దెల్పి తన్ను ము న్నాడిన దుర్భాష లాత్మ మఱచి
మన్నింపు మనెఁ, దెల్పిమాలినదాని నొకతన నారీతిఁ బల్కితి నను మనెఁ,
గరుణతో నన్ను రాఘవుఁ డెట్లు కడతేర్చు న ట్లీవు యత్నింపు హనుమ! యనియె,
దేవ! యీవిధిఁ బల్కి దేవి ముమ్మరపుఁగొందలమునఁ గలఁగి రోదనముఁ జేయ,
గీ. నీ కథ సమస్తమును జెప్పి నేను గూడ, నూఱడించితి, నించుక తేఱి నన్నుఁ
బంపె, నే నట్టు లామెచేఁ బంపఁబడి భ, వన్నికటమున కిచటికి వచ్చినాఁడ. ౨౮౭

క. అరుదెంచునపుడు దనుజే, శ్వరునకుఁ బ్రియ మగునశోకవనమును బ్రుటిలోఁ
బెఱికితి, నటఁ గలరాత్రిం, చరులను బలువురను గసిమసంగితి, రామా!. ౨౮౮

క. పరిమార్చితి దశకంఠా, సురతనయుని నక్షుఁ, గొల్వుఁ జొచ్చి యట నిశా
చరవిభుతో భాషించితిఁ, బుర మఖిలము విడక కాల్చిపుచ్చితి, దేవా!. ౨౮౯

క. ఇది నాచేసినయది మీ, యెదుట నివేదించుకొంటి, నిఁకఁ దడయక భూ
మిదుహితృదుఃఖముఁ దీర్పఁగఁ, బదుండు పోద మనిపలికెఁ బవనజుఁ, డంతన్.

రాముఁడు హనుమంతునిఁ గౌఁగిలించికొని పొగడుట

క. కాత్యాయని! శ్రీరాముం, డత్యంతానందభరితుఁ డగుచు హనూమ
త్కృత్యమునకుఁ, ద్రిజగత్సం, స్తుత్యము నీమహిమ మిగుల చోద్యము, హనుమా!

క. సురలకు నైతము కడు దు, ష్కర మగుపనిచేసినయుపకారివి, నీ కె,
త్తెఱఁగునఁ బ్రత్యుపకార మొ, నరింపఁ గల్గుదును? గల్గినం దుల యున్నే?. ౨౯౨

శా. నా కున్నంతయు నీకు నిత్తు హనుమన్నా! రమ్ము ర మ్మంచుఁ దా
నా కీశోత్తముఁ జేతులం బొదివి గాఢాలింగనం బిచ్చి సీ
తాకాంతుండు ప్రసన్నచిత్తుఁ డయి మోదం బందె నంతేనియుః,
నాకుల్ మెచ్చిరి తద్విధంబున కపర్ణా! పూర్ణసంతోషులై. ౨౯౩

వ. అట్లు పరిరంభించి భక్తవత్సలుం డగుకాకుత్స్థుండు మరుత్సూతితో వాత్సల్యంబున
ని ట్లనియె. ౨౯౪

క. పరమాత్మ నైననాదగు, పరిరంభం బన్యదుర్లభం, బయ్యది చే
కుఱఁ జేసితి నీ కిప్పుడు, హరివర! భక్తుఁడవుఁ బ్రియుఁడ వగుహేతువునన్. ౨౯౫

వ. అని యిట్లు ప్రశంసించె, నదియుఁగాక. ౨౯౬

సీ. మందాకినీజన్మమందిర మై, పూఁచి పొలుపారుతామరపూవుఁ బోలి,
యొప్పునెవ్వనిపాదయుగళంబుఁ దులసీదళాదికంబుల భక్తి యతిశయింపఁ
బూజించువారలు, పోలికగన రానివిష్ణులోకంబున వెలయుచుందు
రో; యట్టిరామచంద్రుని బిగికౌఁగిట నాదరింపఁగఁబడి నట్టివాఁడు,
గీ. కృతసుకృత రాశి, జానకీహితకరుండు, నైనవాయుతనూజాతుఁ డబ్జనాభు
పదముఁ జేరి సుఖంబులు వడయు ననుచు, వాకొనుట వెఱ్ఱిగాదె, పర్వతకుమారి!.

వ. అనిచెప్పి. ౨౯౮

కాండాంతపద్యములు

ఉ. ఆనతపాకశాసనముఖాఖిలదేవకిరీటరత్నరు
జ్మానితపాదపీఠ! యభిమానవివర్జితధీరవిస్ఫుర
న్మానసపౌధరాడ్విహరమాణ! ప్రమాణవిహీననైజరీ
తీ! నిగమాంతగమ్య! సముదీర్ణకథా! దళితాశ్రితవ్యథా! ౨౯౯

మాలినీవృత్తము

మదనశతసురూపా! మంజులాలాప! భూపా!
విదళితభవతాపా! విశ్వరూఢప్రతాపా!
ప్రథితగుణకలాపా! భానువంశప్రదీపా!
సదుపశమితకోపా! సన్నుతాగేంద్రజాపా!. ౩౦౦

క. నిర్దళితవైరివర్గ ! క
పర్దిధ్యానప్రసూనభాసితచరణా !
దుర్దమభవసమ్మర్దన
కర్దమనిర్హారణకారి ! కరుణాలహారీ !. ౩౦౧

గద్య.

శ్రీమద్భారద్వాజగోత్ర, సీతాంబికాపున్నయార్య చతుర్థపుత్ర,
రామచంద్రకృపాపాత్ర, సూరిజనవిధేయ,
నారాయణనామధేయ ప్రణీతంబగు
నాంధ్రాధ్యాత్మరామాయణంబున
సుందరకాండము
సంపూర్ణము.



శ్రీ ర స్తు

శ్రీ సీతారామాభ్యాం నమః

# ఆంధ్రాధ్యాత్మరామాయణము

## యుద్ధకాండము



శ్రీనిష్పాదనచణ! భ
క్తానుగ్రహసమురరీకృతాద్భుతమాయా
మానుషవిగ్రహా! సతతసు
ధీనుత! కరుణామహోదధీ! దాశరథీ! ౧

వ. అవధరింపుము, భవుండు భవాని కిట్లనియె. ౨

క. హనుమద్భాషిత మఖిలము, విని క్రమముగఁ బరమమోద వివశాంగుం డై
దినకరకులవర్ధనుఁ డి, ట్లని యుత్తర మొసఁగె వార లందఱు వినఁగన్. ౩

సీ. భూతలంబున నన్యపురుషునిచే మదిఁ, దలఁచుట కేని సాధ్యంబుగాని
యదియు, వేల్పులకును నలవిగానిదియు నౌ, కార్యంబు సాధించె గాడ్పుపట్టి,
లేకున్న నెవఁ డవలీల దాఁటం జాలు, శతయోజనాయతసాగరమును?
క్రూరరక్షోగణగుప్త యౌలంకను, జెనకిరా నెవ్వనిచేత నగును?

గీ. మానవాధీశునకు భృత్యుఁ డైనవాఁడు
చేయఁదగినట్టి దంతయుఁ జేసినాఁడు
హనుమ కెనయగుప్రియభృత్యుఁ డర్కజునకు
భువిని లేఁ డింకపయిఁ గల్గ బోఁడు పోఁడు. ౪

గీ. సీత నారసి వచ్చుటఁజేసి యిపుడు, పవనజునిచేత రక్షింపఁ బడినవార
మైతి మేనును లక్ష్మణుం, డస్మదీయ, వంశమును నట్లె యుద్ధరింపంగఁ బడియె. ౫

క. రమణీపరిమార్గణకా, ర్యము లెస్సగఁ జేయఁబడిన దన్నిగతుల, నై
న మదీయమనము కలఁగెడు, సముద్రముం దలఁచినంతఁ జకితం బగుచున్. ౬

విచారమానసుం డగురాముని సుగ్రీవుఁడు ప్రోత్సహించుట

సీ. మొసళులఁ బెనుమత్స్యముల నిండి నూఱామడలపొడవున నున్న జలధి దాఁటు
విధ మెట్లు? లేక్రియ వధియింతుఁ బగతున్ని, సుందరి నేరీతిఁ జూడ నేర్తు,
నని విచారమనస్కుఁ డైన రాఘవునకు, రవిపుత్రుఁ డిట్లను, రామభద్ర!
యంబుధి నక్రఝషాకులం బైనను, దరియింపఁగలము శాత్రవపురంబు
గీ. నాశ మొనరింపఁగలము దుర్నయు దశాస్యు,నిపుడ సంగరమున వధియింపఁగలము
చింతఁ బాయుము మది, నదియెంత లేసి, కార్యములనైనఁ ద్రుటిని భగ్నమ్ము సేయు.

క. నిరుపమసత్త్వుల శూరులఁ, దరుచరపుంగవుల నీ హితంబున కై చి
చ్చఱుక నయిన వెనుదీయని, యరాతిభీకరుల వీరి నరయుము, రామా! ౮

ఉ. ఆదిఁ బయోధి దాఁటువిషయంబున మాత్రము బుద్ధి నిల్పు, మా
మీఁద నెకేనియుఁ మన మమిత్రుపురంబును జూతు మేని మం
దోదరివల్లభుండు నిహతుం డనియే తలఁపంగవచ్చు, మీ
రేది యొనర్పఁ గాదు ? సరిదీశుఁడు దారి యొసంగ కుండునే? ౯

క. విలుపూని నిల్చుమిమ్ముం, గలన నెదుర్కొనెడివానిఁ గానను ద్రిజగం
బులలోన, మనకె విజయము, గలుగును సందియము లేదు, కాకుత్స్థమణీ! ౧౦

క. జయసూచకశకునము లెన్నియొ కన్గొనుచున్నవాఁడ నిఖిలాశల, ని
ర్భయ మగు మన, కరికిఁ బరా, జయ మగు నేటి కిఁక నీవిచారం, బనఘా! ౧౧

వ. అనుటయు భక్తివీర్యసమగ్రం బగుసుగ్రీవు వచనంబునకు వికర్తనకులాభరణమ్ము
సమ్మతించి, పురోభాగంబున నున్న మరున్నందనునితో నిట్లనియె. ౧౨

సీ. వాయుకుమార! యేదోయొకవిధమున, నుదధిని మనము దాఁటుదుము గాని
యాలంక నిర్జించు టది యెంతకష్టమో, యెఱుఁగము తద్విధం బింతకు మును;
పూని సాధింపఁగా రానిది దేవదానవులకే నందురు, నాకు దాని
మంచిచెడ్డలు వివరించి చెప్పుము మీఁదఁ, గావింతుఁ దత్ప్రతీకార మేను
ఆ. దగినభంగి ననుడుఁ, దా నతివినయసం,కలితుఁ డగుచుఁ గరయుగమ్ము మోడ్చి
యేను గన్నయట్టు లెఱిఁగింతు సకలమ్ము, నవధరింపుఁ డనుచు హనుమ పలికె.

హనుమంతుఁడు లంకయందలి విశేషములను రామునికిఁ దెలుపుట

క. సురనిర్మిత మాలంకా, పురము, త్రికూటాఖ్యభూరిభూధరము పయిఁ
మెఱయుచునున్నది, చుట్టు న, మరుఁ బ్రాకారంబు కనకమయమై, స్వామీ! ౧౪

సీ. నిర్మలోదకముల నిండి లోఁ దైనయగడ్తలు పురిచుట్టుఁ గలవు, కోట
బురుజులు హేమవిస్ఫురితంబు లై యొప్పు, వివిధోపవనసీమ మివులుచుండు,
కడునున్నతము లైననడబావు లందున్న, వతిచిత్రశోభాసమన్వితములు
మణిఖచితస్తంభమయములు సుందరములు నగుగృహముల నలరుచుండు,
గీ. ప్రభువ! యాపురి పశ్చిమద్వారమందుఁ, గాచియుందురు గజవాహు లేచి వేల
కొలఁది, గుఱ్ఱపురౌతులుం బలసియట్లు, యుత్తరద్వారమున నుండి రుగ్రభంగి. ౧౫

క. కల రగణితసంఖ్యాకులు, బలవంతులు భటులు తూర్పువాకిట, నట్లే
నిలుతురు రాక్షసవీరు లనలకల్పులు కడిమి దక్షిణద్వారమునన్. ౧౬

గీ. గజము లశ్వంబు లరదముల్ కాలుబంట్లు, గణన కధికంబుగా మధ్యకక్ష్యఁ గాచు
చుండు, రిదిగాక నానాస్త్రపాండితి గల, దనుజు లెప్పుడు రక్షించెదరు మహాత్మ!

సీ. చారు వీలుగానిపత్తెరువులు గల, వేక, కాలమ్మునందు పెక్కండ్ర మడియఁ
జేయుశతఘ్ను లెన్నోయున్న వయ్యెడ, నైనను మన కసాధ్యంబు గాదు,
రఘురామ! వినుఁ డందు రావణునకుఁ గల, యట్టిసేనాసమూహమ్ములోన
నాల్గవభాగంబు నాచేత హత మయ్యెఁ, బుర మెల్లఁ గాల్చితిఁ దిరిగితిరిగి,
గీ. విఱుగఁ బొడిచితి మన్నీలు వెఱఁగుఁ జెందఁ
బైఁడి ప్రాకారమును బాహుఁబటిమఁ జేసి,
సంక్రమములు శతఘ్నులు సర్వమట్లె,
నాశ మొనరింపఁబడినవి, నరవరేణ్య! ౧౭

చ. అరిపురి నిన్నుఁ గన్గొనినయంతనె తప్పక భస్మ మౌను, జె
చ్చెరఁ బయనమ్ము గమ్ము నృపశేఖర వానరవీరకోట్లతో,
నరుగుద మబ్ధితీరమున కన్నఁ, దదుక్తు లాలకించి భా
స్కరసుతుఁ జూచి పల్కె రఘుసత్తముఁ డత్తఱి, మత్తకాశినీ! ౧౮

సీ. భానుజ! తడయక పయనంబు చేయ నాజ్ఞాపింపుమీ యెల్లసైనికులను,
విజయసూచక మగువిజయాభిధానముహూర్తంబు జరుగుచున్న దిప్డు,
డీముహూర్తమునంద యేను ప్రయాణమై, పోయి మదేభ దైతేయసంకు
లంబు ప్రాకారావృతంబు వైరుల కభేద్యం బగులంకాపురం బఖిలము
గీ. ధ్వంస మొనరింతుఁ, బంక్తికంధరుని ద్రుంతు, నాకొఱకుఁ దల్లడిల్లుమానవతి జనక
తనయ నూరార్చి తెచ్చెద, దక్షిణాక్షి, యదరుచున్నది క్రిందుగా, నగు శుభంబు.

క. అలఘుబలాన్వితవానర, బల మంతయు నడచుఁగాక, భానుజ! సేనా
నులు ముందు వెనుకఁ బార్శ్వం,బుల నరుగుచు సేన నెల్లఁ బ్రోతురుగాతన్. ౨౧

సీ. ఏను సామీరిపై నెక్కి ముం దేఁగెదఁ, దారేయుపై నెక్కి తమ్ముఁ డంత
నరుగుదెంచెడుఁగాక, యగచరనాథ! నాతోఁగూడ ర మ్మీవు జాగుగొనక,
గజుఁడు గవాక్షుండు గవయుండు జాంబవన్నలులు నీలుండు మైందద్వివిదులు
మఱి సుషేణాదు లందఱుఁ గపివీరులు, బలముఁ గాచుచు నన్ని పార్శ్వములను
గీ. వచ్చెదరుగాత, మని హరివరుల కాన
తిచ్చి జగదీశ్వరుఁడు రాముఁ డినజుతోడ
ననుజుతోఁ గూడి సైన్యమధ్యగతుఁ డగుచు
నడువఁ జొచ్చెఁ బ్రమోదంబునను భవాని. ౨౨

కపిసేన సముద్రతీరముం జేరుట

చ. కరివరసన్నిభుల్ రిపువిఖండనదక్షులుఁ గామరూపు లౌ
దరుచరవీరు లందఱు నుదగ్రత సింహరవంబులున్ భయం
కర మగుగర్జలున్ తఱచుగా నొనరించుచు నేల యీని న
ట్లరిగిరి దక్షిణాభిముఖులై సురసంతతి సంతసింపఁగన్. ౨౩

క. ఫలముల భక్షించుచుఁ దే, నెలఁ ద్రావుచు రామభద్రుని సమక్షమునన్
ఖలుని దశకంఠు నిపుడే, పొలియించెద మనిపలుకుచుఁ బోయిరి దుర్గా! ౨౪

వ. అపుడు వానరసేనాపరివృతులై హనుమదంగదస్కంధనిష్ఠితులును రఘుశ్రేష్ఠులు
నగు రామసౌమిత్రు లాకసంబున నక్షత్రగణసేవితచంద్రసూర్యుల వడువునం బ్రకా
శించి, రిమ్మెయి నమ్మహాసేన ధరావలయం బంతయు నావరించి చనియె నిదియుం
గాక. ౨౫

క. లెక్కకు మిక్కిలియై యే, ది క్కరసిన నిండుకొనుచు ధృతిఁ దరునికరం
బొక్కటఁ బెకలించుచు గిరు, లెక్కుచుఁ బవనగతిఁ బ్లవగు లేఁగిరి, రమణీ! ౨౬

క. వాలాగ్రములు విదిల్చి ఛ, టాలనిపించుచును హృత్పుటము లుత్సాహ
శ్రీల మెఱయ రాఘవపరి, పాలితులై చనిరి శత్రుపదజయకాంక్షన్. ౨౭

సీ. నిముస మైనను నెందు నిలువక యొకపగ, లొకరాత్రి నడచి సముత్సుకతను
మలయసహ్యాద్రుల నలరువిచిత్రకాననముల సొబగుఁ గన్గొనుచు నమ్మ
హాచలంబులు దాఁటి యగచరసైన్యంబు భీమనినాదగంభీర మైన
సింధువుఁ గ్రమముగఁ జేరె, నంత రఘూత్తముం డనిలజుమూఁపునుండి డిగ్గి
గీ. భానుజునితోడ జలసమీపమున కేఁగి, పెనుమొసళ్లకుఁ డెంకి యౌ వననిధి మన
మందఱముఁ జేరినా, మింక నవలి కరుగ, నలవిగా దెది యే నుపాయమ్ము లేక. ౨౮

వ. కావున సైన్యంబు నెల్ల నిందె విడియింపుఁడు. మున్నీటిఁ దాఁటువిషయంబున నాలోచింత మని పల్కిన విని, తదాజ్ఞానుసారముగ సుగ్రీవుం డకూపారంబు తీరంబునఁ గపిహార్యక్షసురక్షితం బగువృక్షచరబలంబుం ద్వరితంబుగ విడియించె. తదనంతరం బతిభయంకరాకారంబును సమున్నతతరంగసంగతంబును మహోగ్రగ్రాహసమగ్రంబును నగాధంబును నుపమితవియత్పథంబు నగుసముద్రమ్ము నవలోకించి, దుఃఖించి యీశరనిధి నుత్తరింప మనతరంబు గాదు. దనుజాధముం డగు దశాస్యుఁ గసిసీఱ నిప్పుడ కసిమసంగవలయు, నిందుల కేమి సదుపాయం బొక్కో? యని వనచరు లెల్లఁ జింతాక్రాంతులై దాశరథిపార్శ్వంబుల నిలువంబడి, రాసమయంబున. ౨౯

శ్రీరాముని లీలామానుషచర్య

గీ. అమరకార్యార్థమై మనుష్యత్వ మూని, రాముఁ డననటించెడురమాకాముఁడుజన
కజ నెదఁ దలంచికొని పెక్కుగతుల వగచె, శోకపీడితుఁ డైనయజ్ఞుని విధమున.

గీ. నిశ్చలమనస్కతఁ గమనించు నెడ సనాతనుఁడు పరమాత్మ జ్ఞానస్వరూపుఁ
డొక్కఁ డద్వితీయుండు రఘూత్తముండు, కాన యతనికి దుఃఖ మెక్కఁడి కలుగు.

సీ. రమణి! రామునిస్వరూపము యథార్థంబుగ, గుఱుతించువానిని గూడ శోక
మోహాదికంబులు మొనయలే వనఁగ; నా, నందస్వరూపుని నాశరహితు
శ్రీరాము నెట్లు స్పృశింపఁగాఁ జాలు? ని,దియుఁగాక హర్షమ్ము భయము దుఃఖ
మును గ్రోధమును లోభమును మోహమును మద,మ్మును మత్సరమ్మును మున్నగునవి
గీ. సకల మజ్ఞానచిహ్నముల్, జ్ఞానరూపుఁ, డైనపరమాత్మయం దివి యరయఁ బడవు,
కలుగు దేహాభిమానికి సిలుగు, దేహ, భిన్నునకుఁ జిదాత్మకుఁ దోఁప దెన్నటికిని.

వ. సుందరీ! సుషుప్త్యవస్థయందు రెండవవస్తువు లేకుండుటంజేసి సుఖం బొక్కండె కదా తోఁచుచున్నది. పరిశుద్ధ మగునాత్మయందును నట్లె బుద్ధ్యాదికము లయిన యితరపదార్థములు గన్పడనికతమున దుఃఖోదయమ్మున కవకాశమ్ము లేకున్నయది. ఇందుచే శోకాదికము సమస్తము బుద్ధికేకాని యాత్మకు సంభవింపదు. ఈవిషయంబు సందేహవిరహితంబు. 33

సీ. పొరపడి యన్యథాబుద్ధిఁ దలంపకు, హైమవతీ! మనరామభద్రు,
నతనిరూపము పరమానంద మిప్పటి, వాఁ డని తెలియ నెవ్వరికిఁ గాదు,
తలఁపుల కైన నందనివాఁడు కోరికల్, లేనివాఁ డెల్లఁ దా నైనవాఁడు
పరమాత్మ ముక్తిసంపన్నుఁ, డట్లైన ని,య్యనఘుని నజ్ఞాను లల్పబుద్ధు
గీ. లరయుచున్నారు మాయాగుణాన్వితునిఁగ, సుఖ మనుభవించువానిఁగ శోకతప్తుఁ
గా నొకానొకమనుజునిఁగా నయోధ్య, నేలునరపతిఁగా; నిదియెల్ల భ్రాంతి. 3౪

రావణుఁడు మంత్రులఁగూడి విచారపడుట

వ. దేవీ! తరువాత వినుము. వీర లిట్లుండ, నట లంకలో రావణుండు దేవతలకు
సైతము దుష్కరం బగుకార్యం బనాయాసముగ నంజనానందనుండు చేసిపోవుటను
గాంచి లజ్జావనతముఖుం డై మంత్రుల నందఱం బిలిచి యి ట్లనియె. ౩౫

క. మనపురి కెంతటిదుర్దశ, పనుపడె నీనాటి కకట? పవనసుతుఁడు చే
సినచేఁత లెల్ల మీ రెఱిఁగినవే కద? సచివులార! కీ డెటు సైఁతున్. ౩౬

సీ. ఏమి యీవిపరీత? మెందుకుఁ గొఱగాని, తరుచరుఁ డొకఁడు దుర్ధర్ష మైన
మనలంక శంక యేమాత్రము లేక ప్రవేశించి వేగండ్ల వేల్పునకును
గనరానిసీతను గాంచి యంతటఁ బోక, పెక్కండ్రుశూరుల పేరు మాపి
మందోదరీ ప్రియనందను ప్రమందించి, నగరమ్ము నిశ్శేషముగ వడిన్ ద
గీ. హించి మిమ్మందఱ నతిక్రమించి కడలి, దాఁటి యాశ్రమమునఁ దనదారిఁ దాను
మరలి చనియెను, దనుజుల మగతనంబు, నేఁటితోఁ గోతిమూలాన నేఁటఁ గలిసె.

చ. మన మిఁక నేమిచేయవలె మంత్రవిశారదులార! చక్క మీ
మనముల నిశ్చయించి హితమార్గముఁ దెల్పుఁడు నాకు, మీకు మిం
చిన పరమాప్తు లెవ్వ? రెది చేసిన వైరిభయంబు దక్కు ని
య్యనువున? నంచు తేఁ డడుగ నాప్రెగడల్ వచియించి రీగతిన్. ౩౮

రావణునియెదుట మంత్రులు ప్రగల్భములు గొట్టుట

చ. జగముల నన్నిఁటిం గడిమి సంగరరంగమునన్ జయించి కీ
ర్తి గనిననీకు రాక్షసవరేణ్యునకున్ రఘురామమూలకం
బగుభయ మేటి కయ్య? త్రిదశాధిపు నంటఁగఁ గట్టితెచ్చి మె
ప్పుగఁ జెఱసాల వైచినరిపుఘ్నుఁడు మేఘరవుండు లేఁడొకో? ౩౯

క. కలవానితోడఁ దలఁపడి, కలనన్ జయ మొంది పుష్పకవిమానమ్మున్
లలిఁ దెచ్చి యనుభవించెడి, బలశాలికి నీకు వైరిభయ మేల విభూ! ౪౦

సీ. దండధరుండు సైతము జితుం డై పాఱెఁ, గాలదండభయంబు గలుగ దయ్యె,
హుంకృతిమాత్రన యోడె నంబుధిరాజు, చంద్రసూర్యులుఁ బరాజయముఁ గనిరి,
దైతేయు లందఱుఁ జేతులు జోడించి, రున్న తాసురుఁడు మయుండుగూడ
నినుఁ జూడ భీతిల్లి తనకూఁతు నర్పించి, నేఁడును లొంగియున్నాఁడు నీకు.
గీ. నింకఁ దక్కు రక్కసులమా టేల యధిప!,
స్వాంతములఁ గోఁతివాఁడు వీఁ డెంతయనుచు

నించుకయు లక్ష్యపెట్టని హేతువునఁ బ,
రాభవము వచ్చెఁ దల లెత్తరాని దగుచు. ౪౧

క. వానరునిమీఁద నొకఁడో, దానవబలపౌరుషప్రదర్శన మనుచుఁ దా
మానితిమి కాని; మఱియొకఁ, డైనన్ సాగునొకో? వానియాటలు, రాజా! ౪౨

చ. మన నటుమోసపుచ్చి యవమానముఁ జేసి యతఁ డిచ్చఁ బోయినాఁ
డనిలసుతుండు, మా తెలివి యంతయుఁ బాడయిపోయె, గొంతు నొ
క్కిన మరణించువానరునికిం దుద కెంతటిశౌర్యధైర్యముల్
పనుపడె నోర? మా దగునలక్ష్యము యింతటిచేటు దెచ్చెఁ జూ. ౪౩

వ. ప్రభువా! యిప్పు డైనను మించిపోయినది లేదు. మా కానతిమ్ము వేని. ౪౪

క. జగ మంతయు నిర్వానర, ముగ నిర్జనముగ నొనర్చి పాలింతుము, మా
మగటిమి యేలినవా రర,యఁగ వత్తురు మరల నించుకంతటిలోనన్. ౪౫

క. ఆలోచింపకుఁ డిఁకఁ జెలి, మాలో నొక్కరుని నేని మఱి పంపుం డా
లీలకుఁ జాలుదు, మనుచుం, గాళీ! డంబములు వల్కఁగా నవ్వేళన్. ౪౬

వ. రక్షగపతిని రావణునిఁ జూచి కుంభకర్ణుఁ డిట్లనియె. ౪౭

సీ. నీ వెది తలపెట్టినావో యాకార్యంబు, గనుఁగొన నీదుచావునకె కాని
వేఱుగా దెన్నఁడు; వింశతిభుజ! సీతఁ, దెచ్చునప్పుడు నీ యదృష్టము కడు
మంచి దాటుఁ జేసి మహానీలమూర్తి యా, భానువంశజుకంటఁ బడకయుంటి,
వాతండు నినుఁ జూచిన నైనఁ దిరిగి జీవంబుతో నీవిందు వచ్చు టెట్లు?

గీ. ఎవ్వఁ డని నీ మనంబున నెంచినావొ, రావణా! రాముఁ డాదినారాయణుండు
నాశరహితుఁడు దేవతానాయకుండు, మానుషావతారమ్మున మహిఁ జరించు.

గీ. ఆశతో విషపిండమ్ము నాది మ్రింగి, మీఁదఁ బరితాపపడుమహామీన మట్టు,
లామువెయి జానకిం దెచ్చి యక్కటకట, వెనుకఁ దపియించుచున్నావు వెఱ్ఱివోలె.

క. జానకి నేమోతెచ్చితి, పై నే మగుఁ దెలివిమాలి పాడుపని యిటుల్
పూని యొనరించితి విసీ; యైనను భయపడకు మేను నఖిలముఁ దీర్తున్. ౫౦

వ. అనవుడుఁ బినతండ్రికి నింద్రజి యి ట్లనియె. ౫౧

చ. అనుమతి యిచ్చి పంపుము రయంబున న, న్నిపు డేఁగి సానుజ
న్మని రఘురామునిం దపనపుత్రుని మ్రుక్కడికోఁతిమూఁక నె
ల్లను బలియిచ్చి వచ్చెద నిలాస్థలికిన్, సకలంబుఁ దీర్పఁ జా
లినసుతుఁ డుండ నేటికి వలీముఖకోటికిఁగా విచారముల్. ౫౨

విభీషణుఁడు రావణునకు హిత ముపదేశించుట

వ. అయ్యవసరంబున భాగవతశిరోమణియు, బుద్ధిమదగ్రగణ్యుండును, శ్రీరామచరణ యుగనిష్ఠితైకాగ్రచిత్తుండును, సుజనతోషణుండు, నగువిభీషణుం డరుదెంచి దివిషచ్ఛత్రు వగుమందోదరీకళత్రునకుఁ బ్రణామంబు సేసి తత్సమీపంబున నుచితాసనాసీనుం డై, క్రిందుమీఁ దెఱుంగక గర్వాలాపంబు లాడుమేఘనాదాదిమాను షాదప్రముఖులను, గామాతురుం డై వేదనం బడుతనయన్నను గనుంగొని, వీ రింకొటిబేల లగుదురే? యని తల పంకించి హితోపదేశమ్ముఁ గావింప నెంచి నిర్మలభావంబున రఘూత్తము మహత్త్వంబువం దప్రమత్తుం డై యిట్లనియె. ౫౩

సీ. తలపడి యే మేమొ తల్లక్రిందును జేతు, మనుచు నీముం దిపు డఱచుచున్న
యీ కుంభకర్ణుండు నీమేఘనాదుఁడుఁ, రామభద్రునిసంగరంబునందు
నెందులకుం జాల, రిట్లె తక్కినమహా, పార్శ్వమహోదరభద్రముఖులుఁ
గుంభనికుంభులుం గొఱగారు, కొఱవితోఁ, దలఁగోకికొనుట యాతనిఁ జెనకుట;
గీ. జానకీనామకమహాపిశాచము నిను, బట్టియున్నది విడువ దెప్పట్ల నైన;
ధనమునం బూజచేసి యాతల్లి, నల రఘూత్తమున కిత్తు వేని నీ కొదవు సుఖము.

చ. మనపురిఁ జుట్టి భానుకులమండను శాతశిలీముఖంబు లీ
దనుజుల మస్తకంబుల నుదగ్రతఁ గూల్పక మున్న జానకిం
గొనిచని భక్తి నాఘనునకుం నతిచేసి యొసంగు టొప్పు, మిం
చినతరువాత నేమియును జేయఁగరాదు, సురారివల్లభా! ౫౪

సీ. పర్వతాకారులు బలశాలులు మృగేంద్ర, తుల్యులు దంష్ట్రాయుధులు నఖాస్త్రు
లురువాలపాశు లుద్ధురపరాక్రము లగు, కపు లవలీలగాఁ గడలిఁ గడచి
వచ్చి నీలంక సర్వం బాక్రమించి ధ్వం, సముఁ జేసి, రనువార్త శ్రవణతాడి
తము గాక మునుపె సందర్శింపు మారామ, భద్రు సీత నొసంగి బ్రతుకుమయ్య!
గీ. అమరపుంగవరక్షణ మమరి యున్న, శక్రుతోడ మీఁదఁ జేరినఁ; జంద్రమౌళి
ప్రాపు చేకుఱినను నిన్ను బ్రతుకనీయఁ, డారఘుప్రవరుండు జితారికులుఁడు. ౫౫

క. డీలుపడి పఱచి తుదఁ బా, తాళము దూరినను, గరుణ దైవా ఱఁగ ని
న్నేలికొనిన మృత్యువు, సీ, తాలోలునివలనఁ జావు దప్పదు సుమ్మీ. ౫౬

రావణుఁడు విభీషణుని నిందించుట

చ. అనుటయు నిర్మలంబును హితాన్వితముం శుభయుక్త మైనత
మ్ముని వచనమ్ము రావణుఁడు మూర్ఛిత మై మ్రియమాణుఁ డౌషధం

బు నెటు లటుల్ గ్రహింపక, ప్రభూతరుషన్ విధిచోదితాత్ముఁ డై
యనియె సభాసదుల్ వినఁగ నక్రమవాక్యము లీక్రమంబునన్. ౫౮

సీ. శస్త్రంబు లగుభోగ్యవస్తువు లే నీయఁ, గమ్మఁగా భుజియించి కండఁబెట్టి
నాసమీపమ్మున వాసమ్ముఁ జేయుచు, నుపకారి నగునాకు నుపకరింప
కుండుటగాక; యోహో ప్రతికూలంబు, గా వాఁగెఁ దొడఁగె నీకలుషచిత్తుఁ,
డనుఁగుఁదమ్మునిరూపమున జనించినశత్రు, వే కాని వేఱుగా దింతనిజము,
గీ. దుష్టుఁ డగునీకృతఘ్ననితోడిమైత్రి, తగదు నావంటివానికి దనుజులార!
జ్ఞాతు లెపుడును జ్ఞాతినాశనమ కోరు,చుందు రెందుల కిప్పట్ల సందియంబు. ౫౯

వ. అని విభీషణునిదిక్కు మొగం బై. ౬౦

చ. మఱియొకఁ డెవ్వఁ డేనియుఁ బ్రమత్తత నిట్లొకమాట వల్కినన్
నఱకియ యుందుఁ దచ్ఛిరము, నా కొకఁ డడ్డమె? త్వత్కృతఘ్నతా
పరిణతి దెల్ల మయ్యె నుర పాతకి! నీ కెన యైననీచుఁ డా
సురకులమందుఁ గన్పడఁడుచూ; చెడఁ బుట్టితి వక్క టక్కటా. ౬౧

విభీషణుఁడు రావణునకు రాముని మహిమ దెలుపుట

వ. అనుడు నమ్మాట లసహ్యమ్ము లగుటం జేసి యందు నిలువనేరక మహాబలుం గుడ నవ్విభీషణుండు గదాపాణియై సభామధ్యమ్మునుండి నల్వురు మంత్రులుం దానును రభసంబున నభంబున కుద్గమించి యట నిలిచి, నిర్నిరోధక్రోధావేశమున లంకేశు నితో నిట్లనియె. ౬౨

సీ. ఆనుఁ జూచికొని నీ వడఁగారిపోకుము, హితవాది నగునన్నె యీవిధమున
ధిక్కార మొనరించి తిట్టితి, వెంత చెప్పిన వినకుంటివి పెంకె వగుచు
నన్నియన్నను దండ్రి కెనయగునట్టి జ్యేష్ఠభ్రాత వగుట రోషమ్ముఁ గొనక
మఱియుఁ జెప్పెదను సమరవైరి! రామస్వ, రూపంబునను గాలరుద్రుఁ డల్ల
గీ. దశరథుని యింటఁ బొడమె, సీతయనుపేర, జనకు మందిరమునఁ గాళి జన్మ మందె,
వార లిర్వురు ధారుణీభార మణఁప, వచ్చినా రిచ్చటికిఁ గల్లవార్త గాదు. ౬౩

క. ఆ రామమూర్తియే నిను, బ్రేరేపింపంగ హితముఁ బెడచెవి నిడి హుం
కారమున నన్ను దూఱఁగఁ, బ్రారంభించితివి రాక్షసాధిప! వింటే. ౬౪

క. ఓయన్నా! శ్రీరాముఁడు, మాయకు ద్రష్ట యయి సతము మాయాతీతుం
డై యలరారెడు, నట్టియ, మేయుని సాధింతు ననుచు మిడికెద వేలా? ౬౫

గీ. దానవేశ్వర! ప్రాణులలోన బయట, నంతటను నిండియుండినాఁ డామహాత్ముఁ,
డమలుఁ డైనను నామరూపాదిభేద, కలనఁ దత్తన్మయుఁడు వోలెఁ గానఁబడెడు.

సీ. పలుతెఱంగు లగుమ్రాఁకుల నొక్కయగ్నియ, తత్తదాకారభేదములఁ జేసి
నానావిధములుగాఁ గానంబడినయట్లు, స్ఫటికంబు స్వయముగ స్వచ్ఛ మయ్యు
వరనీలపీతాదివస్తుయోగమునఁ ద, త్తద్వర్ణములు గలదానిభంగిఁ
గన్పట్టురీతి, రాఘవుఁడు దా నిర్లిప్తుఁ, డయ్యును నన్నమయాదిపంచ
గీ. కోశముఖ్యయోగంబు గల్గుటకతమున, వానియాకారములు గొన్న వానిపోల్కిఁ
దోఁచుచున్నాఁడు మనకు, నిశాచరేంద్ర! మది విచారింపు మివ్విధం, బిదియుఁగాక.

వ. ఆరాముండు నిత్యముక్తుం డయ్యును స్వమాయాగుణంబులం బ్రతిబింబించి కాలుం
డనియుఁ, బ్రకృతి యనియుఁ, బురుషుఁ డనియు, నవ్యక్తమనియుఁ నాల్గువిధముల
వ్యవహరింపఁ బడుచున్నాఁడు. అందుఁ బ్రధానపురుషరూపద్వయమ్ము నురరీక
రించి య య్యజుండు జగం బఖిలమ్ము సృజించు. కాలరూపంబున నుపసంహరించు.
ఇయ్యది యార్యసిద్ధాంతంబు. ౬౮

గీ. అన్న! కాలరూపుఁ డైనయాభగవంతుఁ, డా యజుండు వేఁడ, మాయ నూఁది
రాముఁ డనఁగఁబుట్టి భూమిపై, నిను జంప, వచ్చినాఁడు మరలువాఁడు గాఁడు.

గీ. అతఁడు సత్యసంకల్పుఁ డీ యఖిలమునకు, నీశ్వరుండునుగాన; వాణీశుతోడఁ
దాను మున్నన్నచందానఁ బూనిచేయుఁ,గాని విపరీతముగఁ జేయఁగడఁగఁ డెపుడు.

చ. కడపటమాట విన్ము దశకంఠ! బలంబుల వాహనమ్ములం
గొడుకుల నిన్ను యుద్ధమునఁ గూల్పఁ గలండు రఘూత్తముండు, కూ
ల్చెడు తఱి మిమ్ము శస్త్రహతిఁ జేస్పడువారిని జూడఁ జాల కి
ప్పుడ చనుచుంటి నవ్విభుని పొంతకుఁ జింతలు వాసి యుంటకున్. ౭౧

గీ. అనుఁగుఁదమ్ము నిష్కారణ మాగ్రహించి, పురివెడలఁ గొట్టినాఁడవుపో దశాస్య!
యే నరిగినంత సుఖివయి యిచ్చవచ్చి, నట్లు చిరకాలము సుఖింపు మాశకీఱ.

విభీషణుఁడు శ్రీరాముని శరణుచొచ్చుట

చ. అనుచు విభీషణుండు దనుజాధిపుఁ డాడినమాటమీఁద వ
స్తునికరసమ్మితంబును నతుల్యము నౌభవనంబుఁ దక్కవా
నిని విడి తత్క్షణంబునఁ జనెన్ రఘురామపదారవిందసే
వనమును గోరికొంచు హిమవన్నగనందిని! పూర్ణకాముఁడై. ౭౩

వ. అ ట్లామహాభాగుండు మంత్రిచతుష్టయసమేతమ్ముగాఁ జని రామభద్రు కట్టెదుట నంతరిక్షంబున నిలిచి నిజవృత్తాంతంబు తేటపడ నెలుఁ గెత్తి యి ట్లనియె. ౨౪

సీ. రాజీవలోచన! రామ! నమస్కార, మాలింపు నాకుయ్యి యాదరమున,
మీధర్మపత్నిని మైథిలి నపహరిం, చినదుర్మతికి దశాననున కేను
సహజన్ముఁడను, విభీషణుఁ డంద్రు నన్ను, న, గ్రజుఁ డవమానించెఁ గాన మిమ్ము
శరణు వేడినవాఁడ, స్వామి! యాయవిదితా, త్మునకుఁ జేసితి హితబోధము మఱి
గీ. చెడియెదవు రామమూర్తికి సీత నంపి, సౌఖ్యపడు మని పల్మఱు చాటిచెప్పి
నప్పటికి వినఁ డయ్యె మాయన్న మృత్యు, పాశబంధనమునకు లోఁబడినకతన. ౨౫

క. వినకుండుటగా కలుకం, గొని చంపఁగఁ గత్తిఁ జేతఁ గొని నాపై దూఁ
కెను దనుజాధముఁ డతఁ, డే, నును నిం కిట నుండరా దనుచు భయపడుచున్. ౨౬

క. నలువురుమంత్రులతో మి, మ్ములఁ గొలువఁగ వచ్చినాఁడ ముమ్మాటికి, నా
యలఘుభవబంధజాలము, దొలఁగించి యనుగ్రహింపు దురితవిదూరా! ౨౭

వ. మీకంటె నాకు దిక్కగువాఁడు గానరాఁడు. విపక్షుం డని నిరసింపక యను
కంపం దిలకింపుఁ డన, విని యినతనయుండు దశరథతనయున కిట్లనియె. ౨౮

సీ. మోసకాఁ డైనయీముక్కిడిరక్కసు, దొంగమాటలను నమ్మంగఁదగదు,
సీతను ముచ్చిలించికొనిపోయినదశ, గ్రీవుని తమ్ముండు కేవలంబు,
చేవ గల్గినవాఁడు గావున విశ్వాస, పాత్రుండుగాఁడు భూపాలతిలక!
శరచాపహస్తు లౌసచివులఁ గూడి కీ, డాచరించెడిని సం దైనయపుడు,
గీ. నాకు నానతి యిమ్ము వానరులఁ బంపి
కసిమసంగింతు, బుద్ధి కెక్కరణిఁ దోఁచె,
ననఘ! మీమది కేది యిష్ట మదియుఁగూడఁ
దెలుపుఁడనఁ బల్కెఁ జిఱునవ్వు గులుకుచుండ. ౨౯

క. అఱనిమిసములో లోకే, శ్వరులను లోకముల నెల్ల సమయింతును నే
డ్రెఱ సృష్టింతును మఱియుం, దరుచరవర! యట్టియూహ దవిలిన దేనిన్. ౩౦

వ. కావున నేతన్మాత్రకు శంకింపం బనిలేదు. ౩౧

చ. అతఁ డెవఁ డైన నేమి యభయంబు నొసంగినవాఁడ, నీ విఁకన్
ద్రుతగతిఁ బోయి యాయసురఁ దోడ్కొనిరమ్ము, ప్రపన్నరక్షణ
వ్రత మొకఁ డుండె నాకుఁ, గపివల్లభ! "దీనజనుండ నీవె నా
గతి" యనివేడువారలకుఁ గల్గదు భీతకృతార్తి యెద్దియున్. ౩౨

వ. అనుటయు నమ్మాట కలరి రవిసూనుండు విభీషణుం గొనివచ్చి శ్రీరామసందర్శ నంబుఁ జేయించె. అప్పుడు రావణానుజుండు సాష్టాంగదండప్రణామం బొనర్చి, శ్యామలవర్ణంబును శరచాపధారణంబును విశాలనేత్రద్వంద్వంబును బ్రసన్న ముఖారవిందంబును శాంతంబును జగన్మనోహరంబు లై చూపట్ట సౌమిత్రిసహి తముగ సమాసీనుఁ డై యున్న జగన్నాథు జానకీనాథు నవలోకించి పరమభక్తి యుక్తిఁ గరమ్ములు ముకుళించి యపగతభయుం డై యిట్లని స్తుతించె. ౮౩

విభీషణకృత శ్రీరామ స్తవము

సీ. రామభద్రాయ సీతామనోరమణాయ, భక్తావనాయ తుభ్యం నమోఽస్తు
చండకోదండాయ భండనోద్దండాయ, భయశమనాయ తుభ్యం నమోఽస్తు
రవిపుత్రమిత్రాయ రవికోటితేజసే, పరమశాంతాయ తుభ్యం నమోఽస్తు
జగదుదయస్థితిక్షయకారణాయ దయాసముద్రాయ తుభ్యం నమోఽస్తు
గీ. దేవరాజే మహాత్మనే తే నమోఽస్తు, దానవానీకినీహర్త్రే తే నమోఽస్తు
త్రిభువనైకగురువరాయ తే నమోఽస్తు, దీనలోకచింతామణే! తే నమోఽస్తు.

వ. రామా! యనంతుండవును ననాదిగృహస్థుండ వగునీకు నమస్కారంబు. సర్వ భువనంబుల సృష్టిస్థిత్యంతంబులు భవదధీనంబు లై చెల్లు. యథేచ్ఛావిహారుండ వన నీ వొక్కండవు దక్క మఱెవ్వరుం గారు. జంగమస్థావరాత్మకభూతకోటి యందు బహిరంతర్గతుండ వై వ్యాప్యవ్యాపకరూపంబునం బ్రకాశించుచున్నావు.

సీ. భవదీయమాయాప్రభావంబునఁ జ్ఞాన, మడుగంటిపోవ నష్టాత్ము లగుచుఁ
జెడుపుత్రోవలం ద్రొక్కుచిత్తముల్ గలవారు, పాపపుణ్యంబుల బలిమిఁ జావు
పుట్టుకల్ గాంతు రెప్పుడు, జానకీశ! శుక్తికయథార్థాకృతిఁ దెలియ నపుడు
వెండిపోలికఁ దోఁచువిధమున ని న్నెఱుంగనినాఁడు జగము నిక్కముగఁ దోఁచు
గీ. సకల విషయంబులఁ దొఱంగి జ్ఞానమూర్తి
వైననీయందు నిశ్చల మైనబుద్ధిఁ
దగులువడఁ జేసి యాత్మతత్త్వంబుఁ గన్న
మీఁద జగ మఖిలము మిథ్యగాఁ దెలియును. ౮౪

క. నినుఁ దెలియక యజ్ఞానులు, వనితాపుత్రాదిమోహవశు లై దుఃఖా
ర్ణన మొనరుచుపనులం గై,కొని చెడుచున్నారు వనఁటకుం గుదు రగుచున్. ౮౭

సీ. నీవ యింద్రుండవు నీవ పావకుఁడవు, నీవ యముండవు నిర్ఋతి వీవ
యీవ కుబేరుండ వీశానుఁడవు నీవ, వరుణుండవును నీవ వాయు వీవ

యెల్లలోకములకు నీవ తండ్రివి తల్లి,వీవ ధాతవు నీవ దేవదేవ!
అణువునకంటె నత్యల్ప మై యున్నావు, స్థూలంబు నీకంటెఁ దోఁప దొండు
గీ. మొదలు నడుమును జివరయు మొదలె లేవు
నాశ మెఱుఁగవు నిండియున్నా వఖిలముఁ
గాళ్లుఁ జేతులుఁ గన్నులుఁ గర్ణములును
లేని వాఁడ వవ్యయుఁడవు జానకీశ!. ౮౮

వ. రామా! కన్నులు లేనివాఁడ వయ్యును గాంచుచున్నావు. వీనులు లేనివాఁడ వయ్యు వినుచున్నావు. హస్తములు లేనివాఁడ వయ్యు గ్రహించుచున్నాఁడవు. కాళ్లు లేనివాఁడ వయ్యు నడచుచున్నావు. ఇదియుఁగాక యన్నమయాదికోశ పంచకవ్యతిరిక్తుండవును నిర్గుణుండవును నిరాశ్రయుండవును నిర్వికల్పుండవును వికారదూరుండవు నై యున్నావు. స్వామీ! సర్వప్రపంచమున కీవ నియంతవు. నిన్ను నియమించువాఁడు లేఁ డనుట ధ్రువంబు. షడ్భావరహితత్వమును ననాదిపురుషత్వమును బ్రకృత్యతీతత్వమును నీయందుఁ బ్రవిభాసమానంబు లై పరఁగు. మాయాగృహీతుండ వగుట మనుష్యుఁడవుగ భావింపఁబడుచుంటివి. ౮౯

సీ. నిను గ్రమంబుగ నిర్గుణునిఁగ జన్మాదులు,లేనివానిఁగను దెలిసి మనముల
ముక్తి గాంతురు హరిభక్తులు, రామ! నీ,పదపద్మములమీఁది భక్తియనెడు
నిచ్చెన నెట్టులో నేను సంపాదించి, జ్ఞానయోగం బనుసౌధ మెక్కఁ
గోరుచున్నాఁడ నాకోరిక దీర్పుము, భయవార్ధి నుత్తరింపఁగఁ జేసి
ఆ. కరుణఁ జూడు మయ్య కారుణికోత్తమ! వందనంబు పంక్తివదనవైరి!
యాశ్రితుండఁ ద్రిభువనాశ్రయ! యని విభీషణుఁడు సన్నుతించె, సన్నుతాంగి.

వ. అంత భక్తవత్సలుం డగుకాకుత్స్థుండు ప్రసన్నుఁ డై విభీషణా! నీకు శుభం బగు, వరం బిత్తు. భవదిష్టం బెద్ది? యెఱింగింపు, మనవుడు నతం డి ట్లనియె. ౯౦

గీ. ధన్యుఁడఁ గృతార్థతముఁడఁ గర్తవ్య మెల్ల, నాచరించినవాఁడ నై యలరఁ గంటిఁ
దావకపదాబ్జయుగళసందర్శనమున, నే విముక్తుఁడ నైతి సీతేశ! నిజము. ౯౨

క. నా వంటిధన్యతముఁడును, నావంటివినిర్మలుం డనఘుఁడును లేఁ డె
చ్చో వెదకిన; విభ్రాజ, త్తావకచిన్మూర్తిఁ గాంచుదశ చేకుఱుటన్. ౯౩

గీ. కర్మబంధవినాశమ్ము గలుగుకొఱకు
ని న్నెఱింగెడితెలివియు నీపదాబ్జ
భక్తి నీధ్యానమును దానిఫల మగుపర
మార్థమును నాకు దయచేయు మనఘమూర్తి!. ౯౪

క. విషయసుఖంబుల నే నభి, లషింప నెన్నటికి నృపలలామ! భవత్ప
ద్విషయికదృఢభక్తిని నభి, లషింతు నెల్లపుడు నట్టిలాభం బిమ్మా. ౯౭

వ. అనవుడుఁ బ్రీతుం డై రఘునేత యవ్విభీషణునితో నిట్లను, సౌమ్యుఁడా! మదీయ
రహస్యం బొండు గల దద్దానిం దెలిపెద సావధానచిత్తుండ వై యాలకింపుము.

సీ. సమధికశాంతులు విమలయోగాభ్యాస, రతులును మఱి వీతరాగు లైన
మద్భక్తజనుల హృన్మందిరంబుల నివ,సింతు నిత్యమ్మును సీతతోడ
సందేహ మేమిలే దిందు, విభీషణ!, నీవు శాశ్వతుఁడవు నిర్మలుఁడవు
కలుషవర్జితుఁడవు గావున నన్ను స్మరించి మహోగ్రసంసృతిపయోధి
గీ. నుండి విడువంగఁ బడుదు, నెన్నండు నాకుఁ, బ్రియకరం బైనయీనుతి వినుఁబఠించు
వాఁ డు మత్ప్రీతి కొఱకు నవ్వాఁడు చెందు, నస్మదీయసారూప్యమ్ము ననఘచరిత! ౯౮

వ. అని నిజానుజన్మునిం జూచి, లక్ష్మణా! మత్సందర్శనసంజాతమహాఫలం బితం
డిప్పుడ పడసి సంతసించుఁగాక, నీ వేఁగి సాగరజలమ్ముం గొని రమ్ము. లంకా
రాజ్యమ్మునకుఁ బ్రభునిఁగ నభిషేకించువాఁడ మఱియు.

గీ. చంద్రసూర్యాదిగమనమ్ము సాగుదనుక, నవని గ్రుంగక నిల్చెడునంతవఱకు
నాకథ ప్రపంచమున నుండుదాఁక నితఁడు, దనుజరాజ్యమ్ముఁ బాలించు ధర్మవృత్తి.

సీ. అని, తత్క్షణమ లక్ష్మణానీతసాగర, జలపూర్ణమంగళకలశమునను
స్వయముగఁ దా విభీషణు నభిషేకించి, మంత్రులచేత లక్ష్మణునిచేత
నట్లె చేయించె సీతాధిపుం డంబురు,హానన! వానరు లంద అంత
మిక్కిలి పొగడిరి మేలుమే లనుచు సుగ్రీవుఁ డుగ్ర బిగ్గఁ గౌఁగిటను జేర్చి
గీ. యనఘ! మన మెల్లరముఁ బరమాత్మ యగు ర
ఘూత్తముని కింకరుల మందు నుత్తముఁడవు
నీవు, నీభక్తికిఁ మెచ్చి నెమ్మిమై స్వ
కీయపరిరంభపాత్రునిఁ జేయుకతన. ౧౦౦

క. అరిసోదరుండ వయ్యును, హరికృపకుం జాలి పూజ్య మగురాజ్యంబుం
బరిపాలింపఁగ నున్నా, వరరే? నీకథ విభీషణా! చిత్రము సూ. ౧౦౧

క. నెయ్యము గుదిరిన దగుటం, గయ్యంబునఁ బంక్తిముఖునిఁ గడతేర్పఁగ సా
హాయ్యంబుచేతకుం దగు, దయ్యా! నీకెఱుఁగరాని యది యటఁగలవే?. ౧౦౨

వ. అనుడు సుగ్రీవునకు దశగ్రీవానుజుం డిట్లనియె. ౧౦౩

ఉ. అంతట నిండియుండుపరమాత్మునకున్ రఘురామమూర్తి కే
నెంతటివాఁడ యుద్ధమున నెయ్యి సహాయము సేయఁ; బద్మినీ
కాంతకుమార! రావణుఁ డొకం డన నేటికి గ్రుగ్గు చెప్పఁ బా
టంతటిలోన యీభువన మంతయు నీతఁ డటుల్ దలంచుచో. ౧౦౪

వ. మఱే మందు వేని. ౧౦౫

చ. స్థిర మగుభక్తి శక్తి కొలఁదిం గపకేతరవృత్తితో నిరం
తరమును నిమ్మహాత్మునకు దాస్య మొనర్చెద, నంచుఁ బల్కిన
త్తఱి శుకనామధేయుఁ డొకదానవుఁ డున్నతకాయుఁ డందు నే
ర్పెఱ దశకంఠుఁ డంపఁ జనుదెంచి యనెన్ రవిసూను ఖస్థుఁడై. ౧౦౬

శుకుఁ డను రాక్షసుఁడు రావణుని పంపున సుగ్రీవునికడ కరుగుట

వ. కపిచక్రవర్తీ! రాక్షసచక్రవర్తియు నీకుఁ దోఁబుట్టువు నగురావణుండు చెప్పి పుత్తెంచిన సందేశమ్ము సావధానమ్ముగ వినుము. ౧౦౭

సీ. గొప్పవంశంబునఁ గొమరారఁ బుట్టితి, వదిగాక వనచరు లందఱకును
రాజ వైతివి దినరాజతనూజ! దానవలోక మేలెడునాకు నీవు
భ్రాతృతుల్యుండవు, విప్పట్ల నీ కగునుపద్రవ మేమియును లేదు రామభద్రు
నిల్లాలిఁ గామించి యేఁ దెచ్చికొంటి నీ, మాట యే మున్న దిమ్మాడ్కి విడియ?
గీ. నే నెటులు చేసినన్ నష్టి యేమి నీకు, మరలి కిష్కింధకుం బొమ్ము మర్కటములఁ
గూడి, నిర్నిమిత్తముగ నాతోడ నేల, వైర మూనెద వొకరాచవాని కొఱకు.

క. మానగరముఁ జొర దివిజుల, కైన నశక్యంబు సుమ్మి, యత్యల్పబలుల్
మానవులును వానరులు న, హో నేర్తురె యిట్టి వెఱ్ఱియూహాలు తగునే?. ౧౦౯

వ. అని చెప్పుచున్న సమయంబునఁ గొంతద్రిమ్మరులు హుమ్మని రయమ్మున గగనమ్మున కెగసి పట్టుంబడి దృఢముష్టితలంబులఁ బ్రహరింపఁ బ్రారంభించి, రట్లా శుకుండు మర్కటహన్యమానుం డగుచు రాముని దిక్కై. ౧౧౦

క. ఇనకులతిలకా! దూతలఁ, దునుమరు నరపతులు శాస్త్రదూష్యం బగుటన్
ననుఁ గొట్టు వనచరుల నల్లదని వడి వారించి ప్రోవు మయ్యా! కరుణన్. ౧౧౧

క. అని వేఁడ శుకుని పరిదే, వనవచనం బాలకించి "వధియింపకుఁ డా
తని"నంచు వారి వారించెను గరుణం దరణివంశశేఖరుఁ, డగజా!. ౧౧౨

ఆ. అంత శుకుఁడు మరల నాకాశమునఁ జేరి, యర్కతనయుఁ జీరి, యగచరేంద్ర!
యేను బోవుచుంటి నేమి చెప్పెదవు లంకాధిపతికి ననుడు నతఁడు పలికె. ౧౧౩

శుకాసురుని కపులు చెఱలో నుంచుట

సీ. చెప్పుట కేమివిశేషముల్ గలవు మో, మోటంబు వీడి యీమాటయొకటి
పలుకుము, నాయన్న బలవైరిసుతుఁ డెట్లొ, యట్లె నీవును సందియమ్ము లేదు,
దనుజాధమా! ప్రయత్నమున సైన్యామాత్య, పుత్రయుతమ్ముగఁ బాడ వడఁపఁ
దగినవాఁడవు, రామధాత్రీశు సతిని ముచ్చిలి యెందుఁ బోయెదో చెప్పు నాకు?
ఆ. ననుచుఁ బలికి రాముననుమతి మీఁద న, య్యసురఁ బట్టికట్టి యసము దఱుఁగఁ
బ్లవగపాళి మూఁగి పరిహసింపఁగఁ జెఱ,లోన నునిచె భానుసూనుఁ డపుడు.

వ. అంతకు మున్ను శార్దూలనామకయాతుధానుం డొకం డపరిమితం బగుకపిబలంబుం
దిలకించి తదీయయథార్థస్థితిం దనకు విన్నవింపఁ గంపితుం డై రావణుండు
దురంతచింతాక్రాంతం బగు స్వాంతంబున నంతఃపురంబునం దొక్కపెట్ట నిట్టూ
ర్పుచుండె. ఇట సాగరోపాంతంబున. ౧౧౫

రాముఁడు సముద్రునిపైఁ గోపించుట

క. కను గొలుకు లరుణదీధితి, నెనయఁగఁ గినుకమెయి ప్రోదినీశ్వరునిం గ
న్గొని యనుజున్మన కిట్లనె, జనకసుతావల్లభుండు, చంపకనాసా!. ౧౧౬
సీ. దుర్బుద్ధి యగుసముద్రునికొంటెతనముఁ జూచితె లక్ష్మణా! తన్నుఁ జేరవచ్చి
నట్టిన న్నింతేని నాదరింపఁ దలంపఁ, డౌరౌర? దర్శింప నైన రాఁడు
"మానవుం డీతండు మర్కటంబులఁ గూడి, న న్నేమిచేయు"నంచున్నవాఁడు
గాఁబోలుఁ; జూచెదఁ గాక యే తచ్ఛక్తి, నిప్పుడె శరవహ్ని నింకఁజేతు
గీ. దిగులు దీఱెసవా రయి యగచరు లిఁకఁ, గాళ్లతోడన నడచిపోఁగలరు వడిగ
నరిపురంబున, కనుచుఁ గ్రోధాతిరేక, తామ్రలోచనుఁ డై భూతతతి చలింప.

చ. సరగున రాముఁ, డెక్కిడినచాపముఁ గైకొని కాలవహ్నితో
సరసములాడుదీప్తిగలచండశరంబు నిషంగగుప్తము
ద్ధురగతిఁ దీసి భాసిలఁగఁ దొడ్గి బలంబుకొలంది లాఁగి, యో
తరుచరులార! రాముశరఘాటిఁ గనుంగొనుఁగాత భూతముల్. ౧౧౮

గీ. గర్వదూషితు నీనదీకాంతు నిపుడ, భస్మ మొనరింతు నని యుగ్రభంగిఁ బలుకు
చుండ గిరివనయుతముగా నుర్వి వడఁకె, గగనదిగ్భాగములను జీఁకట్లు గ్రమ్మె.
గీ. కడలి క్షోభించి చెలియలికట్టనుండి
చనియె లోనికి నొక్కయోజనము దవ్వు
గ్రాహతిమిమీనఝషములు గ్రాఁగి మిగుల
బెగడుగుడిచె భయమ్మునఁ జిగురుఁబోడి!. ౧౨౦

సముద్రుఁడు రామసందర్శనార్థము వచ్చి స్తుతించుట

సీ. తత్సమయమున సాక్షాత్సముద్రుఁడు దివ్య, రూపంబు ధరియించి రూఢిమెఱయు
నాభరణములు మై నలరార నిజదీప్తిఁ, జేసి దిక్కులు ప్రకాశించుచుండఁ
దనలోనిజీవరత్నములు దోయిటఁ గొని,వచ్చి క్రోధారుణవదనుఁ డైన
రాముని పాదాగ్రసీమఁ గానుకఁగ స,మర్పించి భక్తి నమస్కరించి

గీ. త్రిభువనావన! జగదీశ! దేవదేవ!, కనికరమ్మున ననుఁ గావు కావుమయ్య!
శివశివా నీకు నపకృతిఁ జేయుదునె; త్వ,దాశ్రితుని నవమానింప న్యాయ మగునె.

సీ. జగము లన్నిఁటి సృష్టిసలిపిన నీచేత, జడుఁడఁగా సృజియింపఁబడితి మొదటఁ
ద్వత్కల్పితస్వభావము వేఱువిధముగ, మార్ప నెవ్వారు సమర్థు లీశ!
స్థూలభూతము లైదు నోలి స్వభావమ్ము,చే జడమ్ములు గనె చేయఁబడియె
నవి యెన్నఁడును భవదాజ్ఞ నుల్లంఘింప, కట్టులెయుండు, నే నందు నొకఁడఁ,

గీ. దామసాహంకృతిని గదా రామ! భూత,గణముపుట్టుట; కారణగుణముల నగు
చెలిమివలనఁ దమోగుణసిద్ధ మైన, జడత తద్భూతములకు నైజముగఁ గలదు.

వ. రామా! నిర్గుణుండవును నిరాకారుండ వైననీవు మాయాగుణంబుల లీలగ నుర రీకరించి వైరాజనామంబున వ్యవహరింపఁ బడుచుందువు. భవద్విరాడ్విగ్రహ సత్త్వగుణంబువలన దేవతలును, రజోగుణంబువలనఁ బ్రజాపతులు మున్నగు వారును, దమోగుణంబువలన భూతనాథుండును బొడమిరి. ౧౨౩

గీ. మాయచేఁ గప్పఁబడి లీల మనుజరూపుఁ, గొన్ననిర్గుణు బ్రహ్మాద్యగోచరు నిను
మూఢచిత్తుండ జడుఁడను మూర్ఖతముఁడ, నే నెటులఁ దెలియఁ జాలుదు? జానకీశ!

గీ. మూర్ఖ్య మూనినవారి సన్మార్గమునకుఁ, ద్రిప్పఁ దగుసాధనమ్ము ధాత్రీతలమున
శిక్షణమె చుమ్ము నిర్జరశ్రేష్ఠ! పశు క,దంబమును మరల్చుటకు లగుడంబు వోలె.

క. నిను భక్తవత్సలు శర,ణ్యుని శరణము వేఁడినాఁడ నొసఁగు మభయముం
గనికరమున, నరిపురికిం, జనఁ దెరు విచ్చెదను నీకు, సౌజన్యనిధీ!. ౧౨౬

వ. అనవుడు సముద్రునకు రామభద్రుం డిట్లనియె. ౧౨౭

గీ. విను మమోఘబాణం బిది వింటఁ గూర్చి, నాఁడ నుపసంహరించుట పాడి గాదు.
ఎద్దియే నొకలక్ష్యంబు నేర్పఱిచి, చెప్పు మద్దాన దీని వైచెదఁ, బయోధి!. ౧౨౮

క. తొందరగఁ జూపు మిఁకఁ దడ,యం దగ దీయస్త్రమునకు నాటంకము లే
దెందును నెంతటి పనియైన,నం దీరిచి పొదికిఁ దా క్షణంబున వచ్చున్. ౧౨౯

వ. నావుడుఁ దేజోనిధి యగుమహోదధి దాశరథివచనంబు విని వింత మంటలు గ్రక్కుచు లక్ష్యంబున కపేక్షించుశరమ్ము నీక్షించి తత్క్షణ మిట్లనియె. ౧౩౦

క. కలదు ద్రుమకుల్య మనియెడు, స్థల మొండు కుబేరదిశ, నచటఁ బాపాత్ముల్
గల రమితమ్ముగ కేల్పవ, ఖలులు నను బాధించుచుంద్రు లోకశరణ్యా!. ౧౩౧

క. వారలు పెట్టెడి యలజడి, నేరను వచియింప, నేఁడు నీబాణం బా
క్రూరులపై విడువుము కడ, తేఱుదు రన వదలె నతఁ డతిత్వరితముగన్. ౧౩౨

క. వదలిన బగబగ మండుచు, నది క్షణమున నందుఁ బోయి యాభీరతతిఁ
సదమదము సేసి యమ్ముల, పొదిఁ జేరెను నెప్ప టట్ల పూర్ణేందుముఖీ!. ౧౩౩

వ. తదనంతర ముదన్వంతుండు సీతాకాంతునిం జూచి సవినయమ్ముగ నిట్లనె. ౧౩౪

సీ. మహితాత్మ! విశ్వకర్మసుతుండు కడుబుద్ధిమంతుఁ డన్నిటను సమర్థుఁ డింతె
కాక యీపని సేయఁగలవరంబును గొన్న, వాఁడు నలుం డనువానరుండు
తోడరి నానీట సేతువు గట్టుఁగాక స,మస్తజనాఘంబు మాయఁజేయు
త్వద్యశం బఖిలదిక్తటవర్తి యై యుంటఁ, గాంచి సంతోషించుఁగాక జగము
ఆ. దేవ! యనుచు నిట్లు దెలిపి తదంఘ్రుల, కెఱఁగి సింధురాజ దృశ్యుఁ డయ్యె
సుందరాంగి! యంత సుగ్రీవలక్ష్మణ,సహితుఁ డగుచు రామచంద్రమూర్తి. ౧౩౫

క. నలునిఁ బిలిచి వింటివి కద, జలనిధి పలుకులను వృక్షచరబలములతో
జలధిపయి సేతుబంధం, బలఘుగతి నొసర్పు మేటి కాలస్య మిఁకన్. ౧౩౬

నలుఁడు సేతుబంధనమ్ము చేయుట

వ. అని యాజ్ఞాపించుటయు విశ్వకర్మకుమారుం డత్యంతసంతోషి యై మహామహీధర సంకాశకీశయూథపసహాయంబునఁ దరుశైలంబులతోఁ బదియామడల వెడల్పును నూఱుయోజనముల పొడవును గల సేతువును దృఢంబుగ నిర్మించె, నని చెప్పి వెండియు శైలకోదండుఁడు కొండరాచూలి కిట్లనియె. ౧౩౭

శ్రీరాముండు శివలింగమును బ్రతిష్ఠించుట

సీ. శ్రీరాముఁ డారీతి సేతు వారంభించి, యచ్చట లోకహితార్థముగను
రామేశ్వరుం డన సోమశేఖరునిఁ బ్ర,తిష్ఠించి పూజించి దివ్యభక్తి,
నీమహాలింగంబు నెలమిమై దర్శించి, సేతుబంధమునకుఁ జేతు లెత్తి
యభివందనముఁ జేయునాతండు మదనుగ్ర,హంబున బ్రహ్మహత్యాదిఘోర
ఆ. పాతకములఁ బాసి ప్రవిమలచిత్తుఁ డై, శమదమాదిగుణము లమర నమర
సమితి సన్నుతింపఁ జంద్రకళాధరు, పదముఁ జేరు ననుచుఁ బలికె, లలన!. ౧౩౮

సీ. సేతుబంధమున సుస్నాతుఁ డై రామేశు, గౌరీశుఁ గన్నులఁ గాంచి దీఱఁ
బాడఁగని, సంకల్పపూర్వకంబుగ దీక్షఁ, బూని కాశీక్షేత్రమునకుఁ బోయి
విశ్వనాయకుని సేవించి గంగాపావ,నోదకంబుల నటనుండి తెచ్చి
యీమూర్తి "శ్రీం నమస్సోమాయ చ"యటంచు నభిషేక మొనరించి యార్యసరణి
గీ. జలముఁ గొనివచ్చినట్టిపాత్రలు మొదలగు, వస్తువుల నెల్ల మున్నీట వైచువాఁడు
సంసృతిక్లేశదూరుఁ డై శాశ్వత మగు,బ్రహ్మపద మొందు సందేహపడకుఁ డిందు.

వ. అని యిట్లు రఘుశ్రేష్ఠుండు స్వప్రతిష్ఠితాష్టమూర్తిమాహాత్మ్యం బెఱింగించె. నలుం
డును నారంభదినంబునఁ బదునాలుగుయోజనంబుల దవ్వు సేతువు నిర్మించె, నట్లె
రెండవదినమునం దిరువదియోజనంబులును దృతీయదివసమ్మున నేకవింశతియోజ
నములును జతుర్థదినమున ద్వావింశతియు నైదవనాఁ డిరువదిమూఁడుయోజన
ములును గట్ట గట్టె. ఇవ్విధి నవ్వానరసత్తమునిచే నిర్మితం బై లంకాపత్తనపర్యం
తంబు శతయోజనదీర్ఘం బై వారధి పరిపూర్తి యగుటయు. ౧౪౦

వానరలు లంకకుఁ జేరుట

క. ఆకట్టమీఁదుగా దగ,లేకుండ రయంబునఁ గపి వలీముఖబల మెం
తో కేరుచు సారెకుఁ జనె, రాకాసులవీడు సొరఁగ రాకేందుముఖీ!. ౧౪౧

ఆ. ఒకనికంటె నొక్కఁ డురవడిఁ బాఱుచు, గణన కందరానికపివరేణ్యు
లాక్రమించి రట్టె యాసువేలాద్రిని, క్షణములోన తోయజాతనయన!. ౧౪౨

గీ. హనుమదంగదులను నెక్కి యరిగి రపుడు
దాశరథు లిర్వురును జయధ్వనులు మిగుల
నంత సీతాధిపుఁడు లంక నరయఁ దలఁచి
పర్వతాగ్ర మారోహించి పాఱఁజూచె. ౧౪౩

వ. చూచి, యతివిస్తృతంబును వివిధవిచిత్రధ్వజవిభ్రాజితంబును భాసురప్రాసాద
బంధురంబును గార్తస్వరవికారప్రాకారతోరణశ్రీకంబును బరిఘావృతంబును
శతఘ్నీసమగ్రంబును సంక్రమసంశోభితంబు నగుయాతుధానరాజధానిప్రసాధన
మున కచ్చెరువడి మెచ్చుకొనుచుండె, నప్పుడు. ౧౪౪

సీ. అసురనాథుఁడు శూరు లైనమంత్రులఁ గూడి, పదికిరీటంబుల ప్రభలు మిగుల
వార్షుకాభ్రమువంటి వన్నియమే నొప్ప, నాకార మలయంజనాద్రిశిఖర
తౌల్యంబుఁ గోర సుందరమణిదండముల్, గలతెల్లగొడుగులు కరములందు
ధరియించి నిల్వఁ గింకరులు, విశాలతలంబున హేమసౌధంబుమీఁద

గీ. నెలమిఁ గొల్వుండె నింతిరో! యింతలోనఁ
బ్లవగతాడితుఁ డై యట బద్ధుఁ డైన
శుకుఁడు వచ్చె నచ్చోటికి సకుటిలహృద
యుండు రాముఁడు విడిపింప నుస్సురనుచు. ౧౪౫

వ. అట్లాగతుం డైనవానిం గని దశాననుండు దరహాసితవదనుం డై. ౧౪౬

క. ఏమిర! యిట్లుంటివి ని, న్నేమైనం బ్లవగకోటి హింసించెన? యే
మేమివిశేషము లరసితి, వామొన వారేమిపలికి? రన నాతండున్. ౧౪౭

శుకాసురుఁడు రామునిమాటలు రావణునకుఁ దెలుపుట

క. మీ రన్నపగిదిఁ బోవ్వా, వారోత్తరతీరమునను వ్రాకుచ్చితి గం
భీరఫణితి సకలంబును, భూరుహచరు లంతఁ గ్రోధపూరితు లగుచున్. ౧౪౮

గీ. గగనమున నున్ననను వడి నెగసి పట్టి, క్రిందఁ బడవైచి తమపిడికిళ్ల గోళ్లఁ
గఱకుఁగోఱల బాధింపఁగాఁ దొడంగి, రశనితులితార్భటులు మీఱ నసురనాథ!.

ఉ. సైఁపఁగ లేక తద్వ్యథకుఁ జచ్చితిఁ జచ్చితిఁ గావు మయ్య సీ
తాపతి! యంచుఁ గుయ్యిడ, నతండు దయాళువు గాన రోదనా
లాపము లాలకించి "కపులార! త్యజింపుఁడు వీనిఁ గొట్టకుం
డీ పయి" నంచు నాన యిడె నెల్లరు నన్ విడి రేమి చెప్పుదున్. ౧౫౦

వ. అంతట నే నిటఁ దడసిన నేమి మూఁడునో; యని భీతిల్లి నిరుపమానవానరానీకి
నీసమాలోకమునం దసమర్థుండ నై యెట్టకేలకుఁ బొఱఁజూచి పారంబుగానక
పేరెమ్మువాఱి మిమ్ముం జేరి బ్రతుకఁగంటి. దానవపతీ! సురాసురులకుం బోలెఁ
గపిరాక్షససైన్యంబులకు సంధి గుదురుట కల్ల. ౧౫౧

సీ. దా పయినారు లంకాపురప్రాకార, మాక్రమించెద రిసుమంతలోన
జాగుచేయకు మిఁక జానకి నిచ్చుటో, వైరంబు రేఁపి చివ్వకు నడచుటో
యెదియే నొకటిచేయు మీ రెంట, నాతోడ మైథిలీశుం డన్నమాట వినుము,
మును పే బలముఁ జూచికొని హరించితివో నా,భార్యను నిప్పుడా బలముఁ జూప
గీ. బంధుహితసైన్యయుతముగ బయలుదేఱి, రమ్ము మసలకు, వచ్చిన రాకయున్న
తేపు ప్రొద్దుట లంకేశ! నీ పురంబు, కాకఘూకమ్ములకు నగుఁ గాఁపురమ్ము.

క. ద్వారములుఁ గాంచనప్రా, కారంబులుఁ గేతనములు ఘనసౌధములుం
దోరణములు భగ్నములై, మారణ మగు నీదులంక మద్బాణములన్. ౧౫౩

క. నా శర మనుమారికి లంకేశ! భవత్సేన నెల్ల నిచ్చెద బలిగా,
లేశంబును దలఁపకు మేఁ, కోశమ్మునఁ గాని "జయ మగున్ నా" కనుచున్.

క. జలనిధిఁ బొడమెడుబడబా,జ్వాలననిభం బయినరోషవహ్నిని నీపై
నలఘుగతిఁ బ్రయోగించెద, నిలు మెదురయి పంక్తికంఠ! నీ పస దెలియున్.

వ. అని మిమ్మనాదరమ్ముగఁ బలికి తూలనాడి విరమించె. ఇదియుఁ గాక పురుష
శ్రేష్ఠు లగునా రామలక్ష్మణసుగ్రీవవిభీషణులు నల్వు రొక్కటియై యెయ్యది
చేయఁ బూనుదు రయ్యది నిరాఘాటముగ జరిగితీరు. త దసాధ్యంబులు మృగ్యంబు.

క. నీ వీడు పాడుసేయఁగఁ, గేవలసత్త్వమునఁ బెల్లగించి బసుమముం
గావింప వీరె చాలుదు, రా వానరసైన్య మేటి? కసురాధీశా!. ౧౫౭

వ. అందును. ౧౫౮

ఉ. రాముని రూపమున్ బలపరాక్రమముల్ వివిధాయుధంబులున్
దీమసముం గనుంగొనఁగ దేవరిపూత్తమ! యాతఁ డొక్కఁడే
యీ మనలంక సర్వము దహింపఁగలాఁ డని నిశ్చయించితిన్
నా మదిఁ, దక్కువారివచనమ్ముల నేమి ప్రయోజనం బిఁకన్. ౧౫౯

చ. తెఱపి యొకింత లేక జగతీతల మీనిసభంగి దట్టమై
పరిమితిహీనమై నగరిపై విడియం బఱతెంచు నా వనే
చరబలముం గనుంగొనుము శక్రరిపూ! మఱి యాదిశన్ భయం
కరముగ గర్జలన్ జలుపు తమోధరదేహుల వారిఁ జూడుమా. ౧౬౦

శుకాసురుఁడు రావణునకు వానరయోధుల నిరూపించి చెప్పుట

సీ. కీశసైన్యంబు లెక్కింప శక్యముగాని, దసురవల్లభ! యైన నందులోఁ బ్ర
ధానుల మాత్రము నేను నీ కెఱిఁగింతు, లంకాభిముఖుఁ డయి లావుమెఱయ
శతసహస్రవనాటసైన్యం బనుగమింప, జీమూతరభటి గర్జించుచున్న
యీవానరుండు సుగ్రీవుని దళవాయి, నీలనాముండు వహ్నిప్రభవుఁడు
గీ. అధిప! వీఁ డద్రిశిఖరాభుఁ డంగదుండు, కమలకేసరవర్ణుండు శమితరిపుఁడు
వాలితనయుండు యువరాజు వాయుజవుఁడు, తోఁకఁ ద్రిప్పుచునున్నాఁ డనేకగతుల.

చ. జలనిధి దాఁటి రామవిభుజాయను గన్గొనె నెవ్వఁ, డేనిచేఁ
గలన భవత్కుమారకుఁడు గండడఁగెన్, నగరంబు సర్వముం
గలయ దహించి వాలశిఖిఁ గ్రమ్మఱి పోయెను నెవ్వఁ, డమ్మహా
బలుఁ డితఁ డాంజనేయుఁ డరిభంజనదక్షుఁడు, రాక్షసేశ్వరా!. ౧౬౧

గీ. నిరుపమపరాక్రముండు మనీషి రజత,సన్నిభాంగుఁడు సుగ్రీవు సవిధమునకు
వచ్చి రయమునఁ బోయెడివాఁడు శ్వేతుఁ, డధిప! చూడుము సర్వసమర్థు నతని.

క. మృగరాజున కెనయగువాఁ, డగణితవిక్రముఁడు ఘనబలాఢ్యుఁడు లంకా
నగరధ్వంసరిరంసుఁడు, నగచరుఁ డీతండు రంభనాముఁడు, రాజా!. ౧౬౪

క. శరభాఖ్యుం డాతఁడు మన,పుర మఖిలముఁ గాల్చువానిపోలిక రుషతో
నరయుచు నున్నాఁ డదె వా,నరయూథపకోటి గొలువ నాకివిరోధీ!. ౧౬౫

సీ. పనసుఁ డందురు వీని బలశాలి యసురేంద్ర!, మైందాభిధేయుఁ డమ్మర్కటుండు
కడలిపై సేతువు గట్టినబలుదిట్ట, విశ్వకర్మసుతుండు వీఁడు నలుఁడు
తిలకింపు మాతండు ద్వివిదుండు, తక్కిన,వారి వర్ణింప నెవ్వరు సమర్థు?
లందఱు గిరిసన్నిభాంగు లందఱు శూరు, లందఱు యుద్ధరంగాభిలాషు

గీ. లందఱును మాంసభుక్సమూహములతోడి, లంక భస్మముఁ జేయ వలంతు, లంద
ఱా రఘూత్తము కార్యార్థ మసువు లైనఁ, బాయ సంసిద్ధు లిఁక వేయి పలుక నేల.

వ. మఱియు వీరలకుఁ బ్రత్యేకంబుగాఁ గలిగి పిసేన లెక్క నక్కాణింతుఁ జిత్తగింపుము.
సుగ్రీవుని ప్రెగ్గడ లగుహనుమదాదుల యూథిపత్యమ్ముక్రింద నేకవింశతికోటిసహ
స్రంబులును, నర్బుదశతంబులును, మెలంగుచుండు. రక్షఃపతీ! తదితరసైన్యంబు
లగణ్యంబు లగుటఁ జేసి, నాకు విరమింపవలసివచ్చె నది యట్లుంచుము. ౧౬౭

శుకాసురుఁడు రావణునకు రాముఁడు పరమాత్మ యని బోధించుట

సీ. రాముని నెవనిఁగా నీమదిఁ దలఁచితో; పరుఁ డాదివిష్ణువు, నరుఁడు గాఁడు
దైతేయవల్లభ! సీత, విశ్వస్వరూపిణియు విశ్వైకకారణము నైన
చిచ్ఛక్తి చుమ్మి, యీచేతనాచేతనా,త్మకముగఁ దోఁచెడిసకలజగము
వారలవలన నే ప్రాదుర్భవించె సీ,తారామభద్రు లాకారణమునఁ

గీ. దల్లిదండ్రులు జగతికిఁ, దద్విరోధి, యైనవాఁ డెట్లు జీవించు, నఖిలలోక
జననినే తెచ్చితివి బుద్ధిచాపలమున, విడువు మింతట నేని వివేకి వగుము. ౧౬౮

వ. రాజా! క్షణకాలవినాశి యగుసంసారమునం జిక్కి పృథివ్యాదిపంచభూతాత్మకం
బును జతుర్వింశతితత్త్వస్వరూపంబును, మలమాంసాస్థిదుర్గంధభూయిష్ఠంబును,
మహదహంకారనిలయంబును, జడంబు, నగుశరీరమ్ముపైఁ దద్విలక్షణుండ వైన నీ
కభిమానం బేల?. ౧౬౯

గీ. బ్రహ్మహత్యాదిదుర్భరపాతకములు, దేనికొఱకై యొనర్చితో; దివ్యభోగ
రాశి నెది భుజియించునో; రాక్షసేంద్ర!, యాశరీర మియ్యది యిందె నాశ మగును.

గీ. అధిప! సుఖదుఃఖమూలమ్ము లైనపుణ్య, పాపములు రెండు జీవుని బాయ కుండి
మరల దేహాదికమును జేకుఱఁగఁ జేసి, యనిశ మొసఁగుచు నుండు సుఖాసుఖముల.

సీ. జీవున కధ్యాససిద్ధిచే నొడలియం, దే ననునభిమాన, మెల్లపనులఁ
గర్తృత్వబుద్ధియుఁ, గలిగి యుండెడిదాఁక, సుఖదుఃఖయుగళంబు సుకృత దుష్కృ
తములు జననమరణములును ఘటియించు, దేహాభిమానకర్తృత్వబుద్ధు
లుజ్జగించినతోన యొదవు స్వరూపసా, క్షాత్కారరూపమోక్షంబు, గాన
గీ. నీవు నాహిత మాలించి నిరభిమాని
వగుము దేహాదికములందు, నాత్మ శుద్ధుఁ
డచలుఁ డత్యంతనిర్మలుం డవ్యయుండు
నిర్గుణుఁడు జ్ఞానమయుఁ డింతనిజము, దేవ!. ౧౭౨

వ. అట్లయినను. ౧౭౩

క. విను తన్నెఱుఁగని కారణ,మున బంధము నొంది మిగుల మోహపడుచు నుం
డెను గాన శుద్ధభావం,బున నాత్మ నెఱింగి యెల్లపుడుఁ దలఁపు మటుల్. ౧౭౪

సీ. ఆశాలతను ద్రెంచి యంగనాసుతహిత, మందిరాదికముల మమత వీడి
వైరాగ్యలక్ష్మిని వరియింపు మసురేంద్ర!, యశుభవిషయములయందుఁగూడ
గనుపట్టు భోగంబు, శునకసూకరశరీ,రములును భోగయోగ్యముల చూవె;
అట్లైనచో నుత్తమాధమజన్మము,లందు భేదంబుండ, దందువలన
గీ. నన్యజనసంబుల నలభ్య మైనయదియు, నుత్తమం బగు నీ జని నొదవునదియు
నగుమహాఫల మొకదాని నభిలషించి, పడయఁ బోలును వృథ నేఁత పాడిగాదు.

సీ. జ్ఞానార్జనమునకుఁ గషునర్హ మగుమేను, బొంది యందును గర్మభూమి యనఁగఁ
బరఁగెడుభారతవర్షంబునం బుట్టి, యందును విప్రత్వ మంద నోఁచి
మతిమంతుఁ డెవ్వఁ డాత్మను శరీరముగ భా,వించి భోగంబులఁ గాంచఁ దివురు?
విప్రుఁడ వైపుట్టి విశ్రవసునిప్రియ తనయుండ వై సమస్తమును దెలిసి
గీ. కటకటా రేల్పవళ్లు భోగములఁ దగిలి, జీవితము మూఢుగతి వృథ చేయుచుంటి
వేమి? సరి గతి మెందుల కింకనైన, సర్వసంగవర్జితుఁడ వై సౌఖ్యపడుము. ౧౭౬

చ. అతులితభక్తిభావమున నాపరమాత్ముని రామచంద్రునిన్
సతము సమాశ్రయింపు, మపచారముఁ జేసితి నైఁపు దేవతా
పతి! యని సీత నిచ్చి నిరపాయతఁ దత్పదసేవకుండ వై
బ్రతుకుము, పాపముల్ దొలఁగి వైష్ణవలోకనివాస మబ్బెడిన్. ౧౭౭

క. నీ విటు సేయనిచోఁ బున, రావృత్తివివర్జితుండ వై మఱిమఱి ర
క్షోవిభుఁడ! యధోగతికిం, బోవుదు విడిచూడ నీకుఁ బోలిన తెఱఁగే. ౧౭౮

సీ. నామాట నెమ్మది నాటించుకొనుము కింకరవాక్య మని యనాదరముసేయ
వలదు, హితమ్ము నెవ్వాఁడు దెల్పిన విన,నగు దాన గౌరవహాని రాదు
సజ్జనస్నేహంబు సలుపుము నిలుపుము తాతతండ్రులపేరు దైత్యనాథ!
మరకతమణిభాసమానశరీరు శరణ్యు నగణ్యుని రఘువరేణ్యు
గీ. జానకీయుతు దివ్యాస్త్రచాపసహితు
నఖిలలోకేశ్వరుని యుష్మదనుజలక్ష్మ
ణార్కసుత సేవితాంఘ్రిని హరిని రామ,
మూర్తిని భజింపు మెపుడుఁ బ్రమోది వగుము. ౧౭౯

రావణుఁడు శుకునిం గోపించుట

వ. అని యివ్విధంబున శుకుండు బోధింప నజ్ఞానశోషణంబు లగుతద్భాషణంబులకు దోషాచరచక్రవర్తి రోషించి రూక్షేక్షణంబుల నిర్దహించుచువాఁడు వోలె నిట్లనియె.

క. అరరే యనుజీవ్యుఁడ వై, చిరకాలమునుండి యుండి చివరకు నాకే
గురువువిధమ్మున నీతులు, గఱపఁగ మొదలిడితి వింత కావర మటరా. ౧౮౧

సీ. జగములు మూఁటిని శాసించువాఁడను, నే, నిట్టినాకు నీ వేమియేమొ
యుపదేశ మొనరించుచున్నావు సిగ్గిల్ల, కిత్తఱి నో; రౌతు మెత్తనైన
గుఱ్ఱంబు వడిగ నేఁగునె? చూచుతోడనె చిత్రవధంబును జేసియుందు,
మునుపటియుపకృతి మనసునకున్ వచ్చె వధ్యుండ వయ్యుఁ గావంగఁ బడితి
గీ. చాలు నిటనుండి యెట కేని సాగు మింకఁ
గర్ణశూలాయమానముల్ కటువులైన
నీ పలుకు లాలకించుట నీతి గాదు
లోకవిద్రావణుఁడ నగునాకు మూఢ!. ౧౮౨

శుకుని పూర్వవృత్తాంతము

వ. అనవుడు మహాప్రసాదం బని పలికి యులుకుచు నిజనిలయంబున కరిగె, నని చెప్పి శర్వుఁడు శర్వాణి కిట్లనియె. సర్వమంగళా! యీ శుకుండు తొల్లి వేదపారగుం డైనబ్రాహ్మణుండు. మఱియు, బ్రహ్మవేత్తలయం దుత్తముం డై వెలసె. ౧౮౩

క. రమణీ! వానప్రస్థాశ్రమమునఁ గాననమునందు సతతముఁ దన క
ర్మము లయినక్రియలు శాస్త్రీయముగా నొనరించుచుండి యాఘనమతియున్.

క. జన్నమ్ములు పెక్కు లవిచ్ఛిన్నముగ నొనర్చి విగతచింతన్ సురల
భ్యున్నతి నలరారుట కా, పన్నత రాక్షసులు మృత్యుబద్ధు లగుటకున్. ౧౮౫

క. అమరహితోద్యతుఁ డగుటను, సమరారుల కెల్లఁ బగతుఁ డయ్యె నతం డో
యుమ! విను మంతట నొకతఱి, నమితరిపుఁడు వజ్రదంష్ట్రనాముఁడు కడిమిన్.

శా. న నైన్ననం గన కీతఁ డివ్విధమునన్ మద్వైరిసంతుష్టి కై
జన్నమ్ముల్ పొనరింప నూరకొనుటల్ శౌర్యంబె నావంటి వి
చ్ఛిన్నారాతికిఁ? దగ్గశాస్తి యెదియోఁ జేయం దగుం దప్పదం
చన్నీచుండు చరించుచుండె నట రంధ్రాన్వేషియై, సుందరీ!. ౧౮౭

గీ. అంత నొకసమయమున నయ్యాశ్రమమున, కరుగుదేర నగస్త్యమహర్షి, యుచిత
సరణిఁ బూజించి నేఁడు భోజనమున కిట, నిలువుఁ డని వేఁడె శుకమహాని నెమ్మిమిగుల.

వ. అందుల కక్కుంభసంభవుం డంగీకరించి స్నానార్థంబు సరోవరంబునకుం జన,
నక్తంచరుం డదియ యద నని యగస్త్యవేషధారి యై శుకుని డాయఁబోయి
యాతనితో ని ట్లనియె. ౧౮౯

విద్యుజ్జిహ్వుఁడు శుకుని మోసగించుట

సీ. ఓవిప్ర! యాతిథ్య మొసఁగెద వేని నా, కొగి సామిషమ్ముగా నుండవలయు
నల మేకమాంసమం దభిరుచి యెక్కుడు, చిరమునుండియుఁ దటస్థింపలేదు
సమకూర్పు మనవుడు సంతసించి శుకుండు చేయించెఁ బలలవిశిష్టమైన
యాహార, మంత స్నానార్థంబుఁబోయిన, వాతాపిదమనుండు వచ్చి కుడువఁ
గీ. గూరుచుండఁగఁ, బొలదిండి కూళ మరల, మాయచే వానిభార్యగా మాఱి తత్స
తీమణిని మోహపెట్టి నిద్రింపఁ జేసి, మనుజమాంసంబు వడ్డించె మౌనిపతికి.

వ. ఇట్లు. ౧౯౧

క. కమ్మగఁ గాలిచి విస్తరిఁ, గ్రమ్మఁగ వడ్డన యొనర్చి క్రవ్యాదుఁడు మా
య మ్మయ్యె నపుడ మునిసిం, హ మ్మెఱిఁగిన మాడ్చు నసుభయమ్మున దేవీ!.

అగస్త్యుఁడు శుకుని శపించుట

చ. కడు నపవిత్రమున్ దనుజకల్పిత మైనమనుష్యమాంసముం
బొడగని కుంభసంభవుఁ డపూర్వరుషన్ జటిఁ బల్కు, బుద్ధిహీ
నుఁడ! భుజియింప ర మ్మని ననుం దినరాని న్నమాంస మిచ్చి నా
వొడలు మదించెనే యెఱుఁగ వొక్కొ మదీయతపఃప్రభావమున్. ౧౯౩

క. మానవమాంసం బిడి యవ,మానించితి వౌట విప్రమండను నన్నుఁ
మానవులం దిని బ్రదికెడి, దానవుఁడవు గ మ్మటంచుఁ దా శాపమిడెన్. ౧౯౪

వ. ఇత్తెఱంగున తుపితనహుషప్రభావుండు ఘటజన్ముండు తీంద్రంబుగ శపింపఁ గంపించి నిష్కపటి యగుశుకుండు భయపడుచు నిట్లు విన్నవించె. ౧౯౫

గీ. అనఘ ! యీరాత్రియ నాపయి నాగ్రహింపఁ
దగునె ? "యాతిథ్య మీయఁగాఁ దఁ ౘె దేని
బలలసహితమ్ముగా నుండవలయు" ననుచు
నిప్పుడే కాదె చెప్పిపోయితిరి మీరు. ౧౯౬

ఆ. యుష్మదాజ్ఞ మీఱకుండ నొనర్చితి, నితర మేమి యెఱుఁగ నింత నిక్క
మిట్టి నన్ను ధర్మవే యిట్లు నిర్నిమి,త్తముగ ఘోరశాపతప్తుఁ జేయ. ౧౯౭

వ. అని తనయపరాధమ్ములేమి తెల్లంబు సేసిన. ౧౯౮

క. విని విస్మితమానసుఁడై, మునివరుఁడు ముహూర్తకాలము సమాధింగై
కొన వజ్రదంష్ట్రిఁ డొనరిం,చినదంతయుఁ దెలియవచ్చె, శీతాంశుముఖి !. ౧౯౯

వ. తదుపరి నిరపరాధి యగువానప్రస్థునెడఁ బ్రసన్నుండై దుఃఖోపశమనమ్ముగ ని ట్లనియె. ౨౦౦

అగస్త్యుండు శుకునకు శాపవిముక్తిని దెలుపుట

సీ. నీ వేమి యెఱుఁగవు నీ కపకృతి చేయఁ,దలఁచు రాక్షసుని కృత్యం బిదెల్ల
మంచిచెడ్డ లెఱుంగ మాని తొందరపడి, శపియించితిని మునిచంద్ర! నిన్ను
నక్లైన నామాట వ్యర్థమ్ము గా దెప్డు, శాపోక్తరీతి రక్షస్స్వరూప
మును బొంది పంక్తికంఠునకు సహాయంబు, సేయుచు వానరశ్రేణిఁ గూడి

గీ. జలధి బంధించి రావణుఁ జంప లంక,దాపునకు రాఘవుఁడు వచ్చుదాఁక నిల్వు
మపుడు మందోదరీవిభుం డనుపఁ జార,వృత్తి నీ వేఁగి రాము దర్శింపఁగలవు. ౨౦౧

ఉ. పాయును శాప మా భువనపావనునిం గనుమాత్ర, మీఁద దై
తేయకులాధినాథునకుఁ దెల్పి యథార్థము బ్రహ్మతత్త్వముఁ
హాయిగ భగ్నబంధనుఁడై కననేర్తు విదేహముక్తి మా
నీ! యని చెప్పి కుంభభవుఁ డేఁగె, శుకుండును నవ్విధమ్ముగన్. ౨౦౨

ఉ. దానవరూపముం బడసి దానవనాథునిఁ గొల్చియుండి చం
ద్రానన ! చారరూపమున రాము నలక్ష్మణుఁ గాంచి భర్తకుం

బూనికఁ దత్త్వముం గఱపి భూసురుఁ డై మఱి పూర్వభంగి, వై
ఖానసకోటిలోఁ గలయఁగాఁ జనియె న్దదనంతరంబునన్. ౨౦౩

వ. వృద్ధుండును బుద్ధిశాలియు నీతిశాస్త్రనిపుణుండును గైకసీప్రియజనకుండును మహీధరతుల్యుండు నగురాక్షసుండు మాల్యవంతుం డన్వ్యోడకు వచ్చి నెయ్యంబు మిగులఁ దియ్యనిపలుకుల నయ్యామినీచరచక్రవర్తి కిట్లనియె. ౨౦౪

మాల్యవంతుఁడు రావణునకు హితమును జెప్పుట

గీ. నా నుడులు శాంత మైనమనమ్ముతోడ, వినుము విని తోఁచినట్లు గావింపు మవల
నవనిసుత ప్రవేశించిన దాదిగఁ బురి, దుర్నిమిత్తము లెన్నెన్నొ తోఁచుచుండె.

క. అవి సకలము నాశనహేతువులును భయదాయకములు దుస్త్వజములు దా
నవవల్లభ! నీ ముందఱ, వివరించెద వినుము వేఱువేఱుగ వానిన్. ౨౦౬

సీ. పిడుగులు గల్గి గంభీరగర్జలు మీఱ, నతిభయంకరము లై యంబుదములు
గురియుచున్నవి మనపురము నల్గడలను, వేఁడినెత్తురు, దేవవిగ్రహములు
గదలుచుఁ జెమ్మట గార్చుచు రోదనములం జేసెడిని, గాళి ముందుఁ జేరి
పకపక తెల్లనిపండ్లు బయల్పడ, హాసియించుచున్న, దే మని వచింతు?
గీ. ముంగిసల ప్రాపునం జేసి మూషికములు, కడకుఁ బిల్లులతోఁ దలఁపడియెఁ బెనఁగ,
గాడిదల నీనుచుండె గోగణము, గరుడపక్షితోఁ బోరసాగె సర్పములు క్రొవ్వి.

గీ. కృష్ణపింగళవర్ణంబుఁ గేవలభయదాకృతియు బోడితలయును నమరఁ బురుషుఁ
డై యనుక్షణమును మృత్యు వరయుచున్న, దసురసదనంబు లన్నిటి, నసురనాథ!

వ. మఱియు, నితరమ్ము లగుదుశ్శకునమ్ము లనేకమ్ము పుట్టుచుండె, నెల్లరకుఁ గన్పట్టుచుండె. కావున రాక్షసవంశసంరక్షణార్థ మిందులకుం దగినశాంతి గావింపు, మయ్యది యెయ్యది యందు వేని. ౨౦౯

క. మణికనకాదుల సీతామణిని సమర్చించి నిండుమనమున రఘురా
మ్మాణి కొసఁగుము కొనిచని రావణ! దీనినిమించుశాంతి పనుపడ దెందున్. ౨౧౦

క. వైరము వీడుము రాముఁడు, నారాయణుఁ డని స్వబుద్ధి నమ్ముము, జగదా
ధారు నతనిఁ గొలిచిన సంసారభయం బడఁగు, నిట్లు సలుపుము నీవున్. ౨౧౧

సీ. మైథిలీశుం డెట్లు మానవుం డగుఁ? దస్మీయాంఘ్రిపోతంబు సమాశ్రయించి
భక్తిచే జనములు పరిశుద్ధహృదయు లై, జ్ఞానంబు వడసి సంసారవార్ధి

సులువుగ నుత్తరించుచునున్నవా, రిట్టి, యసదృశమహిమ యెందరయఁగలము
సకలభూతాలయు సదయు నమ్మహనీయు, భజియింపుమీ భక్తిభావమునను

గీ. నసురనాయక! తన్మహిమాతిశయము, చేతఁ బూర్వము నీ వెంత చెడ్డవాఁడ
వైన నే మేనిఁ జేసిన నమలమాన, సుండ వౌదువు నిరుపమసుఖము గలుగు.

క. తలఁపుము వంశక్షేమము, సలుపుము నేఁ జెప్పినట్లు, సత్కీర్తి మహిన్
నిలుపు మన, దశముఖుం డా, పలుకుల వినఁడయ్యె మృత్యువశుఁ డగుకతనన్.

వ. వినక పోవుటయకాక యసహ్యించికొని మాల్యవంతునితో నిట్లనియె. ౨౧౪

రావణుఁడు మాల్యవంతు నాక్షేపించుట

సీ. అరయఁగ మానవుం డదిగాక యొక్కఁడు, తండ్రి విసర్జింప దైన్యవృత్తి
నాకలములు దిని యడవిఁ గాలక్షేప, మును జేయువాఁడు సన్మునిహితుండు
పనికిమాలినకోఁతిబలగ మూఁతగఁ గలపరమదరిద్రుఁ డబ్జానుకులుఁడు,
నీ వేమిహేతువుచే వాని నింతగా శ్లాఘించుచున్నావు చాలుఁ దెలిసె

గీ. నతఁడు నిను బంప నిట వచ్చి యడ్డులేక, వదరుచుంటివి నోరికి వచ్చినట్లు
చుట్టఱికముఁ బెద్దఱికముఁ జూచి కోప, మాఁపుకొంటిని బో పొమ్ము, పాపచరిత!.

వ. పరప్రకర్షదీపితమ్ము లగునీయాలాపంబులు తప్తశూలప్రాయంబులై శ్రోత్రస్థానంబును దహించెడు, నని యతని నాక్షేపించి తత్క్షణమ యటనుండి లేచి సమస్తసచివసహితంబుగ మేడచిట్టచివఱకుం బోయి యందు సమాసీనుఁడై వానరసైనికులం దిలకించుచు నికటస్థరక్షస్సమూహంబుల నాహవంబునకు నియోగించె. ఆదిక్కున రాముండును. ౨౧౬

గీ. లక్ష్మణుఁడు దెచ్చియిచ్చినలావువిల్లు, చేతఁ గొని మేడపై సమాసీనుఁ డయిన
దశముఖుని మంత్రిపరివృతు దశకిరీట, కలితుఁ గన్గొని కినుకచేఁ గలకఁ బాఱి.

క. భయదార్ధచంద్రబాణ, ప్రయోగమున నొక్కత్రుటిని భంజించె హిర
ణ్మయదశకిరీటముల దీ, ప్తియుగచ్ఛచ్ఛత్రరాజి దేవత లలరన్. ౨౧౭

క. ఎంతపని జరగె నని మదిఁ, జింతిల్లి దశాననుండు సిగ్గున నాత్మీ
యాంతఃపురమునకుం జని, మంతురులఁ బ్రహస్తముఖుల మాయావిదులన్. ౨౧౯

వ. రావించి, మీ రించుకేని జాగొనర్పక దర్పంబు మిగుల నహర్పతితనయప్రహిత తరుచరసైన్యంబుల జన్యంబున గండడంచి రం డని యాజ్ఞాపించె. వారును తేని యానం జేసి, ౨౨౦

ప్రహస్తాదులు యుద్ధమునకుఁ బోవుట

సీ. తప్పెటల్ భేరీమృదంగంబు లానకములు గోముఖమ్ములు మొదలుగాఁ గ
లుగువాద్యములతోడ లొట్టిపిట్టల మహిషముల గాడిదల సింహములఁ బులుల
నెక్కి పాశపరశ్వధేషుతోమరశక్తి, దండాదివివిధాయుధములఁ బూని
డంబముల్ గొట్టు చుగ్రంబుగ, లంక వాకిళ్ల నన్నింటఁ గ్రిక్కిరిసి నిలిచి,
గీ. రగజ! యంతకుమున్నె రామాజ్ఞఁ జేసి, శిఖరముల భూరిభూధరశృంగముల న
నేకభూరుహపాళుల పీఁకఁ బెఱికి, యని కెదురు చూచుచుండె వనాటబలము.

కపులాయుధపాణులై విజృంభించుట

వ. ఇట్లసురబలప్రతీక్షణపరాయణు లైనవానరు లాసమయంబున రాఘవప్రియా
ర్థమ్ము తత్పురప్రాకారం బారోహించి, దళముగఁ బ్రతిద్వారంబునను బిక్కటిలు
రక్కసిమూఁకల జూచి, మన పిడికిళ్లకును గిరిశిఖరంబులకును దరునికరంబులకును
బనిగలిగింప నిదియ తగినయదన ని యెంచి యందు సహస్రసంఖ్యాకులను గోటి
సంఖ్యాకులను శతకోటిసంఖ్యాకులను నడపుదళవాయులు పట్టణం బంతయు
ముట్టడించి, యుగురుచు గంతులిడుచుఁ గో యని యార్చుచు ధైర్యవిజితహిమగ్రావు
లగురామలక్ష్మణసుగ్రీవులు సర్వాతిశాయు లై విరాజిల్లుచుండి, రని యుద్ఘోషిం
చుచు దోషాచరుల నెదిర్చి పోరు గావించిరి. ౨౨౨

సీ. శరభుండు ద్వివిదుండు జాంబవంతుఁడు నీల,నలదధివక్త్రు లనల్పబలులు
తారుండుఁ గుముదుండుఁ దారేయుఁ డనిలనం,దనుఁడుఁ దదన్యు లౌ దండనాథు
లాహవదక్షు లుత్సాహంబు రెట్టింప, లంఘించి ద్వారముల్ లంక యెల్ల
ముసరి యసంబున ముట్టడి వైచి యుగ్రాకృతు లడర రయంబు మీఱఁ
ఆ. బర్వతాగ్రములను బడవైచి ప్రామఁకులఁ, గొట్టి పండ్లఁ గఱచి గోళ్లఁ బీఁకి
మడియఁ జేసి రసురమండలి నొకతెప్ప,పాటులోన వికచపద్మనయన!. ౨౨౩

కపిరాక్షసబలంబులు పోరుట

సీ. తమవారి నిబ్భంగి సమయించుటలు గాంచి, సైఁపక కోపించి చండసత్త్వు
లమితభయంకరు లచలోన్నతాంగులు, రాక్షసు లెల్లద్వారములనుండి
చెచ్చెరఁ బఱతెంచి చేవాటుగుదియల, సునిశితఖడ్గత్రిశూలములను
గొడ్డండ్లఁ బ్రహరించి క్రోఁతిమూఁకను గొంత, యంతకు దర్శింప నంపి, రట్లె
గీ. జయరమాభాసమాను లై శైలచరులు, దేవవైరులఁ గడతేర్చి, రీవిధమునఁ
గదనభువి మాంసశోణితకర్దమ మయి, వెఱపు గొల్పుచునుండెఁ బ్రవిమలహృదయ!

క. వివిధాద్భుతవిషంబుల, నువిద! సమానముగ యుద్ధ ముద్భవిలెఁ దా
నవవానరసైనికులకు, వివరించెదఁ దద్విధంబు విను చిత్రముగన్. ౨౨౫

క. దనుజులు హేమమయస్యం,దనహయగజరాజి నెక్కి దశదిశలఁ బ్రతి
ధ్వను లొదవ సింహనాదము, లొనర్చుచుం బోరి రప్పు డుద్ధతి మీఱన్. ౨౨౬

ఆ. ఒకని నొకఁడు గెలుచునూహల నాహవ,దోహలత్వ మొప్ప దుర్భరముగఁ
బటుతరాయుధములఁ బ్రహరించికొనసరి పరస్పరమును దతభయాస్పదముగ.

వ. ఆసమయంబున. ౨౨౭

సీ. శ్రీమహావిష్ణు వౌరాముని దివ్యకృపారసదృష్టికిఁ బాత్రు లగుచుఁ
గ్రతుభుగంశోద్భవుల్ కపులు పీయూషంబు, ద్రాగినవారు నా ద్రఢిమ గలిగి
ముదితాత్ములైరి, భూపుత్రిక నపహరిం,చినపాపి యగుదశాననుని పాల
నమున నుండుటను దానవులు తేజము చెడి, హతసత్వులై యుండి, రక్కతమునఁ

గీ. గపిజయము దనుజహరణమ్ము గలిగె, నిట్లు
ముక్కడిసురారిసైన్యమ్ము మూఁడుపాళ్లు
జముని వీటికిఁ బయనమై చనియె వృక్ష
చరపరాక్రమదేవత సాగనంప. ౨౨౯

ఉ. క్రోఁతులచే స్వసైన్య మిటు గూలుటఁ జూచి సహింపలేక దు
శ్చేతసుఁ డబ్జగర్భవరసిద్ధుఁ డశేషమహాస్త్రవేది వి
ఖ్యాతబలుండు శక్రజి రయంబున నంబరమం దదృశ్యుఁడై
యాతత మైనపంకజభవాస్త్రమునం గలదివ్యశక్తిచే. ౨౩౦

క. వానరులం బీడింపఁగ, నానావిధశస్త్రముల ఘనకలంబకసం
తానంబుల వర్షించె భ,వానీ! దశదిశలఁ జోద్యపడ లోకంబుల్. ౨౩౧

సీ. అస్త్రవేత్తలలోన నగ్రగణ్యుఁడు రాముఁ, డహితత్రయుక్తమహాస్త్రమును మ
రల్పువాఁ డయ్యును, బ్రహ్మాస్త్ర మనెడుగౌ,రవబుద్ధి నిమున మూరకొని యుండి
తన్మాలమున రణస్థలిఁ జచ్చిపడియున్న, వనచరులను గాంచి వహ్నివోలె
జ్వలితుఁడై లక్ష్మణా! చాపమ్ముఁ దె మ్మిటు, బ్రహ్మాస్త్రమున నీయపాత్రు నింద్ర

గీ. జిత్తు నిప్పుడు భస్మంబు సేతుఁ జూతు,గాని నా శక్తి యొకయింతలోన యనుషు
మాయికుఁడు మేఘనాదుఁ డమ్మాట నాల,కించి యిఁక నిందు నిల్వరాదంచు నెంచి.

వ. తత్క్షణంబ మెలకువ గలిగి మాయాప్రభావంబున లంకం బ్రవేశించె. రఘూత్త
ముండు నెత్తుటం జొత్తిల్లినమేనులతోఁ గూలినగోలాంగూలుల యవస్థకు
నెంతయుఁ జింతించి హనుమంతుం గాంచి యిట్లనియె. ౨౩౩

హతులగు కపులను హనుమంతుఁడు బ్రతికించుట

సీ. పావని! వేవేగ పాలమున్నీటికి, నరుగు, మచ్చోట దివ్యౌషధులకు
నుద్భవస్థానమై యొకసుప్రసిద్ధ పర్వతము ద్రోణాభిఖ్య వఱలుచుండు
దానిఁ గైకొనివచ్చి తరుచరసేనను, బ్రతికింపు మయ్య! శాశ్వతయశంబు
గలుగు నీ కిద్దానఁ గావింపు నాయాన, ననవుడు మీమాట కడ్డుగలదె
గీ. యని రయంబునఁ బోయి ద్రోణాద్రిఁ దెచ్చి, వానరుల కందఱకును జీవములు వోసి
మరల స్వస్థానమున గిరివరముఁ జేర్చి,వచ్చె మారుతి జానకీవరుఁడు మెచ్చ.

వ. అంతఁ బ్రాప్తచైతన్యంబులై జన్యంబునకుఁ దారసిల్లువృక్షచరసైన్యంబులనుండి
ప్రళయాంభోధరసముద్భూతనిర్భరార్భటిం బోలె నొక్కనినదంబు పుట్టిన విని వింశతి
భుజుండు విస్మితుండై దితిజుల కిట్లనియె. ౨౩౫

రావణుఁడు రాక్షసుల నెల్లరను యుద్ధమున కాజ్ఞాపించుట

క. సురలు ననుఁ గెలువఁజాలక, యరిగా నిర్మించి పంప నరుదెంచెను నీ
నరనాథసుతుఁడు రాముఁడు, పరాక్రమము మిగుల విజయభావముతోడన్.

క. కావున రణరంగమునం, బావిమతు వధింప మీర లందఱు వడిగాఁ
బోవలయు, వైరివిజయము, గావలయును నాకు ముదముఁ గలిగింపవలెన్. ౨౩౭

సీ. వారు వీ రనెడివివక్ష గూడదు దళవాయులు మంత్రులు బాంధవులును
నాక్షేమ మెపుడు మనంబులఁ గోరువా, రందఱు నా యాజ్ఞ నొందల నిడి
విద్వేషితోఁ బోర వెల్వడు టుచితంబు, ప్రాణముల్ వోవు నన్ భయమువలన
నని కేఁగ సమ్మతింపని భీరువుల మదాజ్ఞోల్లంఘనుల నేన యుక్కడంతు
గీ. నుగ్రశాసన మిది సముదగ్రజాగ్ర, దాయుధమ్ముల ధరియించి యాత్మశక్తి
నిగ్రహించి శత్రువుల సముగ్రముగను, మెప్పుఁ బడయుఁడు పొందనె మించుఁబోడి!.

వ. అనిన, నబ్భయంకరశాసనంబునకు సంత్రాసమ్ముఁ జెంది భండనోద్దండు లగు
నతికాయప్రహస్తమహానాదమహోదరదేవశత్రుదేవాంతకనరాంతకనికుంభకుంభ
లును మఱియుఁ దదితరు లగుదుష్టులకొలందిశూరులును వీరాలాపంబుల వైరిబల
ముం జొచ్చి భుశుండిఖడ్గభిందిపాలబాణపరశ్వధాదివివిధాయుధంబులను శస్త్రా
స్త్రంబులను వానరసేనానుల నోనేసి విగతాసులం జేసిన, రోసంబు మిగులఁ గీశ
సైన్యంబు లసురులపయిం గవిసి. ౨౩౯

వానరులు దానవుల నఱుమాడుట

మ. తతకాఠిన్యమహీధ్రశృంగములచే ధాత్రీరుహశ్రేణిచే
శితభల్లప్రతిమానదంష్ట్రికలచే జీమూతవాహాయుధా

ద్భుతతీక్ష్ణప్రణఖాళిచేత నసదృశముష్టిప్రహారాళిచే
శతధా బాధలువెట్టి చక్కడఁచె రక్షశ్చక్రముఁ సర్వమున్. ౨౪౦

ఉ. కొందఱు రామబాణములఁ, గొందఱు భానుజు తోఁకదెబ్బలన్
గొందఱు లక్ష్మణాస్త్రములఁ, గొందఱు వాలిజు దీర్ఘముష్టులన్
గొందఱు వాయునందనుని ఘోరశిలామయవృష్టిధారలన్
గొందఱు యూథపార్భటులఁ గూలిరి దానవు లమ్మహాజిలోన్. ౨౪౧

గీ. సాధ్వి! శ్రీరామదివ్యతేజఃప్రవేశ,మునను బలశాలు లై కయ్యమున జయింపఁ
జాలి రసురుల, లేకున్న శక్య మగునె, చెట్టుదిమ్మరులకు నెందు నిట్టిచేఁత. ౨౪౨

సీ. సకలజగన్నియామకుఁ డఖిలప్రపంచస్వరూపుఁడుఁ జరాచరము లైన
భూతజాలంబులఁ బుట్టించువాఁ డలో,కస్థితియందును సుస్థిరముగ
నలరారునట్టిచిదానందమయుఁ డయ్యు, రామభద్రుఁడు నగరాజపుత్రి!
యవని మాయామనుష్యాకృతిఁ గొన్నాళ్లు, చరియింపఁ దలఁచి యీసరణిఁ గయ్య
గీ. మాదిగాఁగల క్రీడలయందుఁ దగిలి, నెఱపుచున్నాఁడు, కాకున్న నిమిషమాత్ర
సర్వవిలయసమర్థనచణున కేమి, బ్రాఁతి ముక్కడిరక్కసిపదువు బళిరె?. ౨౪౩

రావణుఁడు యుద్ధమునకుఁ బోవుట

చ. కదనమునం దెదర్చి యతికాయుఁడు దొట్టి సమస్త సైన్యముల్
సదమద మైనవార్త విని చారులమూలమునన్, దశాస్యుఁ డా
పదకుఁ గలంగి దుఃఖపరిభావితమానసుఁ డై మహాక్రుధా
స్పదుఁ డయి యింద్రజి న్నిలిపి పట్టణరక్షకుఁ దత్క్షణంబునన్. ౨౪౪

సీ. తానె స్వయమ్ముగ జానకీజానితోఁ, బవర మ్మొనర్పఁగ బయలుదేఱె
నంగన! యి ట్లమ్మహాతేజుఁ డఖిలశస్త్రాస్త్రసంపూర్ణశతాంగ మెక్కి
పఱపుము రామునిపైకిఁ దేరని సూతుఁ బురికొల్పి వేగ పోవుచు నెడనెడఁ
గోడెత్రాఁచులఁ బోలువాఁడిశరమ్ములఁ గపులను బెక్కండ్ర గండడంచి
గీ. తపననందనముఖ్యయూథపుల నవని, బడలువడ నేసి, యట గదాపాణి యగుచుఁ
దన్నుఁ దలఁపడ నుఱుకుసోదరు నమోఘు,బలసమగ్రు విభీషణుఁ బాఱఁ జూచె.

రావణుఁడు విభీషణునిపై శక్తిని బ్రయోగించుట

వ. చూచి యేఁచినరోషంబున నద్దోషాచరభర్త భీషణుం డై. ౨౪౬

ఉ. ఇచ్చకు వచ్చినట్లు భుజియించి సుఖంబులఁ జెంది యంతఁ బో
కిచ్చటఁ జేరి నన్ను వధియింపఁగఁ బూనితె? ఛీ కృతఘ్నుఁడా!

చచ్చితి వెందుఁ బోయె దిది చంపక మాన, దటంచుఁ దా మయుం
డిచ్చిన ఘోరశక్తి రయమేర్పడ వైచె నుదగ్రభంగిగన్. ౨౮౭

సీ. అదియును బ్రళయకాలాగ్నికీలాభీల,మై ద్వాదశార్కమహస్సమాన
మై విభీషణుఁ బొడ వడఁగింప జెవ్వనఁ, గవియుటఁ జూచి లక్ష్మణుఁడు "వీని
కభయం బొసంగి మదగ్రజాతుఁడు నీవె,దిక్కని వచ్చి ప్రార్థించినపుడు
శక్తి యా; మరలింపశక్యమ్ముగానిది, యూఁపిరి దీయు నే నూరకున్న
గీ. వధమున కనర్హుఁ" డనుచు భావమునఁ దలఁచి
చండకోదండపాణి యై శౌర్య మొప్ప
వెనుకకుం ద్రోఁచికొని దానవునిఁ జలింప
కద్రివలె నిల్చె రిపుశక్తి కభిముఖుఁ డయి. ౨౮౮

రావణశక్తిపాతమున లక్ష్మణుఁడు కూలుట

వ. అంత నమోఘం బగు నిజసామర్థ్యవిశేషంబున నాశక్తి సుమిత్రాత్మజునివక్షమ్ముం
బగిల్చి లోనం జొచ్చె. ౨౮౯

సీ. శైలజ! యెన్నెన్నిశక్తులు మాయచేఁ, బుట్టుచునున్నవో భువనమందు
వాని కన్నింటి కెంతేనియు నాధార,మైనట్టివాఁడు శేషాంశభవుఁడు
హరిశరీరంబు మహానుభావుఁడు నగు, లక్ష్మణునకు నేమి లక్ష్య మొక్క
యసురప్రయుక్తమాయాశక్తి? యైన మా,నవభావము గ్రహించినాఁడు గాన
గీ. తదనుకూలవర్తనము సద్ధర్మమగుట,
శక్తిపాతంబునం దొంటిశక్తి వాసి
వదనపంకరుహమున వైవర్ణ్య మొదవఁ,
జేతి సింగాణి జాఱంగఁ గ్రోఁతు లడల
సోలి మూర్ఛావశుం డయి నేలఁ బడియె. ౨౯౦

రావణుఁడు లక్ష్మణు నెత్తికొని పోవ నూంకించుట

వ. ఆసమయమ్మున నమ్మహామహు నెత్తికొనిపోవ నూంకించి. ౨౯౧

సీ. అమ్ములు విండ్లు రథమ్ముపైనుంచి సిం,గమ్మున కురుకు గజమ్ము మాడ్కిఁ
బులిపై నడరులేడి పోల్కిఁ గ్రిందికి దూఁకి, గబగబ సౌమిత్రి కడకుఁ బోయి
యేన్గుతొండమునకు నెనయగు నిర్వాది,బుజముల నేర్పెలఁ బొదివి పట్టి
హుమ్మని యిట్టటు లూఁగి మోఁకాళ్లూఁది,ధరణిపైఁ, దుద కొకింతయుఁ గదల్ప

గీ. లేక కడువిస్మితుం డయ్యె లేఖవైరి, యరయ నదియంతెచూ దేవి! యఖిలలోక
సారభూతు విరాడ్రూపు సర్వజగదధీశు సర్వాశ్రయుని నెత్త నేరి కగును?.

పావని రావణుని బడఁ బొడుచుట

క. ఘనశక్తిపాతమున మూర్ఛను గొని పుడమిఁ బడియున్న సౌమిత్రిని గై
కొని దాఁటఁ జూచు రావణుఁ గని యనిలభవుండు క్రోధకలుషితమతియై ౨౫౩

క. ఏమని వచ్చితివిర? మా రామానుజుఁ గొంచుఁ బోవ రావణ! యని యు
ద్దామకులిశనిభముష్టిని, భామిని! ఱొమ్మగలఁ బొడిచె బాధతరముగన్. ౨౫౪

క. ఆకఠినముష్టినిహతిని, రాకాసులఱేఁడు దాశరథిని విడి యిలన్
మోఁకాళ్లూఁతగఁ బడియెం, బాకారిప్రముఖదివిజపంక్తు లలరఁగన్. ౨౫౫

గీ. నోళ్ల ముక్కులఁ జెవులఁ గన్నులను రుధిరధార లొలుకంగ బాధకుఁ దాళలేక
గౌరి! గిఱ్ఱునఁ దిరిగెడుకనులతోడఁ, దిన్నఁగాఁ గూలఁబడె నట్లొ తేరిపైని.

సీ. అంతట హనుమంతుఁ డసురరాజార్దితు, సూర్మిళావిభు బాహుయుగళమునను
దేలికగాఁ గొనితెచ్చి శ్రీరాముని, సన్నిధిలో నుంచె సాధ్వి! జన్మ
విరహితుఁ డైనట్టిపరమేశ్వరుఁడు గురువులకు గురుం డయ్యుఁ బూర్ణభక్తి
మిత్రభావము గల్గి మెలఁగెడుపావని యెడ లఘు వయ్యె నిం దేమి వింత?

గీ. ఆపయి సుమిత్రతనయు విష్ణ్వంశభవునిఁ
గా నెఱిఁగి తత్క్షణమ పాసి దానవేంద్రు
స్యందనముఁ జేరె నమ్మహాశక్తి, యొడలు
దెలిసి యసురయుఁ గ్రమముగాఁ దేఱె నపుడు. ౨౫౭

వ. తేఱి, కోపంబునఁ జాపం బందికొని సీతాపతిపైఁ దారసిల్లె రఘువల్లభుం డది
చూచి యేఁచినకినుక, రథస్థుం డగునిశాటపతికి దీటుగఁ దానును మరుత్సూను
నారోహించి యెదురునడచి వజ్రనిష్పేషభీషణంబుగ గుణధ్వానిం జేసి ప్రావృడం
భోధరగంభీరస్వరంబున ని ట్లనియె. ౨౫౮

రాముఁడు రావణుని నాక్షేపించుట

క. ఓ రావణ! నిలు మెచటికిఁ జాఱకు, మిప్పటికిఁ జూడఁ జాలితి నిను మ
ద్దారాపహారణచణు నో, రోరీ నా కిట్టిసుదిన మలవడ దెపుడున్. ౨౫౯

ఉ. తమ్ముఁడు నేను నాశ్రమపదమ్మున నుండమిఁ జూచి దొంగవే
నమ్మున సీత ముచ్చిలుట శౌర్యమ కాఁ దలపోసితే; సమ
స్త్వమ్మున సర్వముం గనెడివానికి నాకు వృథామహాపరా
ధ మ్మొనరించి పోఁగలవె తప్పుల మందక? రాత్రిసాధమా! ౨౬౦

సీ. ఖరదూషణాదిరాక్షసులు త్వదీయు లే,శరమున మును జనస్థానమందు
నడఁగారినారొ; నేఁ డాశరంబుననె చ,క్కాడి నిన్నును వారి నరయఁ బంపు
వాఁడను, బాఱిపోవక నిల్వు నాముందు, నావుడుఁ గోపించి రావణుండు
మూఁపున రాముసి~ మోయువాయుజునిఁ దీ,వ్రకలంబకముల నొవ్వంగ నేసెఁ
గీ. దన్నిశితకాండహతిఁ జేవ సన్నగిల్ల,కుండుటయె కాక, యభివృద్ధి నొందెఁ దేజ
మాత్మతేజోఽభిరామున కక్కపీశ్వ,రునకు శ్రీరామవహననిరూఢమహిమ. ౨౬౧

వ. అట్లేటువడి వనచరసింహంబు సింహధ్వనిఁ గావించె, నంత దాశరథి దశముఖ
నిశితవిశిఖపాతవ్రణితశరీరు సమీరకుమారు నారసి రెండవ ప్రళయకాలరుద్రుం
డన మండిపడి. ౨౬౨

రాముఁడు రావణుని విరథుం జేసి పరాభవించుట

చ. అరదము తుంపులై పడఁగ, నశ్వము లీల్గఁగ, సూత్త చావఁగా
బిరుదుసిడంబు గూలఁగను, వి ల్విఱుఁగన్, ధ్వజ మూడ, నాయుధో
త్కరము సెడంగ ఛత్రము యథాయథలై పడ నేకకాలమం
దురవడి వాఁడిబాణముల నుగ్రతమైఁ బఱగించె వైరిపై. ౨౬౩

క. జంభారి పర్వతము బలె, దంభోళినిభాంబకమున దశముఖు రణసం
రంభంబు మాన్చి ధరణిఁ, జంభాంతకుఁ డొంచె దనుజసైన్యము బెగడన్. ౨౬౪

క. విలు చేతినుండి జాఱెఁ, జలియించెను గుండె మూర్ఛ సన్నిహితంబై
యలమికొనె రామనిష్ఠుర, కలంబనిహతునకు దనుజకాంతున కగజా!. ౨౬౫

వ. అట్లు శరవిద్ధుం డై యున్నతొలివేల్పుతేనిం జూచి. ౨౬౬

గీ. అతని యాఁదల నర్కదీధితిని బొల్చు, జీవరత్నకిరీటంబు చిదురుప లయి
యవనితలమునఁ బడఁ గొట్టె నర్ధచంద్ర,బాణమున భానుకులవీరుఁ డేణనయన!

సీ. తల బోడిగావించి పలికె, దశాస్య! యి,ప్పటినీదు దురవస్థఁ బాఱఁజూడ
జాలి పుట్టెడు నాకె; శరబాధ కగ్గమై,యున్నావు, నేఁ డాజ్ఞ యొసఁగువాఁడ
శీఘ్రమ్ముగాఁ గొంపఁ జేరి శ్రమము దీర్చి,కొమ్ము, నాశక్తి కయ్యమ్మునందు
జూడ నెంచిన తేపు సూతువు గాని పొ, మ్మింతలో మించిపోయెడి దదేమి?
గీ. యని పరిహసింపఁ దచ్ఛరహతిని గ్రుంగి, దర్ప మెడలంగఁ బెనులజ్జ తాండవింప
మెల్లగాఁ దేరిపైఁబడి యిల్లుసేరెఁ, బంక్తికంఠుండు దరదళత్పద్మనయన!. ౨౬౭

వ. పిమ్మట మూర్ఛాక్రాంతుం డై పుడమిపయిం బడియున్న యనుంగుఁదమ్మునిం
గనుంగొని రఘుపుంగవుండు మాయామానుషవిగ్రహుఁడు గావునఁ, దదనుగుణ
మ్ముగ నించుకసేపు వాపోయి సమీపస్థుం డగుసామీరితో నిట్లనియె. ౨౬౮

రాముఁడు హనుమంతుని నోషధులకొఱకుఁ బంపుట

సీ. నాయనా! హనుమంత! నా కుడిబుజ మిందుఁ, బడిపోయినది యింకఁ బ్రతుకుటెట్లు
మును బోలెఁ గడురయంబున ద్రోణశిఖరికిఁ,జని యందుఁ గలమహౌషధులఁదెచ్చి
తోఁబుట్టువునకుఁ గోఁతులకు జీవమువోయు, మరయ నీశక్తియ యాదినుండి
మా కేడుగడ యయ్యె మఱవ నీమే లన, నీభాగ్యమునకుఁగా నింత యేటి?
గీ. కని మహాబలనందనుం డనిలజవము, నను సరిత్పతి దాఁటి క్షణమ్ములోన
చనియెఁ దద్గిరి కింతలోఁ జారు లసుర,పతికి నీగతి విన్నవింపందొడఁగిరి. ౨౭౦

గీ. స్వామి! మీశక్తిచే రణస్థలి నొరగిన, యనుజుఁ బ్రతికింపఁజేయ మహౌషధులకుఁ
బంపినాఁ డాంజనేయునిఁ బాలకడలి,దాపునకు రామభద్రుఁ డింతయు నిజమ్ము.

క. అతఁ డవిదెచ్చిన సర్వము, వితథ యగు మీయత్న, మనుడు విని చారోక్తుల్
ధృతి చెడి చింతాపరుఁడై, మతిఁ దోఁచక కొంతతడవు భ్రాన్తుఁడియుండెన్.

రావణుఁడు కాలనేమిం గానఁబోవుట

వ. ఉండి తగ్గయుపాయం బొండునిశ్చయించి నక్తంచరవల్లభుండు. ౨౭౩

ఆ. నిలువ కచటఁ గాలనేమిగృహమ్మున, కొకడ చనియె రేయి నుత్పలాక్షి!
ఆత్మమందిరాగతాసురనాయకుఁ జూచి యతఁడు మిగులఁ జోద్య మంది. ౨౭౪

గీ. చేరి యర్ఘ్యాదికములఁ బూజించి తత్స,మక్షమున నిల్చి భయకంపితాంగుఁ డగుచు
ననియెఁ జేమోడ్చుఁ గేలించి యసురనాథ!, చెప్పు మెందుల కిందు వేంచేసినావు.

క. నే నొనరించెడుపని యే,మైనఁ గలదె యర్ధరాత్ర మరుదెంచితి వే
దే నొకప్రమాదవిషయము, రానిది రా వెన్నఁ డీవు, రాక్షసరాజా! ౨౭౬

వ. అనుడు దైత్యపతి దుఃఖితుం డై యిట్లనియె. ౨౭౭

క. నాకును గాలవశంబున, నీకష్టము సంభవించె నీనాటికిఁగా,
నో కాలనేమి! దుర్విధి,పాక మలంఘ్యమ్ము గాదె భువనకు నేనిన్. ౨౭౮

చ. అని మొన లక్ష్మణుండు వివిధాస్త్రవిశారదుఁ డస్మదీయ శ
క్తినిహతవక్షుఁ డై పుడమిఁ దేజుచెడం బడియున్న వాఁడు వా
నిని బ్రతికింప నోషధుల నేర్పునఁ దెమ్మని రాముఁ డంపఁ జ
య్యనఁ జనినాఁడు ద్రోణగిరి కా హనుమంతుఁ డసాధ్యుఁ డన్నిటన్. ౨౭౯

ఉ. అసురమాయఁజేసి మునియాకృతిఁ గైకొని యమ్మహాకపిన్
మోసముసేయఁ బొ మ్మసురముఖ్య! యినుం డుదయించుదాఁక నె

ట్లో సరిపెట్టుకాలము నెదో సదుపాయముఁ జూడు మిందు నీ
తో సరివచ్చువాఁ డొకఁడుఁ దోఁపఁడు నా పను పాచరింపుమా. ౨౮౦

క. విను దినకరోదయమునకు,మునుపు మహౌషధులతో సముద్ధతి రఘునం
దనుదూత యిటకు రాకుం,డ నొనర్పుము రమ్ము గృహమునకు నొం డేలా.

కాలనేమి రావణునకు సదుపదేశమును జేయుట

వ. నావుడుఁ గ్రవ్యాదస్వామికిఁ గాలనేమి యిట్లను. ౨౮౨

సీ. దానవవల్లభ! నా నుడి యిప్పేళఁ,జెవియొగ్గి వినుము, నీచిత్తమందు
నీ తత్త్వమును నిల్పు, మేను జీవముల పో,కడ కేని నోర్చి త్వత్కామితంబు
దీర్చుట నిజము సందేహ మింకేటికి, మున్ను మృగాకృతిం గొన్నయట్టి
మారీచున కరణ్యమధ్యయం దెట్టి దు,ర్గతి వట్టె నాకు నాగతియ చుమ్ము

గీ. సుతులు మనుమలు మిత్రులుం జుట్టములును
నాహవంబున నిహతులై రకట దనుజ
కులమునకు నిట్లు నాశమ్ముఁ గూర్చి నీ వొ
కండ వుండినఁ గల్గు సౌఖ్యం బదేమి?. ౨౮౩

క. అందఱుఁ జచ్చిన పిమ్మట, నెందుకు రాజ్యమ్ము? సీత యెందుకు? దేహ
మ్మెందుకు జడస్వరూపము, ముం దగు ము ప్పరయవల దె మూర్ఖత దగునే?౨౮౪

గీ. ఎంతకాల మిట్లుండిన నేమిఫలము, సీత నర్పించి రామభూనేత, కఖిల
రాజ్యమునకు విభీషణు రాజుఁ జేసి, మునిజనాశ్రయ మగువనమ్మునకుఁ బొమ్ము.

సీ. రమణీయ మగునయ్యరణ్యమ్మునం దుండి, సరవి మేల్కాంచి యుషస్సునందు
నిర్మలాంబువుల మునింగి సంధ్యావంద,నాదిసత్కర్మమ్ము లాచరించి
మీఁద నేకాంతభూమి సుఖాసనపరి,గ్రహుండ వై యన్నిట నొదవునట్టి
యాసక్తి వర్జించి యాత్మేతరాఖిలవిషయముల్ దవ్వుగ వీడఁగొట్టి

గీ. బాహ్యవిషయప్రవృత్తాక్షపంక్తి నాత్మ
విషయఁగాఁ జేయుమీ! యెల్లవేళలందుఁ
బ్రకృతికంటె భిన్నుండు దురాపుఁ డైన
యాత్మను నెఱుంగ యత్నింపు మసురరాజ!. ౨౮౬

వ. మనచేఁ జూడఁబడుచు వినఁబడుచున్న దేహబుద్ధీంద్రియాదికబ్రహ్మాదిస్తంబ
పర్యంతచరాచరాత్మకసమస్తప్రపంచంబునం దెయ్యది చూడంబడు నెది వినం
బడు నదియెల్లఁ బ్రకృతి యనంబడు. మఱియు దానికె మాయ యని మఱొండు
పేరు గలదు. ౨౮౭

సీ. ఆమాయయే జగం బనుచెట్టుఁ బుట్టించి, పెంచి నాశనముఁ గావించుచుండు
తెల్లనిప్రజలును నల్లనిప్రజలును, నెఱ్ఱనిప్రజలుఁ దదితరవర్ణ
ములుదయించుటకు హేతువదియె, యెల్లపుడుఁ గ్రామాదిపుత్త్రిలను హింసాదిపుత్త్రి
కలను సృజించు నక్కైకలాటకత్తె నిత్యానందరూపుఁ డౌనాత్మను దన
గీ. వైనగుణముల నేను నాయది యనియెడు, బుద్ధి గలవానిఁగాఁ జేసి మోహపెట్టు
చున్న దేమందుఁ దచ్ఛక్తి నుగ్గడింప, హరిహరాదుల కేని శక్యమ్ము గాదు. ౨౮౮

వ. మఱియు నమ్మహామాయ యాత్మీయగుణంబు లైనకర్తృత్వభోక్తృత్వాదికముల నీశ్వరుం డగునాత్మయం దారోపించి తన్మూలంబున స్వాధీనుం జేసికొని యహర్నిశ లతనితోఁ గ్రీడించుచుండె. ఆత్మ స్వతశ్శుద్ధుఁ డగుట దర్శనాదివికారదూరుం డయ్యును మాయాసాంగత్యమ్మునం జేసి తదీయగుణవిమోహితుఁ డై స్వస్వరూపంబు మఱచి బాహ్యవిషయంబులం గనుచున్న ట్లగపడుచున్నాఁడు. ౨౮౯

సీ. దీపితజ్ఞానస్వరూపుఁ డౌగురువర్యు, సవిధంబునకుఁ బోయి శ్రద్ధ నమ్మ
హానుభావుని బోధ మంది వెల్పలిచూపు,విడిచి లోచూపున విశదభంగి
స్వస్వరూపముఁ గాంచఁజాలినవాఁడు జీవన్ముక్తుఁ డై యుండుఁ, బ్రాకృతగుణ
వర్గంబుచే విడువంబడు, సర్వబంధమ్ములుఁ దెగిపోవుఁ దాదృశులకు
గీ. నీవు నట్టులె యింద్రియనిగ్రహంబు, గలిగి తత్త్వవిచారంబు సలిపి ప్రకృతి
కంటె నాత్మను భిన్నముగా నెఱింగి, ముక్తుఁడవు గమ్ము వదలుము మోహబుద్ధి.

గీ. పయిని జెప్పినరీతిగాఁ బంక్తికంఠ!, నిర్గుణధ్యాన మొనరింప నేర వేని
జలజదళనేత్రు శుభగాత్రు సగుణమూర్తి, నాశ్రయింపుము సద్భక్తి నవిరతమ్ము.

వ. హృత్కమలకర్ణికయందు మణిగణాలంకృతంబై మృదుశ్లక్ష్ణతరం బై యలరారు స్వర్ణపీఠంబున సుఖాసీనుఁగాఁ జేసి. ౨౯౨

కాలనేమి రావణునకు రాముని నుపాసింపు మని చెప్పుట

సీ. వీరాసనుఁ గిరీటహారకేయూరకౌ,స్తుభముఖ్యభూషణశోభితాంగు
జానకీసంయుక్తు శంపాలతావితా,నవిభాంబరు విశాలనయనుఁ గటక
నూపురోపేతు ధనుర్యుగహస్తల,క్ష్మణపరిసేవితుఁ జారుహాసు
వనమాలికాభాసితునిఁ జరాచరహృద,యాకాశవర్తిని నంబుదాభు
గీ. మంజులాలాపు రాము నాత్మస్వరూపు
ధ్యాన మొనరించి యుత్తమ మైనభక్తి
మానవుఁడు ముక్తుఁ డగు ననుమానరచన
యిందులేదు రెండవమార్గ మిది దశాస్య! ౨౯౩

చ. ఇతరమునందు నీహృదయ మించుకయేనియుఁ జేర్పఁబోక, సం
తతమును భక్తకోటివలనన్ రఘురాముని సచ్చరిత్రలం
గౌతుకము మీఱఁగా వినుము, కొండలఁబోలెడిపాపరాసు లే
హాతమగుఁ జూ నిమేషమున నగ్గిని వైచినతూలరాశినాన్. ౨౯౪

ఉ. ఆలిని దెచ్చి మాఢ్యమున, నాపయి నాఘనుతో నెదిర్చి నీ
వాలము సేయఁగాఁ దొడరుటా? యిది పథ్య మటంచుఁ బల్కఁగాఁ
జాలెడు వార లుందురె? నిశాచరనాయక! యింక నేటి కీ
జాలము వైరమున్ విడిచి శాంతుఁడ వై నిజభక్తియుక్తిమై. ౨౯౫

చ. పరు ననవద్యునిన్ హృదయభావితభాస్వరభావరూపు నీ
శ్వరునిఁ బురాణపూరుషుని సర్వశరణ్యుని నామరూపముల్
దొరకని వాని నొక్కరుని దుర్లభునిం బరిపూర్ణు వేదవా
క్పరిచితు రామభద్రు భవబంధము లూడ భజింపు రావణా!. ౨౯౬

రావణుఁడు కాలనేమిపై నలుగుట

వ. అనవుడు సుధామధురంబు లగుకాలనేమివాక్యమ్ములు విని కోపారుణితలోచనుఁ
డై యగ్నితప్త మగునాజ్యంబు జలంబునం బలెఁ బ్రజ్వలించి నక్తంచరవల్లభుం
డి ట్లనియె. ౨౯౭

సీ. అధిపతి నైననాయాజ్ఞ నుల్లంఘించి, భయభక్తులను బాసి ప్రల్లదములఁ
బలికెడి వాచాటు ఖలచిత్తు నిను బట్టి, ఖండింతు ముక్కముక్కలుగ నోరి
కాలనేమీ! యింతగర్వమా కడు లంచ,గొండి వై శాత్రవకోటివలన
లాభ మేమో పొంది యీభంగి వారి భూషించుచున్నావు విశేషముగను
గీ. రామ కింకరుఁడవు నైఁపరా దనవుడు, నాపయిని మీర లింతగఁ గోపపడఁగ
నేల? నామాటలు రుచింపవేనిఁ దమకుఁ, బోయి యాపనిఁ జేసెద మీ యనుజ్ఞ.

వ. అని పల్కి యమ్మేటిరక్కసుండు రావణమృత్యుప్రేరితుం డై యఖండజవమ్మున.

కాలనేమి హనుమంతుని మోసగించుట

క. చనియె హిమవన్నగము ద్వాపునకుం దత్తరము చిత్తమున రేకెత్తన్
వనజాక్షి! హనుమవోయెడి, పనికిన్ విఘ్నమ్ము సేయుభావముతోడన్. ౩౦౦

సీ. అ ట్లేఁగి హనుమంతుఁ డద్రిఁ దేఁ బోవు త్రోవకు దగ్గఱగఁ దపోవన మొకండు
సృష్టించి నిజమాయచే, నందు మునివేష,ధారియై శిష్యబృందములు గొలువ

దారిఁ జూచుచునుండె దానవుం డంబిక!, యంతఁ బావని బోవు చక్షీపర్వ
మై పురఃస్థలిఁ దోఁచు నాయ్యాశ్రమముఁజూచి, యీవన మీామును లింతకుమును
గీ. నేను బోయివచ్చునపుడు గానరారు, దారి దప్పితినా? భ్రమ దవిలెనా మ
నంబునకు? లేక వైరికృత్యంబ? కాక, యున్న నన్యం బిఁకేమిగా నుండనోపు.

గీ. ఐనఁ గానిమ్ము చూత మియ్యాశ్రమంబు,లోనికిం జని దర్శించి మానివరుల
దాహమాఱ జలమ్ములం ద్రావి పిదప,ద్రోణగిరిరాజమునకుఁ బోదు నని తలఁచి.

సీ. పండినపండ్లును వంగినకొమ్మలుఁ, గలిగినఖర్జూరములు ననంట్లు
పనసలు మొదలగుపాదపంబులఁ జుట్టఁ,బడినదియును, నెటుపాఱఁ జూచి
నను యోజనముదవ్వు గనుపట్టునదియు, సహజవైరముఁ బాసి యహరహంబు
ఘనతరప్రేమచేఁ గలిసిమెలిసియుండు, మృగముల కునికియై మించునదియు,
గీ. దోషవిరహితలక్షణభూషితమును, ద్రష్టృలోకదృగానందదాయకమును
నమలమును నగు నయ్యాశ్రమమును జొచ్చెఁ,బవనతనయుండు వికసితపద్మనయన!

వ. ఇవ్విధంబున వనంబునం బ్రవేశించి, యందు మహేంద్రయోగం బవలంబించి శివ
పూజాతత్పరుం డైయున్న కాలనేమిం గని యమ్మహాసురునకు సగౌరవంబుగఁ
బ్రణమిల్లి. 304

ఆ. ఓమహానుభావ! రామదూతను నేను, హనుమయనుచుఁ బిలుతు రఖిలజనులు
పోవుచుంటిఁ బాలమున్నిటి కేలిక,పనుపుమీాఁద గొప్పపనికిఁగాను. 305

క. దప్పిక నను బాధించెముఁ, జెప్పుము జల మెచటఁ జిక్కు క్షితిసురవర్యా!
యిప్పుడు యథేచ్ఛగా నే, నప్పులు గ్రోలంగవలయు నన నతఁ డనియెన్. 306

క. నీ వెచటికి జలమునకై, పోవం బనిలేదు పవనపుత్రా! యివిగో
త్రావుము కమండలుస్థిత, పావనతోయముల నిత్తుఁ బరమప్రీతిన్. 307

సీ. భక్షింపు మీాపక్వఫలముల నిక్కడ, నిలువుము హాయిగా నిద్రఁ బొమ్ము
పవనజ! నీ వాత్రపడకు మే మాత్రమ్ము జరుగుచున్నదియును జరిగినదియు
నిఁకమీాఁద జరుగఁబోయెడునెల్లవిషయముల్, మహితమామకతపోమహిమవలనఁ
గన్నులకుం గాడకట్టినట్లుండును, విను వినిపించెద విశదముగను,
గీ. దశవదను శక్తిహతి రణస్థలిని బడిన, లక్ష్మణుఁడు మూర్ఛ దేఱి సలక్షణముగ
నున్నవాఁడు, వానరులును గ్రన్నన రఘువీరవీక్షితులై లేచినార లిపుడు. 308

క. నీ విటు సాగినతోడనె, యీావిధి జరిగినది, పోవు టెందుల కింకం
బావని! మధురోదకములు, ద్రావి శ్రమముదీర్చికొని మరలి చను టొప్పున్.

చ. అనవుడు మౌనిచంద్ర! యిదియంతయు సత్యము నైన నేను నా
పని నొనరింప కుండుటలు భావ్యముగా, దెటులైనఁ గొండఁ గై
కొని చనుటే ధ్రువం, బిపుడు కుండికలోనిజలమ్ము ద్రాగుమా
త్రన లవమేని నాకుఁ గలదప్పిక దీఱదు, గాన పేర్మిమై. ౩౧౦

సీ. కమ్మనినీరమ్ముఁ గలసరోవర మున్న,చోటుఁ జూపింపు, మచ్చోటి కేఁగి
తోయంబులను దృష్ణవాయఁ బానము సేసి, చనువాఁడ నన, మంచిదని సురారి
చెచ్చెర కృతిమశిష్యు నొక్కని బిల్చి, యోరి శిష్యా! రయమారఁ బోయి
కొమరారు మన పెద్దకోనేటి నీ పాన,మూనికిఁ జూపించి మరలి రమ్ము
గీ. టంచు నియమించి హనుమతో ననియె, నీవు కన్గవను మూసికొని యుదకంబుఁ గ్రోలి
తిరిగి నాసన్నిధికి నరుదెమ్ము మంచి,మంత్ర ముపదేశ మొనరింతు మారుతసుత!.

వ. దాన నొపధు లెం దున్నను గానంబడు, ననుడు వల్లెయని యాంజనేయుండు
కపటవటుసందర్శితజలాశయంబునకుఁ ద్వరితముగఁ బోయి, నిమీలితలోచనుం
డై సలిలమ్ముం గ్రోలుచుండ, ఘోరరూపిణియు మహామాయాకారిణియు నగు
నొక్కయాఁడు మొసలి తత్కాండాశయమునుండి యుద్దండజవమ్మునం బఱతెంచి
యక్కపికేసరిఁ గ్రసించె, నయ్యవసరంబున. ౩౧౨

### ధాన్యమాలినీశాపమోక్షము

ఆ. తన్ను బట్టి మ్రింగుచున్ననక్రిం జూచి, హనుమ క్రోధ వివశుఁ డై యదల్చి
మరణ మొందఁజేసె నిరుగేల నోరును,జీల్చి పాఱవైచి సిద్ధు లలర. ౩౧౩

వ. మకరీమరణానంతర మంతరిక్షంబున ధాన్యమాలిని యను పేరం బరఁగు దివ్యరూప
ధారిణి యగు నొకపికవాణి గన్పట్టి గాడ్పుపట్టితో ని ట్లనియె. ౩౧౪

### ధాన్యమాలిని హనుమంతునకుఁ గాలనేమి కపటచర్యను దెలుపుట

సీ. వానరోత్తమ! పూర్వ మేనొకయచ్చర, మచ్చెకంటినై నొకమౌనివరుఁడు
కనలి యొకానొకకారణంబునను శాపం బిడె మొసలివి గ మ్మటంచు
దాన నే నిట్టులై కోనేటఁ బడియుంటి, నీయనుగ్రహమున నేఁడు శాప
రూపమ్ము విడి స్వస్వరూపమ్ముఁ బడసితిఁ, ద్వద్దర్శనము సుఖదాయకంబు
గీ. వనమునం దీవు చూచినవాఁడు మౌని
గాఁడు కడుమోసకాఁ డైనకాలనేమి
యనెడిపెనురక్కసుఁడు, మునియట్లు దొంగ
వేసము ధరించి నిను మాయఁ జేసినాఁడు. ౩౧౫

ఉ. నమ్మకు మాదురాత్మువచన మ్మొకఁ డేని, దశాననుండు పో
పొ మ్మని పంపఁ దోఁ పొకటి పొందికగా సృజియించి సీప్రయా
ణమ్మున కంతరాయము నొనర్పఁగ నిచ్చటఁ జేరినాఁడు, స
ర్వ మ్మయథార్థ మిందు నిలువం బతికార్యము చొప్పు దప్పెడున్. 306

సీ. కావున హనుమంత! యీ విప్రహంతను, జిత్రవధముఁ జేసి శీఘ్రగతి న
నుత్తమద్రోణభూభృత్తుఁ గానం బొమ్ము, పాపముల్ వాసి నీస్పర్శముననను
నేను బవిత్ర నైనాను సరోజగర్భునిలోకమున కిదె పోవుచుంటి,
నని చెప్పి దివి కేఁగె నా దేవకాంత, సా,మీరియుఁ గాలనేమియ యితండు?

గీ. బళిర; యెట్టి పన్నుగడను బన్నినాఁడు
మొసలి నను మ్రింగె ననిచాల ముఱియుచుండఁ
బోలు, నిం కేమిచేయునో పోయి చూత
మని తలఁచి వాని చెంగటి కరిగెఁ గలికి!. 307

వ. అపుడు కాలనేమి యి ట్లనియె. 308

గీ. ఇంత యాలస్య మొనరించి తేల? రమ్ము
వానరోత్తమ! నీవు నావలన విధి వి
ధానముగ వీర్యకలితమంత్రములఁ బడసి
చనుము గురుదక్షిణ నొసంగి జయము గలుగు. 309

హనుమంతుఁడు కాలనేమిని జంపుట

సీ. అనవుడు మంచిమా టంటిరి, నాపయి, మీ కున్న కరుణకు మేర గలదె
మీబోఁటియొజ్జలు నాబోఁటి వాని కబ్బుటకు హేతువు పూర్వపుణ్యమె చుఁడి
కొదువ యే మున్నది గురుదక్షిణకు మీకు, నిది మునుముందు గ్రహింపుఁ డనుచు
నట్టహాసముఁ జేసి యంజనాతనయుండు, గట్టిగాఁ బిడికిలిఁ బట్టికొట్టె

గీ. నామహాముష్టి నిహతుఁ డై యాతఁ డకట
"బయటఁ బడె గుట్టు వీఁ డిఁక బ్రతుకనీఁ" డ
టంచు మునిరూపమును విసర్జించి వివిధ
మాయలం బన్ని పోరాడె మంజువాణి!. 310

వ. అప్పుడు మహామాయావిశిష్టుం డైన కోదండరాముని కింకరుండును, మాయావి
జీవనిర్మూలనదక్షుండును, నగుకపిసింహుం డాతుంటరి మాయ లెల్ల మాయించి
ముష్టిప్రహారంబున మూర్ధంబు పగుల నడఁచి గుదెతాల్పువీటికి వీడ్కొల్పి యన

ల్పజవంబునం బయనగపయోధి డాయం బోయె. అట్లుపోయి ద్రోణాచలముం జూచి యందు. ౩౨౧

హనుమంతుఁడు ద్రోణాచలమును దెచ్చుట

గీ. ఓషధులు దన కరయరా కున్న నింత, యేటి కీకొండనే రాము నెదుట నుంతు
నని బల్కాకృతిఁ బెకలించి హనుమ వాయు, వేగమున నెత్తికొనివచ్చె విస్మయముగ.

సీ. వచ్చి రాముని సమీపమున శైలము డించి, యమరపూజిత! యిమ్మహాచలంబు
గైకొని వచ్చితిఁ గాలవిలంబము, కాఁగూడ, దందు యోగ్యముల నేర్చి
చేయం దగినపని చేయించు మనవుడు, హనుమంతువచనంబు నాలకించి
సంతుష్టుఁడై రామచంద్రుండు కావల,సినమహౌషధులను స్వీకరించి
ఆ. యసురనాథుశక్తిహతిఁ దెల్విఁదప్పిన, తపననిభున ననుఁగుఁదమ్మునకు సు
షేణుచేఁ జికిత్సఁ జేయింప నిగురించి, లేచువానిమాడ్కి లేచె నతఁడు. ౩౨౩

క. లేచి యెట కేఁగెదవు దో,షాచరపతి! నిల్వు నిల్వు సంగరమున నీ
పీఁచ మణంచెద ఖరనా,రాచంబులు మేన నాటి రభస మెలర్పన్. ౩౨౪

వ. అని యిట్లు లక్ష్మణుండు రాక్షసనాథుం బలుక విని శ్రీరాముండు చేరం దీసి
శిరంబు మూర్కొని పవనజుం గని ప్రశంసించుచు నిట్లనియె. ౩౨౫

శ్రీరాముఁడు సామీరిని ప్రశంసించుట

సీ. నాయనా! కపిసింహ! నీయనుగ్రహమున, నే యపాయము లేక యేలమి నున్న
యనుఁగుఁదమ్ముని గనులారఁ గనుంగొని, ముదము నొందెడిభాగ్య మొదవె నాకు
మొదటినుండియు నీవ కుదురు నాసంసార,మునకు భవాదృశుల్ ముజ్జగముల
దొరక, రీ వెంతటిస్తుతి కైనఁ దగుదు వీ,యుర్వీధ్రమును మును వున్నచోటఁ
గీ. బెట్టి రమ్మనవుడు గాడ్పుపట్టి యట్లు, చేసెఁ దదనంతరము రఘుశేఖరుండు
రావణానుజు మతమున రవిజకపిబ,లాన్వితుం డయి రణము చేయంగఁ దొడఁగె.

క. వానరు లందఱు తాలును, మ్రానులు గిరిశిఖరములు సమర్షను మిగులం
బూని కదనమున కభిముఖు,లై నడచిరి పగఱఁ బొడిచి, రుద్రకుమారీ!. ౩౨౭

రావణుఁడు రామునిధాటికి నిలువఁజాలక యింటి కేఁగి విచారపడుట

సీ. రాముని తీవ్రనారాచపరంపరఁ, దను వెల్ల జర్జరితంబు గాఁగ
ధృతి సెడి సింహపీడితమత్తకరిభంగి, గరుడాభిభూతనాగంబు కరణిఁ
బంక్తికంఠుఁడు బాధపడి నిల్వలేక క,య్యమునుండి తొలఁగి గృహమ్ము సొచ్చి
సింహాసనమున నాసీనుఁడై దనుజులఁ జీరి యిట్లనియె దేవారులార!

ఆ. వరము లడుగునాఁడు వనజాసనుఁడు "నీకు, మనుజువలన మరణ" మనుచుఁ జెప్పె
జగతి నన్నుఁ జంపఁ జాలినమనుజుఁ డె,వ్వాఁడు లేనిమాట వాస్తవంబ. 3౨౮

క. కావున నిప్పుడు సాక్షా, చ్ఛ్రీవిభుఁడే మనుజుఁ డగుచు క్షితి దశరథధా
త్రీవిభునకు రామాఖ్యను, నావిర్భవ మంది నన్ను నడఁపఁగ వచ్చెన్. 3౨౯

సీ. నిక్క మీవిషయమ్ము రక్కసులార! ము,న్ననరణ్యాన్నృపతి మద్ఘనశరార్చి
కగ్గమై కడునొచ్చి "యస్మదన్వయమున, నారాయణుండు సనాతనుండు
పరమాత్మ యవతరింపం గలఁ, డతనిచే, బంధుపుత్రామాత్యబలయుతముగ
నశియించెదవు చూడు నామాట"యని నన్ను,శపియించి పోయెను స్వర్గమునకు
గీ. ఆతఁ డన్నట్టు లాపరమాత్మయె దిగి,నాఁడు భువికి రామాకృతి నా నిమిత్త,
మితనిచే మృతి దప్ప దిం కేమిసేతు, నెవరిప్రాపున దాఁటుదు నీ విపత్తు. 33౦

రావణుఁడు కుంభకర్ణుని లేపించుట

సీ. తమ్ముఁడు ధారుణీతలము నైనను బట్టి, తల్లక్రిందుగఁ జేయుబల్లిదుండు
కాలకాలుఁడు కుంభకర్ణుఁ డున్నాఁ డను, మాటయ కాని నిశాటులార!
మూఢాత్ముఁడై సదా గాఢనిద్రను మున్గి, యన్యం బెఱుంగఁ డేమైనఁ గాని
మీ రేఁగి యాతని మేల్కొల్పి నాసమ్ముఖమునకుఁ గొనితెండు సత్వరముగ
గీ. ననుచు నానతి నిడఁగ, మహాశరీరు, లసురు లోకకొంద ఱరిగి ప్రయత్న మొప్పఁ
గుంభకర్ణుని లేపి తోడ్కొనుచు వచ్చి, రసురనాథుని సన్నిధి కంబుజాక్షి!. 33౧

వ. అంత నతండు ప్రణామమ్ము చేసి యాసనస్థితుం డై యన్నా! విశేషంబులే మన
వుడు, దానవేంద్రుండు దీనవచనమ్ముల నిట్లనియె. 33౨

రావణుఁడు కుంభకర్ణునితో శ్రీరామపరాక్రమమును దెలుపుట

సీ. కుంభకర్ణా! నేఁడు గొప్పకష్టము వచ్చి, పైఁ బడినది, మహాపత్సముద్ర
మగ్నుండ నైయుంటి, మనుమలు గొడుకులుఁ, జుట్టాలు లోనగుశూరమణులు
రామునిచేత సంగ్రామమునం బడి, రే నేమిసేయుదు, నిపుడు మృత్యు
కాల మాసన్నమై కన్పట్టుచున్నది, లేఁడు ధైర్యముఁ జెప్పువాఁడిమగఁడు
గీ. బలవదగ్రేసరుఁడు రామభద్రుఁ డర్క, తనయు వానరులను వెంటఁ గొనుచువచ్చి
జలనిధిని దాఁటి మనమూలబలము నెల్ల, నాశమొనరించె నెంతయుఁ గౌశలమున.

క. ఇదివఱకు మనపురికి బల్లిదు లని చెప్పికొనుచున్న లెఖ్ఖారులలోఁ
దుద కొకఁ డైనను మిగులక, కదనమున వధింపఁ బడిరి కపివీరులచే. 33౪

గీ. ఎపుడు చూచిన దనుజులే యీల్గుచుండ్రు, గాని; కపులకు నేముప్పుఁ గానరాదు
మొక్కవోవక కడిగినముత్తియముల, సరణి నుండెద రేమి యాశ్చర్యమొ కట.

రావణుఁడు కుంభకర్ణుని శత్రువులపైఁ బొమ్మనుట

ఉ. వారల సంహరింపఁ దగువాఁడిమగండవు నీవె, నీకు నె
వ్వారును సాటిగా రసురవర్గము గొల్వఁగఁ బోయి శత్రుసం
హారముఁ జేసి వాసి విజయంబును గాంచు, మనన్యసాధ్య మీ
కారియ, మన్నకై సలుపఁగాఁ దగు, వేగమ పొమ్ము తమ్ముఁడా!. ౩౩౬

ఆ. నిద్రనుండి నిన్ను నేను లేపించిన, దింనుకొఱకుఁ గాదె? యుద్ధశౌర్య!
యస్మదీప్సితంబు వ్యర్థమ్ముఁ జేయక, పూని శత్రుకోటిఁ బొడువు మిపుడ. ౩౩౭

వ. అనుటయు నగ్రజుని పరిదేవితంబు నాలించి యుచ్చైర్హాసంబు గావించి కుంభకర్ణుం
డిట్లనియె. ౩౩౮

కుంభకర్ణుఁడు రావణునకు నారదోక్తిని జెప్పుట

క. మును నీవు మంతనము సేయునప్పుడె నేమి చెప్పియుంటినొ నేఁడా
ఘనపాపకార్యఫలమే, నిను ముట్టిన దొక్క పెట్ట నిర్జరవైరీ!. ౩౩౯

సీ. మాటిమాటికి నీకుఁ జాటిచెప్పఁగలేదె, శ్రీరామభద్రుండు చిన్మయుఁ డగు
నాదినారాయణుం డనియును, జనకభూనాయకసుత యోగమాయ యనియు
గొంతు వో నెంతగాఁ గొట్టుకొన్నను జెవిఁ, బెట్టవైతి వదేమి పెంకెతనమొ
యొకనాటిరేయి నే నొకవిశాలాచల, శిఖరంబునం దుండి శిష్టవంద్యు

గీ. దివ్యదర్శను నారదు దేవఋషిని, జూచితిని, జూచి దేవ! యెచ్చోటినుండి
యెచ్చటకుఁ బోయెదరు మీర? లెఱుఁగఁ బల్కుఁ డనుడు, నాతోడ నిట్లనె నత్తపస్వి.

గీ. అడిగితివి గాన యున్న దున్నట్లు నీకుఁ, జెప్పువాఁడను విను కైకసీకుమార!
యమరు లాలోచనముఁ జేయునట్టినెలవు, నుండి నే నిపు డరుదెంచుచుంటిఁ జూవె.

వ. అందలివిశేషంబు లేమందు నేని. ౩౪౧

క. నీవును నీయగ్రజుఁ డగు, రావణుఁడును బెట్టునట్టిరాయిడి కెంతేఁ
జేనచెడి శరణు సొచ్చిరి, దేవత లందఱును దేవదేవుని విష్ణున్. ౩౪౩

ఆ. శరణు వేఁడి యాత్మశిరములు సోఁకఁ ద, త్పదసరోజములకుఁ బ్రణతి సల్పి
ప్రభుల కందఱకును బ్రభు వగునద్దను, జాంతకుని నుతించి యార్తి దోఁప. ౩౪౪

ఉ. మమ్మగచాట్లు వెట్టెడికుమార్గచరిష్ణు నజయ్యు మూఁడులో
కమ్ముల కార్తి గూర్చుదశకంఠు వధింపుము, స్వామి! నీకు నై

జమ్మె కదా సురారులను జంపుట? బిడ్డల మైన మేమిటుల్
ముమ్మర మైనశోకమున మున్గి తపింపఁగఁ జూచు టొప్పునే? ౩౮౭

క. "ఆతనిమరణము మనుజుని, చేతం గల" దనుచుఁ దొల్లి చెప్పెను సరసీ
జాతోద్భవు డందులకై, భూతలమున నరుఁడ వగుచుఁ బుట్టు మనంతా!. ౩౮౮

సీ. అని యిట్లు ప్రార్థింప నట్టులేయని పల్కి, సత్యసంకల్పుండు సర్వవిభుఁడు
నగురమావల్లభుం డవనిపై రఘువంశమున నుద్భవించి రాముఁ డనుపేర
నలరుచున్నాఁడు, మి మ్మందఱ బ్రమందించు, నమ్మహామహుఁ, డని యెరిగి యున్ని,
కావున నగ్రజా! నీవు సనాతన, మైన పరబ్రహ్మఁగా నెఱుంగు
గీ. మా రఘూత్తము, విడువుము వైరబుద్ధి, మాయచే మనుజాకృతి మసలునతనిఁ
గొలువు మిపుడు, ప్రసన్నుఁడై నిలుచు భక్తి, భావమున సంస్మరించెడివారి యెదుట.

కుంభకర్ణుఁడు రాముని భజింపు మని యన్నతోఁ జెప్పుట

గీ. తలఁప జ్ఞానమ్ముఁ గలిగించుతల్లి భక్తి, ముక్తి సేకూఱు టద్దానిమూలమున నె
భక్తిహీనునిచేఁ జేయఁబడున దెల్ల, సార్థకము గాదు వ్యర్థమౌ, నమరవైరి!. ౩౮౯

గీ. అవని నయ్యాయి లీలల ననుసరించి, భగవదవతారములు పెక్కు జరుగుచుండు
నందు జ్ఞానస్వరూపుఁ డానందమయుఁడు, జానకీశ్వరుఁ డొకసహస్రమున కుద్ది.

క. మనమున వాక్కున శ్రీరాముని సంతతమును భజించుపుణ్యాత్ములు చ
య్యన విష్ణుపదంబునకును, జనిమెదరు సులువుగ దాఁటి సంసారాబ్ధిన్. ౩౯౦

సీ. జగతీతలమున నేసత్పురుషులు నిర్మలాంతఃకరణముల నహరహంబు
జానకీజానినే ధ్యానంబుసేయుచుఁ, దద్దివ్యచరితామృతంబె త్రావు
చానందమున నోలలాడుచు నుందురో; వారె యీ ఘోరసంసార మనెడి
తనువు గల్గినకోడె త్రాఁచు బుస్సనివేయు, నోడుపులకుం జిక్కకుండువారు;
గీ. వారె క్లేశముల్ వారయనివా, రనంత, సుఖద మగు రామపదమున సుస్థిరముగ
నిలుచువారలుఁ; గావున నీవు నట్లె, రఘుపతిని గొల్చి సుఖియింపు, రాక్షసేంద్ర!

రావణుఁడు కుంభకర్ణుని దూఱుట

వ. అని యిత్తెఱంగున ఘటకర్ణుండు హితోపదేశమ్ముఁ జేయ నొక్కింతయు లెక్క
సేయక, భ్రుకుటీవికటాననుం డై దశాననుండు సింహాసనమునుండి యుడ్డీయ
మానుండుం బోలె నదరిపడి రదనంబులు గీఁటుచుఁ జుఱుకుమాటల నిట్లనియె.

సీ. జ్ఞానోపదేశమ్ముఁ గావింపఁ గడుబుద్ధి, మంతుండ వీ వని మదిఁ దలంచి
రావింపలేదు ని న్నీవేళ, నీకంత, శోష మేటికి నేమి సుఖము గన

నీ కీర్తి మగుసేని నేను బూనినపని, గావింప నడువుము కదనమునకుఁ
గానివో నిద్రింపఁగాఁ బొమ్ము పుడుఁ గూడ, బాధించుచున్నది పాడునిదుర
ఆ. పగఱఁ గెలువలేక మగటిమి దిగనాడి, చెడ్డయనుచు నొరులు చేయుదానిఁ
దెగడఁ దగునె; యట్టిదేబెవు నా కెట్లు, సోదరుండ వైతిరా దురాత్మ!. ౩౫౩
ఆ. అన్న, యెంతగొప్పయాపదలో నుండి, నన్ను లేపెనో; యటన్నమాట
నించు కేనిఁ దలఁప వేమి నీజన్మము, కాలిపోను జాలుఁ గదలు మింక. ౩౫౪

కుంభకర్ణుఁడు కపుల సంహరించుట

సీ. అనుడు శుట్రశవుఁ డకట నాచెప్పిన, దంతయు బూదిదయందుఁ బోయు
పన్నీరువోలె నిష్ఫల మైన, దితఁడు కోపమున నున్నాఁడు లాభమ్ము లేదు
కాల మాసన్నమై కవియుచునుండ నెవ్వం డాఁగు? నేనును వైరమూని
యనిసేయఁ బోవుదు, నని నిశ్చయించి ద్వారమ్మునఁ జనక రయమ్ము మిగుల
గీ. దాటి ప్రాకారమును మహీధరవరాభ, కాయసందర్శనమ్మునఁ గపులు వెఱవఁ
బురము వెల్వడె నంభోధి ఘోరు కలఁగ, భీకరధ్వనిఁ జేయుచు బిసరుహాక్షి!. ౩౫౫
వ. అవ్విధంబున నగరంబు నిర్గమించి రణస్థలిం జొచ్చి. ౩౫౬
క. వృక్షచరుల నవలీలగ, భక్షించుచుఁ దీవ్రకోపభారంబున నా
యక్షీణబలుఁడు నిజదోఃకక్షేయకపాతములను గసిమసఁగె సతి!. ౩౫౭
గీ. పక్షసంయుత మగుగొప్పపర్వతంబు, భంగిఁ జరియించునాతనిఁ బొఱఁ జూచి
కపులు బెగడొంద పాఱిరి కాల్కొలందిఁ, గాలమృత్యువుఁ గన్న భూతాళి యట్లు.
వ. ఆసమయంబున సన్నిహితుఁడు గదాపాణియు నైనవిభీషణుండు. ౩౫౯

విభీషణుఁడు కుంభకర్ణునకు రావణుని మూర్ఖతను దెలుపుట

సీ. అదలించు చోకయిన్నగుదియఁ జేఁ బూని నిర్భయముగ వానరబలమునందుఁ
దిరుగుచుండినవాని, సురుచమసత్త్వుని, నన్నివైపులఁ గలయద్రిచరుల
వధియించి భక్షించువాని, ముద్గరమునఁ, జేతులఁ గాళ్లను జిక్కినట్లు
పలుతెఱంగులఁ గోఁతిపదవును నలినలిగాఁ జేయువాని, నఖండవేగుఁ
గీ. దనకు నగ్రజుఁ డగువానిఁ, గని శుట్రశ, వసునిఁ, బాదంబులం బడి వందనంబు
సలిపి సీతమ్ముఁడను విభీషణుఁడ నేను, గరుణఁ జూపుము నాయెడ సరళహృదయ!.
వ. అని పల్కి వెండియు నిట్లనియె. ౩౬౦
క. "అన్నా! వల దీమూర్ఖత, వెన్నుఁడు రాముండు, సీత విభుఁ దగిన, దం
చెన్నిగతులఁ దెలిపినఁ బె, ద్దన్న వినం డయ్యె నా హితాలాపంబుల్. ౩౬౧

క. కులనాశన మనిచెప్పితిఁ, బలువురు నవ్వుదు రటంచు భాషించితి ను
మ్మలిక యలముకొను ననియుం, బలికితి నూఁకొనఁ డదేమి పాపమొ కట్టా.

ఆ. సాహసించి రామచంద్రునితో విరోధంబు నీకు మృత్యుదంబు గాన
సీత నప్పగించి జీవింపు మని కూడ, నంటిఁ జెవిని బెట్టఁ డయ్యె నెదియు. ౩౬౪

సీ. వినకపోవుటె కాక కినుక వహించి నన్, గడతేర్పఁగాఁ జేతికత్తి యెత్తి
యనరానిమాటల నని కాలఁ దన్ని నా, పురి వసింపకుము ఛీ పొమ్మటంచు
ధిక్కార మొనరించె నక్కట; దుష్టరా, క్షసవేష్టితుం డయి చక్రవర్తి,
యంత నా కటనుండు టతిహైన్యముగఁ దోఁచి, ప్రెగడల నల్వుర వెంటఁగొనుచు
ఆ. సరగ వచ్చి రాముఁ గరుణాపయోధిని, భువనపతిని శరణు వొందినాఁడ
నైనవారివలనియవమానమునకంటెఁ, బరులఁ జేరి మనుట పాడిగాదె. ౩౬౫

కుంభకర్ణుఁడు సోదరుని నాశ్వాసించుట

క. అనవుడుఁ బ్రియసోదరు వచ్చినవానిఁగ నెఱిఁగి చాఁచి చేతులు రార
మ్మని కవుఁగిలించికొని యిట్లనెఁ బ్రేముడిఁ గుంభకర్ణుఁ డమలినహృదయా!.

సీ. భయపడకుము వత్స! బ్రతుకుము నీ వేని, నా రామభద్రుని యండఁ జేరి,
మాచావు సిద్ధంబు మనవంశమునకు నీ, వొక్కండవే నిల్చియుండువాఁడ
వసురరక్షణమున కన్వయస్థితికిని, నీవ యాధారంబ వింకమీఁద
మన మెన్ని చెప్పిన మనసున కెక్క వ, గ్రజునకు నిది కానికాల మగుట,
గీ. నేను నీయట్లె యెంతయు నీతిఁ గఱపి, వచ్చితిఁ బ్రయోజనము లేమి స్థైర మూని,
దేవఋషి నారదుఁడు మున్ను దెలుపఁ బరమ, భాగవతుఁడ వీ వని వింటి, భవ్యచరిత!

చ. అరుగుము తండ్రి! మామకసమక్షమునందున నిల్వఁబోకుమీ
పరుఁ డని చుట్టు మంచుఁ గనుపట్టుట లే దిపు డిందు నాకు, దు
ష్కర మగుదుర్మదం బడరి కన్నులఁ బ్రాముట నేమి ఘోరముల్
జరగెడి నొక్కొ; నావలన సంగరధారుణి యెట్లు మాఱునో?. ౩౬౮

క. కినుక మెయి నిన్నుఁ దునిమిన, మనవంశం బంతరించు మహి దానవపా
లనము నిలిచిపోవును గావున నెచ్చటి కేనిఁ దొలఁగి పొమ్ము రయముగన్.

క. అనుటయు నగ్రజునకు వందన మొనరిచి యచోటువాసి తడయక చని రా
ముని ప్రక్క కొదిగి యుండెను, బెనుచింతకు లోనగుచు విభీషణుఁడు, సతీ!.

వ. అంతఁ గుంభకర్ణుండును. ౩౭౧

క. కరచరణంబులఁ జిక్కిన, గిరిచరవీరులను నలిపి గీ టడఁచుచు నం
గరధరణి మదపుటేనుఁగు, కరణిం జరియించె భయదగతి విమలమతీ!. ౩౭౨

రామకుంభకర్ణుల యుద్ధము.

శా. క్రవ్యాదుం డటుచేయుటల్ జనకజాకాంతుండు వీక్షించి హం
తవ్యుం డంచు సమాదరంబున సుసంధానంబు గావించి వా
యవ్యాస్త్రంబును వైచె వానిపయి నయ్యస్త్రంబు దుష్ప్రేక్ష్య మై
దివ్యుల్ మెచ్చఁగ దక్షబాహువును ఛేదించెన్ సతీరత్నమా!. ౩౭౩

గీ. ముద్గరముతోడ నాచేయి మొదటికిఁ దెగి
పుడమిఁ బడె, నప్పు డెందఱో భూధ్రచరులు
ప్రాణములఁ గోలుపోయిరి పడఁతి! దాని
క్రిందఁ జిక్కి, యాఘోర మేక్రియ వచింతు. ౩౭౪

గీ. చేయి దెగిపోవుటను గుండె చెదరి వాఁడు, గిరులు మాఱ్మ్రోయ నొకపెద్ద కేక వైచె
వణకుఁచుఁ భీతిఁ గపులు పార్శ్వముల నిలిచి, కాంచుచుండిరి రామరాక్షసుల పోరు.

సీ. అప్పుడు ఘటకర్ణుఁ డాగ్రహమ్మున మద్దిచెట్టొక్కటి పెకల్చి చేతఁ బూని
రఘుపతిం జక్కాడ రయమునఁ బరుగెత్త, సాలమహీరుహసంయుతముగ
నెడమకరముఁ గూడ నేడ్తెఱ ఖండించె, నైంద్రాస్త్రమున నమ్మహానుభావుఁ,
డా రావణానుజుం డంతటఁ బోక గర్జించుచుఁ గవియఁ వీక్షించి యర్ధ

గీ. చంద్రసాయకముల రెంటి శాతతరముల నిషంగమునుండి తోడనగ్రహించి
వింట సంధించి జళిపించి విడిచెఁ బాదయుగము ఖండితమై కూల నుత్పలాక్షి!.

క. తెగినపదంబులు రెండును, నగరద్వారమునఁ బడియె నగనందిని! యం
దుఁ గలసురారుల గుండియ, లగలింపఁగఁ జాలుభీకరారావముతోన్. ౩౭౭

చ. కరములుఁ బాదముల్ నఱికి గాయముచేసినఁ గుంభకర్ణుఁ డో
సరిలక యించుకంతయును జంద్రునిపైఁ జను రాహుభంగి వే
పరుగిడె రాముపైకి బడబాశిఖవక్త్రముఁరీతి వక్త్రముం
దెఱచి భయంకరార్భటులు దిక్కులఁ బిక్కటిలంగ నొక్కటన్. ౩౭౮

మ. తనపై వచ్చెడివానిఁ జూచి వినురా దైత్యాధమా! యింక నే
మని నాపైఁ బఱతెంచుచుంటివిర? నీ యాశాబ్ధి యీతూరి యిం
కునురా కన్గొను మిద్ది యంచు శరముల్ గుప్పించి నిండించెఁ ద
ద్ఘనభూభృద్బిలతుల్యవక్త్రమును సీతాభర్త, బింబాధరీ!. ౩౭౯

వ. అత్తెఱంగున నమ్మొఱపతెఱఁగంటిగొంగ. ౩౮౦

క. నరనాయకభీకరశర, పరిపూరితవదనుఁ డగుచు భయదాకృతి మై
నఱచె లయాంభోధరనిస్ఫురగర్జనశంకఁ బద్మజుఁడు వెఱగుపడన్. ౩౮౧

రాముఁడు కుంభకర్ణుని వధించుట

వ. అంత. ౩౮౨

సీ. అర్కప్రతీకాశ మశనిసన్నిభము వజ్రాభం బనుత్తమం బైనయైంద్ర
బాణంబు దివిజారి ప్రాణముల్ డీయఁ బ్రయోగించె రాఘవుం డుగ్రుఁ డగుచు,
నది దుర్నిరీక్ష్య మై యప్రతిహతగతిఁ, బోయి పర్వతమును బోలి రత్న
కుండలంబుల వాఁడికోఱల మీఱుతచ్ఛిరమును వృత్రునిశిరము గులిశ
గీ. మెట్టు లట్టుల ఖండింప, నెగిరి లంక, వాకిటం బడి యరికట్టె రాకపోక
లెవియు సందర్భపడకుండ నిందువదన! విను మవల రామశరపాతవేగమునను.

క. జలనిధిఁ బడి మొండెము మొసళులుఁ బెను మీలాదిగాఁగఁ గలుగుజంతువ్రాతా
నలినలి సేయఁగఁ జాలెం, బోలఁతీ! పవినిహతపతితభూధ్రము కరణిన్. ౩౮౪

రాముని దేవతలు ప్రశంసించుట

వ. అంత సురగరుడగంధర్వకిన్నరకింపురుషయక్షనాగసిద్ధసాధ్యాదిదేవయోనిసంజాతు లప్సరఃకామినీసహితు లై వ్యధకుం బాసితి మని కుంభకర్ణు వధమున కానందించుచు జానకీ లోలునిపైఁ బూలవాన గురియించుచు ననేకవిధంబులం దదీయ ప్రభావంబు స్వభావోక్తులం బ్రశంసించి, రట్టియెడ దశరథుని తొలిపట్టిం జూచుటకు దేవర్షిశ్రేష్ఠుం డగునారదుండు గగనంబునుండి మగఱాలనగిమెడిమేసి దగదగల దశదిశ లలంకరించుచు ద్రుతగతి రణక్షితికి వచ్చె. ఇట్లు వచ్చి. ౩౮౫

నారదుఁడు శ్రీరాముని బొగడుట

సీ. నల్లగల్వలఁడాలు నగఁజాలు మెయివాని, ధనువుఁ బూనినకేలుదమ్మివాని
మించి చేరలఁగొల్వఁ గొంచె మెఱ్ఱఁగనున్న, కందోయితో నిగ్గు గాఱువాని
నసురాస్త్రపీడితు లై కుందుకపులను, గరుణార్ద్రదృష్టితో నరయువాని
నైంద్రాస్త్రభూషితహస్తుఁ బ్రశస్తబుధస్తవపాత్రు సీతాకళత్రుఁ
గీ. జూచి గద్గదవాక్కుతో స్తుతి యొనర్ప, మొదలిడెమె నిట్లు, దేవతాముఖ్య! విశ్వ
సాక్షి! నారాయణా! భువనైకపాల!, దైత్యమర్దన! నీకు వందనము రామ!.

సీ. తలఁచి చూచిన విశుద్ధజ్ఞానరూపుండ, వీ, వట్టిననును మాయ నెనసి మనుజ
వేషంబు గొని వేదవేద్య! సుఖంబు దుఃఖము మొదలయిన ద్వంద్వములు గలయ

తనియ ట్లభినయించి జనుల నందఱ మోసపుచ్చుచుంటివి సర్వభూతహృదయ
సంస్థితిఁ బడసియు స్వప్రకాశుఁడ వయ్యు, మాయచేతను గూహ్యమానుఁడ వయి
గీ. యుందు, వజ్ఞాను లెఱుఁగ రీయుక్తి, నమల, చిత్తులకుఁ గానవచ్చు నీజిత్తు లెల్ల
మంజులాకార! నిఖిలకల్మషవిదూర!, దళితసంసారపాశ! సీతాహృదీశ!.

ఆ. కనులు దెఱచి ముజ్జగములు సృజింతువు, కనులుమూసి ముజ్జగముల ముంతు
వాదిదేవ! నీవ యఖిలాశ్రయుండవు, ని న్నెఱుంగ లేరు నిర్జరులును. ౩౮౮

సీ. పుట్టు నెద్దాన నీభువనంబు లన్నియు?, భాసిల్లు నెద్దాన భవ్యసరణి?
నెద్దానికంటెను నితర మౌవస్తువు, వెదకినం గనగాదో విశ్వమందు?
నట్టిచిదాకృతి నలరువానికి నీకు, వంగన మయ్యా దైవతలలామ!
రూఢి వ్యక్తావ్యక్తరూపుఁ డౌనెవ్వఁడు, బరమపూరుషునిగాఁ బ్రకృతిఁగాను
గీ. గాలునిఁగఁ గాంచుచున్నారొ ఘనులు మౌను?
లామహాత్ముఁడ వీవ నీయందుఁ గాన
మాదిమధ్యాంతములను ననాదిపురుష!
రామ! లోకాభిరామ! శాత్రవవిరామ!. ౩౮౯

వ. దేవా! నిన్ను షడ్భావవికారదూరునింగను, శుద్ధునింగను, జ్ఞానస్వరూపునింగను,
వేదంబు చెప్పుచున్నది. మఱియు నా వేదంబ వే ఱొకచో వివిధవికారసమ్మిశ్రితం
బును, నశుద్ధంబును, జడము, నగు జగత్తు రూపముగాఁ గలవాఁడ వని పలికెడు.
ఇందువలన వేదవాదుల కీ విరోధంబు నిరోధకం బై కన్పట్టుచున్నయది. ౩౯౦

క. నిగమార్థవిచారం బెంతగఁ జేసిన నిందు నీదుదయ గలుగని దో
నిగమాంతగోచరా! పొందఁగఁ జాలరు నిశ్చయమును తత్త్వబుభుత్సుల్. ౩౯౧

గీ. దేవ! మాయతోఁ గ్రీడించునీవిషయము, నందు లేదు విరోధ మిం తైనఁగాని
జ్ఞానహీనుల దృష్టికిఁ గానఁబడెడి, నఖిలజగదాకృతివిగ మాయానుగతిని. ౩౯౨

క. భ్రమమున సూర్యకిరణజాలము జలముగఁ దోఁచునట్లు లలి భ్రాంతిజ్ఞా
నమువలనఁ బ్రపంచము సర్వము నీయెడఁ గల్పితమ్ము ప్రవిమలమూర్తీ!. ౩౯౩

సీ. మనమున కవిషయమును బరబ్రహ్మంబు, నిర్గుణం బైనది నీస్వరూప,
మట్టిది కనుల కె ట్లగపడు? నగపడకున్న భక్తుం డెట్లు సన్నుతించు?
ఏ నామరూపము ల్లేనివస్తువునందు, గుఱి నిల్చుటయ కష్టతరము గాన
యవనిపై యుష్మదీయావతారములయం, దలిరూపములను డెందముల నిలిపి

గీ. భక్తి భజియించి బుద్ధిసంపన్ను లగుచు, దానికతన సముత్పన్న మైనజ్ఞాన
మునను సంసారఘోరసముద్రమును ద,రించుచున్నారు నిపుణు లుదంచితగతి.

వ. రామా! దేహంబునం గలకామక్రోధాదివైరివర్గంబు పిల్లి యెలుకలం బోలె మన
స్సును సదా భయపెట్టుచు భవదీయధ్యానమ్ముఁ జేయనీయక యాఁకట్టుచున్నది.

క. నెమ్మది నీనామ మ్మని,శమ్మును స్మరియించుచుండుజనునకు నిరవ
ద్యమ్మగుత్వదీయశుభరూ,పమ్ము తిరమ్ముగ లభించు భవవిద్వేషీ!. ౩౯౭

సీ. ఆసక్తి మిగుల ని న్నర్చించువారికిఁ, ద్వత్కథామృతపానతత్పరులకు
నినుఁ గొల్చువారి చెల్మిని జేయువారికి, భవమహార్ణవము గోష్పాదసమము
కాన నే నెపుడును మానసంబున నీదు, సగుణరూపమ్మును సంస్మరించి
కాంచి జీవన్ముక్తిగరిమ మహేంద్రాది,సురల కెల్లరకుఁ బూజ్యుండ నగుచు

గీ. జగములఁ జరించుచుంటి స్వేచ్ఛగ మహాత్మ!, యమరపాళికి మేలుసేయంగఁ దలఁచి
గొప్పపనిఁ జేసితివి నేఁడు, కుంభకర్ణుఁ, జంపుటను భూభరము దగ్గెఁ జాలవఱకు.

ఉ. తమ్ముఁడు లక్ష్మణుండు రణధారిణి నింద్రజిఁ గూల్చు ఖేపు, నీ
వమ్ములునాఁడు చంపఁగల వద్దశకంఠుని దేవ! యంతరి
క్షమ్మున నిల్చి చూచెదను సర్వము సిద్ధులఁ గూడి, దర్శనా
ర్థమ్ముగ వచ్చినా నిటకు రాఘవ! పోదు ననుగ్రహింపుమా. ౩౯౮

క. అనిపలికి రామువీడ్కొని, మునిపతి నారదుఁడు సురసమూహస్తుతుఁడై
దనియుచుఁ జనె నిర్దోషం,బును నిరుపమ మైనబ్రహ్మభువనంబునకున్. ౩౯౯

చ. అనుజునిఁ గుంభకర్ణు విమతాతిభయంకరు వీరు నశ్రమం
బున రణరంగమందు రఘుపుత్త్రునిచే మృతుఁ డైనవానిఁగా
విని కడుదుఃఖతప్తుఁ డయి వింశతిబాహువు మూర్ఛ మున్గి కూ
లెను భువిఁ, గొంతసేపటికి లేచి కటా! యని యేడ్చె సుందరీ!. ౪౦౦

కుంభకర్ణునికై దుఃఖించు తండ్రికి నింద్రజిత్తు ధైర్యము చెప్పుట

క. పినతండ్రి బిద్దుఁ డయి నా,తనిఁ దలఁచుచుఁ గన్నతండ్రి ధైర్యము చెడి శో
కనిమగ్నుం డయి పొక్కుట,యును గని యనె మేఘనాదుఁ డుచ్చైర్గణితిన్.

సీ. త్రుంగిన వారికై దుఃఖింపకుము తండ్రి!, యేడ్చిన వత్తురే యెన్నఁ డేని
బలమును బ్రకటించి బవరానఁ బడినమా,చిన్నయ్య కింతగాఁ జివుక నేల?
బలసూదనునకు సంకెలలు వైచినమహా,బలుఁడ నే నీరీతి బ్రతికియుండ
నవకాశ మెక్కడి దయ్య శోకమునకు, నిర్జరాంతక! యింక నీ యలజడి

ఆ. తగ్గుఁ గాక, స్వస్థతను గల్గియుండును, సకల మేను బోయి చక్కఁ జేతు
వైరిబలము నెల్ల వధియింతు, రామలక్ష్మణులఁ గలనఁ బిలుకుమార్చి వత్తు.

గీ. ఇప్పు డేను నికుంభిల కేఁగి యగ్ని, దేవునకు హోమకృతిఁ జేసి తృప్తిపఱచి
యతనికృపఁ గదనార్హరథాదిదివ్య, సాధనంబులఁ బడసి యసాధ్యుఁడ నయి.

ఉ. లాఁతుల పూఁత మాడ్చి జయలక్ష్మిని జేకొని వచ్చువాఁడ, నీ
వాతురతన్ వహించి దిగు లందకు మంచు ననేకభంగులం
దాతను నూఱడించి హవనస్థలికిం జనె నక్షుదానవ
భ్రాత రయంబునన్ భువనబాంధవవంశ్యవధాభిలాషతోన్. ౪౦౬

ఇంద్రజిత్తు నికుంభిలాహోమమును జేయుట

వ. చని, రక్తాంబరధారి యై యెఱ్ఱనిపూలదండలఁ గంఠంబున వైచికొని యరుణ
గంధంబు మే నెల్లం బూసికొని పూన మూని నిర్దిష్టనికుంభిలాప్రదేశంబున
హోమం బొనర్పఁ బ్రారంభించె. ఇట విభీషణుం డింద్రజిత్కృత్రిమం బంతయు
నెఱింగి, కలంగి రఘుపుంగవుం జేరి హోమారంభంబు సాంగంబుగ నిట్లు దెలుపం
దొడఁగె. ౪౦౭

విభీషణుఁడు నికుంభిలావిఘ్నమునకు లక్ష్మణుని బంపు మని రామునితోఁ జెప్పుట

సీ. రాఘవ! వింటె దుర్మతి మేఘనాదుండు, హోమంబు గావించుచుండె నిప్పు,
డంతరాయము లేక యది నెఱవేఱుచో; మన మె కాదా వీరు మార్కొనంగ
నలసురాసురు లైన నర్హులుగారు తత్క్షణ మేఁగు టొప్పు విఘ్న మొనర్పఁ
దడసిన మనప్రయత్నం బంతయును నిష్ఫలం బగు నొకనిమేషంబులోన,

గీ. కాన బలవంతులందు విఖ్యాతి గన్న, యనుజునిం బంపు నావెంట, నతనిచేత
లాఁతిఁ గూల్పించెదను మనలక్ష్మణుండు, సంహరింపఁ గలండు నిశ్చయము వాని.

వ. అనిన రావణానుజునకు రామభూవిభుం డిట్లనియె. ౪౦౮

గీ. వారు వీ రేమిటికి నేన వత్తు వైరి, ఘాతమునకు సమస్తరాక్షసులఁ బట్టి
హత మొనర్చునాగ్నేయమహాస్త్రమునను, నింద్రజిత్తును మడియింతు సిద్ధచరిత!

వ. నావుడు విభీషణుం డిట్లనియె. ౪౦౯

విభీషణుఁ, డింద్రజిత్తును లక్ష్మణుఁడు చంపఁ జగినవాఁ డని చెప్పుట

క. నీ వట్లు దలంపకు సీతావర! విను మితరులకు నతనివధియింపం
గా వశము గాదు, లక్ష్మణుఁడే వధియింపఁ దగుమేటి యేమిటి కన్నన్. ౪౧౦

క. "పదిరెండేం డ్లాహారము, నిదురయు మాని యెవఁ డుండు నిష్ఠ; నతనిచే
నదమద మగు, నింద్రజి"యనుచుఁ దొల్లి నియమించెఁ గమలజుఁడు రఘువీరా!.

వ. సౌమిత్రి, యట్టివాఁడా? యని యందు వేని?. ౪౧౨

క. పురిఁ బాసి యతఁడు నీతో, నరుదెంచిన దాది యెఱుఁగఁ డాహారము ని
ద్దుర నింతదనుక యుష్మ, త్పరిచర్యాసక్తబుద్ధిఁ బార్థివరమణా!. ౪౧౩

క. ఒకపం డైనను దుద నాలుకపై నుంచికొనఁ డయ్యె లోకేశ్వర! యీ
యకలంకునిమాహాత్మ్యము, సకలము నే నెఱుఁగుదును విచార మిఁ కేలా.

క. ఆనతి యిడి పంపించుము, దానవు పన్నగడఁ జెఱచి త్వరలో విగత
ప్రాణునిఁగాఁ జేయును లక్ష్మీనాయక! యీతఁ డాదిశేషుఁడు గాదే. ౪౧౪

సీ. అఖిలలోకంబుల కధినాథుఁ డైన సాక్షాద్విష్ణుమూర్తివి స్వామి! నీవు,
బ్రహ్మాండ మవలీలఁ బడగలపైఁ దాల్చు, నహివల్లభుఁడు సుమిత్రాత్మజుండు,
నడప జగం బనునాటకంబును సూత్రధారు లై యుండిన మీ రిరువురు
రావణకుంభకర్ణప్రముఖాఖిల, దుష్టాసురు లౌనర్చుదుండగముల

ఆ. నైనభూమిభార మపనయింపఁగ నిట్టు, లవతరించినార లనఘులార!.
నీవు పంక్తికంఠు నీల్గింతు వీతండు, మేఘనాదుఁ గూల్చు మిథ్యగాదు. ౪౧౬

వ. అనిన నినవంశోత్తంస మిట్లనియె. ౪౧౭

సీ. రణభయంకరుఁ డైనరావణిమాయ యంతయు నే నెఱుంగు దతండు బాహు
బలశాలి మాయావి బ్రహ్మాస్త్రవిదుఁ డెంత, కైన సమర్థుఁ డియ్యది నిజంబు,
దనుజసత్తమ! యిఁకేఁ దమ్ముని విషయ మై, వేఱ చెప్పఁగనేల వినయనమిత
గాత్రుఁ డై రేలుఁబగల్లుఁ గన్నార్పక, పం డేనిఁ దినక పండ్రెండువత్స

గీ. రములు శుశ్రూష సలిపె నా కమితభక్తిఁ
గానయుం, దది యెఱిఁగియు యేను ముందు
గాఁదగినకార్యమందలిగౌరవమును
బట్టి యిటు లూరకుంటి నిష్పాపహృదయ!. ౪౧౮

వ. అని పలికి య య్యాత్మవిదగ్రేసరుండు సౌమిత్రిం జూచి. ౪౧౯

రాముఁడు లక్ష్మణుని నింద్రజిద్వధార్థము పంపుట

క. వాయుసుతుఁడు లోనగుదళ, వాయులు సేనయును గొలువ వడి నింద్రజిపైఁ
బోయి తదుద్యమభంగముఁ, జేయుము తత్తనువు నుఱుము సేయుము వత్సా!.

క. ఋక్షపతి జాంబవంతుం, డక్షీణబలంబుతోడ నరుదెంచెడు నీ
రాక్షసవరుఁడును సంగర, దక్షా! నీవెంటవచ్చుఁ దనమంత్రులతోన్. ౪౨౧

సీ. మన కాపద ఘటింప మఘవజిత్తులుకతో, నగ్ని నివేల్చురహాగ్రప్రదేశ
మీతండు చక్కఁగ నెఱుఁగుఁ, దద్యత్నభంగోపాయములు సమయోచితముగ
బోధించి కార్యంబు పొసఁగింపఁ జేయు, నన్నివిధాల సాయంబు నీకొనర్చు
ననవుడుఁ, బతిమాట కంగీకరించి భీమపరాక్రముండు లక్ష్మణుఁడు శ్రేష్ఠ
గీ. మైనవేఱొక్కవిల్లు చేఁబూని మోద, మూని యగ్రజు పదపద్మములు స్పృశించి
సంగరోత్సాహ మొతయు సందడింప, ననియె నీరీతిఁ గపిలోక మాలకింప. ౪౨౨

గీ. చాపనిర్ముక్తమామకశరము లిపుడు, దిట్టయగుమహేంద్రజిని భేదించి శుద్ధ
మొనయ భోగావతీజలమ్ముల మునుంగఁ, బోయి రాఁగల వాయధోభువనమునకు.

క. అని సవిభీషణుఁడై రామునకుఁ బ్రదక్షిణము చేసి ముమ్మా, అభివం
దన మొనరిచి త్వరితగతిం, జనె వైరివధాభిలాష జలరుహపాణీ! ౪౨౪

క. వనచరసహస్రములతో, ననిలజుఁడును సచివసహితుఁడై ఘనుఁడు దశా
ననుతమ్ముఁడును సుమిత్రా, తనయుని వెనువెంటఁ జనిరి దనుజులు బెదరన్.

వ. జాంబవత్ప్రముఖభల్లూకంబులును నట్టె రఘువీరుని వెంబడించె. ఇత్తెఱంగున నా
లోకోత్తరశూరుండు కపిసత్తములతో నికుంభిలాప్రదేశంబునకుఁ బోయి, దవ్వునఁ
బలలాశిసంకులం బయినబలముం దిలకించి పరాక్రమించి ధనురగ్రంబునకు జ్యా
లతికం దగిలించి సంసిద్ధుండై యుండె. జాంబవంతుండును, శూరుం డగునంగదు
నితోఁ గట్టాయితుండై నిల్చె, నాసమయంబున విభీషణుండు లక్ష్మణున కి
ట్లనియె. ౪౨౬

విభీషణుఁడు లక్ష్మణున కింద్రజిత్తును జయించువిధమును దెలుపుట

ఆ. కారుమబ్బుకరణిఁ గడునల్లనైన యీ, దనుజబలముఁ గనుము ధైర్యశాలి!
తద్విభేదనంబు తప్పనిసరి మన, కిపుడు, శరము వదలు మేలు జాగు. ౪౨౭

సీ. అపాలదిండిదం డడఁగినతోన యింద్రజియును మనకుఁ గానంగఁ బడును
వాఁ డొనరించుహావనము సాంతము గాక, మున్న; యిప్పనిఁ జేయఁ బూనుకొనుము
పాపాత్ము జీవహింసాపరు రామభద్రద్రోహితనయు నధర్మనిరతు
వీని వధింపుము వీరశిఖామణి!, యదను దప్పినఁ గష్ట మనవుడు, శుభ
గీ. లక్షణుం డగులక్ష్మణుం డాక్షణమున, రాక్షసబలంబు మీఁదఁ బరాక్రమించి
తెఱపి లేకుండఁ గురిపించె దృఢతరోగ్ర, బాణవర్షం బమర్షంబు పైకొనంగ. ౪౨౮

దానవవానరులు పెనఁగుట

క. ధరణీధరశృంగములతోఁ, దరుపాషాణములతోడఁ దరుచరవీరుల్
సురవైరుల నందఱఁ గొట్టిరి బిట్టుగ మూర్ధములు పెటీ లనిపగులన్. ౪౨౯

వ. అప్పు డప్పాలసుదిండివాఁగు చెలరేఁగి మూఁగఁ బాఱి యాఁగరాక పరశ్వధాసి పటుయష్టిపరిఘతోమరశితశరనికరంబులం గపిప్రకరంబులను సేనానులం బ్రహరించి యానందించె. గట్లతేనిగారాబుపట్టీ! యిట్లు పరస్పరప్రహరణోద్భూతాద్భుత ధ్వానంబు భూనభోఽంతరాళంబు నిండ గండుమిగిలి కవిసిన దానవవానరవాహినుల యాహవంబు భయావహంబై చెల్లె, నాసమయంబున దాశకంఠి. ౪౩౦

ఇంద్రజిత్తు లక్ష్మణు నపహసించుట

సీ. తనసైన్య మంతయుఁ దరుచరపాళిచేఁ, బడి నాశ మొందుటఁ బాఱఁజూచి
చేడెఁ గార్య మని దీక్షఁ జేసెడి హోమంబు, విడిచి నికుంభిల వెడలివచ్చి
గ్రక్కునఁ దేరెక్కి కార్ముకం బంద కోపంబు రెట్టింపంగఁ బగతు డాసి
రారమ్ము లక్ష్మణా! రణ మాచరింతము, తెఱఁగంటిదొరఁ గట్టి తెచ్చినట్టి
గీ. మేఘనాదుండ నేను సమీకమునను, బాణములతోడ విసువంగఁ బడవు నీవు
వెఱ్ఱియన్నమాటల కుబ్బి విజయవాంఛ, వచ్చినాఁడవు కడుఁబసివాఁడ వకట.

వ. అని సాపహాసముగ రామానుజుం బలికి యయ్యెడఁ దోఁచు తనపినతండ్రిని గాంచి రోషారుణితనేత్రుఁడై మందోదరీపుత్త్రుండు పరుషభాషణంబుల నిట్లనియె. ౪౩౨

ఇంద్రజిత్తు విభీషణుని నిందించుట

సీ. ఇచ్చోటనేపుట్టి యిచటనే పెరిఁగి నా, తండ్రికి నందును దమ్ముఁడ వయి
తామరతంపరై తనరారుస్వజనముఁ, విడనాడి మగఁటిమి వీటఁబుచ్చి
సిగ్గఱి మార్తురఁ జేరి సేవావృత్తి, బ్రతుకుట యే కాక; సుతుఁడ నైన
నాకును ద్రోహ మొనర్ప నీతనికిఁ బురెక్కించి తెచ్చితే యిప్పు డిటకు?
గీ. నీ వెఱింగింప కున్నచో నెట్లు సొత్తు, రీ రహస్యప్రదేశంబు వీర? యెంత
పాపి వైతి నీజన్మము పాడుగాను, గత్తి కొకకండ దీసినఁ గలుష మున్నె?. ౪౩౩

చ. అని పినతండ్రిఁ దిట్టి పవనాత్మజు వీఁపున నున్నలక్ష్మణుం
గని వివిధాయుధంబులును ఖడ్గములుం గలయట్టిమేటిస్యం
దనమున శోభితుం డయి యుదగ్రధనుర్వర మెత్తి తద్గుణ
ధ్వని యొనరించుచుం బలికె దానవనాథసుతుండు వైరులన్. ౪౩౪

చ. తెలియక వచ్చినారొక సుధీరుని వెంబడి నన్ను నాజిలో
గెలిచెడిబుద్ధి, నయ్యది లగించునె? యిస్సిరొ యెన్నఁ డేని బె
బ్బులిని జయించునే హరిణపుంజము; వానరులార! మచ్ఛరం
బులు భవదీయజీవములఁ బుక్కిటిబంటిగఁ ద్రావుఁగావుతన్. ౪౩౫

ఇంద్రజిల్లక్ష్మణులు పోరుట

చ. అనుటయుఁ గోపముం గొని మహోహివిధంబున రోఁజుచున్ ద్విష
జ్జనదమనుండు లక్ష్మణుఁడు చాపమునం బవిసన్నిభంబు లౌ
ఘనశరముల్ వడిం దొడిగి కైకసి మన్మనిమీఁద వైచె న
ట్లనికనుదోయితోఁ దను నరాతి గనుంగొనుచుండ సుందరీ!. ౪౩౬

సీ. ఆతూపుగమితాఁకుచేత నిశ్చేతనుఁడై మూర్ఛఁగొని యుంచుకంత సేపు
తెలివొంది తదుపరి ధీరుఁ డింద్రజి చలింపకయున్న శూరు లక్ష్మణునిఁ జూచి
కనులు రక్తిమఁ గ్రక్క గ్రక్కున నెదు రేఁగి, క్రూరసాయకములఁ గూర్చి వింట
నాజినందన! ప్రథమాజిలో నీవు నిర్వక్ర మానాదుపరాక్రమంబు
గీ. చూడకుంటివి కాఁబోలుఁ, జూపువాఁడ, నిపుడ కదలక నిల్వు మట్లె యటంచు
సాహసమ్ముగాఁ బల్కి సత్వరంబ, బాణసప్తకమునఁ గొట్టె భానుకులుని.

క. సునిశితధారామండిత, ఘనతరశరదశకమునను గపిసింహు మరు
త్తనయునిఁ బ్రహరించె సురీ, జనము లిఁ కేమున్న దనుచు సంభ్రమము పడన్.

వ. ఇట్లు లక్ష్మణానిలజులం బ్రదరాహత దేహులం జేసి యీసుమెయి నయ్యాసురపతి
సుతుండు. ౪౩౯

ఇంద్రజిల్లక్ష్మణులు పరస్పరకవచముల భేదించుట

సీ. గురుతరక్రోధద్విగుణితవేగంబున, సమ్యక్ప్రయుక్తోగ్రసాయకముల
నూటెంటఁ బినతండ్రి నొప్పించె, నప్పుడు, సౌమిత్రి యతనిపైఁ జండభంగిఁ
గఱకుటమ్ములవానఁ గురిపించి ముంచెఁ, దచ్ఛరవిద్ధమై పైఁడిచాయఁ బొదలు
దేవారికవచంబు దెగి తిలలంబు చేసి, తునుకలై రథభూమిఁ దొరఁగె, నంత
గీ. మండిపడి మేఘనాదుండు ఖండనైక,వీరు నుద్దామవిక్రము సౌరకులజు
వేయిసాయకములఁ నేసి వ్రీలి గొనబు, కత్తళంబు దుత్తునియలు గాఁగ రమణి!.

క. ఒకనికవచ మొకఁ డీక్రియ, శకలములుగ నేసికొని నిశాతాంబకముల్
ప్రకుపితులై వీసరపోవక తలఁపడి రనికి వారు వనజాతాక్షీ!. ౪౪౧

లక్ష్మణుఁ డింద్రజిత్తు నతిశయించుట

సీ. సర్వావయవములు శస్త్రజాలంబుల, ముంచుచుఁ బూచినమోదుగుల వి
ధంబున నెత్తుటం దడిసినమేనులు, గాన్పింప నిట్టూర్పు గడలుకొనఁగ
జయ మేని మఱి పరాజయ మేని లేకుండ, నుగ్రబాణముల నన్యోన్యముఁ గడు
నొప్పించుకొనుచు నే ర్పొప్పఁ బోరిరి పెద్దకాల మవ్వీరాగ్రగణ్యు, లింత
గీ. లోన వీరుఁడు రామభద్రానుజుండు, లాఘవంబున నైదుకలంబకముల
నింద్రజిత్సారథిశిరంబు నెగురఁ గొట్టి, గుఱ్ఱములతోడఁ దేరు నుగ్గుగ నొనర్చె.

క. రెండై పడఁ గోదండము, ఖండించె, మ ఱొక్కవిల్లు గైకొని రణశూ
రుం డతఁ డెక్కిడ నదియును, దుండెము లగునట్లు మూఁడుతూపుల నేసెన్.

ఆ. విఱుగ నేసి రెండు విండ్ల వే ఱొకచాప, మందికొనఁగఁ బూనునంతలోన
బహుశిలీముఖములఁ బఱపి కారించెఁ బ్రాశిరాజసుతుని లక్ష్మణుండు. ౨౨౫

ఉ. దానికి భీమవిక్రముఁ డతం డలుకం గొని చాపహస్తుఁ డై
భానునిభంబు లౌనిశితభల్లములం బఱగించి జానకీ
శానుజు నొంచి వానరుల నందఱఁ జిందఱవంద లౌనటుల్
గా నొనరించి బాణములఁ గప్పెఁ గకుప్పులు నింగి ముంచుగన్. ౨౨౬

వ. అంత రణదక్షుండు లక్ష్మణుండు. ౨౨౭

లక్ష్మణుఁ డైంద్రాస్త్రమున నింద్రజిత్తును వధించుట

క. ఐంద్రాస్త్రముఁ గొని యెక్కిడి, యింద్రజి లక్ష్యముగఁ జేసి యిష్వాసంబుఁ
సాంద్రముగ నిష్ఠురముగ న, తంద్రతఁ జెవిదనుక లాగి తత్పరమతి యై. ౨౨౮

సీ. అఖిలేశుఁ డగుకౌసల్యయన్న పావనపాదపద్మముల్ దలఁచుచు భావమందు
దశరథరాజన్యతనయుండు శ్రీరామ, దేవుండు సత్యప్రతిజ్ఞుఁ డేని;
నీజగత్త్రియమునం దెదురులేనట్టివాఁ, డేని; ధర్మస్థిరుఁ డేని; నిరత
మైంద్రశరమ్మ! నీ వాఁగక వడిఁ బోయి, యింద్రజిత్తును వధియింపు మమ్మ
గీ. యనుచు విడువంగఁ బ్రళయకాలాగ్నివోలె, మండుచుం జని యుజ్జ్వలత్కుండలాన్వి
తమ్ము రత్నకిరీటాంచితమ్ము నైన, యసురు తలఁ ద్రుంచె నమ్మహాస్త్ర మువిద!

హతశత్రుఁ డగు సౌమిత్రిని సురలు కీర్తించుట

క. శిరము దెగి శస్త్రనిహతిఁ, ధరణిం బడ నడఁగె మేఘనాదుం డని ము
ద్బరితు లయి సురలు గీర్తించిరి కొందలపాటుదీఱ శేషాంశభవున్. ౨౨౯

క. విరులజడిఁ గురియఁ జేసిరి, మొరయించిరి దుందుభులను, మునిగణయుతుఁడై
గిరిభేది మోదమందెను, సరసీజదళాక్షి! మిన్ను స్వచ్ఛంబయ్యెన్. ౪౫౦

క. రక్షోభరవహనమునం, దక్షమ యై కంప మొందు నవని కపుడు చి
త్తక్షోభ ముపశమించెను, దాక్షాయణి! మిత్రకులజు ధైర్యము కలిమిన్ ౪౫౧

గీ. బవరమునఁ జచ్చిపడియున్న పగతుఁ జూచి
జయనినాదావృతుం డయి శ్రమము దొలఁగ
శంఖరావముఁ గావించెఁ జావఁగా మి
గిలినపొలదిండితుటుము గుండెలు చలింప. ౪౫౨

ఉ. పిమ్మట సింహనాదమును భీషణభంగి నొనర్చి జ్యారవ
ధ్వానము మ్రోఁగఁ జేసిన వనౌకసు లాధ్వని నాలకించి మో
దమ్మును బొంది తత్క్షణకృతశ్రము లై గుము లై నుతిం రొ
క్కుమ్మడి నూర్మిళాప్రియునకుంతి బాహుపరాక్రమాదులన్. ౪౫౩

వ. అంత నింద్రజిదంతకుండు సంతుష్టాంతరంగుం డయి, కృతకృత్యుం డైన తన్నుం
గొనియాడువనచరవాహిని వెంటరా, హనుమద్విభీషణసమేతమ్ముగ నగ్రజుం
డున్న చక్కటికిం బోయి, జ్యేష్ఠభ్రాతయుఁ జరాచరనేతయు విదళితపాపుండును
నారాయణస్వరూపుండు నగు రామచంద్రునకు వినయవినమితాంగమ్మునఁ బ్రణా
మమ్ము సేసి యి ట్లనియె. ౪౫౪

క. లోకత్రయకంటకుఁ డౌ, పాకారిద్వేషి నసురపతిసుతు నాజిం
గాకుత్స్థ! సంహరించితి, నీకారుణ్యమునఁ జేసి నిర్జరు లలరన్. ౪౫౫

రాముఁడు లక్ష్మణుని శ్లాఘించుట

సీ. అనవుడు శత్రుసంహరణవృత్తాంతంబుఁ, గరము నాసక్తి సోదరునివలన
నాలించి సంతోష మంది కౌఁగిటఁ జేర్చి, శిరము మూర్కొని దృఢస్నేహమునను
రాముఁ డిట్లనె, నాయనా! మేలు మేలు సంతుష్టిఁ గూర్చితివి శత్రువు నడంచి
జగతి నన్యులకు నసాధ్య మౌ గొప్పకార్యము చేసి వచ్చితి పరిక్రాంత!
గీ. మూఁ డహోరాత్రములలోన వాఁడిమగని, శక్రజిత్తు నతిప్రయాసమున శమన
పురము తెరువుఁ బట్టించితి వో; వినిహత, శాత్రవుఁడ వైతి, లేఁడు మత్సదృశుఁ డిటను.

క. ఒకమేఘనాదుఁ డడఁగుట, సకలంబును దీఱినట్ల సందేహము లే
దకలంక! కోటిజన్మము, లకు నేని భవాదృశుండు లభియింపఁడు సూ. ౪౫౭

చ. పొరలెడిపుత్రశోకమునఁ బో గొనరించెడిపూన్కి నాపయిన్
గరకరి రాఁగలండు దశకంఠుఁ డిఁకన్, విను మద్దురాత్ము దు
ర్భరవిషదిగ్ధమార్గణపరంపరలం బఱిగించి నేను న
త్వరమ వధించువాఁడ రణదక్ష! యతింపకు మేతదర్థమై. ౪౫౮

రావణుఁ డింద్రజిన్మరణమునకు దుఃఖించుట

వ. అంత నట లంకాధీశ్వరుండు హతశేషు లయినదోషాచరులవలన లక్ష్మణబాణనిహతుం డై రణస్థలిం బడినకొడుకువృత్తాంతంబు విని విహ్వలేంద్రియుఁడై మూర్ఛిల్లి, యొక్కింతతడవునకుఁ దెలివి వచ్చిన లేచి దుఃఖ మాపుకొనలేక కేవలదీనభావంబున నిట్లని విలపించె. ౪౫౯

సీ. కొడుక! పోయితె నన్ను విడనాడి నీసద్గుణంబులు నీదుకృత్యంబు లకట
మఱచిపోయెద నన్న మఱపునకున్ రావు, పాపిష్ఠసౌమిత్రిపాలఁ బడితె?
సురరాజు నోడించి చెఱఁగొన్న జెట్టివి, పరరాజుశరముల సురుఁగు టెట్లు?
తండ్రి! నీ మరణవార్తను విని చెవులార, వేలుపుమూఁకలు వెఱపు మాని
గీ. మొదలపైఁ జేతు లిడికొని యిచ్చవచ్చి, నట్లు నిద్రించు, నిఁకమీఁద నష్టదిగధి
పతులు మును లాడినదియాట పాడినయది, పాటగాఁ జెల్లుకాలంబు ప్రాప్త మయ్యె.

చ. అని యిటు లుగ్రపుత్రునకు నై బహుభంగుల నేడ్చి తోఁకఁ ద్రొ
క్కినభుజగంబు నా మిగులఁ గిన్కవహించి నిశాచరౌఘమున్
హననము సేయఁగోరి సమరావని, లెం డరుదెం డటంచు గ్ర
క్కునఁ బురికొల్పె వృక్షచరకోటులతోఁ బెనఁగన్, సతీమణీ!. ౪౬౧

వ. అట్లు రాక్షసుల రణోన్ముఖులం జేసి. ౪౬౨

రావణుఁడు సీతను జంపఁబోవుట

చ. సుతమృతిశోకతప్తుఁ డగుశూరుఁడు రాక్షసభర్త రోషరూ
షితుఁ డయి దీనిమూలమునఁ జేటొదవెం గద; కొంప కంచు మూ
ర్ఖతఁ దలపోసి ఖడ్గమును గైకొని భూమిసుతన్ వధింపఁగా
ద్రుతగతిఁ బర్విడెన్, హితము దోఁచునె మృత్యువు డాయువేళలన్? ౪౬౩

ఉ. వధ్యనుగాఁ దలంచి పయివచ్చుచున్నదురాత్ము నిర్జరా
సాధ్యు నమేధ్యుఁ జూచి భయసంచలితేంద్రియ యౌచు రాక్షసీ
మధ్యగ సీత దుఃఖమున మ్రగ్గి పలాశికులాంతకున్ బుధా
రాధ్యుని రామభద్రు మదియందు స్మరించుచు నుండెఁ బార్వతీ! ౪౬౪

గీ. ఇంతలో బుద్ధిశాలి శుద్ధాంతరంగుఁ, డమితమేధావి యగుసుపార్శ్వాభిధాన
మంత్రి యడ్డము వచ్చి సమయసముచిత, భంగి నిట్లనె రాక్షసభర్తతోడ. ౪౬౫

సుపార్శ్వుఁడు రావణునకు హిత మెఱిఁగించుట

సీ. ఏ మయ్య దశకంఠ! యిది యేమిపనియయ్య!, యుష్మాదృశుల కిట్టు లుచిత మగునె?
ధనపతి యగు కుబేరునకుఁ దమ్ముండవు, వేదంబు మున్నగువిద్య లెల్లఁ
బఠియించినాఁడవు ప్రతిభ, యుద్ధోక్తకర్మములందుఁ దత్పరమానసుఁడవు
బహువిధసుగుణసంపన్నుండ వఖిలధర్మజ్ఞుండ వమరసమ్మానితుఁడవు
ఆ. దేవ! యిట్టినీకు స్త్రీవధ ముచితంబె?, మరలు మీరుణంబ మమ్ముఁ గూడి
దాశరథుల సమరతలమునఁ బొలియించి, సీతఁ గూడి సుఖముఁ జెందఁగలవు. ౪౬౬

చ. "కొడుకులఁ జంపి సైన్యములఁ గూల్చియుఁ బేర్గలయూథనాథులం
బాడ వడఁగంగఁ జేసి రణభూమి రిపుల్ విలసిల్ల, వారిపై
నడరి జయింపలేక యొక యంగనపైఁ జని ఖడ్గధారఁ జ
క్కాడఁచె దశాస్యుఁ డిస్సి;" యనునాయపకీర్తి సహింపవచ్చునే. ౪౬౭

చ. అనవుడు ధర్మయుక్తమును నాత్మహితంబును నైనమిత్రు ప
ల్కును జెవిఁ జేర్చి సీతపయిఁ గోపము మాని దురాత్ముఁ డాదశా
ననుఁడు నెగుల్ రగుల్కొని మనంబు విమూఢముగాఁగ నింటికిం
జని యిసుమంత దేఱి హితసమ్మితుఁ డై సభ కేఁగె, భామినీ! ౪౬౮

వ. ఏఁగి సభామధ్యంబునం దాసీనుం డై. ౪౭౦

గీ. రాక్షసులతోడ మంత్రివర్గంబుతోడఁ, బగతుర వధింపఁ దగుసదుపాయ మెద్ది?
యనుచుఁ బరిపరిగతుల యోజనలు సలిపి, పోరునం జావమిగిలినవారిఁ గూడి.

క. శలభము శలభసహిత మై, జ్వాలదనలముమీఁది కుఱుకుచందంబున నా
పాలదిండితేఁడు రఘుకుల, తిలకునిపై కరిగెఁ బెనఁగ, ధీరవిచారా! ౪౭౧

రావణుఁడు రామునిధాటి కాఁగలేక పాఱిపోవుట

మ. జయకాంక్షం బఱియాన మార్కొనినరక్షస్సైన్యముల్ సర్వముల్
లయదండప్రతిమానబాణశిఖిపాల్ గావించి భూపుత్రికా
దయితుం డమ్మెయి వాఁడియమ్మునను దైత్యాధీశు వక్షమ్ము ని
ర్దయుఁ గారింప, సహింపలేక పురి కాతం డేఁగె భీతాత్ముఁ డై. ౪౭౨

చ. మగటిమిఁ బాసి యాసరణి మార్తురధాటికి నోడిపాఱి నె
వ్వగ మిగులంగ నాత్మ రఘువర్యు నమానుషవిక్రమంబు నా

శుగిసుతు దోఃపరాక్రమముఁ జూచి మ తేమియుఁ దోఁపకుంటచే,
స్వగురుని శుక్రుఁ జేరి కృతవందనుఁడై యనె మోడ్పుకేలుతోన్. ౪౨౩

రావణుఁడు కులగురు వగుశుక్రుని శత్రువధోపాయ మడుగుట

సీ. భార్గవ! శ్రీరామభద్రుండు యూథాధిపతులను రక్కసిబలఁగములను
గసిమసఁగించి లంకాపత్తనము రూపు,మాపినాఁ, డొకదండిమగఁడు లేఁడు,
కుంభకర్ణుఁడు ద్రుంగెఁ,గొడుకు లింద్రజిదాదు, లడఁగిరి, బంధువు లంతరించి,
రెంత కేని వలంతు లీరు, సద్గురు లుండ,నీ దుఃఖసందోహ మెట్లు వచ్చె?
గీ. నాపయిన్ మీకు దయదప్పెనా? యె దేనిఁ,దప్పుగావించితిన? యెదో చెప్పి యిప్పు
డరులఁ బరిగొనఁ జేసి కయ్యమున, శిష్యు,నమ్మలికఁ బాపి రక్షించు మోమహాత్మ!
వ. అని ప్రార్థింపఁ గ్రవ్యాదపతికిం గావ్యుం డిట్లనియె. ౪౨౪

శుక్రుఁడు రావణునకుఁ బాతాళహోమమును జేయు మని చెప్పుట

చ. జరిగినదానికై యిఁక విచారము గూడదు, నీవు పోయి నీ
యరులకు గోచరింపనిరహస్యతలంబున హోమకార్యమున్
జరుపుము యత్న మొప్ప, నది సాగిన దేని నిరంతరాయమై,
యరిమథనోచితంబు లగునయ్యయివస్తువు లబ్బు రావణా! ౪౨౫
చ. చెడనిరథంబు, చేవగలసింగిణి, చావనిమావు, లెంతగా
నొడసిన శస్త్రపూర్ణ మయి యుండునిషంగయుగంబు, వ్యర్థమై
యడఁగక మార్తురం గెడపునట్టియజిహ్మగపాళి, యందులోఁ
బొడమును, వానిఁ గైకొని రిపుం బరిమార్పుము, రాక్షసేశ్వరా! ౪౨౬
గీ. హవనసంభూతదివ్యరథాదిపరిక,రోజ్జ్వలాంగుఁడవై కదనోర్వి నిలుచు
నిన్ను మార్కొనఁజాలుమన్నీఁడటంచు, జగతి లేఁ,డజయ్యుఁడ వౌదు సత్య మీవు.
వ. కావున. ౪౨౭
క. చిత్తస్థైర్యముతో మద్దత్తము లగుమంత్రములను దగఁ గొనిచని దై
త్యోత్తమ! హుతవహు వేల్చి ద్వి,పత్తండము గం డడంచి జయముఁ బడయుమా.

రావణుఁడు గహాస్థలమున హోమము గావించుట

సీ. అని యుపదేశించి యసురగురుం డంప,నరిగి శీఘ్రముగ దశాననుండు
తనమందిరమునఁ బాతాళసన్నిభమైన, గుహ యొందు ద్రవ్వించి గూఢవృత్తి

లాఁతులు చొరకుండ లంకవాకిళ్లన్ని మూయించి, రక్షణమ్మునకుఁ దగిన
వారల నందందు వసియింపఁజేసి, హోమార్థమ్ము వలయుద్రవ్యముల నెల్ల
గీ. సంతరించి, గుహాప్రవేశ మ్మొనర్చి, మౌనియై యభిచారహోమమ్ము సలుప
మొదలిడియె మంత్రపూర్వకముగ గురూపదిష్టసరణి శత్రువుల వధింపఁ గోరి.

వ. దాన ధూమం బధికమ్ముగ లేచి గగనంబునం గ్రమ్మిన, విభీషణుం డవలోకించి భయాకులుండై కాకుత్స్థునకుఁ జూపి యిట్లనియె. ౪౮౨

విభీషణుఁడు రామునకు రావణుని హోమకార్యమును జెరుపవలయు నని చెప్పుట

ఉ. ఓ మహితాత్మ! రావణుఁడు హోమము చేయుచు నున్నవాఁడు, త
ద్ధూమము మింటఁ బర్విన దదే తోరముగా, నదె పాఱఁజూడు, మా
హోమము సాగ నేనిఁ జెడకుండ, జగత్త్రియ మేకమైన సం
గ్రామమునం బరాజయము గల్గదు వానికి నే నెఱుంగుదున్. ౪౮౩

ఉ. అం దుదయించుసాధనము లంది దురాగ్రహవృత్తిఁ బోరి క
మ్మందుఁడు రాకమున్న కులమండన! విఘ్నముచేఁతకై మరు
న్నందనముఖ్యదుర్జయవనాటులఁ బంపుము తెంపుఁ జూపి, వా
రందఱు దానవేంద్రుని నిరాశునిఁ జేయుదు రీక్షణంబునన్. ౪౮౪

ఉ. దానికి రాముఁ డట్లె యని తామరసాప్తకుమారు సమ్మతిన్
వానరవీరులన్ జగదవార్యుల నంగదవాయుజాదులన్
మానితవిక్రమక్రమసమగ్రుల నుగ్రులఁ బోయిరం డటం
చానతి యిచ్చి పంపె నసురాధిపుయత్నము వమ్ముఁ జేయఁగన్. ౪౮౫

అంగదాదులు రావణహోమమ్ము ధ్వంసము సేయఁ బోవుట

వ. అట్లు పదికోట్లు పంపఁబడి చుంబితాకాశం బగుప్రాకారంబు లంఘించి నిస్సర ద్ధూమంబైన రావణుధామంబు దరియ నరిగి యందు జాగరూకులై యున్న. ౪౮౬

క. కావలివారినిఁ బొడిపొడి, గావించి తురంగములను గజఘటలను బా
హావాలబాధహతులన్, జీవములకుఁ బాపి చదియఁ జేసిరి, దుర్గా! ౪౮౭

వ. అంతఁ బ్రభాతసమయంబున. ౪౮౮

క. సరమ యనువిభీషణుసుం,దరి "దశముఖుఁ డనలు వేల్చుతా వదిగో చె
చ్చెరఁ బొందు పొం"డటంచుం, గరసంజ్ఞ నెఱుఁగఁ జేసెఁ గపిబలములకున్. ౪౮౯

ఉ. శూరుఁడు వాలిసూనుఁ డది చూచి యిదా! యని డాసి, యాగుహా
ద్వారపుమూఁతబండను నుదగ్రపదాహతిఁ బిండిపిండిగా

మారిచి, లోని కేఁగి మునిమాదిరి గన్నులుమూసి యగ్నిభ
ట్టారకు వేల్చుచుండఁ జినదృఢాసనుఁ బంక్తిముఖుం గనుంగొనెన్. ౪౯౦

కపులు హోమదీక్షనున్న రావణుని హింసించుట

చ. కనుఁగొని రండటంచుఁ గపికాండముఁ జీరఁగ వార లెల్లఁ జ
య్యన గుహఁ జొచ్చి యార్భటుల నచ్చటి సేవకకోటిఁ బట్టి మ
ర్దన మొనరించుచున్ గలపదార్థములన్నిఁటిఁ బాడుసేయుచున్
దనుజకులేంద్రుకార్యము వృథాయగునట్లుచరించి, రీశ్వరీ! ౪౯౧

సీ. ప్రామఁగన్నువెట్టి మైమఱచిన బెబ్బులిన్, జెనకుటకై తారసిల్లినట్లు
వారనికినుక నిర్వైపుల మూఁగి నె, త్తురు గారఁగాఁ బండ్లతోడఁబట్టి
కొఱికిరి, నిడుపాటికొయ్యలం గొట్టిరి, చెవులలో శబ్దంబుచేసి, రాంజ
నేయుండు వహ్నిలో నేయి వోసెడి స్రువ, పాత్ర లాఁగికొని యపారకోప
గీ. మూర్తియై దానినే పూని మొగము వగుల
నడఁచె, నవ రెన్ని చేసిన నసురభర్త
ధ్యానమున నుండి యిసుమంత యేనిఁ దొలఁగఁ
డయ్యెఁ దొయ్యలి! శత్రుజయాభిలాష. ౪౯౨

వ. అట్టియెడ నంగదుం డీదశాననునపగతధ్యానుం జేయుమార్గ మిదిగా దని త్వరితం బుగ నంతఃపురంబు సొచ్చి తెలిగంటిచేడియ లూడిగమ్ముసేయ నీడులేని పోఁడిమిం జెలువొందు సౌందర్యవతి యగుమందోదరిని ననాథవలె విలపింపఁ గొప్పుపట్టి యీడ్చుకొనివచ్చి దశగ్రీవునగ్రతలంబున న్నిలువంబెట్టె. ౪౯౩

అంగదుఁడు రావణుని యెదుట మండోదరికి మానభంగము చేయుట.

సీ. రత్నభూషిత మగుఱవికను దనరెండు, చేతులఁ బట్టునఁ జించివైచె
నందుఁ గూర్చినముత్తియములు జల్లునరాలె, నలుదిక్కులందు రత్నములతోడ
మాణిక్యఖచితమై రాణించుమొలనూలు, క్రోఁతు లార్వఁగఁ బుటుక్కునఁ దెగిపడె
బిగివీడి కటినుండి ప్రియభర్త గనుచుండ, వనిత పోకముడి జల్లునను జాఱె
గీ. ప్రీలి నగలెల్ల నందందునేలమీఁదఁ, గూలె, నా చోద్యమును జూచఁగోరి యటకు
దశముఖానీతదేవగంధర్వసతులఁ, దోడితెచ్చిరి కపులు సంతుష్టు లగుచు. ౪౯౪

గీ. అంత రావణుదేవేరి కాంతు నెదుటఁ, దనకుఁ గలిగినయవమానమునకు నొక్క
పెట్ట నేడ్చుచు మగఁడుమ్ముఁ బట్టలేక, దీనయై పల్కె రాక్షసాధిపునిఁ జూచి. ౪౯౫

మందోదరి భర్తను దూఱుట

ఉ. సిగ్గనుమాట నీయెడ నశించెనొ; నీ యభిమాన మంతయుం
బ్రగ్గెనొ; హాయ మేటి కవమానము వచ్చినమీఁద నాథ! నీ
దగ్గఱఁ గొప్పు వట్టికొని తన్వి నరొ్నరు లీడ్చితెచ్చి నేఁ
డిగ్గతి భంగపెట్టఁ బరువే? యిటు లూరక చూచుచుండుటల్. ౪౯౭

గీ. తా నరయుచుండ జగతి నెవ్వాని భార్య, పాపులగు పగవారిచే భంగపడునొ;
అట్టిహీనుఁ డచ్చోటనె గిట్టవలయు, మృతియె మేలు తలంప నా బ్రతుకుకంటె.

మందోదరి యింద్రజిత్తుని దలంచి దుఃఖించుట

వ. అని పల్కి మృతుం డైన సుతుం దలంచికొని. ౪౯౮

ఉ. నాయన! యింద్రజీ! తుదకు నన్ను భవజ్జనని వనేచరుల్
మాయురె; యీడ్చితెచ్చి యవమానముఁ జేయుచునున్నవారు, మీ
నాయన జీవితాశఁ గుఃనారిని లజ్జను నుజ్జగించినాఁ
డీ యగచాట్లు నీవు నశియింపక యుండిన నాకుఁ గల్గునే? ౪౯౯

ఆ. పైని మాటయేనిఁ బడనీక సుఖపెట్టు, కొడుకు నిను గుణాఢ్యుఁ గోలుపోతి
దిక్కులేని తొత్తు తెఱఁగునఁ గడగండ్లు, నొందుచుంటి భర్తయుండి కూడ. ౫౦౦

రావణుఁ డంగదునిఁ గొట్టుట

చ. అని విలపింపఁ బంక్తిముఖుఁ డాపరిదేవన మాలకించి క
త్తిని గొని మారు మ్రోయు గుహ "దేవిని వీడుమురా" యటంచుఁ దె
ప్పున నటనుండి లేచి, కపిపుంగవు నంగదుఁ గొట్టె శైలసం
దిని! సతి వీడి పాఱఁ గటిదేశమునం దతిజాగరూకుఁడై. ౫౦౧

చ. వనచరు లెల్లవారుఁ దమవచ్చినకార్యము సానుకూలమై
తనరుటఁ జేసి తత్క్షణమ దాఁటి గుహం రఘువీరుఁ గానఁగాఁ
జని కృతకృత్యతం మనవి సల్పి ప్రహర్షముతోడ నుండి ర
య్యనఘుని పార్శ్వమం, దట దశాననుఁ డార్తిఁ గలంగు నంగనం. ౫౦౨

వ. ఊఱడింపఁ గోరి యిట్లనియె. ౫౦౩

రావణుఁడు మందోదరి నూరార్చుట

క. దేవీ! దుఃఖింపకు మిది, దైవకృతం, బింక నిశ్చితజ్ఞానంబుం
నీవు వడయు మఖిలంబును, జీవులకుం గర్మవశతఁ జేకుఱుచుండుం. ౫౦౪

సీ. మానసస్వచ్ఛహార్శ్య్యమున నేమాత్రమును, జోటువెట్టకు పాదుశోకమునకు
నజ్ఞానసంభవం బది, దానికతన జ్ఞానముగూడఁ గ్రమముగ నాశ మెనయు,
ఆత్మ గానట్టి దేహాదులయందు నే ననుబుద్ధి యజ్ఞానమున నె దేహి
కొదవుచునున్నది, మదిరాక్షి! జడములం బొడమెడి యా యహంబుద్ధివలన

గీ. దారపుత్రాదిరూపసంసార మమ్యె, హర్షశోకముల్ లోభమోహములుభయముఁ
గ్రోధమును స్పృహ మున్నగుగుణగణంబు, గలిగెఁ దత్సంస్మృతిని జన్మకారియగుచు.

వ. జన్మమృత్యుజరాదుల కవిద్యయ మూలకారణంబు. రమణీ! యాత్మకు వీనితో నెట్టి సంబంధమును లేదు. అతండు దృశ్యప్రపంచభిన్నుండును, శుద్ధుఁడును నద్వితీయుఁడును, జ్ఞానానందస్వరూపుండును, షడ్భావవికారదూరుండు నై యున్నాఁడు. ఇతరవస్తుసంయోగవియోగంబు లా నిర్గుణబ్రహ్మంబునకు సంభవింపవు. కావున నట్టి యాత్మనుగ నిన్ను నీ వెఱింగికొని దుఃఖంబు మానుము. ౫౦౬

ఉ. ఏ నిపుడేఁగి సంగరమహీస్థలికిన్ భుజశక్తి రాఘవున్
సానుజుఁ గూల్చి వచ్చెదను, నట్లొకవేళ ఘటింపకున్నచోఁ
బ్రాణము వాసి వజ్రనిభబాణపరంపరచేఁ, దదీయసం
స్థానగతుండ నై చెడనిసౌఖ్యము నొందెద, మందగామినీ!. ౫౦౭

ఉ. నిక్కమ యేని నేను మరణించుట; యస్మదనుజ్ఞఁ గొంపకుం
డెక్కలి యైనసీతను వధింపుము చంపకనాస! యాపయిం
జక్కఁగ నుత్తరక్రియలు సల్పుము నా, కటుగానిచో సుధా
భుక్కులు మెచ్చఁ జిచ్చుఱికి పుణ్యగతిం గన రమ్ము సమ్మతిన్. ౫౦౮

మందోదరి రావణునకు రాముఁడు సాక్షాద్విష్ణు వని చెప్పుట

వ. అనుటయు, నమ్మాట కక్కొమ్మ యుమ్మలించి నాథా! యథార్థబోధక మగు నానుడి చెవి నిడి యావల భవదిష్టప్రకారంబు గావింపుఁడని వల్లభునితో నిట్లనియె.

క. ఒకనికి కాదు భువి నెవ్వరికి నేని జయింపరాదు శ్రీరాముని, నా
యకమణి సకలదివౌకస్సుల కతఁడు, సామాన్యుఁ డని తలంపకు మెపుడున్. ౫౧౦

క. పురుషునకుఁ బ్రకృతి కధిపతి, పరమేశ్వరుఁ డర్థిజనశుభంకరుఁడు దయా
శరధి యగుదాశరథి ప్రా, క్చరితము లద్భుతరసప్రశంసాస్పదముల్. ౫౧౧

క. ఆపదలు వొరయనీక క్ష్మా, పాపరత మెలర్ప మనువు వైవస్వతునిం
జేప యగుచుఁ గల్పాదిని, గాపాడినఘనుఁ డితండె, క్రవ్యాదపతీ! ౫౧౨

గీ. లక్షయోజనదీర్ఘ మై లావు మెఱయు, కచ్ఛపం బయి క్షీరసాగరముఁ దరుచు
వేళ మంథానశైలంబు వీఁపునందుఁ, దాల్చినట్టి మహాత్ముఁ డీ దాశరథియె. ౧౬౩

క. పాతాళమునకుఁ గ్రుంగుమ,హీతలము నొకపుడు లేవనెత్తుచు దురితో
పేతుఁ గనకాక్షుఁ జదిపిన, శ్వేతవరాహంబు సుమ్మ శ్రీరాముఁ డనన్. ౧౬౪

క. హరిపదపద్మారాధన, పరుఁ గొమరు ననేకగతుల బాధించిన ము
ష్కరుఁ గనకకశిపుఁ జీల్పఁగ, నరసింహుం డైనలోకనాథుం డితఁడే. ౧౬౫

క. దాన మడిగి మూఁ డడుగులు, దాన జగత్త్రియము నొడిసి తన భక్తున క
ద్దాని నొసఁగి బలి నడఁచిన, ధీనిధి వామనుఁ డితండె, దితిజాధీశా! ౧౬౬

సీ. అసురులు మును క్షత్రియాకారు లై జని,యించి దుర్వృత్తి గర్వించి పుడమి
కత్యంతభారంబు నావహిల్లఁగఁ జేయ, జమదగ్నిమౌనికిఁ గొమరుఁ డగుచుఁ
బరశురామాభిఖ్యఁ బ్రభవించి రాజమం,డలి నెల్ల గండ్రగొడ్డలికి నాహు
తిగ నిచ్చి ధరణి వశ్యఁగ నొనర్చికొని క,శ్యపునకు దానం బొసంగినట్టి
గీ. మాధవుం డీధరాపుత్రికాధవుండె, పద్మగర్భాదినిర్జర ప్రార్థనమున
నీనిమిత్తము భువి నేఁడు మానుషత్వ,మూనియుండిన హరి యితఁ డేను నాథ!.

ఉ. పొంచి బలాత్కృతిన్ విపినభూమిఁ జరించెడి తత్సతీమణిన్
మంచికిఁ దెచ్చినావె? కులమండన మైనకుమారువేరు మా
యించుట కీవు నల్లు నశియించుటకున్ మఱికాక; యండజుం
బంచతఁ గాంచినప్పటికి భావము మాఱ దదేమి కర్మమో. ౧౬౮

ఉ. ఇంతట నేనిఁ బంపుము మహీజను రాముని చెంతకున్, మనగ
కాంతుఁడ! తమ్మునిం బిలిచి గారవ మొప్పఁగ నిమ్ము రాజ్యమున్,
జింతలు వాయఁ గాననముఁ జేరి సుఖమ్ముగ జీవయాత్ర గా
వింతము, చచ్చి యే మనుభవింతుమె యెవ్వఁ డెఱుఁగఁ జాలెడిన్. ౧౬౯

వ. అనుటయు, దశముఖుం డిట్లను. ౧౭౦

రావణుఁడు మందోదరికి, రాముఁడు భగవంతుఁ డని యెఱిఁగియే యిట్లొనర్చితి నని చెప్పుట

చ. కొడుకులఁ దమ్ములన్ దనుజకోటుల నెల్లర నానిమిత్త మై
తొడరుట కట్లు వైరిపయిఁ దోలి శరవ్యథ వారు రాముచే
నడఁగుటఁ జూచి, కోఁచ నయి యాహవభూమిఁ బరిత్యజించి యే
యడవికొ పోయి నే బ్రదుకు టక్కట న్యాయమె? జీవితేశ్వరీ! ౧౭౧

క. తలపడి రామునితో దో,ర్బలము మెఱయఁ బెనఁగెదను, జవంబునఁ బడు న
బ్బలియునిశరముల మృతిఁ గని, జలజోదరుధామమునకు సాగెద ముదితా! ౧౧

సీ. చెప్ప నక్కఱలేదు చేడియ! నేఁ గొని, తెచ్చినజానకి లచ్చి యగుట
రాఘవుం డాదినారాయణుఁ డగుట యెఱుంగుదు, సకల మెఱింగియుండి
యే కదా, నడపితి నీకథయెల్ల "సీ, తాపతిచేఁ జచ్చి తత్పదంబుఁ
బడయుదు" నను నభిప్రాయంబుతో, మనఃప్రియ! నిన్నుమాత్రము విడిచిపెట్టి
గీ. ఘోరసంసారమును బాసి దూరముగను, శుద్ధము ముముక్షుసేవ్యంబు సుస్థిరంబు
స్మయరహితముఁ బరానందమయము నైన సద్గతికిఁ బోవువాఁడ నిస్సంశయంబు.

గీ. రామసాయకకాంతినీరమున నేఁడు, కడుగఁబడియెడు మత్పాపకర్దమంబు
చదిసి ముందుగ నారాక కెదురు చూచు, బంధునివహంబుతోఁ గూడుభాగ్య మొదవు.

సీ. అభినివేశము ద్వేష మస్మిత రాగ మ, విద్యాదు లనియెడి పెద్దపెద్ద
యలలతోడను, భ్రాంతి యనుసుడితోడను, నాలు బిడ్డలు బంధు లాప్తు లర్థ
మనుమీనములతోడ, నౌర్వానలమునకు, సరివచ్చు నాత్మరోషంబుతోడ,
వలరా జనెడిగట్టివలతోడ, వర్ణ్య మై, ఘూర్ణిల్లుచున్నభవార్ణవమునఁ
గీ. గూలి యిందాఁక నటునిటుఁ గొట్టికొంటి, దాశరథికృప మెల్లగ దాఁటి సౌఖ్య
పడెదు శుభశకునములు గన్పట్టుచున్న, వతివ! శ్రీహరిసాయుజ్య మందఁగలను.

వ. అని యిట్లు రాజ్ఞియగు మందోదరితోఁ బ్రేమమిగులఁ దననిశ్చయంబు దెలిపి
యియ్యకొలిపి. ౧౬

రావణుఁడు రామునిమీఁదికి మరల యుద్ధమునకుఁ బోవుట

సీ. అఖిలశస్త్రాస్త్రసమన్వితంబు పిశాచ, వదనభీకరఖరవాహితంబు
వితతకూబరదండయుతము వరూథసం, దర్శనీయము దృఢతరము చక్ర
షోడశసహితంబు సురుచిరసకలసం, భారపూర్ణము భయప్రదము నైన
రథము నధిష్ఠించి, రాక్షసు లత్యుగ్రు, లిరువంకలను జుట్టి యేఁగుదేర
గీ. నంత కంతకుఁ జెలరేఁగునాగ్రహమున, వదనబింబంబు జేగుఱువాఱఁ బ్రళయ
రుద్రుఁ డన దశముఖుఁడు నిర్నిద్రవృత్తిఁ, గదన మొనరింప నరిగె రాఘవునితోడ.

ఆ. అట్లు వచ్చుభీషణాకారు యుద్ధ క, ర్కశునిఁ బాఱఁజూచి కళవళపడి
బయము చెందె రామభద్రపాలిత మగు, కోఁతిమూఁక, శీతకుధరజాత! ౧౮

రావణుఁడు హనుమంతుని పిడికిటిపోటుచే మూర్ఛితుం డగుట

చ. అతులితవిక్రముండు పవనాత్మజుఁ డంత నితాంతరోష సం
భృతుఁ డయి వైరిఁ దాఁక నొకపెట్ట నభంబున కుద్గమించి, శం
బతులితముష్టిఁ బూన్కిమెయిఁ బట్టి యురమ్మునఁ గొట్టె బిట్టుగన్
ధృతిసెడి జాను వూఁతగను దేరిపయిం బడి మూర్ఛ వోవఁగాన్. ౧౨౯

రావణుఁ డాంజనేయు నగ్గించుట

ఉ. ఆగతి సొమ్మసిల్లినసురారి ముహూర్తమునన్ ససంజ్ఞుఁ డై
వేగమ లేచి చూచి కపివీరుని నీసరివాఁడు దోఁపఁ డీ
మూఁగినమూఁకయందు, బలముం జలముం గలపోటుబంట్లలో
నీ గడుసుందనమ్ము వచనీయము మెచ్చితి నిన్ను మారుతీ! ౧౩౦

వ. అనిన దశముఖున కాంజనేయుం డిట్లనియె. ౧౩౧

సీ. ఓయి రావణ! యేటి కుబ్బించెదవు ముష్టి,హాతి భవన్మృతి యిప్పు డబ్బియున్న;
నీ వన్నవిధమున నేను శూరుండ నే,కాని యాకార్యమ్ము గాకపోయె,
విను మీవఱకు జరిగిన దేమొ జరిగె మ,ద్వక్షస్స్థలమున నీబలముకొలఁది
ముష్టిప్రహారంబు ముందుగఁ గావింపు, మాపయి నిన్ను నే నట్లు చేతు,
గీ. దాన మరణింపఁ గలవు, తథ్యం బనవుడు, మంచి దని కేలుసారించి మించి పేరు
టురము గుఱిసూచి పొడిచె వాయుజుఁ బటిష్ఠ, ముష్టితలమున దానవముఖ్యుఁ డలుక.

వ. పొడుచుటయు. ౧౩౩

ఉ. నొచ్చి విఘూర్ణమాననయనుం డయి యించుక తెల్విఁ దప్పి, భూ
భృచ్చరశేఖరుం డసురభేదనదక్షుఁ డెఱింగి యంతలోఁ,
జచ్చితి వెందుఁ బోయెదు దశాస్య! యటంచు వధింపఁ బోవఁగా
నచ్చోటు వాసి యొం డెడకు నాసురభర్త దొలంగె భీతిమై. ౧౩౪

వ. అంత హనుమదంగదనలనీలులనునలువురు వనచరసింహంబులు చెలరేఁగి, తమముం
దర స్వచ్ఛందగతి వీరాలాపమ్ములతోఁ దారసిల్లునల్లఁ ద్రాగుడుమొక్కలీండ్ల నగ్ని
వర్ణ స్వర్ణరోమవృశ్చికరోమఖడ్గరోమనాముల రణభీముల నవలోకించి, యుదంచిత
పరాక్రమంబున వారిపై కుఱికియు, గండశిలలు ఱువ్వియు, జళిపించి నవ్వియుఁ, దరు
శాఖలన్ మోఁదియు, వాలమ్ములన్ బాఁదియు, నొక్కొక్కని నొక్కొక్కఁడుగ
సంహరించి సింహనాదంబులు సేసి, రామపార్శ్వస్థితు లై, రయ్యవసరమున,

రామ రావణులు పరస్పరమును శరములఁ బ్రయోగించుకొనుట.

సీ. నడగొండలం బోలునట్ల్వాగుం జెల్లుట, కసురాధిపుఁడు క్రుద్ధుఁ డగుచుఁ బెదవిఁ
గొఱికి, శ్రీరాము నుగ్రుఁ దీక్షించి, శతాంగ మాదిక్కునకుఁ దోలునట్లుచేసి,
వర్షధారల వారివాహంబు పర్వతరాజమ్ముఁ ముంచెడి యోజ, భయముఁ
బుట్టించునవియు, దంభోళితుల్యంబు లౌ సాయకంబులఁ గౌసలేయు ముంచె
గీ. దత్సమక్షిస్థితాఖిలతరుచరులను, నట్ల తూపులఁ బఱగించి యతిశయముగ
బడలు పడఁ జేసె మిగిలిన బహుగుహాలను, దిండిదం డుబ్బు మెయిఁ దన్నుఁ దేఱిచూడ.

చ. తదుపరి రాముఁ డగ్నితులితంబులుఁ గాంచనభూషితమ్ము లౌ
ప్రదరసహస్రముల్ దనుజుపైఁ గురిపించె సమాహితాత్ముఁ డై,
మదవతి! యంతలోన బలమర్దనుఁ డాకసమందు నిల్చి భూ
మిదుహితృవల్లభుం డవనిమీఁదను బంక్తిముఖుండు తేరిపై. ౹౹౩౮

గీ. నిలిచి బాణప్రయోగంబు నేర్పు మెఱయ, రణ మొనర్చుటఁ దిలకించి, రాఘవునకు
రథములేని కొఱంత దీర్పంగఁ దలఁచి, యాత్మసారథిఁ బిల్చి యిట్లనియెఁ గాళి!

మాతలి యింద్రుని పనుపున రాముని కడకు రథమును దెచ్చుట

సీ. మాతలి! చూచితే మన సేమమునకుఁగా, రావణుతోఁ బోరు రామభద్రు?
నామహాత్మునికొఱ కస్మద్రథమ్మును, భూలోకమునకుఁ గొంపొమ్ము నేఁడు
కార్యంబు సాధింపఁ గడఁగుము కాలయా, పన మొనరింపకు మనుడు, బ్రక్క
యధిపతి యాజ్ఞమై ననుపమానంబు శ, తాంగమ్ము నకుఁ బచ్చరంగుగల్గి
గీ. మానసము మాడ్కి రయముగం బఱచునశ్వ,
రాజములఁ బూన్చి జయ మబ్బ రాఘవునకు,
నాకభువనంబునుండి కన్నార్చి తెఱచు,
నంతలోఁ గొనివచ్చె నవని కతఁడు. ౹౹౩౯

వ. వచ్చి యగోచరం బగు తేరినొగలపై నిలిచి ప్రాంజలియై నృపకుంజరునితోనిట్లనియె.

మాతలి రథాదికమును స్వీకరింపు మని రామునితోఁ జెప్పుట

ఉ. రాక్షసలోకభీమ! రఘురామ! ననుం గను, మేను దేవతా
ధ్యక్షుని క్షత్త, నయ్యనఘుఁ డాత్మరథంబు భవజ్జయార్థమై
యీక్షణ మంపఁ దెచ్చితిని నియ్యెడ, కింక రణోచితంబు లౌ
నక్షయసాయకాదికము లన్నిఁటిఁ బంపెను, జిత్తగింపుమీ. ౹౹౪౧

సీ. కార్ముకం బియ్యది కాకుత్స్థ! మణిగణా, లంకృతంబై యొప్పులావు గంటె
కత్తళం బిది నృపసత్తమ! యెంతటి, పెనఁకువ నైనను జినుఁగఁ బోదు

ఖడ్గ మియ్యది దైత్యఖండన! జంభుని బవరంబునను మంచి పనిని జేసెఁ
దూణీరయుగ మిది ద్రుహిణవందిత! తూపు, లెప్పటి కప్పుడ యిచ్చుచుండు
గీ. స్యందనం బిది దేవ! విజయకరంబు, కాన తే రెక్కి సారథి నైన నన్నుఁ
గూడి పోరాడి రావణుఁ గూల్చు,మమర, భర్త వృత్రాసురునిఁబోలె భండనమున.

రాముఁడు ప్రదక్షిణపూర్వకముగ నింద్రుని రథము నధిష్ఠించుట

చ. అనవుడు వేల్పుతేని మరియాదకు సంతస మంది, మేటి స్యం
దనమునకుఁ వినమ్రతఁ బ్రదక్షిణముం బొనరించి మ్రొక్కి, యా
దినకరవంశమండనుఁడు దిక్కుల కెల్లను నాత్మతేజముం
బనుపడఁ జేయుచున్ రథముపై కరిగెఁ రయమార, నంతటన్. ౫౪౩

క. మహనీయుం డైన రఘూ, ద్వహునకు ధీమంతుఁ డయిన దశవదనునకున్
దహతహపడ జగములు రో, మహర్షణము భయదమగు సమర మయ్యె, సతీ! ౫౪౪

రాముఁడు రావణప్రయుక్తములగు నస్త్రములఁ బ్రత్యస్త్రములచే నడంచుట

సీ. ఆగ్నేయశర మేయ నసురనాథుఁడు, రాముఁ డాగ్నేయశరమున నడఁచె దాని
దైవాస్త్రమును వైవ దేవారి, దైత్యారి, దైవాస్త్రమునన తద్ధాటి మాన్పె,
నాత్మప్రయుక్తఘోరాస్త్రముల్ రెండు వ్యర్థమ్ములౌటకు నాగ్రహమ్ముఁ జెంది
యాయస్త్రవేత్త దైతేయాస్త్రమును బ్రయో, గించె వానరసేన సంచలింప
గీ. దన్మహిమఁ జేసి దశకంఠుధనువునుండి, పైఁడిపింజలబాణముల్ బయలు దేరి
యుగ్రవిషవహ్ని గ్రక్కుడు నురగము లయి, రాఘవునిచుట్టుఁ బడఁజొచ్చె రాజవదన!

చ. గణనకు మీఱి నిప్పుకలు గ్రక్కుచు నాల్కలు గోఁడుచున్న యా
ఫణిముఖభల్లముల్ సకలభాగములం బడి తన్మయంబుగా
రణభువి మాఱె, దద్విధము రాముఁడు గన్గొని సర్వలోకమా
రణకృతిదక్షగారుడశరంబు నుదగ్రత వైచె ముందుగన్. ౫౪౬

ఉ. వైచిన నేమిచెప్పుదును వామవిలోచన! దానినుండి నా
రాచము లుగ్రముల్ విహగరాజనిభంబులు వేనవేలుగాఁ
దోఁచి విరోధు లౌచిలువతూపుల నన్నిఁటి రూపుమాఁపె, దో
షాచరనాథుఁ డస్మాయి నిజాస్త్రము నిష్ఫల మౌట కెంతయున్. ౫౪౭

వ. కుంది క్రుద్ధుఁడై. ౫౪౮

రావణుఁడు రాముని నొవ్వ గొట్టుట.

క. జోరున భీకరబాణా,సారము గురిపించి బిగువునడలక ధైర్య
శ్రీ రాజిల్లుశ్రీరాముని, ఘోరాంబకపాళి నొవ్వఁగొట్టెను మరలన్. ౫౪౯

ఉ. అక్కసు దీఱఁగ దనుజుఁ డంతట వోవక పైఁడిచెక్కడంబుగా
ముక్కలుగా రథంబుపయి బోరనఁ గూలఁగ నేసి, మాతలిన్
స్రుక్కఁగ నొక్క తీక్ష్ణతరరోపమునం బ్రహరించి, కొట్టెఁ బ్రా
గ్దిక్కునునేలు వేల్పుదొర తేజుల నోజ చెడంగ నంగనా!. ౫౫౦

రాముని దీనస్థితికి దేవతలు దిగు లొందుట

సీ. ఆవేళ బవరమం, దార్తునికై వడిఁ, గాన్పించుచున్న రాఘవునిఁ జూచి
తెఱగంటికూటువు దిగు లొందెఁ, జారణుల్, విగతాసు లై పలవించి రొకట
గంధర్వపాళి బిక్కమొగంబు వైచెను, బితృగణంబులు విలపింపఁ జొచ్చె
నఖిలతాపసులు హాహాకారమున నోడు, గుడిచిరి, వానరకుంజరులు వి
గీ. భీషణాన్వితు లయి ధృతి పెంపు దక్కి, సంశయగ్రస్తు లై రామచంద్రుపట్ల
నేమి గానున్నదో యని యేడ్చి రీశ్వ, రార్పితస్వాంతముల భూధరాత్మజాత!.

క. ఇరువదికరముల నిరువది, శరాసనములను ధరించి సంగరమున న
త్తఱి మైనాకమహీధ్రము, కరణిం గనుపట్టెఁ బంక్తికంఠుఁడు, దేవీ!. ౫౫౨

వ. అంత. ౫౫౩

రాముఁడు దుర్నిరీక్ష్యుఁడై రావణుని దలపడుట

చ. బొమముడి వైచి క్రోధమునఁ, బూచిన మంకెనపూవురేవ నే
త్రము లరుణత్వముం బొరయ,రాక్షసనాథదిదృక్షు వట్లు వి
క్రమము వహించి దేవపతికార్ముకసన్నిభ మద్భుతావహా
క్రమ మగుదివ్యచాపము నొకండు కరంబునఁ బూనె వ్రేల్మిడిన్. ౫౫౪

గీ. ప్రళయకాలాగ్నిసన్నిభపటుశరంబుఁ, జేతఁ గొన లోకులకుఁ దనచేవఁ జూపఁ
దేజమునఁ బ్రజ్వలించుచు దితిజుమీఁదఁ,గవిసెఁ గాలస్వరూపుఁ డా ఘనుఁడు పడఁతి!

సీ. కోదండ మెక్కిడి గుణరావముం జేసి, కూర్చి శరంబుఁ జెకొలఁది లాఁగి
ప్రహరించి లంకాధిపతిని వానరసేన, నుబ్బించి దనుజుల యు బ్బడంగఁ
బ్రళయకాలాంతకుభంగిఁ బ్రకాశించె, నరిమీఁది కలుకతో నరుగునపుడు
రాముపక్త్రిముఁ జూచి రహిచెడి సకలభూ,తములు భయంపడె, ధరణి వడఁకె

గీ. దారుణోత్పాతములు వైరిఘాటిఁగూడి, పంక్తికంఠునిఁగూడ డీల్పడఁగఁ జేసె
సమరులు విమానములనిల్పి యరసి రా జగత్ప్రళయతుల్యఘోరసంగ్రామ మువిద!

రాముఁ డైంద్రాస్త్రమున రావణుని శిరముల నఱకుట

చ. కనలుచు నైంద్రబాణమును గైకొని రావణుమస్తకంబుఁల
దునుమఁగఁ గ్రొత్తనెత్తుటను దోఁగుచు వేగమ మింటినుండి భూ
మిని బడసాగెఁ బో; యులివు మేకొనఁ దాళమునుండి పండ్లునా,
వనజదళాయతాక్షి! రిపువర్గము దానఁ జలించె నెంతయున్. ౫౫౮

సీ. అమ్మహారణరంగమందు రే యనికాని, దిన మని కాని సందెయని కాని
తెలియరా కుండెను, దిఙ్నిర్ణయముగూడ, దురవగాహం బయి తోఁచెఁ, బంక్తి
కంఠునిరూపంబు గన్పట్టదయ్యెఁ, దద్విధ మెల్లఁ గాకుత్స్థవీరుఁ డరసి
యాశ్చర్యరసనిమగ్నాత్ముఁ డై యప్రతిహతశాతసాయకవితతిఁ బఱపి
గీ. న్యూనతాధికతలు లేక యొక్కరీతి, నలరి మఱిమఱిమొలచెడి యరిశిరముల
నఱకె నేకోత్తరశతంబుఁ దెఱపిగొనక, తెఱవ! తెఱగంటిదొర తన్ను దేఱిచూడ.

క. తల లెన్నిసార్లు దునిమినఁ, బలలాశిప్రభువు తొంటిపగిది రథమునం
దలరారుఁ గాని ప్రాణంబులను దొరఁగి కలన శాంతిఁ బొందఁడు దేవీ! ౫౫౯

వ. అపుడు సమస్తాస్త్రవేత్తయు, జగత్కర్తయు, ధీరుండును, జితారిపీరుండును, గౌస
ల్యానందవర్ధనుండును, ఖరాదినరాదమర్దనుండును, బహువిధాయుధోపేతుండును,
రఘుకులవిఖ్యాతుండును, నైన రాముండు తనమనంబున నిట్లు విచారించె. ౫౬౦

రాముఁడు, రావణుని చావమికి విచారపడుట

ఉ. కడిమియు యుద్ధకౌశలముఁ గల్గినరక్కసు మొక్కలీండ్ల ను
క్కడఁచినమామకాంబకము లక్కట; యి ద్దనుజాధినాథునిన్
గెడపెడిపట్లఁ గేవలము నిష్ఫలతం గనె, నింక నేక్రియన్
మఱియుఁ గలందు? వీనితెగుమార్గముఁ జెప్పెడివార లెవ్వరో. ౫౬౧

క. నఱుకఁబడినతల లన్నియు,మఱి మొలచుటఁ జూడ దైవమహిమ యెదో యీ
తెఱగంటిగొంగ చెంగటఁ, బరఁగెడు నని తోఁచుచుండె భావంబునకున్. ౫౬౨

క. అని చింతావ్యాకులుఁడౌ, నినకులమండనునితోడ నిట్లనె నికటం
బున నున్నవిభీషణుఁ డో,య్యన నగ్రజుగుట్టు దెలియునట్లు భవానీ!, ౫౬౩

విభీషణుఁడు రామునకు రావణుఁడు చచ్చు నుపాయమును జెప్పుట

చ. వలదు విచార మిట్లొదను, వారిజగర్భువరంబు పెంపునన్
దలలును జేతులుం దెగియు దానవభర్తకుఁ దొంటిరీతిగా
మొలచుచునుండు, ఘోరతపముం బొనరించుట నిట్టిశక్తికిన్
నెల వయినాఁ డితం, డయిన నీకు నసాధ్యుఁడు గాఁడు రాఘవా! ౫౬౪

గీ. అసురపతి నాభిదేశంబునందుఁ గుండ, లాకృతిని నమృత మున్నది యనఘ! నీవు
దాని నుద్దండపావకాస్త్రమున నెండఁ, జేయు మంతటితో మృతిఁ జెందఁగలఁడు.

రాముఁ డాగ్నేయాస్త్రమున రావణుని నాభిస్థానమును భేదించుట

వ. అనుటయు శీఘ్రపరాక్రముం డయిన శ్రీరాముండు. ౫౬౬

క. అనలాస్త్రముతో నొకశర,మును నభిమంత్రించి దైత్యమూర్ధన్యుని బొ
డ్డునకు గుఱిఁ జూచి భయద,ధ్వని మీఱఁగ వైచెఁ దత్సుధారస మింకన్. ౫౬౭

చ. అమృతముఁ జింద నేసి యటు లమ్మహనీయబలుండు త్రోన మూ
ర్ధములను బాహులన్ నఱకె, దాని కతండు రుషాకషాయిత
క్రముఁ డయి భీకరం బశనికల్పము నౌ పెనుశక్తిఁ బూని మ
స్తము గుఱిఁ జూచి వైచెఁ దనతమ్మునిపైఁ గడతేర్పఁ గోరికన్. ౫౬౮

ఉ. ఱిచ్చవడన్ వియచ్చరులు జివ్వన మంటలఁ గ్రుమ్మరించుచున్
వచ్చెడుదానిఁ జూచి బలవంతుఁడు రాముఁడు జాగరూకుఁ డై
చెచ్చెర రెండుఖండములు సేసెను మధ్యను వజ్రివజ్రమున్
బొచ్చుగ నెంచుకాంచనమనోహరశాతశిలీముఖంబులన్. ౫౬౯

రావణుఁడు తేజోహీనుఁ డగుట

క. కలనం దలలం దునుముట, వలనం గ్రతుభుగ్విరోధివరునకుఁ దేజ
స్ఖలనం బయ్యెను, నాకృతి, విలసనము దొరంగె, ముడిఁగె వీర్య, మపర్ణా! ౫౭౦

క. పదునెనిమిదికరములుఁ దొ,మ్మిదితలలును బుడమిఁ బడియె మేని కెడము లై,
తుద రెండుచేతులును నొక, వదనంబును మిగిలె నెల్లవారికి వలెనే. ౫౭౧

చ. ప్రకృతివిరుద్ధరూప మిల భావ్యముగా దని మార్చుపోల్కిఁ, జం
డకరకులావతంస మటు నాకివిరోధిశిరఃకరంబులన్
వికలముఁ జేయఁ, గ్రుద్ధుఁ డయి వేలకు వేలుగ నుగ్రసాయక
ప్రకరము లొక్కపెట్ట రఘురామునిపైఁ గురిపించె నంబికా! ౫౭౨

క. రాముఁడు నట్టులె బాణ,స్తోమము వర్షించె, నపుడు తుములం బై యు
ద్ధామ మయి రోమహర్షణ,మై మిగిలె రణంబు వారి కన్యోన్యంబున్. ౫౮౩

మాతలి రావణవధమునకు రాముని బ్రోత్సహించుట

సీ. ఆసమయమున సునాసీరుసారథి, జానకీశున కిట్లు జ్ఞప్తిచేసె,
రఘుకులసత్తమ! రావణుం బరిమార్ప, బ్రహ్మాస్త్రమును వేగ సంపు మయ్య
సురగణనిర్ణీతమరణకాలము వీని కాసన్న మైన, దీ యదనునందు
శిర మెంతమాత్రమ్ము ఛేదింపఁ బోకుము, తలఁ దున్మి కడతేర్పఁ దగినవాఁడు
గీ. కాఁ డితఁడు, మర్మపుంజోట్లు గాడ నేసి, చంపఁగావలె ననుడు, సంస్మారితుఁడయి
కోడెత్రాఁచుగతిఁ బుసగొట్టుచున్న, యుగ్రశరము తూణీరమునుండి లాఁగె.

రాముఁడు రావణుని సంహరించుట

సీ. పార్శ్వభాగంబునం బవనుండు, ములికి న,గ్నార్కు లుం, గనుపులయందు దివ్య
తేజఃపరీతు లౌదిక్పతు, లెద్దాని, కలరారుచుండు; రేయమ్ము దేహ
మాకాశమయము, హేమాద్రియు మందర,పర్వతంబును దేని బరువుదెలియు
తఱి స్మరణకు వచ్చుఁ; దపననిభప్రభ, దీపించు నెయ్యది తీక్ష్ణ మగుచు;
గీ. నెది జగద్భయనాశకం; బెది మహోగ్ర, మెద్ది జాజ్వల్యమాన మై యుద్ది గనదొ;
యట్టిశరమును మంత్రించి యాగమోక్త,సరణి సంధించె నిజశరాసనమునందు.

క. ఆకాండము చాపంబునఁ, గాకుత్స్థుం డెక్కుపెట్టుకాలంబునఁ జీ
కా కయ్యె భూతతతి భీ,వ్యాకులతఁ గిరియుతముగ నవని వడంకెన్. ౫౮౪

చ. ధనువును బూన్చి పట్టి చెవిదాఁకఁగ హుమ్మని లాఁగి మర్మభే
దనకరమున్ విరోధిజనతాహరణ మ్మగు నమ్మహాస్త్రమున్
గనుఁగవ కెంపుసొం పెనయఁ గావిరి గప్ప నజాండ మంతటం
గనలుచు వైచె దేవి! దశకంఠునివక్షము లక్ష్య మౌనటుల్. ౫౮౮

సీ. జంభారిదోస్తంభసంప్రయుక్తం బగు, దంభోళికరణి దుర్ధర్ష మగుచు
జగముల నన్నిఁటి సమయింపఁ గవియు కాలాంతకుగతి భీకరాస్య మగుచుఁ
గిలికిలారావ నాభీలత నుమియుచుఁ, దీవ్రగతిం బోయి ధీరుఁ డైన
పంక్తికంధరుమీఁదఁ బడి ఘా మ్మనుచు ఱొమ్ము, బ్రద్దలు గావించి బిద్దఁ జేసి
ఆ. ధారుణీతలమ్ముఁ దూఱి నిమేషార్ధ,మునకు వచ్చె నంపపొదికి మరల,
సాటిసాయకములు చాఁగు చాఁ గని బహు,గతులఁ బొగడి తన్ను గౌరవింప.

గీ. శరము దొడిగిన పెనువిల్లు కరమునుండి, జాఱి పడియెను రాక్షసచక్రవర్తి,
కాలఁడును గూలెఁ బుడమిపై నసగతాసువగుటఁ దిరుగుడువడుచుఁ దదమితశక్తి.

క. మృతుఁడై పతి క్షితిఁ గూలుట, హతశేషాసురులు సూచి, యత్యంతభయా
న్వితులై గతి గానక ద్రుత,గతిఁ బరుగిడి రపుడు నాల్గుకడలకు, దుర్గా! ౫౮౦

క. జితకాశులు కీశులు రఘుపతివిజయము లాఁతిచావు బహుభంగుల ను
ద్ధతి నుగ్గడింపు చతిహర్షితులై కావించి రొకట సింహధ్వనులన్. ౫౮౧

రావణదేహమునుండి వెడలిన దివ్యతేజము రామునిలోఁ గలియుట

సీ. అంతరిక్షంబునం దంత మంగళకరం,బగు దేవభేరి మ్రోయంగఁ దొడఁగెఁ,
బుష్పవర్షము రఘుపుంగవుపై నెల్లఁ,గురిసె, మహర్షులు సురలు సిద్ధ
చారణుల్ వేర్వేఱ సన్నుతించిరి, రంభ, మున్నగు నచ్చరకన్నె లాడి
రానందమున గగనాంగణమందు, న,త్తఱి దశగ్రీవునితనువునుండి
గీ. దినకరసమాన మగు దివ్యతేజ మొండు, లేచి నిర్జరలోకంబు సూచుచుండ
నద్భుతంబుగఁ జిన్మూర్తి యైన కౌసలేయు కాయంబునందు విలీన మయ్యె. ౫౮౨

దేవత లాశ్చర్యపడుట

వ. అప్పుడ వ్వింత చెయిదమునకు నభశ్చరు లాశ్చర్యరసనిమగ్నులై యి ట్లనుకొనసాగిరి. ౫౮౩

సీ. మనము దేవతలము మహితసత్వగుణ ప్ర,ధానుల మిందిరాధవకటాక్ష
పాత్రుల,మైనను భవమునం బడి భయ,దుఃఖాదిబాధలఁ దోఁగుచుంటి,
మితఁ డన బ్రాహ్మణహింసకుండు ఖలుండు, దోషాచరుఁడుఁ దమోదూషితుండు
మాధవవిద్వేషి మానిమారకుఁడు ప,రాంగనారతిఁ జెరలాఁచువాఁడు
గీ. లోకకంటకుఁ; డిట్టిపట్లాకి కఖిల,భూతములు గాంచుచుండ నేరీతి రామ
భద్రతాదాత్మ్య మొదవెఁ? దత్పాపరాసు,లేమి యయ్యెను దీనికి హేతు వెద్ది?

నారదుఁడు వేల్పులకు రావణుఁడు రామునం దైక్యమగుటకుఁ గలకారణమును దెల్పుట

క. అని యనుకొనుతఱిఁ గలహా,శనముని సురలార! ధర్మశాస్త్రము సర్వం
బును మీ రెఱిఁగినవారలు, వినుఁ డీవిషయంబు దెలియ వినుపింతుఁ దగన్. ౫౮౪

ఉ. వైరము కారణంబుగ దివంబులు రాత్రులు రావణుండు సీ
తారమణుం స్మరించుచు నెదన్ భటవర్గముతోడఁ గూడి త
చ్చారుచరిత్రముం బఠన సల్పుచు ద్వేషభరీతదేహుఁడై
యారయుచుండు స్వప్నముల న మ్మహనీయుని మాటిమాటికిన్. ౫౮౫

క. "మృతి గలుగుఁ దనకు సీతా,పతికి తమున" ననుచుఁ దెలిసి భయ మంది తదా
కృతినె కనుంగొనుచుండును, బ్రతిదినమును దశముఖుండు ప్రతిదిశయందున్.

ఆ. ఉపకరించె సద్గురూపదేశముకంటె, మిన్న యగుచుఁ గ్రోధ మన్నిలింప
వైరి, కంతమందు శ్రీరామశరహతి,దోరి నిఖిలపాపదూరుఁ డయ్యె. ౫౮౮

క. బంధవిముక్తుం డై పరిపంథుల రగుమీరారు వెలుగుచుండె నా రక్షు
స్సింధురము జానకీపతి, బంధురసాయుజ్యసుఖముఁ బడయఁగఁ జాలెన్. ౫౮౯

క. అని వినిపింపఁగ నారద,మునివనజాసనుఁడు, పంక్తిముఖుభాగ్యము రా
ముని యద్భుతమాహాత్మ్యము, వినుతించిరి సురలు వేయివిధముల సుదతీ!

శ్రీరామ ప్రశంస

సీ. పాపిష్ఠుఁ డైన దుర్భగుఁ డైన పట్టితి,ఘ్నుఁ డైన కృతఘ్నుఁ డైన విశ్వాసదూరుఁ
డైనఁ బరస్త్రీలయందుఁ బరార్థమ్ము,నందు నాస్థ వహించునట్టిఁ డైనఁ
బ్రాణభీతినో స్నేహభావంబుననో సదా, శ్రీరాముః భావించి చెల్లె నేని;
సదమలహృదయుఁ డై జన్మశతంబులఁ, దోఁచెడి బహువిధదోషరాశిఁ
ఆ. బాసి తత్క్షణంబ ప్రభవిష్ణు వగు రామ,భద్రు కరుణఁ బద్మభవవినుతము
శోకరహిత మైన వైకుంఠనామాద్య,పదముఁ బడయఁ గలఁడు, పంకజాక్షి! ౫౯౧

సీ. మూఁడులోకములకుఁ గీడుఁ గావించిన, రావణుం బరిమార్చి రణమునందు
వామహస్తమ్ముచే వసుధపై విలుమోపి, యొయ్యారముగ నిలుచుండి వాఁడి
కోలను గిరగిరఁ గుడిచేతఁ ద్రిప్పుచుఁ, గనుఁగొన లెత్తిన కాంతి నీన
ములుకులు దగి గాయములు వడ్డమేనితోఁ, గమలాప్తకోటిప్రకాశ మొప్ప
గీ. వీరలక్ష్మీపరిస్ఫూర్తి విగ్రహమున, కమర నలరారు దేవతాధ్యక్షువంద్యుఁ
డార్తరక్షావిచక్షణుం డరివిదారి, కౌసలేయుండు రక్షించుగాక మనల. ౫౯౨

వ. అని మఱియు శివుండు శివ కిట్లనియె. దేవీ! యావలికథ విను మయ్యవసరమున.

రాముఁడు హనుమదాదులతోఁ దనకృతజ్ఞతను దెలుపుట

క. హనుమంతు విభీషణు రవి,తనూభవుని జాంబవంతుఁ దమ్ముని మఱిఁ ద
క్కిన వనచరులను గని యిట్లనె రఘువల్లభుఁడు ప్రముదితాత్ముం డగుచున్. ౫౯౪

క. మీ భుజబలసాహాయ్యము,చే ఖండనభూమిఁ గైకసీసుతుఁ ద్రిజగ
త్క్షోభోత్పాదకు దురిత,ప్రాభవుఁ బరిమార్చినాఁడఁ బంక్తిగ్రీవున్. ౫౯౫

చ. అరమరలేక ప్రాణముల కైనఁ దెగించి మదర్థ మిట్లు దు
ర్భరముగఁ బోరు సల్పి రిపుభారము దూరము చేసినట్టి స
చ్చరితులు మీరు, మీదగుయశం బమితంబును దేవగేయమై
ఖరకరచంద్రతారకలు గల్గెడుదాఁక వెలింగెడుం జుఁడీ! ౪౬

క. అనవద్యముఁ ద్రిభువనపావనము యశోమిళిత మైన భవదీయకథన్
గొనియాడు జను లనఘులై, కన నేర్తురు పరమపద మఖండసుఖదమున్. ౪౭

వ. ఇత్తెఱంగున వారిం బ్రశంసించు సమయంబున మందోదరీప్రముఖనిఖిలరాక్షసాంగనలును నిజరమణమరణవార్తావిశకలితాంతఃకరణ లగుచు, రణధరణింగూలియున్న రావణు నగ్రతలంబునం బడి పలువెఱంగులం బలవించిరి. విభీషణుండును మిగుల నార్తుండై దురంతదుఃఖసంవృతమానసంబున నన్నముందటఁ ద్రాలి కన్నీరు మున్నీరుగాఁ బెక్కుచందముల వందురుచుండె, నయ్యెడ రాముఁడు లక్ష్మణునితో నిట్లనియె. ౪౮

### రాముఁ డన్నకై యేడ్చు విభీషణు నూఱడింప సౌమిత్రిం బంపుట

సీ. వాపోవుచున్నాఁడు పాప మన్నకుఁగాను, ని ట్లింత యేడ్చిన నేమి ఫలము?
సౌమిత్రి! నీ వందుఁ జని తగుమాటల, నాదరింపుము రాక్షసాధినాథు
నాలసింపఁగరాదు వైళమ దహనాది,సంస్కారము లితండు సలుపవలయు,
నటు చూడు ధరఁ బతికై పొరలాడుచు, మోములు వాయఁగా మోఁదికొనుచుఁ
గీ. గఠినపాషాణములుగూడఁ గరఁగు నట్టు, లుమ్మలించుచునున్నారు కొమ్మలెల్ల
వారి నూరార్చి వైరాగ్యవచనముల నుపక్రమించునుగాత మృతక్రియలకు. ౪౯

క. అనవుడుఁ దదనుమతిం జయ్యనఁ జని మృతి గూరియున్న యన్నకడన్ దా
నును మృతుగతిఁ బడి కుందెడు, ననఘు విభీషణుని జూచి యతఁ డిట్లనియెన్.

### లక్ష్మణుఁడు దుఃఖితుఁ డగు విభీషణునిఁ దత్త్వోపదేశమునఁ దేర్చుట

సీ. వెఱ్ఱియాయేమి? విభీషణ! సామ్యంత, పోయినట్లుగను వాపోవుచుంటి,
వీ వెవ్వనిగుఱించి యింతగా దురపిల్లుచుంటివో; యాదశాస్యుండు స్వాత్మ
కం బెను బూర్వమ్ముగాని యిప్పుడు గాని, యికముందు గాని నీ కేమివరుస
వాఁ డగు? నీవును వాని కే మయ్యెద, వేమైనఁ దెలియునే యీవిషయము?
గీ. ఏటివెల్లువలోఁ బడ్డయిసుము తద్వశంబగుచుఁ గూడి వీడెడిచందమునను
గాలవశమున జీవు లొక్కతఱిఁ గలిసి, యుండు, రెడఁబాయుచుంద్రు మఱొక్కవేళ.

సీ. బొరుగులయందున బొరుగు లెట్లుండునో, యెట్లుండవో; యట్లె యీశుమాయ
చేతఁ బ్రేరితములై భూతసంతతులు తా,ముండు భూతములయం, దుండకుండు
పరికింప నెట్టిసంబంధమ్ములేని జీ,వులు పరస్పరమును గలిసికొనుట
యే; వింత యగుఁగాని; యెడఁబాయు టొక విశే,షముగాదు; రాక్షసచక్రవర్తి!
ఆ. యేము నీవు వీర లితరులుం గాల్ప్ర,భావమునను దనువుఁ బడసినాము
మార్పు ననుసరించి మనకు సంయోగ వి,యోగములు లభించుచుండుఁ జూవె.

క. చావును బుట్టుక యీరెం, డేవేళను దేనివలన నేర్పడవలెనో;
యావేళ దానివలనఁ, జీవులకుం గలుగుచుంట సిద్ధము సుకృతీ! ౬౧౩

సీ. ఫల మపేక్షింపక బాలుండు మట్టితో, బొమ్మలఁ గావించి పురుషుఁ డనియు
స్త్రీ యని వారల చిన్నిబిడ్డం డని, చెప్పి వినోదంబుఁ జేసి కొంత
తదనంతరం బొకదానితో నొకదానిఁ గొట్టి నాశంబును గూర్చుభంగి,
జననాదిరహితుఁ డీశ్వరుఁ డేవిధం బగు నభిలాష లేనివాఁ డయ్యు మొదట
గీ. దాను సృజియించినట్టి స్వతంత్రరహిత, భూతములచేత నీ సర్వభూతకోటి
సృష్టిఁ గావించి యఱరించి చెఱచుచుండు, వానిచే వాని, దీనికి వగవఁ దగునె?

సీ. దేహంబు గలుగుట దేహియనెడి పేరు, జీవున కిలమీఁదఁ జెల్లుచుండె,
బీజంబునుండియె బీజమ్ము పుట్టిన,యట్లు దేహమునుండి యన్యదేహ
ముదయించుఁ గాని; జీవోద్భవ మెన్నఁడు, గానేర, దిదియునుగాక తను వ
నిత్యమ్ము జీవుండు నిత్యుండు గాన దే,హముకంటె సంభిన్నుఁ డాతఁ డరయ
గీ. భేద మీవిధి రెంటికి విశద మైనఁ, దనువుతో నగుపొత్తు జీవున కనాది
గా వివేకము లేమిచేఁ గలిగి స్వాను,భవముఁ జెడఁగొట్టుచున్నది భవ్యచరిత!

వ. అనలోపాధి యగుకట్టెయం దున్న వక్రత్వాదివికారంబు లనలమ్మునం దోఁచురీతి నాత్మోపాధి యయిన దేహమునందలి నానాత్వజన్మనాశవృద్ధిక్షయక్రియాఫలాద్య నాత్మధర్మము లాత్మ కున్న ట్లవివేకవశమునం గన్పట్టెడు. మఱియు, సదసత్తులలో నెదియేనిఁ దనకన్న నన్యవస్తువును గట్టిపట్టుదలతో ధ్యానించువానికి భ్రమరకీటన్యాయముగఁ దద్రూపసంసిద్ధి యగు కైవడి, దేహసంబంధబలంబునం జేసి నేను నాది యనుమిథ్యాభూత మగునధ్యాసమువలన నాత్మయందు నానాత్వాదిశరీరములు గనిపించెడు. ౬౧౬

సీ. కాయసంబంధంబు గలిగియున్నను నహం,కారంబు వోడమనికారణమున
నిద్రలో నున్నవానికి భవదుఃఖమ్ము, లేశమాత్రమ్మును లేనిపగిది
ఘనత నాత్మజ్ఞానకౌక్షేయకమున సం,సృతిసింహ రాజమ్ముఁ బాత మొసర్చి

వసుధ భాసిల్లుజీవన్ముక్తునకుఁ గూడ, ననహంకృతిని శోక మావరింప,
ఆ. దోయి దానవేంద్ర! మాయామనోధర్మ, మార్యగర్హితము భవావనీరు
హలవాల మగునహమ్మమతాభ్రాంతి, విడిచిపెట్టుచో వివేక మొదవు. ౭౦౭

వ. కావున నీ వాత్మ గాని దేహాదులయం దాత్మబుద్ధి సేయక భగవంతుండును నిఖిల జగన్నియామకుఁడును నాత్మయు నగురామభద్రునియెడ మన స్సుంచి దుఃఖదూరుండ వగు, మదియుఁగాక, బాహ్యేంద్రియవిషయము లైనశబ్దాదులవలని చెలిమిం దగులువడినచిత్తమును దోషప్రదర్శనపూర్వకముగ నం దుండి తిన్నగ మరలించి సమస్తభూతంబుల కాత్మ యై మాయామానుషాకృతి నలరారు శ్రీరామ బ్రహ్మమ్మునందుఁ జేర్చుట భవంబు నేర్చుట యగు. ౭౦౮

సీ. తనువె యాత్మ యటంచుఁ దలఁచినయన్నాళ్లఁ, దలిదండ్రు లన్నలుఁ దమ్ములు సఖు
లనువ్యవహ్రాతి గల్గు, నటుగాక దేహము, కన్నఁ జిదాత్మను భిన్ను నిగను
నెఱుఁగఁజాలిన వీర లెవ్వరుఁ దోఁపరు, శబ్దాదివిషయముల్ సంపదలును
గృహిణియు గృహములు భృత్యవర్గము సతుల్, భూమియు రాజ్యంబు భోక్యనంబు
గీ. మున్నుగాఁ గల్గునివియెల్లఁ బొడము మిథ్య, యైనయజ్ఞానబలమున ననఘచరిత!
కావునను సర్వమును క్షణకాల ముండి, చంచలాలతవోలెఁ గన్పించ కడఁగు.

క. ఇఁక లెమ్ము భక్తిభావితు, నకలంకుని రామభద్రు ధ్యానింపు మెదక్
త్రికరణశుద్ధిగ, విలపింపకు సకలం బనుభవింపు ప్రారబ్ధమ్మున్. ౭౧౦

క. జరుగం బోయెడిదానికి, జరిగినదానికిని మది విచారింపకు మె
త్తతి, జరుగుచున్నదానిని, నిరసింపక యనుసరింపు, నీకు శుభం బౌ. ౭౧౧

క. న్యాయము దప్పక రాజ్యము, సేయుము రాముదెడ భక్తి సేయుము భవదో
షాయుతదూరుఁడ వై ని, శ్రేయఃపదవర్తి వగుము చింతిల నేలా. ౭౧౨

సీ. భూపతి రాముఁ డాజ్ఞాపించుచున్నవాఁ, డదె నిన్ను, మృతిగన్నయన్న కిప్పు,
డౌర్ధ్వదైహికమును నాచరింపుము యథా, శాస్త్రముగా, లోటుజరపఁబోకు,
మాత్మశుపోకకు నలమటఁ గుడిచి రో, దనము గావించు భామినులఁ గూడ
వారించి పంపుము వైశమ పురిలోని, కాలసింపకుము మహామతి! యన
గీ. నాలకించి లక్ష్మణునివాక్యము, దురంత
దుఃఖమును బాసి మోహంబుఁ దొలఁగఁ ద్రోసి
సర్వమును రోసి శ్రీరామచంద్రు డాసి,
పార్శ్వమున నిల్చి యంజలిపట్టి కొల్చి. ౭౧౩

విభీషణుఁడు దురాత్ముఁడగు నగ్రజుని కౌర్ధ్వదైహికమును జేయఁజాల ననుట

వ. ధర్మజ్ఞుం డగు విభీషణుండు రఘుపతిమతి ననువర్తించుతలంపున ధర్మార్థయుక్తం
బుగ నిట్లనియె. ౬౧౪

ఉ. సూనరుఁ గ్రూరవర్తనుని సువ్రతదూరుఁ బరాంగనారతి
ధ్యానుఁ నసత్యభాషణుని దైవవిరోధిని బంక్తికంధరున్
నే నెటు సంస్కరించుటకు నేర్తును? దుర్భరపాపదూష్య మా
పీనుఁగు నంటఁజాలఁ గృపఁ బెంపునఁ జూడుము నన్ను రాఘవా! ౬౧౫

వ. అనుడుం బ్రీతుం డై సీతాపతి యిట్లనియె. ౬౧౬

రాముఁడు రావణున కుత్తరక్రియలు సేయుటకు విభీషణు నొప్పించుట

ఉ. చచ్చినవానిపైని బగచాటుట ధర్మముగాదు, నేఁ డిటన్
వచ్చినకార్య మైనయది, వైర మిఁ కెందుకు సంస్కరింపుమీ,
కుచ్చితుఁ డంచుమానుకొనఁ గూడదు, నీ కెటు తోడఁబుట్టువో
యిచ్చపలుండు; నాకు నటులే యగు నింకఁపయిన్, విభీషణా! ౬౧౭

గీ. ఎంత యపకృతిఁ జేసిన నెట్టిక్రూరకర్ముఁ డైనను నీ కన్న గాకపోఁడు
కాన నాయాన దాఁట కగ్రజున కౌర్ధ్వదైహికక్రియ లొనరింపు త్వరితముగను.

విభీషణుఁడు రావణున కగ్నిసంస్కారాదు లొనర్చుట

సీ. అనవుడు నద్దేవునాజ్ఞను దలఁదాల్చి, ధర్మస్వభావుండు ధర్మవిదుఁడు
ధర్మచేతస్కుండు దాంతుండు నగు విభీషణుఁ డాలసింపక తానె పోయి
భర్తకై విలపించుపట్టపురాణిని, మందోదరిని మతిమంతురాలి
వదినెను ననునయవాక్యంబులం దేర్చి, తొందరపెట్టి బందుగుల నెల్లఁ
గీ. జితి నమర్చి యథావిధిఁ జేర్చి యందు, నాహితాగ్నికిఁ బోలె దశాననునకు
సర్వమును జేసెఁ బితృమేధసరణిఁ దక్క,మంత్రులును బంధువర్గంబు మలసియుండ.

వ. అనంతరము సమంత్రకముగ నగ్నిసంస్కారమ్ము సేసి, కృతస్నానుం డై యార్ద్ర
వసనమ్ముతో జలోపేతంబు లగుతిలల విధివిధానమ్ముగ దర్భలపై వదలి, గోత్ర
నామంబులు చెప్పి తిలోదకంబు లిచ్చి దండప్రణామంబు గావించి, యగ్రజునెడఁ
గృతార్థుం డయ్యె. ౬౨౧

ఉ. ఆదట సాంత్వవాక్యముల నయ్యయిభంగుల నూఱడించి, మం
దోదరి లోనుగాఁగలుగు నుగ్మలులం బురిలోని కంపి య

త్యాదర మొప్ప భూమితనయావిభుపార్శ్వముఁ జేరి నిల్చె ర
క్షోదయితుండు నిర్మలయశోలలితుండు వినీతి యేర్పడన్. ౬౨౧

ఉ. తమ్ముని భానునందనుని దానవసత్తమునిఁ వనాటసై
న్యమ్మును గూడి శత్రుజననాశనముం బొనరించి పూర్ణమో
దమ్మును జెందె రామవసుధావరుఁ డత్తఱి దుష్టవృత్తినా
శమ్మున హర్షచిత్తుఁ డగుశక్రుని కైవడి, బంధురాలకా!. ౬౨౨

క. పురుహూతుని సారథి రఘువరు వలగొని మ్రొక్కి యాజ్ఞ వడసి రథముతో
నరిగె వియత్పథమున సుర, పురమునకుఁ దదీయమహిమఁ బొగడుచు, నెలఁతా!.

విభీషణపట్టాభిషేకము

సీ. తుషితాత్ముఁ డినకులధూర్వహుం డిట్లనుఁ, దమ్మునితో, సుమిత్రాకుమార!
వాగ్రూపముగ నిదివఱకె లంకారాజ్య, మే నీ గుణాఢ్యున కిచ్చియుంటి
నెలమిమై నీ విపు డేఁగి లంకాపురీ, మధ్యభాగమున సమంత్రకముగ
బ్రాహ్మణోత్తములచేఁ బట్టాభిషేకంబు, జరపింపుమీ విభీషణున, కనుడు
గీ. వానరులతోడ వడిఁ బురిలోని కరిగి, జలధిజలపూర్ణకాంచనకలశముల శు
భంబు దీపింప నభిషేచనంబు సలిపె; నసురలోకాధిపతికి రామానుజుండు. ౬౨౪

విభీషణుఁడు పట్టాభిషిక్తుఁడై రామసందర్శనమునకు వచ్చుట.

వ. తదనంతరము నగమాకాంతుండు నానావిధోపాయనపాణులై పౌరజనంబులు వెంట రాఁ దానుం గానుకలు గైకొని సౌమిత్రిసహితంబుగఁ బురంబు వెడలివచ్చి, యక్లిష్టకర్ముఁ డగురఘుశ్రేష్ఠునకు సమర్పించి, దండప్రణామంబు సేసినఁ, బ్రాప్తరాజ్యుం డగునాతనిం జూచి రాముండు తన్నుం గృతార్థునిగాఁ దలంచికొని సహానుజుండై భానుజుం గౌఁగలించికొని యిట్లనియె. ౬౨౫

ఉ. నీ వనిలోనఁ దోడయి వనేచరసింహులతోడ నిల్చుటన్
దేవవిరోధి రావణు వధించితి నేను, విభీషణుండు లం
కా విభవాధిపత్యమును గాంచెను, భారము దూర మయ్యె భూ
దేవికి, సౌఖ్యముం బడసె దిక్పతిసంతతి, వీరశేఖరా! ౬౨౬

వ. అని వినమ్రుఁడై ప్రక్కనున్న మరున్నందనుం దిలకించి. ౬౨౭

క. హనుమా! నీవు విభీషణు, ననుమతిఁ గొని లంక కరిగి యవనిజకు దశా
నను వధముఁ దక్కు రక్షో,జనములు మరణించుటయును సకలముఁ జెపుమా.

క. నీమాట విన్నమీఁదట, భామామణి తెలుపునట్టి ప్రత్యుత్తరముఁ
సామీరి! నాకుఁ దెలుపుము, నా, మతిమంతుం డతండు నగరము సొచ్చెన్. ౬౨౯

హనుమంతుఁడు సీతకడకుఁ బోవుట

సీ. పూర్వదేవతలచేఁ బూజింపఁ బడుచు నా,గతిఁ జొచ్చి దానవపతి దశాస్య
మందిరంబున కేఁగి యం దశోకావనీ,జముక్రిందఁ గూర్చున్నసతిని దీన
వదనను రాక్షసవనితావృత ననింది, తను గృశాంగిని దుఃఖతప్త నాత్మ
భర్తృనామధ్యానపరవశురాలిని, జనకపుత్రిని గాంచి వినయవినమి
గీ. తాంగుఁడై భూమిఁ బడి నమస్కారించి, భక్తిపెంపున నంజలివట్టి ముందు
నిలువఁబడఁ, జూచి జానకి నిమిషకాల, మూఁకళింతకు రామిచే నట్లయుండె. ౬౩౦

క. తన కుంగర మిడు టాదిగ, మునుపటి విషయము సమస్తమును జ్ఞప్తికి రా,
నినకులుని దూత యీతం, డని యతని నెఱింగి పరమహర్షముఁ జెందెన్. ౬౩౧

క. త న్నంతయు గుఱితించి ప్రసన్నముఖముతోడ నున్నసతి నరసి నభ
స్వన్నందనుండు రాముం, డన్నట్టి విధంబు దెలుపఁ బ్రారంభించెన్. ౬౩౨

హనుమంతుఁడు సీతకు విజయవార్త దెలుపుట

సీ. మాయమ్మ! జానకి! మనకు జయం బబ్బె, నీ మనోవిభుఁడు శ్రీరామమూర్తి
సౌమిత్రి సుగ్రీవసహితంబుగా విభీ,షణసహాయము గల్గి సకలకపి స
మూహమ్ముతో క్షేమమున నున్నవాఁడు, పుత్రామాత్యసైన్యసమన్వితముగ
రావణు సంగరరంగంబునం గూల్చి, రహిమించు రాక్షసరాజ్యమందుఁ
గీ. దదనుజు విభీషణుని నిల్పె, ముద మెలర్పఁ, గుశలవృత్తాంత మిపుడు నీకు నెఱిఁగింప
నన్నుఁ బంపించెఁ బూర్వపుణ్యములభించెఁ, బాటుపడినందులకు నాకు మాటదక్కె.

*ఉ. "రాముని లక్ష్మణుం బ్లవగ రాజును గోఁతుల నిందుఁ దెచ్చి యే
మేమొ యొనర్చువాఁడ" నని యెన్నియొ పగ్గెలు గొట్టిపోతి వీ
వామెయి నేమి చేసి"తని యడ్గిన సిగ్గున క్రుగ్గకుండ "సా
ధ్వీమణి! చేసినాఁడ" నని తెల్పెడియోగ్యతఁ గంటి నేఁ డహో. ౬౩౪

సీత హనుమంతుని ప్రశంసించుట

వ. అనవుడు, మనఃప్రియుని ప్రియసందేశంబు విని మఱింత సంతసించి, హర్షాతిరేక
మున డగ్గుత్తికగూరినకుత్తుకతో నాయుత్తమురాలు మరుత్తనయు సద్గుణసంపన్న
తకు మెచ్చికొనుచు నతని కిట్లనియె. ౬౩౫

*క. ఆనాఁ డటు బ్రతికించితి, నానాథునివార్త చెప్పి నాయన! హనుమా!
యీనాఁడు విజయకథనము, నీ నోటనె వింటి మంటి నీమూలమునన్. ౬౩౬

సీ. నాతండ్రి! నీ కేమి చేతుఁ బ్రత్యుపకృతి, ముద్దులుగారు నీమోమునుండి
వచ్చినయీప్రియవాక్యంబునకు భూషణంబులు గాని రత్నములు గాని
యీజగత్త్రయి మఱి యేవస్తువులు గాని, తులగా వనుడు, మరుత్సుతుఁడు పలికె
దేవి! నా కిం కేమి గావలయును? శత్రుసంహార మొనరించి జయముగొన్న
గీ. సుస్థిరుని రామదేవునిఁ జూడనోఁచినాఁడ, మణిరాసు లన నేల నాకరాజ్య
మైన హీన మగుం గదా? దీనికంటె, నావు డిట్లనె జానకీదేవి మరల. ౬౩౭

సీత హనుమంతునితో రామాజ్ఞ కెదురుచూచుచుంటి నని చెప్పుట

చ. అనఘులు చెప్పుసద్గుణము లన్నియు నీకడనే వెలింగెడుఁ
జననుత! నీకు నీవ తగుసామ్యము, నామది రామచంద్రునిం
గనుఁగొనఁ దొందరించెడిని, గ్రక్కున నే నట కేఁగుదెంచు న
ట్లినకులవార్ధి తా ముదల యిచ్చును గావుత మత్ప్రియార్థమై. ౬౩౮

వ. అందులకుఁ బవననందనుండు వల్లె యని యమ్మానినీ మణికిం బ్రణామమ్ము సేసి
దాశరథిసవిధంబునకుఁ బోయి సీతాభాషితంబు సర్వంబు నివేదించిమఱియు నిట్లనియె.

హనుమంతుఁడు సీతాభిప్రాయమును రామునకు విన్నవించుట

సీ. హా! లక్ష్మణా! యని హేమమృగం బఱచినదాదిగాఁ జింతఁ జివుకుటయును
మార్తాండసుతునితో మైత్రి గావించి యసాధ్యుని వాలిని జంపుటయును
నొకపాటివాని న న్నుబ్బించి యంగుళీయక మిచ్చి పరసీమ కంపుటయును
వార్ధిని భయపెట్టి వారధిఁ గట్టి రావణుఁ గూల్ప మన మిందు వచ్చుటయును
గీ. గడిమి బవరాన జయలక్ష్మి గాంచుటయును, నే మహాదేవికోసమో; యామె నిపుడు
చూడు మనఘాత్మ! దుర్భరశోకవహ్నిఁ గ్రాఁగి త్వద్దర్శనామృతాకాంక్ష నుండె.

క. విడువక పట్టినపట్టును, గడఁగి ఫలము గలుగుదనుకఁ గష్టించితి, రి
య్యెడ జాగు సేయు టేటికి, వడి దేవిం దేరఁబంపు వసుధాధీశా! ౬౪౧

చ. అనవుడు జ్ఞానవర్తిలకుఁ డారఘురాముఁడు కృత్రిమావనీ
తనయను నుజ్జగించుటకు దానవభర్త హరింపవచ్చినాఁ
డనలమునందు నిల్పినయథార్థపుసీతను గైకొనంగ నె
మ్మనమున నెంచి వే యొకని మాని విభీషణుతోడ ని ట్లనెన్. ౬౪౨

క. వైనతేయనాథ! పొమ్మా, స్నాతఁగ మృదువిరజవసనసంశోభితఁగాఁ
బూతఁగ వివిధాభరణ, స్ఫీతఁగను నలంకరించి సీతను దెమ్మా. ౬౪౩

విభీషణుఁడు రాము ననుమతిమీఁద సీతను దోడ్కొనివచ్చుట

సీ. ఆమాట విని స్వామి! యట్లనె యని గాడ్పు,కొమరునిఁ గూడి శీఘ్రముగఁ బోయి
పతియాజ్ఞ యైనది భగవతీ! యనిచెప్పి, వృద్ధ లౌ రాక్షసస్త్రీలచేత
స్నానమ్ముఁ జేయించి చక్కఁగ దివ్యాంబ,రంబు గట్టఁగఁజేసి రత్నఖచిత
లాలితభూషణాలంకృతఁ గావించి, శి స్తగుకాంచనశిబికయందు
గీ. నెలమి నెక్కించి తలలఁ బాగలును హ స్త,తలములను వెండిబెత్తముల్ గలుగుకంచు
కీజనము గొల్వ రా నిరు కెలఁకులందు, జానకిని దోడితెచ్చెను జంద్రవదన! ౬౪౪

చ. వనచరవీరు లందఱును వచ్చెడియమ్మహిళామణిం గనుం
గొనుటకు మూఁగఁ బాఱఁ దొలఁగుండు తొలంగుఁ డటంచు దండచా
లనముల మేఘగర్జనములన్ జళిపించి యెడమ్ము సేయుచున్
దినకరవంశ్యు చెంగటికిఁ దెచ్చిరి పల్లకి సప్డు కంచుకుల్. ౬౪౫

సీ. పల్లకిపై వచ్చువల్లభ నల్లంత,దవ్వునఁ గని రఘూద్వహుఁ డి దేటి
యాగడంబు? విభీషణా! యేల కంచుకుల్, వారించుచున్నారు వానరులను?
కన్నతల్లినిబోలెఁ గాంతురుగాక నేఁ,డవనిసుతం గపు లడ్డుగొనక,
పల్యంకికను డిగ్గి పాదచారిణి యయి, దేవి నాయొద్దకు రావలయు న
గీ. టంచుఁ బలికినఁ బతిమాట లాలకించి, శిబికలోనుండి మెల్లఁగ క్షితికి డిగ్గి
యక్షిసాఫల్యముగఁ గపు లరయుచుండఁ, గాలినడకను రామునికడకుఁ జనియె.

రాముఁడు సీతను బరీక్షించుట

వ. అప్పుడు రఘుపతి రాక్షసశిక్షారూపకార్యార్థమ్ము నిర్మిత యగు మాయాసీతం
జూచి పరగృహావాసవ్యాజంబున దోషనిరూపణము సేయుచు నివ్విధంబున దూ
షించె. ౬౪౭

*క. కంటికిఁ గన్పట్టినవా,ల్గంటిని బలిమిఁ గొనితెచ్చి కవఁ గూడెడిబల్
తుంటరి యింటను నిన్నా,ళ్లుంటకు యోజింపవలసి యున్నది తెలవా! ౬౪౮

*క. ముదిత! ప్రబలప్రమాణం, బెదియును లేకుండ నిన్ను నేలికొనం జె
ల్లదు, శుష్కవచనముల నా,హృదయం బణుమాత్ర మేని నిష్టపడదు సూ. ౬౪౯

వ. అనుటయు. ౬౫౦

చ. పతిపరుషప్రలాపములఁ బ్రాణము వోయినయట్టులై ధరా
సుత సయిపంగలేక యరిసూదన! లక్ష్మణ! లోకపాలికిన్
బతికిని నమ్మక మ్మొదవుభంగిగఁ జొచ్చెదఁ జిచ్చులోపలన్
శతమఘముఖ్యనిర్జరులు సమ్మదముం గన, మంటఁ జేయుమా. ౬౫౧

క. అన వదినె తెగువయును రాముని తలఁపు నెఱింగి, కాష్ఠముల నమితముగాఁ
గొని తెచ్చి పేర్చి గుట్టగ, ననలం బిడి ప్రజ్వరిల్లిన న్లొనరించెన్. ౬౫౨

సీత ప్రదక్షిణపూర్వకముగ నగ్నిని బ్రవేశించుట

క. ఒనరించి యగ్రజుని ప్రక్కను జేరి సుమిత్రపట్టి కదలక యుండెన్,
జనకసుత యంత హృదయేశునకుఁ బ్రదక్షిణము సేసి సుస్థిరభక్తిన్. ౬౫౩

గీ. అఖిలజనములు దేవరలు ఉంగనలును, వేడ్కతోఁ దన్నుఁ గనుఁగొన వేలుపులకు
బ్రాహ్మణులకును జేమొత్తి ప్రణతిసల్పి, జాతవేదుని చెంతకుం జనియె, గౌరి! ౬౫౪

చ. చని కరకంజముల్ ముడిచి జానకి, నామది సంచలింప కె
ప్డును రఘురాముపాదములపొంతన యుండుట నిక్క మేని; నీ
యనలుఁడు లోకసాక్షి యొకయాపదఁ గూర్పక నన్నుఁ గాచుఁగా,
కనుచుఁ బ్రదక్షిణించి జ్వలదగ్నిని జొచ్చెను ధీరచిత్తయై. ౬౫౫

సీ. అట్లు భగ్గనిమండునగ్గిలో నాసాధ్వి, యుఱుకుట గాంచి తత్తరము మిగుల
భూతసంతతి సిద్ధపూగంబుతోఁ గొంత, తడవు దురంతచింతను మునింగి
సకలంబు దెలిసిన చతురుఁ డయ్యును రామ, చంద్రుఁడు తనోక్కక్షణము సైత
మెడఁ బాయఁ జాలని యిల్లాలి సీతా చ్ఛలంబున వర్తించులక్ష్మి నెట్లు

ఆ. వదలుటకు సహించె? వహ్నిలోఁ బడుటను, నా సతీమతల్లి యాచరించి
నట్టిదోస మేమి? యాశ్చర్య మాశ్చర్య, మని పరస్పరమును నాడికొనిరి. ౬౫౬

బ్రహ్మాదిదేవతలు శ్రీరాముని వినుతించుట

వ. ఆసమయంబున నింద్రాదిదిక్పతులును, బ్రహ్మవిచ్ఛిఖామణి యగు బ్రహ్మయు, నార
దాదిదివ్యర్షులును, గరుడకిన్నరయక్షసిద్ధసాధ్యులును, నాగులును, బరమయోగు
లును, నచ్చరలును, దక్కుంగల దేవయోని సంజాతు లందఱును, నిరుపమానంబు
లగు విమానంబుల నధిష్ఠించి రఘుశ్రేష్ఠుని సమీపించి బద్ధాంజలిపుటులై యి
ట్లని పొగడిరి. ౬౫౭

సీ. కల జగంబుల కెల్లఁ గర్తవు విజ్ఞాన, విగ్రహుండవు సాక్షి వింతె కాక
వసువులలోనఁ బ్రభాసనాముండవు, రుద్రులలో శంకరుఁడవు లోక

సంతతి సృజియించుచతురాననుఁడ వాది,కర్త వర్కేందులు కనులు నీకుఁ,
గ్రతుభుగ్భిషక్కులు ఘ్రాణేంద్రియము; రామ!, యాద్యంతములు నీవయఖిలమునకు
గీ. శుద్ధుఁడవు బుద్ధుఁడవు గుణశూన్యుఁడవు స,దోదితుండవు ముక్తుండ వుత్తముండ
వద్వితీయుండ వొక్కండ వసదృశుఁడవు, నిత్యుఁడవు నిన్ను నుతియింపనేర్తు మెట్లు?

క. సతము భవన్మాయాసం,వృతులకుఁ దోఁచెదవు మనుజవిధమున, నామా
మృతపానలోలురకు రఘు,పతి! చిద్రూపుండ వగుచు భాసిల్లె దహో. ౬౫౯

చ. మదమున నెత్తివచ్చి పయి మమ్మగచాట్లకుఁ బాలు సేసి మా
పదవుల నన్నిఁటిం గొనియెఁ బంక్తిముఖుండు దయావిహీనుఁడై,
కదనమునందు నీ వతని గండడఁగించుటఁ జేసి నేఁడు గుం
డె దిగులు దీఱెఁ, దొంటికరణిం బదవు ల్లభియించె, రాఘవా! ౬౬౦

క. అని పలు తెఱఁగుల వేల్పులు, వినుతిం గావించి, రట్టివేళఁ బయోజా
సనుఁడు నుతింపం దొడఁగెను, బ్రణతుం డై రాము సత్యపథవర్తిష్ణున్. ౬౬౧

బ్రహ్మ శ్రీరాముని సంస్తుతించుట

మ. నిను సర్వస్థితికారణుం బ్రకృతికంటెన్ భిన్ను జ్ఞానస్వరూ
పుని నధ్యాత్మవిదగ్రణీహృదయభావ్యున్ వ్యాపకున్ భక్తవ
ర్ధను నిర్ద్వంద్వు సమస్తహృన్నిలయు సత్తామాత్రు దీవ్యద్దయా
వనధిన్ వందనపూర్వకంబుగ మదిన్ భావింతు, సీతాపతీ! ౬౬౨

సీ. దోషభూయిష్ఠమై తోఁచుట విషయసం,తతినుండి ప్రౌఢి మనస్సుఁ ద్రిప్పి
శ్రవణాదిబలమున స్వస్వరూప మెఱింగి, యపగతాజ్ఞాను లైనట్టియతులు
చాంచల్యదూరనిశ్చయబుద్ధితోడఁ బ్రా,ణాపానముల రెంటి ననువుపఱచి
ఘనకుంభకమున నెవ్వనిఁ జూచుచుందురో; యమ్మహామతికి వేదాంతవేద్యు
ఆ. నకు ననర్ఘమణికసత్కాంచనకిరీట, శోభమానునకు విశుద్ధమతికి
రవిసమాజసునకు రామభద్రున కభి,వందనం బొనర్తు వాఁడ భక్తి. ౬౬౩

సీ. మాయాగుణంబు లేమాత్ర మెవ్వని కంట, వెవ్వాఁడు జగతికి హేతుభూతుఁ
డుండె నెవ్వఁడు ప్రపంచోత్పత్తికంటెను, బూర్వ, మెవ్వనిమూర్తి పోల్పరాని
దజ్ఞాన మడఁగింప నర్హుఁ డెవండు యో,గపథప్రవర్తకకర్త యెవఁడు
మునుల వందనము లే ఘనునకుఁ జెందు నె,వ్వానికి యోగిధ్యేయపదము వొదలు
గీ. నట్టిపరిపూర్ణునకుఁ దోషితాఖిలప్ర,పంచునకు సుందరునకు నుదంచితునకు
శ్రీమనోనాథునకు రఘుశేఖరునకుఁ, బ్రణతిఁ గావింతు నిర్మల భావమునను. ౬౬౪

సీ. అస్తినాస్తిప్రత్యయములకు విషయము, గాని వానిని దేశకాలవస్తు
కృతపరిచ్ఛేదసంతతి లేనివానిని, శంకరప్రముఖనిర్జరగణంబు
సదమలవైరాగ్యసంపన్నులును బూజ, సలిపెడియడుగులజంటవానిఁ
గాలత్రయాబాధ్యు ఘను నవిలేపుని, జ్ఞానస్వరూపు నోంకారవాచ్యుఁ
ఆ.ద్రిభువనైకవీరుఁ బ్రభు నశేషాసుర,వంశవిపినదావవహ్నితుల్యు
ద్యుచరవినుతబాల్యుఁ దోషితకౌసల్యు, నిన్ను రామచంద్రు సన్నుతింతు. ౬౬౫

మ. శ్రితరక్షాపరతంత్రబుద్ధి నపరిచ్ఛేద్యుండ వయ్యుఁ రమా
పతి వై యంతట నిండియుందువు, నిరుక్తి భక్తిఁ భజింపంగ సం
స్మృతి దూరం బగు, యోగభావితమనస్సీమానుసంచారి, వీ
హితముల్ సర్వము నా కొసంగుమతి వీవే చుమ్ము సీతాపతీ! ౬౬౬

సీ. భువనజాలంబును బుట్టించి పోషించి, సంహారమొనరించు చతురమతివి
పరమేశ్వరుండవు భక్తియు శ్రద్ధయుం, గలిగినసాధులోకంబుచేత
సేవింపఁబడియెడి దేవదేవుండవు, ఘనుఁడవు శాస్త్రముల్కెక్కుండుదక్క
ననఘ! నిన్ దెలియఁ బ్రత్యక్షానుమానాది, లౌకికమానముల్ పనికిరావు
గీ. నల్లగల్వలడాలును గొల్లఁగొనెడి, కళల నీనెఁడునీడుచక్క నగుమేను,
లేదు మఱియెందు నీయందు లేని చోద్య, మరయు మనుకంప వందన మాచరింతు.

సీ. కొలఁదికి మించిన గుణరాసులవాఁడ! గతమాన మేప్రొద్దుఁ గలుగువాఁడ!
తవిలి లోకానువర్తనమున కల్లబ్బం, దావననీమలో దేవతతికి
బ్రణతి గావించినవాఁడ! ముక్కంటి ముఖ్యగువారిమ్రొక్కుల నందువాఁడ!
దేవర్షిపూజలం దేజరిల్లెడివాఁడ!, యానందఘనకంద మైనవాఁడ!
గీ. కలుముల వెలందికలయిక మెలఁగువాఁడ!, మానుషాకార! నీకు నమస్కరింతు
నింద్రియాధీనుఁ డైనవాఁ డెవఁడుగాని, నిన్నుఁ దెలియంగఁజాలఁడు నిశ్చయంబు.

సీ. గరుడపచ్చలవన్నె నిరసించునసిమించు, మేనితో భాసిల్లువాని, కఖిల
వేదసంతతిచేత వివిధశాస్త్రములచే, తను బ్రతిపాదింపఁ దగినవాని
కపు డిపు డనక యెల్లపుడును నొకరీతిఁ, గోట్యర్కదీప్తి వెల్గొందువాని
కానందరూపున కరయుద మన్నను, నాద్యంతములు దోఁపనట్టివాని
గీ. కస్మదీయసేవాదుల నందికొన న,రాకృతిం దాల్చినమధురాధినాథు
నకును నిర్విషయజ్ఞానునకు రఘూత్త,మునకు నీ కేను మ్రొక్కెద నినకులేశ!

వ. అని వినుతించి విరించి విరమించె. ౬౭౦

చ. ఇలపయి శ్రద్ధతోఁ బ్రభుని నిష్టదు శ్యామలవర్ణు రామునిం
దలఁచుచు ముక్తిదంబు లలితంబు విరించికృతంబు నాద్య మై
యలరెడియీస్తుతిం జదువునట్టి మనుష్యుఁడు మోక్షభాక్కు కాఁ
గలఁడు, తొలంగిపోఁగలవు కల్మషజాలము లెల్ల వానికిన్. ౬౭౧

అగ్నిభట్టారకుఁడు రామునకు సీతను సమర్పించుట

వ. ఆసమయమున లోకగురుం డయిన నాళీకగర్భు సంస్తుతి నాలించి దేదీప్యమాన భూషణభూషితయు రక్తాంబరావృతనిర్మలారుణప్రభావిభాసితయు నగు జనకజను నిజాంకతలంబునఁ గూర్చుండఁబెట్టుకొని, సర్వసాక్షి యగు నగ్నిభట్టారకుండు పొడకట్టి కట్టెదుట నున్న ప్రసన్నవిపన్నివారణు నిర్జితరావణు రామునిం గని యిట్లనియె. ౬౭౨

శా. రక్షోనాథునిఁ జంపి లోకముల సంరక్షింపఁగా మున్ను మా
యాక్షోణీతనయన్ సృజించి భవదర్ధాంగిన్ విదేహాత్మజన్
సాక్షాల్లక్ష్మిని నాకడ న్నిలుపవే సర్వేశ! సర్వజ్ఞ! లో
కక్షేమంకరి! యామె యీమె మరలం గైకొమ్ము సంప్రీతిమై. ౬౭3

చ. అనుకొని నట్లు పంక్తిముఖుఁ డాప్తచమూసుతబంధురాజితో
నని మొనఁ గూలినాఁడు భవదస్త్రహతిన్, ధరణీభరంబు మా
సినయది తద్వినాశనముచే, భువనంబులు దేలెఁ, దాను వ
చ్చినపని యూటఁ గృత్రిమపుసీత తిరోహిత యయ్యె నియ్యెడన్. ౬౭౪

*క. భూభార మణఁచితివి రక్షోభర్తను సంహరించి సుస్థిరకీర్తీ!
నాభారము వాపుము సీతాభగవతి స్వీకరించి తాత్పర్యమునన్ ౬౭౫

శ్రీరాముఁడు సీతను బరిగ్రహించుట

చ. అనవుడు హర్షచిత్తుఁ డయి యప్పుడ శ్రీపతి రాముఁ డాత్మద
ర్శనజనితప్రమోదభరసంకలితన్ జ్వలదగ్నిశోభితన్
జనకసుతన్ గ్రహించి సురసంఘముఖుం బగుహవ్యవాహనున్
ఘనముగ సత్కరించెఁ గపికాండము లుబ్బఁగ, నబ్జలోచనా! ౬౭౬

వ. అట్లు సన్మానించి. ౬౭౭

ఉ. తాను రమావిభుం డగుటఁ దన్నెడఁబాయక యెప్డు నీడచం
దాన మెలంగుదాని, భువనత్రయమాతను, బంకజాలయన్

బ్రాణసఖిన్ విదేహనరపాలసుతన్ దొడమీఁదఁ జేర్చి స
మ్మానితఁ జేసె భానుకులమండనుఁ డచ్చపుఁగూర్మి పెంపునన్. ౬౭౮

### ఇంద్రుఁడు సీతాసమేతుఁ డగు శ్రీరామునిం బొగడుట

గీ. ఊరుతలమున జానకియొప్ప దీప్తిఁ, దేజరిల్లెడి శ్రీరామదేవుఁ జూచి
యలరి సురపతి డాసి కృతాంజలి యయి, యెలుఁగు గద్గదపడ భక్తి నిట్లు పొగడె.

సీ. కాఁపురం బనియెడికారడవిం గాల్పఁ, గారుచిచ్చనఁదగు పేరువాని
గట్టురాకూరిమిపట్టి డెందమునఁ గన్పట్టునానందరూపంబు వాని
నల్లగల్వలలోనినైగనిగ్యముఁ బోలి, మెఱుఁగారుచక్కని మేనివాని
మూఁడుకన్నులవేల్పు మున్నగు తెఱఁగంటి, కూటువ మ్రొక్కులఁ గొనెడివానిఁ
ఆ. పాతకంబుఁ బెంచుభవములేమికి హేతు,వైనవానిఁ బుడమి కగుభరంబు
నణఁచువాని నిరత మర్చింపఁ దగువాని, భక్తిసులభు రామభద్రుఁ గొలుతు.

క. శరణాగతజనములకుం, బరమానందామృతంబు వర్షించుదయా
కరు నీశు నిరాకారుని, నరాకారు వీరు రాము నామది నెంతున్. ౬౮౧

క. హరినిఁ బరేశు వరేణ్యునిఁ, బరమానందస్వరూపు భక్తప్రాప్యున్
సురగణదుఃఖనివారణ, పరతంత్రు స్వతంత్రు రామభద్రు భజింతున్. ౬౮౨

సీ. శ్రితలోకదుఃఖనిశ్శేషవినాశని,దానాభిధానసంధానుఁ డెవఁడు
శమదమాన్వితతపస్సంపన్నయోగీంద్ర, పావనభావాభిభావ్యుఁ డెవఁడు
శాశ్వతేతరదుర్విషయభోగసంచయ, వ్యాసంగిజనదూరవర్తి యెవఁడు
లయహఠముఖయోగలాలసమానస, మానిసన్నిధిభాసమానుఁ డెవఁడు
గీ. మిత్రపుత్రాదివానరమిత్రుఁ డెవఁడు, దీపితవిదేహజానందరూప మెవఁడు
ముఖ్యుఁ డెవఁడుచిదానందమూల మెవ్వఁ,డామహితుశరణువొందెద రామచంద్రు.

సీ. అఖిలేశ! నీవు మహాయోగమాయావి, శేషసత్త్వాదివిశిష్టుఁడ వయి
మహి విలాసమ్ముగా మానవాకృతిఁ బూని, తాదృశచేష్టలఁ దగులువడిన
కైవడి నిల్లు ప్రకాశించుచున్నాఁడ, వానందజనకలీలానిదాన
భవదీయసత్కథల్ చెవులార వినువారు, బ్రహ్మభావంబును బడయఁగలరు
గీ. నేనహంకారమనుకల్లు నాని మిగులఁ, గైపు గొని యొడ లెఱుఁగనికారణమున
నఖిలలోకంబులకును నియంత ననుచు, గర్వపడితి నింతటిదాఁకఁ గమలనాభ!

క. భువనత్రయాధిపత్యో,ద్భవాభిమానంబు నన్నుఁ బాసి చనెం, దే
కువ యొదవె మదికి నిప్పుడు, భవదీయానుగ్రహమునఁ బాతకహరణా! ౬౮౫

చ. లలి రతనాలబాహుపురులన్ మణిహారపరంపరన్ సము
జ్జ్వలుఁ డగువాని, భూసతికి భారముఁ బెంచెడిదుష్టరాక్షసా
వళి బసుమంబుసేయ దనవహ్నిగ మాఱెడువాని నుల్లస
జ్జలగుహాస్త్రనేత్రు రఘుసత్తము నిన్ను భజింతు నిచ్చలున్. ౬౮౬

మ. గరిమన్ నీలముడాలు నీలజలముక్కాంతిన్ దుటాయించు సుం
దరదేహచ్ఛవివాఁడ! దుర్మదవిరాధాదిక్షపాటప్రభూ
త్కారసంహారమునన్ జగంబులకు సౌఖ్యంబుం బ్రసాదించిన
ట్టి రమావల్లభ! నీపదాంబురుహముల్ డెందంబునం గొల్చెదన్. ౬౮౭

క. పురవైరివిజయకారణు, శరదిందుసమానవదను శశ్వచ్ఛోభా
కరరత్నకిరీటాదిక, గురుతరనృపచిహ్ను నిన్నుఁ గొలుతు మహాత్మా! ౬౮౮

సీ. బంగారమునకు మెఱుంగువెట్టిడిమేను, పొదల సౌదామినీపుంజ మట్లు
నవనవకాంతితో హావణించి ప్రియసతిన్, సీత నంకమున నుంచికొని కోటి
శుభ్రాంశుపులభంగి శోభిల్లుమాణిక్య,సింహాసనమున నాసీనుఁ డైన
వాని, నార్తియుఁ దంద్ర లేనివానిని, భక్తులకుఁ దక్కఁ దదితరులకు నలభ్యుఁ
ఆ. డైనవానిఁ, ద్రిజగదారాధ్యు ననవద్యు, నిన్ను రామమూర్తి సన్నుతింతు
నాదినుండి నీవ యాధార మమరసం, తతి కనంతశయన! దైత్యదమన! ౬౮౯

వ. కాంతామణీ! శచీపతినుత్యనంతరము విమానంబున నిన్నుఁ గూడి నభస్థలినున్న
నేను రాజీవదళాక్షుం డగు రామునితో నిట్లంటి. ౬౯౦

శంకరుఁడు రామునకు దశరథాగమనమును జెప్పుట

ఉ. తమ్ములు దల్లులుం బ్లవగతండములుం బ్రజ లుబ్బ రాజలో
క మ్మకలంకభావములఁ గానుక లిచ్చి బహూకరింపఁ బాం
క మ్మగు సింహపీఠిక నఖండమహీవలయాధిపత్యమున్
నెమ్మి వహించి వెల్గుతఱి నిన్గనవచ్చెద నే నయోధ్యకున్. ౬౯౧

గీ. ఇపుడు రామాభిధేయత నెసఁగునీదు, తనువునకుఁ దండ్రి యైనట్టిదశరథేశు
నరయు మిదె విమానస్థుఁ డై యరయవచ్చి,నాఁడు నిన్నన జానకీనాయకుండు.

క. కనుఁగొని కట్టెదుటం గల, జనకుని, ముదితాత్ముఁ డగుచు సౌమిత్రియుఁ దా
నును శిరము లంటఁ దత్పద,వనజంబుల కెఱఁగె భక్తిభావము మిగులన్. ౬౯౩

దశరథుఁడు రాముని శ్లాఘించుట

క. మ్రొక్కినముద్దులకొమరుల,గ్రక్కునఁ గౌఁగిటను జేర్చి గారాబమునన్
జక్కశిరంబుల మూర్కొని, యిక్కరణిం బలికె జానకీశునితోడన్. ౧౯౪

ఉ. దాఁటితి దుఃఖవీచిభయదం బగుపాపపుఁగాఁపురంపుమున్
న్నీటిని నశ్రమంబుగను నీకతనన్ మఱి; వత్స! తండ్రికిన్
లాటిమహోన్నతం బయినలాభము గూర్చెదునందనుం డిలం
గోటికి నొక్కఁ డేని సమకూరఁడు, నేరఁడు నిన్నుఁ బోలఁగన్. ౧౯౫

క. అని పునరాలింగితుఁగాఁ, దనయుని నొనరించి, ప్రేమఁ దత్కృతపూజల్
గొనిచనియె, నంత రాఘవుఁ,డనె నంజలివట్టియున్నయమరేంద్రునితో. ౧౯౬

రాముఁ డింద్రునితో రణనిహతులగుకపుల నమృతవర్షమునఁ బ్రతికింపుమని
ప్రశంసాపూర్వకముగఁ దెలుపుట

క. సాయముఁ జేసితి వరదము, సాయకములుఁ బంపి నాకు సమరంబున స్వ
ర్నాయక! ముద మొదవించెను, నీ యౌచిత్యంపుపెంపు నీ సన్నుతియున్.

చ. అమరపతీ! మదర్థముగ నాజి విరోధులతోఁ బెనంగి ప్రా
ణములు దొఱంగి భూతలమునం బడియుండినయీవనేచరో
త్తములు సజీవు లౌగతి సుధారసముం గురిపింపు, మొండు వా
క్యము వచియింప కిమ్మెయిఁ, నాజ్ఞ యొసంగితి నాఘ దాతఁడున్. ౧౯౮

సీ. "ఇంతకంటెను నెక్కు డేమున్న" దని రాము,ఁ డనుపు సేయుటకు సంబరముఁ జెంది
మృతి గన్న వానరతతిమీఁదఁ బీయూష,వర్షంబు వర్షింప వార లెల్లఁ
గన్నులు నులిపికొం చన్నన్న; నిదురించి, లేచెడివారు నా లేచి తొంటి
గతి బలశౌర్యముల్ గల్గి హృష్టాత్ములై, రామభూజాని పార్శ్వమ్ముఁ జేరి,
గీ. రసురులకు నమృతస్పర్శ మయ్యెఁ గాని, జీవములతోడ నొకఁడును లేవఁ డయ్యె,
నంత సాష్టాంగవందనం బాచరించి జానకీభర్తతో విభీషణుఁడు వలికె. ౧౯౯

గీ. వినుము భక్తవత్సల! భవద్విషయభక్తి, యున్నచో నాయెడన్ నేఁడు నన్ననుగ్ర
హించి సమలంకృతుఁడ వై మహీజతోడ, మంగళస్నాన మాచరింపంగ వలయు.

ఉ. స్నాన మొనర్చి తక్కఁగలసర్వము నియ్యెడఁ దీర్చి తే పయో
ధ్యానగరంబు వోవఁగఁ బ్రయాణముఁ జేయుద మన్న, జానకీ
జాని విభీషణోక్తి విని సౌమ్య! భవద్ధిత మాచరింపఁగా
నే నెటు చాలుదున్ భరతునన్ సుకుమారునిఁ బాసి యొంటిగన్? ౨౦౧

రాముఁడు భరతునిఁ జూడఁబోవలయు నని విభీషణుని సమాధానపెట్టుట

సీ. ఆతండు నిష్కల్మషాత్ముఁడు నాయందు, బహుభక్తిగలవాఁడు భవ్యమూర్తి
"యగ్రజుం డడవులం దట్లుండ నొండువిధంబున నుండు టధర్మ" మనుచు
నావలె జడలును నారచీరలుఁ దాల్చి, నిర్జితేంద్రియుఁ డయి నిష్ఠ మౌన
మూని శబ్దబ్రహ్మ మైనప్రణవమును, జపియించు చెప్పుడు సమయ మగును
గీ. నన్నుదర్శన మెపు డిచ్చు ననుచు నా కొ,
ఱకు నెదురుచూచుచున్నాఁడు రాక్షసేంద్ర!
అట్టిప్రియసోదరుండు లేనట్టిచోట
సమ్మతింపదు నాయాత్మ సౌఖ్యపడఁగ. ౨౦౨

వ. కావున నన్ను గౌరవించినట్లు భావించి తడయక సుగ్రీవప్రభృతికీశుల విశేషముగ
సత్కరింపుము. వారిపూజ నాపూజకాతలంపు, మిందు సందియంబు వల, దన
వుడు రాక్షసోత్తముం డమ్మాటకు సమ్మతించి. ౨౦౩

క. కోరిక కనుగుణముగ బం, గారము వస్త్రములు విలువగలరత్నము ల
వ్వారికిఁ గురిపించెను ధా, త్రీసుహాచరబలము దనియ ధీరవిచారా! ౨౦౪

క. దితిజాధిపుచే నటు పూ, జితు లై గంతు లిడుప్లవగసింహుల సీతా
పతి గొనియాడెను సముచిత, గతిఁ దత్కృత ముగ్గడించి, కంజదళాక్షీ! ౨౦౫

రాముఁడు సీతాలక్ష్మణులతోఁ బుష్పకవిమానము నెక్కుట

ఉ. అంత విభీషణుండు సముదంచితముగ రవిబింబతుల్యభా
మంతము నైనపుష్పకవిమానవరంబును దెచ్చినఁగ, ధను
ష్మంతుఁడు సోదరుం డనుపమానపరాక్రముఁ డైన యూర్మిళా
కాంతునితోడ నెక్కె రఘుకాంతుఁడు తన్మహనీయయానముగ. ౨౦౬

చ. స్థిరశుభకీర్తిశాలిని పతివ్రత నూతనలజ్జితాస్య పం
కరుహదళాక్షి యైన జనకప్రభుపుత్రిని నంకమందు న
బ్బురముగఁ జేర్చి వానరవిభుం డగుభానుజునిఁ విభీషణుం
గరువలిపట్టి నద్రిచరకాండముఁ గన్గొనిపల్కె నివ్విధిగ. ౨౦౭

క. శ్రమ మనక మిత్రకార్యము, సమస్తమును దీర్చి హితముసల్పితిరి మదా
జ్ఞమెయిగ మీ రింక యథే, ష్టముగాఁ బోవచ్చుఁ బ్లవగసైన్యములారా! ౨౦౮

సీ. భానునందన! సర్వసేనలతోడఁ గి, ష్కింధకుఁ జనుమీవు శీఘ్రగతిని
నో విభీషణ! విను నీవు నా భక్తుండ, వై భవదీయరాజ్య మగు లంక

యందు వసింపు, మింద్రాది దేవతలైన, నిను మార్కొనఁగలేరు నిశ్చయంబు
నేను మత్పిత్రు రాజధాని యగుననయోధ్య, కరుగఁ దలంచితి, ననుడు దనుజ
గీ. పతియు నెల్లవనాటులుఁ బ్రాంజలు లయి, యేముగూడ భవత్పురి కేఁగుదెంచి
మిమ్ముఁ బట్టాభిషేకలక్ష్మీసమేతుఁ, గాంచువారము కనులారఁ గాంతుదీఱ. ౨౦౯

క. నిను సింహాసనసంస్థితుఁ, గని వందన మాచరించి కౌసల్యకుఁ బైఁ
జనియెద మస్మద్రాజ్యం, బున కానతి యొసఁగు మట్లు పురుషశ్రేష్ఠా! ౨౧౦

రాముఁడు వానరబలముతోడఁ బుష్పకముమీఁద నయోధ్యకుఁ బయనించుట

చ. అనవుడు రాముఁ డట్లెయని, యర్కజునిం గని జాల మేటికిఁ
వనచరపాళితో నసురవల్లభుతోఁ బవమానసూనుతో
మన మలరంగ నెక్కుఁడు విమాన, మటన్నఁ దదాజ్ఞ నెక్కి రా
వనచరదానవాధిపు లపారచమూనచివాన్వితంబుగన్. ౨౧౧

క. అంద అధిష్ఠించుటయును, నందం బగు నా కుబేరుయానం బెగసెం
బొందుగ గగనమునకు రఘు,నందను ననుమతిని బడసి, నగరాడ్దుహితా! ౨౧౨

గీ. అంచగమితోడఁ దగఁ బ్రకాశించుచున్న, పుష్పకముచేత సంతుష్టిఁ బొదలు రామ
భద్రుఁ డపరచతుర్ముఖుభాతిఁ దేజ,రిల్లె నపు డెల్లహృదయముల్ పల్లవింప. ౨౧౩

గీ. అనుపమతపోధనులబ్ధంబు నర్కబింబ, సన్నిభం బగు ధనదుపుష్పకము పరమ
శోభను వహించె జానకీసోదరాన్వి,తుం డయి వెలుంగు రామచంద్రుని కతమున.

వ. ఆసమయంబున. ౨౧౪

రాముఁడు సీతకుఁ ద్రోవంగల విశేషంబుల నిరూపించి చెప్పుట

క. నలుగడలఁ బఱచి చూపును, జలజాస్త్రకులాభరణము చంద్రముఖిన్ మై
థిలి నంకస్థాయినిఁ గని, పలికెన్ సకలమ్ముఁ దేటపడ హైమవతీ! ౨౧౬

చ. అతివ! త్రికూటశైలశిఖరాగ్రమునం గల లంకఁ జూడుమా
యతులితదీప్తి భాసిలు, దిశాధిపతుల్ బలవైరిదొట్టి దే
వతలు వినమ్రులై రెవనిబాహుబలంబున కోర్వలేక, యా
ర్జితయశుఁ డెవ్వఁ డా దనుజశేఖరుఁ డేలిన దిద్దియే చుమీ. ౨౧౭

సీ. ఇటుచూడు రణభూమి యిది మాంసకర్దమ, పంకిల మగుట బీభత్సమగుచుఁ
గన్పట్టుచున్నది, కమలలోచన! రాక్షసులును వానరులును బలముకొలఁది

వెనుఁదీయ కుగ్రులై పెనఁగులాడినది యిచ్చోటనే, మామకసునిశితాస్త్ర
పాతమ్మునన్ గూలె నిఁగిలి నిర్జీవుఁడై దశముఖుం డొఱఁగె నీస్థలమునందుఁ
గీ. గుంభకర్ణుఁ డాతావునఁగూలె, దాని, కవలివైపుగ నింద్రజి త్తడఁగె, దనుజ
వాహిని సమస్తమును రణోత్సాహ మెడలి, ప్రమగ్గె నిచ్చట మనవారి కగ్గమగుచు.

క. ఆ కనఁబడునదె సేతువు, నీ కొఱ కేఁ గట్టితిని వనేచరసాహా
య్యాకలన సముద్రముపయి, రాకాచంద్రముఖి! యటు మరల్పుము దృష్టిన్.

గీ. ఇదె జగత్త్రయపూజితం బిష్టదంబు
సేతుబంధాభిధానప్రసిద్ధతీర్థ
మువిద! మహానీయుఁ డైన పయోధియందుఁ
దోఁచుచున్నది చూడు మతుల్యముగను. ౭౨౦

క. పూతము నత్యుత్తమ మగు, నీ తీర్థాలోకనమున నెసఁగు శుభంబుల్
పాతకసంఘంబులు నిర్ధూతము లగు ద్రష్టలకు విధుప్రతిమాస్యా! ౭౨౧

క. రామేశ్వరుఁ డనుపేరం, గామారిని భక్తగమ్యుఁ గామదు గిరిజా
కాముని శంకరు నే నిట, క్షేమంకరముగఁ బ్రతిష్ఠఁ జేసితి, సుదతీ! ౭౨౨

క. తనహిత మాలింపక త్రిట్టినయన్నను బంక్తిముఖు విడిచి మంత్రులతో
నను శరణు సొచ్చె నిమ్మెయి, జననుతుఁడు విభీషణుండు జనకకుమారీ! ౭౨౩

సీ. అప్పుడె కడుదూర మరుదెంచె యానంబు, తపననందను రాజధాని యైన
కిష్కింధ యియ్యది పుష్కరదళనేత్ర!, సుందరారణ్యసంశోభితంబు,
తత్త్వోపదేశంబు తారకు నిచ్చటఁ, జేసితి నని యాజ్ఞ సేయ రాముఁ,
డర్కపుత్రుఁడు వోయి యవనిజామానసం, బలరింపఁ జేయఁ దారాదివాన
గీ. రాంగనలఁ దోడికొని వచ్చె నప్పు డటకు, వారితోఁగూడ నా కలివాని యాన
మతిజవంబునఁ దరలెఁ, దద్గతిఁ గని ప్రియకాంత కిట్లనె మరల రాఘవుఁడు, గౌరి!

క. ఇది ఋశ్యమూకపర్వత, మిది మద్బాణహతి వాలి యీల్గినతా, వి
య్యది పంచవటీక్షేత్రము, మదవతి! మన మున్న యాశ్రమం బది కనుమా. ౭౨౪

గీ. అవి యగస్త్యసుతీక్ష్ణుల యాశ్రమములు, మంగళప్రదములుఁ దపోమాన్యు లమ్ము
లరుగొ; వా రందఱును మౌనివరులు మనకుఁ, గానవచ్చుచున్నారు కాంచు మబల!

చ. రమణిరో! చిత్రకూటనగరాజ మదే కనుగొమ్ము నేత్రప
ర్వముగ వెలుంగుచున్నయది, ప్రస్తుతిపాత్రుఁడు కైకపట్టి య

శ్రమ మని యంబచేఁత కలుకంగొని నన్నుఁ బ్రసన్నుఁ జేయు భా
వమున వినమ్రుఁడై కదియవచ్చెను నిచ్చోట మౌనివర్యకృతిన్. ౭౨౭

క. యమునానదితీరంబున, రమణీయం బగుచు శ్రీభరద్వాజునియా
శ్రమము పొడకట్టుచుండెను, గమలదళవిశాలనయన! కను మల్లదిగో. ౭౨౮

ఉ. దేని భగీరథుండు కులదీపకుఁ డిందుధరుం బ్రసన్నునిం
గా నొనరించి భూస్థలికిఁ గైకొనివచ్చెనొ కాపిలోగ్రవై
శ్వానరకీలలం బడినవారిఁ బునీతులఁ జేయ; నట్టి గం
గానది యీమె కాంచుము జగత్త్రియపావని, నంబుజాననా! ౭౨౯

క. యూపస్తంభసహస్రో, ద్దీపితదివిజస్తవార్హతీరతలము వ్యా
త్తాపహారము సరయూనది, చూపట్టెడు నదిగొ చూడు సురుచిరగాత్రీ! ౭౩౦

రాముఁడు భరద్వాజమహర్షిని భరతునికుశలము నడుగుట

సీ. రఘుపాలితము మనరాజధాని యయోధ్య, గోచరించెడి నదిగో మృగాక్షి!
యభివందనము సేయు మని యిట్లు సీతకుఁ, జెప్పుచు రఘువంశశేఖరుండు
జనకనిదేశవత్సరములు పదునాల్గు, గడియయుఁ బ్రిక్కఁ గడచినన్న
తోడనె పంచమినాఁడు భరద్వాజ, మౌనిచంద్రుని యాశ్రమంబు చేరె,
గీ. జేరి కృష్ణాజినాసీను శిష్యసహితు, నమ్మహాత్ముని దర్శించి యనుజుతోడ
నడుగులం బడి ప్రణమిల్లి యడిగె నిట్లు, వినయ ముట్టిపడఁగ శైలవిభుకుమారి!

సీ. నామీఁదఁ గల ప్రేమ నన్నిందు విడనాడి, పోలేక పోలేక పోయినట్టి
గుణరాశి భరతుండు కుశలియే? తదనుజ్ఞునకు రిపుఘ్ననకు ననామయంబె?
యీతిబాధలకుఁ జోటీక సుభిక్షమ్ముగా నున్నదా యయోధ్యానగరము?
మాకొఱకు నెప్పు డుమ్మలిక మున్గెడితల్లు, లూపిరితోడఁ దా రున్నవారె?
గీ. భరతుపరిపాలనము సరిపడునె ప్రజకు? నభినందింతురె మత్పునరాగమనము?
సవిధవర్తులకున్ మీకు సకల మెఱుఁగ, వచ్చు కరుణించి తెలుపుము సచ్చరిత్ర!

వ. అనిన నమ్మాటకుఁ బ్రహృష్టచిత్తుండై భరద్వాజుండు, భరతాగ్రజునితో నిట్లనియె.

భరద్వాజుఁడు రామునకు భరతుని యోగ్యతను దెలుపుట

ఆ. పురిని నీవు లేకపోయినను యొక్కటి దక్క, క్షేమమునకు లోప మేమి లేదు,
జనులకు ననుంగు పైదోడులకుఁ బౌరజనములకును గలదు సౌఖ్య మనఘ!

వ. అందు మహామనస్కుండగు భరతుండు మాత్రము. ౭౩౫

గీ. జడలు దాల్చి వల్కలంబులను గట్టి, ప్రాణరక్షకుఁ బండ్లు గందంబులను దినుచు
రాజ్యమఖిలముఁ బాదుకార్పణము సేసి, నీ కెదురు చూచుచున్నాఁడు నిర్మలాత్మ!

భరద్వాజుఁడు రాముని స్తుతించుట

సీ. ఏ మేమి దండక నీ వాచరించితో, యాదియును సీతాపహరణము మొద
లసురవధముదాఁక నైనవృత్తాంతమ్ము, సకలమ్ము మత్తపశ్శక్తిఁ జేసి
నీయనుగ్రహమున నే నెఱింగితి రామభద్ర! సాక్షాత్పరబ్రహ్మ వీవు,
మొదలును నడుమును దుద లేనివాఁడ వీవె; భూతముల సృజియింపఁ దలఁచి
గీ. యాది జలమును గల్పించి యందు నిదురవోయి, తత్కారణమున నారాయణుండ
వనఁగఁ బరఁగెదు, నరులకు నంతరాత్మ, వఖిలలోకస్వరూపుండ వాదిదేవ!

క. రామ! జగంబుల కెల్లఁ బితామహుఁ డగుబ్రహ్మ బొడ్డుదమ్మిఁ బొడమెటఁ
స్వామి వఖిలమున కీవే; నీమహిమము భువనకీర్తనీయము చూడన్. ౨౩౮

సీ. వైకుంఠపతి వీవు వైదేహి శ్రీదేవి, యీలక్ష్మణుండు ఫణీశ్వరుండు
నీయంతనే నీవు నీయందె నీమాయచే నీజగంబు సృజించుచుంటి,
వైనఁ జిచ్ఛక్తిచే నఖిలంబునకు సాక్షివై యాకసముభంగి నంటకుండు
వదిగాక భూతంబులందు వెల్పలను లోపల నిండియుండిన వాఁడ వయ్య
గీ. నజ్ఞులకుఁ బరిచ్ఛిన్నునియట్లు గానఁబడియెదవు, ప్రపంచమును బ్రపంచపాల
కుఁడుఁ దదాధారమును మూఁడుగూడ నీవ, త్వదితరం బేమి లేదు విశ్వప్రకాశ!

గీ. భూతములలోన భుజియించుప్రోడ వీవ, యారగింపంగఁ దగినపదార్థ మీవ
యేది వీక్షింపఁగాఁ బడు నెది వినఁబడు, నెది స్మరింపఁగఁబడు నదియెల్ల నీవ. ౨౪౦

క. నేరుపుమెయి నీశక్తిప్రేరిత మై మాయ జగము సృజియించు నహం
కారాదినైజగుణసంభారంబునఁ జేసి, భువనవందితచరణా! ౨౪౧

వ. అందువలన నీయందు స్రష్టృత్వ మౌపచారికముగాఁ జెప్పంబడెడు. సూదంటు
ఱాయిచెంత నినుము మున్నగునవి చలించుకరణి మాయ జడ మయ్యును ద్వదవ
లోకిత మై జగముం గలిగించుచున్నది. దేహవర్జితుండ వగునీకుఁ బ్రపంచరక్షణే
చ్ఛావశంబున విరాడ్ఢిరణ్యగర్భసంజ్ఞలుగల స్థూలసూక్ష్మశరీరంబులు రెం డేర్పడినవి.
అందు మొదటిదగు విరాడ్దేహమునుండి వేనవేలుగ భవదవతారంబు లుత్పన్నంబు
లయి కార్యాంతంబున మరలఁ దత్ప్రవేశంబు గనుచుండు. ౨౪౨

క. వినుము భువనంబునం దెవ, రనన్యచిత్తముల యుష్మదవతారకథల్
వినిపింతురో చదువుదురో, యనఘాత్ములు వారె ముక్తి కర్హులు, రామా! ౨౪౩

చ. పుడమికిఁ గ్రుంగ్రవేఁ గడఁచుభారనికిఁ దామరసోద్భవుండు నీ
యడుగుల వ్రాలి వేగతులఁ బ్రార్థన సేయఁగ నెంతయున్ ముదం
బడుచుఁ దదీయనిష్ఠకు రమాపతి! యీగతి రాఘవుండ వై
పొడమి సురారులం దునిమి పూర్తియొనర్చితి దేవకార్యమున్. ౨౪౪

చ. అనితరసాధ్య మైనపని యంతయు నీవలనన్ సుసాధ్య మై
మునులకు వేల్పుమూఁకలకు మూఁడుజగంబులకున్ సుఖంబు పై
కొనియెను నేఁడు,తీఱెను దిగుల్ ధరణీమహిళామతల్లికిన్
వనజజు ప్రార్థనమ్ము ఫలవంతము నై నెగడెన్ రఘూత్తమా! ౨౪౫

రాముఁడు భరద్వాజుని యాతిథ్య మంగీకరించుట

సీ. ఇఁకమీఁదఁ బెక్కువేలేం డ్లిట్లె మనుజరూపంబున భూస్థలిపై వసించి
దివికిని భువికిని దవిలి మే లొదవింప,దురితహారంబులు దుష్కరములు
నైనకార్యంబుల నాచరింపుచు యశఃపూర్ణమ్ము సేతువు భువన మెల్ల,
నిన్నుఁ బ్రార్థింతు జగన్నాథ! నేఁడు నాయిలు పవిత్రము సేయు మిందు నిల్చి
గీ. సైన్యసహితుండ వగునీకు శక్తికొలఁది, విం దొనర్పఁగ నుంటి, నాయందలి దయ
భోజనము సేసి రేపు మీరాజధాని, కరుగవచ్చును నావుడు ననుమతించి. ౨౪౬

వ. రాముఁ డానాఁ డయ్యుత్తమాశ్రమంబున నిల్చి సీతాలక్ష్మణసైన్యోపేతమ్ముగ భరద్వాజమహర్షిచేఁ బూజితుం డై భోజనానంతరము కొంతతడ వంతరంగంబునఁ జింతించి, సమీపస్థుం డగుసామీరిం గాంచి యిట్లనియె. ౨౪౭

రాముఁడు భరతాదులకుఁ దనరాకఁ దెలుపుటకు హనుమంతుని ముందుగఁ బంపుట

క. నీ విటనుండి యయోధ్యకుఁ, బావని! శీఘ్రముగఁ బొమ్ము పౌరు లటన్ సౌ
ఖ్యావహు లై యవిచారముగా వర్ధిల్లుటను మొదటఁ గాంచు మటుపయిన్.

క. చని శృంగిబేరపురమున, కనఘాత్ముఁడు ప్రాణమిత్ర మయినగుహునితో
నను భార్యానుజయుతు వచ్చినవానిఁగ సకల మెఱుఁగఁ జెప్పుము, పిదపన్.

వ. నందిగ్రామమున కేఁగి. ౨౫౦

సీ. అం దున్న భరతు నాయనుఁగుఁదమ్మునిఁ జూచి,చెప్పు మామువ్వురిక్షేమవార్త
నవనీకుమారిక యపహృత యగుట మున్నగునవియును రాక్షసాధిపతి వ

ధాదికంబును మఱి యచ్చట జరిగిన, సకలవిషయములు సక్రమముగఁ
దెలుపుము, శత్రుషండ్తుల నెల్ల సమయించి, తోయ్యలితోడ సైఁదోడుతోడఁ
గీ. గూడి భల్లూకవానరకోట్లు గొలువ, హాయిగా వచ్చుచుండె మీయన్న యనుచు
నెఱుఁగఁబలికి యచ్చటి విధమెల్లఁ దెలిసి, యతని నడవడిఁ గని యిట కరుగుదెమ్ము.

క. అనవుడుఁ బవనజుఁ డట్టులె,యని మానవరూపు వడసి యహిపతిఁ బట్టం
జనుతార్క్ష్యుఁ డనఁగఁ బవనగ,తిని నందిగ్రామ మున్నదిక్కున కుఱికెన్. ౭౫౨

హనుమంతుఁడు రామాగమనవార్తచే గుహుని సంతోషపెట్టుట

వ. అ ట్లేఁగుచు నడుమం గలశృంగబెరపురంబు సొచ్చి యవలోకితగుహుండై
సంతుష్టస్వాంతమ్మున మధురఫణితి నతనితో నిట్లనియె. ౭౫౩

చ. దశరథరాజనందనుఁడు ధర్మరతుండు భవత్సఖుండు శౌ
ర్యశమితవైరిసంచయుఁడు రాముఁడు నన్నిట కంపె నేమపుం
దశ నెఱిఁగింప నీ, కనుఁగుఁదమ్మునితో ధరణీకుమారితోఁ
గుశలము సిద్ధమాఘునుకుఁ, మఱియొక్కటి యాలకింపుమా. ౭౫౪

క. ఆగుణనిధి యిపు డీచటికి, రాఁ గలఁ డనుమతిని గొని భరద్వాజుకడన్,
గాఁగలదు శుభము చూడం,గాఁ గలుగుట రామభద్రుఁ; గైవర్తపతీ! ౭౫౫

హనుమంతుఁడు భరతుం జూడ నందిగ్రామమున కరుగుట

సీ. అని తనమాటల కతిహర్షపులకిత,గాత్రుఁ డౌ గుహుని కిక్కారణిఁ జెప్పి
మహితతేజస్కుండు మారుతతనయుండు, కడువడి గగనమార్గమున నెగసి
దివ్యమౌ శ్రీరామతీర్థమున్ సరయూమ,హాతరంగిణిఁ గనులారఁ గాంచి
మెచ్చి వాని నతిక్రమించి యయోధ్యాపు,రమునకుఁ గోసుదూరమ్మునందుఁ
గీ. దనరుచున్న నందిగ్రామమునకుఁ బోయి, యాశ్రమం బొందు గల్పించి యం దొకండె
మెలఁగువానిఁగ భరతునిఁ దెలిసి హర్ష,చిత్తుఁ డయి తత్సమీపముఁ జేరె, నారి!

సీ. జింకచర్మము నారచీరలును ధరించి, జడ లల్లి కార్శ్యతఁ జాటువాని
ఫలమూలభక్షణఁ బవలు రే యనక రా,మధ్యానమున నున్న మనసువాని
నగ్రజుపాదుక లగ్రతలంబున, నిడికొని పుడమిఁ బాలించువాని
మలపంకదిగ్ధమై లలి దొరంగినమేని, వాని నాశ్రమవాసి యైనవాని
గీ. లలితకాషాయవసనధారు లయి పౌర
ముఖ్యులును మంత్రులును జుట్టు మొనయువాని

నాకృతిం గొన్నధర్మ మట్లలరువాని
బహుళసద్గుణభరితుని భరతుఁ గనియె. ౭౫౭

వ. కని యంజనాసూనుండు ప్రాంజలి యై. ౭౫౮

హనుమంతుఁడు రామాగమనవృత్తాంతము భరతునకుఁ జెప్పుట

ఉ. స్వామి! మదుక్తి విన్ము మునివైఖరి దండకలో వసించు నే
రాముని సంస్మరించుచుఁ గరమ్ము వనంటఁ గృశించుచుంటివో;
యామహితాత్ముఁ డాయనఘుఁ డాశ్రితరక్షణపక్షపాతి దా
క్షేమముఁ జెప్పి రమ్మనుచుఁ జెచ్చెర నన్నిట కంప వచ్చితిన్. ౭౫౯

క. నీకుం బ్రియ మెఱిఁగించెద, భీకరశోకమ్ము విడిచిపెట్టుము సుమతీ!
లోకార్చితుఁ డన్నయు నగు, కాకుత్స్థు సమాగమంబు గలుగును నేఁడే. ౭౬౦

సీ. చిత్తంబునం గలయుత్తలపాటు య,థాయథ లై పోయి హాయిగలుగ
నీయన్న కౌఁగిట నీవు నిల్వం గల,వీముహూర్తమునంద యిద్ధచరిత!
బవరాన రావణుం బరిమార్చి జనకనృ,పాత్మజావాప్తిఁ గృతార్థుఁ డగుచు
జానకీలక్ష్మణసహితుఁడై కపులతో, నరుదెంచుచున్నవాఁ డమ్మహాత్ముఁ

గీ. డనుడుఁ, గైకేయిప్రియసుతుం డద్భుతప్ర,భావుఁ డబ్భరతుం డగ్రభవసుఖాగ
మనవచశ్శ్రవణోద్ధితమహితహర్ష,భరితుఁడై నేల వ్రాలె మైమఱచి దుర్గ! ౭౬౧

భరతుఁ డానందపరవశుఁడై హనుమంతు నభినందించుట

వ. అట్లు మూర్ఛిల్లి తోడన ససంజ్ఞుఁ డై లేచి పచ్చకప్రంపుఁబలుకుల కెనయగుపలు
కులం బ్రియంబు పలుకు కపిలోకతిలకుం గౌఁగిలించుకొని పరమానందనిష్యంది
బాష్పధారలం దడుపుచు నతని కిట్లనియె. ౭౬౨

చ. నరుఁడవో దైవతంబవో వనంటకు లోనయి యున్ననాపయిం
గరుణ జనింపఁ బ్రోచుటకుఁగాఁ జనుదెంచితి విందు, నీవలెం
గరముఁ బ్రియంబు వల్కుకృతి గానఁగరాఁ డిలలోనఁ, బోవునూ
పిరి నిపు డాపినావు రఘువీరునిరాకను దెల్పి సౌమ్యుఁడా! ౭౬౩

గీ. లక్షగోవుల భూషావిలాసవతులఁ, గన్యకలఁ బదునార్వుర గ్రామశతము
నొసఁగువాఁడను నీదు మహోపకార,మునకుఁ బ్రతిఫలముగ నరముఖ్య! నేఁడు.

వ. అని తనివిసనక మరున్నందనునితో మఱియు నిట్లనియె. ౭౬౪

సీ. ఓడక పెక్కేండ్లనాఁడు భీకరవన,భూమి కేఁగిన రఘుపుంగవునకు
నాస్వామి కవనిజానాథునకుఁ క్షేమ,మని చెప్పి హృత్తాప మణఁచినావు,
పీయూషతులితంబుఁ బ్రీతికరం బగు,నాసేవ్యు వృత్తాంత మాలకించు
భాగ్య మీనాటికిఁ బ్రాప్త మయ్యెను నాకు, నీమూలమునఁ గీర్తనీయచరిత!
గీ. "క్షితి విపత్తులఁ జావక బ్రతికియుండె,నేని; నూఱేండ్లకైనను మానవునకుఁ
గలుగు నానంద" మనులోకగాథ నాకు, ననుభవమునకు వచ్చె యథార్థముగను.

గీ. అగచరుఁకు రామునకు సమాగమంబు,గలుగు టెట్లు? నిశ్చయమును దెలుపుమనఘ!
మంగళం బగు నీకు, నీమాట విశ్వ,సింతు ననవుడు వానరశ్రేష్ఠుఁ డలరి. ౨౬౭

క. క్రమముగ శ్రీరామునిచరి,తము సకల మెఱుంగఁ జెప్పెఁ దచ్ఛ్రవణోత్సా
హమునఁ బొదలుకై కేయీ, కుమారునకు విబుధగేయగుణవారునకున్. ౨౬౮

భరతుఁడు రామసందర్శనార్థ మందఱఁ బయనింపు మని శత్రుఘ్నునితోఁ జెప్పుట

వ. అంత భరతుండు. ౨౬౯

క. కరువలికొమరునివలనం, బరమానందకర రామభద్రు చరితము౦
గరము విని తనవలెకుఁ మో,దరసనిమగ్నుఁ డయి యున్నతమ్మున కనియెన్.

క. పలువిధము లగునివేదన,ములను సమర్పించి నేఁడు పూజింపంగా
వలయు బుధులు మనవీటం, గలవేల్పుల నెల్లఁ దనియఁగా, శత్రుఘ్నా! ౨౭౦

సీ. వంశకథల్ చెప్పువారును మేల్కొల్పు, వైతాళికులు స్తుతిపాఠకులును
వారాంగనామణుల్ వందలకొలఁది నీ,వేళ సంఘములుగా వెడలవలయు,
మఱి రాజభార్యలు మంత్రు లేనుఁగులు గుఱ్ఱములుఁ బదాతులు రథము లాది
గాఁగలసేనలు తమ్మొసురు లాగత,ధారుణీపతులును పౌరజనులు
గీ. ముదము పొదలంగ బయలుదేరుదురుగాక, పూర్ణిమాచంద్రబింబంబుపోల్కిఁ గళల
నీనురఘునాయకునిసుందరాననంబుఁ, గన్నులార సందర్శింపఁ గలుగుటకును. ౨౭౧

* క. సురవైరులఁ బోరిగొని నిజ,పురికిఁ వేంచేయుచుండెఁ బో రాఘవుఁ, డు
ర్వర నింతకంటెఁ బ్రియ మగు,తఱి యీజన్మమున కిఁక నొదవునే మనకున్.

భరతుఁ డెల్లరతోఁ గూడి రామున కెదురు వోవుట

వ. అని యాజ్ఞాపింప శత్రుఘ్నుండు సంతుష్టుం డై చయ్యన నయ్యైపనులకుఁ దగువారి నియోగించె. అప్పుడు కొందఱు రాజపురుషులు ముక్తామణివిభ్రాజితంబు లగు తోరణంబులఁ గట్టియు, విచిత్రాంబరసంశోభితంబు లగు పతాకల నెత్తియు, నయోధ్యాపురం బనేకవిధంబుల నలంకరించిరి. బహువిధా

లంకారరచనల నైపుణ్యంబు గలవా రగుటఁజేసి, ప్రజ లెల్ల రొకదానికంటె
నింకొక్కటి మిన్నగ నుండు తెఱంగునఁ దమతమలోఁగిండ్ల శృంగారించికొని,
భగవదర్హంబులును భవ్యంబులు నగు నుత్తమద్రవ్యంబుల గ్రహించి రఘునందన
సందర్శనామందాసక్తితోఁ బురము వెలువడి, రయ్యవసరంబున. ౨౨౪

గీ. లాలితము లగుపసిఁడిజాలరులతోడ, వెలుఁగుస్యందనములు పదివేలు వార
ణములు పదివేలు మేటిగుఱ్ఱములు లక్ష, కదలె రామున కెదురుగాఁ; గట్టుపట్టి!

క. ఉల్లము లలరఁగ బంగరు, పల్లకులం దెక్కి రాజభార్యలు సీతా
వల్లభతో వచ్చెడిరఘు,తల్లజుఁ గన వెడలి, రబ్జదళనిభనేత్రా! ౨౨౬

చ. మఱి మఱి రామభద్రుని సమాహితభక్తి మదిన్ భజించుచున్
శిరమునఁ బాదుకాయుగముఁ జేర్చి కరంబులు మోడ్చి శత్రుఘ
స్నరుఁడును వెంటరా నరిగె, మార్గముఁ జూచుచుఁ బాదచారి యై
భరతుఁడు రాముఁ డేడి యని పల్మఱు పావనిఁ బ్రచ్ఛ సేయుచున్. ౨౨౭

వ. అట్లేఁగుతఱి సామీరి సకలజనంబులం బేరెలుంగునం జీరి యిట్లనియె. ౨౨౮

హనుమంతుఁడు ప్రజలకు హస్తనిర్దేశమున రామాదులం జూపించుట

సీ. నలినసంభవుఁడు మనస్సుచే నిర్మించి, నదియు సూర్యున కెనయైనదియును
సంపూర్ణశశిబింబసంకాశ మగుబుష్ప,కవిమాన మదె దవ్వుగా మనలకుఁ
గన్పట్టుచున్నది, కాంచుఁ డందఱును మ,హాజనులార! తద్యానమందు
నన్నదమ్ములు విక్రమోన్నతు లున్నారు, శ్రీరామలక్ష్మణుల్ సీతతోడ,
గీ. అద్రిచరవల్లభుం డగునర్కసుతుఁడు, సచివవర్గంబుతో విభీషణుఁడును గల,
రితరవనచరబలము మితేతరముగఁ, గలదు నావుడు సమ్మోదకలితు లగుచు.

ప్రజలు శ్రీరాముని సందర్శించుట

గీ. స్త్రీలు బాలురు యువకులు వృద్ధు లెల్ల, రిదుగో మనరాఘవుం డని యేకభంగి
నఱచి, రమ్మహానాద మంబరముముట్టి, విబుధవిజయారవముతోడి వియ్య మందె.

క. వారణముల వారువములఁ, దేరులఁ గలజనము లెల్ల దిగి నేలకు సీ
తారమణు విమానస్థు న,భోరాజితచంద్రునివలెఁ బొడఁగని, రువిదా! ౨౩౧

చ. అతిశయహృష్టభావమున నబ్బరతుం డిరుగేలు మోడ్చి న
మ్రత నెదు రై సముజ్జ్వలవిమానముపై నలరారుజానకీ
పతికి రఘుప్రవీరునకు భక్తి బయల్పడ మ్రొక్కె మేరుప
ర్వతశిఖరస్థితుం డయినభానునకుం బలె, హంసగామినీ! ౨౩౨

భరతుఁ డన్నసన్నిధిం జేరుట

ఆ. అంత జానకీశుననుమతి మెల్లగ,క్షితికి దిగియె, యక్షపతివిమాన,
మందు ననుజుతోడ నారోపితుం డయ్యె, భరతుఁ, డిట్టు లన్నపజ్జఁ జేరి. ౭౮౩

*క. "నిన్నుఁ జిదానందమయు స,మున్నతిఁ గని కలసిమెలసియుండెడి యోగం
బెన్నాళ్లకబ్బె బ్రదికితి, నన్నా!" యని పలికి మరల నడుగుల వ్రాలెన్. ౭౮౪

వ. అప్పుడు. ౭౮౫

భరతుఁ డన్నచే బుజ్జగింపఁబడి, సీతాలక్ష్మణ సుగ్రీవాదులకుఁ బ్రణామాదికము నాచరించుట

సీ. భద్రేభతుండాభబాహుయుగ్మము చాఁచి, పదగతుం డగుకైకపట్టి నట్టె
పైకెత్తి తనయూరుభాగంబునం దుపవిష్టునిఁ గావించి హృష్టుఁ డగుచు
నీ పట్టుదల వర్ణనీయము నాయనా!, యని జానకీపతి యబ్బురముగఁ
గవుఁగిటఁ జేర్చెను, గాంత! యంతటఁ బ్రేమ, విహ్వలుం డై ప్రీతివిస్తరిల్ల
గీ. భరతుఁ డొయ్యన సౌమిత్రిపజ్జ కరిగి, బాఢపరిరంభ మొసఁగి యాపైని వదినె
కెదురుగా నిల్చి భరతుఁడ నే నని యభి,వందనముచేసెఁ దత్పాదవనజములకు.

వ. తదనంతరము సుగ్రీవజాంబవదంగదనలనీలఋషభసుషేణ గవాక్ష గంధమాదన శరభపనసాదికపిపుంగవులఁ బరిష్వంగసంగతులఁ గావించె. వా రందఱును మానుషరూపంబులం బడసి సుందరాకారు లై సంతుష్టహృదయంబులఁ గైకేయికుమారు గౌరవించి కుశలం బడిగి, రంత నా గుణవంతుండు మార్తండతనయు నిండుకౌఁగిటం బొదివి భక్తితో నిట్లనియె. ౭౮౬

భరతకృతసుగ్రీవప్రశంస

ఉ. నీదుసహాయసంపద ననిం జయముం గనె రామమూర్తి, ర
క్షోదయితుండు రావణుఁడు గూలె శిలీముఖవిద్ధదేహుఁ డై,
త్వాదృశుఁ డెందు లేఁ డనుట తథ్యము, గావున నైతి వీవు మా
కైదవసోదరుండ విదియాదిగఁ, బంకజమిత్రనందనా! ౭౮౭

వ. పదపడి శత్రుఘ్నుండు. ౭౮౮

ఆ. రామభద్రుచరణరాజీవములకు వం,దన మొనర్చి లక్ష్మణునకు మ్రొక్కి
నమితగాత్రుఁ డయి ప్రణామంబు గావించె,జానకీపదాంబుజముల, కంత. ౭౮౦

రాముఁడు కౌసల్యాదిజననులకుఁ బ్రణామమ్ముఁ జేయుట

సీ. బహుకాలవిరహసంభవబాధతరశోక, దహనార్చిరభిశప్తతనువుదాని
ననిలభూసంకథితాత్మాగమనవార్త, నొక్కింత తెలివొందియున్నదాని
నెడనెడ సుతురాక యెంతసత్యమొ యను, భ్రాంతి వివర్ణతఁ బడయుదాని
శల్యమై యున్న కౌసల్యను దనకన్న,తల్లిని మెల్లగా దరియ నరిగి
గీ ముదముఁ గూర్చుచు నాయమహృదయమునకు,వసుధపైఁబడి సాష్టాంగవందనంబు
నేసి తత్పాదపద్మముల్ చే గ్రహించి, కనుల కద్దికొనెఁ రఘుకాంతుఁ, డింతి!

క. ఆమీఁదం గైకేయికి, సౌమిత్రిప్రసువ కితరజననుల కధిక
ప్రేమము భక్తియు గదురఁ బ్రణామం బొనరించె శైలనందిని! యంతన్. ౭౯౨

భరతుఁడు రాజ్యమును గైకొమ్మని రాముని వేఁడికొనుట

క. సతతముఁ దనచేఁ దగఁ బూజితంబు లగు పాదుకలను స్థిరభక్తినమ
న్వితుఁ డై కుతుకముతో రఘుపతిపాదంబులకుఁ దొడిగి భరతుం డనియెన్. ౭౯౩

సీ. కాకుత్స్థ! యిల్లడగా నాకడంగల, యీరాజ్యము సమస్త మేను మరల
నొప్పగించితి నీకు, నిప్పుడు నాపయిం, గలభార మంతయుఁ దొలఁగి పోయె,
వనిఁ బాసి నగరికి వచ్చినసచ్చిదా,నందుని నిను మహానందముగను
గనుచుంటిఁ గాన మత్కామితంబు ఫలించెఁ, బుట్టువు సఫలతఁ బొందె, నీశ!
గీ. సైన్యమును బొక్కసమును గోష్ఠమును దొంటి
కంటెఁ బదియంత లెక్కుడుగా నొనర్పఁ
బడినవి త్వదీయదివ్యప్రభావమునను,
నేలికొను మింక నీరాజ్య మీవు దేవ! ౭౯౪

క. అనిపలికిన భరతునిఁ గని, కనుదమ్ములనుండి నీరు గార్చుచు సమ్మో
దనిభృతహృత్పుటములతోఁ, గొనియాడిరి ప్రీతిఁ బ్లవగకుంజరు లెల్లన్. ౭౯౫

వ. పిమ్మటఁ బ్రహ్మాష్టాత్ముం డై రఘుశ్రేష్ఠుండు నిజాంకతలంబున భరతు నాసీనుం
జేసికొని యశ్రమయాయి యగు పుష్పకంబున భరతాశ్రమంబునకుం బోయి,
యట నవని కవతరించి విమానంబున కిట్లనియె. ౭౯౬

రాముఁడు పుష్పకమును గుబేరునికడకుఁ బొమ్మని యాజ్ఞాపించుట

ఉ. నీపయి మోజు గల్గియును, నిర్దయుఁ డైనదశాననుండు చూ
పోపక నిన్నుఁ గైకొనుట యుద్ధమునం దతనిన్ జయించు బా

హాఁటిమంబు లేమిని నిరాశఁ బ్రతీక్ష యొనర్చుచుండెఁ జూ
నీపతి యూకుబేరుఁ; డతనిం గనఁబొమ్ము, విమానరాజమా! ౨౯౮

క. అనుమతి నొసఁగితి నిఁకఁపయిఁ, జని యలకాపురమునకు విశంకటవృత్తిన్
ధనదుని మోయుచునుండుము, మనోగతం బెఱిఁగి మెలఁగుమా పోపొమ్మా.

చ. అని సెల విచ్చి పుష్పకము నంపి మహేంద్రుఁడు నేల్పుఁ బోజ్జకుం
బ్రణతి యొనర్చు చందమున భక్తి వసిష్ఠపదాంబురుహ్యగం
బునకుఁ గృతప్రణాముఁ డయి పోలినగద్దియ నిల్పి దాస న
మ్మునిని నుపవిష్టుఁ జేసి రఘుముఖ్యుఁడు నిల్చెఁ దదంతికమ్మునన్. ౨౯౯

భరతుఁడు రాజ్యమ్ముం బరిగ్రహింపు మని రాముని మఱిమఱి ప్రార్థించుట

వ. అంత భరతుండు శిరోనిహితాంజలి యై కులగురుసమక్షంబున జ్యేష్ఠభ్రాత కిట్లనియె. ౩౦౦

సీ. సర్వంబు సిద్ధ మై క్షణములోఁ గానున్న, యభిషేకయత్నంబు నాపి వైచి
యడిగినతోడన యడ్డుమాటాడక, యఖిలరాజ్యంబు నా కప్పగించి
మాయమ్మ నెంతో సన్మానించితివి, రామభద్ర! మున్పటియొడంబడిక రీతిఁ
బదునాలుగేండ్లుగా మదధీనమున నున్న, నీరాజ్య మొసఁగెద నీకు నేఁడు
గీ. వేఱుదలఁపకు దయయుంచి స్వీకరింపు, మనుచు సాష్టాంగవందనం బాచరించి
గురువరునితోడఁ దల్లితోఁ గూడఁ గలిసి, వివిధభంగుల రఘువీరు వేఁడికొనియె.

వ. వేఁడికొనుటయు. ౩౦౧

రాముఁడు భరతునివలన రాజ్యమ్ముం గొనుట

ఆ. మాయ నూఁది సకలమానవచేష్టల, నాశ్రయించి యున్నయభవుఁ డీశ్వ
రుండు నైనరాఘవుం డట్లె యని తమ్మునలనఁ గొనియె రాజ్య మలరఁబోఁడి!.

పరమేశ్వరస్ఫూర్తి శ్రీరామప్రశంస

సీ. ఆనందమును జ్ఞాన మను నివి రెండె రూపంబుగాఁ గలవాఁడు పరుఁ డనుగ్ర
హామమాత్ర భక్తుల కాఖండలునికల్మి, కెనవచ్చుసంపద లిచ్చువాఁడు
బొమముడితో నజునిమునమ్ములో మూఁడు, జగముల మాయింపఁజాలువాఁడు
ధాతృసుఖముదాఁకఁ దనరారుసుఖము లన్నిఁటిమించు సుఖ మయి నెగడువాఁడు
గీ. శాశ్వతుఁ డనంతుఁ డగునఖిలేశ్వరునకుఁ, జర్చ సేయ మనుష్యరాజ్యంబువలన
నగుప్రయోజన మేమున్న దందఱవలె, నుండి వచ్చిన పని దీర్చుకొఱకె యిదక్క?

క. కను గీటి విలాసముగా, ననేకకోట్యంబుజాసనాండంబులు గ
ల్పనసేయు శ్రీపతికి నొక, ఘనమా యీస్వల్పరాజ్యకథనము, సాధ్వీ!. ౧౦౫

క, ఐనను దన్ను భజించెడి, జ్ఞానులకుం గోరికల నొసఁగుతమి లీలా
మానుషదేహమ్మున భువి,పై నఖిలముఁ జేయుచుండెఁ, బైకథ వినుమీ. ౧౦౬

గీ. అవల శత్రుఘ్ను నాజ్ఞ సమర్థుఁ డయిన, నాపితుం డయ్యోడకు వచ్చె, నగకుమారి!
శ్రీరఘూత్తము పట్టాభిషేకమునకు, వలయుసంభారములఁ దెచ్చి నిలిపి రొకట.

రామాదులు సర్వాలంకారభూషితులై యయోధ్యం బ్రవేశించుట.

సీ. ఆదిఁ గైకకొమారుఁ డాపయి మహాసీయుఁ, డగులక్ష్మణుఁడు మీఁద నగచంద్రుఁ
డవల విభీషణుం డచ్ఛోదకంబుల, స్నానమ్ముఁ జేసి, రనంతరమ్ము
సౌమిత్రిభరతులు జడలను విడఁదీయ, జానకీభర్త మజ్జన మొనర్చి
రమణీయములు ననర్ఘము లగువస్త్రముల్, ధరియించి కమ్మనితావి గ్రమ్ము
గీ. పుష్పమాలలు దాల్చి మైపూఁతఁ గాంచి, దివ్యతేజమ్ము మిగుల దేదీప్యమానుఁ
డయ్యె, నంతట మతిమంతుఁ డైనభరతుఁ, డగ్రజునకు సుమిత్రాత్మజాన్వితముగ.

వ. ఉత్తమాలంకారమ్ముఁ జేయించె. కౌసల్యాదిరాజకాంతలు సీతను సుస్నాతం గావించి దివ్యాంబరాభరణాదుల ననుపమానముగ నలంకరించి, రంతఁ బుత్రవత్సలయు సుగుణరాశియు నగురామమాత వానరపత్నుల కందఱ కనేకవిధంబులఁ బ్రసాధనంబు సేయించె. పిమ్మట శత్రుఘ్నానుమతంబున. ౧౦౯

క. మతిమంతుఁ డగుసుమంత్రుం, డతిముదమున హరులఁ బూన్చి యర్కనిభం బు
న్నతము శతాంగముఁ దెచ్చి వి,హితసరణిఁ నిలిచె రామునెదుట లతాంగీ!.

ఉ. సత్యమునందు ధర్మమున సంతత మాస్థ గలట్టి దేవతా
స్తుత్యుఁడుఁ రాఘవుండు ముదితుం డయి స్యందన మెక్కె, నంత నా
దిత్యభవుండు నంగదుఁడుఁ దెమ్మెరపట్టి విభీషణుండు నొ
న్నత్యము మీఱ దివ్యవసనమ్ములఁ దాల్చి విభూషితాంగులై. ౧౧౧

గీ. మత్తమాతంగముల హిరణ్మయరథముల
డం బలర నెక్కి రాముని వెంబడించి
ముందు నడచి రన్యోన్యంబు ముచ్చటించు
కొనుచుఁ దన్మహిమమ్మును, గువలయాక్షి!. ౧౧౨

క. వనచరనాథు పురంధ్రులు, జనకకుమారికయుఁ జనిరి సమ్యక్శోభ
దనరారుపురవరమునకుఁ, గనకాందోళికలమీఁదఁ, గంబుగ్రీవా!. ౧౧౩

చ. పరివృతదేవసైన్యుఁ డయి పచ్చనిమావులఁ బొల్చుతేరిపై
సురపతి వోవుచందమున సూరెల సేనలు గ్రమ్మి సాగఁగా
నరిదమనుండు రాఘవుఁ డహర్పతితేజుఁడు స్యందనస్థుఁ డై
యరిగె నభశ్చరుల్ వొగడ నాత్మపురంబునకున్, మనోహరీ!. ౧౯౪

సీ. కైకేయిసుతుఁడు నొగలమీఁదఁ గూర్చుండి, వారువంబులఁ బట్టి తేరు దోలె
ద్యుతిసముగ్రుండు శత్రుఘ్నుండు శ్వేతాతపత్రంబు నిరుగేలఁ బట్టి నిలిచె
సవిధస్థుఁ డగుచు లక్ష్మణుఁడు చామరమును, విసనకఱ్ఱయుఁ బూని విసరుచుండె
లంకాధిపుండు శశాంకసంకాశ మహామణియొకధవళచామరముఁ బట్టె
గీ. సమరగణములు సిద్ధసంఘములు దివ్య, దర్శనమహర్షిపూగంబు స్తవ మొనర్చె
శ్రావ్య మగుమధురధ్వని జగమునిండ, జానకీపతి పురి కేఁగుసమయమునను. ౧౯౫

క. మనుజాకృతులం గైకొని, వనచరు లెల్లరును మత్తవారణములపై
మనము లలరఁ జనిరి వికర్తనకులభూషణుని రాజధానికి, సుదతీ!. ౧౯౬

క. అమితంబుగ భేరులు శంఖములును బణవమ్ము లానకంబులును మృదం
గములున్ మ్రోఁగుచునుండఁగ, సమలంకృతపురము రామచంద్రుఁడు సొచ్చెన్.

సీ. దూర్వాదళంబులతోఁ బోల్పఁ దగునట్టి, మిసిమించునల్లనిమేనివాని
లలితకిరీట మాఁదల నుజ్జ్వలన్మణి, భూషలు నిలువెల్లఁ బొల్చువాని
నీరజంబులమాడ్కి నిడుద లై యొప్పి యెఱ్ఱనిడాలు నించుకన్గొనలవాని
బహువిధమాణిక్యభాసితకటిసూత్ర, సన్నద్ధపీతవస్త్రంబు వాని
గీ. మాంసలభుజాంతరాళుని మంచిముత్తియములపేరుల వెలుఁగొందు నట్టి వాని
రామభద్రునిఁ గని పుణ్యరాసు లగుట, నెల్లవారును సమ్మోద, మొనసి రపుడు.

పురస్త్రీలు రామసందర్శనార్థము వచ్చుట

సీ. పరమశాంతాత్ముఁ డౌ భానునందనుఁ డాది, గాఁగలప్లవగపుంగవులచేత
భక్తిమై సేవింపఁ బడుచున్న వాఁడును, దివనాథునిం బోలు తేజువాఁడు
గమగమవాసించుకస్తూరి గలిపిన, గందంపుఁబూఁత చేఁ గ్రాలువాఁడు
కల్పభూరుహసముద్గతపుష్పమాలికా, సంపన్నదివ్యవక్షంబువాఁడు
గీ. నైనరాముని వచ్చినవానిఁగ విని, మొదలువెట్టినగృహకృత్యములను వదలి
శ్రేష్ఠ మగునలంకారముఁ జేసికొని మహీయముదమునఁ బురిలోనియింతు లెల్ల.

వ. సంతోషాతిశయసంప్రవృద్ధముఖశ్రీవిరాజిత లగుచు మేడ లెక్కి సమస్తలోక
నయనానందకరసుందరవిగ్రహుం డగురఘుగ్రామణిం దిలకించి మెఱుఁగుమొగం

బులకు వన్నెఁబెట్టుచిఱునగవుతో దోసిళ్లకొలంది పుష్పంబులం జల్లి యంతం
దృష్టి దీఱెక. ౮.౨౦

క. కనులకు మనమునకు రసాయన మై స్వానందమూర్తి యగు సీతాజా
నిని నిశ్చలచిత్తంబులఁ, గనుచుండిరి ఱెప్పవాల్పక, కుసుమగాత్రీ! ౮.౨౧

చ. హరియుఁ బ్రభుండు నైనకమలాక్షుఁడు రాముఁడు తన్ను నొక్కఁడై
నరయుచునున్న వారి నపరాంబుజగర్భుఁడు వోలెఁ బ్రేమయుఁ
దరహసితంబు నొల్కు విశదం బగుదృక్కునఁ దన్పుచుఁ సురే
శ్వరభవనాభిరామపితృసద్మముఁ జేరఁగఁ బోయెఁ దిన్నగన్. ౮.౨౨

వ. పోయి యెల్లరితోడ నంతర్భవనంబునం బ్రవేశించి కౌసల్యాపదపల్లవంబులకుం బ్రణమిల్లి తదనంతరము యథాక్రమముగఁ దక్కినతల్లుల కందఱకుం గృతాభివందనుం డై మార్తాండ వంశమునకు జెండావంటివాఁడును సమర్థుండును సత్యపరాక్రముండు నగు నమ్మహామహుండు భరతునితో నిట్లనియె. ౮.౨౩

చ. గొన బగు సర్వసంపదలకు న్నెల వై హృదయంగమంబు నై
తనరెడు నాగృహమ్మునను దమ్ముఁడ! ప్రాణముతోడి మిత్రి మా
నినజు వనేచరేంద్రు విడియింపుము, తక్కినవారి కల్లె చ
క్కని భవనంబులన్ సుఖముగా వసియింపఁగ నేర్పఱింపుమా. ౮.౨౪

క. అనవుడు రఘుపతియానన్, వనచరులకు దనుజపతికి వసతులు దగు భం
గిని గల్పించి యహస్కర, తనయునిఁ గని కైకపట్టి తగ నిట్లనియెన్. ౮.౨౫

శ్రీరామ పట్టాభిషేకప్రయత్నము

సీ. భగవంతుఁ డగురాముపట్టాభిషేకార్థ, మర్కజ! నాల్గుతోయధులనుండి
నలలితపరిశుద్ధజలము దెచ్చుటకు దూతల శీఘ్రగాములఁ దక్షణంబ
పంపించు మనవుఁడుఁ బవనజు జాంబవంతుని సుషేణుని నంగదుని నలువుర
ననిచె వారు తదాజ్ఞ ననిలవేగమున నొక్కొక్క సంద్రమునకు నొక్కకరుగఁ జని
ఆ. నిర్మలోదకముల నిండించి సౌవర్ణకలశములను దెచ్చి నిలిపి రచట
సచివగణముతోడ శత్రుఘ్నుఁ డా నమ్ముద్రాంబువులను గురున కప్పగించె. ౮.౨౬

వ. అంత, ౮.౨౭

## శ్రీరామ పట్టాభిషేకము

క. పరిశుద్ధుఁడు వృద్ధుఁడు నగు, నరుంధతీప్రియుఁడు బ్రాహ్మణాన్వితుఁడై సుం
దరమణిపీఠంబున రఘు,వరునిం గూర్చుండఁ జేసె వసుధాసుతతోన్. ౮౨౮

వ. అట్లు నృపశ్రేష్ఠు సింహాసనాధిష్ఠితుం జేసి, వల్మీకభవ వామదేవ గౌతమ జాబాలి
ప్రముఖ మునిముఖ్యులుం దానును. ౮౨౯

సీ. తులసీదళంబులం దోఁగి కుశాగ్రమిశ్రిత మయి సజ్జనుచిత్త మట్టు
లత్యంత నిర్మలం బై పరిమళబంధుర మ్మగు జలమున రామమూర్తి
కభిషేక మొనరించె నానందమున దేవి! విప్రోత్తములును ఋత్విజులుఁ గన్య
కలును మంత్రులు మింటఁ గల వేల్పులును స్వీయ, పరివారయుతముగఁ బ్రస్తుతించు

గీ. లోకపాలురు గూడఁ దదేకభక్తి, నమరవిభు వసు లట్లఖిలౌషధీ ర
సములతో సముచిత మగుసరణి సదభి,షేకముం జేసి రా రఘుశేఖరునకు.

క. సీతావల్లభునకు నపు, డాతతమంగళకరంబు నతిమంజుల మా
శ్వేతచ్ఛత్రముఁ బట్టెను, బూతచరిత్రుఁ డగు నారిపుఘ్నుఁ డపర్ణా! ౮౩౧

క. తామరసాప్తతనూజుఁడు, భీమపరాక్రముఁడు గుణి విభీషణుఁడును విం
జామరలఁ బూని విసరిరి, కామితఫలదాయకునకుఁ గాకుత్స్థునకున్. ౮౩౨

క. సురపతిచోదితుఁ డై సుస్థిరభావముతోడ వాయుదేవుండు మనో
హరకాంచనమాలిక రఘు,వరు సుందరకంధరమున వైచెను రమణీ! ౮౩౩

చ. వితతరుచిప్రపూర్ణమును విస్ఫురితంబును జారుహేమమం
డితమును జీవరత్నకమనీయము నుత్తమ మైన హారమున్
హతరిపుఁ డింద్రుఁ డిచ్చెను స్వయంబుగ "రాఘవ! స్వీకరింపు" మం
చతిశయ మైన భక్తి నపు డాడిరి పోఁడిమి మింట నచ్చరల్. ౮౩౪

క. సురగంధర్వులు తమసు, స్వరవీణల మేళవించి పాడిరి దశకం
ధరనిర్మథనాదికరఘు, వరాపదానమును జెవులపండువుగాఁగన్. ౮౩౫

చ. మొరసెను దేవదుందుభు లమోఘముగా, సురభూరుహోత్త మై
కురిసెను బూలవాన నృపకుంజరుమీఁద సమస్తదిక్కులున్
మెఱసెఁ దదీయతేజమున, నిర్జరసంచయ భీతుపారమున్
విరిసెను, దేవమాని నిజవీణపయిం బలికించె గీతముల్. ౮౩౬

వ. అనమయంబున నచిరప్రరూఢదూర్వాదళశ్యాముండును, రవికోటిప్రభావిభాసిత రత్నకిరీటాభిరాముండును, గోటికందర్పసుందరుండును, ముక్తాహారవిరాజితకంధరుండును, పీతాంబరసమావృతుండును, యశోవివృతుండును, దివ్యాభరణసంపన్నుండును, బోషితాపన్నుండును, దివ్యచందనలేపుండును, నిర్ధూతాఖిలపాపుండును, బంగారము నంగలార్పించు మెఱుంగు మేనిపయిఁ బలుతెఱంగు లగుతొడవులు సెలంగఁ గరారవిందంబునఁ గెందొవఁ దాల్చి యెడమవైపుగఁ దన తొడపయింగూర్చున్న పుడమిచూలిని వామబాహుపరిష్వంగంబున నలరించువాఁడును, సర్వాతిశయతేజోధాముండు నగురాముం గాంచి, మానినీ! యే నివ్విధంబునం బొగడితి. ౮౩౭

శివుఁడు శ్రీరాముని సన్నుతించుట

సీ. అసితోత్పలశ్యామలాంచిత దేహా! రత్నకిరీటహారాంగదాదిభూష
ణాలంకృతా! రావణారి! మాయాశక్తి, భాసిత! రత్నసింహాసనస్థ!
మహితతేజస్క! రామా! నీకు మ్రొక్కెద, మొదలును నడుమును దుదియులేని
వాఁడ వొక్కఁడవు నీవైఖరి గడుఁ జిత్ర, మాత్మమాయను జేసి యఖిలజగము
గీ. సృష్టిసేయుదు వాదిఁ, బోషింతు వవలఁ, దుదకు మ్రింగుదు వొకతూరి, యదియుఁ గాక
యనవరతము సుఖాసక్తి నలరుదోష, విరహితుఁడ వౌట నిన్నేమి పొరయకుండు.

చ. అనఘ! గుణత్రయావృతుఁడ వై శరణాగతభక్తసంతతిన్
గనికర ముంచి ప్రోచుటకుఁగా సురమానుషముఖ్యజన్మముల్
గొని విహరించుచుందువు మనోహరలీలల, నీ యథార్థముం
గనుఁగొని సంతసించుటకు జ్ఞానులు మాత్రమె యర్హు లెప్పుడున్. ౮౩౮

సీ. నీయంశమునఁ జేసి నిఖిలప్రపంచమ్ము, నిర్మించి దానిని నిర్వహింపఁ
జాలినవస్తువు సంభవింపమి వేయి, పడగలు గలఫణిభర్త వగుచుఁ
గ్రిందను జేరి రాత్రిందివమ్ములు మోయు, చున్నావు, మఱియు నీ వొక్కరుఁడవె
యర్కేందుపవనమేఘౌషధీముఖరూప, ములఁ దోఁచి యీ లోకము నఖిలమును
ఆ. నందు నిందు ననక క్రిందును మీఁదను, గాచుచుంటి వయ్య కరుణతోడ
నీవు కన్నుమూయు నిముసమ్మునంద యీ, జగము మాఱిపోవు జలమయముగ.

వ. రామా! నీవీలోకనంబున జఠరాగ్నిస్వరూపుండ వై ప్రాణాపానాదివాయు పంచక సహాయమున దేహధారులు భుజించుసమస్త పదార్థములను జీర్ణమునకుఁ దెచ్చుచుందువు. కావున నశేషజగత్పోషణము నీవలన నగుచున్న దనుట ధ్రువము. ఈశ్వరా! చంద్రసూర్యాగ్నులందలి తేజంబును సర్వశరీరస్థిత చైతన్యంబును బ్రాణి

కోట్లకుం గల యాయురారోగ్యధైర్యశౌర్యాదులును, భవదీయసత్త్వమే కాని వేఱొండుగావు. మఱియు విధి విష్ణ్వీశాన భేదంబునను గాలకర్మసూర్యచంద్రాది విభాగంబునను దత్తన్మతావలంబు లగువాదులకు వేఱువేఱుగఁ గన్పట్టుచుంటివి. కాని విచారించినచో సజాతీయాదిభేదత్రయరహితుండును శాశ్వతుండు నగు పరబ్రహ్మ వనుట సత్యము. నీ వొక్కండవ మత్స్యకూర్మాదిదశావతారధారి వైనట్లు వేదంబులందును బురాణంబులందును జెప్పఁబడి యున్నది. అనేకవిధమున సదసద్రూప మగు నేతత్ప్రపంచమంతయు నీకంటెభిన్నంబు గాదు. ౮౭౧

సీ. స్థావరజంగమాత్మక మయి మేర గానఁగరాని యిబ్బువనంబునందు
నేదేది పుట్టెనో యెదిపుట్టుచున్నదో, యెదిపుట్ట నున్నదో; యది సకలము
నీవు లేకుండిన నిలువంగ నేరదు, కావున జీవునకంటెఁ బరుఁడ
వయినఁ ద్వదీయమాయాగ్రస్తులై జనులందఱు నీ పరమార్థరూప

గీ. మెఱుఁగఁ జాలక యున్నవా రించుకేని, నిన్ను భజియించుభక్తుల నెమ్మిఁ జేరి
వినయమున నాశ్రయించెడివిమలమతుల, కబ్బు నీశ్వరదివ్యతత్త్వానుభవము. ౮౭౨

చ. అనవరతంబు బాహ్యవిషయంబులఁ జిక్కుటఁ జేసి మానసం
బనఘ! భవత్స్వరూపము నుదంచిత మైనచిదాత్మతత్త్వముం
గనుఁగొనఁ జాలకుండి రలకంజభవాదులు గూడఁ, దద్గతిన్
నిను గుణశూన్యునిం దెలియనేరనిమూఢుఁడు గాఢభక్తిమై. ౮౭౩

క. కోమల మై నీలాభ్ర,శ్యామల మై జనమనోనయనసౌఖ్యద మై
శ్రీమించు నీ స్వరూపముఁ, గామించి భజింప ముక్తిగలుగు భవారీ! ౮౭౪

చ. నిరతము గౌరితో భవవనీదహనాభము నీదునామ మా
దరమున నుచ్చరించుచుఁ గృతార్థుఁడ నై మరణించువారికిం
దిరముగ మోక్ష మబ్బ నుపదేశ మొనర్చుచుఁ దారకంబు సు
స్థిరమతి నున్నవాఁడ రఘుశేఖర! నే నలకాశికాపురిన్. ౮౭౫

గీ. అనుదినం బీస్తవంబు ననన్యభక్తి, వ్రాయువారును వినువారుఁ బాడువారు
నిరుపమసుఖంబులం బొంది నీయనుగ్రహమున వైకుంఠవాసులై యలరుచుంద్రు.

వేల్పుతెగలు వేఱువేఱ శ్రీరాముని వినుతించుట

వ. అని వినుతించి విరమింప నిలింపపతి యిట్లనియె. ౮౭౬

ఉ. బమ్మవరమ్మునన్ దనుజభర్త హరించెను నాకలోక సౌ
ఖ్య మ్మఖిలమ్ము నాఁడు, రిపుఖండన! నేఁ డది తావకప్రసా

దమ్మునఁ జేసి వచ్చె, మఱి దారుణదానవజాతికిన్ వినా
శ మ్మొదవించి రావణునిఁ జంపి నిలింపులఁ బ్రోచినా వహో. ౧౪౮

వ. దేవత లిట్లనిరి. ౧౪౯

ఉ. యాగములందు భూసురు లనాదిగ మా కిడుచున్న యా హవి
ర్భాగము లెల్ల బల్మిఁ గొని బాధలు వెట్టినయాదిదైత్యునిన్
వేగమ చంపి తీవ్ర శరవిద్ధునిఁ జేసి, యిఁకన్ యథావిధిన్
రాఁగల వధ్వరాంశములు రావణమారణ! నీకతంబునన్. ౧౫౦

వ. పితృదేవత లిట్లనిరి. ౧౫౧

చ. దురితరతున్ దశాననుని ద్రుంచితి వెంతయు మేలు గల్గె, న
మ్మొఱకుఁడు మానిమిత్తము ప్రమోదముతోడ గయాదులందునన్
నరు లిడుపిండముల్ బలమునన్ హరియించి భుజించి క్రిందు మీఁ
దెఱుఁగక హింసఁ బెట్టె జగదీశ! యథాస్థితి మంటి మిత్తఱిన్. ౧౫౨

వ. యక్షు లిట్లనిరి. ౧౫౩

ఉ. హాయిగ సంచరించు మము నామునఁ దెచ్చి నికృష్టపుంబనుల్
సేయఁగఁ బంపు, నే మనుచుఁ జెప్పెదు? మా యవివేకిపల్లకిన్
మోయుటఁ జేసి వాసి చెడి మూఁపులు కాయలు గాచె, నింక మా
దాయ యడంగెఁ గష్టములు దప్పె భవద్దయ, నిందిరాపతీ! ౧౫౪

వ. గంధర్వు లిట్లనిరి. ౧౫౫

సీ. సంగీతమునఁ గడుఁజతురుల మగుమేము, తొల్లి సుధారసతుల్య మైన
నీచరిత్రమును వీణియల ఫిడేళ్లను, స్వేచ్ఛగా గానమ్ము సేయు చపరి
మితసముద్గతసుఖామృతవార్ధిఁ దేలుచు, నిశ్చింతఁ జరియింప దుశ్చరితుఁడు
పంక్తికంధరుఁడు నిర్బంధించె మము నెల్ల,నాభాధ పడలేక యది మొదలుగఁ
గీ. బాడురక్కసిగొడవలే పాడుకొనుచు, జాగరూకతఁ దత్సేవ సలిపినార,
మాజగత్కంటకుని మృతి నందఁ జేసి, మమ్ముఁ బ్రతికించినాఁడవు మైథిలీశ!

బ్రహ్మాదిదేవతలు పరమానందముతో స్వగృహముల కరుగుట

వ. ఇవ్విధమున. ౧౫౭

క. ఉరగులును మరుత్తులుఁ గిన్నరులుఁ బ్రజాపతులు గోగణము గుహ్యకులున్
గరుడులు వసువులు మును లచ్చరమూఁకయు మఱియు సౌరసంఘము లెల్లన్.

ఉ. ఆవిభుఁ జేరి యుత్సవము నారసి కన్నులపండు వౌనటుల్
భావము లూర సంస్తుతు లపారముగా నొసరించి, మీఁద సం
భావితు లై తదీయనిరుపద్రవలోకహితప్రవర్తనం
జే వివరించికొం చెవరియిండ్లకు వారలు వోయి, రీశ్వరీ! ౧౫౯

చ. హరిహరపంకజాసనులు నల్లె ముదంబున సన్నుతించి త
చ్చరితము లెల్లఁ బాడి నృపసత్తము భూమిసుతాసమేతు సు
స్థిరు ననుజన్మయుక్తు నభిషేకజలార్ద్రు మహాసనస్థు నీ
శ్వరు హృదయస్థుఁ జేసికొని సంస్మరియించుచు నేఁగి రత్తఱిన్. ౧౬౦

శ్రీరాముని యౌన్నత్యము

సీ. భేరులు మున్నగు సౌరవాద్యంబు లమోఘంబుగా దివి మ్రోఁగుచుండ
స్తుతిపూర్వకముగ దేవత లెల్లఁ గూడి ప్రహృష్టాత్ము లై పుష్పవృష్టి నింప
మునిసమూహములు నమోనమ యని హస్తపద్మముల్ ముకుళించి ప్రణుతిసేయ
జానకీలక్ష్మణశ్వసనపుత్త్రులుఁ గపివారంబుఁ దనచుట్టుఁ జేరి కొలువ
గీ. నల్లనగు కాయమును జిఱునగవు గులుకు, నెమ్మొగంబును శతకోటినీరజాప్త
దీప్తియుఁ బ్రసన్నతయు మీఱఁ దేజరిల్లు, చుండె రఘురామమూర్తియఖండలీల.

వ. ఇట్లఖిలలోకసుఖావహుండును రాణ్మహేంద్రుండు నయినరామచంద్రుండు పట్టాభి
షేకంబు వడయుటయు. ౧౬౧

క. పరిమళహీనసుమంబులు, పరిమళబంధురము లగుచుభాసిల్లె, వసుం
ధర పైరులతో నిండెను, బరమముదం బొసఁగెఁ దరులు ఫలవంతము లై. ౧౬౩

రాముఁడు బ్రాహ్మణులను వానరులను సన్మానించుట

వ. అప్పుడు నూఱువేలవారువంబులును లేఁదూడలతోఁ దేజరిల్లు లక్ష మొదవులును
నన్నియ యుత్తరగోవులును వృషభశతంబును విప్రుల కిచ్చె, మఱియు ముప్పది
కోట్ల సువర్ణంబులను బహువిధరత్నభూషణాంబరములను బరమసంతోషంబున
బ్రాహ్మణులం బూజించె. ౧౬౪

గీ. భాస్కరునికాంతితో దీటువడయునదియు,మానితాఖిలమణిమయ మైనదియును
నమలమగుహారమొక్కటియర్కసుతున,కొసఁగెభక్తవత్సలుఁడురఘూద్వహుండు.

క. అంగన! విను తారాత, న్వాంగప్రియసూనుఁ డయిన యంగదునకు ని
చ్చెం గౌతూహలమున షో, మాంగదయుగళంబు నమితమంగళకరమున్. ౧౬౬

రాముఁడు సీతచే హనుమంతునకు రత్నహారము నిప్పించుట

సీ. ఒకకోటిచంద్రుల కుద్దినై మణిరత్న, భూషితంబయి దీప్తిఁ బొదలుచునట్టి
హారిహిరణ్మయహారంబుఁ జెలువొప్ప, మిగుల భూషాత్రికమెసను వైచె,
ఆసాధ్వి యది దీసి హస్తంబునం బూని, పలుమాఱు కపులను బ్రాణవిభునిఁ
జూచెఁ, జూచినతోన సుదతీమనోగతా,భిప్రాయ మెఱిఁగి రఘుప్రభుండు
గీ. వనజముఖి! యిప్పు డిందున్నవారిలోన, నెవఁడు నాక్షేమవార్త నీ చెవి నిడియెనో?
యెవనికతమున సమ్మోద మెనసినావొ?, వాని కీ హార మిమ్మనుమాన మేల?

చ. అనవుడు సంతసించి వసుధాత్మజ రమ్మిటు రమ్ము నాయనా!
హనుమ! యటంచుఁ బిల్చి విభుఁ డాదరదృక్కులఁ జూచుచుండఁగా
వనచరపాళియందు బళి వహ్వారె యన్ రవ ముద్భవింపఁ బా
వనిసముదారకంఠమున వైచె సభర్తన్ బతిదత్తహారమున్. ౧౭౮

క. చారుతరహారమున సీ,తారామకృతాదరమున ధన్యాత్ముఁడు సా
మీరి ప్రకాశించె సభా,గారమునం దనుపమానగతి హైమవతీ! ౧౭౯

గీ. అపుడు కేల్మోడ్పుతోఁ దనయంతికమున,నున్న గుణవంతు నాంజనేయునిఁ గనుఁగొని
పలికె నివ్విధి జానకీపతి తదీయ,పరమభక్తికి సమ్మోదభరితుఁ డగుచు. ౧౮౦

క. కావలసినవర మడుగుము, పావని! నీయెడఁ బ్రసన్నభావము గలిగెన్
దేవతలకు దుర్లభతర,మై వెలయున దయిన నిత్తు నన ముదితుండై. ౧౮౧

హనుమంతుఁడు చిరజీవిత్వము నర్థించుట

సీ. ఆంజనేయుండు సాష్టాంగప్రణామంబు, గావించి యమృతంబుకన్న రుచ్య
మై మించునీరామనామ మేప్రొద్దు స్మ,రించెడి నామనం బించు కేనిఁ
దనివొంద కున్న దిత్తఱిఁ గాన సర్వదా, భవదీయనామంబుఁ బాడుకొనుచు
జగతిపై నుండెద, జగదీశ! నీపేరు,లోకంబునం దెంతదాఁకఁ బరఁగు
గీ. నంతకాలము నాతను వలరుఁగాక, వ్యాధులకు నెడమై పటుత్వంబు గలిగి,
యిదియ మువ్మాటికిని గడునిష్ట మయిన,వర మనుగ్రహింపుము దీనిఁ బరమకృపను.

రాముఁడు సామీరిని సఫలమనోరథుం జేయుట

వ. అని నిజాభిమతంబు దెలుప రఘుకులతిలకుం డట్లయగు నని వరంబు ప్రసాదించి
మఱియు నిట్లనియె. ౧౮౩

క. ధర జీవన్ముక్తుఁడవై, కరము సుఖస్థితిని బడసి కల్పాంతమునన్
హరివీర! పొందెదవు భా,స్వరతర మగుమామకీనసారూప్యంబున్. ౧౮౪

క. తదుపరి జానకి యనియెన్, ముదితస్వాంత యయి, సకలభోగంబులు నీ
కొదవుచు నుండు మదాజ్ఞం, గొదలే కెందున్నఁ బ్లవగకుంజర! యనుచున్.

వ. ఇట్లయ్యాదిమదంపతులచే ననుగ్రహింపం బడి, మేధావి పావని ముదితహృదయుం
డై యానందాశ్రుమిళితలోచనమ్ముల జానకీరాములకుఁ బునఃపునః ప్రణామంబు
లాచరించి. ౮౭౬

క. అనుమతిఁ గైకొని యపు డాఘనులను బాసి చనలేక కష్టతరముగాఁ
జనెఁ బ్లవగుల నెల్లర వీడ్కొని తప మొనరింప మంచుకొండకు, దుర్గా! ౮౭౭

రాముఁడు గుహుని సత్కరించి పంపుట

వ. అంతఁ బ్రాంజలి యై యున్న గుహుం జేరి నృపకుంజరుం డిట్లనియె. ౮౭౮

సీ. చతురామోద మై సర్వోత్తమం బయి, చెన్నారునట్టిశ్రీశృంగబేర
నగరమ్మునకుఁ బోయి నన్నె సంతతమును, ధ్యానమ్ము సేయుచు మానసమున,
ననుభవింపుము స్వార్జితాఖిలభోగమ్ము, లిహమున సుఖము లి ట్లెనసి కడకు,
రూఢి మదీయసారూప్యంబు వడయఁగాఁ,గలవు నెచ్చెలి! యని పలికి, మహిత
గీ. రాజ్యమును మేటిరతనాలరవణములును, భవనివారకవిజ్ఞానభాగ్యము నిడి
కౌఁగిటం జేర్చి పంప నాగౌరవమున, కాత్మఁ బొంగుచు నతఁ డింటి కరిగె, నంత.

క. వెలలేనినగల దువ్వలు, వలఁ దన వెనువెంట నటకు వచ్చిన కపిచం
ద్రుల నందఱఁ దదితరులను, నలఘుఁడు రాఘవుఁడు ముదితుఁ డై పూజించెన్.

సుగ్రీవవిభీషణాదులు రామాజ్ఞను బొంది నిజపురంబుల కరుగుట

వ. అట్లు సుగ్రీవప్రముఖవలీముఖలోకం బలోకసామాన్యుండును బరమాత్ముఁడు నగు
దాశరథిచే సత్కారంబు వడసి సంతుష్టస్వాంతములఁ గిష్కింధకుం జనియె. అంత
విభీషణుండును స్వహస్తగతనిష్కంటకరాజ్యలాభుం డై రఘుపతికల్పితపూజావిధా
నంబున కానందించుచు లంకకుం జేరె. నారీమణీ! యి ట్లెల్లరం బనిచి. ౮౮౧

గీ. అభిలషింపకయున్నను యౌవరాజ్య, పదవికిఁ లక్ష్మణుని బట్టభద్రుఁ జేసి
త న్నతఁడు భక్తి సేవింప ధరణి నేలె, రామచంద్రుండు పౌరానురాగి యగుచు.

సీ. నెలఁత! రాముండు దా నిర్వికారుఁడును గర్తృత్వాదిరహితుఁ డతీంద్రియుండు
నఖిలకర్మాధ్యక్షుఁ డమలుండుఁ బరముఁ డాత్మానందమునఁ దృప్తి నందువాఁడు
సుఖరూపుఁ డయ్యు వసుంధరపై మానుషాకృతి గొన్నవాఁ డగుటఁ జేసి
యఖిలలోకములకు నాదర్శకుం డయి, యుపదేశ మొనరించునూహతోడ

గీ. దేవగురుతుల్యులైనఋత్విజులఁ జేర్చి, దక్షిణాపూర్ణములుఁ గీర్తిదాయకములు
నైనయశ్వమేధాదిమహాక్రతువులఁ, జేసి నిర్జరులకుఁ దృప్తి చేసె నపుడు. ౮౮౩

శ్రీరాముని రాజ్యపాలనమునందలి ప్రజాసౌకర్యములు

క. సాధునుతుం డాతఁడు నిర్బాధముగాఁ బుడమినేలుపట్టునఁ దొలఁగెన్
వ్యాధిభయము, యువతులకున్, వైధవ్యమువలనిదుఃఖభారము డిందెన్. ౮౮౪

చ. చోరభయంబు దప్పెఁ, బరిశుద్ధమనంబుల నుండి రెల్లరున్
జారె నధర్మవృత్తి, విలసద్గతి సత్యము మీఱె, నిర్మలా
చారము హెచ్చె, దుష్టమృగసాధ్వస మంతము నొందె, వృద్ధులౌ
వారు సుఖాన నుండఁ బసివారికి మృత్యువు దూర మై చనెన్. ౮౮౫

చ. తరుణము దప్పకుండ సుఖదంబుగ మేఘచయంబు వర్షమున్
గురియుచునుండె, రాము ననఘున్ యజియించెడి యాస్థ గల్గి త
త్స్మరణము సేయుచుండిరి సమస్తజనంబులు, స్వాశ్రమైకధ
ర్మరతియు నన్యవిస్మృతియు రాజిలె నాపరిపాలనంబునన్. ౮౮౬

గీ. సర్వశుభలక్షణాఢ్యుఁడు సకలధర్మ, రతుఁడు రాముండు జనకుఁడు సుతులఁ బోలెఁ
బ్రజలఁ గూరిమి సాఁకుచుఁ బదునొకండు, వేలవత్సరములు రాజ్య మేలె రమణి!.

వ. ధనధాన్యవర్ధనంబును జిరాయురారోగ్యకరంబును బుణ్యదాయకంబును బరమ రహస్యంబును బవిత్రతరంబును నధ్యాత్మసంజ్ఞితంబు నగునీరామాయణంబు నీ కెఱింగించినవాఁడ నైతి, నింక నుత్తరకాండ మొండు గలదు. దానిని దరువాత వినిపింతు, నిందలిఫలశ్రుతి నాకర్ణింపుము. ౮౮౮

గ్రంథపఠనశ్రవణాదులవలనిఫలము

గీ. భక్తి గల్గి సమాహితభావుఁ డగుచు, ముదముతో దీని విన్నను జదివికొన్న
దురితతతినుండి మెల్లగఁ దొలఁగి హృదయ, గతమనోరథసాఫల్యగరిమఁ గాంచు.

గీ. ఆదినుండియు దీనిఁ బారాయణంబు, చేసి శ్రీరామపట్టాభిషేకకథను
భక్తి శ్రవణించునర్థార్థి పడయు ధనము, నమలమతి సుతుఁ గాంచుఁ బుత్రాభిలాషి.

గీ. రిపుల నిర్జించి సంపత్సమృద్ధ మైన, ధరణి ప్రాపింప దుర్జయత్వంబు వడసి
యుపశమితశోకుఁ డై సుఖముండు శ్రద్ధ, నీమహాసంహితను విన్నభూమిభర్త.

సీ. తతభక్తి నీచరిత్రం బాలకించిన, మానిని గొడ్డురా లైన మార
సుందరాకారుని నందనుఁ గన నోఁచు, శ్రవణఫలంబున సతులకుఁ గడు
మన్నన గల్గుఁ, గుమారు లాయుష్మంతు,లై యుంటఁ గని ముద మందు టబ్బు,
క్రోధాదిశత్రునిర్మూలంబు గావించి, గతమత్సరుం డయి కౌసలేయ
గీ. పాదపంకజభక్తిసంపన్నబుద్ధి, శ్రద్ధ నాలించు నెవ్వఁ డీ యుద్ధచరిత
మాతఁ డుద్ధూతకష్టుఁ డపాస్తభయుఁడు, నై నిరంతర మానంద మనుభవించు.

క. సుర లెల్లఁ బ్రసన్నత నుం, దురు, ఘనసంపదలు గల్గుఁ, దొలఁగును విఘ్నా
త్కర, మాదినుండి యధ్యా, త్మరామచరితంబు వినిన ధన్యాత్ములకున్. ౮౯ ౩

సీ. అంగన ముట్టైనమైదవదిన మాది, పండ్రెండుదినములు భక్తిగలిగి
యిష్టార్థదాయక మీ రామచరితంబు, నాలించె నేని దీర్ఘాయువుగల
మంచికుమారునిఁ గాంచుఁ, బతివ్రత, యయి గౌరవముఁ జెందు నవనియందు
సహారహంబును భక్తి నర్చించి గ్రంథమున్, మ్రొక్కువారలు పాపములను బాసి
గీ. జలజనాభునియుత్తమస్థానమునకుఁ బోదు, రీదివ్యగాథ సంపూర్ణముగ శ్ర
వణము చేసి పఠించినవారిపట్ల, జానకీవల్లభుఁడు సుప్రసన్నుఁ డగును. ౮౯ ౪

వ. రాముండు పరబ్రహ్మంబు గావున నా సర్వాత్మకుండు సంతృప్తుఁ డైనచో ధర్మార్థ కామమోక్షంబులం దెది గోరిన నది లభించు. ఆయుష్కరంబును, నారోగ్యప్రదంబును, గల్పకోటిసముత్పన్నకలుషవలాహకజంఝానిలంబును, నఖండితము నగు నీయధ్యాత్మరామాయణంబు సాకల్యంబుగ వినుట యెల్లరకు ముఖ్యంబు. ఏతచ్ఛ్రవణరూపమహాఫలంబున నాదిత్యాదిగ్రహంబులును బితరులును బ్రీతు లగుదురు. మఱియుఁ బురాతనంబును వైరాగ్యవిజ్ఞానయుతము నగు నీగ్రంథరాజంబు శ్రోతృపఠితృలేఖకలోకంబునకుఁ బునర్భవనివారకం బయి శోభిల్లు, నని యివ్విధంబున.

సీ. ఏకాగ్రబుద్ధి ననేకపర్యాయమ్ము, లఖిలదేవావళి నరసి చూచి
భవతారకం బగు బ్రహ్మంబు విష్ణ్వవ, తారంబులందుఁ బ్రధానమూర్తి
యగురాముఁ డని నిర్ణయముఁ జేసికొనియున్న, భవుఁడు తదాగమభాగసార
సిద్ధాంతముల నేర్చి, శ్రీరాముని రహస్య, తత్త్వరూప మగు నధ్యాత్మరామ
ఆ. చరిత మనెడిపేర సంక్షేపముగను విస్పష్టముగను శాస్త్రసమ్మతముగఁ
౫ ప్రియకు నుమకుఁ జెప్పెఁ బ్రీతి ద్రాక్షారస, మాననీయ మైనమధురశైలి.

కాండాంతపద్యములు

చ. దళితమహేంద్రనీలమహితచ్ఛవిశోభితసుందరాంగ ! యు
జ్జ్వలశరచాపహస్త ! పితృవాక్పరిపాలనశస్త ! నిత్యమం
గళ ! నిరుపద్రవా ! నిగమగంధిలపుష్పసమర్చనీయ ! ని
స్తులభుజవీర్య ! వైరికులశోషణ ! భాస్కరవంశభూషణా ! ౮౯౭

(ద్రుతవిలంబితము)

ప్రమథనాథశరాసనభంజనా !
శమదమాదికసద్గుణరంజనా !
విమతచక్రపరాక్రమబాధకా !
నమదుదగ్రభవామయశోధకా ! ౮౯౮

క. నిత్యప్రసన్న ! సతత, ప్రత్యయగోచర ! నిశాటపటలపటుత కా
ర్దత్యనిరాసక ! సత్సాంగత్యాదిగుణానురాగి ! కమలాయోగీ ! ౮౯౯

గద్య.

శ్రీమద్భారద్వాజగోత్ర, సీతాంబికాపున్నయార్య చతుర్థపుత్ర,
రామచంద్రకృపాపాత్ర, సూరిజనవిధేయ,
నారాయణనామధేయ ప్రణీతంబగు
నాంధ్రాధ్యాత్మరామాయణంబున
యుద్ధ కాండము
సంపూర్ణము.



శ్రీ ర స్తు

శ్రీ సీతారామాభ్యాం నమః

# ఆంధ్రాధ్యాత్మరామాయణము

## ఉ త్త ర కా ం డ ము



చిత్సౌధవిహారా !
వాచంయమిరమణవినుతపదపంకరుహా !
మేచకదేహా ! యాచక
ఖేచరభూజాత ! జానకీహృన్నేతా ! ౧

వ. అవధరింపు మట్లు మహాదేవునివలన భవదీయపట్టాభిషేకమ్మువఱకు జరిగినకథ నాలించి తచ్ఛ్రవణమ్మునం దనివి సనని మనంబున నంబిక మరల నిట్లనియె. ౨

### పార్వతి పరమేశ్వరుని బ్రశ్నించుట

గీ. భీమవిక్రముఁ డారఘురామమూర్తి, రావణప్రముఖాఖిలరాక్షసులను
గలనఁ బొలియించి పురి ధరాకన్యతోడ, నెలమిఁ బట్టాభిషిక్తుఁ డై యేమి చేసె.

క. పరమాత్మ సనాతనుఁ డ,త్తెఱఁగున మాయామనుష్యదేహముతోడన్
నిరుపమలీలలఁ జూపుచు, ధరణీస్థలి నెన్నియేండ్లు తా నుండె శివా!. ౪

క. కడ కెట్లు మర్త్యలోకము, విడిచి చనె రఘూద్వహుండు, విశ్వేశ్వర! యి
వ్వెడ శ్రద్ధావతి నగు నా,యెడఁ గారుణ్యమునఁ జేసి యెఱిఁగింపఁ దగున్. ౫

క. ఆమయదూరం బగు శ్రీ,రామకథామృతరసంబు ద్రావినకొలఁదిన్,
నామది తని వొందక తృ,ష్ణామేదుర మగుచు నుండెఁ, జంద్రార్ధధరా! ౬

క. కావున వివరముగా న,ద్దేవునిచరితంబు ముగియఁ దెలుపుఁ డనఁ, గృపా
భావుఁ డఖిలవిదుఁ డభవుఁడు, దేవీ! విను మనుచు నిట్లు దెలియం బలికెన్. ౭

పరమేశ్వరుఁడు పార్వతికి నుత్తరరామకథను దెలుపుట

క. వసుధాభర మడఁగింపఁగ, నసురవధముఁ జేసి జగతి కంతకు దొర యై
యసితఘనాంగుఁడు రాముం, డసదృశగతి రాజ్య మేలునాసమయమునన్. ౮

సీ. గాధేయుఁ డసితుండు కణ్వుఁ డంగిరసుఁడు వామదేవుండు దుర్వాసుఁ డత్రి
ముని శిష్యగణయుక్తుఁ డనఘుఁ డగస్త్యుండు భృగువు కశ్యపుఁడు మున్నగుమహర్షు
లందఱు జానకీశాభినందనవాంఛ నరుదెంచి సాకేతపురికి, రాము
నగరువాఁకిట నిల్చి నగరాజనందిని! ద్వారపాలునితోడఁ బలికి రిట్లు

గీ. వేగ నీ వేఁగి "మీకు దీవెన లొసంగి, సమ్మదముఁ గూర్పఁగా ఘటజన్మముఖులు
తాపసులు వచ్చి వాఁకిటిదండ నిలిచి, యున్నవా" రని చెప్పు రఘూత్తమునకు. ౯

చ. అనుటయు వాఁడు కుంభజునియానతి వైళమ లోస కేఁగి యొ
య్యనఁ బతి డాసి మ్రొక్కి వినయావనతుం డయి మోడ్పుఁగేలుతో
ననియె, మహాప్రభూ! మునిగణావృతుఁ డై మిముఁ జూచుకోర్కి వ
చ్చి నిలిచియున్నవాఁడు కలశీసుతుఁ డేను వసించువాఁకిటన్. ౧౦

క. నావుడు సంతసపడి సీ,తావిభుఁ డీ జాల మేల దౌవారిక! యా
పావనుల యథాసుఖముగ, నీ విచటికిఁ దోడితె మ్మనియె, వనజాక్షీ!. ౧౧

వ. అంత వాఁడును. ౧౨

గీ. విభునియానతి మై మానివిభులకడకుఁ,బోయి సెల వయ్యె నిఁక దయచేయుఁ డనుచుఁ
బూజితులఁ జేయ, వారలు పొంగి చొచ్చి, రఖిలరత్నభూషిత మగు నధిపునగరు.

సీ. అరుదెంచుచున్నమహర్షుల నల్లంతదవ్వునఁ గని రామధరణివిభుఁడు,
సింహాసనము డిగ్గి శీఘ్రంబ చేతులు జోడించి యెదు రేఁగి యొడితగతి
నర్హాక్రమంబున నర్ఘ్యపాద్యాదులఁ బూజించి మధుపర్కమునకు నొక్క
వృషభంబు నిడి మ్రొక్కి వేర్వేఱుగా నుచితాసనంబులఁ బెట్టె నందఱకును

గీ. నట్లు రామునిచేఁ బూజ లంది మౌను, లాసనస్థితు లై ముదితాంతరంగు
లగుచు సంపృష్టకుశలు లై యవలఁ దమ కుశలసమాచారమును దెల్పిపలికి రిట్లు.

అగస్త్యాదిమహర్షులు శ్రీరాము నభినందించుట

ఉ. అంతట నీకు సేమమె కదా రఘుపుంగవ! విద్విషత్సమూ
హాంతక! నేఁడు ని న్నిటు హతారిని మాసుకృతంబుపెంపుచే
నెంతయుఁ జూడఁ గంటిమి, బళీ విలు పూని జగత్త్రయంబు ని
ర్జితువు పంక్తికంఠుని వధించుట నీ కొకభారమే కనన్? ౧౫

క. రావణుఁడు మున్ను గాఁగల, దేవారులు క్రూరమతులు దెగి రొక్కట యు
ద్ధావనిలో నీవలనను, భావింపఁగ మామకీనభాగ్య మిదెల్లన్. ౧౬

గీ. సాధ్య మగు రావణువధమ్ము జరిగె దాని, కేమి యింద్రజిద్వధ మది యెంత యే న
సాధ్య మయ్యది గూడ సుసాధ్య మయ్యె, నో మహాభుజ! నీదు మహోగ్రశక్తి.

చ. అలఘులు కుంభకర్ణముఖు లంతకతుల్యులు దైత్యు లెల్లరుం
గలన గతాసు లైరి పవికల్పపటుప్రదరంబులన్, మహీ
తలమును దేజె, నీ యభయదక్షిణ మున్నె యొసంగినావు మా
కల వనభూమిఁ జొచ్చినపు డందఱము న్నిను గాంచి వేడఁగన్. ౧౮

చ. దితిజులఁ జంపి తొల్లిఁటిప్రతిజ్ఞ యథార్థ మొనర్చి మేల్కృతా
ర్థత మనఁజాలినావు, రఘురామ! యటంచుఁ బ్రశంస చేయఁగా,
నతఁ డనె భావితాత్ములు మహర్షులు త న్నటు లంటకున్ సువి
స్మితుఁ డయి నమ్రభావమునఁ జేతులు మోడిచి వారితోడుతన్. ౧౯

గీ. దశముఖుని ముజ్జగంబు లుద్ధతి జయించు, కుంభకర్ణాదిరాక్షసకుంజరులను
వీడి యొక యింద్రజిత్తు నివ్విధిఁ బ్రశంస, చేసినార లిదేమి? ఋషీంద్రులార! ౨౦

*క. అందఱకంటెను మిన్న య్యనం దగినవిశేష ముండినన్ దానవరా
ణ్ణందను కడఁ దెలుపుఁ డనన్, సందేహము వాయఁ గుంభజన్ముఁడు వలికెన్. ౨౧

అగస్త్యుఁడు రామునకు రావణాదుల పూర్వచరిత్రమును జెప్పుట

సీ. ఇనవంశమండన! యింద్రజిద్రావణుల్ పుట్టినవిధమును, బొగరు మిగులఁ
జేసిన చేష్టలున్, గాసికి నోర్చి తపంబున మెప్పించి పద్మగర్భు
నతనిచే వరముల నందినతెఱఁగును, సర్వంబుఁ జెప్పెద సంగ్రహముగ
విను, మున్ను కృతయుగంబునఁ బంఙితుండు మహామనస్కుండుఁబితామహసుతుఁ

గీ. డగుపులస్త్యబ్రహ్మయుఁడు తప మాచరింప, నరిగి మేరువుచెంతకు, నందలి తృణ
బిందు నాశ్రమసీమ నస్పందగతి వ,సించె నాకమ్మపఠనమ్ముఁ జేసికొనుచు. ౨౨

సీ. అమల మై మిగులరమ్యం బయి పొల్పునయ్యాశ్రమమందు దేవాంగనలును
గంధర్వకన్యలు గాన మ్మొనర్చుచు నృత్యమ్ముఁ జేయు చనేకగతుల
నవ్వుచు వాద్యస్వనంబులఁ గొల్చుచుఁ దపమునకున్ విఘ్నదశ ఘటిల్లు
కరణి నెల్లెడలను జరియింపఁగాఁ, బులస్త్యబ్రహ్మ చూచి క్రోధాత్ముఁ డగుచు,

గీ. నిదిమొదల్కాని నాదృష్టిపథమునందుఁ, బడినసతు లెవ్వ రేని గర్భంబు దాల్తు
రని శపించె, నందులకు భయమ్ముఁ జెంది, మాని రచటికిఁ బోవ నమ్మానినులును.

వ. రాజర్షి యగు తృణబిందుని నందన యమ్మాట వినమిం జేసి నిర్భయంబుగ ము
న్యగ్రేసరు నగ్రతలంబునం దిరుగుచుఁ దన్నయనగోచర యై శాపాతురంబులకు
గుఱి యయ్యె. ౨౪

### కుబేరుని జననము

క. ఒడలెల్లఁ దెల్లనై వ్రెల్లడిచేయంబడినగర్భలక్షణముల నే
ర్పడినవివర్ణతఁ గని భయ్యపడి వడి నాకన్య తండ్రిపజ్జకుఁ జనియెన్. ౨౫

ఉ. భీతిలి వచ్చినట్టితనబిడ్డను గన్గొని యమ్మహౌజసుం
డాతురతన్ వహించి తనయాతను వీగతి మార్పుఁ జెందఁగా
హేతు వదేమొకో? యనుచు నించుక యోజన చేసి రామభ
ద్రా! తుది సర్వముం దెలిసెఁ దాపసకృత్యము జ్ఞానదృష్టిచే. ౨౬

చ. అనఘచరిత్రుఁ డాతపసి, యాయనమాటకు నడ్డు లే దిఁకన్,
నినుఁ గొనిపోయి యమ్మునికి నెమ్మి నొసంగెద భార్యగాఁగ ర
మ్మని ప్రియపుత్త్రితోడ వినయంబు చెలంగఁ బులస్త్యుఁ జేరి యి
చ్చెను దృణబిందు "వీకొమిరెఁ జేకొనుఁ" డంచు వచించి రాఘవా! ౨౭

ఉ. ఇచ్చిన "మంచిదే"యని గ్రహించె ధరామరమౌళి, యామెయుం
బొచ్చెము లేనిభక్తిని విభుం డలరం బరిచర్య సేయుచుం
దచ్చరణాంబుజంబుల నెదం గదియించి తగన్ భజించుచున్
నిచ్చలుఁ గొల్చుచుండె రఘునేత! సతీతిలకాయమాన యై. ౨౮

సీ. ఆయమశుశ్రూష కపరిమితానందచిత్తుఁ డై యత్తాపసోత్తముండు
లలన! నీ కుభయకులంబుల నభివృద్ధిఁ బొందించునొక్కసుపుత్త్రు నిత్తు
ననె, నంతఁ దదనుగ్రహంబున నక్కాంత గనియెఁ గుమారు జగత్ప్రసిద్ధు,
బ్రహ్మకు నెనవచ్చుపరమర్షి యై విశ్రవసుఁ డనుపేరున వఱలె నతఁడు,
గీ. తత్పవిత్రచరిత్రంబుఁ దత్సమగ్ర, సుగుణసంపద్విశేషంబుఁ జూచి మెచ్చి
మహితమూర్తి భరద్వాజమౌనిచంద్రుఁ, డాత్మసుత నిచ్చె భార్యఁగా హర్షమునను.

క. విశ్రవసువలన నాయమ, వైశ్రవణుని లోకవిహితవర్తనుని ద్రయీ
విశ్రుతుని బితృసమున్ విబుధశ్రేణి నుతింపఁ గనియె, దశరథరామా! 30

### కుబేరుఁడు లంకను రాజధానిఁగాఁ బడయుట

చ. తదుపరి యాతఁ డాత్మచరితంబున నబ్జజు మేల్పొగడ్తకుం
గుదు రయి, దీక్ష నమ్మహితుఁగూర్చి తపం బొనరింపఁ దన్మనో

రథము ఫలించునట్లుగ సరస్వతిభర్త యిడెఁ ధనేశతా
పదవి నఖండితమ్ము, నిటు ప్రాప్తవరుం డయి యక్షనాథుఁడున్. ౩౧

సీ. బ్రహ్మదత్తంబు విభాసమానంబు పుష్పకవిమానంబున జనకుకడకుఁ
జని వందనముఁ జేసి తనతపఃఫలము సర్వంబును వినిపించి పలికె నిట్లు,
నాయనా! భగవానుఁ డా యజుం డుత్తమవర మిచ్చి నివసింప వసతి యొసఁగ
కుండె, నే నెయ్యెడ నుండు "నాస్థలమున కేల వచ్చితి"వని యెవ రయినను
గీ. హింస పెట్టకయుండు తా వేర్పఱింపు, మనుడు, లవణాంబురాశిమధ్యను నిశాట
గణము నివసించుటకు విశ్వకర్మ గట్టె, నట్టి పట్టణరాజ మొం డలరుచుండు. ౩౨

ఉ. అచ్చటిదైత్యు లెల్ల దనుజారికి నోడి రసాతలంబులోఁ
జొచ్చిరి భీతచిత్తు లయి, శూరుల కేని నసాధ్య మప్పురం,
బిచ్చకు వచ్చినట్లు సుఖయింపుము, నీ కది యెంతయేని న
భ్యుచ్ఛ్రయదాయకం బగును బో యిఁక నందియ మంద నేటికిన్. 33

వ. అప్పురభేదనం బింతకుము న్నన్యాధిష్ఠితంబు కాలే దని, పౌలస్త్యుండు దెలియఁ జెప్పె. అప్పుడు శ్రీదుండు తండ్రియానతిం బోయి, లంకం బ్రవేశించి యందుఁ బితృసమ్మతుం డై చిరకాలంబు సుఖంబుండె, నంతఁ గొంతకాలమ్మునకు సుమాలి యనునొక్కరక్కసుండు. ౩౪

సుమాలి కైకసి యను తనకూఁతును విశ్రవసు కడకుఁ బంపుట

క. అనుపమలావణ్యను దన, తనయను లక్ష్మి కెనయయినదాని నొకర్తెఁ
వెనువెంటఁ గొని రసాతలమును వీడి మనుష్యలోకమున కేతెంచెన్. ౩౫

సీ. వచ్చి కన్నియతోడ వాఁ డీజగమ్మున సంచరించుచు రామచంద్ర! యొక్క
నాఁడు పుష్పకవిమానంబున విహరించుచున్న కుబేరునియున్నతి గని
వెరవరి యాట "నవ్విధి నధోలోకమం దణఁగియుండిన రాక్షసాన్వయమున
కీ మహాదశ పట్టు టె" ట్లని మది విచారించి పుత్త్రికిఁ దిలకించి పలికె,
గీ. నమ్మ! నీకు వివాహయోగ్య మగునీడు, వచ్చియున్నది చూడ యౌవనముగూడ
నతిశయించెడుఁ బరిణయం బాచరింప, కింక నిలుపంగఁ జెల్ల దే దెట్టులైన. ౩౬

గీ. "దోష మెన్ని తిరస్కరింతు" వనుభీతి, నిన్ను వరు లెవ్వ రర్థింప కున్నవార,
లట్టి నీ విప్పు డబ్జగర్భాన్వయమునఁ, బుట్టినట్టివిశ్రవసుఁ జేపట్టు టొప్పు. ౩౭

ఉ. ఆ మునిభార్య వైనఁ దమయంత సుతుల్ ధనదోపమాను లు
ద్దామబలాఢ్యు లీదృశులు దప్పక నీ కుదయింతు, రత్తప

సీనము నన్ను గ్రహమ్మునను జేకుఱు సర్వశుభంబు, లింకఁబై
వేమఱు చెప్ప నేల? చని విశ్రవసుం వరియింపు మమ్మరో! ౩౮

వ. అనుటయు. ౩౯

ఉ. సమ్మతిఁ జెంది కైకసి ప్రశస్తగతిం మునియున్న వృతువా
టమ్మును జేరఁబోయి, యెదుట న్నిలుచుండె ధరాస్థలిం బదా
గ్రమ్మున వ్రాయుచుం వదనకంజము వాంచి, తదా తదీయరూ
ప మ్మలరింపఁ జేయుటను రాఘవ! భూసురవర్యుఁ డిట్లనెం. ౪౦

క. ఎవతెవు నీ? విచ్చటి కేమి వలచి వచ్చితివి? కన్నె మిన్నరో! నీ యు
ద్భవమునకుఁ గర్త లెవ్వరు?, వివరింపుము నావు డాపె విహితాంజలి యై. ౪౧

క. నన్నడుగు టేటి కీశే, మన్నిజవృత్తంబు ధ్యానమహిమ నెఱుఁగుఁడీ
యున్నది యున్నటుగా నని, తిన్నగఁ బ్రత్యుత్తరంబు దెలిపెను రామా! ౪౨

క. అమ్మెయి నమ్మునిపతి ధ్యానమ్మున నొకనిమున ముండినం దోఁచె సమ
స్త మ్మాకన్నియవృత్తాంత మ్మంతట జాలి నొంది తాపసుఁ డనియెన్. ౪౩

సీ. కైకసి! నీమనోగతవాంఛితార్థమ్ముఁ దెలిసికొన్నాఁడ, నావలన సుతులఁ
బడయంగ నుంటివి, పాప మే నేమిచేయుదు? నందులకు, నిమ్మహోగ్రవేళఁ
జనుదెంచినావు గావునఁ గ్రూరకర్ము లిర్వురు రాక్షసులు నీకుఁ బుట్టువారు,
నావుఁడు జకితమానస యయి యోయమ యలఘుచరిత్ర! నీవలనఁగూడఁ

గీ. గడకు నిటువంటికొడుకులా కలుగు; టిట్టి, సుతులఁ గన్నట్టివారి కేసుఖముదక్కు
నుర్వి నిందలపాలగు టొకటిదక్క; దయదలిర్పఁగఁ జెఱుమార్పుఁ దలఁపు మయ్య.

వ. అనుటయు. ౪౫

చ. వలదు విచార మిందులకు, వారలు గల్గినమీఁద బుద్ధిమ
త్తిలకుఁడు సాధుపూరుషవిధేయుఁడు భాగవతాగ్రగణ్యుఁ డు
జ్జ్వలుఁ డఖిలేశరామపదవారిరుహభ్రమ రాయమాణుఁడుం
లలితచరిత్రుఁ డుద్భవిలు నాతి! తృతీయుఁడు నీకు వేడ్కమై. ౪౬

క. వారికి వానికి నడుమఁ గుమారి దురాచారనక్తమానన భయదా
కార నొకర్తుకఁ గనియెదు, సారసదళనయన! యనుచు సంయమి పలికెన్. ౪౭

వ. అంత నమ్మునివచనమ్మునం జేసి. ౪౮

రావణాదుల జననప్రకారము

క. పదితల లిరువదికరములు,ను దారుణాకృతియుఁ గలతనూజు జగద్భీ
తిదు రావణాఖ్యుఁ గనియెను, ద్రిదశేశ్వరు నింద్రుగుండె దిగ్గురు మనఁగన్ ! ౪౯

ఉ. వాఁడెను గల్పవృక్షసుమవర్గము, భాస్కరమండలంబు దా
వీడెను నైజతేజ, మతివేలము లయ్యెను వార్ధు, లుర్వియుం
గూడఁ జలించె, భూతములకుం మతి వ్రాయిన యట్టు లయ్యెఁ జూ;
వాఁ డుదయించుమాత్రమున, వారిరుహప్రియవంశమండనా ! ౫౦

సీ. పిమ్మట నాపెకుఁ బెనుగొండతో దీటు గాంచఁజాలినకుంభకర్ణుఁ డొదవె
నంత వారలచెల్లెలై భీకరాకృతి శూర్పణఖానామసుత జనించెఁ
దదనంతరమున స్వాధ్యాయి శాంతాత్ముఁడు ధర్మశీలుఁడు సౌమ్యదర్శనుండు
నియతాశనుండును నిత్యకర్మపరాయణుండు విభీషణాఖ్యుండు వొడమె,
గీ. వారిలోఁ గుంభకర్ణుఁ డట్టివాఁడు దుష్టచిత్తుఁడై నిత్యసంతుష్టచేతసు లగు
మునుల భూసురవర్యులఁ దినుచు నుగ్రభంగిఁ జరియించెఁ దెఱగంటిపదువు బెదర.

క. అనఘా ! ప్రాణివినాశం,బునకుం బెనురోగ మట్లు భువనవినాశం
బున కై వృద్ధిం బొందెను, ఘనసత్త్వుఁడు రావణుండు కర్కశభంగిన్. ౫౨

వ. అనిచెప్పి మఱియు నిట్లనియె. ౫౩

అగస్త్యకృత మగు శ్రీరామప్రశంస

సీ. జానకీశ్వర ! నీవు సాక్షివి సర్వహృన్నిలయస్థితుండవు నిర్మలుండ,
వరయ దంతగకరణాదిసాహాయ్యముఁ గొనక విజ్ఞానదృక్కున సకలముఁ
బ్రకృతిజీవులకంటెఁ బరముండ వనవరతోదితుండవు, విబుధాదరమునఁ
దాల్చినాఁడవు వినోదముగ నరాకృతి, నాత్మీయమాయయం దంరి సృష్టి
గీ. రముగ మాయాగుణానుబంధముఁ బడయక, రాజిలుచునుందు, విట్టిసర్వజ్ఞుముందుఁ
బంక్తివదనాదిదానవోత్పత్తి విధము, నన్యుఁ డెఱిఁగించు టన్న హాస్యంబు గాదె.

సీ. ఏను మూఢతముండ నైనను శ్రీరామ ! నీయనుగ్రహమున ని న్నొకనిఁగ
జ్ఞానస్వరూపునిఁగా, ననంతునిఁగ, నాశములేనివానిఁగ జన్మరహితుఁ
గా, నెన్నశక్యముగాని మాయాశక్తి యమరువానిఁగ, విదితాత్మతత్త్వ
నిఁగ నెఱుంగుదు, భవన్నిజరూప మంతఱి కరయరాకుండ నరాకృతి యను
గీ. యవనికం గప్పిపుచ్చితి వని యెఱుఁగుదు, నఖిల మెఱిఁగియుఁ దెలియనియట్లు పృచ్ఛ
సేయుకతమున మీయాజ్ఞఁ జేసి నేఁడు, నోరు మెదలించుచున్నాను వేఱుగాదు.

క. అనవుడుఁ గుంభజు పల్కులు, విని వారిరుహాప్తకులపవిత్రుండు యశో
ధనుఁడు రఘూత్తముఁ డనిమ్మెఱ మునితో మొగమునను నగవు ముద్దులు గులుకన్.

గీ. మౌని! నాయందు నితరంబు లేనికతన, నఖిలధర్మకర్మములు మాయాశ్రితముల
యైన; నవి మామకములుగా నాత్మ నెంచి, ప్రస్తుతించుటచేఁ గల్గుఁ బాపహరము.

ఉ. దాని నటుండ నిచ్చి ప్రకృతం బగుతత్కథ మాకుఁ దెల్పుమా
వీనులవిందుగా, ననుడు విప్రవరుండు ప్రమోదపూర్ణుఁ డై
భానుకులాగ్రగణ్యుఁడు సభాసదులున్ వినుచుండ నిట్లనెన్
దానవలోకనాథుచరితం బఖిలంబును, హంసగామినీ! ౫౮

ఉ. అంతటఁ గొంతకాలమున కచ్చటికిం బితృదర్శనార్థ మై
మంతన మొప్పఁ బుష్పకవిమానమునన్ ధనదుండు రాఁగ, భా
స్వంతునిమాడ్కిఁ దేజరిలువాని మహోన్నతిఁ గాంచి కైకసీ
కాంత సహింప లేక దశకంఠునిచెంగటి కేఁగి యి ట్లనెన్. ౫౯

ఉ. ఓరికుమార! తేజమున నున్నతుఁ డైనకుబేరుఁ జూచితే?
యీ రహి నీకుఁ గల్గుటకు నై తగుయత్న మొనర్పు మీపయిం,
జారువిమానమందు విలసత్ప్రథుతేజముతో వెలుంగు ని
న్నారసి కన్నులార ముద మందెడుభాగ్యముఁ గూర్పవే వొకో. ౬౦

వ. అనుటయు మాతృభాషణంబున దోషాచరేంద్రుండు సంతుష్టుం డై, కుపితమాన
సమ్మున ని ట్లనియె. ౬౧

గీ. తల్లి! నామాట విను శపథం బొనర్తు, నర్థపతికిఁ దుల్యుండనో యంతకంటె
నధికుఁడనొ యయ్యెదను; భవదభిలషితము, సంఘటింపఁగ లేనినాజన్మ మేల? ౬౨

క. సంతాపము నొందకు మిది, యెంతటిపని మాదృశుల కహీనవ్రత! ని
శ్చింతన్ మెలఁగుము వాణీ, కాంతుని మెప్పించి వరముఁ గైకొని వత్తున్. ౬౩

రావణాదులు తపస్సు చేయుట

క. అని యూఱడించి తల్లిని, ననుజుల వెంటఁగొని యాప్తితావాప్తికి నై
యనితరసాధ్యతపంబుం, బొనరుప గోకర్ణమునకుఁ బోయె నతండున్. ౬౪

సీ. అమ్మహాక్షేత్రమం దాసోదరులు ముమ్వు రనుకూల మగుతావు లరసి నిర్ణ
యముఁ జేసికొని నియమముఁ బూని వేర్వేఱ భీకరం బఖిలలోకైకతాప

నంబు దుష్కరము నైనతపంబుఁ గావింప మొదలిడి, రనఘ! పట్టుదలతోడ,
పంక్తికంఠుండు దివ్యసహస్రవర్షమ్ము లనశనవ్రతధారి యై వసించె,

గీ. దశసహస్రవత్సరము లుదగ్రభంగి, నిలిచెఁ గుంభకర్ణుండు, నిర్మలుఁడు ధర్మ
భావుఁడు విభీషణుం డేకపాద మూఁది, యైదువే లేఁడు లుండె నేకాగ్రబుద్ధి. ౬౫

వ. పంక్తిముఖుండు దనకుఁ బదివందలయేండ్లు పరిపూర్ణం బగుటయు. ౬౬

క. శిర మొండు ఖరతరాసిఁ, సరగునఁ దెగఁగోసి వేల్చె జ్వాలనునియం ద
చ్చెరువంద జగము తేజస్స్ఫురణ యొకింతయును బొల్లుపోవని తెగువన్. ౬౭

క. తొమ్మిదివేలేం డ్లిటు తన,తొమ్మిదిశిరములను ద్రుంచి ధూమధ్వజునం
ద మ్మానవాశనుఁడు హోమ మ్మొనరిచెఁ, బద్మినీరమణకులతిలకా! ౬౮

బ్రహ్మ రావణాదులకు వరము లొసఁగుట

చ. పదియవవేయిగూడఁ గడఁబట్టుటఁ గాంచి యదేవిధంబుగాఁ
బదవశిరమ్ముఁ ద్రెంపఁగఁ గృపాణముఁ గైకొనునంతలోన స
ద్హృదయుఁడు పంకజాసనుఁ డతిత్వరితమ్ముగ నంచతేజిపైఁ
బొందలుచు వచ్చి యాదనుజుపూన్చినఖడ్గము నాఁపి యి ట్లనెన్. ౬౯

ఉ. వద్దిఁక వద్దు సాహసము వత్స! ననుం గను మేసనం దప
శ్శుద్ధు వ్రతానురక్తు నినుఁ జూడఁగ వచ్చినయబ్జగర్భుఁడన్,
దద్దయుఁ బ్రీతుఁగాఁ జలిపెఁ దావకభక్తియు సత్తపంబు, న
న్మద్దయ కిష్టపాత్రుఁడవు సత్యము, కోరు మెదే నొసంగెదన్. ౭౦

క. నావుడు హృష్టాత్ముం డయి, రావణుఁ డంజలి యొనర్చి రాజీవభవా!
నీవు వర మిత్తు వేనిం, గావలయును నాకుఁ జావు గలుగమి యెపుడున్. ౭౧

క. సురగరుడోరగయక్షా, సురులవలనఁ బొలియకుండఁ జూడుము చాలున్,
నరు లన్న గడ్డిపఱకలు, సరసిజభవ! వారిఁ గూర్చి చర్చ యదేలా.౭౨

క. నానావిధదేవాసుర, యోనిసముద్భవులఁ దక్క నుర్వీస్థలి నె
వ్వాని నొకలెక్క చేయఁడు, దానవవిభుఁ డితఁడు, గాన దయయుంచు మటుల్.

వ. అని యవధ్యత్వ మర్థించువిబుధద్వేషికి సంతోషమ్ముగ వరంబు ప్రసాదించి విరించి
మఱియు ని ట్లనియె. ౭౪

ఉ. కోసి కరాసి నొక్కొకటి గొంకక మండెడు నగ్ని హోమముం
జేసినయట్టి నీతలలు చెన్నుదొఱంగక తొంటిరీతిగా

భాసిలు నేఁటినుండియును, బంక్తిముఖా! "వర మున్న దింక నా
తో సరి యెవ్వఁ"డంచుఁ జెడుత్రోవలు ద్రొక్కక సంచరింపుమా. ౨౫

క. అని యచటు వాసి భక్త్యావనుఁడు విభీషణుఁ గృతాభివందనుఁ గని, నా
యన! చేసితి వుత్తమతపమును ధర్మార్థముగ, నడుగుము వరం బిత్తున్. ౨౬

క. వరదాతను "నీకుఁ డేగతిఁ, జరియించునో మీఁద" నను విచారాంబుధి నే
త్తెఱఁ ద్రోయువారిఁ జేరని, సరసుండవు నీవు నీదుసమ్మతిఁ జెపుమా. ౨౭

వ. అని మరాళయానుండు మందస్మితాననంబునం బలుకఁ బ్రణతుం డై విభీషణుం
డంజలి వట్టి వినయ ముట్టిపడ నిట్లనియె. ౨౮

సీ. దేవరవారికి నావంటివానిపై దయ గల్గుటే చాలు, దానికంటె
నెక్కు డేమున్నది "యీప్సితార్థంబుల నిచ్చెద" ననివచ్చు టెంతమాట;
జగదీశ! నాబుద్ధి శాశ్వతధర్మంబు నందు నిల్చెదుఁగాక యనవరతము,
నెచ్చోట నైన మ ఱేవేళ నైన నధర్మమార్గంబునఁ దగులకుండు

గీ. గాక, యేమఱియును నాల్క కఠినభంగిఁ, బలుకకుండుత, ముపకారపరత మెలఁగుఁ
గాత సర్వావయములుఁ, గరుణ నీ వరమ్ము నొసఁగుఁడి యిదియ సర్వమ్ము నాకు.

వ. అనుటయుఁ బరమేష్ఠి సంతుష్టుం డై. ౩౦

క. ఘనముగ నీకోరిన వెల్ల నొసంగితి, నల్లె కాఁగలవు నీ విఁకఁబై,
విను వత్స! యడుగకున్నను, మనసారఁగ నిచ్చినాఁడ మరణము లేమిన్. ౩౧

చ. తదుపరి కుంభకర్ణు సవిధంబునకుం జని, వత్స! లెమ్ము నె
మ్మదిఁ గలకోరికం దెలుపుమా యన, వాఁ డనె నాయెడన్ దయా
హృదయుఁడ వైతి వేని నిదురించుట లాఱునెలల్ భుజించు టొ
క్కదినముగా వరం బిడుము, కంజభవా! యని వాణిప్రేరణన్. ౩౨

క. వర మతఁ డట్లడుగుటయున్, సురలను బరమేష్ఠి యోరచూపునఁ గనుచున్
జరుగు భవదిచ్ఛ చొప్పున, నఱమర లే దని వచించి యరిగెను రామా! ౩౩

సీ. వాణియుఁ దా నందు వచ్చినపని యాట గ్రక్కున నకుంభకర్ణుముఖము
వెలువడి దివి కేఁగె వేల్పులు శ్లాఘింప, నంత నాదుష్టాత్ముఁ డక్కటకట
యనుకొన్న దొకఁ డయ్యె, నడిగిన దొకఁ డయ్యె, నీమార్పు జరుగుట కేమి హేతు?
విన్నాళ్లు శ్రమపడి యెందుకుఁ గొఱగానివరముఁ గోరితిఁ గదా వెరవు మాలి

గీ. దైవఘటనంబుఁ దప్పింపఁ దరముగాదు, సమయమున లేక యిపుడు విచారపడిన
ఫలము గల్గు నొకో; యని బహువిధముల, వగచెఁ దనమందబుద్ధికి, వసుమతీశ!

వ. తరువాతఁ బాతాళంబునుండి సుమాలి. ౮౫

సుమాలి కుబేరునుండి లంకను వశపఱచుకొనుటకు రావణుని బ్రోత్సహించుట

క. తన దౌహిత్రులు వనజా,సనుచే వరములను బడయఁ జాలినవార్తన్
విని వెడలివచ్చె నిర్భయ,మునను బ్రహస్తాదిదనుజముఖ్యులతోడన్. ౮౬

క. వచ్చి ప్రియమార దశముఖు, గ్రుచ్చి కవుఁగిలించుకొని నగుచు నిట్లనె, నా
యిచ్చఁగలకోర్కి సమకుఱె, హెచ్చగు భాగ్యమునఁ జేసి, యిద్ధవిచారా! ౮౭

చ. హరికృత మాభయంబు మొదలంట నశించెను మాకు, నన్నిశా
చరరిపుఘాటికి న్నిలువఁజాలక లంకను బాసి భీతిమైఁ
బఱచితి మారసాతలముఁ బ్రాణము నిల్పుకొనంగఁ బూర్వ, మా
తెఱఁగిఁక నేల దానవుల దీనత హీనతఁ గాంచె నెంతయున్. ౮౮

సీ. ఆమాట కేమి ముం దీమాటవినుము మహాభుజ! యట్లు మే మందఱమును
జుట్టుకై దువు వేఁడి కిట్టులై పాసిపోలేక పోలేక పోయినంత
నుండియు నాలంక నుత్సాహమున ధనదగ్రజుండు కుబేరుఁ డాక్రమించె,
నన్నివిధముల నీ కది తగియున్నది, దాని మించునది జగాన లేదు.
గీ. మంచితనముననో; యసమానవిక్ర,మప్రదర్శనముననో; యన్యప్రకార
మున్న దాననో; విత్తేశునుండి పురము, మనవశముఁ జేసికొనవలె మసలవలదు.

ఉ. "అన్నను జిన్నఁబుచ్చఁ దగునా"యని యాత్మఁ దలంపఁబోకుమీ
యెన్నఁడుఁగాని,రాజులకు నిష్టుఁడుఁ జుట్టము లేఁడు, సర్వముల్
సున్నయ, నాహితోక్తిఁ జెవిఁ జొన్పి పురంబు వశంబుఁ జేసి కొ,
మ్మిన్నెగులుల్ హరింపు దనుజేంద్ర! నిశాచరజాతి కంతకున్. ౯౦

క. మనవారల యభివృద్ధిని, మనమునఁ దలపోసి మత్కుమారికను భవ
జ్జనని నొసంగితి విశ్రవ,సున కింద్రాదుల జయించుసుతులఁ గనుటకై. ౯౧

చ. ధనదునిఁ బోలి యెల్లరముఁ దత్పురి కేఁగుద మన్న, రావణుం
డనియెను మీర లిట్లనుట న్యాయమె? నింద్యముగాక; నా కతం
డనఁ బరుఁడా? గురుండు గద; యన్నను బొమ్మసి నెట్టి తత్పురం
బును బల మున్నదంచుఁ గొనఁబోలునె! యయ్యది శూరకృత్యమే? ౯౨

వ. అనవుడుఁ బ్రహస్తుండు వింశతిహస్తున కిట్లనియె. ౯౩

సీ. రావణ! యి ట్లనరాదు నీ వెప్పుడుఁ, జెవియొగ్గి వినుము నేఁ జెప్పుహితము,
నీతిశాస్త్రమ్మును నృపధర్మమును జదువంగ లే దనుమాట వాస్తవంబు,

బలశాలు లైనశూరులకు భ్రాతృస్నేహ మనునది యుండ, దిందనుక నేల
కశ్యపనందనుల్ గారె సత్త్వాఢ్యు లౌ దేవతలును బూర్వదేవతలును;
గీ. వారు స్నేహమ్ము విడనాడి వైర మూని, రణ మొనర్పఁగ లేదె పరస్పరమ్ము;
నాఁటిపగ గాదె యిది? యొకనాఁటి కైన,దివిజులను నమ్మరాదు సాధింపఁ బోలు.

గీ. కాన యొండువిచారంబు మాని। పురము,విడిచి పొమ్మని యక్షేశుకడకు దూత
నంపి యతఁ డొప్పకున్నఁ గయ్యమునఁ దోలి, పట్టణంబును గైకొంట పౌరుషమ్ము.

చ. అనుటయు దుష్టబుద్ధి యగునాతనిమాటల కద్దశాననుం
డనుమతిఁ జెంది, డెందము క్రుధానకీలలఁ గ్రాఁగఁ దామ్రలో
చనముల శ్రీదుపైని బగఁ జాటుచు వేగ త్రికూటపర్వతం
బునకుఁ జనెం బ్రహస్తముఖముఖ్యనిశాటులతోడ, రాఘవా! ౯౬

క. చని ధనదుసమక్షంబున, ననఁ దగుమాటలను జెప్పి యంపించెఁ బ్రహ
స్తుని దూతఁగ, వాఁ డవ్విభు, ననుమతి నటఁ బోయి నిర్భయంబుగఁ బలికెన్. ౯౭

ప్రహస్తుఁడు రావణుని పనుపునఁ గుబేరునితో సంభాషించుట

*క. ఏను బ్రహస్తాఖ్యుఁడ వాణీనాథవరప్రసాది నీయనుజుఁడు తే
జోనిధి రావణుఁ డనుపం, గా నరుదెంచితిని నీదుకడకుఁ గుబేరా! ౯౮

వ. మీతమ్ముఁడు మీతోఁ జెప్పుమన్నమాట లాలింపుము. ౯౯

సీ. తల్లులు వేఱైనఁ దండ్రి యొక్కఁడె గాన సోదరులము మన ముభయులమును,
బంకజాసనుని దపంబున మెప్పించి మరణంబు లేకుండ వరముఁ గొంటి
నిన్నాళ్లనుండియు స్వేచ్ఛగా లంకను బాలించి సౌఖ్యంబు పడసినాఁడ
వీ వీఁక దీని నే నేలఁదలంచితిఁ గావున నీ వొండుకడకుఁ జనుము
గీ. వినవ యేని సామోక్తులు, వెనుకముందుఁ, జూడక పరాక్రమంబును జూపి సాగ
నంపుపూనికతో నుంటి నంతదాఁక, ముదురనీకుము వడి లేచిపొమ్మవలకు. ౧౦౦

వ. అని చెప్పు మనియె, నర్థపతీ! విచారించిచూచిన నది యథార్థంబ. ౧౦౧

*క. నీవంతు దీఱిపోయెను, దేవారులవంతు మరలఁ దీఱఁగవలయున్
గావున లంకానగరము, వే విడి చను టొప్పు నొండువెరవున నెటకేన్. ౧౦౨

కుబేరుఁడు లంకను వీడిపోవుట

చ. అనవుడు నెమ్మదిన్ సకల మారసి, యన్నయుఁ దమ్ముఁ డున్కికై
పెనఁగుట ధర్మువే విడిచిపెట్టెద నేన యటంచుఁ దండ్రి ప

న్పునఁ బురిఁ బాసి తా రజతభూమిభృదగ్రముఁ జేరి నత్తపం
బునఁ బరితుష్టుఁ జేసె శివు భూతపతిన్ ధననాథుఁ డత్తఱిన్. ౧౦౩

వ. అట్లు పన్నగభూషణుం బ్రసన్నుం జేసికొని యశక్యం బగు తదీయసఖ్యంబు సంపాదించి. ౧౦౪

ఆ. అలకయనెడి పేర నలవిశ్వకర్మచేఁ, బట్టణం బొకండు గట్టఁజేసి
యందు దిక్పతిత్వ మలవడ సుఖముండె, రామ! త్రిణయనాభిరక్షణమున. ౧౦౫

వ. అంత నట దశగ్రీవుండు. ౧౦౬

చ. పురముఁ ద్యజించి యక్షపతి పోవుట దూతముఖంబునన్ సమా
దరమున నాలకించి ప్రమదంబున నం దభిషిక్తుఁ డై స్వసో
దరులును రాక్షసుల్ గొలువ దానవరాజ్యము నేలె నైజదు
శ్చరితముచే జగత్త్రియము సంచలితం బయి క్రిందుమీఁదుగాన్. ౧౦౭

సీ. తన చెల్లెలిని వికృతస్వరూపిణిని శూర్పణఖను బ్రీతి నర్పణముఁ జేసె
ఘనతరమాయావియును గాలఖంజాన్వయోద్భవుఁడును విక్రమోద్ధతుండు
దుష్టుండు నైనవిద్యుజ్జిహ్వానామకదానవోత్తమునకు జానకీశ!,
వినుమంత దానవవిశ్వకర్మయు దితిసుతుఁడు నౌ మయుఁ డాత్మసుతఁ ద్రిలోక
ఆ. సుందరిని లతాంగి మందోదరిని దెచ్చి, పంక్తిముఖున కిచ్చి భార్యగాఁగ
మొక్కవోనిచేవ నెక్కానుశక్తియన్, గురుతరాయుధంబుఁ గూడ నొసఁగె.

వ. రావణుం డట్లు వివాహితుం డై పితృదత్తయు వైరోచను దౌహిత్రియునగు వృత్రజ్వాల యనుకన్యకను గుంభకర్ణునకును, శైలూషనామధేయుండును మహాత్ముండు నగుగంధర్వరాజపుత్త్రికను సౌందర్యవతిని సమస్తలక్షణసంపన్నను సర్వధర్మజ్ఞను సరమ యనుదాని విభీషణునకును బరిణయంబు గావించె, నంతఁ గొంత కాలంబునకు. ౧౦౯

మేఘనాదుని జననము

క. తనయుని గనె మందోదరి, జనియించినతోన మేఘసదృశముగ మహా
ధ్వనిఁ జేసినకతమున మేఘనాదుఁ డని రెల్ల రతనిఁ,గాకుత్స్థమణీ! ౧౧౦

ఆ. బహుళపక్షతమముభంగిఁ గాంచుచునుండె, దినదినాభివృద్ధిఁ ద్రిదశవైరి,
యంతఁ గుంభకర్ణుఁ డగ్రజుతోడ ని,ట్లనియె నిదురబాధ కాఁగలేక. ౧౧౧

క. "అడుగుము వర మొం" డని న్నా,కడకుం జనుదెంచి కమలగర్భుఁడు పలుకన్
వెడఁగుఁదనమ్మున నిద్దుర, నడిగితి వెర వెఱుఁగమిని, దదాదిగ నదియున్. ౧౧౨

క. అలమికొని నాకు బాధం, గలిగించెడిఁ, గనులు దెఱవఁగా రా, వికటంబై
నిలువంగఁ జాల విజన, స్థలమున నిదురించువాఁడు; దనుజాధీశా! ౧౧౩

వ. అనుటయు. ౧౧౪

క. తడయక వైశాల్యంబును, గడుఁ బొడవును గల్గుగుహను గట్టించె దశా
స్యుఁడు, దాన నిదురవోయెను, నొడ లెఱుఁగక కుంభకర్ణుఁ, డుర్వీరమణా! ౧౧౫

ఉ. తమ్ముఁడు మంచిచెడ్డలవిధమ్ము నెఱుంగక నిద్రవోవ లో
కమ్ముల నేడిపించుదశకంఠుఁ డకుంఠితవిక్రముండు ధ్యా
నమ్మున నున్నవారలను నాగుల మానవకోటి వేలుపుం
గొమ్మల విప్రపుంగవులఁ గొంకక హింసను బెట్టె నెట్టనన్. ౧౧౬

ఉ. రెండవమృత్యువై భయదరీతిని జీవుల బాధవెట్టు నా
దుండగునక్రమంబు గడు దుస్సహమౌటకు రోయుచుం గుబే
రుం డొకదూత నంపెఁ "జెడుత్రోవఁ జరింపక ధర్మబుద్ధితో
నుండి యశంబుఁ బొందుము మదుక్తిని దాఁటకు"మంచు రాఘవా! ౧౧౭

రావణుఁడు పుష్పకమును గైకొనుట

సీ. వాఁ డది చెప్ప రావణుఁడు నేవోసిన బగ్గనిమండెడునగ్గివోలెఁ
గనలి యెంతటిమాట వినఁగల్గితిని గటా? పంక్తికంఠుని నొకపాటివాఁడు
మందలించెడివాఁడె? "యిందుశేఖరుమైత్రి గలదు నా కే"మని గర్వ మంది
యైలబిలుం డిట్టు లంపించియుండును, గొదమసింగమ్మును గొమ్ముతోడఁ
ఆ. జెనకు లేడిముప్ప దనకు మూఁడు టెఱుంగఁ, డనుచు దండువిడిసి యలకమీఁద
విక్రమమున మించి విత్తేశు నిర్జించి, యలరు పుష్పకమ్ము నపహరించె. ౧౧౮

వ. అ ట్లపహరించినయనంతరము. ౧౧౯

రావణుఁ డింద్రుని చేఁ బట్టువడుట

క. దండధరపాశహస్తుల, భండనమునఁ గెలిచి జయవిభాసితుఁ డై యు
ద్దండగతి స్వర్గమున శాఖండలు హింసింపఁ గోరి కడువడిఁ జనియెన్. ౧౨౦

ఉ. పోయి దురాగ్రహం బడరఁ బోరికిఁ బిల్చి సమస్తదేవసే
నాయుతుఁ డౌబిడౌజుని ఘనప్రదరంబుల నేయఁ, గ్రుద్ధుఁ డై
యా యమరేంద్రుఁ డూర్జితశరాసననిర్గతమార్గణాళిఁ ద
త్సాయకముల్ మరల్చె నిముసంబున, నీగతి వార లిర్వురున్. ౧౨౧

చ. ఒకరిశరంబు లొక్కరుగ నుగ్రత ద్రుంచుచు నెంతయున్ భయా
నకముగ సంగరస్థలిఁ జెనంగెడునప్పుడు మేటివై బలాం
తకుఁ డసురేంద్రుఁ బట్టి రథదండమునన్ బిగియంగఁగట్టె హ
ర్షకలితమానసుల్ సురలు సన్నుతి సేయఁగఁ దన్ను, రాఘవా! ౧౨౨

వ. అంత. ౧౨౩

మేఘనాదుఁ డింద్రు నోడించి తండ్రిని విడిపించుట

క. వృద్ధశ్రవసుఁడు తండ్రిని, బద్ధుం గావించె నన్న పలుకున్ విని ద
ర్పోద్ధతుఁడు మేఘనాదుఁడు, క్రుద్ధుం డై వ్రేటుగొన్నక్రోల్పులికరణిన్. ౧౨౪

*చ. కనలి రయంబునం గదియఁగాఁ జని యేమిర! యింద్ర! యిట్టిపా
టొనయఁగఁ జేసినా వెఱుఁగవే? నను విద్విషదంతకాఖ్యు, నా
జనకుని బద్ధుఁ జేసి చనసాగితె? నీగతిఁ జూడు మింకఁ బై
సునిశితబాణపాతమున స్రుక్కఁగఁ జేసెద వేల్పు లేడ్వఁగన్. ౧౨౫

చ. అని ప్రళయాగ్నిసన్నిభము లంబకముల్ పఱఁగించి తీండ్ర మా
నని యొనరించి యొంచి దివిజావళి జిష్ణుని తేరిపైకి రి
వ్వునఁ జని హుంకరించి మెలిఁబోవునటుల్ పెడకేలు గట్టి తం
డ్రిని విడిపించికొం చతఁడుఁ బ్రీతిఁ బురంబున కేఁగె వైరితో. ౧౨౬

*క. ఆకథ సకలము దుర్భర, శోకాకులమానసముల సురలు దెలుప నా
లోకభవుఁ డేఁగి యా యవి, వేకి పనుల కెంత యేని విసకటపడుచున్. ౧౨౭

సీ. చచ్చెర నంచ తేజీ నెక్కి లంకకుఁ బోయి రావణునిచేఁ బూజితుఁ డయి
తగ దిట్టిపని యని తగుమాటలం జెప్పి శౌర్యధైర్యములఁ బ్రశంస సేసి,
పగవానిచే నైనభంగపాటునకుఁగాఁ జెఱసాలఁ జిక్కి కృశించుచున్న
వేలుపురాయని విడిపించి పంపి, దశగ్రీవసుతున కిష్టదము లైన

ఆ. వరము లొసఁగి పెక్కు, వర్ధిల్లు ముచితమార్గమున నడచి యనుచుఁ గనకగర్భుఁ
డరిగె స్వభవనమున కంబుజమిత్రాన్వవాయజలధిసోమ! భవవిరామ! ౧౨౮

వ. అంత. ౧౨౯

రా వ ణు ని దం డ యా త్ర

క. విజయాభిలాషము తగన్, భుజబలమునఁ జేసి యెల్లభువనంబుల న
క్కజముగ నోడించెను సర్వజనహృదయశల్యుఁ డగుచు రావణుఁడు, సతీ! ౧౩౦

సీ. పొగరున నెం దేనిఁ బోవుచుఁ దనవిమానం బాఁగఁ గన్గొని నన్ను మించు
శూరుండు గలఁడె యిచ్చో నంచు దిగిచని పరిఘలఁ బోలునిర్వదికరములఁ
గైలాసశైలంబుఁ గదలించె, నందున్న నందీశ్వరునిఁ జూచి నవ్వె, దాని
కాతండు కుపితుఁ డై "యసురాధినాథ! పం డ్లిగిలించితివి గాన నింకమీఁద
గీ. నరులు వానరులును నీ వినాశమునకుఁ,
గారకులు, వారిచే ముప్పుఁగాంచువాఁడ"
వనుచు శపియించెఁ, దచ్ఛాపమున కోకించు,
కయుఁ దలంకక చనియె హైహయునిఁ జెనక. ౧౩౧

వ. అట్లు మాహిష్మతీపురంబు దరియం జని. ౧౩౨

చ. తలఁపడి కార్తవీర్యనృపతల్లజుతోఁ భుజగర్వ మొప్ప మొ
క్కలమగుపౌరుషం బెసఁగఁ గయ్యము చేసి తదీయుధాటికిన్
నిలువఁగ లేక బద్ధుఁ డయి నెవ్వగమైఁ జెఱసాలఁ జిక్కఁగా
విలసితమూర్తి వచ్చి విడిపించెఁ బులస్త్యుఁడు గూర్మిపెంపునన్. ౧౩౩

ఆ. తాత వచ్చి ముప్పు దప్పించె నింతియ,చాలు ననుచు మరలిచనక పురికిఁ
గార్తవీర్యకన్న ఘనుని గపీంద్రుని, వాలిఁ గెలుచుపూన్కి వాఁడు వోయె. ౧౩౪

సీ. చని పురిలోన లేఁ డనిమాత్ర మెఱిఁగి సముద్రతీరంబున నద్రిపోలెఁ
గూర్చుండి తగ సంధ్యవార్చుటఁ గాంచి, చప్పుడుగాకయుండున ట్లడుగు లిడుచు
నోరచూపునను ద న్నారసి తా నేమి యెఱుఁగనట్టుల నుండు టెఱుఁగలేక
పట్టెద నని వెన్కప్రక్కఁగా దరిఁ జేరి యిరుచంకలను జేతు లిరువదింటిఁ
గీ. జొనిపి బాధింపఁ బోవ నా శూరుఁ డట్టె
బాహుదండంబులను బిగఁబట్టి నాల్గు
సంద్రములఁ ద్రిప్పి ముంచి తజ్జలములందు,
వదలెఁ దుదకుఁ గిష్కింధోపవనమునందు. ౧౩౫

క. వదలినఁ బుడమిం బడి దశ, వదనుఁ "డీఁక నితనితోడ వైరము గొను టా
పదకుం గారణ"మని తన, మది నెఱిఁగి కపీంద్రుతోడ మైత్రి యొనర్చెన్. ౧౩౬

క. ఘనబలవంతుఁడు కైకసి,తనూభవుఁడు లోకములను దనవశములుగా
నొనరించికొని ప్రమోదం,బునఁ దానే యనుభవించె, భూపాలామా! ౧౩౭

ఆ. అట్టివాని విఱిచికట్టినవేలుపు, దిట్టక్రొ వ్వడంచి తెగువ మిగులఁ
జెఱను గొన్న యింద్రజిత్తుని గలనిలో, నణఁచు టన్న· సాధ్య మైనపనియె? ౧౩౮

ఉ. వారిప్రభావ మిట్టి దినవంశమణీ! విను మందు లోకముల్
క్రూరత నేడిపించుఖలుఁ గూల్చితి వాహవభూమి రావణుఁ,
శూరుఁడు లక్ష్మణుం డతనిసూనుని నింద్రజిఁ జంపెఁ, బర్వతా
కారుఁడు కుంభకర్ణుఁడును గాంచెను మృత్యువు నీకతంబునన్. ౧౩౯

వ. దేవా! నీ వన నఖిలభువనంబుల కాదికర్తయుఁ బ్రభుండు నగుసాక్షాన్నారాయ ణుండవు గాని; సామాన్యుండవు గావు. స్థావరజంగమాత్మక మైనయీసర్వప్రపంచ మును భవత్స్వరూపంబకాని వేఱొండు గాదు. ౧౪౦

సీ. జగముల సృజియించుజాణ వాణీశుఁ డుద్భవ మొందె నీ నాభిపద్మమందు
వాక్కుతోఁ గూడఁ బావకుఁడు ముఖంబున, బాహుయుగ్మమున దిక్పాలసమితి
వీనుల దిశలును విదిశలుఁ, జక్షుర్యుగంబునఁ జంద్రభాస్కరులు, ఘ్రాణ
మునఁ బ్రాణము సుపర్వముఖ్యు లశ్వినులును, జంఘుల జానూరుజఘనములఁ బ్ర

గీ. మముగ భువరాదిమహితలోకములు, నుదర
మునఁ బయోధిచతుష్కంబుఁ జనుల నింద్ర
వరుణులుఁ మేఢ్రమున సమవర్తి, కేశ
ములఁ బయోధరసంతానమును జనించె. ౧౪౧

వ. మఱియు. ౧౪౨

సీ. గుదమున మృత్యువు, క్రోధంబునను త్రినేత్రుం డగురుద్రుఁ, డస్థుల మహీధ
రములు, రేతస్సునఁ బ్రకటతేజోనిధుల్ వాలఖిల్యాదిదివ్యర్షి వరులు,
తనుసీస్తరోమసంతతి మహౌషధులు, నఖముల స్వారాదులుం గలిగె ననఘ!
నీవు విశ్వాకృతి నెగడుపూరుషుఁడవు, వితతమాయాశక్తియుతుఁడ వగుటఁ

గీ. దోఁచుచున్నావు వివిధాకృతులు గలట్టి, వానికరణి మాయాగుణవ్యతికరమునఁ
జేసి, నీ కేమి యంటదు సిద్ధ మిందు, విగళితాశ్రితభవపాశ! జగదధీశ! ౧౪౩

సీ. నిర్జరసంతతి నిన్నాశ్రయించియె యాగంబుల హవిస్సు ననుభవించు
చున్నది, జగములు యుష్మత్కృతంబులు, స్థావరజంగమాత్మకము లైన
సకలవస్తువులకు సత్తయు భానంబుఁ గలుగుచునుంట నీవలనఁ గాన
యన్నియు భవదాశ్రయమున జీవించెడు నరయుచో వ్యవహారమందుఁ గూడ

గీ. నఖిలవస్తువులును భవదన్వితములు, పాలలో నున్న నేయి యేపగిదిఁ బాల
నెల్ల వ్యాపించియుండెనో; యీవు నట్లె యుందు వఖిలప్రపంచంబునందు నిండి.

గీ. భాస్కరుం డాదిదీప్తిమద్వస్తు లెల్ల, దేవ! నీప్రకాశంబునఁ దేజరిల్లు,
నిన్ను భాసింపఁగాఁ జేయనేర దెది య,ఖండరీతి స్వయంప్రకాశుండ వగుట. ౧౪౪

క. నిను సర్వవ్యాపకు నొక్కని నిత్యు జ్ఞానదృష్టి గలవాఁడె కనుం
గొనఁజాలుఁ దదితరుఁడు గనుఁ,గొనలేఁ డెపు, డర్కుఁ బుట్టుగ్రుడ్డి యెటు లటుల్.

సీ. దైవమండన ! యతద్వ్యావృత్తిముఖ్యోపనిషదుక్తులను నహర్నిశము యోగు
లరయుచున్నారు నిన్ బరమేశ్వరుని నొందుతలఁపులు విడి తమతనువులందె,
భవదీయపాదాబ్జభక్తిలేశం బెవనిఁ గలిగినచో నిన్నుఁ గాంచఁగలరు,
భక్తిహీనులకుఁ గన్పడ వొక్కనాఁడును, దానిని మించుప్రధానసాధ
గీ. నంబు లే దొండు త్వద్దర్శనంబుపట్ల, వదరితిని గొంచె మేదొ సర్వజ్ఞుల రగు
మీసమక్షమునందు క్షమింపవలయు, భవదనుగ్రహపాత్రుండఁ బ్రభువతంస !

సీ. కడలేనిగుణములు గలవాని దిగ్దేశకాలాపరిచ్ఛేద్యు ఘను ననన్య
జ్ఞానస్వరూపుని జన్మాదివిరహితు నద్వితీయునిఁ జలనాదిహీను
నక్షరు నఖిలనియామకు సకలంబు గుఱు తెఱింగినవానిఁ, గొలుచువారి
కంటె నెప్పుడు వేఱు గానివాని, వ్యదస్తమాయు జగద్ధ్యేయు మంజుకాయు
ఆ. రవిసహస్రతేజు రఘుకులాంబుధిరాజు, వేదవేద్యు భక్తవిసరహృద్య
నాహవైకవీరు మోహనాకారు నిన్నభినుతింతు భక్తి నంద నెంతు. ౧౪౮

వ. అనినఁ గుంభసంభవునకుఁ గుంభినీజంభారి యిట్లనియె. మునీంద్రా! భవత్కృతం
బగుమహనీయస్తవంబు ముక్తిదాయకం బై చెల్లు. దాని నటుండనిమ్ము. ఇంద్రసూర్యులు
వానరాకృతుల వాలిసుగ్రీవు లై భూవలయంబున నావిర్భవించి రని వినియుంటి.
వారలజన్మవృత్తాంతంబు వివరంబుగ నాలింపఁ దలంపు గల్గెడు. సుధామధురంబు
లయినమీవచనరచనల శ్రవణపేయంబు చేయవలయు, ననుడు నతం డిట్లు చెప్పఁ
దొడంగె. ౧౪౯

క. శతయోజనవిస్తృతి మై, యతులితగతి నలరుచుండు నజునిసభ సము
న్నతజీవమణిద్యుతిభా,సిత మేరుమహీధ్రమధ్యశిఖరము మీఁదన్. ౧౫౦

క. సరసిజగర్భుఁ డొకానొక, తరుణమున సమాధి నొంది తత్సభ నుండం
దొరఁగె నధికముగఁ గనుదా,మరలఁ బ్రమోదాశ్రుజల మమానుషభంగిన్. ౧౫౧

క. దానిఁ దనచేతఁ గొని విధి, ధ్యానించి యొకింత తడవు ధరణి విడుచుమా
త్రానం దజ్జలమున నొక, వానరుఁ డుదయించె గొప్పవాఁ, డనఘాత్మా! ౧౫౨

ఉ. అంతట వానిఁ గన్గొని సమస్తశుభాఢ్యము నీద్య మైన నా
యంతికసీమయం దిచట హాయిగ నుండుము కొంతకాల, మ

భ్యంతర మేమియుం గలుగ దట్లువసించిన; వత్స! మీాఁద నీ
కెంతయు శ్రేయ మబ్బు ననియెం, బ్రమదంబున నాతఁ డవ్విధిన్. ౧౪౩

సీ. వసియించె నయ్యెడ,బహుకాల మీారీతిఁ జన, విజ్ఞుఁ డక్కపిసత్తముండు
ఫలమూాలములకుఁగాఁ బ్రయతించి యొకనాఁడు దిరుగుచు నమ్మహాద్రిపయి, దివ్య
జలపరిపూర్ణంబుఁ జారురత్నశిలావిభాసితం బగు నడబావియొండు
గని, నీరుద్రావుకోర్కిని సమీాపించి యాత్మప్రతిబింబ మద్దానిలోనఁ
గీ. గాంచి ప్రతివానరునిఁగఁ దలంచి పట్టనుఱికి జలముల, నొడ్డున నున్నయపుడు
గన్న కపివీరుఁ గానక క్రన్ననఁ జను,దెంచెఁ దీరంబునకు, జగతీతలేంద్ర! ౧౪౪

క. తీరమున కుఱికి తాను నొ,యారముగలపూవుఁబోఁడి యై యుండుట నా
వీరుఁడు గని యచ్చెరువడి, యూార ? యి దేమనుచు హేతు వరసెడువేళన్. ౧౪౫

గీ. అమరవిభుఁడు సురజ్యేష్ఠు నబ్జగర్భు,నియతిఁ బూజించి చను చాత్మనిలయమునకు
మవ్వపుంజవ్వనమ్మున నివ్వటిల్లు, రమణి నీక్షించె మధ్యాహ్నసమయమందు.౧౪౬

సీ. వీక్షించుతోడన పుండ్రేక్షుకోదండుండు వాఁడిపూఁదూఁపుల గాఁడ నేసె,
శక్రుఁ డద్దాన సంచలితేంద్రియుం డయి రామ! యమోఘవీర్యమ్ము వదలె,
వదలిన నయ్యది ముదితఁ బొందక వాలదేశమ్మునన్ ధరిత్రిపయిఁ బడియెఁ,
దోడనె బలవైరితుల్యపరాక్రముం డగువాలి యుదయించె, నంత దేవ
గీ. పతి నిజాత్మజునకుఁ బ్రవిభాసమాన,హేమమాలిక నొకదాని నిచ్చి బుజ్జ
గించి దివమున కేఁగె నుదంచితగతి, నపుడ ద్యుమణియు నచ్చటి కరుగుదెంచి.

క. తరుణీమణిఁ గని మన్మథ,పరవశుఁ డై విడిచెఁ గంఠభాగంబున దు
ర్భర మగునుత్తమవీర్యము, ధరణీభృత్తిలక! వినుము తదవసరమునన్. ౧౪౮

ఆ. వానిగళమునుండి వానరుండు జనించె, గొప్పమేనివాఁ డొకొండు, రవియుఁ
దనతనూభవునకు హనుమంతుఁ దోడిచ్చి, గగనమునకు నరిగె, నిగమవినుత!

క. అల రెడికొడుకులఁ గని యా,వెలఁది యొకట నిదుర వోయి వేకువ లేవన్
లలనారూపము దొఱఁగి మ,రలఁ బురుషాకార మబ్బె, రఘుకులతిలకా! ౧౫౦

వ. స్వస్వరూపప్రాప్తికి ముదితస్వాంతుం డై ఋక్షస్వామి. ౧౫౧

సీ. వలసినఫలమూాలములు సంగ్రహించి తనూజయుగ్మముతో సరోజభవుని
ముందునకుం జని మ్రొక్కి నిల్చుండినఁ, బరమేష్ఠి యావనేచరవరేణ్యుఁ
బలుతెఱంగుల నూఱడిలఁ బల్కి నిర్జరతుల్యుఁ డొ నొకదేవదూతఁ బిల్చి
దూతుఁడా! నాయాజ్ఞ నీవనిఁ గొనిపోయి యఖిలసౌభాగ్యసమావృతంబుఁ

గీ. త్రిదశులకు నేనిఁ జేనకరానిదియు విశ్వ,కర్మనిర్మితమును నలంకారభరిత
మతులితము నగుకిష్కింధ యనుపురీల,లామమును జేర్పు,మం దభిరామసరణి.

క. గొన బగుమణిసింహాసన,మున నిడి పట్టాభిషేకమును జేయుము రా
జునుగా నీ వానరవీ,రుని బరదుర్జయులు వానరులు గొలువంగన్. ౧౬౩

వ. వారు పీ రన నేల నప్తద్వీపంబులం గలలాంగూలోత్తము లందఱు నీతనికి వశవర్తులై
యుందురు. మఱియు ౧౬౪

చ. ఎపుడు సనాతనుం డగురమేశ్వరుఁ డుర్వికి ద్రేఁగుఁగూర్చు న
స్రపులను సంహరించుటకు రాముఁ డనన్ భువిపై జనించునో;
యపుడు వనాటు లందఱును నమ్మహనీయునకున్ సహాయులై
యుపకృతిరూప మహాఫల మనుత్తమముం గయికొంద్రుగావుతన్. ౧౬౫

వ. అని యాజ్ఞాపించుటయు. ౧౬౬

క. చని కిష్కింధాపురికిన్, వనచరులకుఁ బతిఁగ ఋక్షవరు నభిషేకిం
చినవాఁ డయి, కృత మెల్లను, వనజజునకు విన్నవించె వాఁ,డమలాత్మా! ౧౬౭

చ. అగచరకోటి కంతకుఁ దదాదిగ నా పురి రాజధాని య
య్యెఁ, గమలజార్థితుండు నిఖిలేశ్వరుఁ డౌ హరి నీవె మైతి, వీ
పగిదిని లీలగా మనుజభావము నూఁదినమీకతంబునన్
నిగమవచోఽనుభావ్య! ధరణీసతిభారము దీఱె సర్వమున్. ౧౬౮

సీ. నిత్యముక్తుండవు నిఖిలభూతాంతరస్థుండవు జగదేకశూరమణివి
జ్ఞానరూపుఁడ వఖండానందమూర్తివి నీ, విట్టిఘనునకు నీకు బడుగు
రక్కసిమూఁక ధరాస్థలిఁ గూల్చుపరాక్రమ మన నెంత? రామభద్ర!
ఐన లీలామానుషాకృతి నంగీకరించిన నీదుకీరితి యనేక
గీ. గతులఁ గొనియాడఁబడి సుధీగణముచేతఁ, బాపనంతియసౌఖ్యసంప్రాప్తిరూప
మహితఫలదాత్రి యగుచు సమస్తలోక,ములకు ధన్యతఁ గల్పించె, నలఘుచరిత!

గీ. యుష్మదాశ్రయ మగుట నత్యుత్తమ మయి, తనరు నీ వాలిసుగ్రీవజననకథను
శ్రద్ధధానుఁ డై కీర్తించుసజ్జనుండు, సకలదురితంబులను బాసి సౌఖ్యమొందు. ౧౭౦

వ. ఇఁక దుష్టాత్ముం డైనరక్షశ్శ్రేష్ఠుండు రావణుండు త్రిజగన్మాత యగుసీత నెందుల
కపహరించినదియుఁ దెలియఁజేయుభవత్సంబంధంబు గల మఱియొక కథను విను
పింతు వినుఁ,డని యిట్లనియె. మున్ను కృతయుగంబున. ౧౭౧

గీ. బ్రహ్మమానసపుత్రుండు ప్రభువు విమల, చరితుఁ డఖిలజ్ఞుఁ డేకాంత సంస్థితుండు
నగు సనత్కుమారుని జెంతకరిగి పంక్తి,ముఖుఁడు వినయావనతుఁడయి మ్రొక్కి పలికె.

సీ. సర్వజ్ఞ! మీచెంత సందేహములు దీర్చికొనవచ్చినాఁడ నా మనవి వినుఁడు,
భువనంబునం దుత్తముం డెవ్వఁ, డమృతాంధసులలోన నెక్కుడు బలము గలుగు
వాఁ డెవ్వఁ, డమరులుగూడ నెవ్వనినాశ్రయించి కయ్యమున జయింతు రరులఁ,
బరమయోగిధ్యానపాత్రుఁ డెవ్వఁడు, సదావినుతింతు రెవ్వని విప్రవరులు,
గీ. ప్రశ్నముల కుత్తరంబులు పలుకుపట్ల,మీర నిపుణులు మీ యట్టివారు లేరు
దయ సమాధానమును దెల్పఁదగునటన్న, నుత్తముం డమ్మహాయోగి యోగదృష్టి.

వ. తదీయమనోగతాభిప్రాయంబు సర్వం బెఱింగి యిట్లనియె. పుత్రా! ౧౭౪

సీ. జగము లన్నిఁటికి నిచ్చలుఁ బ్రభు వెవ్వఁడో; జననాదిగుణము లెవ్వనికి లేవో;
దైత్యు లాదిత్యులుఁ దలఁచుట లెవనినో; విశ్వస్రష్టుల కెల్ల విభుఁడు బ్రహ్మ
వొడముట కెవ్వనిబొడ్డుఁదమ్మియె హేతు; వరయ స్థావరజంగమాత్మక మగు
బ్రహ్మాండ మఖిల మెవ్వనికల్పితంబొ; యాతం డాదినారాయణుండు విష్ణు
గీ. వనుచుఁ జెప్పంగఁబడియెడు నసురనాథ!, యమరు లమ్మహానీయు సమాశ్రయించి
యే; విరోధుల నాజి జయించి సౌఖ్య,భాక్కు లగుచుండుదురు నిరపాయవృత్తి.

వ. మావంటియోగుల ధ్యానయోగంబునకు లక్ష్యమైనవాఁడును నతండ చుమ్ము. చతుర్దశభువనంబులఁ దద్వ్యతిరిక్తుం డగుస్వతంత్రుండు లేఁ,డనవుడు దశాననుం డిట్లనియె. ౧౭౫

చ. దనుజులు రాక్షసుల్ మఱియు దైత్యులు పెక్కుఱు పోరిలోనఁ బ
ద్మనయనుచేతఁ గూలిరి కదా మునిపుంగవ! వారి కేగతుల్
పనుపడు సౌఖ్యదం బయినస్వర్గమ కాలుని రాజధానియా
ఘనతర మైనవేఱొకజగంబ వచింపఁగదయ్య నావుడున్. ౧౭౬

చ. ముని యను బంక్తికంఠ! సురముఖ్యులచే ననిఁ ద్రెళ్లినట్టివా
రనుపమనాకలోకగతులై బహుసౌఖ్యము లొంది పుణ్యనా
శన మగుతోడనే నిలువఁ జాలక యచ్చట భూమిఁ జెంది ప్రా
గ్జనికృతపాపపుణ్యములఁ జచ్చుచుఁ బుట్టుచు నుందు రెప్పుడున్. ౧౭౭

క. పురుషోత్తముఁ డగుహరిచే, మరణంబును జెందువారు మాత్రము సౌఖ్యా
కర మగుతదీయపదమున, కరిగి ప్రమోదమున నుందు రపగతచింతన్. ౧౭౮

క. అనుటయు సర్వము మునివల్ల,నను విని హృష్టాత్ముఁ డగుచు నారాయణుతోఁ
జెనఁకువగలిగెడియత్నము, నొనరించెద ననుతలఁపున నుండె మహాత్మా! ౧౮౦

క. అసురపతిమానసంబునఁ, బొసఁగినవిషయమును ముని స్వబుద్ధి నెఱిఁగి వ
త్స! సుదర్శనాయుధునితో, నసమసమర మొదవుఁ గోర్కె యలవడు నీకున్.

సీ. నామాటయందలి నమ్మికఁ గొంతకాలము నిరీక్షింపుము లాభ మొదవు,
ననిపల్కి మఱియు నిట్లనె బ్రహ్మనందనుం, డాకృతిలేనివాఁ డైన మాయ
కతన నానావిధాకృతులను దోఁచునద్దేవు స్వరూపంబు దెలుపువాఁడ
నాలింపు పంక్తిముఖా! నిఖిలస్థావరములందును నదీనదములయందు
గీ. నందు నిం దన నేల సమస్తమునను, నతఁడు వ్యాపించియున్నవాఁ డనుట నిజము
క్షమయు సావిత్రియును దయాసత్యములును, ఘనతరంబగునోంకారమును నతండె.

ఆ. ఆమహామహుండె యాదిశేషావతా,రంబు స్వీకరించి ప్రబలభార
వంత మైనభువనసంతతి కాధార,భూతుఁ డై వహించుఁబ్రోడ; వత్స!. ౧౮౩

చ. దినమును రాత్రియున్ నిఖిలదేవతలున్ మిహిరోదయంబు వా
యువును బరేతరాజును బయోధులుఁ గాలము వర్షదేవుఁడున్
రవిశశితారకాగ్నిసురరాడ్వసురుద్రసరోజగర్భమృ
త్యువులును దైత్యదానవతతుల్ సకలంబును విష్ణువే సుమీ. ౧౮౪

సీ. వేఁడివేల్పయి మింట వెల్గుచునున్నాఁడు హుతవహాకృతి మండుచున్నవాఁడు
రక్షించుచున్నాఁడు భక్షించుచున్నాఁడు నిర్మించుచున్నాఁడు నిఖిలభువన,
మిట్లు సనాతనుం డీశ్వరుం డఖిలేశుఁ డైనయావిష్ణువే హాయిఁ గ్రీడ
సేయు విద్యుద్వర్ణచేలముల్ ధరియించి యసితోత్పలదళంబు నపహసించు
గీ. శ్యామలాంగంబుతోఁ బైడిచాయయొడలి
కడలికూఁతును నెడఁబాటు గననిబోటి
నెడమతొడనున్న లచ్చిఁ బ్రేముడి నరయుచుఁ,
గవుఁగిటం జేర్చికొనియుండు ఘనుఁ డితండు. ౧౮౫

చ. సురనరదానవోరగుల చూడ్కుల కెన్నఁడు గోచరింపఁ, డు
ర్వారఁ దదనుగ్రహాతిశయపాత్రుఁడు మాత్రము చూడ నేర్చు, న
ధ్వరముల సత్తపోఽధ్యయనదానములన్ మఱి వేనిచేత నే
నరయుట దుర్లభంబు నిగమాంతచరిష్ణుని విష్ణు; రావణా!. ౧౮౬

గీ. ఉపనిషచ్ఛుద్ధదృక్కులు నపగతాఘు, లతనియందె మనస్సు గలట్టివారు
దద్గతప్రాణులుఁ భక్తితత్పరులును, గాంతు రాభగవంతు ననంతు నెపుడు. ౧౮౭

సీ. ఒకవేళ నీకుఁ గోరిక గల దేని నాపరమేశ్వరునిఁ జూడఁ బంక్తికంఠ!
తెలిపెద విను మనుష్యులకు దేవతలకు, హితముఁ గావింపఁగా నెంచి మహిత
సత్త్వపరాక్రమసంపన్నుఁ డౌవెన్నుఁ డిక్ష్వాకువంశమం దెలమిమిగులు
దశరథేశ్వరున కాత్మజుఁ డయి నృపవిగ్రహము నూఁది త్రేతాయుగమునఁబొడమి
గీ. ధర్మపరుఁ డౌట గురునాజ్ఞఁ దల ధరించి, తనదుమాయయు జగములతల్లి యైన
తరుణితో సోదరునితోడ దండకాటవిని జరింపఁగలాఁడు సన్మునిహితముగ. ౧౮౮

క. వి[illegible]యును దానవవల్లభ! నీకుఁ జెప్పినాఁడను, భువన
[illegible]ను రాఘవు నపుడు భజింపు భక్తికలితాత్ముఁడ వై. ౧౮౯

ఆ. [illegible] చనము చేసి, మఱి విచారమగ్నమానసుఁ డయి
వ[illegible]గారి మిత్రోడి, పగను గోరి రామభద్ర! యట్లు.

గీ. బ[illegible]వాంఛను జగముల సంచరించి
[illegible]పూర్వకమ్ముగ హరియించె భూమిసుతను.

క. ఇ[illegible]పఠించినను శ్రద్ధ వినువారలకుఁ
[illegible]కుఁ బరమసౌఖ్యదశయును గలుగున్. ౧౯౨

వ. [illegible]పతిచరితంబు సీతాపతికి వెండియుఁ దెలుపఁ
[illegible]థేచ్ఛగా భువనంబులం బర్యటనంబు సేయుచు
[illegible]చను దెంచునారదమహర్షిం జూచి కృతప్రణాముఁ ౧౯౩

ఉ. [illegible]టిమి గల్గినవారితోడ, నా
[illegible]భూలక పోల కార్తిమై
[illegible]శూరతాఘనుల్?
[illegible]నాకు నెఱుంగ నోఁ గదా; ౧౯౪

క. [illegible]థము దీఱ నని సేతు ననఁ
[illegible] పలికెఁ జెఱునగ వొలుకన్. ౧౯౫

క. [illegible]బెనఁగ నేర్చినశౌర్యో
[illegible]నారసితిఁ గల రచటన్. ౧౯౬

సీ. ఘనసత్త్వశాలులు మహాకాయులు శూరుల లెక్కఁబెట్టని గట్టియుక్కుతునుక,
లదిగాక విష్ణుపూజాసక్తు లెవ,రెవ్వ రామహామహునిచే హతులు, వారె
యచట జన్మించినా రసురవల్లభ! సురాసురులకు నేనియు నరివి వారి
నిర్జింప;నైనను నీవంటిమన్నీఁడు చొఱఁబాఱి యొకచేయి చూడఁదగిన

గీ. తా వది, ప్రయాణసన్నాహతత్పరుఁడవు,గమ్ము కీర్తి నుపార్జింపఁ జొమ్మనవుడు
నట్లయని వారిపెనఁకువ నభిలషించి, సచివగణసంయుతముగఁ బుష్పకము నెక్కి.

వ. తత్క్షణంబ శ్వేతద్వీపసమీపంబునకుం జని తదీయమహాప్రతిభావిశేషమ్మునఁ
దేజమ్ము చెడి విమానంబు సాగకున్నం జూచి పరిత్యక్తయానుండై దశాననుండు
మంత్రులుం దానును సమరావేశంబున ద్వీపమ్ములోనికిం బ్రవేశించుటయు నొక
పడంతుక యాతనిఁ దనచేతం గొని. ౧౯౮

క. ఎందుండి వచ్చుచుంటివి? యిందులఁ బనియేమి? ...
చందం బది యెట్టిది? యెఱుఁగం దెలుపు ... ౯.

సీ. ఆలోన నట నున్న స్త్రీ లందఱును గూడి ...
వానిఁ జూడము, వింతగా నుండె ... ... ండి
యన్యోన్యమును హాస్యాదాకర్షణముఁ ...
తప్పించుకొని యెట్లొ తచ్ఛక్తి కెంతయు ... ఁడు

గీ. "నాయయిక శ్రీపతికి మహాకోప మొదవు, ... నర్చి
కూలి తన్మార్గణముల వైకుంఠనగర,వాసమ ... ము.

చ. అతఁ డటు లెంచి నిన్నుఁ బరమాత్మను గా ...
మృతిఁ గనఁగోరి నీవలన, మేధ్యచరిత్రను సీత ...
సుతను హరించి దండకను, సుందర మావనిఁ ...
వతవలెఁ దల్లినింబలెఁ బవల్లును రేలు భజించ ... ౦౧

సీ. కాలత్రయోత్పన్న కార్యసాక్షివి, యెప్ప ...
విషయ మిం తేనియు, విజ్ఞానదృశుఁడవు
ఐనను, భక్తజనాళికి సన్మార్గమును జూ ... ౧౦
నరరూప మీలీల ధరియించి పను లె ...

గీ. దర్శనంబునఁ గడతేఱఁదలఁచి యింద ...
గథల నాలించుచున్నావు మధువిదారి ... ము.

క. అనిపొగడి రఘూత్తముఁ, దద్ఘనత ... ౧౩
జనెఁ గుంభజుఁడు నిజాశ్రమ,మున ...

వ. రమానాథుం డగురాముండును. ౨౦౪

క. కనుసన్నలఁ బ్రెగ్గడలును, ననుజులు వర్తింప జనకజాంగనతోఁ జే
ర్మిని గ్రీడించుచు గృహమున, వనితా! తానొకగృహస్థువైఖరి నుండెన్. ౨౦౫

గీ. విను మనాసక్తుఁ డయ్యును విషయసుఖము, లనుభవించెను సీతాసమన్వితముగ
నాంజనేయాదివానరకుంజరులును, నలఘుచరితులుఁ దనచుట్టు బలసియుండ.

క. వినుకెంపుకొలముతేఁ డిట్లనయము వర్తింప ధనదుయానము మరలం
జనుదెంచి యొకానొకతఱి, వినయంబునఁ బలికె నాత్మవిభుకథితంబున్. ౨౦౭

క. అలనాఁడు మీయనుజ్ఞను, దలఁ దాలిచి యక్షరాజధానికిఁ బోనం
దిల ... ్, నలకాపురభర్త, రావణాంతక! రామా! ౨౦౮

చ. మొ ... సురముఖ్యుఁడు రావణుఁ, డాపయిన్ జగ
ద్వి ... రుఁడు వాని వధించి కైకొనెన్
సద ... త్తయినావు గావునన్
ము ... ందుట భావ్య మెంతయున్. ౨౦౯

గీ. దా ... ద్వహనక్రియ నాచరింపు
చు ... నాచెంతకున్ రమ్ము క్రమ్మఱంగ.

వ. అ ... ననంతోత్తముండు భానుసమానం బగు
న ... ౨౧౦

సీ. ... శుభం బగుఁగాతఁ బుష్పకంబ!
... గోచర వయి మెలంగుము, యథేచ్ఛఁ
... నె, నంత సోదరసచివాన్వితుఁ డయి
... న్యాయంబుదప్పక తోయజాక్షి!

గీ. ... ుర్వి నీగతిఁ బాలించుచున్న వేళ
... తదశవృక్షములు పోల్చె లలితభంగి.

క. ... రెల్లమనుజులు, వనితా
... తఁ జూడఁ డయ్యెఁ దండ్రి యొకండున్.

ఉ. ... గో విమానరా
... సంచరించుచున్

నమ్మినవారి నిందుకరుణం గనుఁగొంచుఁ దమిఁ మనుష్యసా
ధ్యమ్ములు గానికార్యముల నామహనీయుఁ డొనర్చెఁ బెక్కిఁటిన్. ౨౧౪

సీ. ఒకనాఁడు విప్రబాలకు నకారణమ్మృతుఁ గొనితెచ్చి తజ్జనకుండు రాము
నగరివాఁకిటఁ బెట్టి నాయనా! మముఁ బాసి పోడగాన రాకుండఁ బోయినావె?
తలిదండ్రులము మేము తలలెత్తు టెఁక నెట్టు? లీమేను నిలుచుట కేది తెరువు?
కడుపు చిచ్చాఱునే కన్నతల్లికిఁ? బుత్రశోకంబునకు నీడుశోక మున్నె?
గీ. జనవిభుఁడు ధర్మపరుఁడైన సంభవింప, విట్టివిపరీతములు ప్రజ కెపుడుఁగాని;
నీమృతికిఁ గారణమ్ము శ్రీరాముఁడె యని, తనయుపైఁ బడి విలపించెఁ బనవిపనవి.

చ. తనపయి నింద మోఁపి యటు తిల్లడ మొందెడి బ్రాహ్మణోత్తముం
గనుఁగొని ధర్మదూష్య మగుకార్యము పుట్టఁగ నేల నాఁడ-
లనమున నంచు నెమ్మదిఁ దలంచి మహామతి రామము
య్యనఁ జనె న్యాయదూరులను నారయుకోఁకిఁ బ ౨౧౫

చ. చని పటుదీక్షతోఁ దపము సల్పునొ
గనులకుఁ దోఁపఁ, దచ్ఛిరము ఖడ్గ
దనుని సజీవుఁ జేసెఁ బ్రమదంబుఁ
శుని సదనుగ్రహంబునను శూద్ర
దవు, ౨౧౬

క. జగదుపదేశముకొఱకిమ్మగ నాగ,వాసవ
దగురీతిఁ గోట్లకొలఁదిగ, మగువాక్యను గా ౨౧౭

సీ. మానసీయములు నమానుషమ్ములె త్రను సీత
కను సుఖింపఁగఁ జేసె, ననుపమసర హావనిఁ క,
యఖిలలోకమలాపహారణచణాత్మియ భజించె
మాయానుకృతిఁ జేసి మానవవేషమ్ము
ఆ. యేఁడులు దొర యయ్యె నిల కంతకు ను
భువనవంద్యపాదపుండరీకుఁడును న,న ౨౧౮

గీ. ఏకపత్నీవ్రతస్థుఁడై యెల్లయపుడు
నాచరించె సమస్తగార్హస్థ్యకర్మ,

క. వినయమున భయంబున లజ్జను
వినుతానుకూల్యమున నాథుని ౨

క. అని యిటు లోకులు ప్రతిదిన, మనికొనుమాటలను దెలుప నాలించి వికర్తనకులమణి యట నున్న స్వజనములఁ గని యివ్విధంబు సత్యమె? యనుడున్.

వ. వా రెల్లరుఁ గృతప్రణాము లై. ౨౩౫

క. ప్రజ లిట్లు చెప్పికొనుటల్, నిజ మిం దయథార్థ మేమి లే దని, రంతర్
విజయుని సచివుల మిత్ర, వ్రజమును వీడ్కొలిపి దాశరథి కృతమతి యై. ౨౩౬

సీ. అనుఁగుఁదమ్ముని సుమిత్రాత్మజునిం బిల్చి విన్నావు గద మనవిజయుమాట;
లత్యంతపరిశుద్ధ మగు భాస్కరాన్వయంబునను గళంకంబు వొడమె నేఁడు
జానకీ మూలాన సంప్రాప్త మయ్యె లోకాపవాదము నాకు సైఁపరాని,
దిఁక నెంతమాత్ర ముపేక్షింపఁ దగదు, ప్రాతఃకాలమున నొండుతలఁపు మాని
గీ. జానకిం దీసికొనిపోయి స్యందనమునఁ, బుట్టఁబుట్టినతపసి యున్నట్టినెలవు
కుఱుఁగటం డించి శీఘ్రమ్ము మరలి రమ్ము, తనయ! మన కిది ముఖ్యకర్తవ్య మిపుడు.

క. విను నా కనుమత మగు నీ, పనియెడ నేమేని నీవు బదు లాడినచో
నను జంపినట్ల యయ్యెడుఁ, జని రేపు మదుక్తసరణి సనరింపు మనెన్. ౨౩౮

చ. అనుటయు నన్నముందు బదు లాడఁగ నోడి గృహంబు సేరఁగాఁ
జని నిశి యెట్టులో కడపి చయ్యన వేకువ లేచి యెక్కస్యం
దనమున సీత నుంచికొని తన్మహనీయగుణాళిఁ గూర్చి లో
ననుకొనుచున్ సుమంత్రయుతుఁ డై వని కాతఁడు వోయెఁ, బార్వతీ!. ౨౩౯

సీ. ఏపాప మెఱుఁగనియీపుణ్యసాధ్విని నీజగన్మాన్య నీ హితచరితను
నీ విదేహకుమారి నీ మాజికోడలి నీ విమలాంగిని మావదినెను
నీ జ్వాలదగ్నిపరీక్షాసముత్తీర్ణ నన్యులు దూషించునట్టివారె?
హరిహరి! శివశివా! యక్కటక్కట యెట్టివిపరీతవార్తల వినఁగవలసె?
గీ. అన్నిగతుల సమున్నతిఁ గన్నయట్టి, మాకుటుంబము లోకులు వాకొను నొక
మాటతోఁ దుద కిటు భంగపాటుగాంచఁ,గలుగు నని స్వప్న మందైనఁ దలఁపనైతి.

వ. అని విచారించుచు లక్ష్మణుఁడు. ౨౪౧

ఆ. అన్నయాన దాఁట నర్హాంబుగామికి, ధరణిజాత వీడఁదగని దగుట
కెంతయేని దుఃఖ మెనయఁ దపించుచుఁ, దపసియాశ్రమమ్ము దరియ నేఁగె. ౨౪౨

వ. ఏఁగి జానకి నొక్కచో డించి గద్గదస్వరమున నాయమ కిట్లనియె. ౨౪౩

ఉ. అమ్మ! విదేహరాజతనయా! విను నాపలుకుల్ జనాపవా
దమ్మున నైనభీతి "వనధారిణి ధారిణికన్య డించి శీ
ఘ్రమ్మున ర"మ్మటంచు రఘురాముఁడు పంపఁగ వచ్చినాఁడ, స
త్య మ్మిది నాదుదోస మిసుమంతయు నియ్యెడ లేదు చూడఁగన్. ౨౪౪

క. తప్పనిసరియగుటను నే, నిప్పని కొప్పికొనవలసె నీసమయమునం
దొప్పులకుప్పా! నీవే, చెప్పుము రఘుపతి యనుజ్ఞ చేయఁగవలదే. ౨౪౫

*ఉ. తేఁకువ వీడి శోకము మదిం గదియింపక ధైర్య మూఁది వా
ల్మీకి మునీంద్రుసన్నిధికి మెల్లగఁ బొమ్ము శుభ మ్మగుం గదా
లోకనసాదరోక్తుల ద్యులోకపవిత్రచరిత్ర! నీకె కా
దా కటకంతునంతటిమహాత్మున కైన నవస్థ దప్పనే? ౨౪౬

ఉ. తల్లి! యనుజ్ఞ నిమ్ము రఘుతల్లజుఁ గానఁగఁబోదు నంచు మే
నెల్లఁ జెమర్ప డిల్లపడి యెల్లొ ప్రదక్షిణ మాచరించి యా
బల్లిదుఁ డప్పుడే రథముపైఁబడి రామునిచెంతకుం జనెం
బల్లవపాణి! మంత్రివరుపల్కుల నించుక తెప్పిఱిల్లుచున్.

సీ. ధవునియానతిమీఁదఁ దన్నుఁగు మఱఁవి మహారణ్యమున డించి యరుగుకతన
జనకపుత్త్రిక దుఃఖసంతప్తగాత్రియై తమతొంటి చైదముల్ దలఁచుకొనుచు
నొక్కపెట్టున వెక్కివెక్కి యేడ్చెను మూఢురాలిపోలిక నగరాజతనయ!
యంత దివ్యదృగ్జుఁ డైనప్రాచేతసముని శిష్యగణముల మూలమునను
గీ. నవ్విధం బాలకించి యాయమ విదేహ,నరవరేణ్యుని దుహిత యం చెఱిఁగి యర్ఘ్య
పాద్యములతోడఁ బూజించి బహువిధముల, నూఱడించెను గాలోచితోక్తిగరిమ.

క. ఇఁక మీఁద జరుగఁబోయెడి, సకలమ్ము నెఱింగి దివ్యచక్షుష్కుఁ డతం
డకుటిలమతి మునియోషి, త్ప్రకరమునకు నొప్పగించె భగవతి సీతన్. ౨౪౯

ఉ. ఆ మునికాంతలుం దపసి యానతి మై పరమాత్మ యైన శ్రీ
రామమహీశుదేవిని గరమ్మును లక్ష్మిఁగ నమ్మి భక్తియు
క్తామలమానసంబున సమర్చితఁ జేసి సపర్య లెప్పుడుం
బ్రేముడిఁ జల్పుచుండ్రి వినయవిస్తృతభంగి మెలంగి రంగనా!. ౨౫౦

*క. ధరణీజయు మునిపత్నీ, పరిచర్యాకలన దుఃఖభారము దొలఁగన్
సురుచిర తేజోభాసిత, వరగర్భము వృద్ధిఁ బొంద వసియించె నటన్. ౨౫౧

సీ. విశ్వనియంతయు విజ్ఞానదృష్టిచే నఖిలప్రపంచంబు నరయువాఁడు
నాదిదేవుం డొకం డవిరతమునిముఖ్యసేవితపాదరాజీవయుగళుఁ
డమలుండుఁ బరమాత్ము డైనరాముండును నారీతి జానకి నడవి కంపి
సదమలవైరాగ్యసంపన్నుఁ డై సర్వభోగమ్ములును దృణమ్ముగఁ ద్యజించి
ఆ. యోగలాలసత్వ మొప్ప మునీంద్రుని, పోల్కి వ్రత మొకండు పూని పౌర
జానపదుల కెల్ల సంభ్రాంతి జనియింపఁ, బురి వసించె భూమిధరకుమారి!. ౨౫౨

వ. అట్లుండి ప్రపంచాభ్యుదయసుఖస్వరూపము లగు సమస్తమంగళములకు మంగళప్రద మై విలసిల్లుదివ్యవిగ్రహంబుతో నాకుభవాదిమహర్షిప్రణీతనిఖిలరామాయణప్రతిపాదిత రావణవధాదిరూపనిజకథాసద్యశమ్ము ననవద్యమ్ముగాఁ బ్రతిష్ఠించి పురాతనరాజర్షిపుంగవులభంగి నిత్యకృత్యంబులు నిర్వర్తించుచు నుదారబుద్ధి యగు సౌమిత్రిచే నడుగఁబడి చిరంతనప్రవర్తితములును మంగళకరమ్ము లయిన పెక్కుకథలు మధురఫణితిం దెలిపె, నందు. ౨౫౩

సీ. నిర్మలచరితుండు నృగుఁ డనునరపతి యవనీసురులకు ధేనువుల నిచుచుఁ
దనమందలోఁ గలిసినయొకానొకబ్రాహ్మణునిగోవు నెఱుఁగక కన్యునకు దాన
మీయఁ, దద్యజమానుఁ డెల్లెడ వెదకుచుఁ గడ కొక్కచోఁ దానిఁ గాంచి పిలువ
నది తనస్వామియం చాతని వెనువెంటఁ జనుచుండ, రాజుచేఁ గొనిన యాతఁ

పంచపాది.

"డీ మొదవు నాది" యని కలహించె, నిట్లు
తగవులాడుచు నృపుసన్నిధానమునకు
నేఁగి యిరువురు మత్తుఁ డౌ టెఱేఁగి పెక్కు
వేలయేం డ్లీవు తొండవై కూలు మనుచు
శాపతప్తునిఁ గావించి చనుటఁ దెలిపె. ౨౫౪

వ. అంత. ౨౫౫

క. సరసుఁడు పరిశుద్ధాంతగి, కరణుఁడు లక్ష్మణుఁ డొకానొకతెఱఁ బ్రణతుఁడై
హరి నేకాంతస్థితు నీశ్వరు లక్ష్మీలాలితాంఘ్రిసరసిజుఁ బలికెన్. ౨౫౬

సీ. అఖిలజీవులకును నాత్మవు నిర్మలజ్ఞానరూపుఁడవు జగన్నియంత
వౌదువు స్వయముగ నాకార మొం డేమి లేకయుండియు, జగదేకపూజ్య!
యఘముల నొడుచు నీ యడుగుఁదామరదోయిఁ దుమ్మెద లై మరందమ్ముఁ గ్రోలు
కోరిక నున్న భక్తులకును విజ్ఞానదృక్కులకును గోచరింతు వెపుడు

గీ. సంసృతి నశింపఁజేసి మోక్షము నొసంగు, యోగిభావితభవదంఘ్రియుగళ మేను
శరణు సొచ్చితి దుస్తరాజ్ఞానజలధి, సుఖముగఁ దరించుమార్గంబుఁ జూపు మనఘ! 

వ. అనుటయు. ౨౫౮

ఉ. భానుకులావతంసుఁడు ప్రపన్నజనార్తిహరుండు రామభూ
జాని ప్రసన్నబుద్ధి ననుజన్మునిమాటల నాలకించి య
జ్ఞానతమంబు వో నడపఁగా నుతిఁ గన్న శ్రుతిప్రపన్న వి
జ్ఞానము నాత్మతత్త్వముఁ బ్రశస్తగతిన్ వినిపించె నివ్విధిన్. ౨౫౯

సీ. మనుజుండు తొలుదొల్తఁ దనవర్ణమునకును దనయాశ్రమమునకుఁ దగినక్రియల
ఫలము నాసింపక సలిపి, సమాసాదితామలమానసుం డయి క్రమముగ
ఘనవివేకాదిసాధనచతుష్టయమహామైశ్వర్యమును బొంది యంతమాత్ర
మునఁ గృతార్థుఁడ నైతి ననుకొన కాకర్మసంచయం బఖిలంబు సన్యసించి
గీ. దివ్యతమ మగు నాత్మలబ్ధికి ముముక్షు, ముని మహాత్ము నన్వేషించుకొనుచుఁ బోయి
వలసినట్లుగ శుశ్రూష సలిపి తదుప, దేశమునఁ జేసి తాఁ గడ తేఱు టొప్పు.

సీ. ప్రాగ్జన్మకృతకర్మఫలము దేహోత్పత్తికిం గారణముగఁ జెప్పంగఁ బడియెఁ
గాయంబుపై భ్రాంతిగలవాని కొదవుఁ బ్రియాప్రియంబులు రెండు, నక్కతమునఁ
గలుగు ధర్మాధర్మములు, దాన మునువోలె దేహసంసిద్ధియుఁ దిరిగి సకల
కర్మాచరణమును ఘటియించుఁ, జక్రమ్మువడువున సంసృతి నడచుచుండు
గీ. నట్టిసంసార మొదవుట కాదిహేతు, వొక్కయజ్ఞానమే, మఱియొండు గాదు
తద్వినాశనవిత్తపద్ధతియె నేఁడు, నీకు నుపదేశ మొనరింతు, నిర్మలాత్మ!. ౨౬౧

క. జ్ఞాన మొకఁడె ధరపై నజ్ఞానమ్ము నణంప వలఁతి; సౌమిత్రీ! య
జ్ఞానభవ మగుటఁ గర్మం, బేనాఁడును జాలదు హరియింపఁగ దానిన్. ౨౬౨

సీ. జ్ఞాన మెవ్విధమొ యాకరణిఁ గర్మము గూడ నదమలపురుషార్థసాధన మని
జీవధారికి ననుష్ఠేయం బనియుఁ జెప్పఁబడె వేదముఖమున భవ్యసరణిఁ
గాన కర్మ మనర్థకమునకుఁ గాక విద్యకు సహకారియై యలరుచుండుఁ
గర్మంబు బాసట గలుగక యున్నచో నొక్కజ్ఞానము మోక్ష మొసఁగఁ జాల
ఆ. దిదియుఁగాక కర్మ మెవఁ డాచరింపక, యుండు వాని దోషయుక్తునిగ వ
చించె నిగమ, మందుచే ముముక్షువు సదా, కర్మముల నొనర్పఁ గడఁగు టొప్పు.

వ. అని కర్మసాహాయ్యము జ్ఞానమున కావశ్యక మగుటంగూర్చి కొందఱు వాదింతు, రది
సమంజసము గాదు. ఏ మన, విద్య పరాపేక్ష లేనిస్వతంత్రురాలును స్థిరకార్య

కారిణియు నై యున్నది. ప్రపంచమునం గల యితరకారణంబులకుం బోలెఁ గార్య ముదయింపఁ జేయునెడ జ్ఞానమునకు సహకారు లుండఁ బనిలేదు. సోదరా! మఱియు నీవిషయంబున జ్ఞానకర్మసముచ్చయవాదులు. ౨౬౪

సీ. క్రతువు శాశ్వతఫలకారి యైనను బ్రయాజాద్యంగముల సహాయంబుఁ గోరు
కరణి, జ్ఞానముగూడ సరవి యావజ్జీవవిహితహోత్రాదికవిధిబలమునఁ
దప్పక చేయంగఁదగిన వై ప్రాప్తించుకర్మపుంజమ్ముతోఁ గలిసి యుండి
ముక్తి నిచ్చెడు"నంచు యుక్తిచే వాదింతు, రదియు దృష్టవిరోధ మనెడికార
గీ. ణమువలన సరికాదు, కర్మము శరీర, నిష్ఠితాభిమానంబున నెగడు నెపుడు,
జ్ఞాన మటుగాక గళితాభిమానవిము, మానసునకు సిద్ధించు సమానరహిత!

సీ. కాయమందలి యహంకారంబునను గర్మ మాచరింపఁగఁబడు, నది యడఁగినఁ
గాని విజ్ఞానమ్ము గలుగ, దివ్విధి నహంకారంబు కర్త్రైకకారణ, మది
యుండు నందాఁక జ్ఞానోదయభాగ్యమ్ము జనియింప దిలఁ బరస్పరవిరుద్ధ
ధర్మంబులనుజేసి తనరారుశీతోష్ణముల కొక్కచో నున్కి పొసఁగనట్లు,
గీ. జ్ఞానకర్మముల్ రెం డేకకాలమందు, నొక్కచోఁ గూడియుంట హుళిక్కి కాన
కర్మబలము విద్యకుఁ దోడుగావలెనను, పక్ష మెంతయు నిరసింపఁబడెఁ, గుమార!

క. విమలతరజ్ఞానవిచా, రమనోజ్ఞం బనుపమముఁ జరిమ మనఁదగి పొ
ల్పు మిగులు నాత్మవ్యాపా,రము విద్యగఁ బలుకఁబడియెఁ బ్రాజ్ఞులచేతన్. ౨౬౭

గీ. కర్మ మట్టిదిగా దది కర్తృకర్మ, ముఖనిఖిలకారకాదులఁ బొడముచుండుఁ,
దజ్జనకకారకౌఘవిధ్వంసకారి, యైనజ్ఞానమ్ముతోఁ గూడి యలరు టెట్లు? ౨౬౮

సీ. విను విద్యతోఁ గర్మమునకుఁ బ్రత్యక్షవిరోధంబు వొడముట రూఢిగాన
నారెంటికి సముచ్చయము సంభవింపదు, పరిశుద్ధహృదయంబు వడసి ముక్తి
పద మపేక్షించెడివాఁడు కర్మమును నిశ్శేషమ్ముగఁ బరిత్యజించి దీక్ష
సకలేంద్రియములను శబ్దాదివిషయపరంపరనుండి మరల్చి నిర్మ
గీ. లాత్మవస్తువిచారంబునందుఁ దగిలి, తత్త్వమస్యాదివాక్యమహత్త్వ మెఱిఁగి
తద్గతసదర్థమును నిదిధ్యాసనం బొనర్చుచుండఁగవలయు ననారతంబు. ౨౬౯

క. గురుమాయాబలమున న్విద్ధర దేహాదికములందుఁ దొలఁగనుమతి నే
ర్తైఱ నిలుపుదాఁకఁ గీడ్పడు, నరుండు విధివాదసముపనతకర్మములన్. ౨౭౦

క. నేతీతి నిగమవాక్తతి, చేత శరీరాదికముఁ దృజించి పరాత్మన్
జేతమున నెఱిఁగి కర్మవ్రాతమ్మును బిదప విడువవలయుఁ, గుమారా! ౨౭౧

వ. జీవాత్మపరమాత్మోపాధికృతభేదవిభేదకంబును, స్వతఃప్రకాశంబు నగువిజ్ఞానంబు పరిశుద్ధాంతఃకరణమ్మునం దుదయించుటయె తడవుగ జీవసంసారహేతువై కర్తృకర్మాదికారకోపేత యగుమాయ మాయమగు. లక్ష్మణా! యియ్యెడఁ గొందఱా మాయ పునరాగత యగుటం జేసి కర్మమున కవకాశంబు గలదందురు. ఆవాదంబు దూష్యంబు. ఎందుచేతనన; వేదప్రమాణసముద్భూతానవద్యవిద్యాప్రభావంబున వినాశంబు గాంచిన యవిద్య కార్యకారకజనకమై మరలఁ గార్యంబు వుట్టింప సమర్థం బగుననుట కల్ల. మఱియు, ౨౭౨

క. జ్ఞానస్వరూపుఁడును బర, మానందుఁడు నద్వితీయుఁ డమలుండును దే
జోనిధి యగునాత్మవలన, నేనాఁడు నవిద్య గలుగ, దిద్ధవిచారా! ౨౭౩

సీ. మరణించిననెలంత మరల బిడ్డలఁ గాంచనట్లు, నశించిన యా యవిద్య
వేఱు కార్యంబుల నేర దాట సృజింప, నీపని గావింప నేను గర్త
ననుబుద్ధి యెబ్భంగి జనియించు? నవు డహంకారంబునకు నవకాశ మున్నె?
అందుచేత స్వతంత్రమై మెలంగెడి విద్య మోక్షం బొసంగ నపేక్షసేయ
గీ. దన్యవస్తుసహాయంబు, నలరుచుండుఁ, దాన కేవల, మిప్పట్లఁ దైత్తిరీయ
కశ్రుతియు వేద్యవిషయవాజిశ్రుతియును, మోక్షసాధనముగ జ్ఞానమునె విధించె.

వ. అందును దైత్తిరీయంబు "నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః" అను వాక్యంబులచేఁ బ్రశస్తసమస్తకర్మత్యాగమును, వాజసనేయంబు "ఏతావదరేఖ ల్వమృతత్వ" మిత్యాదివచనముల మోక్షప్రాప్తికి జ్ఞానాపేక్షయుఁ, గర్మానపేక్షయు, సాదరముగ నుపదేశించె, నిదిగాక సముచ్చయవాదమున యజ్ఞము జ్ఞానముతోఁ బోల్పఁబడినది. ఫలాభిలబ్ధివిషయమున నారెండును భిన్నభావంబు గల వగుటచే నాదృష్టాంతంబు సరిగాదు. ౨౭౫

గీ. క్రతు వహంకారమమకారకల్పిత మగు, కర్తృకర్మాదిబహుకారకములచేత
సోదరా! మఱి దేశకాలాదినియమ, సముదయముచేత నెంతయు సాధ్య మగును.

గీ. జ్ఞానసంపాదనకు వీనిలో నొకటియు, వలయునవసర ముండదు వాస్తవంబు,
నియమనిరపేక్షమై సదా నిగమవాక్య, సంవిచారంబుచే నది సంభవించు. ౨౭౭

సీ. "విహితకర్మమ్ములు విడిచిపెట్టినఁ బ్రత్యవాయరూపాఘంబుఁ బడయువాఁడ"
నని తలంచెడు నీయనాత్మబుద్ధి వివేకశూన్యప్రసిద్ధంబు, మాన్యచరిత!
యాత్మతత్త్వ మెఱింగినట్టిధన్యాత్ముల కీసంశయము దోఁప దింతనిజము,
కాన క్రియాఫలకాంక్షు లనుష్ఠించు కతన వేదప్రకాశిత మయినను

గీ. బండితులకుఁ గర్మము త్యజింపం దగినది, విషయభోగైకలాలసవిజ్ఞవిముఖ
లోకమున కయి యయ్యది వాకొనఁబడె, నాత్మవేత్తకు దానితో నగున దేమి?

సీ. సదమలస్వాంతుండు శ్రద్ధాన్వితుఁడు నగు, జనుఁడు సద్గురునిప్రసాదమునను
దత్త్వమస్యాదివేదప్రకాశితమహావాక్యవిచారంబువలన నాత్మ
కును జీవునకుఁ జెప్పికొనుతొంటిభేదంబు మఱచి, తదేకత్వ మెఱిఁగి యంత
నజ్ఞానకల్పిత మగుసుఖదుఃఖాత్మకప్రపంచమున నోకానొకపుడుఁ
గీ. గంప మొందక మేరునగంబుకరణి, సుస్థిరుఁ డయి జీవన్ముక్తి సుఖముఁ గాంచ
వలయు నజ్ఞానజలదప్రభంజనప్ర,భావవైదగ్ధ్య మొప్ప, సుధీవిధేయ! ౨౭౯

వ. వాక్యార్థావగతికిఁ బూర్వము పదార్థజ్ఞాన మవసరము. తత్త్వమసి యనువాక్య మందలి తత్పదంబునకుఁ బరమాత్మయుఁ, ద్వం పదంబునకు జీవుఁడును గడపటి యసి పదంబునకుఁ దజ్జీవేశ్వరైక్యమును నర్థములై యొప్పు. సర్వజ్ఞత్వాదిధర్మ విశిష్టుఁ డగు నీశ్వరునకును, గించిజ్జత్వాదిధర్మములు గలజీవునకును నేకత్వ మెట్లు ఘటియించు ననఁ జెప్పెద వినుము. వాచ్యార్థానుపపత్తిసందర్భమున లక్షణ ప్రవర్తించుఁ గావునఁ బ్రత్యక్షత్వపరోక్షత్వాదులచే జీవేశ్వరుల కొదవినవిరోధమును ద్యజించి, యనిష్టవిషయవిసర్గ నేష్టవిషయాదాన రూపభాగత్యాగలక్షణలక్షితయు యుక్తిసంశోధితయు, నగు తదుభయగతాధిష్ఠానచైతన్యమును గ్రహింపవలయు. ఇవ్విధి యుక్త్యనుభవశ్రుతిప్రమాణములచే నవిరోధముగ జీవేశ్వరైక్య సంపాదన మొనర్చి, యవగతాత్మస్వరూపుఁ డై బ్రహ్మంబు గావలయు. మఱియు, విశేష్యం బయిన చైతన్యం బేకాత్మకం బగుట జహల్లక్షణయు, విరోధస్థితిం జేసి యజహ ల్లక్షణయుఁ బ్రవర్తింపనేరవు. "వాఁడే వీఁ"డను పదార్థములం బోలెఁ దత్ త్వం పదార్థములకు జహదజహల్లక్షణ యొక్కటియ నిర్బాధకముగ సరిపోవు చున్నది. లక్ష్మణా! యిఁక జీవుని స్థూలసూక్ష్మోపాధుల వివరింతు. ౨౮౦

సీ. సుఖదుఃఖకారణనిఖిలకర్మానుభవంబునకు న్నిలయం, బిలాది
పంచీకరణభూతసంచయోత్పన్న, మాద్యంతవంతమ్ము, మాయామయంబుఁ,
బ్రాగ్జనికృతకర్మభవ, మగుతనువు జీవునకు స్థూలోపాధి యనియు, మనము
బుద్ధి దశేంద్రియంబులు గల్గి సుఖదుఃఖభోక్తృనుసాధనంబు నయి ప్రాణ
గీ. పంచకాన్విత మై యవిభక్తసూక్ష్మ, భూతసంజనితం బయి పొల్పుమీఱు
నది తలంప సూక్ష్మోపాధి యనియుఁ జెప్పఁ,బడు సుధీతల్లజులచేత, భవ్యచరిత!

వ. మూఁడవది కారణశరీరంబు. అయ్యది సదసద్వివక్షాదురవగాహం బయి మాయా ప్రధాననామద్వయప్రథితం బై యనాది యై చెల్లు. ఇట్లు చైతన్యం బొకఁ డయ్యు

నుపాధిభేదంబువలన వేఱుగాఁ దోఁచుటం జేసి వివేకియగువాఁడు తన యాత్మను
శ్రవణమనననిదిధ్యాసక్రమముచే బుద్ధియందు నిశ్చయించికొనఁ దగు. ౨౮౨

సీ. దాసాని విరిచెంత భాసిల్లు స్ఫటికంబుపగిది నీ జీవుఁ డుపాధిరూప
దేహత్రయంబున దీపించుచనన్నమయాదికోశంబులయందు నిలిచి
తత్తదాకృతుల నెంతయుఁ దోఁచుచున్నాఁడు, సమ్యగ్విచారమ్మునలిపి చూడ
నతఁ డసంగాకారుఁ డద్వితీయుఁడు చావుపుట్టుకల్ లేనట్టిప్రోడ చుమ్మి
గీ. వెలయు స్వప్నాదిభేదంబువలనఁ ద్రివిధ,వృత్తి యొకఁ,డదియు గుణత్రయాత్తరూప
బుద్ధి దేకాని నిత్యుండుఁ బూర్ణుఁ డమలుఁ,డైన పరమాత్మునిది గాదు; మాననీయ!.

వ. తమోగుణప్రధానమును నజ్ఞత్వపిశునమగు నంతఃకరణవృత్తి, తనువు, ఇంద్రియ
ములు, ప్రాణములు, మనస్సు, చిదాభాసుఁడు, కూటస్థుఁ డను నేతత్సమూహము
నుండి యనవరతమును బ్రసరించునంతవఱకు నీ సంసారోత్పత్తి యగుచుండు.
ఉపనిషద్వచనవిచారపూర్వకనిదిధ్యాసకౌశలమున నధ్యాస నశించినతోడన
భవంబు నివర్తించు. ౨౮౪

సీ. లోనిరసంబు పెల్లాని పైత్వక్కును గడుదూరమునఁ బడవిడుచుకరణి
నధిగతానుభవపర్యవసాయి యగునిగమప్రమాణముచే సమస్తము విడి
పరమాత్మ యనియెడిపరమామృతమ్ము నంతఃకరణమునఁ బానమ్మొనర్చు
నతఁడు మిథ్యాభూత మగునీజగం బెల్లఁ, ద్యజియించు, లక్ష్మణా! యాత్ముఁ డెపుడు
గీ. జననమరణవృద్ధిక్షీణసర్వశూన్యుఁ, డద్వయుండు నిరస్తసర్వాతిశయుఁడు
నిరుపమానందరూపుండు నిఖిలగతుఁడు, స్వప్రకాశుండు లోకైకసాక్షి సూవె.

క. పరమజ్ఞానానంద, స్వరూప మగు నిట్టి యాత్మ వస్తువునం దె
క్కారణిఁ గనంబడు దుఃఖా, కర మేహ్యము నౌ భవంబు? కళ్యాణనిధీ!. ౨౮౬

క. జ్ఞానము లేమి భ్రమముచేఁ, దా నవ్విధి గోచరించి తన కరి యా వి
జ్ఞాన ముదయించు తోడన, భానుని గనుతమముభంగి భవము నశించున్. ౨౮౭

క. ఒకవస్తువు నారసి వేఱొకవస్తు వటంచు భ్రాంతి నూహించుట యే
ది కలదొ; యది యధ్యాసగ, నకుటిలమతిఁ దెలుపఁ బడియె నార్యులచేతన్.

క. తమమునఁ ద్రాడుం గని సర్ప మనుచు వెర గందు నట్లు, భవరహితబ్ర
హ్మమును శరీరాదిప్రపంచముగా నూహింతు రిల విచారవిహీనుల్. ౨౮౯

వ. సౌమిత్రీ! వికల్పహేతుభూతమాయావిరహితుఁడును, జిదాత్మకుఁడును, సర్వాకార
ణుఁడును, దుఃఖదూరుండును, దృశ్యప్రపంచవిలక్షణుఁడును, కేవలుండును, బ్రహ్మ

ము, నగునాత్మయందు నే నను నధ్యాసయే మొట్టమొదటఁ గల్పింపఁబడినవి. ఇచ్ఛాపేక్షలు రాగద్వేషములు సుఖదుఃఖములు మున్నగు ధర్మములు గల యంతఃకరణవృత్తు లాత్మయందు సదా సంసారమును గల్పించుటకుఁ గారణము లై యున్నవి. కావున సుషుప్త్యవస్థయం దవి లేమిం జేసి పరమాత్మ మనకు సుఖరూపముగఁ దెలియఁబడుచున్నాఁడు. మఱియు, ననాదిసిద్ధ మగు నజ్ఞానంబునం బొడమిన యంతఃకరణమునందుఁ బ్రతిబింబితపరమాత్మప్రకాశంబు జీవుం డనియు, నా యంతఃకరణమునకు సాక్షియగుటచే వేఱుగా నుండిన కూటస్థుఁ డే బుద్ధ్యవ పరిచ్ఛిన్నపరత్వమునం జేసి త్వం పదార్థమునకు లక్ష్య మైన పరమాత్ముఁ డనియు నెఱుంగ నగు. ౨౯౦

సీ. అనుజ! చిదాభాసుఁడును నింద్రియోపేత, చేతమ్ము నొకచోటఁ జేరియుంట
ననలతప్తం బగు నినుపగుండు విధాన, నొకదానియందు మఱొక్కదాని
ధర్మ మధ్యాసచేఁ దగిలెడుఁ, గాన జడాజడత్వములు చిదాత్మబుద్ధు
లందుఁ గ్రమమ్ముగ నారోపితము లయి, జడుఁ డాత్మ, చేతంబు జ్ఞాత, యనెడి
గీ. వ్యవహృతి జగంబునం గల్గె, నరయ నరుఁడు, వరగురూపదేశాగమవచనజన్య
విమలవిద్యానుభవమహావిభవుఁ డగుచుఁ, జిత్తనిష్ఠితు నాత్మ వీక్షింపవలయు.

క. అమలు నుపాధివిరహితుని, దమోవినాశకుని వేద్యతము నీశ్వరు నీ
క్రమమున నెఱింగి జగ మఖిల మాత్మగోచరము విడుచు లాఘవ మొప్పన్.

సీ. అజుఁడ నద్వయుఁడ స్వయంప్రకాశుఁడ నిరామయుఁడ నిత్యవిభాసమానగుణుఁడ
స్ఫురదవిద్యాకృతావరణవిక్షేపసమ్యగ్దోషరహితుఁడ నక్రియుండ
నానందరూపుండ నమలతరజ్ఞానఘనుఁడ సంపూర్ణుండ ననవరతము
ముక్తుఁడ నగణితశక్తిమంతుఁడ నింద్రియావిషయజ్ఞాన మయినవాఁడ
గీ. నిర్వికారుండ సర్వదానిగమశిఖ, బుధహృదయభావితుండ విభుండ దేశ
కాలవస్తుపరిచ్ఛేద్యలీల లేని,వాఁడ నేను నా కెనయగువాఁడు లేఁడు. ౨౯౩

సీ. అని యి వ్విధంబున ననవరతంబు ని,తరవిషయమ్ముల కరుగనట్టి
ప్రవిమలస్థిరబుద్ధిఁ బ్రత్యగాత్మను ననుసంధించుచుండెడు సజ్జనునకుఁ
గాలక్రమమున విజ్ఞాన మొం డుదయించి, సంసేవ్యదివ్యరసాయనంబు
రోగజాలమ్మును బోఁగొట్టుగతి నవి,ద్యను నవిద్యాకల్పితమ్ము లయిన
గీ. సకలకర్మంబులను వినాశమ్ముఁ జేయుఁ,గాన లక్ష్మణ! తదనుసంధానవిధముఁ
దచ్ఛ్రవణలౌల్యభావనఁ దగిలియున్న, నీకు నెఱిఁగింతు విధ్యుక్తనియతి నింక.

సీ. విఘ్నమ్ములేని వివిక్తదేశమున సుఖాసీనుఁ డై యింద్రియముల స్వేచ్ఛఁ
దిరుగనీయక నిరోధించి మనోనిగ్రహము గల్గి పరిశుద్ధ మైన యంత
రాశయమున ముక్తి నార్జింప జ్ఞానంబు దక్క మఱొక్కసాధనము జగతి
నెందు లే దని నిశ్చయించి విజ్ఞానైకదృక్కున సంగంబుఁ ద్రెంచివైచి
గీ. తాన పరమాత్మగా జగద్వంద్యసరణి, నిర్వికల్పసమాధిని నిలుచు టొప్పు
జననమరణస్వరూపదుస్తరభయంక, రార్ణవోత్తరణాభీష్టపూర్ణబుద్ధి. ౨౯౫

గీ. అఖిలమునకుఁ గారణ మగునాత్మయందు
ననుజ! పరమాత్మదర్శన మైన విశ్వ
మఖిలము లయింపఁగాఁ జేసి యవల నతఁడు
పూర్ణుఁ డానందరూపుఁ డై పొలుపుమిగులు. ౨౯౬

క. వెలుపలఁ గానీ మఱి లోపలఁ గానీ కలుగ దీప్రపంచస్ఫురణం
బు లవం బైనను త్రిపుటీ, విలయము గావించుతత్త్వవేత్తకు నెపుడున్. ౨౯౭

వ. ఇంక సమాధిని సాధించువిధం బెఱిఁగింతు, సావధానమనస్కుండ వగుము. సమాధికిఁ బూర్వము చరాచరాత్మకం బగుజగం బంతయు నోంకారస్వరూపంబ కాని తదన్యంబు గా దని భావింపవలయు. అవిద్యావశంబున నాప్రపంచమే వాచ్యముగను, బ్రణవమే వాచకముగను, దెలియ నయ్యెడి. జ్ఞానోదయకాలంబున నీయూహ తిరోహితం బగు. స్థూలశరీరాభిమాని యగు విశ్వనామకజీవుం డకారసంజ్ఞితుఁడుగను, సూక్ష్మశరీరాభిమాని యైన తైజసుఁ డుకారసంజ్ఞితుఁడుగను, గారణశరీరాభిమాని యయినజీవుఁడు మకారసంజ్ఞితుఁడుగను, నఖిలవేదంబులఁ దెలుపంబడియెడు. ఏతద్భావన సమాధిదశకు ముందుగాని తరువాతగాదు. పరమార్థ మరయుచో; నిందుల కవకాశముండదు. ఇవ్విధి బహూధావ్యవస్థితుఁ డగు విశ్వాభిధానుని నకారంబును నుకారమధ్యంబున లయమొందింపవలయు. తదుపరి ప్రణవద్వితీయవర్ణ మైన యుకారంబును దైజసునిఁ దదంతిమాక్షరం బగు మకారంబునఁ బై తెఱంగున లయించి, కడపట మకారమునుగూడఁ గారణశరీరాభిమాని యగుప్రాజ్ఞునితోఁ బరుఁడును గూటస్థుఁడును జ్ఞానఘనుఁడు నైన యీశ్వరసాక్షియందుఁ గలుపం దగు. ౨౯౮

గీ. అట్టినేను విజ్ఞానదృగంచలుండ, విమలుఁడ సమేధితోపాధివిరహితుండఁ
బ్రకటితవిముక్తిమత్పరబ్రహ్మ ననెడి, యనుభవం బప్పు డుత్పన్న మగును జూవె.

సీ. ప్రతివేళ నీలీలఁ బరమాత్మదివ్యానుభవసంపదలఁ దేలుపంశితుఁడు మ
హానందమగ్నుఁ డై యఖిలప్రపంచమ్ము మఱచి సచ్చిత్సుఖాత్మత మెలర్పఁ

ప్రథితజీవన్ముక్తిపదవీవిరాజి వైయి నిస్తరంగాచలనీరధి గతిఁ
జలియింపకుండు లక్ష్మణ! మఱి సతము సమాధియోగంబును నభ్యసించి
గీ. యొకట నింద్రియవిషయంబు లుజ్జగించి, సమదకామాదివైరిషట్కము జయించి
విజితషడ్గుణాత్మకుఁ డైనవేత్తృమణికి, జ్ఞానవిషయుండ నౌదుఁజు, మ్మౌన యతఁడు.

గీ. పవళులుఁ రేలిటుల్ పరబ్రహ్మఁ గొలిచి, పాసి మాయాకృతాఖిలబంధము, లభి
మానవర్జితుఁ డై యుండు మననశీలుఁ, డనుభవించుచుఁ బ్రారబ్ధ మగున దెల్ల.

క. అది నాశ మయినతోడనె, ముదితాత్ముం డాతఁ డైక్యముం బొందు జగ
ద్విదితసరణి నాలోనన, పదపడి జననాదిభవముఁ బడయఁ డొకపుడున్. ౩౦౨

వ. ఆదిమధ్యాంతములయం దెందును భవంబును భయదుగళ కారణంబుగఁ దెలిసికొని,
విధివాదప్రచోదితసమస్తకర్మములఁ ద్యజించి, యవల నఖిలజీవుల కాత్మ యైన
తన్ను భజించుచు, సర్వాధిష్ఠాన మగు తనయందు దృశ్యమానప్రపంచస్థితము
లగు మాయాకల్పితనామరూపంబుల వదలి, అస్తి, భాతి, ప్రియ, రూప బ్రహ్మంబు
నభేదదంబుగ భావింపఁజను. తద్భావనావసరమున నతండు జలనిధియందు జలము
వలె క్షీరమ్మునందుఁ బాలపోల్కి యాకాశంబున గగనంబుకైవడిఁ బవనంబునందలి
యనిలంబుచందంబున నధిష్ఠాన మగునాయందు విలీనతాదశ నొందు. ౩౦౩

సీ. తన దైనప్రారబ్ధమును భుజియించుచు మహిపయి నున్నను మననశీలుఁ
డఖిలప్రపంచమ్ము నాగమయుక్తిమానముల మిథ్యాభావనం బెమల్చి
కను నేని; దొలఁగు జగద్భ్రాంతి, చంద్రబింబములు రెం డని, తూర్పుఁ బడమరయని
తెల్పునప్పుడు వోలె దినకరాన్వయదీప! యఖిలజగం బస్మదాత్మకముగ
గీ. నెఱుఁగలేనంతదాఁకఁ దదేకబుద్ధి, నన్ను సేవింపవలయు ననారతంబు,
సదమలశ్రద్ధయును భక్తి సంతరించు, నిపుణుహృదయంబునందు నే నిలిచియుందు.

క. శ్రుతిసారసంగ్రహము ని, శ్చిత మతిగోప్య మగు నీ విశేషము నెఱిఁగిం
చితి నీకుఁ బ్రియుఁడ వగుట సు, మతి! యఘ మేతద్విచారమహిమను బాయున్.

చ. కనులకుఁ గానిపించెడిజగం బిది యెల్లను గల్లయంచు నె
మ్మనమునఁ బూర్తిగా వదలి మత్స్మరణామలమానసుండ వై
యనితరసాధ్యనిస్తులసుఖాకృతిఁ బొంది నిరామయస్థితిం
దనరి సుఖింపు మెల్లపు డతంద్రత, భూరిభుజా! ప్రియానుజా!. ౩౦౬

సీ. ప్రకృతిగుణత్రయరహితాత్ముఁ డగు సగుణేశ్వరపరుఁనిగా నేని, లేక
సర్వజ్ఞతాదిప్రశస్తగుణాత్ముఁనిగా నేని, నను శుద్ధమానసమున

నెన్నఁ డే భజియించు నెవఁ; డతం డేన యౌ, సూర్యనికరణి నాస్వ్రతుండు
నిజపదాంచితరేణునికరమ్ముచేతఁ బవిత్త్రము సేయు జగత్త్రయంబు,
గీ. నిగమసార మేకంబును నిరుపమంబు, నుపనిషద్వేద్య చరణమదుత్తము నయి
పరఁగు నీ జ్ఞానబోధకప్రకరణంబు, ముక్తిద ముపాసకులకుఁ బ్రమోదహృదయ!

ఉ. నాయెడ నిండుభక్తియును నావచనంబుల మంచిశ్రద్ధయుం
బాయక కల్గి దేశికుని పజ్జ యథావిధి రామగీతఁ బా
రాయణముం బొనర్చుగుణరాశి యఘంబులఁ ద్రోసి సన్మని
ధ్యేయగతి న్ననుం గలియు నియ్యది సత్యము సుమ్ము తమ్ముఁడా! ౩౦౯

లవణాసురపీడితు లగుమునులను శ్రీరాముఁ డాశ్వాసించుట

సీ. అని యుత్తెఱంగునఁ దనదివ్యతత్త్వంబు, సౌమిత్రికి వచించె రామమూర్తి,
యంత నొకప్పుడు యమునానదీతీర, వాసులు తులితాంబుజాసనులు త
పోనిధు లందఱు భువనకంటకుఁ డైన, లవణాసురుని బాధలకు సహింపఁ
జాలక, భృగుపుత్త్రుఁ జ్యవనమహర్షిని ముం దిడికొని రఘునందనుకడ
గీ. కరుగుదెంచిరి దైత్యవధార్థముగను, బరమభక్తి నాసంయమీశ్వరుల నెల్లఁ
బూజసేసి సంతోషమ్ము పొడమునట్లు, మధురభంగి నిట్లనె దాశరథి! యపర్ణ!

చ. ననుఁ గనఁ బ్రీతి నిందు మునినాథులు మీ రరుదెంచుకారణం
బునఁ జరితార్థతం బడసెఁ బుట్టువు, వీఁ డెదిసేయు టిష్టమో
యనుమతి యిండు, భూతహిత మైనప్రయోజన మొక్కఁ డెద్దియో
మనములఁ గోరి కాక యిటు మాకడ కూరక రాఁ దలంతురే! ౩౧౦

చ. అనృతము గాదు దుష్కరమ యైనను మీపని నేఁడు చేసెదఁ
ఘనమతులార! బ్రాహ్మణులె నా కిలువేల్పులు, వారిపట్ల భృ
త్యునిగతి సంచరించి పరితుష్టిని గూర్ప యతింతు నెప్పుడున్,
మనముల సందియంబు లేక మాని నను న్నియమింపుఁ డియ్యెడన్. ౩౧౧

శ్రీరామునకు భార్గవుఁడు లవణాసురవృత్తాంతమును దెలుపుట

క. అనవుడుఁ దద్వచనంబులు, విని మునినాయకులు మోదవివశాత్మకు లై,
రనఘుఁడు భార్గవుఁ డీగతి,ననె రామనరేంద్రుతో హిమాచలతనయా! ౩౧౨

సీ. దేవతలను మహీదేవతలను భక్తి నర్చించువాఁడు ధర్మైకరతుఁడు
మధునామకాసురమండనుం డొక్కఁడుఁ డుండెఁ బూర్వము కృతయుగమునందుఁ,
దచ్చరిత్రమునకు మెచ్చి చిచ్చుఱకంటివేలుపు కొండరాచూలి మగఁడు

సర్వోత్తమంబు నఖర్వ మహా శూలాయుధ మ్మొకఁ డిచ్చి మోద మ్మెసంగ
ఆ. నె వని దీనఁ గొట్టుదువో యతం డెంతటి, బలియుఁ డైనఁ దోన పొలియఁగలడు
నిక్క మనుచుఁ దెలిపె నృపలోకభూషణ!, దానిఁ బూని వాఁ డుదగ్రుఁ డయ్యె.

ఉ. వానికిఁ బెండ్లమాచు దశవక్త్రుని చెల్లెలు భీకరాస్య కుం
భీనసి దాఁపరించె నరిభీకర! యాకె గనెన్ దురాత్ము నె
వ్వాని కెదుర్పరానిబలవంతుఁ గరాళపరాక్రముం గృపా
హీనుఁ బ్రపీడితామరమహీదివిజున్ లవణాఖ్యదానవున్. ౩౧౪

ఉ. అ మ్మొఱకుం డహమ్మున నిరంతరముం వని సంచరించుచుం
మ మ్మొక లెక్కగాఁ గొనక మాదగుకృత్యము నొక్కఁడే సమ
గ్రమ్ముగ సాగనీక కడగండ్లను బెట్టఁగ నందు నిల్వ లే
కిమ్మెయి వచ్చియుంటి, మఖిలేశ్వర! మీ కెఱిఁగించుకోరికన్. ౩౧౫

*క. ఆ బల్లిదు దోర్గర్వ, ప్రాబల్యముతోడ నిలకు బలియొసఁగి వెసన్
మా బాధల నాశ్రితజన, తాబంధూ! మాన్పవలయు దయ పెంపొందన్, ౩౧౬

క. శరణాగతజనములు తుద, కరు లయినను గనికరమున నరయుదువు గదా
శరణొందినార మిప్పుడు, దురితాత్ము హరించి మాకుఁ దోడ్పడ వలదే. ౩౧౭

చ. అనవుడు రామచంద్రుఁడు మహామహులార! భయంబు మానుఁడీ
చనుఁడు యథేచ్ఛ మీకు నపచార మొనర్చినదుష్టునిన్ భవ
న్మనములు పొంగఁగా నిమిషమాత్ర గతాసునిఁ జేతు నంచుఁ జ
య్యన నటనున్న సోదరుల నారసి నేరుపుమీఱ నిట్లనెన్. ౩౧౮

క. మీలో నెవండు దుర్మదు, నా లవణు నణంచి యిమ్మహర్షుల నభయ
శ్రీలాలితులం జేయం, జాలెడినో; త్వరగఁ దెలుపఁజను, సైఁదోడుల్!. ౩౧౯

క. నావుడు భరతుఁడు ప్రాంజలి,యై విక్రమ మొప్ప దానవాధము లవణున్
నే వధియించెద నన్నే మ,హీవల్లభ! పంపు మాన యిడి యని పలికెన్. ౩౨౦

సీ. అంతట శత్రుఘ్నుఁ డన్నకు మ్రొక్కి రఘూత్తమ! నాపలు కొకటి వినుము,
లంకారణంబున లక్ష్మణు డింద్రజిద్ధననాదిమహిత కార్యము లొనర్చె,
భరతుఁ డన్ననో; వ్రతపరత నందిగ్రామమున నిల్చి దుఃఖమ్ము ననుభవించె,
నేటికి నీపంపు నెఱవేర్పకున్నది యే నొక్కరుండ నే; కాన నేన
ఆ. పోయివత్తు లవణుఁ బొరిఁగొన మానుల, బాధ వెట్టు నాకృపావిహీను
దాయ నడఁతుఁ గలన నీయనుగ్రహమున, నానతిచ్చి పంపు మతిరయముగ. ౩౨౧

క. అని యని కరుగం గోరెడి, పినతమ్ము రిపుఘ్ను నంకపీఠస్థునిగా
నొనరించి ప్రియము మిగులఁగ, ననె నరిసూదనుఁడు రాముఁ, డంబురుహాక్షీ!.

శ్రీరాముఁడు శత్రుఘ్నుని లవణుని వధింపఁ బంపుట

క. చను మీఁద దాయపై క్కాతనిమధురా రాజ్యమునకుఁ దగునేలికఁగా
నిను నభిషేకించెద నొం,డన కిపుడె మహర్షిగణము హర్షము నొందన్. ౩౨౩

వ. ఇట్లుపలికి తదర్థమ్ము వలయుసంభారంబుల సౌమిత్రిచేఁ దెప్పించి, యతం డభిలషింప కున్నను సమధికప్రేమ నిజబాహుపరశ్వథవిచ్ఛేదితవిద్విషద్విషద్రు మధురారాజ్యపట్టభద్రునిఁగ నభిషేకించి యొక్క దివ్యశరం బొసంగి తెఱఁగంటిగొంగ తెఱఁగు తేటపడ నిట్లనియె. ౩౨౪

సీ. ఆ లవణునకు నిత్యముఁ దనయింటఁ బుష్పాదులతోడ శూలాయుధమ్ము
నొకదానిఁ బూజించి యుంచి, నానావిధప్రాణిహింసయు జంతుభక్షణమ్ముఁ
గావింప నడవికిఁ బోవు టాచారంబు, శూలంబు చే నున్న వేళ వాని
నిర్జింపఁ దుదకుఁ ద్రినేత్రుఁడుం జాలఁ, డుపాయంబునం జిక్కువడుట ధ్రువము
గీ. కాన యయ్యాతుధానుండు కాననమునఁ, దిరుగు చటనుండి యింటికి మఱలి రాక
మునుపె తన్నగరద్వారభూమి కడ్డముగ ధనుర్ధారివై నిల్వు మొగిఁ, గుమార!.

ఉ. వాకిట నున్న నిన్నుఁ గని వాఁడు లయాంతకుమాడ్కిఁ దీవ్రరో
షాకుల చిత్తుఁ డై భయదసంగతి సంగరముం బొనర్పఁగా
వే కవియుఁ రిపుఘ్న! భుజవీర్య మవార్యముగా నెదిర్చి యీ
భీకరబాణపాతమునఁ బీఁచ మడంపు నిలింపు లౌ ననన్. ౩౨౬

సీ. సంహరింపఁగ మంచిసమయం బిదియ యాట నీరీతి నా క్రూరు పీ రడంచి
మధునామకారణ్యమహి యెల్ల బా గొనరించి పట్టణము నిర్మించి యచట
వసియింపు మందు సైన్యసమేతముగ నస్మదాజ్ఞ మానుల కభయంబు నిడుచు
నాఱునూ ఱేనుఁగు లయిదువేలహయంబు లం దర్ధభాగంబు స్యందనములుఁ
గీ. గడిమిమిగులు ముప్పదివేలుకాలుబంట్లు, రాఁగలరు వెన్క రాజ్యనిర్మాణమునకు
ముందు మాత్రము నీ వేఁగి సం దెఱింగి, బలిమి సాధింపు దుష్కృత్యప్రవణు లవణు.

చ. అనుచు శిరంబు మూర్కొని మహర్షులుఁ దాను జయంబుగల్గు దీ
వెనలఁ బ్రశంసఁ జేసి రఘువీరుఁడు పంపె నిజానుజన్ము, నా
ఘనభుజుఁడుఁ శరాసనముఁ గైకొని తత్క్షణ మందుఁ బోయి య
న్ననుడివినట్లు సర్వము నొనర్చి రిపుం బరిమార్చె, మానినీ!. ౩౨౮

సీ. అపగతశూలసహాయు భీకరకాయు, మధుసుతు సుజననిర్మథననిరతు
దంభోళి నైశిత్యదంభాపహాద్ధత్యజానకీవరదత్తసాయకమునఁ
బ్రధనంబున వధించి మధురానగర మొండు గట్టంగఁజేసి శృంగారగరిమ
జనులను దేశదేశమ్ములనుండి రావించి తగఁగ గౌరవించి వలయు
గీ. వస్తువుల నిచ్చి చక్కనివసతు లేరు, పరచి వారల నందుండఁ బనిచి సైన్య
భరిత మై సాటిలేనివైభవము నీను, దానిఁ బాలించుచుండె రామానుజుండు.

కుశలవుల బాల్యచర్య

గీ. అంత నచ్చట నాకుభవాశ్రమమున, నుర్విపుత్రియు నాశ్వినేయులనుబోలు
సుభగమూర్తుల నిర్వురసుతులఁ గనియెఁ, దాపసాంగనలకుఁ బ్రమోదంబు వొడమ.

గీ. పెద్దవానికిఁ గుశుఁడని పిన్నవాని, కొగి లవుం డని యా పుత్త్రయుగ్మమునకు
నామకరణంబుఁ గావించె నాకుభవుఁడు, సకలలోకసమ్మతుఁడు ప్రశస్తభంగి. 33౧

సీ. ప్రతిభ మై విద్యలం బొండితి గడియించి విధ్యుక్తముగ మౌనివిభునిచేత
నుపనయనముఁ బొంది యుక్తకాలమున వేదాధ్యయనాసక్తి ననవరతము
మెలఁగుచు, మోహనకళ లీను దివ్యమంగళవిగ్రహములతోఁ గ్రాలుచుండి,
రంత నా యమళల కమ్మునికాంతుండు పాకశయ్యాధ్వనివ్యంగ్యభరిత
గీ. మౌచితీబంధురం బుపమాద్యలంక్రి, యాసమంచిత మతులితం బాత్మరచిత
మైన రామాయణాభిధానాదికావ్య, మును సమగ్రముగాఁ జెప్పె వనరుహాక్షి!

క. మును నీ కే నెఱిఁగించిన, ఘనరామచరిత్రమును నిగమతాత్పర్యం
బును వివరించుట కై రా, ట్తనయుల కటు నేర్పె మౌనితల్లజుఁ డగజా! 333

వ. ఇ ట్లమ్మాణవకు లధీతరామాయణు లై. 33౪

గీ. లలితమృదుమధురంబు గళస్వనంబు, దంబుర రవంబుతో మిళితం బొనర్చి
తాళమానంబుఁ జెడనీక తంత్రికత స్వమస్తమును బాడనేర్చిరి మౌను లలర.

సీ. చెంగటఁ జేరి పైఁ జే యుంచి నివురుచు, మెల్లగా వాల్మీకి మేలుకొలుప
లేచి ప్రొద్దుటను గాలోచితకృత్యముల్, సలిపి స్నాన మొనర్చి సంధ్యవార్చి
తల్లికి మఱి మౌనితల్లజునకు మ్రొక్కి, బుజములఁ జిన్నితంబురలు పూని
గలుగల్లు రనుమ్రోఁత నలరించు చిఱుతల నెడమచేతుల ధరియించి, రామ
గీ. మూర్తిపావనకథ జగన్మోహనముగఁ, బాడుచుందురు సతము సైఁదోడు లిర్వు
రిచ్చ టచ్చట ననకుండ నెల్లరమ్యు, తలములందుఁ దపస్విసదస్సులందు. 33౬

క. మంజులనినాదగళయుగ, ముం జతనము మీఱఁ గలిపి ముద్దుగ గానం
బుం జేయుదివ్యరూపులఁ, గంజాక్షులఁ గాంచి మునులు గడువిస్మితులై. ౩౩౭

మునులు కుశలవులఁ బ్రశంసించుట

సీ. బహుకాలముగ నిలఁ బ్రబతికియుండినమన మెన్నిమాఱులో కఁటి మన్నిదిశలు
భూతలంబునఁ గాని పాతాళమునఁ గాని స్వర్గమ్ము నం గాని సత్యలోక
మునఁ గాని పెరజగంబుల నెందుఁగాని గంధర్వగీర్వాణకిన్నరులలోనఁ
గాని యిట్టి యనూనగానసౌకర్యంబు కమనీయవాద్యంపుగరిమ యెపుడుఁ

పంచపాది.
గన్నదియు విన్నదియు లేదు, పిన్నవయసు
నంద పెనుమోళ్లు చిగిరించునట్లు రామ
చంద్రుచరితముఁ గర్ణరసాయనముగఁ,
బాడఁజొచ్చి రిదెంతయు భాగ్య" మనుచుఁ
గుశలవుల సన్నుతించిరి, కుందరదన! ౩౩౮

క. ప్రతిదిన మీవిధమున ముని, పతివర్గముచేతఁ బొగడఁబడుచు మహీజా
సుతయుగ మయ్యాశ్రమమున, సతి! చిరకాలము వసించె సౌఖ్య మ్మొదవన్.

సీ. అంత నయోధ్య మహాతేజుఁ డగురామభద్రుండు జానకీప్రతిమ నొండు
కనకమయంబును గల్పించుకొని తనప్రక్క నుండఁగఁజేసి బహుళదక్షి
ణాన్వితతురగమేధాదియజ్ఞమ్ములఁ గావించె, దత్క్రతుగరిమఁ జూడ
నరుదెంచి రఖిలమహర్షులు రాజర్షు లుర్వీసురులు రాజు లూరుజులును,

గీ. బుట్టఁబుట్టినతాపసపుంగవుఁడును, గాయకులు రూపధిక్కృతకాయజు లగు
నవనిజానందనులఁ గుశలవులఁ బ్రీతి, వెంటఁగొని వచ్చె ముని యున్న విడిదిఁ జేర.

కుశుఁడు జ్ఞానశాస్త్రరహస్యములఁ గూర్చి వాల్మీకిని బ్రశ్నించుట

వ. తదనంతర మొక్కచో సమాధిఁజాలించి యేకాంతమున నున్నపరమశాంతుఁ డగు
మునికాంతు నంతికసీమం గూర్చుండి, కుశాగ్రబుద్ధి యైనకుశుండు ప్రసంగవశం
బున జ్ఞానశాస్త్రరహస్యంబుల నెఱుంగఁ గోరి యిట్లని ప్రార్థించె. ౩౪౧

క. తాతా! మహత్త్వతులితవి, ధాతా! నీవలన నిఖిలతత్త్వరహస్యం
బీతరుణంబున వినఁగాఁ, గౌతూహల మొదవె నాకుఁ గరుణఁ దెలుపుమా. ౩౪౨

క. భువి జీవున కీ దృఢతమ, భవబంధం బెట్లు లొదవెఁ? బదపడి యతఁ డే
వ్యవసాయంబునఁ దద్బం,ధవిముక్తిని గాంచి ముక్తిదశ వడయ నగున్. ౩౪౩

క. శిష్యుఁడ మీ కవిరతముం, బోష్యుఁడఁ, దత్త్వానుభవము బొత్తుగ లే, దో
ఋష్యుత్తమ! యించుక వై,దుష్యముఁ గలపంగ వేఁడుదును వినయమునన్.

వాల్మీకి కుశునకు బంధమోక్షస్వరూపమును దత్సాధనమును దెలుపుట

గీ. అనుడు వాచంయమీంద్రుఁ డి ట్లనియె వత్స!, సంగ్రహంబుగ బంధమోక్షస్వరూప
మును దదీయసాధనమును విను తుఁ దేట,తెల్లముగ బుద్ధి శ్రద్ధ సంధిల్ల వినుము.

క. నావలన విన్న తెఱఁగున, నీ వఖిలం బాచరింపు నెటి శుభము లగున్,
జీవన్ముక్తుఁడ వౌదువు, కావలసిన దదియె కా; జగతి నెల్లరకున్. ౩౮౮

సీ. దేహ మే యొక పెద్దగేహ మదేహుఁ డౌ పరమాత్మ, కిం గృహపతికి గృహము
తోఁ బోలెఁ గాయంబుతో విలక్షణత చిదాత్మునికిం గల దనుట నిక్క,
మాత్మకు దేహగతాహంకృతియె మంత్రి, యదియుఁ దత్కల్పిత మక్కతమునఁ
దను గేహగత మగు తన యభిమానంబు నారోపిత మొనర్చి యాత్మయందుఁ
గీ. బాసఁగ నాత్మతాదాత్మ్యముఁ బొంది తద్వి, భాసితశరీరి యై తనపనుల నెల్ల
నాచరించుచున్నది పరమాత్మునందు, సతతమజడముగతి నహంకృతి, కుమార!

క. సంకల్పవశంబున స్వాహంకారుం డగుచు జీవుఁ డనవరతం బా
సంకల్పం బనియెడి పెను,సంకెలకుం జిక్కి యుండు, సదమలహృదయా! ౩౮౯

సీ. అవ్విధిఁ జిక్కి భార్యాపుత్త్రగృహముఖ్య,వస్తుప్రపంచ మవ్వారిగాఁగఁ
దనయంతఁ దాఁ గోరు, చనయంబుఁ దద్గత,చింతల నెంతయోఁ జివుకుచుండు,
తనయ! యహంకృతితాదాత్మ్య మొనసినయట్టిజీవునకు దేహములు మూఁడు
సత్త్వరజస్తమస్సంజ్ఞ లుత్తమమధ్యమాధమములు గల, వవియ భువన
గీ. సంస్థితికిఁ గారణము, లం దసభ్య మగు త,మోగుణాత్మకసంకల్పమునను జేసి
తామసము లగుచేష్టలఁ దగిలి పాప, చరితుఁ డై మీఁదఁ గ్రిమికీటజన్మముగను.

వ. రజోగుణప్రధాన మగు సంకల్పముగలవాఁడు జగంబున వ్యవహారజ్ఞుఁ డై దార
పుత్త్రాదు లనుకూలు రై సుఖపెట్ట సంసారంబునం దుండు. ౩౯౦

గీ. సత్త్వరూపసంకల్పుఁ డౌ సజ్జనుండు, జ్ఞానధర్మంబులను మహాసక్తి గలిగి
మోక్షసామ్రాజ్య మంతికమ్మునఁ జెలంగ, సమధికసుఖస్వరూపుఁ డై జగతిఁ బరఁగు.

గీ. ముత్తెఱఁగు లైన యీరూపమును ద్యజించి,యెవనిసంకల్ప ముపశాంతి నొనయు నతని
కౌదవుఁ బరమపదంబు మహోన్నతంబు, భవకృదీహావినాశకం బవుటఁ జేసి. ౩౯౧

గీ. విడిచి దవ్వుగ నింద్రియవిషయముల మనస్సుచే నిగ్రహించి మనస్సు, బాహ్య
సంస్థితాభ్యంతరస్థితసకలవస్తు, సహితసంకల్పనాశంబు సలుపవలయు. 3౫3

సీ. భోగవతీసరిద్యోగమహాభాగ్యభాసితపాతాళవాసి వైన
గంగాదినిర్మలకల్లోలినీరత్నవర్ధితభూలోకవాసి వైన
సనకసనందాదిసన్మునిస్తవనీయవాగిజాసనలోకవాసి వైనఁ
గామితార్థప్రదకల్పకచింతామణీసమంచితనాకవాసి వైన
గీ. వేలకోలఁదివత్సరములు వేల్పు లలర, ఘనతపశ్చర్య నున్న సంకల్పనాశ
నమ్ము గాదేని నీకు మోక్షమ్ము లేదు, తదితరోపాయములు నిరర్థకము లచట.

వ. అట్లగుటం జేసి. 3౫౫

గీ. ఆత్మసుఖద మబాధ మత్యంతశుద్ధ, మపగతవికారషట్కంబు ననుపమంబు
నైన సంకల్పసంక్షయ మబ్బుట కయి, ప్రబలయత్నం బొనర్పుము పౌరుషమున.

సీ. సంకల్పదృఢతంతుసంగ్రథితంబులు భావంబు లన్నియుఁ, బాపరహిత!
యా తంతువిచ్ఛేద మైనమీఁదట నవి యెచ్చటి కేఁగునో; యెఱుఁగలేము
కాన విధ్వస్తసంకల్పుండ వై నీవు ప్రారబ్ధవశమునం బ్రాప్త మైన
వ్యవహారమునమాత్ర మాస్థ వహింపుము, క్రొత్తగా నెద్దియుఁ గోరకు మది
ఆ. సాధుజనవిధేయ! సంకల్పసంతతి, చ్ఛేద మెప్పు డొదవు; జీవుఁ డపుడ
బ్రహ్మభావ మొనయు భవసంగదూరుఁ డై, యోగికథితముక్తియోగ మిదియ.

సీ. పరమార్థవిషయ మై ప్రశ్నించితివి పిన్నవాఁడ వయ్యును, జెప్పినాఁడ నట్లు,
అబ్బాయి! బ్రహ్మతత్త్వానుభవంబును బడసి నేర్పున వికల్పప్రపంచ
మును బలాత్కృతిఁ ద్రోసిపుచ్చి మనోవృత్తు లన్నింటి విలయమ్ము నందఁ జేసి
కడలేని సౌఖ్యంబుఁ బడయు నిమిత్త మై యత్యుత్తమంబును నద్వితీయ
గీ. మాగమశిఖాప్రసిద్ధంబు యోగిసేవ్య, మమలతర మగు పరమపదముఁ గ్రమముగఁ
బొందు మని యెఱిఁగించె నపూర్వఫణితిఁ, గుశున కత్తఱి నమ్మౌనికుంజరుండు.

క. మునిబోధముచేఁ దత్క్షణమున భ్రమము దొలంగ జ్ఞానమును బడసి మహీ
తనయాసుతుఁ డఖిలముఁ బయి, కనువర్తించుచుఁ జరించె నదిమొదలు, నగజా!

వ. అనంతర మయోధ్యాపట్టణంబున జనసంబాధంబు లయిన సమస్తవీథులయం దట
నటఁ గాన మొనర్చుచున్న సవయస్కుల మహామనస్కుల సన్నుత గాత్రుల
జనకదౌహిత్రులఁ జరణజితపల్లవులఁ గుశలవులం దిలకించి, వాచంయమీంద్రుఁడు
మోచాఫలమధురవాచాధౌరంధరి నిట్లనియె. 3౬౦

ఉ. ప్రేమను జూపుచున్ శ్రవణపేయముగా భవదీయగానమున్
రాముఁడు భీమదానవవిరాముఁడు తా వినఁగోరు నేస్; వి
ద్యామహిమంబు తోఁపఁగఁ దదగ్రతలంబునఁ బాడుఁడీ, యతం
డేమి యొసంగవచ్చిన గ్రహింపఁగఁ బూనకుఁ డీరు బాలకుల్!. ౩౬౧

*క. భూదయితుఁ డాలకించిన, నాదుకవిత్వంబునకు ఘనత గల్గుటయే
కా, దన్నలార! మీసుల శుభోదయ మగు మీకుఁగూడ నొగిఁ జనుఁ డనుడున్.

సీ. వారును మునిపతి ప్రేరణచేఁ బురి నందందుఁ బాడుచు మందగమన
మునఁ బోయి తమపాట జనపతికిన్ వినవచ్చునట్లుగ సమీపమున నిలిచి
తంత్రుల మీటుచుఁ దనుయష్టులకుఁ గోరకితదశ యేర్పడుగతిని బాడి,
రప్పుడు రాఘవుం డం దందు నూతనపాఠక్రమములచేఁ బరఁగి శ్లోక
గీ. బద్ధ మై శుద్ధ మై గేయఫణితితోడఁ, బాలుచు తన పూర్వవృత్తాంతపుస్తకంబు
విని మఱియు దీనిఁ జక్కఁగా వివిరిలన, నాలకింపంగవలయు నం చభిలషించె. ౩౬౩

వ. అంత నాపురుషశార్దూలుం డధ్వరమధ్యంబున వీలగుకాల మరసి మహర్షులను, రాజులను, బండితులను, పౌరులను, పౌరాణికులను, వ్యాకరణజ్ఞులను, బ్రాహ్మణులను దక్కుంగలవారి నందఱ నాహ్వానించి గానప్రవీణు లగు మాణవకులఁ బిలిపించె, నట్టివేళ. ౩౬౪

కుశలవులు రామాజ్ఞచే రామాయణమును గానము సేయుట

సీ. అచ్చటఁ జేరిన యఖిలజనంబులు సంతోషపూరితస్వాంతు లగుచు
బాలకులను రామభద్రుఁ దదేకదృష్టుల తెప్పవాల్పక చూచిచూచి
యచ్చెరువడి బళీ! యిచ్చిఱుతలు రఘూత్తంసుని నెల్లవిధములఁ బోలి
యుండిరి, రామబింబోదితప్రతిబింబయుగళమో యనుబుద్ధి యొదవుచుండె,
గీ. వీరియెడ వల్కలాజినధారణంబు
జడలు ముడియు టీరెండుఁ జొప్పడవ యేని
నెఱుఁగఁబడ దొండుభేద, మం చేకభంగి
ననికొనఁదొడంగి రన్యోన్యమును లతాంగి! ౩౬౫

క. ఉమ! తమ్ముఁ గని సభికులీ, క్రమమునఁ జెప్పికొనుచుండఁ గలరసమున గా
నము సేయ మొదలువెట్టిరి, సమంచితవిపంచికలను సంయమితనయుల్. ౩౬౬

గీ. మనుజసంగీతమహితక్రమమ్ము మించి, మధురగానరస మ్మసమానసరణి
మౌనిదారకవక్త్రపద్మముల వెడలి, రామభద్రు సభామందిరమును ముంచె.

మ. అపరాహ్ణం బగుదన్క బాలకులచే నాత్మీయ మాగాథఁ గ
ర్ణపుటాప్యాయనదాయకంబుగ జనుల్ రంజిల్లఁ బాడించి గా
థపుఁ బ్రేమన్ రఘువల్లభుండు "పదివేల్ బంగారునాణెమ్ము లి
మ్ముపధానమ్ముగ వీరి" కంచు భరతాఖ్యుం బంచెఁ, గాత్యాయనీ! ౩౧౮

ఉ. కైక కొమారుఁ డాకరణిఁ గాంచననిష్కము లీయఁబోవఁగా,
మా కివి యేల? రాజ! క్షుధ మాన్పుకొనన్ వనసంభవంబు లౌ
శాకములున్ ఫలంబులును జాల లభించెడి వద్దటంచుఁ గై
కోక నిరాకరించి మునికుంజరుసన్నిధి కేఁగి రిర్వురున్. ౩౧౯

శ్రీరాముఁడు, కుశలవులు తనకుమారు లని యెఱింగి జానకీసహితముగ వాల్మీకిమహర్షిని బిలిపించుట

చ. కనకముఁ ద్రోసివేఁత మునికాంతునిఁ జేరుటఁ దన్నుఁ బోలుటల్
తనచరితంబుఁ బాడుట సదస్యులు తద్గతిఁ జెప్పికొంటయుం
గని రఘుభర్త యచ్చెరువుగల్గినడెందముతో మహీసుతా
తనయులుగాని కారు మునిదారకు లంచు నెఱింగె వారలన్. ౩౨౦

వ. ఇట్లు కృతనిశ్చయుఁ డై శత్రుఘ్నహనుమద్విభీషణసుషేణాంగదులం గనుంగొని
వారితో నిట్లనియె. ౩౨౧

సీ. భగవంతుఁడు మహానుభావుండు మునిలోకమండనుం డమరసమానుఁ డైన
వాల్మీకిసంభవు వైళంబ జానకితోడ నిచ్చోటికిఁ దోడితెండు,
పూతచరిత్ర యీసీత, దోషము లేశ మేనిఁ గనంబడ దీమెయెడల
నని నమ్మకంబుగ జనులంద ఱనుకొనుభంగి నేఁ డీసభాభ్యంతరమున.
గీ. సీత గట్టిగ శపథంబు సేయవలయు, ననుడు విస్మయమానసు లగుచు రామ
పార్షదులు మౌనివర్యునిపజ్జ కరిగి, యెఱుఁగఁ బల్కిరి తద్విధం బెల్ల, దేవి! ౩౨౨

క. అనుటయు రామమహీశుని, మనోగతం బెల్లఁ దెలిసి మౌనీంద్రుం డ
ట్లనె మా జానకి శపథము, పొనరించును తేపు జనసమూహము నెదుటన్. ౩౨౩

క. సతులకుఁ బతియే పరదైవత మగుటను రఘువరేణ్యు పను పొనరింపం
గృతనిశ్చయురాలు సుఁడీ; క్షితిపుత్రిక, సంశయింపఁ జెల్లదు మీరల్. ౩౨౪

సీ. ఏఁ గొనివచ్చి తే పెల్లరు హర్షింపఁ జేయింతు శపథంబు సీతచేత,
మతిమంతులార! యీమాట నివేదింపుఁ డని పల్క, వారు తదాజ్ఞ వడసి
చని మౌనికథితంబు సర్వంబు దెలిపిరి, రాముఁ డయ్యది విని రాజులార!
మునులార! జనులార! మునివరుసందేశమును వింటిరే? తేపు జనకపుత్రి

గీ. శపథ మొనరించుఁ గావున సకలజనులు, దాని నాలించి యవల మీమానసములఁ
గోరి మంచిచెడ్డల నెఱుంగుదురుగాక, యనుచు వాఁడుచ్చె నత్తఱి వనజనయన!

వ. మఱునాఁడు తదీయపాతివ్రత్యప్రభావంబు నరయుభావంబులఁ జాతుర్వర్ణ్యంబుల వారును మహర్షులును వానరర్షభులును గౌతూహలావిష్టు లై వచ్చి సభాభవనం బున సమాసీను లై యుండి, రంతఁ దపస్విలోకతిలకాయమానుం డయిన వాల్మీకి జానకీసమేతుం డై చెచ్చెఱ విచ్చేసె. ౩౭౬

సీ. చేమోడ్పుఁ గీలించి మోము మఱవాంచి కన్గవనుండి యశ్రుబిందువులు తొరఁగ
"నేదోస మెఱుఁగనినాదుజీవితమున కకట యిన్నిపరీక్షలా ?" యటంచుఁ
దల్లడ మొందుడెందమ్ముతో మెల్లనినడకతో భారతీనాథువెంట
వచ్చుమహాలక్ష్మివైఖరి వాల్మీకిసంయమివెంబడి సవనశాల
గీ. లోఁ బ్రవేశించుచున్న త్రిలోకపూత, నవనిజాతను జూచి సమస్తజనులు
బాగు బాగు మేల్ మేల్ బళిబళి యటంచ, నేకగతులఁ బ్రశంసించి రిందువదన!

వాల్మీకి సీతావృత్తాంతమును శ్రీరామునితోఁ జెప్పుట

క. ఆసమయంబున మునిజల, జాసనుఁ డగు నాకుజన్ముఁ డవనీప్రియపు
త్రీసహితుఁ డగుచు ననియె స, భాసన్మధ్యమును జొచ్చి భానుకులునితోన్. ౩౭౭

సీ. రాఘవ! చూడు మీ రాకేందుముఖి సీత నిర్మలచరిత నీధర్మపత్ని
సువ్రత దోషైకశూన్య, జనాపవాదమ్మున కధికభయమ్ముఁ జెంది
విడనాడితివి పూర్వ మడవిలో మాయాశ్రమమునకుఁ గడుసమీపముగ, నవ్వి
ధం బేను మానికాంతాముఖమ్మున విని, చెచ్చెఱఁ బోయి తోడ్తెచ్చి దుగఖ
గీ. ముపశమించెడినుడు లెన్ని యో యెడనెడఁ, జెప్పి చిప్పటిదాఁక రక్షించినాఁడ
సంశయింపక యాజ్ఞ యొసంగు దేని, నమ్మకము పుట్ట శపథ మ్మొనర్పఁగలదు.

గీ. యమళశిశువుల వీరల నరయు మధిప!, మైథిలీగర్భజాతులు మదనకల్పు
లాత్మజులు నీకు దుర్ధర్షు లన్నిఁటను భ, వాదృశులు నే యథార్థంబుఁ బల్కుచుంటి.

క. ఇది యొకఁడు విను ప్రచేతసు, పదియవకొమరుఁడను నే, నబద్ధపునుడి యం
చిదివఱ కెన్నఁ డెఱుంగ జ, గదీశ! కుశలవులు నీకుఁ గన్నకుమారుల్. ౩౭౮

ఉ. ఎన్నియొవేలయేండ్లు తప మే నొనరించితి నిండుదీక్షతో
మున్నటవీస్థలిన్ మునిసమూహము లౌ నని మెచ్చ, దాన నౌ
పున్నెము నన్నుఁ జెందకయ పోవుత నిష్ఫల మై, పవిత్రతా
భ్యున్నతి వన్నె గన్న మహిపుత్త్రికయందుఁ గళంక మున్నచోన్. ౩౭౯

సీ. అనవుడు జనవిభుం డను విద్వదవతంస! నీవు పల్కిన దెల్ల నిక్కువంబు
గట్టినమ్మకమును గల్గించెఁ గల్మషరహితభవత్సూక్తిరాజి నాకు,
మును లంకలోఁ గూడ ననలంబునం జొచ్చి వేల్పు లద్భుత మొంద వెడలివచ్చి
ఘనతరప్రత్యయకారిణి యయ్యె, నాఁ డిల్లు సేర్చుటకును హేతు వదియు
గీ. అట్టిసతి సీత తప్పు లేనట్టి దైన, నడవి విడువఁగఁబడియె జనాపవాద
భీతచిత్తుండ నయిననాచేత సంయమిప్రభూ! దాని మీరు క్షమింపవలయు. ౩౮౩

క. నా కుదయించిన పుత్త్రికు, లీ కుశలవు లనుచు బుద్ధి నెఱుఁగు,దయిన భూ
లోకమునఁ బతివ్రత సీ,తాకాంత యటన్నఁ గడుముదం బగు నాకున్. ౩౮౪

*క. పలువురు పలుతెఱఁగులుగాఁ, గులకాంతనుగూర్చి చెప్పికొన నేమేమో,
యిల నెంతవాని కైనను, దలవంపక సంచరింపఁ దగునా? యనఘా! ౩౮౫

సీతశపథము చేయుట

క. ఆ మాటలచే నప్పుడు, రామాభిప్రాయ మెఱిఁగి, రాజీవభవుఁ
వే ముం దిడికొని విబుధ,స్తోమం బచ్చటికి మెచ్చుతోఁ జనుదెంచెన్. ౩౮౬

*క. తోయజముఖి మనజానకి, తోయజమిత్రాన్వవాయధూర్వహు నాజ్ఞఁ
జేయు నట శపథ మేదో; యాయెడకుం బోయి విందమని మోదముతోన్. ౩౮౭

చ. పరుగిడివచ్చి రందఱు సభాభవనం బఖిలంబు నిండె, న
త్తఱి నునుపట్టుఁబుట్టమును దాల్చిన పంటపలంతిముద్దుకూఁ
తురు పతియానచొప్పున నథోగతదృష్టుల నిట్లు పల్కెను
త్తరముగ మోముఁ ద్రిప్పి కరతోయజముల్ ముకుళించి, పార్వతీ! ౩౮౮

ఉ. ధన్యుని రామభూధవునిఁ దక్క మదీయమనోఽంబుజాత మం
దన్యుఁ దలంప నేని; వనమందుఁ ద్యజించిన యప్పు డైన న
మ్మాన్యుని నేవగించి యొకమాటయుఁ బల్కక కొల్తు నేని; సౌ
జన్యముతోడ మజ్జనని క్ష్మా వెస నా కవకాశ మిచ్చుతన్. ౩౮౯

గీ. తల్లి! భూదేవి! నాయందుఁ దప్పులేని,మాట నిజ మేని; దడయక మార్గ మొసఁగి
నన్ను నీలోనఁ జేర్చికొనంగదమ్మ, జగమునం గలసడి కోర్వఁజాల నింక. ౩౯౦

భూదేవి సీతను దనలోనికిఁ గొంపోవుట

సీ. జానకి యీవిధి శపథంబు గావించునంతలోపలఁ గడునద్భుతముగ
సురుచిరవంతమ్ము సూర్యప్రకాశ మనుత్తమంబును మహోన్నతంబు

దివ్యరూపాహిరాడ్ధ్రియమాణ మైన సుందరవిమానంబు భూతలమునుండి
పొడమె నొకం, డంత భూదేవి గన్పట్టి స్నేహసమన్వితచిత్తమునను

గీ. రెండుచేతుల నాత్మపుత్త్రిక గ్రహించి, స్వాగతము వల్కి రమ్ము బిడ్డా! యటంచుఁ
దద్విమానమధ్యంబున నద్వితీయ,భంగిఁ గూర్చుండఁ బెట్టెను, మంగళాంగి! ౩౯౧

క. సులలితయానమున రసా,తలమునకుం బోవ నున్న ధరణీసుతపై
నలఘుగతిం గురిసెం బూ,వులవాన దివంబునుండి, పూర్ణేందుముఖీ! ౩౯౨

క. సురనికరసాధువాదము, కర మాశ్చర్యముగఁ బరఁగె, గగనతలగతా
ధ్వరభుక్కు లొక్కమొయిఁ బల్కిరి పలుతెఱఁగు లగునుదులఁ, గిన్నరకంఠీ!.

వ. మైథిలీశపథకారణమ్మునం జేసి పృథివ్యంతరిక్షంబులం గల సమస్తస్థావరజంగమంబు
లును మహాకాయు లగువానరులును విభ్రాంతు లై యుండి, రందు. ౩౯౪

ఉ. కొందఱు రామునిం గనుచుఁ, గొందఱు జానకిఁ గాంచి యెంతయుం
గొందఱు మందుచున్, మఱియుఁ గొందఱు ధ్యానమునన్ మెలంగుచున్,
గొంద ఱిదేమి మాయ యనుకొంచు, మహాపద మూఁడె నంచు, న
ట్లందఱుఁ దెల్వి దప్పి గళితాశయు లై,రపు డేమిచెప్పుదున్. ౩౯౫

ఆ. ధరణిపుత్త్రి భూవివరముఁ బ్రవేశింప, నొకముహూర్తకాల మూహ దక్కి
సర్వభూతకోటి సమ్మోహితం బయ్యె, న పవిత్రచరిత మద్భుతంబు. ౩౯౬

సీ. కాకుత్స్థుఁ డామీఁదఁ గాఁగల కార్యంపు,గౌరవం బెఱిఁగినఘటికుఁ డయ్యుఁ
దెలియనివానిరీతి ననేకగతుల సీ,తనుగూర్చి దుఃఖించి తత్క్షణంబ
యబ్జగర్భుండు మహర్షులు బోధింప, స్వాస్థ్యస్థితునిమాడ్కిఁ జలుపఁదగిన
యవ్వాలికార్యంబు లన్నిఁటిఁ గావించి, సంయమీంద్రుల నెల్ల సాగనంపి

ఆ. యధ్వరంబు నడపినట్టి ఋత్విక్కుల, కందఱకును మణిధనాదు లిచ్చి
సత్కరించి తాను జనె నయోధ్యకుఁ బ్రియ,సుతులతోడ బంధువితతితోడ. ౩౯౭

క. నరనాథుం డదిమొదలుగ, విరక్తుఁ డయి విషయభోగవిసరము పట్లన్,
నిరతముఁ బరాత్మచింతా,పరుఁ డై యేకాంతభూమి వసియించె, సతీ! ౩౯౮

కౌసల్య తరణోపాయమునుగూర్చి చెప్పుమని రాముని గోరుట

వ. ఒకానొకప్పుడు ప్రియభాషిణి యగు కౌసల్య స్వగర్భసంజాతుం డయిన రాముని
సాక్షాన్నారాయణునిఁగాఁ దలంచి, ధ్యానరతుం డై యతండున్న చక్కటికిం బోయి,
భక్తిమై నమస్కరించి ప్రసన్నుం జేసికొని తుషితహృదయమ్మున నిట్లనియె.

సీ. రామ! నీ వఖిలకారణుఁడవు పరమాత్మ వానందరూపుండ వవ్యయుఁడవు
పూర్ణుండ వుత్తమపురుషుండ వాదిమధ్యాంతము ల్లేని నియంత వౌర ?
ఇంతకు మున్ను ని న్నెట్టులో భావించి జీవితమ్మును వృథ సేసికొంటి
మత్పూర్వభవపుణ్యమహిమచే నుదయింపఁ జాలితి నాగర్భసదనమందు

గీ. స్వామి! నా కిదె యవసానసమయ మయ్యెఁ, గాని యిపుడును నజ్ఞానకల్పితభవ
బంధవిచ్ఛేదకృత్సదుపాయ మెదియు, మదికిఁ దోఁపదు తిరియించుమార్గ మెట్లు?

*క. కన్నందుకుఁ గనులారం, గన్నందుకు వినుతి సేయఁ గన్నందుకు నా
యన్నా! భవపాశంబును, గ్రన్నన విదళింపు బోధఖడ్గతతిచే. ౪౦౧

*క. ముసలితన మలమికొనుటం, బస చెడె నవయవములందుఁ బ్రజ్ఞ సడలె మా
నసమున, సంక్షేపముగ స్వరసఫణితిం దత్త్వమును గఱపుము, మహాత్మా!.

క. అనవుడు వైరాగ్యముతోఁ, దనవిధముం దెలియఁ గోరుతల్లికి భక్తా
వనుఁ డనఘుఁ డనుకంపావననిధి దాశరథి మాతృవత్సలుఁ డనియెన్. ౪౦౩

రాముఁడు కౌసల్యకుఁ ద్రివిధ మగుభక్తిమార్గమును దెలుపుట

సీ. కర్మయోగం బని జ్ఞానయోగం బని యుత్తమస్థిరభక్తియోగ మనియు
ముక్తిసాధనము లౌ మూఁడుమార్గమ్ములు చెప్పంగఁ బడియె నాచేత మున్ను
త్రిగుణభేదమ్ముచేఁ ద్రివిధమ్ము భక్తి, యెవ్వాని కేగుణము స్వభావ మగునొ;
భక్తియు వాని కబ్బంగినే భేదించు, నన్యులు గొప్పవాఁ డనుచుఁ దన్నుఁ

గీ. జెప్పికొనుటకొ; రిపులహింసించుకొఱకొ; పరగుణద్వేషమాత్సర్యభావముననొ;
ప్రీతి భజియించు సంరంభి భేదదృష్టి, తామసుం డగుభక్తుండు తల్లి! నాకు. ౪౦౪

పంచపాది:

పుడమి ధనమును యశమును భోగములను
వలచి స్వర్గాదిఫలలబ్ధివాంఛ గలిగి
యే నుపాసకుఁడను మఱి యీశ్వరుం డు
పాస్యుఁ డనియెడి భిన్నభావమున నన్నుఁ
బ్రత్యహముఁ గొల్చుభక్తుండు రాజసుండు. ౪౦౫

గీ. అఘవినాశార్థమో; యీశ్వరాజ్ఞఁ జేసి, యర్హ మనియొ; నిరీహ మదర్పితముగ
మామకార్చనరూపకర్మము నభేద, భావమునఁ జేయు సాత్త్వికభక్తుఁ, డంబ!.

వ. మదీయంబు లగుసర్వజ్ఞత్వసర్వశక్తత్వాదిధర్మంబు లాత్మీయంబులుగ భావించుటం
జేసి సముద్రమ్మునందు గంగోదకమ్మునకుం బోలె, ననంతకళ్యాణగుణనిలయుండ

నైననాయం దవిచ్ఛిన్నముగ నుదయించు మానసికైక్యనిర్గుణభక్తియోగము
నకుఁ బరమప్రాపకం బయి చెల్లు. ఇదియుంగాక భేదబుద్ధిరహితం బైన యహేతుక
భక్తి సాలోక్యసామీప్యసారూప్యసాయుజ్యంబు లనియెడుమత్సంబంధంబు లగు
చతుర్విధముక్తులం గల్పింపఁ జాలియుండు. ఐనను భక్తు లగువారు నాసేవ మాని
పైనాల్గింటిలో నెద్దియు గ్రహింపక మదైక్యరూప మగునైదవముక్తిని బడయు
దాఁక భజించుచుందురు. ఇదియె సంపూర్ణ మయిన భక్తియోగము. ౪౦౭

క. సాలోక్యాదులఁ గోరక, యోలిఁ సంపూర్ణభక్తియోగముచే ని
ర్మూలించి గుణత్రయమును, నాలోనం గలియఁగలఁడు నరుఁ, డో జననీ!. ౪౦౮

వ. గొప్పదియు ఫలవాంఛారహితము నగు స్వధర్మాచరణరూపప్రసిద్ధకర్మయోగం
బును, హింసావివర్జనమును, నసత్యవస్తుత్యాగమును, విషయవిరక్తియు, సాధుజన
సంభావనంబును, నార్తజనరక్షణంబును, దనకుఁ దుల్యు లగువారియెడఁ జెలిమి
నిలుపుటయు, యమనియమాద్యష్టాంగయోగాభ్యాసంబును, వేదాంతవాక్య
శ్రవణంబును, మద్దర్శనంబును, మత్ప్రార్థనంబును, మత్పూజారతియు, మదీయ
ధ్యానంబును, మన్నమస్కారంబును, మన్నామానుకీర్తనంబును, సత్పురుషసాంగ
త్యంబును, నిష్కపటవర్తనంబును, నహంకారనిరసనంబును, నా ధర్మ మగు
సచ్చిదానందభావమునం దాసక్తియుంచుటయు నను నీ సద్గుణంబులు గల పురు
షుండు పరిశుద్ధహృదయుఁ డై మదైక్యంబు వడయు. అందును బ్రధానంబుగ నా
గుణంబుల నాలించుటయె శీఘ్రంబున నన్నుఁ బొందుటకు ముఖ్యసాధనంబు. ౪౦౯

సీ. తన కాశ్రయమ్ము లై తనరుపుష్పాదుల వదలి యొయ్యన వాయువశమువలన
ఘ్రాణేంద్రియముఁ బొందు గంధమ్ము చందాన, మనము యోగాభ్యాసమహిమఁ జేసి
యాత్మను బొందెడు, నంబికా! బ్రహ్మాండగతసకలప్రాణివితతులందు
నే నాత్మ నై యుండ, జ్ఞానహీనుం డట్లు లో నున్న నన్నుఁ దాఁ గానలేక
పంచపాది:
మాంసదృగ్గోచరప్రతిమాదిబాహ్య
వస్తువులమాత్ర మర్చించు వాంఛతోడఁ,
గార్య నిర్వృత్తబహువిధగంధపుష్ప
ధూపదీపోపహారవస్తువుల నాకు
నంతగా సంతసము గల్గ దనుట ధ్రువము. ౪౧౦

సీ. ఎల్లభూతములయం దే నుండ నవ్విధం బరయక యందు లే ననియుఁ, దాను
బూజించు విగ్రహంబుననె యున్నా ననియును, భూతములకంటె ఘనత ప్రతిమ

కే కల దనియును, నెవ్వఁడు దలఁచు; నమ్మనుజుండు భూతావమానియగును
నతఁ డెంతగాఁ బ్రతిమాదుల నన్నుఁ బూజించిన నే నపూజితుఁడనె చుమీ;
గీ. తల్లి! తనయందు నిఖిలభూతములయందు, నేను గల నని గుఱుతింపఁ డెంతదాఁక
నంతదాఁకనె ప్రతిమాదులందు నన్ను, భక్తిఁ బూజింపవలె యుక్తభంగి జనుఁడు.

గీ. అమ్మ! తనకును బరమాత్మ నైననాకు, భేద మెంచు నెవం, డట్టిభిన్నబుద్ధి
గలుగువానికి మృత్యువువలనిభయము, సంభవించును లేదిందు సందియంబు. ౪౧౨

గీ. అక్కతనఁ బరిచ్ఛిన్నము లైన సకల, భూతముల నపరిచ్ఛిన్నరీతి నున్న
నన్ను నొక్కని జ్ఞానమానముల మైత్రి, పెంపున నభేదబుద్ధిఁ బూజింపవలయు.

గీ. చేతనుండ విశుద్ధుండఁ జిన్మయుఁడ, నైన నేనె జీవాకృతి నలరుచుంటి
నని యెఱిఁగి బుద్ధి ననిశంబు నఖిలభూత, తతికి నతి సేయవలె సుధీతల్లజుండు.

సీ. జనని! యాకారణంబున నీశ్వరుఁడ నగు నాకును మఱిజీవునకును భేద
మరయంగఁ బోల దెత్తఱి, నీకుఁ గర్మయోగమ్మును జ్ఞానయోగమును జెప్పి
నాఁడ, నీ రెంటిలో నరుఁ డెద్ది గైకొన్న శాంతిచేకూరు నిస్సంశయంబు
కావున భక్తియోగము నవలంబించి యీ వఖిలప్రాణిహృదయవర్తి
గీ. నైన నన్ను నారాధింపు, మావిధంబు, కష్టముగఁ దోఁచె నేని; నీకన్నబిడ్డఁ
గాఁ దలంచి ధ్యానించినం గలుగు శాంతి, క్రమముగా నన్మదైక్యసౌఖ్యము లభించు.

వ. అనుటయుఁ గౌసల్య. ౪౧౩

చ. తనయుని మాటలన్ విని ముదంపడి నాఁడు మొదల్ పరాత్పరుం
బ్రణిహతపాపబంధనుని రాము సదా మదిలో స్మరించుచున్
జననమృతిప్రభూతదృఢసంస్మృతిపాశముఁ ద్రెంచి ముక్తిఁ బొం
దెను గమనీయభక్తిని గత్రితయమ్మును దాఁటి, పోటిరో!. ౪౧౪

సీ. చిత్రకూటాద్రిపై శ్రీరాముఁ డెఱిఁగించినట్టితత్త్వరహస్య మఖిల మాత్మఁ
గదియించి యుండిన కైకేయియును శాంతభావ మై శ్రద్ధయు భక్తి మిగుల
రఘువరేణ్యుని మనోరాజీవమందు స్మరించుచుఁ దనువుఁ ద్యజించి శాంతి
వొదలఁ ద్రివిష్టపంబున కేఁగి యట దశరథునితోఁ గూడి నిరంతరముగ
ఆ. సౌఖ్య మందుచుండె, సౌమిత్రితల్లి సుమిత్రయును సదా పవిత్రహృదయ
యగుట రామభద్రు నతిభక్తిఁ బూజించి, యొడలు విడిచి భర్తకడకుఁ జనియె.

వ. అంతఁ గొంత కాలంబు గడచుటయు. ౪౧౫

ఆ. తనకు మేనమామ జనవల్లభుఁడు యుధా, జిత్తు పిలువ నధికసేనతోడ
భయదవిక్రముండు భరతుండు కేకయ, దేశమునకుఁ జనియెఁ దెగువ మిగుల.

సీ. అన్నయానతిమీఁద నావిధిఁ జని యంద, మోఘసత్త్వాఢ్యుల మూఁడుకోట్ల
గంధర్వపతుల సంగ్రామంబున వధించి పురములరెంటి నేర్పఱచి యాత్మ
తనయులఁ బుష్కరతక్షుల ధనధాన్యసుహృదన్వితులఁ జేసి, సొరిదిఁ బుష్క
రావతియందు నగ్రజునిఁ దత్సోదరుఁ దక్షశిలాఖ్యపత్తనమునందుఁ
ఆ. గ్రతుభుగాళి మెచ్చగతి నభిషేకించి, నేల యేలు రాజనీతి దెలిపి
మరలివచ్చి రామచరణసంసేవనా, సక్తి మెలఁగె సరసిజాతనయన!. ౪౨౧

క. అనుజుఁడు భరతుఁడు చేసిన, పనికిఁ ముద మంది రామభద్రుం డపు డి
ట్లనియె సమాదరఫణితిఁ, ఘనభుజు లక్ష్మణునిఁ జూచి, కరిరాడ్గమనా!. ౪౨౨

లక్ష్మణుఁడు రాముని పంపున నిజాత్మజులను బట్టభద్రులం జేయుట

సీ. ఘనబాహుబలపరాక్రమనిధు లగు నీదు పుత్రుల నంగదచిత్రకేతు
లను నిర్వురను వెంటఁగొని పశ్చిమాశకు వడిఁ బోయి యట నెల్లవారలకును
గర్వమ్మునై నపకారంబు గావించుదుష్టులఁ బోయలఁ ద్రుంచి. మంచి
పట్టణంబులు రెండు గట్టించి హస్త్యశ్వధనరత్నముఖసంపదల నమర్చి
గీ. యందు వారికిఁ బ్రీతిఁ బట్టాభిషేక, మాచరించి ప్రజావిహితాంశములను
దెలిపి శీఘ్రంబ యిచటికిఁ దిరిగిరమ్ము, పొమ్ము తమ్ముఁడ! నావుడు సమ్మతించి.

చ. గజములుఁ దేర్లు గుఱ్ఱములుఁ గర్కశకాయులు కాలుబంట్లు న
క్కజముగ వెంటరా నటకు గ్రక్కునఁ బోయి, కిరాతవీరులఁ
విజితులఁ జేసి చంపి, యడవి న్నగరంబులు రెం డమర్చి, త
త్పౌజ లలరంగ సూనులకుఁ బట్టము గట్టెను, గట్టుపట్టిరో! ౪౨౪

ఆ. అన్నయానమీఁద నరివధాదిక మఖ, లంబు నాచరించి లక్ష్మణుండు
దివ్యమూర్తి రామదేవుని యడుగుఁదా, మరలు గొల్చుచుండె మరలివచ్చి. ౪౨౫

వ. పిమ్మటఁ జాలకాలమ్ము చనుటయు. ౪౨౬

యముఁడు ప్రచ్ఛన్నవేషమున రాముని సందర్శించి యేకాంతముగ ముచ్చటించుట

క. అనవరతధర్మపథప్ర, వర్తను విష్ణు ననాదిపురుషు రాముని జూడఁ
మునిరూపంబున నిలకుం, జనుదెంచెఁ గృతాంతుఁ డబ్జసంభవుఁ డనుపన్. ౪౨౭

వ. చనుదెంచి సౌమిత్రిం జూచి. ౪౨౮

సీ. మతిమంత! లక్ష్మణా! యతిబలుదూతుండ దర్శింపవచ్చితి దాశరథిని
వేగంబ యివ్వార్త విన్నవింపుము పోయి, చిరకాలముగ నా ఋషీశ్వరునకుఁ
బురుషోత్తముఁడు జగత్పూజ్యుఁ డౌ రామభూదేవేంద్రుతో నివేదింపఁదగిన
విషయంబు గల దొండు, విన్నవించెద దాని ననుమతి యైనచో; ననుడు మౌని
గీ. పలుకు లాలించి వడి రఘుపతిని జేరి, యన్న! మీతోడ భాషింప నరుగుదెంచి
యొకతపోనిధి మొగసాల నున్నవాఁడు, సెలవొసంగినఁ దోడ్తెత్తు శీఘ్ర మిటకు.

వ. అని పలుకుటయు నినకులుం డమ్మాట కలరి సత్కారపూర్వకమ్ముగ నమ్ముని
ముఖ్యు నిందుఁ బ్రవేశపెట్టు మనుడు, నూర్మిళాకాంతుండును. ౪౩౦

గీ. ఆజ్యధారలఁ దడిసినయగ్ని వోలె, నాత్మతేజంబునను వెల్గునమ్మహర్షి
నన్నయానతిఁ దెల్పి సమాదరమున, లోనికిం దోడికొనివచ్చె లోలనయన! ౪౩౧

సీ. అవ్విధి మౌనీంద్రుఁ డరిగి రాముని చెంత కనఘాత్మ! వర్ధిల్లు మని మృదూక్తి
నాశీర్వదించిన, నతఁడు వినమ్రుఁడై మ్రొక్కి యథావిధి పూజసేసి
కుశలం బడిగె, మౌనికుంజరుండును నట్లె క్షేమమ్ము గుఱిచి ప్రశ్నించె, నపుడు
దివ్యాసనస్థితు భవ్యతపశ్శీలుఁ దాపసుఁ జూచి సీతావిభుండు
గీ. స్వామి! మీ రెందుకొఱ కిందు వచ్చినారు? నేను గావించు కార్య మే దేనిఁ గలదె?
తెలుపుఁ డని పల్కరింపఁ దత్పరితుఁ డయి, మౌనిసత్తముఁ డిట్లనె, మంజువాణి!.

సీ. రాఘవ! మన మిర్వురము దక్క మూఁడవవాఁ డెవ్వఁ డిందుండ వలనుపడదు
అస్మదాలోచన మతిరహస్యం బౌట నన్యులకుం దెలియంగఁ దగిన
యది కాదు, మఱియెవ్వ రాలింపఁగారాదు, చెవియొగ్గి, నీవును జెప్పరాదు
కట్టుబా టిది, దీనిఁ గడచి యెవ్వఁడు మనమాట లాకర్ణించు మనలఁ జూచు
గీ. నతఁడు నీకు బహిఃప్రాణ మైనఁ జంపఁ, దగినవాఁ డగు, వెనుదీయఁదగ దపు డనఁ,
దపసితో నట్లె యని శపథం బొనర్చి, మిత్రకులరత్న మనియె సౌమిత్రిఁ గాంచి.

వ. నాయనా! లక్ష్మణా! ౪౩౨

గీ. నీవు చని ద్వారభూమిని నిలువు మధిక, జాగరూకత, నేకాంతసమయ మగుట
నెవ్వఁ డేఁ గాని రాఁ జెల్ల దిచటి కిపుడు, వచ్చెనేని; వధించెద వాని నేను. ౪౩౩

క. నిక్కం బీవాక్యంబు మ,ఱొక్కని రానీక కాచియుండు మటంచుం
గ్రక్కునఁ బనిచి నిజానుజు, నక్కపటమునీంద్రుఁ బలికె, నంబుజనయనా!. ౪౩౪

క. నినుఁ బనిచినవా రెవ్వరు, పని యెయ్యది చెప్పుమన్న పలుకుల వేవో
వినిపింపుము నాయెదుటను, ననఘమతీ! యనఁ, గృతాంతుఁ డనె నిబ్భంగిన్. ౪౩౫

క. సకలేశ్వర! వాణీనా,యకుఁ డొకకార్యమునిమిత్త మంపింప భవ
న్నికటమునకు వచ్చితి, మా,యకు నీకుం బొడమినట్టియర్భకుఁడఁ జుమీ. ౪౩౮

క. అరిసూదన! సర్వంబును, హరియించుచుఁ గాలపురుషుఁ డనియెడిపేరం
బరఁగుదు భవదాజ్ఞ మెయిన్, సురమునిపూజితుఁడు పద్మజుఁడు నీతోడన్. ౪౩౯

వ. తనమాటలుగాఁ జెప్పుమన్నవి కొన్ని గల వవధరింపుము. ౪౪౦

సీ. స్వర్గంబు రక్షింప సమయ మయ్యెను నీకు, నాలసింపకుము మహామనస్క!
మును మాయచే జగమ్ముల నెల్లను హరించి, యుంటి వొక్కఁడవె,సీయువిదమైన
మాయతోఁ గూడి కుమారుని నన్నును, నుదకంబునం బండియుండునట్టి
భోగవంతు ననంతుఁ బుట్టించితివి మొట్ట,మొదట, నింకయు కాక మదయుతులును
గీ. గఠినదేహులు నగు మధుకైటభాఖ్యు, దివిజరిపుల సృజించి వధించి వారి
యెమ్ముకలప్రోవు మెదడు గిరీంద్రసహిత,మైన యిమ్మేదినిఁగ జేసి, తంబుజాక్ష!

గీ. దివసకరసన్నిభంబును దివ్యము నగు, పొలుచు నీబొడ్డుఁదామరపూవునుండి
భవనుఁ గల్పించి నను బ్రజాపతిని జేసి, నిఖిలభారంబు నాయందు నిలిపి, తీశ!

సీ జగదీశ! భవదనుజ్ఞానుకూలముగఁ బ్ర,జాపాలనాదికసర్వభార
వహనమ్మునకు నిష్టపడి "నేను సృజియించు, ప్రజల నహంకృతి బాధపెట్టు
దుష్టభూతంబులఁ ద్రుంగింపుఁ" డని యప్పు డర్థించితిని, బరమాత్మ వైన
నీ వంతఁ గశ్యపునికి వామనాకృతి జన్మించి క్రూరరాక్షసగణమ్ముఁ
ఆ. బొడవడంగఁ జేసి భూమిభారమును బోఁ,గొట్టినాఁడ, వవలఁ గొంతకాల
మునకుఁ బ్రజలు పంక్తిముఖుని దుశ్చేష్టల, కోర్వలేక కుంద లోకఁడు గలిగె.

గీ. అతనిని వధించుకోర్కి దేవతలముందు, పదునొకండువేలేండ్లిలపై వసింప
సమయ మొనరించి మానవజగతి కీవు, దిగితి వా యభిలాషమ్ము దీఱెఁగాదె.

గీ. నరుఁడ వై భువి నుంట కేర్పఱచికొన్న, యాయువును బూర్ణమయ్యె నీ, కందుచేతఁ
గాలపురుషుఁడు తాపసాకారమున భ,వత్సమీపమ్మునకు నేఁడు వచ్చినాఁడు.

సీ. ఈమీఁదఁగూడ నీ కా మహీరాజ్యంబు, ననుభవింపఁగవలె ననెడియిచ్ఛ
గలిగిన నట్టులే కానిమ్ము, భద్ర మహా దేవ! ని న్నొకఁడు విధించువాఁడె?
యని చెప్పె, నిదియ పద్మాసనుసందేశ మఖిలేశ! దేవలోకాభిగమన
వాంఛ మీకున్న దేవతలందఱును నేఁడు, శ్రీహరి వైన నీచే సనాథు
గీ. లై త్వదీయవియోగగాఢానుతాప,మునకు గుఱిగాక నిర్బాధముగ సుఖింతు
రనుడు, బ్రహ్మోక్తి విని మందహాసియగుచు, నినకులుం డంతకునితోడ నిట్టులనియె.

సీ. వింటి నీమాట న ప్పిధిఁ జేత నాకును నెంతయు నభిమతం బింత యేల?
యంతక! నీరాక యత్యంతసంతోషమునకుఁ గారణ మయ్యె నని యెఱుఁగుము,
ముల్లోకములకుఁ బ్రమోదంబు గల్గులే నాయవతారంబునకు ఫలంబు,
ఎందుండి యిందుల కేతెంచితినొ పూర్వ; మందులకే యిప్ప డరుగుదెంతు

పంచపాది.

వినుము కోరిక దీతె, నీ విషయ మయి వి
చారమే లేదు; పంకజాసనుఁడు చెప్పి
నట్లు మత్సేవకులకు నాకౌకసులకు
సకలకార్యంబులందు రక్షకుఁ డ నై మె
లంగవలె నింక మాయావిలాసయుక్తి. ౪౪౮

క. దండధర! నీకు శుభ మగు, ఖండితముగ వత్తు, ననుచుఁ గాకుత్స్థుఁడు కా
లుం డిటు సంభాషించుచు, నుండ రఘూత్తమునిఁ జూచునుత్సాహముతోన్.

దుర్వాసుఁడు రాముని యాతిథ్యమును గొని వెళ్లుట

క. దుర్వాసోమునిసింహుఁడు, సర్వజ్ఞుం డీశ్వరాంశసంభవుఁడు మహీ
యార్వానలసంకాశుం, డుర్వీధరపుత్త్రి! వడి నయోధ్యకు వచ్చెన్. ౪౪౯

వ. ప్రాపితరాజద్వారుం డై లక్ష్మణుం జేరి యిట్లనియె. ౪౫౦

క. సౌమిత్రీ! సత్వరముగ, రామునిఁ జూపింపు మవసరం బగు కార్యం
బీమెయి నా కొకఁ డున్నది, నా, మునిసింహున కనెం బ్రణతుఁ డై యతఁడున్.

సీ. ఓమునిశార్దూల! మీ మనోరథ మేమి? మాయన్న యినకులవార్ధి యిపుడు
గావింపఁదగినట్టి కార్యం బదెట్టిది? వినిపింపుఁ, డేను గావించువాఁడ
రాముండు కార్యాంతరవ్యగ్రచిత్తుఁ డై యున్నాఁడు, గాన ముహూర్తకాల
మాగుఁడు కానిచో; ననుడు, నమ్మాటచేఁ దపసి క్రోధానలతప్తుఁ డగుచు
గీ. నీక్షణంబున నీవు మహీశు రాము, నాకుఁ జూపకయుండిన మీకులంబు
దేశయుతముగ నొక్కమై నాశ మొనయ, శాపముం బెట్టువాఁడ నిస్సంశయంబు.

సీ. అని బిట్టుపల్కుడు నాభయంకరవాక్య మాలించి యందలియర్థ మెఱిఁగి,
"మునిపతి కనుకూలముగ నేను బోవకయుండినఁ బెంపొందు నొక్కకులము
నకె కాదు, దేశంబునకుఁ గూడఁ జేటు వాటిల్లెడు, నేగినఁ జెల్లువాఁడ
నే నొక్కఁడనె; కాన నెల్లరు ప్రమందుటకంటె నొక్కరునిపోకయ సమంజ

గీ. నం," బనుచు నిశ్చయించి మనంబునందుఁ, గంపితుఁడుగాక యగ్రజుకడకుఁ బోయి
యత్రిమునిపుంగవునిప్రియపుత్త్రి రాక, విన్నప మొనర్చె నొయ్యన, సన్నుతాంగి!

ఉ. తమ్మునివాక్యముల్ విని కృతాంతునిఁ దిన్నగ సాగనంపి, సౌ
ధమ్మును నిర్గమించి గుణధాముఁడు రాముఁడు తత్క్షణంబ ద్వా
రమ్మును జేరఁబోయి, యట రాజిలు తాపసరాజుఁ గాంచి పా
దమ్ముల వ్రాలి మ్రొక్కి ప్రమదమ్మునఁ దోడ్కొనిపోయె లోనికిన్. ౪౫౪

క. కొనిపోయి యథావిధి న్యాసన మిడి పూజించి మహానిసత్తమ! యిపు డే
నొనరింపఁదగినకార్యంబును దెలుపుఁ డదెట్టి దైనఁ; బొనరింతు ననెన్. ౪౫౫

వ. అనుడు, దుర్వాసుం డిట్లను, రామా! వేలకొలఁది యేండ్లనుండి యుపవాసవ్రతం
బొకండు నాచే ననుష్ఠింపఁ బడుచున్నది. అయ్యది నేటితోఁ బరిసమాప్తియగుటం
జేసి భుజింపఁ దలంచితి. నీయింట సిద్ధంబుగ నున్నపదార్థం బొసంగి, సంతుష్టి
సేయు, మనుడు మహాభాగ్యం బని రఘుగ్రామణి యథాయోగ్యంబుగ సమంజస
వ్యంజనపూర్ణంబును, గదుష్ణంబును, రుచికరంబును, నమృతోపమానంబు, నగు
శాల్యోదనంబు ప్రమోదంబునం గుడువం బెట్టె, నట్టులా జడదారిదిట్ట కృతా
హారుం డై సంతోషస్వాంతంబున నబ్భాకాంతుం బ్రశంసించుచు మరలి నిజాశ్రమంబు
నకుం జనియె. ౪౫౬

తన్నుఁజంప విచారపడు రాముని లక్ష్మణుఁడు ప్రోత్సహించుట

సీ. ఏమాటఁ జెప్పి నశేయని తనచేత ననిపించెనో యముఁ డాదిలోన;
నామాటఁ గూర్చియ యనుకొంచుఁ బెనువగ యలమి పీడింప విహ్వలత నెదియుఁ
దోఁపనిహృదయంబుతో దీనదశఁజాటు, వదనాంబుజంబును వంచి, సకల
లోకాధినాథుండు కాకుత్స్థుఁ డనుజు లక్ష్మణుని హతప్రాయుఁగాఁ దలంచి,
గీ. యొండు పలుకక మిన్నకయుండె,నపుడు, స్నేహబంధమ్ముఁ దెగడుచుఁ జింతతోడఁ
దనకుఁగా దుఃఖమున మున్గి స్థాణు వైన,యగ్రజునిఁ జూచి సౌమిత్రి యనియె నిట్లు.

గీ. రామ! నానిమిత్తము విచారపడ వలదు, బంధుతాప్రేమబంధమ్ముఁ బాయఁ ద్రోచి
తెగువ నన్ను వధింపు కాలగతి యివ్విధముగ మున్నె యేర్పడిన దన్య మిఁక నేల?

సీ. జగదీశ! నీవు భ్రష్టప్రతిజ్ఞుఁడ వైన; నరకలోకప్రాప్తి నాకుఁ గలుగు
నే ననుగ్రాహ్యుఁడ నేని నాయెడఁ బ్రీతి నీ కున్నమాట తా నిక్కమేనిఁ;
బ్రతినఁ జెల్లించుపద్ధతి శ్లాఘ్యతర మేని; సంశయింపక నన్నుఁ జంపఁ దివురు,
ధర్మంబు దొలఁగు టుత్తమలక్షణము గాదు, ప్రతిన దీర్చెడుపట్లఁ బతికిఁ దోడు

గీ. పడుటయే భృత్యకోటికిఁ బరమధర్మ,మనుచు, రాఘవుఁ డమ్మాట విని నిజాను
జన్ముపైఁ గలస్నేహమ్ము సడలఁ జేసి, కులగురు వసిష్ఠు మంత్రులఁ బిలువనంపె.

వ. అట్లాహ్వానించి. ౪౬౦

క. తనకడకుఁ గాలపురుషుఁడు, చనుదెంచినదాది మౌనిశార్దూలుం డేఁ
గినదాఁకం గల యంశము,లను సకలముఁ దెలిపె వారలకుఁ,బికవాణీ! ౪౬౧

మంత్రులు లక్ష్మణుఁడు పరిత్యాజ్యుఁ డని రామునితోఁ దెలుపుట

క. తెలుపుటయుఁ దలఁపై నం,జలులను ఘటియించి ధర్మసరణిని బ్రెగడల్
పలికిరి సపురోహితులై, కలికీ! యక్లిష్టకర్ముఁ గాకుత్స్థు నిటుల్. ౪౬౨

గీ. పాపులను రూపుమాపి భూభరముఁ బాపు
నట్టినీచేతఁ బూర్వమ్మునంద నిశ్చ
యింపఁగాఁ బడియుండెఁ బో; యివ్విధంబు
యుష్మదిచ్ఛావిముఖకార్య మెదవు పెట్లు? ౪౬౩

క. సౌమిత్రివియోగము నీ, కీమెయిఁ గలుగునని జ్ఞానదృష్టికతమునఁ
మే మెఱిఁగినార మనఘా! ప్రేమింపక యనుజు విడిచిపెట్టుము వడిగన్. ౪౬౪

క. వమ్మగును బ్రతిజ్ఞాత్యా,గమ్మున ధర్మంబు, ధర్మగతి జాఱిన నా
శమ్మనయు ముజ్జగములు ధ్రు,వమ్ముగఁ, గావునఁ బ్రతిజ్ఞఁ బాయకు మధిపా!

సీ. అదిగాక నీ వనఃనఖిలలోకములకుఁ బాలకుండవు సుఖాంపాదకుఁడవు
నిన్ను నీచేఁతలు నీనుడుల్ పరమప్రమాణమ్ములుగ నమ్మి మనములందు
వర్తించుఁ బ్రజ, రఘువల్లభ! యూర్మిళావిభు నొక్కనిఁ ద్యజించి త్రిభువనముల
నిపుడు రక్షించుట కీ వర్హుఁడవు, చేయఁ దొడరుము, నాఁడుదు దోషరహిత

గీ. ముచిత మమలంబు ధర్మార్థయుక్తమైన, వారివాక్యము విని సభాగారమధ్య
భాగమున ననుజన్మునిఁ బాఱఁజూచి, తడయ కిట్లనె రామభూధవుఁ, డపర్ణ!.

శ్రీరాముఁడు లక్ష్మణుని బరిత్యజించుట

క. కాఁగూడదు ధర్మక్షతి, రాఁగూడదు నింద పృథివి రాజునకుఁ, బరి
త్యాగమ్మును వధయు మహా, భాగులకుం దుల్యము లయి పరఁగుచు నుందున్.

ఉ. నాయెడఁ గల్గుభక్తియును, నా కొఱకై వనిఁ బడ్డకష్టముల్
దాయలఁ జంపుతెంపును గృతజ్ఞతయుఁ, గణియింప కిత్తఱిఁ
న్యాయపథైకరక్షణమనమ్మున నార్యజనోక్తిమీఁదుగాఁ
బాయఁగఁజేయఁ బూనితిని బ్రాణసమానుని నిన్ను, లక్ష్మణా!. ౪౬౮

క. అనుగుందమ్ముఁడ! యిమ్మెయి, నినుఁ బూర్తిగ వదలినాఁడ, నీయిచ్చకు వ
చ్చినయట్టు లెచటి కైనను, బనివిను మిఁకఁబై, ఋణానుబంధము దీఱెన్. ౪౫౯

లక్ష్మణుఁడు స్వస్వరూపముం బడయుట

ఉ. అన్న ముఖంబునుండి "విడనాడితిఁ బ్రాణసమాను సత్వసం
పన్నుని ని"న్నటన్న చెడుపల్కు బయల్పడి నంత నే; మహా
పన్నత కగ్గమై కలఁకఁబాఱినకన్నులు కొందలంపు టా
ర్తి న్నెఱపంగ లక్ష్మణుఁడు తేజుదొఱంగినమోముదమ్మితోన్. ౪౬౦

ఆ. రామభద్రునకుఁ బ్రణామంబుఁ గావించి, సత్వరంబ యాత్మసదనమునకు
నేఁగి యందుఁ దల్లి కిల్లాలి కితరుల, కెఱుఁగఁ జెప్పి వారి నిష్టపఱచె. ౪౬౧

సీ. అంతట సరయూస్రవంతీతటంబున, కరిగి, తజ్జలముల నాచమనముఁ
జేసి యొక్కట రెండుచేతులుఁ మోడ్చి నిశ్చలమతి నవరంధ్రములను మూసి
శిరమునఁ బ్రాణమ్ముఁ జేర్చి, యక్షరమును, వాసుదేవాభిఖ్య వఱలునదియు
నవ్యయంబును, బరం బనవద్య మగు బ్రహ్మ,తేజంబు హృదయపంకేజమందు
గీ. ధ్యాన మొనరించె నూర్మిళాజాని, యపుడు, ప్రాణవాయునిరోధపరాయణుఁ డగు
నతని ఋష్యగ్నిసంయుతు లమరు లెల్ల, వేవిధముల నుతించిరి విరులు చల్లి.

క. త్రిదశులకుం దదితరులకు, నదృశ్యుఁ దనుధారి నంచితాంబరకలితుఁ
ముదితాత్ము లక్ష్మణునిఁ గొని, త్రిదశేశ్వరుఁ డరిగె నపుడు త్రిదివంబునకున్.

గీ. అబ్జనాభు చతుర్థాంశ మై వెలుంగు, దివ్యమూర్తి నాలక్ష్మణదేవుఁ గాంచి
సురవరుల్ సురమాను లందఱును వినయ,భంగిఁ బూజించి రౌత్సుక్యభావములను.

ఉ. ఆగమవేద్యుఁ డైనహరియంశ జనించినయట్టిలక్ష్మణుం
డాగతి స్వస్థితిం గని మహాహివరాకృతిఁ దేజరిల్లఁగా
యోగులు సిద్ధలోకమున నుండెడివారుఁ దదీయదర్శనే
చ్ఛాగతబుద్ధి మై సరసిజాసనుతోఁ జనుదెంచి, రీశ్వరీ!. ౪౬౫

గీ. జానకీనాథుఁ డట్లు ప్రియానుజన్ము, వదలి దుఃఖసమన్వితహృదయముననుఁ
బురజనుల మంత్రిముఖ్యుల గురువరేణ్యు, నరసి యిట్లనెఁ, బంకరుహాయతాక్షి!.

రాముఁడు మహాప్రస్థానమున కున్ముఖుఁ డగుట

సీ. వినుఁ డందఱును బ్రజావిహితవర్తనుఁడు మహామనస్కుండు సుధీమణి యగు
భరతు రాజ్యమునకుఁ బ్రభువుఁగా నేఁ డభిషేకించి నే నూర్మిళాకళత్రు

నడుగులవెంబడి నరుగఁదలంచితి, ననుడు వారెల్ల దుఃఖార్తు లగుచు
నేలఁ గూలిరి ఛిన్నమూలవృక్షములునా, భరతుఁడు సైతమాపలుకువిన్న
గీ. తోడనే; మూర్ఛ గొని లేచి పాదుపదవి, యేల నాకని యన్నివిధాల రాజ్య
రమను గర్హించి, మైథిలీరమణు సవిధ,భూమి నిటువల్కెఁ దా మనగపూర్వకముగ.

సీ. గట్టిగ నే నొట్టు పెట్టి చెప్పెద శ్రవణింపు రఘుశ్రేష్ఠ! నిన్నుఁ బాసి
స్వర్గాన నైన భూస్థలి నైన రాజ్య మపేక్షింపఁగాఁ జాల నెపుడు గాని
బాధింపకుం డింక పై విను మని, భవదంఘ్రిపద్మములపై నాన యిడితి
శ్రీకరంబుగ నభిషేకింపుమీ కుశ,లవకుమారుల గుణాలాలితులను
గీ. గోసలంబున నుత్తరకోసలమునఁ, గ్రమత నభిషేచనక్రియాకలనఁ బొలిచి
పౌరవిహితప్రవర్తనప్రౌఢి మెరసి, వసుధఁ బాలింత్రు గావుత వారిరువురు. ౪౬౮

క. చనవలె దూతలు శత్రుఘ్నుని దోడ్తెచ్చుటకు వడిగ గుణి యాతండుఁ
వినుఁగాక స్వర్నివాసమ్మునకై చను మనప్రయాణమును నిద్దానిన్. ౪౬౯

వ. అంత భగవంతుం డగు నరుంధతీకాంతుండు. ౪౭౦

క. భరతోక్తులు విని సీతా,వరు నెకబాటునకు మిగుల వగచుచు భీతిం
బొరసి, పుడమిఁ బడియుండిన, పురజనములఁ గాంచి కరుణ భూపతి కనియెన్.

సీ. నాయనా! రఘురామ! పోయెద నే నని నీ వన్ననుడి విని నిలువలేక
ప్రబలదుఃఖార్తులై ప్రజ లెల్ల రిలఁ గూలి,రాదరంబున వారి నరయు మిప్పు,
డిదిగాక తన్మనోఽభీష్టానుకూలమ్ముగాఁ గరుణించి సౌఖ్యమును గూర్పు
మనుడు, వసిష్ఠోక్తి విని డాయఁజని జానకీవల్లభుఁడు వారి లేవనెత్తి
ఆ. యన్నలార! యిట్టు లలజడి కగ్గమా,టేల? మూర్ఛ మునుఁగు టేల? మీకు
నే నొర్పఁదగిన దేమి? వాక్రువ్వఁ డం,చడిగె స్నేహపూరితాత్ముఁ డగుచు.

ప్రజలు వెంటవత్తు మని రామునితోఁ జెప్పుట

వ. అడుగుటయుఁ బ్రజలు ప్రాంజలులై భక్తిభావంబుల రఘూత్తమునితో నిట్లనిరి.

క. నీ వెట కేఁగఁ దలంచితొ, నీవెంబడి మేము నటకు నెఱి వచ్చెద మో
దేవా! మా కిది పరమ ము,దావహ మతిశ్రేయకరమ్ము నగు ధర్మము సూ.

సీ. నినుఁ బాసి మే మొక్కనిముస మైనను మనంజాలము, దృఢతరాశయము నాటు
కొనియున్న దాత్మ నిన్గొలుచుచు వెనువెంటఁ దిరిగెదుపట్లు, సుధీప్రసన్న!

వీనరహోక సతీసుతాదులఁ గూడి యన్నివిధముల నిన్ననుసరించి
వచ్చుచుంటిమి తపోవనమున కేని; స్వర్గమునకు నే; నగరమున కేని;
గీ. నిమ్మెయిని మమ్ముల ననుగ్రహింపు మనుడుఁ,
దన్మనోదార్ఢ్యమును భక్తితత్పరతయుఁ
గాలపురుషోక్తియుఁ దలంచి హేళివంశ్యుఁ
డట్లె యని వారి రాకకు ననుమతించె. ౪౭౫

క. పయనమున నాఁడె కృతనిశ్చయుఁ డయి కుశలవుల ధైర్యసమధికుల నిజ
ప్రియసుతులఁ గోసలంబుల, నయగతిఁ బాలింపఁ బనిచె నరపతి, సుదతీ! ౪౭౬

సీ. తండ్రియానతిఁ జేసి తనయు లిర్వురును వే,శ్వేఱుగ నఱువదివేల వారు
వమ్ములు నొకవేయివారణములు నెన్నిమిదివేలరథము లభ్యుదయసూచ
కమ్ముగ నడువ, మోదమ్మును బుష్టియు నుత్తమవస్తుసముత్కరమును
నలఘువిత్తమ్మును గలజనంబులు చుట్టుఁ బఱసియుండఁగ రఘుపతికి మ్రొక్కి
గీ. యెట్టకేలకుఁ బోయి, రద్రీంద్రపుత్త్రి!, యంత శత్రుఘ్నుఁ దోడితెం డనుచు శీఘ్ర
గాము లగుదూతలను బంప రామచంద్రుఁ, డట్లె వారును నాతని నరయఁబోయి.

రాముఁడు శత్రుఘ్నుని రాకకు సమ్మతించుట

చ. శమనుని రాకయుం, గినుక సంయమి వోయినపోకయుం, బరా
క్రమనిధి లక్ష్మణుండు నిజకాయముఁ బాయుటయుణ్, మహీసుతా
రమణు ప్రతిజ్ఞయుణ్, ధృతివిరాజితతత్తనయాభిషేచన
క్రమమును, దచ్చికీర్షితముఁ, బ్రస్ఫుటభంగి వచించి రంతయున్. ౪౭౭

క. దూతల నుడులు మహాబలుఁ, డాతఁడు విని వంశనాశ మగుదుర్దశకుణ్
భీతిలి దుఃఖితుఁ డయ్యును, నాతీ! యొక్కింతతడవునకుఁ దెలి వొందెణ్. ౪౭౮

వ. అట్లు ధైర్య మవలంబించి, సత్వరంబ నిజనందనుల నిరువురం బిలిచి, యందు
సుబాహునకు మధురాపురంబును, యూపకేతునకు విదిశానగరంబును, బరిపా
ల్యంబులుగ నిర్ణయించి, కృతాభిషేకులం జేసి రఘునందనసందర్శనాభిలాషం
బునం జేసి స్వయమ్ముగ నయోధ్యకుం బఱతెంచె. ౪౮౦

సీ. వచ్చి తేజంబున వహ్నికిఁ దుల్యునిఁ, బీతాంబరద్వయోపేతకాయు
నతఁయు లగు వసిష్ఠాదిమహర్షుల,చేఁ జుట్టఁబడి విరాజిల్లువాని
విష్ణ్వవతారుని విభుని రామునిఁ గాంచి, మ్రొక్కి చేదోయిని మోడ్చిపలికె
నొకమాట ధర్మార్థయుక్తమ్ముఁ, బుండరీకాయతనేత్ర! మదాత్మజులకు

గీ. నచటఁ బట్టాభిషేకమ్ము నాచరించి, నిన్ననుగమింపవలె ననునిండుఁదమిని
వచ్చినాఁడను విడనాడవలదు వీనిఁ, గేవలము నీదుభక్తుని, దేవదేవ!. ౪౮౧

గీ. అనుటయును, దన్మనోదార్ఢ్య మరసి మంచి, దల్లె నీవును నావెంట నరుగుదెమ్ము
పయనమునకు సంసిద్ధుఁడవయినిలువుము, చనఁదలంచితిమధ్యాహ్నసమయమునను.

సుగ్రీవాదులు రామునితోఁ బయన మగుట

సీ. అని రాఘవుఁడు పల్కఁ, నాక్షణంబున ఋషిక్రతుభుగంశోద్భవుల్ కామరూపు
లగువానరులు ఋక్షు లసురులు గోపుచ్ఛు లందఱు వేలకొలందిగ నట
కరుదెంచి రామప్రయాణసన్నాహమ్ము విని చూచి భక్తి వందన మొనర్చి
స్వామి! మీవెనువెంటఁ జనుదెంచుటకు నిశ్చయించికొంటి మనుగ్రహింపవలయు
గీ. వేఱుతలఁపులు లేనట్టివారిఁగ మముఁ, దెలియుఁ డని యెల్ల రొకపెట్టఁ బలికి,రింత
లోన సుగ్రీవుఁ డమితబలుండు యోగ్య,సరణి నతి సల్పి భక్తవత్సలున కనియె.

క. కపిరాజ్యంబున కంతకు, నపరిమితబలాభిరాము నంగదు నభిషే
కపురస్సరముగ శుభగతి, నృపతిం గావించి వచ్చి నిలచితి నిచటన్. ౪౮౪

చ. త్రికరణశుద్ధిగా నరుగుదెంచెద నీ చనునున్నచోటి, క
ర్కకులవతంస! కష్టము సుఖం బనుచింతకుఁ బాలుగాక త్వ
న్నికటమునన్ మెలంగఁ గృతనిశ్చయుఁడం జుమి, వేఱుమాట చె
ప్పక వెనువెంట రాకకుఁ గృపామతి నానతి నిమ్ము, శ్రీపతీ! ౪౮౫

వ. అనుడు, నిజాగమనార్థంబు ప్రార్థించు ఋక్షవానరరాక్షసుల దృఢవాక్యంబు లాకర్ణించి, శ్రీకాంతుండు విభీషణుం గాంచి మృదుమధురఫణితి సమాదరంబుగ నిట్లనియె. ౪౮౬

రాముఁడు విభీషణహనుమజ్జాంబవంతుల పయన మాపుట

సీ. ప్రజల నెందాఁకఁ దా భరియింపఁగాఁ గల్గు ధరణీతలం, బంతదాఁక నీవు
నావచనమున దానవరాజ్య మఖిలంబుఁ, బాలింపుమా నిరపాయముగను,
నాన వెట్టితిని నాపైని,మదర్థమై బదులాడ వల దింకఁబై నెదియును
శంకింపకుము మది లంకేశ! యని యాంజనేయునితో నిట్లనెన్ మృగాక్షి!
గీ. వాయునందన! పయనంపు వాంఛ వీడి, క్షుత్పిపాసాదిబాధల స్రుక్కకుండ
వసుధపైఁ జిరకాలమ్ము బ్రతికియుండు, మన్మత మొనరింపఁగాఁబోకు మస్మదాజ్ఞ.

వ. పిదప జాంబవంతు నీక్షించి. ౪౮౮

సీ. భల్లూకవల్లభ! పయన మాఁపుము, త్వరపడకు మింకొక్క ద్వాపరమునందు
నిజముగ నాతోడ నీకు నేదో యొకా,నొక కారణంబున యుద్ధ మొదవు
మత్పరిష్వంగాసమానభాగ్యప్రాప్తి విలసిల్లు, దండాక వేచియుండు
మని, మిగిలినవారి కందఱ కానతి నిచ్చెను దన వెంట వచ్చుటకు, న
గీ. నంతరము పుండరీకాయతాక్షుఁడును వి,శాలవక్షుండు నగు రఘుసత్తముండు
నేవ్య నిజపురోహితుని వసిష్ఠుఁ జూచి, పలికె మఱుదినమందుఁ బ్రభాత వేళ.

శ్రీరాముని వైకుంఠ ప్రయాణమహోత్సవము

క. మునిసత్తమ! నాకంటెను, మునుముందుగ నగ్నిహోత్రములు చనునట్టుల్
పొనరింపు, మవల నందఱుఁ, జనియెదరు యథేచ్ఛ విగతసంశయు లగుచున్.

వ. అనవుడు, నమ్మాటకు సమ్మతించి యరుంధతీకాంతుండును దన్మహాప్రస్థానంబునకు
వలయు పూర్వాంగకర్మమునంతయు యథావిధిగ నాచరించి, చరితార్థుం డయ్యె,
నయ్యవసరంబున. ౪౯౧

సీ. కరమునఁ దెల్లఁదామరఁ దాల్చి క్షీరసాగరపుత్త్రి యెడమప్రక్కను జెలంగ
నరుణాబ్జహస్తయై శ్యామలాంగముతోడ భూదేవి కుడిపార్శ్వమున వెలుంగ
ఘనతరప్రస్థానమున నిశ్చయాత్ముఁడై ధవళాంబరంబులు దాల్చి, పాణిఁ
గుశపవిత్రముఁ బెట్టి శశికోటికాంతితో రాముండు నిజనగరమ్మునుండి
గీ. వెడలెఁ దెలిమబ్బువెలువడు విధునికరణి,శస్త్రములుశాస్త్రములు శరచాపములును
శ్రుతులు నాల్గును దేవతాకృతులు దాల్చి,నడచెఁ దత్పురోభాగంబునను,లతాంగి!
గీ. విశ్వపూత పతివ్రత వేదమాత, యైన గాయత్రి ప్రణవంబు వ్యాహృతులును
గూడి రా నమ్మహావిష్ణుఁ గూడి చనియె, దివ్యరూపంబుతో జగద్ధ్యేయసరణి.

సీ. మునిపుంగవులును బ్రమోదంబునం బోయి, రంబికా! జనులంద ఱపుడు దార
పుత్త్రులతో బంధుపుంజంబుతోఁ గూడి, పర్యాప్తకాము లై పయనమైన
జానకీశుని వెంట సాగి రనావృతద్వారాపవర్గసౌధమున కనఁగ
శత్రుఘ్నునిం గులసతిని నంతఃపురాంగనలను ననుచరగణముఁ గొంచు
గీ. భరతుఁ డరుదెంచెఁ, బురిలోనిపౌరజనము, బాలకులు వృద్ధు లనెడివివక్ష వదలి
కదలెఁ "బ్రాగ్జన్మకృతభాగ్యకలనఁ జేసి, యిట్టిపయనంబు గల్గె"నం చెన్నికొనుచు.

వ. బ్రహ్మక్షత్త్రి వైశ్యశూద్రులును, దదితరులును, మంత్ర్యమాత్యవర్గపురస్సరముగ
ద్విజోత్తములును, రఘూత్తము ననుసరించి వెడలిరి. సుగ్రీవప్రముఖవలీముఖ
శిఖామణులును గృతస్నాను లై పరిశుద్ధాంతఃకరణముల మంగళశబ్దోచ్చారణము

సేయుచుం జని, రిట్లు విరక్తు లై పశుభృత్యసమూహమ్ములతోఁ బరమానందం
బున నానందమయు రఘునందను వెంబడించి పోవువారిలో సంసారదుఃఖదూషి
తుఁడుగాని దీనుఁడుగాని విషయసుఖాసక్తుఁడు గాని యొక్కఁడును గానరాకుండె.

సీ. స్థావరజంగమజంతుసంతతులును, గనుదోయికిం బొడకట్టనట్టి
భూతంబులును, బాహ్యభోగవైరాగ్యంబు గల వయి యీశ్వరు ఘను ననంత
శక్తుని బరుని సాక్షాత్పరమాత్ముని వేదవేద్యుని రాము వెంబడించె
నింతి! వేఱుగఁ జెప్ప నేటికి? కానమయమం దల రామభద్రునియందు బుద్ధిఁ
గీ. జేర్చి విషయాభిరతిని ద్యజించి తన్మహోత్సవానందవారాశి నోలలాడు
చా మహాత్ముని వెంటఁ బోనట్టిప్రాణి, కలికమున కైనఁ దత్పురిఁ గానరాదు.

క. రా జయిన రామచంద్రుం, డోజం దన్ను విడిచన నయోధ్య సకలముం
దేజము చెడి పాడఱియెఁ బరాజితుని ముఖంబు వోలె, రాజీవముఖీ!. ౪౯౭

శ్రీరాముఁడు నిజస్వరూపమును స్మరించుట

చ. పురమును నిర్గమించి రఘుపుంగవుఁ డంతయు దవ్వు వోయి శ్రీ
హరినయనాబ్జజాత విమలాంబుసమేత జగత్పవిత్ర యా
సరయువుఁ జూచి, తుష్టుఁ డయి సర్వమునుక్షుజనైకసేవ్య మై
పరఁగువిరాట్స్వరూపమును భావమునందు స్మరించె నయ్యెడన్. ౪౯౮

వ. ఇవ్విధంబున. ౪౯౯

క. తనతోంటి దివ్యతత్త్వము, మనమునకుం దెచ్చికొని సమస్తజగంబుం
దనయందు నున్నదానిఁగఁ, గనుఁగొనె నాసర్వమయుఁడు కంజదళాక్షీ!. ౫౦౦

వ. ఆసమయమున మహనీయుండు పితామహుండును, నిఖిలబ్రహ్మర్షిముఖులును, సమస్త
ఋషులును నెల్లసిద్ధులును బ్రాపితమనోరథసిద్ధు లై భగవద్దర్శనార్థంబు దద్దయుం
బ్రీతి నేతెంచిరి. ౫౦౧

క. సురసేవితభాస్కరవిస్ఫురదురుతరమణివిమానపుంజంబులు గ్రి
క్కిఱిసె నిరవధిక మగునంబరమున, నే మందుఁ దత్ప్రభావము దేవీ!. ౫౦౨

క. మఱియుం దద్యానపరం, పరచే స్వర్గంబు వోలె భాసిలె నభ, మ
చ్చెరువుగ జ్యోతిర్మయ మై, సరసీజళాక్షి! యవలిసంగతి వినుమా. ౫౦౩

సీ. పూజ్యులలోపలం బూజ్యులు పుణ్యవంతులలోనఁ బుణ్యవంతులు స్వయంప్ర
కాశులుం జేరి రాకాశ మంతటఁ, బరిమళబంధురంబు లై మంజులముగ

వీచెను వాయువుల్, విరివాన గురిసె, వేల్పులమృదంగంబులు మ్రోఁగుచుండ
గీతముల్ పాడిరి కిన్నరుల్ విద్యాధరులు మనోజ్ఞముగ, సరోజనయన!
గీ. అట్టి యుత్సవవేళ ననంతశక్తి, రాఘవుఁడు పాదములతో సరయువుఁ జొచ్చి
తజ్జలముఁ జేత నొకమాఱు తాఁకి తోన, లోనికిం బోయెనడచి యనూనభంగి.

వ. అత్తఱిఁ గంజగర్భుండు కృతాంజలి యై రామున కిట్లనె. ౫౦౫

బ్రహ్మ శ్రీరామబ్రహ్మమును బ్రార్థించుట

క. నిరుపమసుఖరూపుండవు, పరమేశ్వరుఁడవు సమస్తపరిపూర్ణుఁడవుం
బరమాత్మవు విష్ణుండవు, నిరుపాధికమూర్తి వీవు నీరధిశయనా!. ౫౦౬

ఉ. వేదశిఖాప్రపంచితము విస్తృత మైశము నద్వితీయ మా
నీ దగు దివ్యతత్త్వమును నీవ యెఱుంగుదు, వుర్వి నేరికిన్
గా, దటువంటివాఁడ వయిన న్నిఖిలేశ్వర! సేవకుండ నే
నా దగు ప్రార్థనంబుఁ గరుణ న్నిరవేర్చితి వింత కంతయున్. ౫౦౭

వ. కావున భక్తపరాధీనుండ వగుదేవా! ౫౦౮

క. తమ్ములతో నీ విఁక నాద్యమ్ము ననంతమ్ము ముక్తిదము వైష్ణవదే
హమ్మును గొని, దైవతలోకమ్మును బాలింపవయ్యుఁ గరుణాదృష్టిన్. ౫౦౯

వ. అట్లు గాదేని. ౫౧౦

క. హితమగుమఱొక్కదివ్యా, కృతిఁ గొని రక్షింపు మమ్ము, నీవ దివౌకః
పతివిని విష్ణుండవు నీదు తత్త్వ మే నొకఁడ నెఱుఁగుదును వనజాక్షా!. ౫౧౧

గీ. విబుధలోకనియామక! వేయిమార్లు
మ్రొక్కువాఁడ మఱిమఱి మ్రొక్కువాఁడఁ
ద్వత్కటాక్షప్రసారార్హదశ ఘటింపఁ
జేసి, మమ్ముఁ గృతార్థులఁ జేయు టొప్పు. ౫౧౨

శ్రీరాముఁడు శ్రీమహావిష్ణు వగుట

సీ. పద్మగర్భుం డిట్లు ప్రార్థింప వినిరాముఁ, డదితినందను లంద ఱరయుచుండ
మహితప్రభాభాసమానంబు శంఖచక్రాద్యాయుధోపేత మనుపమంబు
భువనపూజ్యముఁ జతుర్భుజము నైన సమగ్ర,విగ్రహంబును దాల్చి విష్ణు వయ్యెఁ
గాత్యాయనీ! తత్ప్రకారాతిశయము చేఁ, దిలకించు వేల్పులదృష్టి చెదరె

గీ. బహుళతరాశ్చర్యకర మగు పడగచాలు, మెఱయ శేషాహి యైన సౌమిత్రి హరికిఁ
బానుపయ్యెను, భరతుండు పాంచజన్య,శంఖ మయ్యె, శత్రుఘ్నుఁడు చక్ర మయ్యె.

సీ. ఇంతి! యింతకుఁ బూర్వ మే యుర్వరాసుత, శ్రీమహాలక్ష్మి యై చెలఁగుచుండెఁ
బురుహూతముఖ దేవపూజితుం డగుఁ బురాణ,పురుషుండు విష్ణువు వరదుఁడు నగు
రామభద్రుం డట్లు రహి సహోదరులతోఁ, బ్రాక్తనరూపంబుఁ బడసి, దివ్య
తేజోమయుం డయి తేజరిల్లెఁ, బితామ,హేంద్రాదిసురలు మునీంద్రగణము

గీ. నాగయక్షసిద్ధులుఁ జిదానందమయుఁ బ,రేశుఁ గేశవు డాసి యనేకగతులఁ
బొగడి పూజించి తత్కృపఁ బూర్ణకాము,లై ప్రమోదాంబునిధి నోలలాడి రపుడు.

వ. తదుపరి చతుర్భుజుండు చతుర్ముఖునిఁ జూచి. ౫౧౫

క. అనురక్తియు భక్తియు నెక్కొన నాయెడ, విషయసుఖముఁ గోరక త్రిదివం
బున కుద్గమించు నాతోఁ, జనుదెంచిరి వీర లెల్ల, సరసిరుహాభవా! ౫౧౬

సీ. రహిమించు నిచటితిర్యగ్జంతువులుగూడఁ, బ్రాగ్భవపుణ్యసంపదలఁ జేసి,
వాంఛమై నావెంటవచ్చినప్రాణుల కన్నింటికిని సుఖం బబ్బునట్లు
వైకుంఠమున కెనవచ్చునుత్తమలోక, మావాసముగఁ జేయు టవసరంబు
నాయాజ్ఞ వీరి నందఱ వేగ తాదృశ,పదవికి నీవు చేర్పంగవలయు

పంచపాది.

ననుడు, వాణీవిభుండు మహాత్మ! నిన్ను
మనమునం జేర్చి పుణ్యసంపదలఁ బొదలు
సుగుణవంతులు వీరు నేఁడుగ మదీయ
ధామమునకుఁ బైనున్న సాంతానికాఖ్య
చిత్రభోగాఢ్యజగతి వసింత్రుగాక. ౫౧౭

చ. బల మగురోగబాధలకుఁ బా లయి కాయముఁ బాయుపట్టునం
దెలియక యేనియుం దుదకు దేవరవారి పవిత్రనామముం
బలికెడివారు సైత మఘభంజన! దుష్కరయోగసిద్ధిచే
నలవడునమ్మహాజగములందు సుఖమ్ముగ నుంద్రుగావుతన్. ౫౧౮

వ. అని వచించి విరించి విరమించుటయు, నటం గల తరుచరదానవాదు లెల్లరును.

రాముని వెంబడించిన సమస్తప్రాణులును నుత్తమగతి కేఁగుట

క. సరయూవిమలాంబువులం, బరమాహ్లాదప్రపూర్ణ భావంబులతో
మురియుచు మునింగి నృకళే,బరములను ద్యజించి రపుడు పంకజనేత్రా! ౫౨౦

క. హరిబుజులివీరు లేయే,సురాంశములఁ బొడమిరో వసుధరపైఁ; గ్ర
మ్మఱఁ దత్త్రపాంబులఁ,గర మాశ్చర్యంబు దోఁపఁ గైకొని, రబలా! ౫౨౧

సీ. కీశవల్లభుఁడు సుగ్రీవుఁ డాదిత్యుని, వీర్యంబునం బ్రభవించుకతన
నతనిలోఁ గలిసె, ననంతరంబున నరుల్, నిమ్నగాంబువుల మునిఁగి త్యక్త
మానుషదేహులై మణిమయాభరణముల్, గొమరార ఘనవిమానముల నెక్కి
శాశ్వతానందకృతాంతానికాభిఖ్యపుణ్యలోకములకుఁ బోయి, రట్లు
గీ. రామభద్రవీక్షితములై యామహాత,రంగిణిం బడి నిజశరీరములఁ బాసి
యొక్కపెట్టఁ దిర్యక్కులుం జక్క నేఁగె, ధాతృనిర్దిష్టమగు తత్పదంబుఁ జేర.

సీ. పల్లెలనుండి భూభర్తనిర్యాణంబు, గానంగ వచ్చినజానపదులు
తన్మహనీయసందర్శనమ్మునఁ జేసి, దుర్విషయాసక్తి దొలఁగిపోవ
సకలలోకములకు జ్ఞానప్రదాతయు, శాశ్వతుండును బరమేశ్వరుండు
విష్ణువు నౌ రామవిభు భక్తసులభుని, గాఢానురాగంబు గడలుకొనఁగ
ఆ. మనములఁ స్మరించుకొనుచు నగీతోయ,ములను గ్రుంకి వేల్పుమూఁక వొగడఁ
జనిరి సురవిమానమునను సాంతానిక,లోకమునకు ధూతశోకమునకు. ౫౨౩

క. అని యీరీతిగ శ్రీరా,ముని యుత్తరకథను సాంతముగ నెఱిఁగించెం
దనప్రియురాలికి భువనా,వనుఁ డభవుఁడు భక్తిపారవశ్యం డగుచున్. ౫౨౪

ఫలశ్రుతి

క. తుద కొకపాదం బైనను, జదువు నెవఁడు దీన వేయిజన్మంబులయం
దొదవినపాపము రూపఱి, ముదంబు చేకూఱు నిక్కముగ నాతనికిన్. ౫౨౫

సీ. ప్రతిదినంబును ఘోరపాపంబు లొనరించు, ఖలుఁడును భక్తి నీగ్రంథ మెత్తి
కడ కొక్కశ్లోకమే గడగడ వాకొన్న, నిర్ధూతపాతకనివహుఁ డగుచుఁ
బడయు ననన్యలభ్యం బగురాముని,సాలోక్యమును, బూర్వకాలమందు
రఘువరచోదితరాజమౌళిప్రణీతంబు నుత్తరకథాసమ్మితంబు
గీ. నైన శ్రీమదధ్యాత్మరామాయణాఖ్య, ఘనచరిత్రంబుఁ జెవియొగ్గి వినినమాత్ర
దాననిర్నిద్రభద్రసంధాయకుండు, జానకీనాయకుండు ప్రసన్నుఁ డగును. ౫౨౬

ఉ. ఆయతపుణ్యవంతము శివాభిహితమ్ము సమస్తదేవతా
ధ్యేయపద మ్మహీనము గిరీంద్రసుతావిహితమ్ము నైన రా
మాయణకావ్యముం బ్రవిమలాత్మఁ బఠించినపూరుషుం డొగిం
బాయును నూఱుపుట్టువులఁ బైకొనినట్టిమహోగ్రపాప మేన్. ౫౨౭

వ. మఱియుఁ ద్రిభువనపవిత్రం బగు నీయుత్తమచరిత్రంబు. ౫౨౮

క. సదమలభక్తిని విన్నం, జదివిన వ్రాసినను జనకజాసంయుతుఁ డై
హృదయమున నిలిచి సతతము, సదయుఁడు రాముండు సకలసంపద లొసఁగున్.

గీ. అజముఖామరసంస్తుత మఖిలజనమనోహరం బాదికావ్య మనుత్తమంబు
నిమ్మహాగ్రంథమును బఠియించువాఁడు, విమలుఁ డై యంత్యమునఁ జేరు విష్ణుపదము.

కాండాంతపద్యములు

ఉ. భానుకులాగ్రగణ్య! భవబంధవిమోచన! పద్మలోచనా!
మానుషవేషధారి! సురమండన! దానవచక్రఖండనా!
ఆనతలోకకల్పక! సమంచితవిగ్రహ! దూరితాగ్రహా!
తానవహీనతేజ! సతతశ్రుతిఖేలన! ధర్మపాలనా! ౫౩౧

మత్తమయూరము

క్ష్మాపుత్రీహృత్సుందరసౌధాగ్రవిహారా!
భూపాలోత్తంసా! పరిపూర్ణా! మణిహారా!
పాపాంభోరుణ్ణిట్పతి! పౌరందరభాగ్యా!
తాపాధీనోద్ధారక! దైవార్చనయోగ్యా!. ౫౩౨

క. మాయాకల్పితనానో
పాయాతీతప్రసిద్ధపథసంచారా!
ఆయతజగదవనైకప
రాయణ! కరుణాప్రపూరితాంతఃకరణా!. ౫౩౩

గద్య

శ్రీమద్భారద్వాజగోత్ర, సీతాంబికాపున్నయార్య చతుర్థపుత్ర,
రామచంద్రకృపాపాత్ర, సూరిజనవిధేయ,
నారాయణనామధేయ ప్రణీతంబగు
నాంధ్రాధ్యాత్మరామాయణంబున
నుత్తరకాండము
సంపూర్ణము.



హరిః ఓం తత్సత్.

# శుద్ధపత్రిక

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౬ | ౨౩ | మఱొండుగాదు | పరుండుగాఁడు |
| ౩౧ | ౧౧ | జగద్వ్య | జగదీడ్య |
| ౫౪ | ౫ | తమస్థితు | తమఃస్థితు |
| ,, | ౧౫ | కడదాఁచిన | ముందు దాఁచ |
| ౫౯ | ౧౧ | వలెననుసరించుచునుంటి | వోలె ననుసరించుచుంటి |
| ౮౧ | ౨౧ | వ్యధితుఁడు | వ్యథితుఁడు |
| ౧౧౨ | ౧౧ | యనే | యనె |
| ౧౧౫ | ౧౨ | చినిగి | చిన్గి |
| ౧౧౭ | ౧౩ | నేనెఱుఁగ | గా నెఱుఁగ |
| ౧౧౮ | ౧౩ | మానువ | మనుజ |
| ౧౩౫ | ౧౭ | ప్రతిదినముహర్ష మున | పరమహర్ష మ్మ్రనక్ |
| ౧౩౯ | ౫ | మానిని! | మానని |
| ౧౪౧ | ౭ | సనుజ్ఞ | ననుజ్ఞ |
| ౧౬౨ | ౧౧ | తిరుగుమడి | తిరుగుచుంటి |
| ౧౯౧ | ౩ | సన్న | నన్న |
| ౧౯౯ | ౭ | రౌధ్ర | రౌద్ర |
| ౨౧౫ | ౨ | హనుమ ముంగుం జనిరోక్ | ముందు పవనజుఁ డరిగెన్ |
| ౨౧౫ | ౨ | దశాస | దశాన |
| ౨౨౧ | ౭ | మహానీయు | మహనీయు |
| ౨౨౫ | ౮ | మాసను | మానసు |
| ౨౨౩ | ౨౨ | ఒప్పుగా | ఒప్పుఁగాని |
| ౨౩౮ | ౧౬ | పదుపాయ | సదుపాయ |
| ౨౪౧ | ౭ | కుసుమంజుల | కుసుమమంజుల |
| ౨౪౩ | ౨౧ | దేహాస్థితి | దేహస్థితి |
| ౨౫౩ | ౨౪ | బగబగమని | బగబగని |
| ౨౫౭ | ౬ | నీపుట్టువు | మీపుట్టువు |
| ౨౫౯ | ౧౪ | మ్మలఘుపతి | మ్మలరఘుపతి |
| ౨౬౬ | ౧౧ | ఱఱిచుగా | దఱిచుగా |
| ౨౮౧ | ౧౪ | గుడ | డగు |
| ౨౭౩ | ౮ | తదసాధ్యంబులు | తదసాన్యంబు |
| ౨౭౪ | ౨౪ | మాం నాస్థి | మాంసాస్థి |
| ౨౭౫ | ౨౪ | దగలి | దగిలి |
| ౨౭౮ | ౧౩ | విద్యుజ్జిహ్వుఁడు | న్రజసంస్త్రుఁడు |
| ౨౭౭ | ౬ | దలఁచె దేని | దలఁచె దేని |
| ,, | ౨౪ | బంధనునై | బంధనుఁడనై |
| ౨౯౨ | ౧ | విషంబుల | విషయంబుల |
| ౨౯౬ | ౧౬ | దానవ్రేందు | దానవేంద్రు |
| ,, | ౨౧ | ఎదుఱు | ఎదురు |
| ౩౧౧ | ౯ | లతనితో | మతనితో |
| ౩౧౩ | ౮ | కృతిమ | కృత్రిమ |
| ౩౧౫ | ౮ | మసవుడు | మనవుడు |
| ౩౧౬ | ౧౭ | వపస | వనన |
| ౩౧౯ | ౨౬ | విడు | విడువ |
| ౩౧౨ | ౧౫ | విధబులం | విఘంబులం |
| ౩౨౧ | ౬ | దొఁగ | దొలఁగ |
| ౩౨౬ | ౧౭ | నిలువం బెట్ట | నిలువం బెట్టి |
| ౩౨౭ | ౨౩ | వురుషు | పురుషు |
| ౩౨౯ | ౧ | తరుచు | తఱుచు |
| ౩౩౨ | ౫ | దత్సముక్షి | దత్సమత్కు |
| ,, | ౨౧ | వచ్చె | వచ్చెను |
| ౩౩౫ | ౨ | సమరులు | నమరులు |
| ౩౪౩ | ౧౭ | విధిఁజేర్చి | విధి చేర్చి |
| ౩౪౮ | ౧౬ | పాచచారిణి | పాదచారిణి |
| ౩౪౯ | ౨ | ఘ్రూణేంద్రియ | ఘ్రాణేంద్రియ |

# శుద్ధపత్త్రిక

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు | పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| ౩౫౫ | ౧౧ | కాతలంపు | గాఁదలంపు | ౩౯౨ | ౮ | క్రుధాన | క్రుధానల |
| ,, | ౧౩ | ధిరవిచారా | ధీరవిచారా | ౪౦౨ | ౪ | నాయుధు | నాయుధః |
| ౩౫౮ | ౭ | జగత్రయ | జగత్త్రయ | ౪౧౩ | ౨౧ | గానసు | గానను |
| ౩౬౧ | ౬ | సంతోపెట్టు | సంతోషపెట్టు | ౪౧౫ | ౨౧ | నచివ | సచివ |
| ౩౬౪ | ౧౫ | బుష్పక | పుష్పక | ౪౧౬ | ౪ | మన్యా | మస్యా |
| ౩౬౮ | ౭ | పంరేంద్రు | చరేంద్రు | ౪౧౭ | ౧ | బడినవి | బడినది |
| ౩౭౨ | ౨౬ | లోకనంబు | లోకంబు | ౪౨౨ | ౨౪ | లపణు | లవణు |
| ,, | ౧౭ | జన్మముల్ | మూర్తులక్ | ౪౨౭ | ౧౨ | విరిచలన | వీరివలన |
| ౩౭౭ | ౭ | మంచుకొండ | మంచుఁగొండ | ౪౨౮ | ౧౬ | వాల్మీకి | వల్మీక |
| ౩౮౬ | ౧౧ | యున్నటు | యున్నటు | ౪౨౯ | ౩ | బావంబుల | భావంబుల |
| ,, | ,, | తిస్నగ | తిన్నగ | ౪౩౨ | ౧౮ | భజియుంచు | భజియించు |
| ,, | ౨౨ | సాధు | సాధు | ౪౩౫ | ౧౧ | వుత్రుల | పుత్త్రుల |
| ౩౮౮ | ౧౩ | నుస్నశు | నున్నశు | ౪౩౮ | ౧౭ | మాయస్న | మాయన్న |
| ౩౯౧ | ౧౪ | సర్వాసయము | సర్వావయవము | ౪౫౧ | ౪ | ంబు | మగు |

౭-వ పుటలోని ౫౪-వ పద్యముయొక్క మొదటిపాదము "తనుదానెఱుంగనప్పుడు" అని చదివి కొనవలయును.



# శుద్ధపత్రిక

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౫౫ | ౧౧ | కాతలంపు | కాదలంపు |
| ,, | ౧౩ | ధిరవిచారా | ధీరవిచారా |
| ౩౫౭ | ౭ | జగత్రయ | జగత్త్రయ |
| ౩౬౧ | ౬ | సంతో పెట్టు | సంతోష పెట్టు |
| ౩౬౪ | ౧౫ | బుష్పక | పుష్పక |
| ౩౬౮ | ౭ | ఁరేంద్రు | నరేంద్రు |
| ౩౭౨ | ౨౬ | లోకనంబు | లోకంబు |
| ,, | ౧౭ | జన్మముల్ | మూర్తులన్ |
| ౩౭౭ | ౭ | మంచుకొండ | మంచుఁగొండ |
| ౩౮౬ | ౧౧ | యుస్నటు | యున్నటు |
| ,, | ,, | తిస్నగ | తిన్నగ |
| ,, | ౨౨ | సాధు | సాధు |
| ౩౮౮ | ౧౩ | నుస్నను | నున్నను |
| ౩౯౧ | ౧౪ | సర్వానయము | సర్వాన్వయము |
| ౩౯౨ | ౮ | ప్రధాన | ప్రధానల |
| ౪౦౨ | ౪ | నాయుధు | వాయుధు |
| ౪౧౩ | ౨౧ | గానసు | గానను |
| ౪౧౫ | ౨౧ | నచివ | సచివ |
| ౪౧౬ | ౪ | మన్యా | మస్యా |
| ౪౧౭ | ౧ | బడినవి | బడినది |
| ౪౨౨ | ౨౪ | లపణు | లవణు |
| ౪౨౭ | ౧౨ | విరిచలన | వీరిచలన |
| ౪౨౮ | ౧౬ | వాల్మీకి | వల్మీక |
| ౪౨౯ | ౩ | బావంబుల | భావంబుల |
| ౪౩౨ | ౧౮ | భజియించు | భజియించు |
| ౪౩౫ | ౧౧ | పుత్రుల | పుత్త్రుల |
| ౪౩౮ | ౧౭ | మాయస్న | మాయన్న |
| ౪౫౧ | ౪ | ంబు | మగు |

౭-వ పుటలోని ౫౪-వ పద్యముయొక్క మొదటిపాదము “తనుదానెఱుంగనప్పుడు” అని చదివి కొనవలయును.

